శ్రీ.

శ్రీ సద్గురుపరబ్రహ్మణే నమః.

# కైవల్యనవనీతము.

## తత్త్వబోధప్రకరణము

అను

## మొదటిభాగము.

కనుపర్తి - వేంకటరామ శ్రీ విద్యానందనాథ విరచితము.

స్వకృత టీకాతాత్పర్య విశేషార్థసహితము.

బ్రహ్మశ్రీ,

పండిత, పురాణం - సూర్యనారాయణతీర్థులవారిచే

పరిశోధితము.

ఐదవకూర్పు.

ఏతద్గ్రంథకర్తృపుత్త్రుఁడగు

శ్రీ కనుపర్తి. మార్కండేయశర్మచేతఁ

ప్రకటింపఁబడినది.

౧౯౩౬.



కనుపర్తి వేంకటరామ శ్రీవిద్యానందనాథులవారు
కైవల్య నవనీతాది గ్రంథకర్త

A. P. Press, Madras.

# ఉపోద్ఘాతము.

## గ్రంథకర్తృజీవితము.

### కనుపర్తి వేంకటరామ శ్రీవిద్యానందనాథులు.

తత్త్వబోధము, సందేహనివారణము అను రెండు ప్రకరణములు గల ఈకైవల్యనవనీతగ్రంథమును, త్రిపురప్రదీపిక మున్నగు ఇతరగ్రంథములను ఆంధ్రభాషయందు రచించి ప్రకటించి ఆంధ్రమండలములందును, ద్రవిడదేశమునందును ప్రసిద్ధిగాంచిన వేంకటరామ శ్రీవిద్యానందనాథులవారు ఆంధ్రబ్రాహ్మణశాఖలలో నొకటియగు ఆరువేలనియోగి శాఖను చేరినవారు. తైత్తిరీయ శాఖాధ్యేతలు. ఆపస్తంబసూత్రులు. కాశ్యపసగోత్రులు. గుంటూరుమండలము బాపట్లతాలూకాయందుఁగల వేటపాలెమను పేరుగల రైల్వేస్టేషనుకు సమీపమున సుమారు ఒకకోసు దూరమునఁగల పందిళ్లపల్లి యను గ్రామము వీరిపూర్వుల నివాసభూమి. తండ్రి కనుపర్తి వెంకయ్య తల్లి కామమ్మ. తమ్ముఁడు నరసయ్య.

శాలివాహనశకము ౧౭౪౪-వ సంవత్సరమునకు సరియగు రుధిరోద్గారిసంవత్సర వైశాఖమాస శుక్లపక్షమున మృగశిరానక్షత్రమున వీరు జన్మించిరి. విద్యానందనాథులను నది దీక్షానామము.

శాలివాహనశకము ౧౮౦౦-వ సంవత్సరమునకు సరియగు హేమలంబి (హేవలంబి) సంవత్సర కార్తీక బహుళపాడ్యమియందు సన్యసించి సిద్ధినందిరి. అనగా ౫౬ సంవత్సరములు జీవించిరి.

గుంటూరుజిల్లా రేపల్లెయందు శాలివాహనశకము ౧౭౮౧ సం. నందుజన్మించి ఆంధ్రదేశమునందుఁగల నియోగి శాఖీయులలో వేదశాస్త్ర నియమానుసారముగ మతాచారవిధులను ఆచరింపఁజేయించుచు జీర్ణాద్వైతమత పునరుద్ధారకులను ప్రసిద్ధినిగాంచిన శ్రీనందిరాజ లక్ష్మీనారాయణదీక్షితులవారు ఈవిద్యానందనాథులవారికంటె దాదాపు ౧౬ సంవత్సరములు చిన్నవారు. అయినను ఆకాలమునందుఁగల పండితులలో పలువురును పీఠాధిపతుల సమీపమునఁగల పండితబృందమంతయు తనకుప్రతిపక్షము వహించినను జంకక శాస్త్రసిద్ధాంతమును మాత్రమే సహాయముగ పరిగ్రహించి వాదించి జయించి బ్రహ్మచర్యాది నియమపూర్వకముగ నియోగిశాఖీయులందు వేదవిద్యను

వ్యాపింపఁజేయుచున్న శ్రీలక్ష్మీనారాయణదీక్షితులవారిని "చిత్రం వట తరోర్మూలే వృద్ధాశ్శిష్యా గురుర్యువా" యనుశ్లోకానుసారము శ్రీదక్షిణామూర్త్యంశావతారముగను కులాచార్యునిగను ఈ కైవల్యనవనీత గ్రంథమునందు వర్ణించియున్నారు. వీరు బాల్యము మొదలుకొని సిద్ధి పొందునంతవఱకు ద్రవిడదేశమునందే తమకాలమునంతయు గడిపిరి. కాని మధ్యకాలమునందు కొన్నాళ్లు ఆంధ్రదేశమునందు నివసించి ఆ కాలమునందు వేదవిద్యాప్రచారమునకును శ్రోత్రియసదాచారాభివృద్ధికిని ప్రయత్నించి జయముగాంచుచున్న శ్రీ నందిరాజ లక్ష్మీనారాయణ దీక్షితులవారితోడఁ బరిచయమును కలుగఁజేసికొని వారికి చాలవఱకు తోడ్పడుచుండిరి.

## వీరిసంగ్రహ జీవితచరిత్రము.

౧. ఈవిద్యానందనాథులవారికి బాల్యమున ౮వ సంవత్సరము రాక పూర్వమే తండ్రియగు వెంకయ్యమరణించెను. ఒకతమ్ముఁడు తల్లి పినతండ్రియు వీరికుటుంబము. ఆకాలమునందు సర్వసాధారణముగానున్న యవిభక్తకుటుంబసంప్రదాయానుసారము పినతండ్రియే ఈకుటుంబమునకు పోషణకర్తగానుండెను. బాల్యముగుటచేతను మేనమామలగు అచ్యుతన్నవారు గ్రామములు యిజారాచేయుచు ధనికులుగను యజ్ఞయాగాదికము లొనర్చుచు సదాచారనిరతులుగను, పుత్రికాసంతతిగలవారుగను నుండుటచేతను స్వగ్రామమగు వందిల్లపల్లికి అతిసమీపముననే తన పుట్టిల్లగు తిమ్మసముద్రమను గ్రామ ముండుటచేతను విద్యానందనాథులవారితల్లి పుత్రులతోడ తఱుచుగ తిమ్మసముద్రగ్రామమునందేయుండుట సహజమాయెను.

విద్యానందనాథులవారి పెద్దమామ అచ్యుతుని యజ్ఞేశ్వర సోమయాజి; పిల్లనిచ్చినమామయగు చిన్నమేనమామ రాజేశ్వరసోమయాజి. మాతామహుఁడు శేషాద్రిసోమయాజి. మాతుఃపితామహుఁడు యజ్ఞేశ్వరసోమయాజి. మాతామహుఁడగు శేషాద్రిసోమయాజి గోదావరీ తీరమగు వాసరాక్షేత్రమునందు పవనపర్ణాంబుభక్షకుఁడయి దేవినిగూర్చి తపమునల్పెను. దేవి ప్రత్యక్షమయి "నీవు వివాహితుఁడవయి సత్సంతానమునుబడసి యజ్ఞయాగాదికముల నొనర్చినపిదప విరక్తుఁడవయి సన్యసించి యఖండకైవల్య సుఖమునను భవించు"మని యాజ్ఞాపింప తదా

క్షాప్రకారము స్వదేశమునకు మరలివచ్చెను. వీరిమాతామహుఁడగు శేషాద్రిసోమయాజిగారిశిష్యసంతతికిచేరినవా రనేకులు నైజాము రాజ్యములోని గోదావరీతీరమున నిప్పటికినిగలరు. ఏతద్వంశీయులు ఇప్పటికిన్ని అప్పుడప్పుడు నైజాములోనివాసరాక్షేత్రమునకుఁబోయి శిష్యులచేత స్వస్వవిభవానుసారము సత్కరింపఁబడుచున్నవారలు. ఈ విద్యానంద నాథులవారికి ౮-వ యేట ఉపనయనమాయెను. పినతండ్రి మున్నగువారు ఛిద్రోర్ధ్వపుండ్రము ధరించునట్టి యాచారముగలిగియుండిరి. మేనమామలు సోమయాగ మొనర్చిన కర్మిష్ఠులగుటచేత భస్మరుద్రాక్షచందనధారులు. విద్యానందనాథుఁడు మేనమామయింటియందే పెరుగుచుండుటచేత తానున్ను భస్మరుద్రాక్ష చందనముల ధరించుచుండెను. పినతండ్రికడకుఁ బోయినప్పుడు అతనికి భయంపడి భస్మరుద్రాక్షచందనముల ధరించక కుంకుమనుమాత్రము ధరించుచుండెను.

౨. కొంతకాలమునకు వైష్ణవగురువులగు జియ్యరుగారువచ్చి శిష్యులకు చక్రాంకనముల నొనర్చుచుండిరి. వీరిపినతండ్రియు మఱికొందఱును చక్రాంకనముల నొనర్చుకొనుటకు కుతూహలులయిరి. వీరిపినతండ్రి విద్యానందనాథునకుఁగూడ చక్రాంకనముచేయింప నిశ్చయించి పిలువఁగా నతఁడు అంగీకరింపనందున నిర్బంధముచేసెను. "చక్రాంకనముచేసికొనుటవలన కలుగులాభ మేమి?" యని పినతండ్రిని విద్యానందనాథుఁ డడుగగా "ముద్రవేసినకాసు చెల్లును, ముద్రవేయని కాసుచెల్లదు" అని పినతండ్రి సమాధానము చెప్పెను. అందులకు బదులు విద్యానందనాథుఁడు చెప్పఁబోగా పినతండ్రికోపపడి నీపిచ్చిమాటలకు తగినసమాధానమును జియ్యరుగారే చెప్పెదరు రారమ్మని చెయిపట్టుకొని జియ్యరువద్దకు ఈడ్చుకొనిపోయి మావాఁడేమో చక్రాంకనమునుగూర్చి యడుగునఁట. సమాధానముచెప్పవలయునని జియ్యరుగారితో చెప్పఁగా ఇద్దఱకు ఉత్తరప్రత్యుత్తరము లీరీతిగా జరిగెను:—

విద్యానంద:—చక్రాంకన మెందులకు చేసికొనవలయును?

జియ్యర్:—ముద్రవేసినకాసు చెల్లును. ముద్రవేయనిదిచెల్లదు.

విద్యానంద:—ముద్రవేసినకాసగు యీదేహము ఇక్కడనే పడిపోవుచున్నదే. ఇట్టిదానివలన మీరుచెప్పిన లాభ మెటులకలుగును?

జియ్యర్:—(సమాధానము ఏమిచెప్పలేదు)

విద్యా:—చక్రాంకనము చేసికొన్న నేను స్మార్తుడనా? వైష్ణవుడనా?
జియ్యర్:—వైష్ణవుడవే.
విద్యా:—మాతండ్రి యాబ్దికమునాడు మీరు భోక్తగావచ్చెదరా?
జియ్యర్:—రాము.
విద్యా:—పోనీ మీశిష్యులనైనను భోక్తలుగా పంపెదరా?
జియ్యర్:—వీలుపడదు.
విద్యా:—మాలోమాకు మంత్రములనేర్పి సమష్ఠానుగాచేసెదరా?
జియ్యర్:—మేముచేయము. అది మాపనిగాదు.
విద్యా:—ఇంక మీరు మాకుచేయు సహాయమేమి!
జియ్యర్:—చక్రాంకనముచేయుటయే.

జియ్యరుగారి పైసమాధానమును వినినవెంటనే విద్యానందనాథుఁడు "మా బుజాలు కాల్చిపోవుటయే మీవలనయినయెడల మాకు మీచక్రాంకనమక్కఱయే లేదు" అనిచెప్పి తనరొండిని పెట్టుకొనియున్న పొట్లమును విప్పి అందున్నభస్మమును దీసి ఆజియ్యరుగారియెదుటనే త్రిపుండ్రమునుధరించి మీచక్రాంకనము నాకక్కఱలేదని చెప్పి యింటికి వెళ్లిపోయెను. ఈ సంభాషణము నచటికి చక్రాంకనార్థము వచ్చియున్నవార లాలకించి చక్రాంకనము చేయించుకొనకయే పరిపరివిధములుగ మాట్లాడుకొనుచు తమతమ గృహములకుఁ బోయిరి. తనమాటవిని చక్రాంకనము చేసికొనలేదని పినతండ్రి విద్యానందనాథుని యింటినుండి లేచిపొమ్మనెను. మేనమామ యింటికిపోగా తమయింటియందే తనియుంచుకొన్నయెడల జియ్యరుగారితో విద్యానందనాథునకు జరిగిన యుత్తరప్రత్యుత్తరములను తాము చెప్పినంపించినామని పినతండ్రిగారభిప్రాయపడుదు రనుతలంపుతో మేనమామ విద్యానందనాథునిచూచియు చూడనట్లుండెను. విద్యానందనాథుఁడు ఇంతకుమున్ను మిక్కిలి వాత్సల్యముతో తననుచూచుచున్న మేనమామ నిరాదరణచేయుట సహింపజాలక, యింటినుండి లేచిపొమ్మనిన పినతండ్రికడకు తిరిగిపోవుటకు ఇష్టపడకయు ఎవరితోడను చెప్పక గ్రామమునుండి బయలుదేరి యెట్లో కొన్నాళ్లకు చెన్నపురికి చేరెను. అప్పుడు చెన్నపురియందు జాగీరుదారులగు పెద్దినాయనివంశీయులు సుమారు ౧౦ సం. వయసునందు దేశముకాని దేశమునకు వచ్చియున్న విద్యానందనాథునిచూచి యాదరించి య

స్నవస్త్రములకు తగిన యేర్పాట్లు చేయించి సంస్కృతాంధ్ర భాషలయందు చక్కని పాండిత్యముగల ఇద్దఱు పండితులకడ ఉదయమున సంస్కృతమును సాయంకాలమున ఆంధ్రమును చెప్పించుచుండిరి. పెద్దినాయని కుటుంబమునందు విద్యాభిమానియగు ఒకరాజు అప్పుడప్పుడు వీరితో మాట్లాడుచు ఒకటిరెండు సమస్యలనీయఁగా తృప్తికరముగా విద్యానందనాథుఁడు వానిని పూర్తిచేసెను. అప్పటికి విద్యానందనాథునకు ౧౨ సం. వయస్సు. బాల్యమునందే ఇట్టి సూక్ష్మబుద్ధిగల ఇతనికి సంస్కృతాంధ్ర భాష లేగాక మఱి రెండుభాషలు చెప్పించుట మంచిదని యారసజ్ఞుఁడు తలంచి అరవము, హిందుస్తాని భాషలను చెప్పించుటకు తగుసౌకర్యము చేసి తనసౌధమునందే ఉండుటకు తగిన వసతిని కల్పించెను. స్వదేశమునందు తల్లియు, పినతండ్రియు, మేనమామయును విద్యానందనాథుఁడెచ్చటనున్నది తెలియక ఉత్కంఠితులై జాడ తెలియక దుఃఖించుచుండ కొన్నాళ్లకు చెన్నపురియందున్నట్లు కర్ణాకర్ణిగా తెలియఁగా చెన్నపురికి తల్లి వచ్చి పుత్త్రుఁడగు విద్యానందనాథుఁడున్న తావునకేగి పుత్త్రుని స్వదేశమునకు పిలుచుకొనిరాగా మేనమామయు బంధువులును సంతుష్టులయిరి. మేనమామ 'సరస్వతి' యను సార్థకనామయగు తనపుత్త్రికనిచ్చి పెండ్లిచేసెను. విద్యావ్యసనియగు విద్యానందనాథుఁడు మేనమామ మున్నగువారి యనుజ్ఞగైకొని చెన్నపురిచేరి కొంతకాల మచటయుండి తర్వాత మధురకుఁబోయి తర్క వ్యాకరణ వేదాంతశాస్త్రములఁ జదువుచుండెను. ౧౦ సం. ములవఱకు ఉత్తర ప్రత్యుత్తరము లేమియు రాకపోవుటచేత విద్యానందనాథునివారి మామ తనపుత్త్రికను సోదరిని వెంటఁ బెట్టుకొని చెన్నపురికివచ్చి విచారించగా మధురయందున్నట్లు జాడ తెలియవచ్చుటచేత మధురకుఁబోయి యచట విద్యానందనాథునిచూచి పుత్త్రికను సోదరిని అక్కడనే దిగవిడిచి తాను స్వదేశమునకు వచ్చి చేరెను. విద్యానందనాథుఁడు భార్యయు తానును తల్లియు హరిహర, మాయవర, శ్రీరంగక్షేత్రములయందు దాదాపు ౪౦ సంవత్సరములు దక్షిణదేశమునందే నివసించెను. వీరికి శ్రీత్రిపురసుందరి యిష్టదేవత. అష్టాదశపురాణములయందును పెరియపురాణము మున్నగు ద్రావిడ భక్తుల చరిత్రములయందును, ద్రవిడవేద ప్రబంధగ్రంథములయందును వీరుచదువని గ్రంథమే లేదు. మంత్రశాస్త్రీయ పాదుకాంతదీక్షమున్నగు

సంప్రదాయ రహస్యములను, వేదాంతశాస్త్ర సిద్ధాంతములను సమరస పఱచి హృదయంగమముగ బోధించుటయందు వీరికిఁగల నేర్పు ఇట్టిదని వర్ణించుటకు శక్యముకాదు. వీరు తమ ౫౬ వ వయసున స్వదేశము నకువచ్చి యాకాలమునందు మతాచార విద్యాభివృద్ధికిగాను తమజీవిత మంతయు నర్పించి బ్రహ్మచర్యాది నియమపూర్వకముగ వేదవిద్యను బోధించుచున్న శ్రీనందిరాజ లక్ష్మీనారాయణ దీక్షితులవారిని సందర్శించి శ్రౌతస్మార్త క్రియాకలాప సంబంధమగు వేదవిద్యను కొంతయభ్యసించి పాకయజ్ఞములనొనర్చి పలువురకుబోధించి బాపట్లతాలూకాయందుగల తనబంధుజాలమునందు పలువురను శ్రౌతస్మార్త విద్యాభ్యాసమునకు పురికొల్పి మతవిద్యాపారంగతు లగునటుల చేసిరి.

౩. ఈ విద్యానందనాథుఁడు హరిహరక్షేత్రమునందున్నప్పుడు ఒకానొక సూర్యగ్రహణ కాలమునందు తుంగభద్రానదియందు స్నానమొనర్చి ఆహ్నికముతీర్చుకొని వేదాంతగ్రంథము నొక్కదానిని రచింపవలయునను సంకల్పముతో ఇష్టదేవతను స్మరించుచుండఁగా శ్రీమత్త్రిపురసుందరీదేవి ప్రత్యక్షమయి నీవుచేయ సంకల్పించిన గ్రంథమునకు నన్నుకృతినాయికగా నొనర్పుమనిచెప్పి యంతర్ధానముకాగా తదాజ్ఞానుసారము భాగద్వయాత్మకమగు ఈకైవల్యనవనీతమును, త్రివర్గప్రదీపిక మున్నగు గ్రంథములను క్రమక్రమముగ రచించి తన్ముద్రణార్థము దాదాపు తమ ౭౫-వ వయసున చెన్నపురిచేరి గ్రంథములముద్రించి పలువురకు బోధించుచు ౯౬ వ యేట సిద్ధినందెను.

ఈకైవల్యనవనీతముయొక్క ౭ ముద్రణములు దాదాపు ౮౦౦౦ గ్రంథములు లోకులచేత ఆదరింపఁబడినవి. ౧౦ సంవత్సరములనుండి గ్రంథములను పలువురు కోరుచున్నను ముద్రింప నసమర్థులమయితిమి. మామిత్రులగు బ్రహ్మశ్రీ వేములపాటి వెంకటరాఘవయ్యగారి సోదరులు రాఘవయ్యగారు ఏతన్ముద్రణార్థము ౧౫౦ రు. ఇచ్చి ప్రోత్సాహమొనర్చినందులకు వారియందు కృతజ్ఞుఁడను. విద్యాప్రియులు యథాపూర్వముగ గ్రంథము నాదరించి తగుప్రోత్సాహము నొసంగెదరు గాక.

బృందావనం,
కీల్పాకం, మదరాసు,
రుధిరోద్గారి శ్రావణ శు ౧౫-౭-౨౩

ఇట్లు గ్రంథకర్తృపుత్త్రుఁడు,
క. మార్కండేయశర్మ.

శ్రీసద్గురుపరబ్రహ్మణే నమః.

# కైవల్యనవనీతము

## తత్త్వబోధప్రకరణ మను ప్రథమభాగముయొక్క

## విషయసూచిక.

పద్య సంఖ్య. పుట సంఖ్య.

* మొదటిసంఖ్య పద్యసంఖ్య. రెండవసంఖ్య పుటసంఖ్య అని యెఱుంగునది.

## చతుర్విధమహావాక్యముల యర్థవివరణము.



ఈ తత్త్వబోధప్రకరణ గ్రంథమునందుగల సందేహములన్నియు

# సందేహనివారణ ప్రకరణము

అను ద్వితీయభాగమునందు తీర్పఁబడినవి.

ద్వితీయభాగమున్నూ ఇదివఱకు 3 పర్యాయములు ముద్రింపఁబడి జగత్ప్రసిద్ధి నందియున్నది.

వెల. ౨-౦-౦.

అత్యుపయుక్తమగు గ్రంథరాజము.

# యోగాభ్యాసదర్పణము.

పరమహంస పరివ్రాజకాచార్యవర్య

## శ్రీ బ్రహ్మానంద సరస్వతీయతీంద్ర విరచితము.

ఈ గ్రంథము యోగపాతంజలసూత్రములు, హఠయోగప్రదీపిక మొదలగు యోగశాస్త్రగ్రంథములన్నియు పరిశీలించి కేవలగ్రంథములనుమాత్రమే గాక స్వానుభవపూర్వకముగ

## యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణా, సమాధులను

అష్టాంగయోగములనుగూర్చి వ్రాయబడినవచనగ్రంథము.

యోగశాస్త్రవిషయములను తేటతెలుగుమాటలతో తెలుపునట్టిగ్రంథము ఇది యొకటియే.

గ్లేజుకాగితముల ప్రతి వెల. ౦-౧౨-౦.

పెదరైటుకాగితాలు లైబ్రరియడిషన్ ౧-౮-౦.

గ్రంథమునందుగల కొన్నివిషయములీక్రింద తెలుపఁబడుచున్నవి.

౧-వ ప్రకరణమునందు:—అహింస, సత్యము, అస్తేయము, ఆర్జవము, క్షమ, ధైర్యము, శౌచము, బ్రహ్మచర్యము, మితాహారము, దయ, అను ౧౦ విధములగు యమములయొక్క వివరము, వానిననుష్ఠించుటవలన కలుగుఫలము తెలుపఁబడినది.

౨-వ ప్రకరణమునందు:—జప, తపో, దాన, వేదాంతశాస్త్రశ్రవణ, ఆస్తిక్య భావ, వ్రత, ఈశ్వరపూజన, యదృచ్ఛాలాభసంతోష, శ్రద్ధా, లజ్జ, యను ౧౦ విధములగు నియమముల లక్షణము తత్ఫలమున్ను, యోగాభ్యాసమునకుతగిన ప్రదేశము, కాలము, ఆహారనియమము, పథ్యాపథ్య పదార్థములును, తెలుపఁబడినవి. మఱియు ఇడా పింగళ శంఖిన్యాది నాడులయొక్కయు, ధౌతి, బస్తి, నేతి, నౌలి, త్రాటకము, కపాలభాతియను షట్క్రియలయొక్కయు, దశవిధవాయువులయొక్కయు, మహాముద్ర,

నభోముద్ర, ఉడ్యాణబంధముద్ర, జాలంధరముద్ర మొదలగు ౨౦ విధములగు యోగ ముద్రలయొక్కయు వివరము, వానిననుష్ఠించువిధము తేటతెల్లముగ స్వానుభవపూర్వక ముగ వ్రాయబడినది. షట్క్రియల ననుష్ఠించుటను అభ్యాసముచేసినవాఁడు ఆరోగదృఢ శరీరముగలవాఁడున్ను దీర్ఘాయుర్దాయముగలవాడున్ను అగును.

౩-వ ప్రకరణమున:—యోగాభ్యాసమున కత్యావశ్యకములగు సిద్ధాసన, వజ్రాసన, పద్మాసన, దృఢాసన, వీరాసనమున్నగు ౩౨ ఆసనములను వేయురీతి ఏయేయాసనమును అభ్యసించిన ఏయేశక్తి కలుగునదియు చక్కగా వివరింపబడినది.

౪-వ ప్రకరణమున:—రేచకపూరక కుంభకములను త్రివిధప్రాణాయామ భేదములయొక్కయు, అష్టవిధకుంభకములయొక్కయు, ప్రాణాయామము నభ్యసించువారు సలుపవలసిన అభ్యాసక్రమము, కాలనిర్ణయము మొదలగునవి తెలుపబడినది.

౫-వ ప్రకరణమున యోగశాస్త్రము ననుసరించినట్టియు వేదాంతశాస్త్రము ననుసరించినట్టియు ప్రత్యాహారభేదము వివరింపబడినది.

౬-వ ప్రకరణమున:—స్థూలసూక్ష్మధారణయొక్కయు, స్థూలధారణాభేదములగు పృథివి, అంభసి, ఆగ్నేయ, వాయవీ, ఆకాశధారణములయొక్కయు వివరము వానినాచరించుటవలన కలుగుఫలము తెలుపఁబడినది.

౭-వ ప్రకరణమున:—స్థూల, సూక్ష్మ జ్యోతిర్ధ్యానములును, తదవాంతరభేదములగు అంతస్థూల బహిస్థూల ధ్యానములు షట్చక్రధ్యానము మున్నగు యోగశాస్త్ర ధ్యానభేదములున్ను, పదస్థధ్యానము, పిండస్థధ్యానము, రూపస్థధ్యానము రూపాతీత ధ్యానము అనువేదాంతశాస్త్ర ధ్యానభేదములున్ను తెలుపబడినవి.

౮-వ ప్రకరణమున:—ధ్యానయోగ, నాదయోగ, రసానందయోగ, లయయోగ, భక్తియోగ, రాజయోగ, సమాధులను యోగశాస్త్ర సమాధిభేదములు, సవికల్ప, నిర్వికల్ప సమాధులయొక్కయు, తదవాంతరభేదములగు వితర్క, విచార, ఆనంద, అస్మిత సమాధులనియెడి వేదాంతశాస్త్ర సంబంధసమాధి భేదములయొక్కయు వివరముగలదు.

పలయువారీక్రీడవిలాసమునకు వ్రాయుడు:—

క. మార్కండేయశర్మ.
బృందావనం కీల్ పాకు మదరాసు.

శ్రీరస్తు.

శ్రీ పరబ్రహ్మణే నమః.

# కైవల్యనవనీతము

## తత్త్వబోధప్రకరణము.

(టీకాతాత్పర్యసహితము.)




అవతారిక. కైవల్యనవనీత మనెడు సకలోపనిషత్సార మైన యీయద్వైత శాస్త్రమంతయు నిత్యమంగళస్వరూప మైనను "సమాప్తికామో మంగళమాచరేత, విఘ్నవిధ్వంసకామో మంగళ మాచరేత" అను శిష్టాచారమునుబట్టి ఆస్తికమతావలంబను

అనుజనులకు "అస్మద్గురుభిర్మంగళమాచరితమ్, అస్మాభిరపిమంగళమాచరితవ్యమ్" అను ప్రమాణములు తెలియుటకై "శ్లో. ఓంకారశ్చాథశబ్దశ్చ ద్వావేతౌ బ్రహ్మణః పురా, కంఠం భిత్వా వినిర్యాతౌ తస్మా న్మాంగళికా వుభౌ." అను స్మృతినిబట్టి యీ గ్రంథాదిని ప్రణవాకారపరబ్రహ్మము "శ్రీకైవల్యఖదైకపా" త్తనుపద్యముచేత స్తుతింపఁబడుచున్నది.

శా. శ్రీకైవల్యఖదైకపాత్త్రిపదలక్ష్మీసంయుతోద్గీథస
ల్లోకాలోకకలైకమత్యపరమాలోకాత్మమై యెద్ది య
స్తోకానందముఖాంకపంచకలనాసువ్యక్తమై యొప్పు నా
శ్రీకైవల్యనవోద్ధృతార్థము సదా సేవించి కీర్తించెదన్. ౧

టీక. ఎద్ది=ఏ ప్రణవాకారపరబ్రహ్మము, శ్రీకైవల్య...కాత్మమై-శ్రీ=ధర్మార్థకామముల నెడి త్రివర్గముయొక్కయు, కైవల్య=మోక్షముయొక్కయు, ఖ=సుఖములను, ద=ఇచ్చునట్టి, ఏకపాత్="పాదోఽస్య విశ్వాభూతాని" అను శ్రుతిచేత నొక్కటియై అకారాత్మకమై అవిద్యాపాదముయొక్కయు, త్రిపద="త్రిపాదస్యామృతం దివి" అను శ్రుతిచేత మూఁడైన ఉకారమకారార్ధమాత్రస్వరూపములైన విద్యాపాదానందపాదతురీయపాదములయొక్కయు, లక్ష్మీ=సంపదలతోడ, సంయుత=కూడిన, ఉద్గీథ=బ్రహ్మప్రణవమందలి, సత్=శ్రేష్ఠములైన, లోకకలా=ప్రకృతిమయములగు పదునైదుకళలయొక్కయు, అలోకకలా=ప్రకృత్యతీతమగు తుర్యతుర్యమనెడి పదియాఱవకళయొక్కయు, ఐకమత్య=మేళనముచేత, పరమ=సర్వోత్కృష్టమై, ఆలోక=వెలుఁగుటయే, ఆత్మమై=స్వరూపముగాఁ గలదై, అస్తో...క్తమై-అస్తోక=మిక్కుటమైన, ఆనందముఖ=నిజానందమే మొదలగు, అంకపంచ=గుఱుతులైదింటియొక్క, అనఁగా పంచలక్షణములయొక్క, కలనా=కూడికచేత, సువ్యక్తమై=తెల్లగాఁ దెలియఁబడునదియై, ఒప్పు...అర్థముఁ-ఒప్పు=మనోహరమగుచున్న, ఆ=ప్రసిద్ధమైన, శ్రీ=సూర్యచంద్రానలకాంతులమీఱి మెఱయుచున్న, కైవల్యనవోద్ధృత=కైవల్యనవనీత మనెడి ఈయోగశాస్త్రమందలి, అర్థముఁ=విషయమును, అనఁగా ప్రణవమయమైన పరబ్రహ్మమును, సదా=ఎల్లప్పుడును, సేవించి=భజించి, కీర్తించెదన్=పొగడెదను.

తా. ధర్మార్థకామమోక్షప్రదములగు అకార ఉకార మకారార్ధమాత్రస్వరూపములైన అవిద్యాపాదము విద్యాపాదము ఆనందపాదము తురీయపాదము అనెడు నాలుగుపాదములుగల బ్రహ్మప్రణవమందలి పదియాఱవభాగమైన అవికల్పావికల్ప

కలాస్వరూపమయి సచ్చిదానందనిర్మలాఖండము లనెడి పంచలక్షణములచేత వెలుఁగు చున్నదై కైవల్యనవనీత మనెడి ఈ యోగశాస్త్రమందలి ముఖ్యతాత్పర్యమయి యొప్పు పరబ్రహ్మమును ఈశాస్త్రనిర్విఘ్నపరిసమాప్త్యర్థమయి యెల్లప్పుడును సేవించి వినుతించుచున్నాననుట.

శార్దూలవృత్తలక్షణము. శా. సారాచారవిశారదా యినయతిన్ శార్దూలవిక్రీడితా । శారంబై మసజమ్ములిమ్ముగ సతాగప్రాప్తిచేఁ జెల్వగున్॥ తా॥ మ-స-జ-స-త-త-గ-గణములును, ౧౩-వ అక్షరము యతి శార్దూలవృత్తమునకు నుండవలయు ననుట॥ క॥ కృతిముఖమున నైనసమ । స్కృతియొండె నభీష్టవస్తుకీర్తన మొండెన్॥ వితతాశీఃపద మొండెను । బ్రతిపాదింపంగవలయు భద్రాపేక్షన్॥ అను లక్షణముచేత నిష్టదేవతాకీర్తనారూపమంగళ మీపద్యమునఁ జెప్పఁబడెను॥ క॥ మయరసతజభనల కు భూ । జలయాగ్న్యనిలగగనభానుపద్మాకృపా । శ్రీయును లీతులు శిఖజయంబులు । భయబంధుర్గమనముదములు ఫలములు వరుసన్॥ అని యున్నందున గ్రంథాదిని మగణ ప్రయోగము॥ శ్రీకారప్రభావము॥ తే॥ వేదముల కెల్ల నోంకార మాదియైన । కరణిఁ గృతులకు నెల్ల శ్రీకార మాది । గానఁ గవివరు లెల్లను దానిఁ దక్క । నితరవర్ణంబు లిడరు సత్కృతులమొదల ॥ క ॥ పదపడి శ్రీకారము కృతి । మొదల నిలిచి దోష పుంజము నడంచి శుభం । బొదవించుఁ బరుస మినుమును । గదిసిసువర్ణంబు సేయు కరణి ధ్ధరణిన్॥ క॥ శుభదేవతాత్రయంబును। శుభఖచరత్రయముగలిగిశుభవాచకమై। యభినుతిఁ గాంచిన కతమున । శుభములుశ్రీకారమునను జొప్పడుటరుదే॥ తా॥ శవర్ణ రేఫేకారములంగూడి శ్రీ యయ్యెను. అందు శవర్ణకారములకు అధిదేవత లక్ష్మీదేవి. రేఫమున కగ్నిదేవుఁడు "శ్రియమిచ్ఛేద్ధుతాశనా" త్తని పురాణవచనముగలుగుటంజేసి యతఁడును లక్ష్మీప్రదుండు గావ మూఁడువర్ణములకును శుభదేవతలైరి మొదలిశవర్ణమునకు గ్రహము గురుఁడు. రేఫమునకు నీకారమునకు శుక్రుఁ డొక్కఁడే కావ మూఁటికినిశుభ గ్రహములే యయ్యెను. "కమలా శ్రీర్హరిప్రియా" యని లక్ష్మినామము గావున శుభ వాచకమయినది కావఁ గృతిముఖమందుఁ బ్రయోగించిన శ్రీకారమువలన శుభము గలుగుట చిత్రము గాదు గనుక నీగ్రంథాదిని శ్రీకారము ప్రయోగింపఁబడెను. ఇట్లని యప్పకవీయమం దున్నది.

మఱియు, ఈపద్యపురెండవపాదమున "లోకాలోకకలైకమత్యపరమా" యని చెప్పుటచేత లోకకలలు పదియైదును అలోకకల యొక్కటియునుగూడి పదియాఱుకళ లయ్యెను. కలయనఁగా ఒకటిలో పదియాఱవభాగము గనుక బ్రహ్మప్రణవముపదియాఱు భాగములుగలది. అది యెట్లనిన "శ్రు॥ అష్టాంగంచ చతుష్పాదం త్రిస్థానం పంచ

దైవతమ్ । ఓమిత్యేవం నజానాతి బ్రాహ్మణో నభవేత్సహి." అని మహావాక్యరత్నావళియందును "స్మృ. అస్త్యేకపాదవిద్యా స్యాన్నిరవిద్యా త్రిపాదభూత్." అని బ్రహ్మప్రణవార్థప్రకాశికయందును చెప్పఁబడియున్నది. కావున ప్రణవమందు అకారోకార మకారార్ధమాత్రాస్వరూపము లగు నవిద్యావిద్యానందపాదతురీయపాదాత్మకములైన సమష్టివ్యష్టిస్థూలసూక్ష్మకారణ మహాకారణము లనెడి యష్టశరీరములయొక్క కార్యములగు జాగ్రత్స్వప్నసుషుప్తితురీయము లనెడు నాలుగవస్థలకు బ్రహ్మవిష్ణురుద్రేశ్వరులు నలుగురు నధిదేవతలైరి. పంచదైవతి మవ్వుటవలన నయినవారైన సదాశివమూర్తికి స్థానము లేకపోయెను గనుక మాండూక్యాద్యుపనిషత్తులయందు పైనఁ జెప్పిన యవిద్యాదిపాదముల నాలుగింటిని పదియాఱుభాగములు చేయుటకు హేతువులు గలిగియుండుటవల్లను "స్మృ. గతాః కలాః పంచదశ ప్రతిష్ఠా దేవాశ్చ సర్వే ప్రతిదేవతాసు। కర్మాణి విజ్ఞానమయశ్చ ఆత్మా పరేఽవ్యయే సర్వ ఏకీభవంతి" అని రత్నావళియందు చెప్పఁబడియుండుటవల్లను షోడశకలలు పదిహేనింటిని మీఱినపదియాఱవకళ సదాశివమూర్తికి స్థానముగా నేర్పడుచున్నది గాన ప్రణవము పదియాఱుభాగములుగ భాగింపఁబడెను. వానికి వివరణము:—జాగ్రత్తలో జాగ్రత్త. ౧. జాగ్రత్తలో స్వప్నము. ౨. జాగ్రత్తలో సుషుప్తి. ౩. జాగ్రత్తలో తురీయము. ౪. స్వప్నములో జాగ్రత్త. ౫ స్వప్నములో స్వప్నము. ౬. స్వప్నములో సుషుప్తి. ౭. స్వప్నములో తురీయము. ౮. సుషుప్తిలో జాగ్రత్త ౯. సుషుప్తిలో స్వప్నము ౧౦. సుషుప్తిలో సుషుప్తి. ౧౧. సుషుప్తిలో తురీయము. ౧౨. తురీయములో జాగ్రత్త. ౧౩. తురీయములో స్వప్నము. ౧౪. తురీయములో సుషుప్తి. ౧౫. తురీయములో తురీయము ౧౬ మతియు త్రిస్థానమని యుండుటవలన సమష్టి వ్యష్టి తదుభయ చైతన్యైకమత్య బ్రహ్మవేత్త లని యర్థము గనుక సమష్టిరూపుఁడయిన యీశ్వరునకును వ్యష్టిరూపుఁడయిన జీవునకును సమష్టివ్యష్టిచైతన్యైక్యమగు బ్రహ్మవేత్తకును జాగ్రదవస్థయందు అకారమును అవిద్యాపాదమును స్థూలదేహమును తారతమ్యములు. అప్పు డీశ్వరునకు విరాట్టు వైశ్వానరుఁడు వైరాజనుఁడు అని, జీవునకు విశ్వుఁడు వ్యావహారికుఁడు చిదాభాసుఁడు అని, బ్రహ్మవేత్తకు ఓతయని పేళ్ళగును.

౧. జాగ్రత్తలో జాగ్రత్త:— ఈశ్వరజీవబ్రహ్మవేత్తలకు జాగ్రత్తలో జాగ్రత్త యిచ్చునప్పుడు అకారములో అకారమును అవిద్యాపాదములో అవిద్యాపాదమును స్థూలదేహమునందు స్థూలదేహము తారతమ్యములు. అప్పుడు ఈశ్వరునకు విరాట్టులో

విరాట్టు జీవునకు విశ్వునిలో విశ్వుఁడు బ్రహ్మవేత్తకు ఓతోత అని నామములు కలుగును.

జాగ్రత్తలో స్వప్నము:—పై మువ్వురకును జాగ్రత్తలో స్వప్నము వచ్చినపుడు అకారములో ఉకారమును అవిద్యాపాదములో విద్యాపాదమును స్థూలశరీరమునందు సూక్ష్మశరీరమును తారతమ్యములు అపుడు ఈశ్వరునకు విరాట్టులో హిరణ్యగర్భుఁడని జీవునకు విశ్వునిలో తైజసుఁడని బ్రహ్మవేత్తకు ఓతానుజ్ఞాత యని పేళ్ళు గలుగును.

జాగ్రత్తలో సుషుప్తి:—పైమువ్వురకును జాగ్రత్తలో సుషుప్తి వచ్చినపుడు అకారములో మకారమును అవిద్యాపాదములో ఆనందపాదమును స్థూలశరీరమునందు కారణశరీరమును తారతమ్యములుగాఁ గలుగును అప్పుడు ఈశ్వరునకు విరాట్టులో హిరణ్యగర్భుఁడని జీవునకు విశ్వునిలో ప్రాజ్ఞుఁడని బ్రహ్మవేత్తకు ఓతానుజ్ఞైకరసుఁడని నామములు గలుగును.

జాగ్రత్తలో తురీయము:—ఆమువ్వురికిని జాగ్రత్తలో తురీయము వచ్చినపుడు అకారములో అర్ధమాత్రయును అవిద్యాపాదములో తురీయపాదమును స్థూలశరీరమునందు మహాకారణశరీరమును తారతమ్యములు. అప్పుడు ఈశ్వరునకు విరాట్టులో పరమాత్మయని జీవునకు విశ్వునిలో కూటస్థుఁడని బ్రహ్మవేత్తకు ఓతావికల్పుఁడని పేళ్లుగలుగును.

౨. స్వప్నము:—సమష్టిరూపుఁడైనయీశ్వరునకును వ్యష్టిరూపుఁడైనయీశ్వరునకును వ్యష్టిరూపుఁడైన జీవునకును సమష్టివ్యష్టిచేతనైక్యమగు బ్రహ్మవేత్తకును స్వప్నావస్థయందు ఉకారమును విద్యాపాదమును సూక్ష్మదేహమును తారతమ్యములు. అప్పు డీశ్వరునకు హిరణ్యగర్భుఁడు సూత్రాత్మ యను పేళ్లును జీవునకు తైజసుఁడు స్వప్నకల్పితుఁడు అను పేళ్లును బ్రహ్మవేత్తకు అనుజ్ఞాత యనుపేరును గలుగును.

౧ స్వప్నములో జాగ్రత్త:—ఈశ్వరజీవబ్రహ్మవేత్తలకు స్వప్నములో జాగ్రత్త వచ్చినపుడు ఉకారములో అకారమును, విద్యాపాదములో అవిద్యాపాదమును, సూక్ష్మదేహమందు స్థూలదేహమును తారతమ్యములు. అప్పుడు ఈశ్వరునకు హిరణ్యగర్భునిలో విరాట్టనియును, జీవునకు తైజసునిలో విశ్వుఁడనియును బ్రహ్మవేత్తకు అనుజ్ఞాతోత యను పేరును గలుగును.

౨. స్వప్నములో స్వప్నము:—మఱియు నీమువ్వురకును స్వప్నములో స్వప్నము వచ్చినపుడు ఉకారములో ఉకారమును విద్యాపాదములో విద్యాపాదమును సూక్ష్మ

దేహమందు సూక్ష్మదేహమును తారతమ్యములు. అప్పు డీశ్వరునకు హిరణ్యగర్భునిలో హిరణ్యగర్భుఁడు జీవునకు తైజసునిలో తైజసుఁడు బ్రహ్మవేత్తకు అనుజ్ఞాతానుజ్ఞాత అని పేళ్లు గలుగును.

౩. * స్వప్నములో సుషుప్తి — మఱియు నీచెప్పఁబడిన మువ్వురికిని స్వప్నములో సుషుప్తి వచ్చినపుడు ఉకారములో మకారమును విద్యాపాదములో ఆనందపాదమును సూక్ష్మదేహమందు కారణశరీరమును తారతమ్యములు. అప్పు డీశ్వరునకు హిరణ్యగర్భునిలో అవ్యాకృతుఁడు జీవునకు తైజసునిలో ప్రాజ్ఞుఁడు బ్రహ్మవేత్తకు అనుజ్ఞాతానుజ్ఞైకరసుఁడు అని పేళ్ళు గలుగును.

౪. స్వప్నములో తురీయము — వెండియు పైని చెప్పఁబడిన మువ్వురికిని స్వప్నములో తురీయము వచ్చినపుడు ఉకారములో అర్ధమాత్రయును విద్యాపాదములో తురీయపాదమును సూక్ష్మదేహమందు మహాకారణశరీరమును తారతమ్యములు. అప్పుడు ఈశ్వరునకు హిరణ్యగర్భునిలో పరమాత్మ జీవునకు తైజసునిలో కూటస్థుఁడు బ్రహ్మవేత్తకు అనుజ్ఞాతావికల్పుఁడు అని పేళ్ళుగలుగును.

౩. సుషుప్తి — సమష్టిరూపుఁడైన యీశ్వరునకును వ్యష్టిరూపుఁడైన జీవునకును సమష్టివ్యష్టిచైతన్యైక్యముగు బ్రహ్మవేత్తకును సుషుప్త్యవస్థయందు మకారమును ఆనందపాదమును కారణశరీరమును తారతమ్యములు. అప్పు డీశ్వరునకు అవ్యాకృతుఁడు అంతర్యామి యను పేళ్ళును జీవునకు ప్రాజ్ఞుఁడు పారమార్థికుం డను పేరును బ్రహ్మవేత్తకు అనుజ్ఞైకరసుఁ డను పేరును గలుగును.

౧ సుషుప్తిలో జాగ్రత్త — మఱి యీశ్వరజీవ బ్రహ్మవేత్తలకు సుషుప్తిలో జాగ్రత్త వచ్చినపుడు మకారములో అకారమును ఆనందపాదములో అవిద్యాపాదమును కారణశరీరములో స్థూలశరీరమును తారతమ్యములు అప్పు డీశ్వరునకు అవ్యాకృతునిలో విరాట్టనియు జీవునకు ప్రాజ్ఞునిలో విశ్వుఁ డనియు బ్రహ్మవేత్తకు అనుజ్ఞైకరసోత యనియు పేళ్ళు గలుగును.

౨. సుషుప్తిలో స్వప్నము — పైముగ్గురికిని సుషుప్తిలో స్వప్నము వచ్చినపుడు మకారములో ఉకారమును ఆనందపాదములో విద్యాపాదమును కారణశరీరములో సూక్ష్మశరీరమును తారతమ్యములు. అప్పు డీశ్వరునకు అవ్యాకృతునిలో హిరణ్యగర్భుఁడు జీవునకు ప్రాజ్ఞునిలో తైజసుఁడు బ్రహ్మవేత్తకు అనుజ్ఞైకరసానుజ్ఞాత అని నామములు గలుగును.

౩. సుషుప్తిలో సుషుప్తి—మఱియు నీముప్పురికిని సుషుప్తిలో సుషుప్తివచ్చినప్పుడు మకారములో మకారమును ఆనందపాదములో ఆనందపాదమును కారణశరీరములో కారణశరీరమును తారతమ్యములు. అప్పు డీశ్వరునకు అవ్యాకృతునిలో అవ్యాకృతుఁడు జీవునకు ప్రాజ్ఞునిలో ప్రాజ్ఞుఁడు బ్రహ్మవేత్తకు అనుజ్ఞైకరసానుజ్ఞైకరసుఁడు అనుపేళ్లు గలుగును.

౪. సుషుప్తిలో తురీయము—మఱియు పైని జెప్పఁబడిన ముప్పురికిని సుషుప్తిలో తురీయము వచ్చినపుడు మకారములో అర్ధమాత్రయును ఆనందపాదములో తురీయపాదమును కారణశరీరములో మహాకారణశరీరమును తారతమ్యములు. అప్పు డీశ్వరునకు అవ్యాకృతునిలో పరమాత్మ జీవునకు ప్రాజ్ఞునిలో కూటస్థుఁడు బ్రహ్మవేత్తకు అనుజ్ఞైకరసావికల్పుఁడు అను నామములు గలుగును.

౫. తురీయము—సమష్టిరూపుఁడగు నీశ్వరునకును వ్యష్టిరూపుఁడగు జీవునకును సమష్టివ్యష్టిచైతన్యైక్యమగు బ్రహ్మవేత్తకును తురీయావస్థ వచ్చునపుడు అర్ధమాత్రయును తురీయపాదమును మహాకారణశరీరమును గలుగును. అప్పు డీశ్వరునకు పరమాత్మయనియు జీవునకు కూటస్థుఁడనియు బ్రహ్మవేత్తకు అవికల్పుఁడనియు పేళ్లు గలుగును.

౧ తురీయములో జాగ్రత్త—ఈముప్పురకును తురీయమున జాగ్రత్తవచ్చునపుడు అర్ధమాత్రలో అకారమును తురీయపాదమందు అవిద్యాపాదమును మహాకారణశరీరమందు స్థూలశరీరమును తారతమ్యములు అప్పు డీశ్వరునకు పరమాత్మలో విరాట్టనియు జీవునకు కూటస్థునిలో విశ్వుఁడనియు బ్రహ్మవేత్తకు అవికల్పోతయనియు పేళ్ళు గలుగును.

౨. తురీయములో స్వప్నము—మఱి యీముప్పురకును తురీయములో స్వప్నము వచ్చునపుడు అర్ధమాత్రలో ఉకారమును తురీయపాదములో విద్యాపాదమును మహాకారణశరీరములో సూక్ష్మశరీరమును తారతమ్యములు. అప్పు డీశ్వరునకు పరమాత్మలో హిరణ్యగర్భుఁడనియు జీవునకు కూటస్థునిలో తైజసుఁడనియు బ్రహ్మవేత్తకు అవికల్పానుజ్ఞాత యనియును పేళ్లుగలుగును.

౩. తురీయములో సుషుప్తి—పైముప్పురికిని తురీయములో సుషుప్తి వచ్చినపుడు అర్ధమాత్రలో మకారమును తుర్యపాదములో ఆనందపాదమును మహాకారణశరీరములో కారణశరీరమును తారతమ్యములు. అప్పు డీశ్వరునకు పరమాత్మలో అవ్యాకృతుఁడు జీవునకు కూటస్థునిలో ప్రాజ్ఞుఁడు బ్రహ్మవేత్తకు అవికల్పానుజ్ఞైకరసుఁడు అను నామములు గలుగును.

౪. తురీయములో తురీయము—మఱియు నీమువ్వురికిని తురీయములో తురీయము వచ్చినపుడు అర్ధమాత్రలో అర్ధమాత్రయును తురీయములో తురీయపాదమును మహాకారణశరీరములో మహాకారణశరీరమును తారతమ్యములు అప్పుడీశ్వరునకు పరమాత్మలో పరమాత్మ జీవునకు కూటస్థునిలో కూటస్థుఁడు బ్రహ్మవేత్తకు అవికల్పావికల్పుఁడు అను నామములు గలుగును.

ఇట్లేర్పడిన పదియాఱవస్థలయందు సమష్టిరూపుఁడైన యీశ్వరుఁడు సర్వజ్ఞత్వ సర్వేశ్వరత్వ సర్వాంతర్యామిత్వ సర్వస్రష్టృత్వ సర్వపాలకత్వ సర్వసంహారకత్వాది మహాగుణములును వ్యష్టిరూపుఁడైన జీవుఁడు "అహంకర్తా అహంభోక్తా అహంసుఖీ అహం దుఃఖీ అహంపాపీ అహందరిద్రః" అనునివి మొదలగు స్వల్పగుణములును బ్రహ్మవేత్తలు సర్వజ్ఞత్వ కించిద్జ్ఞత్వాదిగుణములయందు నిరభిమానముగలిగి యదృచ్ఛాలాభసంతుష్టియు పరబ్రహ్మనిష్ఠయు మహాకర్తృత్వము మహాభోగము మహాత్యాగము మొదలగు సుగుణములును గలవారై వెలుంగుదురు. మఱియు కార్యమునుబట్టి కారణమును గ్రహింపవలయుఁ గావున కార్యములైన జాగ్రదాద్యవస్థలనుబట్టి కారణములయిన అకారాదివర్ణపంచకములను అవిద్యాదిపాదపంచకములను సమష్టివ్యష్టిమయములైనదుభయైక్యస్వరూపములగు స్థూలాదిదేహములను తద్దేహాంతరవర్తులైన ఈశ్వరజీవబ్రహ్మవేత్తలకు గలిగెడు విరాడ్విశ్వాదినామధేయములను వివరముగ నెఱుఁగుటకై జాగ్రత్స్వప్నసుషుప్తితురీయమిశ్రముల నెఱుఁగుటకు ఉదాహరణములు ఈక్రింద వ్రాయఁబడుచున్నవి.

౧ జాగ్రత్తలో జాగ్రత్త—గురుసన్నిధానమున శాస్త్రశ్రవణము చేయునప్పుడు అడుగఁదగినవిషయముల నడిగి తెలిసికొని మనసున మఱపులేక యుండుట.

౨. జాగ్రత్తలో స్వప్నము—గురువునొద్ద శాస్త్రవిషయములను వినునప్పుడు పరాకుపడుటచేత ఆవిషయములు జ్ఞాపక ముండియు నుండక యుండుట.

౩. జాగ్రత్తలో సుషుప్తి—గురువునొద్ద సద్విషయములను వినవలయు నని ప్రారంభించి వినునప్పుడు హెచ్చరిక లేమిచే అవి యేవియు కొంచెముగా జ్ఞాపకము లేకపోవుట.

౪. జాగ్రత్తలో తురీయము—గురువునొద్ద శాస్త్రశ్రవణము చేయుటచే వస్తుతత్త్వజ్ఞానము గలిగి ఆవస్తువును చింతించుట.

౫. స్వప్నములో జాగ్రత్త—కల గని లేచి తాను కలలో కన్నదాని నెల్ల తప్పక చెప్పుట.

౬. స్వప్నములో స్వప్నము—కలగని లేచి అందలివిషయమును మఱచియు మఱవక యుండుట.

౭. స్వప్నములో సుషుప్తి—కలుగని మేలుకొని ఆకలయందు తాను కన్నదంతయు మఱచుట.

౮. స్వప్నములో తురీయము—కలలో తాను కొండమీఁదను ఏనుఁగుమీఁదను నెక్కినట్లును లక్ష్మీదేవి తన్ను వరించి పొందినట్లును గని లేచి దానిఫలమును విచారించి తనకు రాజ్యాధిపత్యము వచ్చుననియు సంపద గలుగు ననియు నెంచక ఇదియంతయు మనోవ్యాపారము గాని వేఱు కాదని నిశ్చయించి బ్రహ్మనిష్ఠనుండి చలింపకుండుట.

౯. సుషుప్తిలో జాగ్రత్త—సుఖముగా నిద్రించి లేచి ఆనిద్రాసుఖ మిట్టి దని తెలిసి చెప్పుట.

౧౦. సుషుప్తిలో స్వప్నము—సుఖముగా నిద్రించియు దానివలనిసుఖ మెట్టిదో యది తోఁచియు తోఁచక యుండుట

౧౧. సుషుప్తిలో సుషుప్తి—నిగురించి లేచిన పిమ్మట దానిసుఖ మిట్టి దని తెలియక యుండుట.

౧౨. సుషుప్తిలో తురీయము—సుఖముగ నిద్రించియు ఆనిద్రావస్థ అజ్ఞాన విషయము గాని ప్రజ్ఞానఘనప్రత్యగాత్మ నైన నాకు విషయము కాదని తెలియుట.

౧౩. తురీయములో జాగ్రత్త—బ్రహ్మనిష్ఠయందుండునప్పుడు జాగ్రత్తయందలివ్యాపారము లైన యాఁకలిదప్పులు తోఁచి ప్రపంచస్ఫూర్తి గలుగుట

౧౪. తురీయములో స్వప్నము—ఆబ్రహ్మనిష్ఠయం దుండునప్పుడు ఆఁకలిదప్పులు తోఁచి ప్రపంచస్ఫూర్తి కలిగి కలుగక యుండుట.

౧౫. తురీయములో సుషుప్తి—బ్రహ్మనిష్ఠయందు వికల్ప మేమియు లేక యుండుట.

౧౬. తురీయములో తురీయము—జాగ్రత్స్వప్న సుషుప్తులవలనఁ గలిగెడి యావదింద్రియభేదములును లేక అఖండపరిపూర్ణసచ్చిదానందపరబ్రహ్మము తానే కాని తనకంటె వేఱుగాను అనెడు వ్యక్తిభేదములేక పరబ్రహ్మము తాను తానై యుండుట. ఇదే అవికల్పావికల్పము.

౧. జాగ్రత్త—మనస్సు దశేంద్రియములతోఁగూడి శబ్దాదివిషయములయందు అనుభవము గలిగి యుండుటయే జాగ్రదవస్థ.

౨. స్వప్నము—జాగ్రత్క్రమక్రమముగ క్షీణించి గాఢనిద్రను బొందక అజాగ్రత్తయందలి విషయములయనుభవము గలిగి యుండుటయే స్వప్నావస్థ.

౩. సుషుప్తి—మానసాదిసర్వేంద్రియవ్యాపారశూన్యమే నిద్రావస్థ.

౪. తురీయము—దేవుఁడు గలఁడనెడి ఆస్తికబుద్ధి గలిగి ప్రమాణములచేత అసత్తు సత్తు అనుభేదము గల లౌకికకర్మద్వైతాద్వైతములకల్పనల విమర్శించి వస్తుజ్ఞానము గలిగి యుండుటే తురీయము. ఈనాలుగవస్థలు నొక్కొక్కటి నాలుగేసిభాగములుగ భాగింపఁబడి పదియాఱవస్థలయ్యెను.

ఈయవస్థలు పదియాఱింటియందు తమోగుణప్రధాను లగువారు తరు పాషాణ జలచర క్రిమి పశు పక్షి ప్రాయులై మూఢవృత్తి గలవారయి యుందురు. రజోగుణప్రధాను లగువారు ఘోరవృత్తి గలిగి పామరులై కర్మభక్తిజ్ఞానములలో నొక్కటియైన లేక కుటుంబపోషణాసక్తి గలిగి మనుష్యస్వభావముగలవారై నాస్తికలౌకికులై యుందురు. సత్త్వగుణప్రధాను లగువారు శాంతవృత్తిగలిగి బుద్ధిమంతులై పుణ్యకర్మాసక్తియు దేవతాంతరభక్తియు పుణ్యలోకానురక్తియుఁ గలిగి దేవతాస్వభావము గలవారై యుందురు. గుణసామ్యావస్థగల వివేకులు శుద్ధసత్త్వసంపన్నులై సగుణోపాసకులై యుందురు. కేవలబ్రహ్మవేత్తలు జాగ్రత్తు మొదలగు పదియాఱవస్థలు గల ప్రకృతి నతిక్రమించి అవికల్పావికల్పపరబ్రహ్మనిష్ఠగలవారై యుందురు. మఱి ఈపదియాఱుకలలు త్రిగుణవిభాగములచేత నొకటితో నొకటి పలుమాఱు గూడి యనేకభేదములై పంచదశకలాత్మక మూలాతూలాప్రకృతిరూపములై లోకవ్యాపకములై యుండును. పదియాఱవకల కేవలసత్తామాత్రమై మూలప్రకృతి కాశ్రయమై స్వయంప్రకాశమై యుండును. కనుకనే "కలాభ్యాం చూడాలంకృతశశికలాభ్యాం" మని శివానందలహరి యందును, "శివ శ్శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం" మని సౌందర్యలహరి యందును, "సర్వం ఖల్విదం బ్రహ్మ, పురుషా న్నపరం కించిత్, పురుష ఏవేదగ్ంసర్వం, ఏకో దేవో బహుధా నివిష్టః, ఏకం సంతం బహుధా కల్పయంతి, అజాయమానో బహుధా విజాయతే తస్య ధీరాః పరిజానంతి యోనిం, బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి, స బ్రహ్మ స శివ స్సహరి స్సేంద్ర స్సోఽక్షరః పరమః స్వరాట్" అని యుపనిషత్తులయందును, "శ్రుత్ అనుభూతిం వినా మూఢో వృథా బ్రహ్మణి మోదతే, ప్రతిబింబితశాఖాగ్రఫలాస్వాదనమోదవత్" అని మహావాక్యరత్నావళియందును చెప్పఁబడియున్నది. కాఁబట్టి ప్రణవార్థానుభవము గలిగి పదియాఱవకల యను తురీయాతురీయస్వరూపుఁ డయి యానందించువాఁడే బ్రహ్మవేత్త. ఈవిషయములు కరతలామలకము గఁ దెలియుటకై బ్రహ్మప్రణవచక్రము వ్రాయఁబడుచున్నది.

అవతారిక. చంద్రునియందలి చంద్రికవలె తటస్థాతద్వ్యక్త్యవ్యక్తిస్వరూపలక్షణ లక్షితపరబ్రహ్మము నెడఁబాయనిపరబ్రహ్మిణి వినుతింపఁబడుచున్నది.

చ. సలలితతుర్యతుర్యశివసన్మయునం దవినాస్వభావ లై
కలసి త్రిరూప లై స్వగుణకల్పితకృత్యము లందొనర్చుచున్
వెలయుచిదాత్మశక్తి సువివేక మొసంగ నుతింతు సన్మనో
నిలయను దేవి మత్కృతి వినిర్మల మొంద సదా ముదంబునన్. ౨

టీ. సలలిత...నంగున్-సలలిత = ఒప్పిదమైన, తుర్యతుర్య = బ్రహ్మప్రణవ మందలి పదియాఱవభాగమైన అవికల్పావికల్పమను పేరుగల, శివ = సూర్యచంద్రానల కాంతులను మీఱి వెలుఁగుచున్న, సన్మయునంగున్ = దేశకాలవస్తుపరిచ్ఛేదశూన్యమైనపరబ్రహ్మమందు, అవినాస్వభావలై = అమలసత్త్వగుణస్వభావము గలిగి వేఱు పాటు లేనిదై, కలసి = పరబ్రహ్మముతోఁ గూడి (పిమ్మట) త్రిరూపలై = మలిన సత్త్వస్వభావముచేత లక్ష్మిపార్వతీసరస్వతు లనెడు మూఁడురూపములు గలదై, లేక, యిచ్ఛాజ్ఞానక్రియారూపములు గల గాయత్రీ, సావిత్రీ సరస్వతు లనెడి మూఁడురూపములు గలదై లేక, భిన్న, అభిన్న, భిన్నాభిన్న అను త్రివిధరూపములు గల, త్రిపద, త్రిబీజ, త్రికూటము లనెడు గాయత్రీ, బాలా, పంచదశాక్షరీ, మంత్రదేవతారూపిణి లై, వీనిలో కర్మకాండపరిపూర్తికి గాయత్రి, భక్తికాండ పరిపూర్తికి బాల, జ్ఞాన కాండ పరిపూర్తికి పంచదశాక్షరి ఉపాస్య అని యెఱుఁగునది స్వగుణకల్పితకృత్యములు, స్వ=స్వకీయములైన, గుణ = సత్త్వరజస్తమోగుణములచేత, కల్పిత=పుట్టింపఁ బడిన, కృత్యములు = సగుణబ్రహ్మాదిదేవతాజంగమస్థావరాంత మగు నిరువదిరెండు భేద ములు గల ప్రాణులసృష్టిస్థితిసంహారతిరోధానానుగ్రహము లనెడు పంచకృత్యములను, అందున్ = అపరబ్రహ్మమందు, ఒనర్చుచున్=లేనిదే యున్నట్లుగ తోఁపింపఁజేయుచు, వెలయుచిదాత్మశక్తిన్ - వెలయు = ప్రకాశించునట్టి, చిదాత్మశక్తిన్ = విజ్ఞానస్వ రూపమైన పరబ్రహ్మశక్తియైనదియును, సన్మనోనిలయనున్ - సత్ = బ్రహ్మవేత్తల యొక్క, మనః=అంతఃకరణములయందు అనఁగా చిదాకాశములయందు, నిలయనున్ = నివసించునదియును నైన, దేవిన్ = (సకలవస్తువులయందు ఆయావస్తునామరూపములచేత క్రీడించునట్టి) త్రిపురసుందరిని, సువివేకమొసంగన్=అహం బ్రహ్మాస్మి యను దివ్య జ్ఞానము నిచ్చుటకును, మత్కృతి = నాచేతఁ జేయఁబడిన కైవల్య నవనీతము అనెడి యీ యోగశాస్త్రమును, వినిర్మల మొందన్ = అప్రయుక్తాదిసకలదోషములు లేక

యుండునట్లు చేయుటకును, ముదంబునన్ = నిరతిశయానందముతోడ, సదా = ఎల్లప్పుడు, నుతింతున్ = కొనియాడుచున్నాను.

తా. సచ్చిదానందనిత్యనిర్మలము లనెడు పంచలక్షణములచేత మనోహర మగు పరబ్రహ్మమునందు, అమలసత్త్వస్వభావముచేత, అగ్నియం దుష్ణప్రకాశరూపశక్తియున్నట్లు, అభిన్నముగఁ గూడి యుండి, పిమ్మట మలినసత్త్వస్వభావముగలదై, లక్ష్మి పార్వతి, సరస్వతి లనెడుమూఁడురూపములుగలదై, స్వకీయము లగు సత్త్వరజస్తమోగుణములచేత, సగుణబ్రహ్మాదిదేవతాజంగమస్థావరాంతమైన యిరువదియేడు భేదములుగల ప్రాణులను, పుట్టించుట, పెంచుట, త్రుంచుట, మఱుఁగుపఱచుట, మఱలఁగనఁబఱచుట లనెడు పనులన్నియుదింటిని అపరబ్రహ్మమే చేయుచున్న దన్నట్లుగ తోఁపింపఁజేయునది యును, బ్రహ్మజ్ఞానులయంతఃకరణములయందు నివసించునదియును, సకలపదార్థములయందు అనేకనామరూపములచేత క్రీడించునదియును నైన పరబ్రహ్మణిని "అహంబ్రహ్మాస్మి" యనునిశ్చయజ్ఞానము నిచ్చుటకును, ఈగ్రంథము నిర్విఘ్నముగను, నిర్దోషముగ నెఱవేర్చుటకును ఎల్లప్పుడు స్తుతించుచున్నా ననుట.

మఱి యీపద్యమందలి రెండవచరణమున "త్రిరూపయై స్వగుణకల్పితకృత్యము లందొనర్చుచున్" అని యుండుటవలన మొదట పరబ్రహ్మిణి,తురీయతురీయనిర్గుణ పరబ్రహ్మమందు చంద్రునియందలి చంద్రికవలె, అవినాభావముగఁ గలిసి పిమ్మట లసత్త్వప్రధానయైనందున అపరబ్రహ్మము తటస్థలక్షణముచేత అపరబ్రహ్మిణితోఁ సగుణబ్రహ్మ మయ్యెను. ఆయమలసత్త్వప్రధానచేతనులకు జన్మార్జితపుణ్యావశమువలన బ్రహ్మజ్ఞానముఁ గలిగించి తటస్థలక్షణస్వరూపుఁడైన పరబ్రహ్మమును జూపి వెనుక నిర్గుణస్వరూపుఁ డగు పరబ్రహ్మమందైక్యము గలుగఁజేయును. వెనుక ఆయమల సత్త్వప్రధానయే మలినసత్త్వప్రధానయై గాయత్రీ సావిత్రీ సరస్వతులనెడు మూఁడు రూపములుగఁ గనఁబడి, అపరబ్రహ్మమందు స్వగుణములైన సత్త్వరజస్తమస్సులచేత పుణ్యపాపమిశ్రభేదములు గల దేవ తిర్య పాషాణ జలచర క్రిమి మృగ పక్షి నరులతోఁ గూడిన త్రిజగములను తోఁపింపఁజేసి వారికి సృష్టిస్థితిసంహారతిరోధానానుగ్రహములఁ గలుగఁజేయుచు నుండును. ఆత్రిగుణములవలనఁ బుట్టినవి యీక్రింద విభజనగఁ దెలుపఁబడుచున్నవి.

సత్త్వగుణమువలనఁ జతుర్ముఖబ్రహ్మ మొదలగు ముప్పదిమూఁడుకోట్లదేవతలు పుట్టిరి.

రజోగుణమువలన మనుష్యులు, మృగములు, పక్షులు, పురుగులు, జలచరములు లోనగు సకల జంగమప్రాణులు పుట్టెను.

తమోగుణమువలన భూమి పర్వత వృక్షపాషాణములు మొదలగు స్థావరము లన్నియుఁ బుట్టెను. ఈత్రిగుణములు ఒక్కటొక్కటితోఁ గలిసి సత్త్వసత్త్వము, సత్త్వరాజసము, సత్త్వతమస్సు, రజస్సత్త్వము, రజోరజస్సు, రజస్తమస్సు, తమస్సత్త్వము, తమోరజస్సు, తమస్తమస్సు అని తొమ్మిదివిధము లయ్యెను. అందు సత్త్వగుణమందలి సత్త్వగుణమువలన విరాట్టు సూత్రేశ్వరుఁడు మొదలగువారు పుట్టిరి.

సత్త్వగుణమందలి రజోగుణమువలన, దేవఋషులు, అఱువదినాలుగుకోట్లు వాలఖిల్యులు వైఖానసులు మొదలగువారు జనించిరి.

సత్త్వగుణమునందలి తమోగుణమువలన యక్షులు రక్షస్సులు విద్యాధరులు లోనగువారలు జన్మించిరి

రజోగుణమందలి సత్త్వగుణమువలన జనసంఘ ముదయించెను.

రజోగుణమందలి రజోగుణమువలన నాలుగుకాళ్లుగల పశువులు మృగములు మొదలగునవి కలిగెను.

రజోగుణమందలి తమోగుణమువలన స్వేదజములు, అండజములు, జలచరములు, మొదలగునవి పుట్టెను.

తమోగుణమందలి సత్త్వగుణమువలన పైరులు, కసువులు, గడ్డిపంటలు, మొదలగునవి యుదయించెను.

తమోగుణములోని రజోగుణమువలన చెట్లు,పొదలు,తీఁగలు లోనగునవి జనించెను.

తమోగుణములోని తమోగుణమువలన భూములు, కొండలు, ఱాళ్లు, మొదలగు స్థావరములు పుట్టెను.

మఱి సత్త్వమందలిసత్త్వము మొదలైన యాతొమ్మిదియును ఒక్కటొక్కటితోఁ గలసి సత్త్వతమస్తమస్సు, సత్త్వతమోరజస్సు, సత్త్వతమస్సత్త్వము, సత్త్వరజస్తమస్సు, సత్త్వరజోరజస్సు, సత్త్వరజస్సత్త్వము, సత్త్వసత్త్వతమస్సు, సత్త్వసత్త్వరజస్సు, సత్త్వసత్త్వసత్త్వము, రజస్తమస్తమస్సు, రజస్తమోరజస్సు, రజస్తమస్సత్త్వము, రజోరజస్తమస్సు, రజోరజోరజస్సు, రజోరజస్సత్త్వము, రజస్సత్త్వతమస్సు, రజస్సత్త్వరజస్సు, రజస్సత్త్వసత్త్వము, తమస్తమస్తమస్సు, తమస్తమోరజస్సు, తమస్తమస్సత్త్వము, తమోరజస్తమస్సు, తమోరజోరజస్సు, తమోరజస్సత్త్వము, తమస్సత్త్వతమస్సు, తమస్సత్త్వరజస్సు, తమస్సత్త్వసత్త్వము, అని యిరువదియేడు భేదము లయ్యెను. అందు,

౧. సత్త్వగుణముతోఁ గలసిన తమోగుణమందలి తమోగుణమువలన శేషుఁడు, వాసుకి, తక్షకుఁడు, కర్కోటకుఁడు, శంఖుఁడు, మొదలగుసర్పములును, పాతాళా

హాహా మొదలగు గంధర్వులు, అశ్వముఖంబును నరశరీరమును గల కిన్నరులును, మాణిభద్రుఁడు మొదలగు కింపురుషులును, కామరూపధరులును, ముప్పదియార్వురు తుషితులును నైరృతి మొదలగు రాక్షసులును, అసురేంద్రుఁడు లోనగు నలువదియాఱుకోట్ల దైత్యులును, కుబేరుఁడు లోనగుయక్షులు మొదలగువారు పుట్టిరి.

౨ సత్త్వ...మందలి రజోగుణమువలన ముప్పదిమూఁడుకోట్ల దేవతలును యముఁడు అంగిరసుఁడు అగ్నిష్వాత్తుఁడు కవ్యవాహనుఁడు అజానజానులు మొదలగు పితృదేవతలును పుట్టిరి.

౩ సత్త్వ...మందలి సత్త్వగుణమువలన భూలోకమందలి జనులకు అగ్నిష్టోమాదివైదికకర్మములఁ జేయు బుద్ధిపుట్టించుటకును వారికి తమసారూప్యాది పదవుల నిచ్చుటకును శక్తి గలిగి దేవలోకమం దుండు కర్మదేవతలును సూర్యుఁడు మొదలగు నవగ్రహములును వాని పరివారసమూహము వసించులోకములును పుట్టెను.

౧ సత్త్వగుణములోఁ గలసిన రజోగుణమందలి తమోగుణమువలన అణిమాదిసిద్ధులుగల విశ్వావసు పరావసు ప్రభృతిసిద్ధులును మనుఁడు హనుమంతుఁడు విష్వక్సేనుఁడు నారాయణుఁడు మొదలగు సాధ్యులును, బ్రహ్మర్షులగు సనకాదిమహామునులు మొదలైనవారు పుట్టిరి.

౨. సత్త్వ...మందలి రజోగుణమువలన నిత్యపవిత్రులగు వసిష్ఠాగస్త్యదధీచిగౌతమభరద్వాజాదిఋషులును శుకవామదేవజాబాల్యాదిమౌనులును భగవన్నామపరాయణులగు ప్రహ్లాదపుండరీక నారదాంబరీషాది పరమభాగవతులును పుట్టిరి.

౩. సత్త్వ...మందలి సత్త్వగుణమువలన ఇంద్రుఁడు మొదలగు దిక్పాలకులును ముప్పదిమూఁడుకోట్ల వేల్పులును బ్రహ్మవిష్ణురుద్రేశ్వర సదాశివులును బృహస్పతి విశ్వకర్మనందికుమారగణనాథాదులును దుర్వాసో దత్తాత్రేయాదిమహర్షులును కాలాగ్నిరుద్రహాటకేశ్వరాదులును పుట్టిరి.

౧. సత్త్వగుణములోఁ గలసిన సత్త్వగుణమందలి తమోగుణమువలన విరాట్పురుషుఁడు హిరణ్యగర్భుఁడు అవ్యాకృతుఁడు స్థాణుగణేశ్వరుఁడు నిర్వికల్పకజ్ఞాననిష్ఠులు లోనగువారు పుట్టిరి.

౨. సత్త్వ...మందలి రజోగుణమువలన సూత్రాత్ముఁడు సాక్షినాయకుఁడు నిర్వికల్పకసమాధినిష్ఠులు బ్రహ్మవిదుఁడు బ్రహ్మవిద్వరుఁడు బ్రహ్మవిద్వరీయుఁడు బ్రహ్మవిద్వరిష్ఠుఁడు లోనగు జీవన్ముక్తులును ఉద్భవించిరి.

౩. సత్త్వ...మందలి సత్త్వగుణమువలన సర్వజ్ఞత్వము, సర్వేశ్వరత్వము, సర్వాంతర్యామిత్వము, సర్వకర్తృత్వము, సర్వనియామకత్వము లోనగు మహాగుణములును, సృష్టి, స్థితి, సంహారము, తిరోధానము, అనుగ్రహము అనెడి పంచకృత్యములును గల పరమేశ్వరుఁడు పుట్టెను

౧. రజోగుణముతోఁ గూడిన తమోగుణమందలి తమోగుణమువలన అడవియీఁగలు తేళ్లు కందిరీఁగలు ఉసిళ్లు చీమలు ఈఁగలు పాములు మిడుతలు మింటను మంటను పుట్టుజంతువులను మిణుఁగురుపురుగులు పట్టుపురుగులు ముఖముల్లుపురుగులు చెమటవల్ల పుట్టెడి పేలు ఈళ్లు చీరపేలు ఎల్లలు నల్లులు దోమలు లోనగునవి పుట్టెను

౨. రజో...మందలి రజోగుణమువలన మొసళ్లు ఎండ్రకాయలు నత్తలు గవ్వలు కాకిచిప్పలు ముత్తెపుఁజిప్పలు సంకులు చేఁపలు తాఁబేళ్ళు నీటిపాములు కప్పలు జెలగలు లోనగు జలజంతువులును పుట్టెను.

౩. రజో...మందలి సత్త్వగుణమువలన కాకులు పిచ్చుకలు చిలుకలు గోరువంకలు కెమిళ్లు హంసలు కొంగలు చక్రవాకములు చకోరములు గండభేరుండములు శరభములు డేగలు సాళువములు కోకిలలు గరుడపక్షులు గ్రద్దలు కొఁజాలు వానకోయిలలు గువ్వలు కోళ్ళు పావురాళ్ళు గిజిగాళ్ళు లోనగు పక్షులు పుట్టెను.

౧ రజోగుణముతోఁగూడిన రజోగుణమందలి తమోగుణమువలన సింహములు పులులు అడవిపందులు ఎలుఁగులు ఊరఁబందులు ఎలుకలు పందికొక్కులు కుక్కలు నక్కలు పిల్లులు బల్లులు చివంగులు తోఁడేళ్లు తుండేళ్ళు గాడిదలు చిఱుతపులులు ఉడుములు లోనగు మృగములు పుట్టెను.

౨. రజో...మందలి రజోగుణమువలన కోఁతులు ఏనుఁగులు గుఱ్ఱములు మేఁకలు గొఱ్ఱెలు ఎనుములు పునుఁగు జవ్వాజిపిల్లులు కస్తూరిమృగములు ఒంటెలు ఖడ్గమృగములు లోనగునవి పుట్టెను.

౩. రజో...మందలి సత్త్వగుణమువలన కామధేనుకులమునఁ బుట్టిన కపిలయావులు మొదలగు గోవులును, చమరీమృగములు వల్లి యిఱ్ఱులు జింకలు దుప్పులు లోనగునవి పుట్టెను.

౧ రజోగుణముతోఁగూడిన సత్త్వగుణమందలి తమోగుణమువలన శూద్రులును మంగల చాకలి మాల మాదిగలును, శబర హూణ మ్లేచ్ఛ కంక కిరాతకులును, లోహ ఎరుకల ఏకాది చెంచు దొమ్మరి కుమ్మరి సాలె జాంగ్ర అగసాలె లోనగుజాతులవారును

మనుష్యమాంస భక్షకులును, జనభయంకరులును చోరులును కటికివాండ్రును మఱియు ఘాతుకపుఁబనులు చేయువారును లోనగువారు పుట్టిరి.

౨. రజో...మండలి రజోగుణమువలన, చదువుట, ఇచ్చుట, పుణ్యకర్మములు చేయుట, దుష్టనిగ్రహ శిష్టపరిపాలన భూరక్షణములు లోనగుపనులు గల రాజులును, దున్నుట, ఆవులఁగాచుట, బేరమాడుట, లోనగు పనులుగల కోమట్లును, బేరులును, లోనగువారు పుట్టిరి.

౩. రజో...మండలి సత్త్వగుణమువలన బ్రహ్మవాదులును వేదశాస్త్రాదివిద్యాధ్యయనసంపన్నులును బ్రహ్మచర్యాద్యాశ్రమాచారవంతులును అయిన ఆంధ్ర కర్ణాట ద్రావిడ ఘూర్జర మహారాష్ట్ర లనెడు పంచద్రావిడులును, ఉత్కల మైథిల గౌడ కనోజ సారస్వత సార్వర్య లనెడి పంచగౌడులును పుట్టిరి వీరే దశవిధబ్రాహ్మణులు.

౧. తమోగుణముతోఁ గూడిన తమోగుణమండలి తమోగుణమువలన నీళ్ళులేని భూములును, కొండలు ముండ్లచెట్లు గండ్లు ఱాళ్ళు లోనగునవి గలిగి జనులచేత పోఁగూడనిమార్గములును, జనులు సంచరింపఁదగినకొండలును, మొఱపనేలలును, చవుటినేలలును తృణకాష్ఠజలసమృద్ధులు లేక దేవబ్రాహ్మణవర్జితములును నైపరోపకారరహితులగు కేవల తమోగుణజనులకు నివాసములై కంపు చేఁదు ఉప్పు గల జలములుగలిగి భూతదయాపశ్చాత్తాపములు లేక భూతవేతాళబ్రహ్మరాక్షసాది దుష్టగ్రహనివాసములై తామసాహారములును తామసదానములును తామసతపస్సులును తామసశ్రద్ధలును తామసయజ్ఞములును గలజనులు వసించుగ్రామములుగల దేశములు పుట్టెను.

౨. తమో...మండలిరజోగుణమువలన సారవంతములై పంటలకుఁదగి తియ్యని తేటచల్లనినీళ్ళు గలిగి రాజసాహారములు దానములు తపస్సులు శ్రద్ధలు యజ్ఞములుగల జననివాససంచారయోగ్యములైన భూములును మృదువులై జారచోరకంటక రహితములయిన మార్గములును చేలగు కొండలును రేగటిమన్ను ఎఱ్ఱమన్ను గల నేలలును మృదువులై మనుష్యకార్యములకు యోగ్యములైన ఱాళ్లును సామాన్యజంతువులచే భుజింపఁబడెడి దేవబ్రాహ్మణనివాసయోగ్యములైన యూళ్లు గల దేశములును జనించెను

౩ తమో...మండలి సత్త్వగుణమువలన పుణ్యక్షేత్రములును గంగాదిపుణ్యనదులును పవిత్రజలములుగలిగి దేవతలచేత బ్రాహ్మణులచేత నెల్లప్పుడుసేవింపఁబడెడు కాశీ కాంచి మథుర అయోధ్య ద్వారవతి అవంతి లోనగు పుణ్యపట్టణములు గల భూములును వేంకటాద్రి భద్రాద్రి సింహాద్రి అరుణాచలము శ్రీశైలము అగస్త్యగిరి కైలాసము హిమా

లయము మేరుగిరి మందరపర్వతము లోనగు పుణ్యపర్వతములును, గోపిచందన శ్వేతమృత్తికలును, ఫల పుష్ప పత్ర యోగ్యములగు చెట్లుగల నేలలును, సజ్జనసంచారమార్గములును, సాలగ్రామబాణలింగశోణభద్రాగణపతిస్వర్ణ నిమళరాజాన్నత్రములును, యమునా జాహ్నవి లోనగు శిలలును, బంగారు వెండి లోనగు లోహములు పుట్టెడివోట్లును, వజ్రము వైడూర్యము లోనగు రత్నములగనులుగల నేలలును, బ్రహ్మవిద్ బ్రహ్మవిద్వర బ్రహ్మవిద్వరీయ బ్రహ్మవిద్వరిష్ఠులకు మహర్షులసంచారమునకు నివాసమునకుఁ దగిన స్థలములును సాత్త్వికాహారదానతపోయజ్ఞశ్రద్ధలుగల జనులకు నివాసపాత్రములగు క్షేత్రములును పుట్టెను.

౧. తమోగుణముతోఁగూడిన రజోగుణమందలి తమోగుణమువలన చేఁదు ముండ్లుగలిగి నీడలు పువ్వులు పండ్లు లేక నిద్రాలస్యములు సోమరితనము లోనగు తామసగుణములుగల దుర్జనులకుఁ దగిన ముష్టి వేము తుమ్మ బలురక్కసి నాగజెముఁడు ఈటి తాఁడి యీఁత లోనగునికృష్టపుచెట్లును దుర్గంధసహితములై అల్పజలములుగల యేళ్లును పిశాచ దుష్టజనసంచారములకుఁ దగిన యూళ్లును పుట్టెను.

౨. తమో...మందలి రజోగుణమువలన రాజసజనులకు యోగ్యములైన ఫలపుష్పపత్రములు గలిగి ఔషధములకు భక్షణమునకుఁ దగిన నిమ్మ దానిమ్మ జమ్మి ముస్టి కానుఁగు నేరేడు చింత లోనగుతరువులును మనుష్యులచే సేవింపఁదగిన పుష్పములు, తీఁగలు, పొదలు, పొదరిండ్లును పుట్టెను.

౩. తమో...మందలి సత్త్వగుణమువలన సాత్త్వికజనులకుఁదగిన అఁటి పనస మామిడి వెలగ రావి తులసి బిల్వము మల్లె లోనగు చెట్లును, జ్ఞానులకుఁ దగినచంద్రకాంత ఉత్తరేణి దర్భ లోనగునవియును దేశములు, బ్రాహ్మణులు లోనగు ఉత్తములచేత పూజింపఁదగిన పద్మములు కలువలును కల్పకము పారిజాతము మందారము హరిచందనము సంతానము లోనగు కల్పవృక్షములును, పొన్నలు సురపొన్నలు లోనగునవియును పుట్టెను.

౧. తమోగుణముతోఁగూడినసత్త్వగుణమందలి తమోగుణమువలన తమిద ఉలవ జొన్న కొఱ్ఱ సజ్జ ఆరిక వరిగ మొదలగు క్షుద్రధాన్యములును, ఆవాలు మిరియాలు మిరపకాయలు మొదలైనవి పండెడినేలలు నుదయించెను.

౨. తమో...మందలి రజోగుణమువలన నల్లవరి కంది నువ్వు మినుము అనుము ఆముదములు లోనగు పైరులును, జాజికాయలు లవంగములు ఏలకకాయలు పసుపు లోనగునవి పండెడునేలలును పుట్టెను.

౩. తమో...మందలి సత్త్వగుణమువలన తెల్లవరి సన్నవరి నివ్వరివరి పెసలు గోధుమలు యవలు చామలు చెఱుకు మేఁకగుకాయలు పండ్లు ఆకులు పూవులు మొదలైనవి పండెడు నేలలు పుట్టెను

ఇవ్విధముగ సమష్టిరూపమైన మూలావిద్య వ్యష్టిరూపమైన తూలావిద్య అనెడు రెండురూపములుగల మలినసత్త్వప్రధానయగు మూలప్రకృతి తనత్రిగుణములచేత తొలుత త్రిశక్తులుగఁ దోఁచి వెనుక ఆత్రిగుణపరస్పరసమ్మేళనమువలన నవవిధములై పిదప ఆనవవిధాన్యోన్యసమ్మేళనముచేత సప్తవింశతివిధములై తెల్లనివస్త్రమున చిత్రములు కల్పితమైనట్లు శుద్ధపరబ్రహ్మమందు పైని జెప్పఁబడిన ఇరువదియేడుభేదములుగలసృష్టిగళయట్లుగఁ గనఁబఱచెను మఱి వేదపురుషుఁడు ఈయిరువదియేడుభేదములుగల సృష్టికి కారణమైన ప్రకృతిమాయయగు గాయత్రి మూఁడుపాదములను "భూర్భువస్సువ" యనువ్యాహృతిత్రయముతోడ నిరువదియేడుఅక్షరములను గలదని చెప్పి దాని ద్విజాతులగు బ్రహ్మక్షత్రియవైశ్యులకు తారతమ్యముగ నుపాస్యముగ నిర్ణయించెను. మఱి యాగాయత్రికి మాఱురూపమగు యజ్ఞోపవీతము మూఁడుసూత్రములు గలది. అందొక్కొకసూత్రమునకు మూఁడేసి అంతరసూత్రములు గలవు. ఆయాంతరసూత్రములయం దొక్కొక్కటికి మూఁడుమూఁడుపోగులు గలవు గాన మూఁడుపెద్దపోగులుగల ఆయజ్ఞోపవీతము ఇరువదియేడుపోగులు గలదయ్యెను. ఆతంతువులే యిరువదియేడుభేదములు గలజగత్తు, ఆజగద్రూపమగు యజ్ఞోపవీతమునే గాయత్రి యని ద్విజాతులు ధరించి పరబ్రహ్మము నుద్దేశించి సర్వకర్మములఁ జేయవలయుననియు దాని ధరించువాఁడు కర్మకాండ మనుష్ఠింపవలయు ననియు, వెనుక సద్గురుకరుణచేత విజ్ఞానము కలిగి గాయత్రీయజ్ఞోపవీతప్రపంచవిచారణచేసి యజ్ఞోపవీతమందలి మూఁడుతంతువులకు కూటస్థానమైన ముడియే బ్రహ్మముడియనియు అదియే అమలసత్త్వప్రధానయగు గుణసామ్యావస్థయనియు తెలిసి ఆయజ్ఞోపవీతమును పరిత్యజించువాఁడే సన్న్యాసియనియు అతఁడే బ్రహ్మకాండమనుష్ఠించువాఁడనియు తెలిపెను. ఈరీతిగను తటుకున తెలిసినవాఁడే సర్వకర్మవిముక్తుఁడు జీవన్ముక్తుఁడు. పైని జెప్పిన ఈయిరువదియేడుభాగములును సారెసారెకు నొకటితో నొకటి కలిసి యనేకవిధసృష్టులు గలుగును. గుణత్రయవివేకశాస్త్రమునుబట్టి నాకు గోచరించినవఱకు వ్రాసితిని. బుద్ధిమంతులగువారు మీఁదుగ నూహించునది. ఇందులకు స్మృతిశ్రుతులు "శ్లో॥ దైవీహ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా। మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే" తా॥ ఈమాయ త్రిగుణస్వరూపిణి; నాసన్నిధానబలమున సకలప్రాణులను నాయందు, తన త్రిగుణములవలన కల్పించి వానియందు క్రీడించుచుండును.

అస్మచ్ఛబ్దవాచ్యుఁడనైన నన్నెఱిఁగి పొందువారు ఈమాయ నతిక్రమింతు రనుట. ఇట్లని గీతావచనము.

"శ్రు. అజా మేకం లోహితశుక్లకృష్ణాం బహ్వీం ప్రజాం జనయంతీగ్ం సరూపామ్, అజో హ్యేకో జుషమాణోఽనుశేతే జహాత్యేనాం భుక్తభోగా మజోఽన్యః" తా. మూలప్రకృతి సూర్యకాంతి సూర్యునకు వేఱుగానియట్లు పరబ్రహ్మము నెడఁబాయక అస్వరూపమాత్రముగ నుండెడుశుద్ధసత్త్వప్రధానము, ఆసూర్యకాంతి సూర్యుని వీడకయే వెలుపల వ్యాపించి చీఁకటిని తనయందు నణఁచుకొని, తనయందా సూర్యుఁడు కలదిగ ప్రకాశించుతీరున, ఆపరబ్రహ్మమును విడువకయే బహిర్వ్యాపకముకలదై సృష్టిస్థితిలయాదులు లేని పరబ్రహ్మమును తా నావరించి, అది తనయందుఁ గలయట్లుగను, దానికి సృష్టిస్థితిలయాదులు కలయట్లుగను కనఁబడఁజేయు మలినసత్త్వప్రధానము అనెడు రెండురూపములుగలది. అందొకటియగు మలినసత్త్వప్రధానము పుట్టుకలేనిది. ఎఱుపు తెలుపు నలుపు వన్నెలు గలది. నానావిధరూపములతోఁ గూడిన బహువిధములైన ప్రాణులను పుట్టించునది. సజాతీయవిజాతీయ స్వగతభేదశూన్యమై ఉత్పత్తిలేనిదగు పరబ్రహ్మము ఆప్రకృతియందు ప్రవేశించి మగ్నమైయుండును. అనుభవించి విడిచిన భోగములుగల యీప్రకృతిసంబంధము లేనివాఁడు ఉత్పత్తిశూన్యుఁడయి ప్రకృతికి విలక్షణుఁడయిన పరబ్రహ్మస్వరూపుఁడై యుండుననుట.

"శ్రు. న శిఖాం వపనం కృత్వా బహిస్సూత్రం త్యజేద్బుధః। బ్రహ్మసూత్ర మిదం జ్ఞేయం సూత్రం నామ పరంపదం। తత్సూత్రం ధారయేద్యోగీ సవిప్రో వేదపారగః" తా. పండితుఁడయినవాఁడు శిఖాధారణము, ముండనము, లోనగుకర్మములను ముఖ్యములని యెన్నక, వెలుపలియజ్ఞోపవీతధారణము వ్యర్థమని బ్రహ్మసూత్రధారణమే ముఖ్యమని, బ్రహ్మసూత్రమనఁగా త్రిగుణవిభాగములవలననైన యిరువదియేడు భేదములుగల ద్వివిధప్రకృతికంటె పరమైన పరమపదమని ఆసూత్రమునుధరించిన వాఁడే బ్రాహ్మణుఁడు, యోగి, వేదముల తుదముట్ట నెఱిఁగినవాఁడని యెఱుఁగవలయుననుట. ఇట్లని బ్రహ్మోపనిషత్తునందుఁ గలదు.

మఱియు రజోగుణమువలనఁ గలిగిన మనుష్యులులోనగు సకలజంగమప్రాణులలో రజస్సత్త్వసత్త్వగుణమువలనఁ బుట్టిన బ్రహ్మవాదులైన బ్రాహ్మణులకును, రజస్సత్త్వరజోగుణమువలన జనించిన క్షత్రియవైశ్యులకును, రజస్సత్త్వతమోగుణమువలన జన్మించిన శూద్రులకును, తక్కినజాతులలోఁ గలిగిన జనులకును ఆహారములును, దానములును, యజ్ఞములును తపస్సులును పూజలును శ్రద్ధలును సాత్త్వికరాజసతామసభేదములచేత మూఁడు

విధములుగ నుండును. అందు ఆయుర్వృద్ధిని శరీరశక్తిని ఆరోగ్యమును సుఖమును సప్త ధాతువృద్ధిని జ్ఞానమును గలిగించు తేనె పాలు నెయ్యి మినుములు గోధుమలు పెసలు లోనగునవి సాత్త్వికాహారము అనఁబడును. కామక్రోధాదులను ప్రబలఁజేయు కారము పులుసు ఉప్పు వేఁడిమి చేఁదు వగరు చుఱుకుగల పదార్థములు రాజసాహారములు నాఁబడును. జాములుగడచినది రసహీనమయినది దుర్గంధముగలది చలిది ఎంగిలి అపవిత్రత గల పదార్థములు తామసాహారము అగును. దానములు దేశకాలపాత్రముల నెఱిఁగి యిచ్చుట సాత్త్వికదాన మగును. ప్రతిప్రయోజనమును లాభమును గోరి డంభముకొఱకు నిచ్చుట రాజసదాన మగును. దేశకాలపాత్రములఁ బరిశీలింపక యిచ్చుట తామసదాన మగును. శాస్త్రోక్తక్రమముగఁ జేయు యజ్ఞములును, పూజలును, తపస్సులును సాత్త్వికము లనఁబడును. డంభమునిమిత్తము మెప్పుదలలకు చేయు యజ్ఞములును, పూజలును తపస్సులును రాజసము లనఁబడును. అశాస్త్రీయముగను, భయంకరముగను జేయు యజ్ఞములును, పూజలును, తపస్సులును తామసము అగును. శ్రద్ధావివరణము॥ ధర్మములును, కర్మములును నియతము లని ఫలాపేక్ష లేక యీశ్వరార్పణబుద్ధిచేతఁ జేయుట సాత్త్వికశ్రద్ధ. కాయక్లేశభయమున భక్తిలేక కర్మములను, ధర్మములను జేయుట రాజసశ్రద్ధ. మోహమువలన భక్తిలేక అశాస్త్రీయముగ కర్మములను, ధర్మములను జేయుట తామసశ్రద్ధ యనఁబడును. ఇట్లు గీతాప్రమాణము. ఇవి యన్నియు చక్కఁగ నెఱిఁగి సకలజనులగుణములను నిర్ణయించి బుద్ధిమంతులు సర్వవిషయములయందును మెలఁకువ గలిగి మెలఁగుచు ముక్తులు గావలయును.

అవతారిక. ఈశాస్త్రము నిర్విఘ్నముగ నెఱవేఱుటకొఱకు వల్లభాగణపతి స్తుతింపఁబడుచున్నాఁడు:——

శా. శ్రీమద్వామనిజోరువిష్టరమునం జెన్నొందు శ్రీవల్లభా
రామారత్నముఁ గౌఁగిలించుకొని తారారాజప్రత్యగ్రరే
ఖాముక్తావళి మౌళిఁ దాల్చి విలసత్కాశ్మీరశోణాంగుఁడై
ప్రేమ న్బ్రోచు గణేశు నెంతు నతిగంభీరోక్తి నిష్పత్తికిన్. 3

టీ. శ్రీమ...రమునన్, శ్రీమత్ = శోభాయుక్తమైన, వామ = ఎడమదైన, నిజ = తనదైన, ఊరు = తొడయనెడు, విష్టరమునన్ = పీఠమందు, చెన్నొందు...రత్నమున్ - చెన్నొందు = సొగసైన, శ్రీ = లక్ష్మీస్వరూపిణియైన, వల్లభా = వల్లభయనుపేరుగల, రామారత్నమున్ = కాంతామణిని, కౌఁగిలించుకొని = ఆలింగనముచేసికొని, తారా...వళిన్ - తారారాజ = చంద్రునియొక్క, ప్రత్యగ్ర = క్రొత్తదైన, రేఖా = కళయనెడు,

ముక్తా=ముత్యములయొక్క, ఆవలిన్=వరుసను, మౌలిన్=కిరీటమందు, తాల్చి=ధరించి, వి...గుఁడై-విలసత్ = మిక్కిలి ప్రకాశించుచున్న, కాశ్మీర = కుంకుమపువ్వువలె, ని॥ బాహ్లీకం పీతనం కాంతం పిశునం రుధిరాహ్వయం, కాశ్మీరంచ గుడం రక్తం తథా కాలేయకంచ తత్॥ అని ప్రతాపనిఘంటువు. శోణ=ఎఱ్ఱనైన, అంగుఁడై=శరీరముగలవాఁడై, పొల్పుగనేశుఁ-పొల్పు = వెలుఁగుచున్న, గణ=ప్రథమవీరవరసురరుద్రపితృఋషి దైత్యరాక్షసభూత పిశాచవిశ్వేదేవవసుతుషిత భాస్వరానిల మహారాజికసాధ్యాదిసకలగణములకును, ఈశున్ = ప్రభువైనవల్లభాగణపతిని, ఇష్టాప్తికిన్ = ఇష్టసిద్ధికొఱకు, అతిగంభీరోక్తిన్-అతి=మిక్కిలి, గంభీర=తెలియనలవిగాని, ఉక్తిన్=పరావాక్కుచేత, పేర్మిన్=ప్రీతితోడ, ఎంతున్=కొనియాడుచున్నాఁడను.

తా. సొగసగు తనయొడమతొడయనియెడు పీఠముమీఁద కూర్చుండియుండెడి వల్లభయను పేరుగల తనప్రియవల్లభను కౌఁగిలించికొని బాలచంద్రుని కిరీటమున ధరించి కుంకుమపువ్వువలె నెఱ్ఱని యొడలుగలిగి ప్రకాశించుచుండెడి వల్లభాగణపతిని నామనోరథము నెఱవేఱుటకొఱకు మిక్కిలి మక్కువతో పొగడుచున్నానని తాత్పర్యము.

మఱియు లోకమున గణపతి బ్రహ్మచారి యని వాడుక యుండఁగా నీగ్రంథమున గృహస్థునిగ స్తుతించుట యెట్లనిన దుర్వాసుఁడు శ్రీపురమునువర్ణించినపుడు చెప్పిన ఆర్యాద్విశతియందు "శ్లో. వందే గజేంద్రవదనం వామాంకారూఢవల్లభాశ్లిష్టమ్, కుంకుమపరాగశోణం కువలయినీజారకోరకాపీడమ్" అని॥ మఱియు దశభుజమహాగణపతి మంత్రధ్యానమున "శ్లో. హస్తీంద్రాననమిందుచూడమరుణచ్ఛాయం త్రినేత్రం రసాదాశ్లిష్టం ప్రియయా సపద్మకరయాస్వాంకస్థయా సంతతం। బీజాపూరగదాధనుర్విశిఖయుక్చక్రాబ్జపాశోత్పల। వ్రీహ్యగ్రస్వవిషాణరత్నకలశాన్ హస్తైర్వహంతం భజే" అనియు చెప్పఁబడియున్నది. మఱియు శివునకు నిరువదియైదులీలలును శక్తికనంతరూపములును, విష్ణువునకు దశావతారములును గలయట్లు గణపతికిని ఇరువదియొక్కలీలలు గలవని గణపతిపురాణ కల్పములు ప్రసిద్ధముగ ఘోషించుచున్నవి. గ్రంథవిస్తరభీతిచేత నవి యిచ్చట వ్రాయఁబడవు.

అవ. శ్రీమదద్వైతమతభాష్యకారులును, పరమహంసపరివ్రాజకాచార్యులును అగు శ్రీశంకరాచార్యులు వినుతింపఁబడుచున్నారు.

మ. అజసంస్తోత్ర మెఱింగి పంప హరి మున్ వ్యాసాఖ్యసూత్రాదులన్
సృజియింపం గొని వాని దుర్మతములన్ శిక్షించి శ్రీభాష్యముల్

త్రిజగత్పూజ్యముగా నొనర్చి గురుఁడై దీపించి కైలాసశై
లజలింగం బలరిల్ల నిల్పు శివలీలాశంకరుం గొల్చెదన్.. ౮

టీ. ముక్ = పూర్వము, అజసంస్తోత్రముక్, అజ = బ్రహ్మయొక్క, సంస్తోత్రముక్ = పొగడికను, ఎఱింగి = తెలిసికొని, అనఁగా వేదబాహ్యులై దేహమే పరమాత్మ, మరణమే మోక్షము, అనెడు చార్వాకులును, ఇంద్రియములే పరమాత్మ, మరణమే మోక్షము, అను చార్వాకైకదేశికులును, ప్రాణమే పరమాత్మ, దానినాశమే మోక్షము అనెడిసౌగతులును, దేహేంద్రియప్రాణముల సంకోచవికాసావస్థలు గలవాఁడే ఆత్మ, నిత్యమును పరమాణురూపమునైన ఆలోకాకాశమధ్యమందు క్రమక్రమముగ సంచరించుటే మోక్షము, అనెడిజైనులును, బుద్ధియే బ్రహ్మము, సుఖదుఃఖాదిద్వంద్వముల నంటని శుద్ధబుద్ధి గల్గియుండుటే మోక్షము, అనెడు బౌద్ధులును, శూన్యమే ఆత్మ, దానియందుఁ గలియుటే మోక్షము, అనెడి అర్హతులును, నీటియందు బుగ్గలు కనఁబడినట్లు శూన్యమందు బహురూపములు తోఁచునదే యాత్మ, ఆరూపములు వీడి శూన్యమందుఁ గలియుటే మోక్షము అనెడిక్షపణులును, ఆనందమే ఆత్మ ఆకాశగమనదూరదృష్టి దూరశ్రవణాదిసిద్ధులు గలిగియుండుటే మోక్షము, అనెడు రుద్రకాలభైరవయామళులును, ఆనందమే ఆత్మ, ఆనందోద్దీపకములైన మధుమాంససంగమాదులవలనఁ గలుగు ఆనందప్రాప్తియే మోక్షము అనెడు శాక్తేయులును, నాడీమధ్యమున అణు పరమాణుస్వరూపమున వెలుఁగుచు ఇరువదియాఱవ తత్త్వరూపుఁడై పరము వ్యూహము విభవము అర్చ అంతర్యామి అనురూపముల మెలఁగు వాసుదేవుఁడే ఆత్మ, వానియందు స్వరూపహాని లేక కైంకర్యపరుఁడై యుండుటే మోక్షము, అనెడి పాంచరాత్రులును, ఇందు పర మనఁగ పరమపదము వ్యూహము లనఁగా వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్న అనిరుద్ధవ్యూహములు. అందు వాసుదేవవ్యూహము పరమపదము, సంకర్షణవ్యూహము పాతాళము, ప్రద్యుమ్నానిరుద్ధవ్యూహములు క్షీరాబ్ధి మేరువులు, విభవమనఁగా రామకృష్ణాద్యవతారములు. అర్చ యనఁగా వేంకటాచలము, శ్రీరంగము, కాంచి, మేలుకోట లోనగు స్థలవిగ్రహారాధనములు, అంతర్యామి యనన జీవుఁడే దేహముఁ గల వాసుదేవుఁడు అనియెఱుఁగవలయును. దేహపుత్రమిత్రకళత్రపశుభృత్యాదులే ఆత్మ ఇహపరములలో వారికి ఆధివ్యాధులు లేక వారితోఁ గూడి సుఖముగ నుండుటే మోక్షము, అనెడిలౌకికులును, స్వతస్సిద్ధముగ ప్రమాణసమేతుఁడే ఆత్మ, స్వర్గవైకుంఠకైలాససత్యలోకాదులసాలోక్యాదిపదప్రాప్తియే మోక్షము, అనెడు పూర్వమీమాంసకులైన భాట్టప్రాభాకరులును, మింటివలె మితము లేక శిలవలె జడరూపుఁడై మనోబుద్ధిధర్మములు గలవాఁడే ఆత్మ, శరీరేంద్రియాది

కములనెడు నిరువదియొకవిధములైన దుఃఖములు లేక ఱాతివలె నుండుటే మోక్షము, అనెడు నైయాయికవైశేషికులును, మింటివలె దేని నంటక జ్ఞానస్వరూపమున వెలుఁగువాఁడే ఆత్మ, ప్రకృతిపురుషవివేకముచేత అజ్ఞాననాశమగుటే మోక్షము, అనెడు సాంఖ్యులును, వస్త్వంతరసంబంధము లేక విజ్ఞానస్వరూపమున మెఱయువాఁడే ఆత్మ, యోగాభ్యాసబలమున మనోలయముగలిగి అజ్ఞానము నశించుటే మోక్షము అనెడు పాతంజలులును, నిత్యవ్యాపకరూపుఁడే ఆత్మ, ఆయాత్మ సర్వజ్ఞుఁడు సర్వపరిపూర్ణుఁడు అని తాను కించిద్జ్ఞుఁడు అని తలఁచి ఆయాత్మయందు జ్ఞప్తిగలిగి యుండుటే మోక్షము అనెడు పాశుపతులును, కర్తృత్వాద్యభిమానరూపసంసారమునకు వేఱైనవాఁడే యాత్మ, దానినివిడిచి భగవంతునియందు జ్ఞప్తి గలిగి యుండుటయే మోక్షము, అనుకాపాలికమహావ్రతులును, నిత్యవ్యాపకజ్ఞానక్రియాస్వరూపపరమశివుఁడే ఆత్మ, షడధ్వాతీతపరశివసమానత్వమే మోక్షము, అనెడు మాంత్రికశైవవీరశైవులును, గణపతియే కర్త, సూర్యుఁడే పరుఁడు ఆగణపతి సూర్యసాలోక్యాదిపదములఁ బొందుటే మోక్షము, అను గాణాపత్యసౌరులును, సర్వోత్తముఁడు సమానరహితుఁడు అయిన సర్వేశ్వరుఁడే పరమాత్మ, వానినుపాసించి యిహమందలిరూపములవంటి రూపులతోడనే వానిలోకమందు వసించుటే మోక్షము, అను ద్వైతులును, ప్రాణుల పుట్టుట, గిట్టుటలు స్వభావమే కాని పుట్టింప గిట్టింప కర్త యొకఁడు లేఁడు. అను స్వభావవాదులును, మఱియు తక్కిన పరిణామవాదులులోనగువారును క్రమక్రమంబుగ భూమినాక్రమించి వర్ణాశ్రమధర్మములను యాగయోగతపోనిష్ఠాదులను నశింపఁజేయఁగా పాపంబు పెరుఁగ ఆబరువు నోరువఁజాలక భూదేవి కటకటఁబడి బ్రహ్మపాలికేగి వాపోవ ఆపరమేష్ఠి ధరణి నూరడించి పరమేశ్వరుఁడగు తనసన్నిధికి వచ్చి కొనియాడఁగా తెలిసికొని యనిభావము. హరిక=శ్రీమహావిష్ణువును, పంపక=అంపింపఁగా, వ్యాసాఖ్యక=(విష్ణువు ద్వాపరయుగమందు)వ్యాసనామముచేత, సూత్రాదులక=, సూత్ర=బ్రహ్మసూత్రమే, ఆదులక=మొదలగువానిని, సృజింపఁగ=కల్పింపఁగా, అనఁగా చతుర్ముఖుని చతుర్ముఖంబులయందుఁబుట్టిన ఋగ్యజుస్సామాథర్వణంబులనెడి చతుర్వేదంబులలో ఋగ్వేదము ఇరువదియొక్క శాఖలును, యజుర్వేదము నూటతొమ్మిదిశాఖలును, సామవేదము సహస్రశాఖలును, అథర్వణవేదంబు ఏఁబదిశాఖలును గలవయ్యును ఆవేదశాఖలు యుగభేదము చేతను, రాజపరిపాలనావిశేషముచేతను, నాస్తికమతసాంకర్యముచేతను బ్రాహ్మణాదివర్ణస్థులకు చిత్తస్థిరత్వము తప్పుటచేతను క్రమక్రమముగ కొన్ని క్షీణించెను. క్షీణించిన శాఖలయందు దేమివిశేషములు గలవో యనెడుసందియములు జనులుపొందకుండ నశించినవేదశాఖార్థముల శ్రీవేదవ్యాసుండు సంగ్రహించి మూఁడులక్షల గ్రంథపరిమితి గలిగి శివునిమహిమను దెలిపెడుశివమా

ద్బ్రహ్మాండేయభవిష్యత్ లింగవరాహస్కాందవామనకూర్మమత్స్యబ్రహ్మాండము లనెడి పది పురాణములను, ఏబదివేల గ్రంథంబు గలిగి విష్ణుదేవుని మహత్త్వంబు ప్రతిపాదించునట్టి విష్ణు భాగవత నారద గారుడము లనెడు నాలుగుపురాణములను, ఇరువదియైదువేల గ్రంథసంఖ్య గలిగి బ్రహ్మదేవుని మహిమలఁ జెప్పెడు బ్రాహ్మపాద్మము లనెడు రెండుపురాణములను, పండ్రెండు వేలయేనూఱు గ్రంథసంఖ్యగలిగి సూర్యునిమహిమను దెలిపెడి బ్రహ్మకైవర్త పురాణమును, పండ్రెండువేల యేనూఱు గ్రంథపరిమితి గలిగి అగ్నిదేవుని ప్రతిపాదించునట్టి ఆగ్నేయపురాణమునుగా పదునెనిమిదిపురాణములనిర్మించి పెనుకపంచమవేదం బనంబరఁ గిన శ్రీమహాభారత మనెడి యితిహాసమును గల్పించి ఉపపురాణములని ప్రసిద్ధిఁ జెంది వైదిక కర్మాంగములఁ బ్రతిపాదించుచు పురాణనామములు గల మునులచేత నిర్మింపఁబడిన సనత్కు-మార, నారసింహ, నంది, శివధర్మ, దుర్వాసో, నారద, కపిల, మను, ఉశనో, బ్రహ్మాండ, వరుణ, కాళి, వసిష్ఠ, లింగ, సాంబ, సౌర, పరాశర, మరీచి, భార్గవ, పురాణములనుసంస్క-రించి, నాలుగువర్ణములయు, నాల్గాశ్రమములయు, పదునెనిమిదిజాతులయు ఆచారములను, మహాపాపములకు ప్రాయశ్చిత్తములను వ్యవహారభేదములను దెలుపుచు స్మృతు లని ప్రసిద్ధికెక్కి స్మృతులనామములు గలవారచేత రచియింపఁబడిన మను, అత్రి, హారిత, విష్ణు, యాజ్ఞవల్క్య, ఉశన, అంగిరస, యమ, ఆపస్తంబ, సంవర్త, కాత్యాయన, బృహస్పతి, పరాశర, శంఖ లిఖిత, దక్ష, గౌతమ, శాతాతప, వసిష్ఠస్మృతుల శోధించి, తనపేరఁ బ్రసిద్ధికెక్కిన వ్యాసస్మృతిని నిర్మించి వేదాంగము లని ప్రసిద్ధిఁ జెంది బ్రహ్మనిర్మితంబు లగుచు ఉదాత్తానుదాత్తస్వరితదీర్ఘస్వరితప్రచయము లనెడు స్వరములఁ దెలియఁబఱచు శిక్షను, సుశబ్దాపశబ్దపరిజ్ఞానమును దెలుపు వ్యాకరణమును, గణయతిప్రాసాక్షరలక్షణములఁ దెలుపుచు ఇరువదియాఱు భేదములఁ జెప్పు ఛందమును వర్ణాగమవర్ణలోపవ్యత్యయాదుల నిశ్చయించునదియు వేదసిద్ధాంతవాక్యములపై మాఱు మాట పుట్టింపనిదియు నగు నిరుక్తమును, వేదోక్తవర్ణాశ్రమవిహితకర్మాంగములకు కాలనిర్ణయము చేయుచు గ్రహనక్షత్రాదుల యుదయాస్తమయాదులఁ బ్రతిపాదించు జ్యోతిషమును, ఆపస్తంబీయ, ఆశ్వలాయనీయ, కాత్యాయనీయ, బోధాయనీయము అను పేళ్ళుగలిగి శ్రౌతస్మార్తక్రియలయందు సమర్థమగు కల్పమును విచారించి, మీమాంసాన్యాయ[illegible] స్మృతులనెడి ఉపాంగంబుల శోధించి వ్యాధి నిదాన [illegible] మంత్ర [illegible] ధములవలని చికిత్సల చేత ఆయురారోగ్యాదులఁ గాపాడెడి ఆయుర్వేదమును, యజ్ఞ [illegible] యందు దక్షిణను ఆజ్య, చరు, [illegible] ఉపహారము [illegible] చుటకును ధర్మాదిచతుర్వర్గమునకును సాధనమై యుండెడి అర్థవేదమును, శత్రుజయ కరంబులగు శస్త్రప్రయోగమంత్రాదులఁ దెలుపు ధనుర్వేదమును, [illegible]

సరిగమపధని యను సప్తస్వరములను గీతాదులను దెలుపు గాంధర్వవేదము, ఆయుష్య వేదములు బోధించెను. వెనుక చతుర్దశవిద్యలయందు శ్రేష్ఠతరంబై మీమాంసాశాస్త్రము ఇరువదియధ్యాయములు గలిగి పూర్వమీమాంస, ఉత్తరమీమాంస అనెడి రెండుభాగములుగలదగును. అందు పూర్వమీమాంసాశాస్త్రము కర్మకాండంబును ప్రతిపాదించుచు ద్వాదశాధ్యాయంబులుగలిగి వ్యాసశిష్యుండగు జైమినిచేత రచియింపఁబడినసూత్రములు గలదై కర్మకర్తృప్రతిపాదకమై లోకవేదాధికరణాదిసహస్రాధికరణంబులుగలిగి వెలుఁగును. మఱి యాజైమినిసూత్రములకు శాబర మనెడి భాష్యంబును భట్టాచార్యునిచేత విరచింపఁబడిన వార్త్తికరూపంబగు భాట్టమనెడి యొక మతాంతరవిషయకశాస్త్రంబును గలదు మఱియాశాబరభాష్యమునకు భట్టాచార్యునిశిష్యుఁడగు ప్రభాకరునిచేత వ్యాఖ్యానరూపముగ రచియింపఁబడిన ప్రాభాకరీయమను మతాంతరగ్రంథమొక్కటిగలదు. మఱి యుత్తరమీమాంస దేవకాండము బ్రహ్మకాండము అను రెండుభాగములు గలిగి వ్యాసరచితసూత్రములుగలదై ప్రకాశిల్లును. అందు దేవకాండము నాలుగధ్యాయములుగలిగి మంత్రవాదంబైన దేవతాధికరణములఁ బ్రతిపాదించును. బ్రహ్మకాండము నాలుగధ్యాయములుగలదై పరబ్రహ్మమును బ్రతిపాదించుచుండును. ఈబ్రహ్మకాండమునకు శ్రీశంకరభగవత్పాదాచార్యులచేత అధ్యాసప్రకరణము. మున్నుగాఁగల వేదాంతభాష్యము చేయఁబడెను వెనుక నీశంకరభగవత్పాదాచార్యశిష్యులగు వివరణాచార్యులచేత నీభాష్యమునకు టీకారూపముగ వివరణము చేయఁబడి పిదప మఱి వాచస్పతిమిశ్రులు మొదలగు కొందఱు శిష్యులచేత వృత్తిపంచపాదిక భామతి కల్పతరువు అధికరణరత్నమాల రామానందీయము బ్రహ్మవిద్యాభరణము ఆనందగిరీయము మొదలగు ననేకవ్యాఖ్యానములును శాస్త్రిక మనుటీకయును చేయఁబడి యున్నదనుట వానిన్ = అనూతార్థములను, కొని = గ్రహించి, దుర్మతములన్ = పైనిజెప్పినచార్వాకాదిదుష్టమతములను, శిక్షించి = ఖండించి, శ్రీభాష్యములు, శ్రీ = మోక్షసంపదనిచ్చునట్టి, భాష్యములు = సూత్రభాష్యోపనిషద్భాష్యగీతాభాష్యములను, త్రిజగత్పూజ్యముగాన్, త్రిజగత్ = భూలోకభువర్లోకసువర్లోకములనెడి మూల్లోకములయందు, పూజ్యముగాన్ = సన్మానింపఁదగినట్లుగా, ఒనర్చి = [illegible]ంచి, గురుఁడై = త్రిలోకైకాచార్యుఁడై, దీపించి = ప్రకాశించి, కైల...గఁబున్, కైలాసమను వెండికొండయందుఁబుట్టిన, లింగంబున్ = చంద్రమౌళి యను పేరుగల స్ఫటికలింగమును, [illegible] ప్రసిద్ధమైన చిదంబరక్షేత్రమందు [illegible] శరీరముతో కైలాసమునకేగి చంద్రమౌళి యను స్ఫటికలింగ[illegible]దెచ్చి ప్రతిష్ఠించినట్టి [illegible]శివపురియొక్క, లీలా = ఇరువదియైదులీలలుగల[illegible] [illegible]శంకరాచార్యులు, కాయైవన్ = కాయికవాచికమానసి[illegible]చేత సేవింప[illegible]



తా. పూర్వము వేదబాహ్యులైన చార్వాక, చార్వాకైకదేశ, సౌగతాదిదు
ర్మతవాదులు బలిష్ఠులై భూమియం దంతటను వ్యాపించి వర్ణాశ్రమాదివేదోక్తధర్మం
బులను యాగయోగతపోనిష్ఠాదులను జెఱుప పుణ్యంబు సడలి పాపంబు ప్రబలిన అభా
రంబోరువఁజాలక ధరణీదేవి పరితపించి పరమేష్ఠిపాలికేగి వాపోవ పరమేష్ఠి ధరణీదేవి
నూరడించి హరునిచేరఁబోవ నరిగి బహుప్రకారంబులఁ బొగడఁగా అతండు శ్రీతుండై
శ్రీహరిఁగని నీవు భూలోకంబున వ్యాసుండను పేరఁబుట్టి నష్టించిన చతుర్వేదశాఖార్థం
బులుగల అష్టాదశపురాణములను వ్యాసస్మృతిని మహాభారతంబును బ్రహ్మసూత్రంబు
లను నిర్మింపుము అని పంప ఆనారాయణుండు ద్వాపరయుగాంతంబున బాదరాయ
ణుండై జనించి హరుఁడు చెప్పినట్లు అష్టాదశపురాణాదుల నిర్మించెను. అంత త్రిలోక
శంకరుఁడగు శంకరుండు భూలోకంబున శంకరాచార్యుండై విష్ణువహ్ని వరుణ వాయుస్వ
రూపులగు పద్మపాదహస్తామలకతోటకవార్తికులనెడు నలువురుశిష్యులతోడ నావిర్భవిం
చి వ్యాసకృతసూత్రపురాణాదులను దా ననుసరించి దుష్టులగు దుర్మతవాదులనష్టపఱచి
దిగ్విజయంబు చేసి శిష్టుల సంరక్షించి శైవ. వైష్ణవ, కాపాలిక, శాక్త, సౌర, గాణా
పత్యము లనెడి షణ్మతములను॥ శ్లో॥ అలింగక మచక్రాంక మజటాస్థ్యనురామిషం।
అరక్తక మనుచ్ఛిష్టం వదస్మార్త రమస్థితం॥ అను స్మృత్యర్థప్రకారముగ భూలోకం
బున ప్రతిష్ఠించి పరమమోక్షప్రదంబులగు ఉపనిషద్భాష్యగీతాభాష్యసూత్రభాష్యము
లనెడు ప్రస్థానత్రయమును ఉత్తమాధికారులనిమిత్తమునిర్మించి ఆప్రస్థానత్రయముఁ
జూడ సమర్థతలేనివారికి అద్వైతమకరందము ఆత్మబోధప్రకాశిక దృగ్దృశ్యవివేకము
మొదలగు వేదాంతగ్రంథములఁ గల్పించి శరీరముతోడ కైలాసంబున కేగి చంద్రమౌళి
యనుపేరనొప్పెడు స్ఫటికలింగంబుఁ దెచ్చి తిల్లయనెడి పేరుగల చిదంబరంబున ప్రతి
ష్ఠించిన పరమశివుని యిరువదియైదు లీలలకంటె వేఱయిన లీలాస్వరూపుఁడగు శ్రీశంకర
గోవిందభగవత్పాదుల నారాధించుచున్నా. నని తాత్పర్యము.

శివునిపంచవింశతిలీలలవివరణము:— చంద్రుని ధరించుట, ఉమాదేవితోఁ గూడి
[illegible]నుట, ధర్మదేవతారూపమగు వృషభము నెక్కుట, నృత్యమాడుట, పార్వతీదేవిని
పెండ్లియాడుట. భిక్షమెత్తుట, మన్మథునిఁ దహించుట, యమునిగెల్చుట, త్రిపురములఁ
గాల్చుట, జలంధరాసురునిఁ జంపుట, గజాసురునిఁ జక్కాడుట, వీరభద్రావతారమెత్తు
ట, విష్ణువునర్థశరీరంబుననిల్పుట, పార్వతీదేవి కర్థశరీరం బొసఁగుట, కిరాతరూపుఁ
డగుట, కంకాళరూపియగుట, చండీశ్వరు ననుగ్రహించుట, విషముభక్షించుట, విష్ణు
వునకు చక్రంబిచ్చుట, విఘ్నము హరించుట, ఉమాకుమారులతోఁ గూడి యుండుట,
ఏకపాదరుద్రుఁడగుట, సుఖాసనంబుననుండుట, దక్షిణామూర్తి రూపంబుధరించుట,
లింగోద్భవుఁడగుట యనునవి.

అవ. శిథిలాద్వైతమతపునరుద్ధారకులును, స్వకులాచార్యులును అగు అద్వైతమత ప్రతిష్ఠాపన లక్ష్మీనారాయణదీక్షితులు కొనియాడఁబడుచున్నారు.

శా. శ్రీనాథార్చితదక్షిణాననకలం బై చెన్నొంది యద్వైతల
క్ష్మీనారాయణదీక్షితుం డనఁ గులశ్రేయంబు సాంకర్యతన్
హీనంబై నశియింపఁ బావనముగా హేయంబు ఖండించి ని
త్యానందుం డగునస్మదీయగురుపాదద్వంద్వముం గొల్చెదన్. ౫౦

టీ. శ్రీనా...కలన్, శ్రీనాథ=విష్ణువుచేత, అర్చిత = పూజింపఁబడిన, దక్షిణాసన=దక్షిణామూర్తియొక్క, లేక షడక్షరరూపమైన పరమశివునితత్పురుష, అఘోర, సద్యోజాత, వామదేవ, ఈశానము ప్రముఖములు తూర్పు, దక్షిణము, పడమర, ఉత్తరము మీఁదు క్రిందు ప్రక్కలుగఁ దిరిగి యుండును. అందు దక్షిణముఖమైన అఘోర ముఖముయొక్క, కలన్ = పదియాఱంశములలో మేలైన యంశముచేత, అద్వైతలక్ష్మీనారాయణదీక్షితుండు=పూర్వము శంకరాచార్యులచేత ప్రతిష్ఠింపఁబడిన అద్వైతమత సిద్ధాంతము దుర్మతప్రవిష్టులవలన క్రమక్రమముగ క్షీణించుటచేత దానిని పునరుద్ధారము చేయుటఁబట్టి అద్వైతమత ప్రతిష్ఠాపనమను బిరుదుగల నందిరాజు లక్ష్మీనారాయణ విద్యాజి, అనన్=అనునట్లు, చెన్నొంది=అవతరించి, కులశ్రేయంబు, కుల=బ్రాహ్మణుల లో భాట్టీయప్రాభాకరీయులను పేళ్ళుగల వైదికనియోగులయందు నియోగకులముయొక్క, శ్రేయంబు=ధర్మము, అనఁగా ఆచారము, సాంకర్యతన్ = జాతిసాంకర్యాశ్రమ సాంకర్యమతసాంకర్యములచేత, హీనంబై=తక్కువపడినదై, నశియింపన్=చెడఁగాను, పావనముగాన్=నియోగమతముపవిత్రమగునట్లుగా, హేయంబు=సాంకర్యత్రయమును, ఖండించి = నివారించి, నిత్యానందుండు=బ్రహ్మానందముగలవాఁడు, అగు...ద్వమున్, అగు=అయిన, అస్మదీయ=నాయొక్క, గురు=అజ్ఞాననాశకుఁడగు కులగురువుయొక్క, పాదద్వంద్వమున్=అడుగులజంటను, కొల్చెదన్=ఆరాధించుచున్నాఁడను.

తా. విష్ణుదేవునిచేత అర్చింపఁబడిన దక్షిణామూర్తియంశమున భూలోకమందవతరించి స్వకీయంబగుకులంబు జాతిసాంకర్య, ఆశ్రమసాంకర్య, మతసాంకర్యములచేత హీనదశ నొంద దాని నిర్మలంబుగావించి ప్రబలించి శిష్యవర్గంబునకు శాంకరద్వయాత్మక కర్మబ్రహ్మస్వరూపాద్వైతసిద్ధాంత ముపదేశించి నిరతిశయానందస్వరూపిలై యున్న అద్వైతలక్ష్మీనారాయణదీక్షితగురువుల నెల్లప్పు డారాధించుచున్నాఁడ నని తాత్పర్యము.

అవ. స్వగురుపరమగురుపరమేష్ఠిగురువులు వినుతింపఁబడుచున్నారు—

మ. అమితామ్నాయశిరోర్థసంఘటనదీక్షానందనాథాభిధా
నమహానిర్మలపూర్ణచిత్త్రివిధసన్మాన్యాస్మదాచార్యులా
సమసచ్చిత్సుఖలీలలో యన బుధుల్ సర్వజ్ఞులై పొల్చునా
విమలశ్రీపరమేష్ఠిముఖ్యగురులన్ వేడ్కన్ సదా గొల్చెదన్. ౬

టీ. అమితా...ర్యులు, అమిత=మితిలేని, ఆమ్నాయ=వేదములయొక్క, శిరః=శిరస్సులైన యుపనిషత్తులయొక్క. లేక మంత్రశాస్త్రమందలి శ్రేష్ఠములైన పూర్వామ్నాయ, దక్షిణామ్నాయ, పశ్చిమామ్నాయ, ఉత్తరామ్నాయ, ఊర్ధ్వామ్నాయ, అనుత్తరామ్నాయములు అనెడు షడామ్నాయములయొక్క, అర్థ=ఉపనిషదర్థములయొక్క, షడామ్నాయములయందలి మంత్రసిద్ధులయొక్క, సంఘటన=లభ్యమునకైనట్టి, దీక్షా=దృగ్దీక్ష, వాగ్దీక్ష, స్పర్శదీక్షలనెడి మూఁడుదీక్షలతోఁగూడిన పూర్ణపట్టాభిషేకదీక్షయందు (తమతమయాచార్యులచేత పొందఁబడిన) ఆనందనాథాభిధాన=తమతమనామములకు కడపట ఆనందనాథయనునదిగల, మహాత్=అధికులైన, నిర్మల=నిర్మలానందనాథుఁడు, పూర్ణ=పూర్ణానందనాథుఁడు, చిత్=చిదానందనాథుఁడు, (అను) త్రివిధ=మూఁడువిధములైన పేళ్ళచేత, సన్మాన్య=గౌరవింపఁబడుచున్న, అస్మదాచార్యులు=నాగురువులు, ఆసమసచ్చిత్సుఖలీలలో. ఆ=ప్రసిద్ధమైన, సమ=పరబ్రహ్మమందలి, సచ్చిత్సుఖ=సచ్చిదానందములయొక్క, లీలలో=విలాసములాయేమి యని, బుధులు=ఆత్మానాత్మవివేకముగల పండితులు, అనన్=పొగడఁగా, సర్వజ్ఞులై=అన్నియు నెఱిఁగినవారై, పొల్చు...గురులన్, పొల్చు=తేజరిల్లుచున్న, ఆ=అట్టి, విమల=ఆణవకార్మికమాయికమాయీయతిరోధానములనెడి పంచమలములులేనట్టి, శ్రీ=మోక్షసంపదతోఁగూడిన, పరమేష్ఠి=పరమేష్ఠిగురువే, ముఖ్య=మొదలుగాఁగల, గురులన్=కారణాచార్యులను, వేడ్కన్=నిరతిశయానందముతోడ, సదా=కాలత్రయమందును, గొల్చెదన్=సేవించుచున్నాఁడను.

తా. సకలోపనిషదర్థములను మంత్రశాస్త్రములయందుఁగల షడామ్నాయముల యందలి మంత్రసిద్ధులను పొందునప్పుడు తమతమగురువులవలన నిర్మలానందనాథుఁడు, పూర్ణానందనాథుఁడు, చిదానందనాథుఁడు అను నామములనొందిన మదీయాచార్యులు పరబ్రహ్మమందలి సచ్చిదానందములే ఈత్రివిధరూపముల ధరించివచ్చెనా యేమి యని బ్రహ్మవేత్తలు పొగడఁగా సర్వజ్ఞులై, నిర్మలులై మోక్షసంపదగలిగి ప్రకాశించు నిర్మలానందనాథ, పూర్ణానందనాథ, చిదానందనాథులనెడు గురునిర్మితనామములుగలిగిన పరమేష్ఠిగురువు, పరమగురువు, స్వగురువులైన శేషాద్రిసోమయాజులను, కృష్ణనారాయణసోమయాజివాంసలను, రాజేశ్వరసోమయాజులను త్రికాలములయందు సేవించుచున్నా నని తాత్పర్యము.

పంచమలవివరణము — ఆణవమలమనఁగా బ్రహ్మవిషయకజ్ఞానము అప్పుడప్పుడు ఉదయింపఁగా దానిని మఱుఁగుపఱచునది. కార్మికమలమనఁగా వేదాంతశాస్త్రవిషయములను పెద్దలుబోధించునప్పుడు దానియందుఁ బుద్ధిని చొరనియ్యనిది. మాయికమలమనఁగా బ్రహ్మవిషయకజ్ఞానవాసన నెప్పుడును ఉదయింపనీయనిది. మాయేయమలమనఁగా పాపకార్యములయందు మనస్సును ప్రవేశపెట్టునది. తిరోధానమలమనఁగా నిత్యసత్యపరిపూర్ణపరబ్రహ్మమందు అనిత్యబుద్ధిపుట్టించి పరబ్రహ్మేతరముగ దేవతలును, మంత్రములును, క్రియలును, మతములును, సాధనములును గలవు అవి సత్యములు అనెడి బుద్ధిని గలిగించి జననమరణాదిదుఃఖముల ననుభవింపఁజేయునది.

షడామ్నాయములలో పూర్వామ్నాయవివరణము: — పూర్వామ్నాయ గురుమండలదేవతలగు స్వగురుపరమగురుపరమేష్ఠిగురుమంత్రదేవతలును, మహాగణపతి కామగిరిపూర్ణగిరి జాలంధరపీఠమంత్రదేవతలును, పూర్వామ్నాయదేవతలగు శుద్ధవిద్య, బాల, ద్వాదశార్ధలఘువీణావేణుశుకరాజశారికసంగీతల నెడి సప్తశ్యామలలు మొదలైన యిరువదివాలుగువేల దేవతలును, ఉపదేవతలగు గాయత్రి గాణాపత్యము కార్తికేయము మృత్యుంజయము నీలకంఠము త్ర్యంబకము జాతవేదము ప్రత్యంగిరస్సు మొదలగు మంత్రదేవతలును, త్రైలోక్యమోహనచక్రావరణదేవతలును ఇవి మొదలగు రెండుకోట్లమంత్రదేవతలు పరమశివుని తత్పురుషముఖమువల్లఁ బుట్టి కామగిరిపీఠమున నివసించి వైదికాగమప్రసిద్ధములై ఆరాధించువారికి సాలోక్యపదవి మొదలగువాని నిచ్చుచుందురు.

దక్షిణామ్నాయవివరణము — దక్షిణామ్నాయగురుమండలదేవతలైన అష్టభైరవులును, దశవిధంబులగు సిద్ధసంఘదేవతలును, విరించి ఛత్రస్కంధము లనెడు వటుకత్రయదేవతలును, ప్రకాశవిమర్శము లనెడి పదద్వంద్వమంత్రదేవతలును, ఆమ్నాయదేవతలగు సౌభాగ్యవిద్య, పంచదశాక్షరి, బ్రహ్మాస్త్రదేవతయగు బగళాముఖి, వారాహిస్తంభకము, వటుకనాథుఁడు, తిరస్కరిణి మొదలగు ముప్పదివేలమంత్రదేవతలును, ఉపదేవతలగు అఘోరము, శరభము, ఖడ్గము, రావణము, వీరభద్రము, రౌద్రము, శాస్తము, పాశుపతము, దక్షిణామూర్తి మొదలగు కోటిమంత్రదేవతలును, సర్వాశాపరిపూరకచక్రావరణదేవతలును, పరమశివుని అఘోరముఖమునఁబుట్టి పూర్ణగిరిపీఠమున వసించి శైవాగమప్రసిద్ధములై ఉపాసించువారికి సామీప్యపదవి లోనగువాని నిచ్చుచుందును.

పశ్చిమామ్నాయవివరణము — పశ్చిమామ్నాయగురుమండలదేవతలగు నవవిధదూతీమంత్రదేవతలు, సోమసూర్యాగ్నిమండల దేవతలు, ఆమ్నాయదేవతలగు లోపాముద్ర, మహాదేవి, భువనేశ్వరి, అన్నపూర్ణ, కామకళ మొదలగు మూఁడువేలమంత్రదేవతలును, ఉపదేవతలగు సుదర్శనము, గరుడము, కార్తవీర్యము, నృసింహము, అచ్యుతము, అనంతము,

గోవిందము, శ్రీరామషడక్షరి, షోడశాక్షరి, గోపాలమంత్రాష్టకము, సోరమతసిద్ధాంత మంత్రదేవతలు,ధన్వంతరి,ఇంద్రజాలమహేంద్రజాలాదివిద్యామంత్రదేవతలును,ఇంద్రాది దశదిక్పాలకమంత్రదేవతలును, నారాయణాష్టాక్షరి, వాసుదేవద్వాదశాక్షరి మొదలగు కోటిమంత్రదేవతలును, సర్వసంక్షోభిణ, సర్వసౌభాగ్యదాయక, చక్రావరణదేవతలును పరమశివుని సద్యోజాతముఖమునఁ బుట్టి వైష్ణవాగమప్రసిద్ధములై జాలంధరపీఠమున నివసించి ఉపాసనచేయువారికి సారూప్యపదవి లోనగువాని నిచ్చుచుండును.

ఉత్తరామ్నాయ వివరణము:—ఉత్తరామ్నాయ గురుమండలదేవత లగు వీరశాపాతన్న, వీరమార్తాండుఁడు,వీరకేసరిలోనగు తొంబదియాఱువేల నలుబదెనమండ్రు వీరమంత్రదేవతలును,బ్రహ్మ విష్ణు రుద్ర ఈశ్వర సదాశివులనెడి పంచవీరావళీమంత్రదేవతలును,ఆమ్నాయ దేవతలగు తుర్యాంబ మహార్ధ అశ్వారూఢ మిశ్రాంబ పరాదేవి వాగ్వాదిని మొదలగు రెండువేల ఆమ్నాయమంత్రదేవతలును, ఉపదేవతలగు సర్వసంక్షోభిణి సర్వవిద్రావిణి, సర్వాకర్షిణి సర్వవశీకారిణి సర్వోన్మాదిని సర్వమహాంకుశి సర్వఖేచరి సర్వ... సర్వయోని సర్వత్రిఖండ అను నవముద్రాదేవతలును, మూఁడువేలసిద్ధదేవతలును, గుర్గి కాళి రహస్య చండి నకులి మహాబగళాముఖి రేణుక లక్ష్మి వాగ్వాదిని స్వయంవర బ్రాహ్మి మాహేశ్వరి కౌమారి వైష్ణవి వారాహి ఐంద్రి నారసింహి మొదలగు రెండుకోట్లమంత్రదేవతలును పరమశివుని వామదేవముఖమువల్లఁ బుట్టి ఓడ్యాణపీఠమున నివసించి శాక్తాగమ ప్రసిద్ధములై ఆరాధించువారికి సాయుజ్యపదవి మొదలగువాని నిచ్చుచుండును.

ఊర్ధ్వామ్నాయ వివరణము:—గురుమండలదేవతలైన అనులోమవిలోమవర్ణరూపమైన అకారాదిక్షకారాంతమగు మాలినీమంత్రదేవతయు మంత్రరాజమగు నృసింహము ఆమ్నాయదేవతలగు కామేశ్వర్యాదిషోడశనిత్యమంత్రదేవతలును,పరాశాంభవి పర అపర పరాపర మహాషోడశి ఆపదుద్ధారణము మొదలగు సహస్రమంత్రదేవతలును,ఉపదేవతలగు జ్వాలామాలిని ధూమావతి ప్రత్యంగిరా(?)కాళిని పరమంత్రభక్షిణి మొదలగుఅర్ధకోటిమంత్రదేవతలును సర్వసిద్ధిప్రదాయకసర్వైశ్వర్యప్రదాయక చక్రావరణదేవతలును, పరమశివుని ఈశానముఖమువలనఁ బుట్టి శాంభవీపీఠమున నివసించి పరమేశ్వరాగమప్రసిద్ధములై ఉపాసించువారికి సార్ష్టిపదవి లోనగువాని నిచ్చుచుండును.

అనుత్తరామ్నాయవివరణము--పరబ్రహ్మస్వరూపములయిన ప్రాసాదమంత్రదేవతలును, దహరము ఉద్గీథము హంసము మహావాక్యములు పంచాక్షరి జన్మతారకమగు మహాతారకము మహాపాశుపత రక్తశుక్లమిశ్రచరణములు పంచపంచకలు మూలవిద్యా షడ్విధములయిన ఆధారాదివిద్యలు శైవవిద్య మొదలగు నర్ధకోటిమంత్రదేవతలును,సర్వరోగహరసర్వసిద్ధిప్రదాయకసర్వానందమయచక్రావరణదేవతలును,పరమశివునిగుప్తముఖమునఁ బుట్టి తుర్యపీఠమున వసించి ఉపాసించువారికి బ్రహ్మానందము నిచ్చు పరమమోక్ష

పదవి గలిగించుచుండును. ఇట్లని ఆమ్నాయసారసంగ్రహమునందుఁ గలదు. ఇది పార్వతీ దేవికి పరమేశ్వరుఁ డుపదేశించెను.

అవ. భూతభవిష్యద్వర్తమానకాలములయందలి సంస్కృతాంధ్రసత్కవులు పొగడఁబడుచున్నారు.

మ. కవితాకల్పమహీజరాజి యిరువంకన్ సంస్కృతాంధ్రాకృతిన్
దివికిన్ భూమికిఁ బోవ రా సరణిలో నీడ ల్గనం జేసి స
త్కవులా నెందఱుపుణ్యు లుందురు ధరన్ గైవల్యముం జెంద నా
కవిశార్దూలుర సన్నుతించెదను మత్కావ్యంబు ప్రాలం దగన్. ౭

టీ. ధరన్=భూమియందు, సంస్కృ...కృతిన్, సంస్కృత = గీర్వాణభాషయనెడి, ఆంధ్ర=తెనుఁగుభాషయనెడి, ఆకృతిన్=ఆకారముచేత, కవి...రాజి, కవితా=కవిత్వములనెడి, అనఁగా పురాణస్మృతిసహస్రాదిసకలగ్రంథములనెడి, కల్పమహీజ=కల్పవృక్షములయొక్క, రాజి=వరుస, దివికిన్=స్వర్గమునుగూర్చి, పోవన్=(జనులు) ఇష్టాపూర్తకర్మలచేత ధూమాదిమార్గమునను వైరాగ్యోపశాంత్యాదితపస్సులచేత దేవమార్గమునను పోవుటకును, భూమికిన్=ఆపోయినవారు భూమినిగూర్చి, రాన్=ఇష్టాపూర్తకర్మఫలానుభవములను వైరాగ్యోపశాంత్యాదితపస్సులవలనిఫలానుభవములను క్షీణించివచ్చుటకును, సరణిలోన్=పుణ్యమార్గమందు, ఇరువంకన్ = రెండుప్రక్కలను, నీడలు=ఛాయలు, కనంగఁజేసి=కలుగఁజేసి, సత్కవులు=కవిశ్రేష్ఠులు, ఎందఱుపుణ్యులు=అనువట్టియెందఱుసుకృతవంతులు, కైవల్యమున్=ఆత్యంతికరహితమగునపరోక్షజ్ఞానమువలన మోక్షమును, చెందన్=పొందుటకై, అనఁగా లోకోపకారముగ సద్గ్రంథములు రచియించువారికి చిత్తశుద్ధి గలిగి అందువల సాధనచతుష్టయసంపద లభించి దానివలన సద్గురులాభము గలిగి అందువలన నుదయించు అపరోక్షజ్ఞానముచేత జీవన్ముక్తిని విదేహముక్తిని పొందుదురని భావము. ఉందురు=కలరో, ఆకవిశార్దూలురన్=ప్రసిద్ధులైనయాకవిశ్రేష్ఠులను, మత్కావ్యంబు=నాచేఁజేయఁబడిన కైవల్యనవనీతమనెడి గ్రంథము, తగన్=బాగుగా, ప్రాలన్=ప్రకాశించుటకు, సన్నుతించెదన్=కొనియాడుచున్నాను.

తా. భూమియందు కవిసార్వభౌములు పెక్కండ్రు తాము పరమమోక్షముఁ జెందుటకయి అగ్నిహోత్రము తపస్సు సత్యము వేదపరిపాలనము ఆతిథ్యము వైశ్వదేవము అనెడి ఇష్టకర్మములను, నడబావులు బావులు చెఱువులు లోనగువాని త్రవ్వించుట గుళ్ళు ఇండ్లు మండపములు లోనగువాని కట్టించుట అన్నదానము లోనగు దానములు చేయుట తోటలు లోనగువాని వేయించుట యనెడు పూర్తకర్మములను చేసి ధూమాది

మార్గమునను వైరాగ్యము ఉపశాంతి గలిగి యోగనిష్ఠచేత అర్చిరాదిమార్గమునను పుణ్యలోకములకుఁబోయి అచ్చట పుణ్యకర్మఫలముల ననుభవించి పుణ్యము క్షీణింపఁ దొల్లింటి జన్మములయందు పుణ్యకర్మములఁ జేయునప్పుడు పునర్జన్మకారణములైన ఆగామికార్య ఫలముల ననుభవింపను గలభూలోకమున జన్మింప వచ్చువారికిని జన్మించి మరణించి మరల పుణ్యలోకములను పొందువారికిని సాహాయ్యంబుగ సంస్కృతాంధ్రభాషారూపములై కర్మభక్తిజ్ఞానవైరాగ్యములను బోధించు గ్రంథములనెడి కల్పవృక్షములవరుసలను ధూమాదిఅర్చిరాదిమార్గములను రెండుప్రక్కలను మార్గసూచకంబుగ నిర్మించినట్టి భూత వర్తమానభవిష్యత్కాలములయందలి సంస్కృతాంధ్రకవిశిఖామణుల నందఱను నాగ్రంథము వర్ధిల్లఁజేయ ప్రార్థించుచున్నానని తాత్పర్యము.

త్రికాలకవులఁ గొనియాడుట పూర్వపుకవులు నాకు కవిత్వాదిమార్గము చూపినవారగుటచేతను, వర్తమానకవులు, నాగ్రంథపోషణము చేయువారగుటచేతను, భవిష్యత్కవులు నాగ్రంథము వర్ధిల్లఁజేయువారగుటచేతను అని యెఱుఁగవలయును.

మఱి పైనిజెప్పిన అర్చిరాదిధూమాదిమార్గముల వివరణము:—"శ్లో॥ అగ్నిర్దేవో ద్విజాతీనాం మునీనాం హృదిదైవతం। ప్రతిమాస్వల్పబుద్ధీనాం సర్వత్ర విదితాత్మనాం॥" అనుస్మృతినిబట్టి ద్విజాతులకు బ్రాహ్మణక్షత్రియవైశ్యగృహస్థులకు అగ్ని ముఖ్యదైవము ఆయగ్ని తేజస్సు ధూమము అనురెండురూపములు గలది. "శ్లో. అగ్నిర్జ్యోతి రహశ్శుక్లః షణ్మాసా ఉత్తరాయణం। తత్ర ప్రయాతా గచ్ఛంతి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః॥" అనుగీతా వచనప్రకారమున తేజస్సు పగలు శుక్లపక్షము ఉత్తరాయణము దేవయానము ఇడానాడి తేజోమార్గము, ఈమార్గమునఁ బోవువారు యోగాభ్యాసముచేత వైరాగ్యోపశాంతి వృత్తులు గలవారై బాహ్యసన్న్యాసము గలిగికాని పైనిజెప్పినక్రమముగా సూర్యలోకమును పొంది అచ్చట మన్వంతరములను నుండి పిమ్మట బ్రహ్మలోకముఁ జేరి అచ్చట వేదాంతవిచారణచేత "బ్రహ్మణాసహ ముచ్యంతే,, అనుశ్రుతిప్రమాణమునుబట్టి ముక్తులగుచున్నారు. అట్లు ముక్తులు కానివారు బ్రహ్మ యుండునంతవఱకు అచ్చటనే యుండి వెనుక తాము ఉపాసించిన దేవతాంతరలోకములయందు సాలోక్యాదిపదవులఁ బొందుదురు. వివేకవృత్తి లేనందున వీరు బహుకాలమునకు ముక్తులగుదురు మఱి వారు అగ్నిమొదలగు పదవులలో దేనినుండి జాఱినను, అచ్చటచ్చటికి దిగువపదవులయందుఁబడుచు తిరుగ పుణ్యకర్మఫలములచేత పైకిఁ బోవుచుందురు. ఇది అర్చిరాదిమార్గము.

ధూమాదిమార్గమనఁగా—"శ్లో॥ధూమో రాత్రి స్తథా కృష్ణ షణ్మాసా దక్షిణాయనం। తత్ర చాంద్రమసం జ్యోతి ర్యోగీ ప్రాప్య నివర్తతే,, అను గీతావచనమును బట్టి "శ్లో॥ అగ్నిహోత్రం తప స్సత్యం వేదానాం చానుపాలనం, ఆతిథ్యం వైశ్వదే

వంచ ఇష్టమిత్యభిధీయతే. వాపీకూపతటాకాది దేవతాయతనానిచ, అన్నప్రదానమారామః పూర్తమిత్యభిధీయతే॥ అను ప్రమాణమున ఇష్టాపూర్తకర్మములంజేయువారు పొగ రాత్రికృష్ణపక్షము, దక్షిణాయనము, పితృయానము, పింగళానాడి ఈమార్గమునబోయి చంద్రలోకంబు చేరి అచ్చట పుణ్యఫలముల ననుభవించుచు అవి క్షీణింప అచ్చోటు నుండి మేఘమందుఁబడి జలమై ఆజలరూపమున భూమియందలి ఓషధులలోఁజేరి అన్నమై జన్మానుగుణ్యమగు పురుషజంతుగర్భమందుఁజేరి శుక్లంబై అవ్వల వనితాగర్భంబునంజేరి నవమాసంబులం కడచినతోడనే పుడమియందుదయించి పెరిగి పుణ్యపాపమిశ్రకర్మములఁ జేసి ఆత్మజ్ఞానము గలుగుదాఁక లోకాంతరంబుఁ బొందుచు మరల పుట్టుచు గిట్టుచుందురు. ఇది ధూమాదిమార్గ వివరణము. అపరోక్షబ్రహ్మజ్ఞానముగలవారు బ్రహ్మార్పణబుద్ధిచేత బహుజన్మములయందుచేసిన యాగయోగ తపోనిష్ఠలవలన పుణ్యపుంజంబువలన కుంజాలంబగు చిత్తశుద్ధిగలిగి సాధనచతుష్టయసంపన్నులై వేదాంతశ్రవణ మనననిదిధ్యాసలుచేసి ధూమాద్యర్చిరాదిమార్గముల నిరాకరించి వివేకవృత్తిచేత జీవన్ముక్తులై ॥శ్లో. నతద్భాసయతేసూర్యో నశశాంకో నపావకః, యద్గత్వానవర్తంతే తద్ధామ పరమంమమ॥ అను గీతావచనప్రకారముగ విదేహకైవల్యమునొందుదురు. పుణ్యలోకప్రాప్తికై పైనిజెప్పిన ధూమాద్యర్చిరాదిమార్గములఁగాని వీని మీఱిన జ్ఞానమార్గమునఁ గాని పోనివారు అంధకారబంధురంబగు నరకమందు వసింతురు.

అవ:—స్వాభిమాననిరసనమును, కుకవితిరస్కరణమును చేయఁబడుచున్నది.

చ. శిశువులు సైకతస్థలులఁ జేరి రచింపరె బొమ్మరిండ్ల నే
విశదము లంచుఁ గాంతురు ప్రవీణతకెక్కిన శిల్పులెల్ల దా
దృశమగు మత్కవిత్వము సుధీజను లజ్ఞులు లెక్కసేయరే
న శమములేని కుత్సితులు నవ్విన నవ్వరె వారిఁ దాదృశుల్. ౮

టీ. శిశువులు=బిడ్డలు, సైకతస్థలులన్ = ఇసుకనేలలయందు, చేరి=ప్రవేశించి, ఒనర్చెడిబొమ్మరిండ్లన్ = నిర్మించునట్టియాటయిండ్లను, ప్రవీణతకెక్కినశిల్పులెల్లన్= ప్రసిద్ధిబొందిన శిల్పశాస్త్రజ్ఞులందఱును, ఏవిశదములంచున్=ఏమివిలక్షణములని, కాంతురు=వీక్షింతురు, తాదృశము=ఆబొమ్మరిండ్లవంటిది, అగుమత్కవిత్వమున్ = అయిన నాకవిత్వమును, సుధీజనులు=పండితులును, అజ్ఞులు=పండితులుకానివారును, లెక్కసేయరు=లక్ష్యపెట్టరు, అనఁగా పండితులు నాకవిత్వమునందలి తప్పొప్పులఁదెలిసి క్షమావంతులై ఆక్షేపించక సమర్థింతురు. ఆపండితులు తప్పొప్పులెఱుఁగక యూరకుందు రని భావము. ఐనన్=అట్లు లక్ష్యపెట్టకపోయినను, శమము=తాలిమి, లేనికుత్సితులు=లేనట్టికులువలు, నవ్వినన్=నాకవిత్వమును పరిహసించినను, తాదృశులు = అపలువలతోడి

వారు, చూచి=నాకవిత్వమును జూచినప్పు వారిని, నవ్వరె=పరిహసింపరా, అనఁగా పరిహసింతురనుట.

తా. చిన్నబిడ్డలు ఇసుకదిన్నెలపై పన్నిన బొమ్మరిండ్లను శిల్పశాస్త్రములఁ దెలిసినవారు వీక్షించి ఈయిండ్లకు ధ్వజ ధూమ సింహ శ్వ వృషభ గజ కాకములనెడి ఆయములు జాతిన్యాయములుగ లేవనియు ఘాతశూలలు వెన్నుపోటులు ఎన్నెన్నోయున్నవనియు ఇండ్లవాకిండ్లు నవగ్రహభాగములతో బృహస్పతిశుక్రభాగములయందు లేవనియు నివి మొదలగుదోషములనెన్నక మిన్నకుందురు. ఆయిండ్లఁబోలిన నాకవిత్వమునుజూచి పండితులును తప్పొప్పులనెఱిఁగి సమర్థింతురు. పామరులవి యెఱుఁగక యూరకుందురు. పండితులును పామరులును గాక తాలిమిలేక కుతర్కములు చేయు కుచ్చితులు మచ్చరముతో నాగ్రంథముపైని ఒచ్చెములు పెట్టి దూఱితేని వారిని వారిసరివారు దూఱుదురని తాత్పర్యము.

వ. ఇట్లు విశిష్ట శిష్టేష్ట దేవతానిష్ఠానూపప్రార్థనంబును, సద్గురుచరణారవిందద్వంద్వవందనప్రవర్ధనంబును, సంస్కృతాంధ్రసత్కవిబృందాభినందనంబును, కుకవిసందోహనిందనంబును, స్వాభిమాననిరాకరణంబును, స్వాత్మజ్ఞానబహూకరణంబును గావించి యేనొక్కయగణ్యపుణ్యశరణ్యంబగు సూర్యోపరాగంబున నఖర్వసర్వపాపతాపలతాలవిత్రంబును, సురాసురాఘురముని స్తోత్రపాత్రంబును నగు హరిహరక్షేత్రంబున సభంగమంగళోత్తుంగతరంగసంగత హరిద్రాసంగమతుంగభద్రోత్తర వాహినీజలావగాహనంబొనరించి నిత్యనైమిత్తిక కాల్యక్రియాచయంబుల సాఫల్యంబుగ నెఱవేర్చి విలక్షణ లక్షణ విచక్షణ దక్ష ముముక్షుజనసేవ్యంబగు నొక్క మహాకావ్యంబు భవ్యంబుగ నిర్మింప నాత్మప్రయత్నంబున శ్రీగురుదేవతామంత్రానుష్ఠానపర్యలుగావించి తదేకనిష్ఠనున్న సమయంబున.

టీ. ఇట్లు=ఈప్రకారము, విశిష్ట...నంబును-విశిష్ట=సమస్తదేవతలకంటె, లేక, అంతరబాహ్యదృశ్యములకంటె, శిష్ట=మిగిలినట్టి, ఇష్ట=సమ్మతమైనట్టి, దేవతా=స్వయంప్రకాశమానంబగు ప్రణవాకారపరబ్రహ్మమునుగూర్చి, నిష్ఠానూప=సవికల్పనిర్వికల్పకసమాధిరూపములగు, ప్రార్థనంబును=స్తోత్రమును, సద్గురు...నంబును-సద్గురు=సూచకనిషిద్ధబోధకవాచకాద్యష్టగురువులలో శ్రేష్ఠులగు కారణాచార్యులయొక్క, చరణారవింద ద్వంద్వ = పాదపద్మముల జంటనుగూర్చి, వందన = సాష్టాంగనమస్కారముయొక్క, ప్రవర్ధనంబును=అభివృద్ధియును, సంస్కృత...నంబును - సంస్కృత = గీర్వాణభాష

యందుఁగల, అంఘ్రి = తెనుఁగుభాషయందుఁగల, సత్కవి=శ్రేష్ఠులైనకవులయొక్క, బృంద=సంఘమునుగూర్చి, అభినందనంబును=పొగడుటను, కుక...మ-కుకవి=కుచ్ఛిత కవులయొక్క, సందోహ = సమూహమునుగూర్చి, నిందనంబును = దూషించుటను, స్వాభి...బును- స్వ=తనయొక్క, అభిమాన=గర్వముయొక్క, నిరాకరణంబును = తిరస్కరించుటను, స్వాత్మ...బును-స్వాత్మ=పరబ్రహ్మాభిన్న కూటస్థచైతన్యముయొక్క, జ్ఞాన=అపరోక్షజ్ఞానముయొక్క, బహూకరణంబున=గౌరవించుటను, కావించి=చేసి, ఏక=నేను, ఒక్క...బును-ఒక్క=ఒకానొక, అగణ్య = ఇంతింతనిలెక్కపెట్టరాని, పుణ్య=సుకృతములకు, శరణ్యంబు=ఉనికిపట్టు, అగుసూర్యోపరాగంబునన్=ఐనసూర్యగ్రహణకాలమందు, అఖర్వ...బును-అఖర్వ=అధికములైన, సర్వ=సమస్తములైన, పాప=దోషములవలనఁగలిగిన, తాప=ఆధ్యాత్మికము, ఆధిభౌతికము, ఆధిదైవికము లనియెడి త్రితాపములనెడు, లతా=తీఁగలకు, లవిత్రంబును=కొడవలివంటిదియును, నరా...త్రంబును-నర=మనుష్యులు, అసుర=దైత్యులు, అమర=దేవతలు, మునిజన=ఋషులు వీరియొక్క, స్తోత్ర=పొగడ్తలకు, పాత్రంబును=స్థానమైనదియును, అగు...బునన్-అగు=ఐనట్టి, హరిహరక్షేత్రంబునన్ = పూర్వము గుహాసురుఁడు హరిహరులచేత మరణము గలుగకుండ బ్రహ్మవలన వరము వడసి నరులను సురలనుబాధింప శివకేశవు లొకరూపమై ఆరాక్షసుని ద్రుంచి నిలిచిన హరిహరమనెడి పుణ్యస్థలమందు లేక ‘‘నద్వైతం కేశవాత్పరమ్’’ అనెడు వైష్ణవులకును ‘‘శివాత్పరతరంనాస్తి’’ అను శైవులకును హరిహరు లొకటేయని తెలుప రేకరూపము ధరించి నిల్చిన హరిహరక్షేత్రమందు, అభంగ...రించి-అభంగ=కొఱవడని, మంగళ=శుభకరములైన, ఉత్తుంగ=ఉన్నతములైన, తరంగ=అలలతోడ, సంగత=కూడిన, హరిద్రా = హరిద్రానదితోడ, సంగమ = కలిసిన, తుంగభద్రా=తుంగభద్రానదియొక్క, ‘‘శ్లో. హరిద్రాసంగమోయత్ర ముక్తిస్తత్ర నసంశయః, తుంగా నారాయణ స్సాక్షా ద్భద్రా దేవో మహేశ్వరః, తుంగభద్రేతి విఖ్యాతా హరిశంకరయోర్వపుః’’ అని పూర్వ తుంగభద్రా మాహాత్మ్యమందుఁ గలదు. అట్టి తుంగభద్రానదియొక్క, ఉత్తరవాహినీ = ఉత్తరపుదిక్కుగ ఐదుక్రోసులదాఁక ప్రవహించు ప్రవాహమండలి, జల=తీర్థములయందు, అవగాహనంబు=విధ్యుక్తప్రకారముగస్నానమును, ఒనరించి=చేసి, నిత్య...లన్, నిత్య=ప్రతిదినము చేయఁదగిన, నైమిత్తికకాల్య=విశేషకాలములయందుఁజేయఁదగిన, క్రియా=స్నానసంధ్యా గాయత్రీజపదానాది క్రియలయొక్క, చయంబులన్=సమూహములను, సాఫల్యంబులు=సప్రయోజనములు, కన్=అగునట్లు, అనఁగా నీశ్వరార్పణముగ ననుట, కెంజేర్చి = చేసి, విల...సేవ్యంబు-విలక్షణ=పంచకోశములకంటె వేఱైన పరబ్రహ్మముయొక్క, లక్షణ=తటస్థస్వరూపలక్షణములను, విచక్షణ=పరిశీలించుటయందు, దక్ష=సమర్థులైన, ముముక్షుజన=మోక్షాపేక్షగలవారిచేత

సేవ్యంబు=భజింపఁదగినది, అగునొక్క మహాకావ్యంబున్ = ఐనయొక గొప్పప్రబంధమును, భవ్యంబు=మనోహరము, కాన్=అగునటుల, నిర్మింపన్=చేయుటకు,నూత్న... బునన్- నూత్న = నవీనమైన,ప్రయత్నంబునన్=యత్నముచేత,శ్రీగురు... సపర్యలం- శ్రీ=నిత్యసంపదతోఁగూడిన, గురు=స్వగురువులయొక్కయు,దేవతా=ఉపాసనామూర్తియొక్కయు, మంత్ర=గురుమంత్రదేవతామంత్రములయొక్కయు, అనుష్ఠాన=ధ్యానము మొదలగు, సపర్యలు = పూజలను, కావించి=ఒనర్చి, తదేకనిష్ఠన్, తత్ = ఆగురుదేవతయొక్క, ఏక=ముఖ్యమైన, నిష్ఠన్=ధ్యానమందు,ఉన్నసమయంబునన్=ఉన్నవేళను.

తా. ఇవ్విధముగ సత్వలక్షణ విలక్షణంబయిన ఓంకారరూప పరబ్రహ్మమును వినుతించి, సద్గురుస్తోత్రంబు కావించి భూతభవిష్యద్వర్తమానకాలములయందలి సంస్కృతాంధ్రకవులఁగొనియాడి కుకవినిందనంబుచేసి స్వాభిమానతిరస్కారమొనరించి ప్రత్యగభిన్న పరబ్రహ్మపరోక్షజ్ఞానమును సన్మానించి ఒకనూర్యగ్రహణకాలమున సమస్తపాపములనునివారించు హరిహరమనెడి పుణ్యక్షేత్రతీరమునఁగల తుంగభద్రానదియందు స్నానముచేసి నిత్యనైమిత్తికకర్మముల నాచరించి యిష్టదేవతాధ్యానపరవశుఁడనై యుండఁగాను అని తాత్పర్యము.

అవ:—ఇష్టదేవతయగు పరబ్రహ్మిణి శివకామసుందరీస్వరూపంబున ప్రత్యక్షంబైనవిధము చెప్పఁబడుచున్నది.

సీ. జ్ఞానభూమికలు నజ్ఞానభూమిక లూర్ధ్వ, కాయంబు దగనధఃకాయ
మమరఁ,దాల్చి యాజ్ఞాచక్ర దళమధ్యమందుసిం, హాసనాసీనయైఁ
యతిమధురత, రేక్షుచాపముఁ గుసుమేషుపంచక మంకు, శంబు
పాశంబును శయచతుష్కము, మునఁ బూని త్రుంప వైరినికరము
వరాభ,యము లంఘ్రికమలయుగమున నలరఁ. తే. బ్రోవ నొక వే
షమున సర్వభూషణముమ, మాలికల దివ్యకంచుక చేలములను,
వరుస ధరియించి నామోల వైభవమున, నున్నయాదేవిఁగనుఁ
గొని యుచితగతుల. ౧౦

టీ. జ్ఞానభూమికలు=శుభేచ్ఛ,విచారణ,తనుమానసి, సత్వాపత్తి,అసంసక్తి,పదార్థాభావన,తురీయములనెడిజ్ఞానభూమికలేడును, అజ్ఞానభూమికలు = బీజజాగ్రము, జాగ్రము,మహాజాగ్రము,జాగ్రత్స్వప్నము,స్వప్నము,స్వప్నజాగరము,సుషుప్తులనెడిఅజ్ఞానభూమికలేడును, తగన్=లెస్సగా, ఊర్ధ్వకాయంబు=పాక్కిలికిమీఁది శరీరముగాను, అధఃకాయము=పొక్కిలికిక్రిందిశరీరముగాను, అమరన్=ఒప్పియుండునట్లుగా,తాల్చి=ధరించి,అనఁగా బొడ్డు,కడుపు, రొమ్ము,మెడ,ముఖము,భ్రూమధ్యము, తల అనునీయేడు

నెలవులను జ్ఞానభూమికలుగాను, పొత్తికడుపులు, పిఱుఁదులు, తొడలు, మోకాళ్లు, పిక్కలు, చీలమండలు, అఱకాళ్లు అను నీయేడు నెలవులను అజ్ఞానభూమికలుగాను ధరించి యనుట. లేక భూలోక భువర్లోక సువర్లోక జనర్లోక తపోలోక సత్యలోకములు మీది దేహముగాను, అతల వితల సుతల తలాతల మహాతల రసాతల పాతాళలోకములను క్రింది దేహముగాను ధరించి యని భావము. ఆజ్ఞా...మందుఁ-ఆజ్ఞాచక్ర = కనుబొమలనడుమ నుండెడి ఆజ్ఞాచక్రమందలి, దళ=సంకల్పవికల్పములనెడు రెండు రేకులయొక్క, మధ్యమందుఁ=నడుమను, సింహాసనాసీనయై = సింహపీఠమునఁ గూర్చున్నదై, వైరినికరముఁ-వైరి=భక్తజనుల అంతశ్శత్రువులగు రాగద్వేషాదులయొక్కయు, బహిశ్శత్రువులైన మధుకైటభశుంభనిశుంభరక్తబీజ భండాసురాది దుష్టదానవులయొక్కయు, నికరముఁ=సమూహమును, త్రుంపఁ=సంహరించుటకు, శయచతుష్కమునఁ=నాలుగుచేతులయందును, అతి...మును- అతిమధురతర=మిక్కిలిమాధుర్యముగల, ఇక్షుచాపమును = మనోరూపమగు చెఱకువింటిని, ఘనుమేషుపంచకమునఁ=పంచతన్మాత్రరూపములైన పుష్పబాణములనైదింటిని, అంకుశంబునఁ=క్రోధాకారమైన అంకుశమనెడిఆయుధమును, పాశంబునఁ=రాగరూపమైనవల్లెత్రాటిని, పూని=ధరించి, అంఘ్రికమలయుగమునఁ=పాదపద్మములజంటయందు, వరాభయములు-వర = ఇష్టఫలమునిచ్చెడి వరదముద్రయును, అభయములు=సాధకులభయముహరించెడిఅభయముద్రయును, అలరఁ=ఒప్పఁగాను, ॥శ్లో॥ త్వదన్యః పాణిభ్యామభయవరదో దైవతగణ స్త్వమేకా నైవాసి ప్రకటితవరాభీత్యభినయా, భయాత్త్రాతుం దాతుం ఫలమపిచ వాంఛాసమధికం శరణ్యే లోకానాం తవహి చరణావేవ నిపుణౌ॥ అని సౌందర్యలహరియందుఁ గలదు. గావున భక్తజనుల యభీష్టముల నిచ్చుటకు సంసారభయము నివారించుటకు పరబ్రహ్మణి పాదములే చాలుననుట. ప్రోవఁ = నన్ను రక్షించుటకై, ఒకవేషమునఁ=ఒకరూపముచేత, అనఁగా తాను పరబ్రహ్మమందలి పంచలక్షణములలోని చిల్లక్షణమగుటవలన భక్తజనులఁ రక్షింప ఇట్టి ఆకృతిని వహించివచ్చె ననుట, సర్వ...కలఁ-సర్వ=సమస్తములైన, భూషణ = మణికిరీటాద్యాభరణములను, సుమమాలికలఁ = కల్పవృక్షపుష్పహారములను, దివ్య...లఁ-దివ్య=అప్రాకృతములైన, కంచుక=రవికను, చేలములఁ=చీరను, వరుసఁ=క్రమముగా, ధరించి=తాల్చి, నామ్రోలఁ=నాయెదుట, వైభవమునఁ=విభవముతో, ఉన్నయాదేవిఁ=ఉన్నట్టి ఆచిచ్ఛక్తిని ఉచితగతులఁ=తగినవిధములచేత, కనుఁగొని=చూచి.

తా. శుభేచ్ఛ విచారణ తనుమానసి మొదలగు జ్ఞానభూమికలను బీజజాగ్రము, జాగ్రము, మహాజాగ్రము మొదలగు అజ్ఞానభూమికలను అప్రాకృత దివ్యమంగళశరీరముగ ధరించి దివ్యాభరణములను దివ్యవస్త్రములను దివ్యపుష్పగంధములను దాల్చి మూలాధారము మొదలైన ఆఱుచక్రములలో మేలైన ఆజ్ఞాచక్రమునడుమ సింహాసనముపైఁ గూర్చుండి భక్త

జనుల అంతరబాహ్యశత్రువులఁజంప చతుర్భుజములయందును ధనుస్సు, బాణము, పల్లె త్రాటిని అంకుశమునుపూని అభయవరదముద్రలుఁగల పాదపద్మములుఁగలిగి ప్రత్యక్షమైన పరబ్రహ్మణికి పాద్యము అర్ఘ్యము స్తోత్రము మొదలగు చతుష్షష్ట్యుపచారములఁజేసి వినయభయభక్తులు పెనఁగొన సందర్శించి అని తాత్పర్యము.

మఱి యీపద్యపు రెండవపాదమున ఆజ్ఞాచక్రిదళమధ్యమందని చెప్పియుండుట చేత మూలాధారము మొదలు కపాలముదాఁక వీణాదండమువలె బ్రహ్మదండిమేరువు అను పేళ్లుగల వెన్నెముకయుండును. దానివంటిమూలాధారమందు వశషస అను నాలుగక్షరములుగల నాలుగుదళములుఁగలిగి భూమికిస్థానమై అపరంజివన్నెగలదై నాసికకుకారణమై మూలాధారచక్రి మొప్పును. ఆచక్రింబునవసించి దానికి నాయకుఁడైన వినాయకునకు అజపాగాయత్రీమంత్రజపమందు ఆఱునూఱుహంస లర్పింపఁబడును.

లింగస్థానమందు బభమయరల అనెడి ఆఱక్షరములుగల ఆఱుఱేకులుఁగలిగి జలమునకుస్థానమై తెల్లనిరంగుగలిగి నాలుకకుకారణమై స్వాధిష్ఠానచక్రిము వెలుఁగును. ఆచక్రిమందువసించి దానికధిపతియైన బ్రహ్మకు అజపాగాయత్రీమంత్రజపమున ఆఱువేలహంసలు సమర్పింపఁబడును.

బొడ్డునందు డఢణతథదధనపఫ అనెడు పదియక్షరములుగల పదిదళంబులతోఁగూడి ఎఱ్ఱనిరంగుగలదై అగ్నికిస్థానమై నేత్రంబులకుకారణమై మణిపూరకచక్రింబు భాసిల్లును. ఆచక్రింబునవసించి దానికిప్రభువైన విష్ణువకు అజపాగాయత్రీమంత్రజపమున ఆఱువేలహంసలు అర్పింపఁబడును.

వక్షస్థలమందు కఖగఘఙచఛజఝఞటఠ అనెడు పండ్రెండక్షరంబులుగల పండ్రెండుదళములుగలదై ఆకుపచ్చవన్నెగలిగి వాయువునకు నివాసమై చర్మమునకు కారణమై అనాహతచక్రింబురాజిల్లును. ఆచక్రిమునవసించి దానికధిపతియగు రుద్రమూర్తికి అజపాగాయత్రీమంత్రజపమందు ఆఱువేలహంసలు సమర్పింపఁబడును.

కంఠస్థానమందు అఆఇఈఉఊఋౠఌౡఏఐఓఔఅంఅః అనెడు పదియాఱక్షరంబులుగల పదియాఱుదళంబులుగలిగి నీలవర్ణంబుగలదై మింటికిస్థానమై శ్రోత్రంబులకుకారణమై విశుద్ధచక్రింబుతంజిల్లును. అందువసించి దానికిప్రభువగు జీవరూపుఁడైన యీశ్వరునకు అజపాగాయత్రీజపమందు వేయిహంసలు సమర్పింపఁబడును.

భ్రూమధ్యమందు హక్ష అను రెండక్షరంబులుగల రెండుదళంబులుఁగలిగి మాణిక్యవర్ణంబులు గలదై అంతఃకరణంబునకు నిలయమై సకలేంద్రియవ్యాపారంబులకు కారణమై ఆజ్ఞాచక్రింబుప్రకాశించును. అందువసించి దానికి దొరయై పరమాత్మస్వరూపుఁడై

రాజిల్లు సదాశివునకు అజపాగాయత్రీమంత్రజపమందు వేయిహంసలు సమర్పింపఁబడును. కావున నిట్టి ఆజ్ఞాచక్రమందని భావము.

మఱియు కొందఱు జ్ఞానులు ఆధారకమలంబునకు నాసికకుచేరిక గావున నాసికకు విషయంబులగు సుగంధదుర్గంధ సుగంధమిశ్రదుర్గంధ దుర్గంధమిశ్రసుగంధంబులు నాలుగే ఆధారకమలంబునకు నాలుగుదళంబులనియు, స్వాధిష్ఠానకమలంబునకు లోచనంబులకు కూడిక గావున లోచనంబులకు విషయంబులగు తెలుపు నలుపు పసుపు ఆకుపచ్చ ఎఱుపు మిశ్రము లావు సన్నము పొట్టి పొడుగు అనెడి దశవిధరూపంబులే దశదళంబులనియు, మణిపూరకకమలంబునకు నాలుకకుపొందిక గాన నాలుకకు విషయంబులైన వగరు తీపు ఉప్పు కారము చేఁదు పులుసు అనెడి షడ్రసంబులే షడ్దళంబులనియు అనాహతకమలంబునకు శరీరచర్మంబునకు సంబంధంబు గావున చర్మంబునకు విషయంబులైన శీతఉష్ణ శీతమిశ్రోష్ణ ఉష్ణమిశ్రశీత మృదుకఠినస్పర్శంబులాఱును అల్ప అధికంబులచేత పండ్రెండగును. ఆపండ్రెండువిధంబులైన స్పర్శంబులే అనాహతకమలంబునకు పండ్రెండుదళంబులనియు, విశుద్ధకమలంబునకు కర్ణంబులకు కలయిక గనుక ఆకర్ణంబులకు విషయంబులైన అకారాదిషోడశస్వరరూపశబ్దంబులే షోడశదళంబులనియు, ఆజ్ఞేయకమలము మనస్సునకు నెలవు గనుక మనస్సునకు విషయంబులగు సంకల్పవికల్పములే ఆజ్ఞేయచక్రంబునకు రెండుదళంబులనియు పలుకుదురు.

మఱి కుండలీశక్తిరూపమైన బిందుతత్త్వము జగద్వ్యాపారవృత్తిగలిగినప్పుడు నిలుపనాధారమైనందున మూలాధారమనియు, ప్రభాసము చూపతనచేత అధిష్ఠింపఁబడుటవలన స్వాధిష్ఠానమనియు, సాధకుఁడు తన్ను నారాధించుసమయంబున మణిమయంబులై మోగుచుండు అందెలు కడియములు కిరీటము భుజకీర్తులు మొదలగు నగలచేత తనశరీరము నిండించెడిస్థానమగుటవలన మణిపూరకమనియు, సాధకుఁడు పూజాకాలమందు విఘ్నకారులగు దుష్టభూత భేతాళ రాక్షసాదులపోకకు మంగళవాద్యమునుచేయుట ప్రసిద్ధము గనుక సాధకునకు సాహాయ్యముగ కొట్టకనే ఢణిఢణిఢణి ఘంటా శంఖ వీణాతాళ వేణు భేరీమృదంగ మేఘధ్వనులు కలుగుచుండుటవలన అనాహతమనియు, సాధకుఁడు శుద్ధస్ఫటికాకృతిగా తన్ను ధ్యానించుచోటగుటచేత విశుద్ధమనియు, తనయాజ్ఞ చెల్లించుస్థలమగుటవలన ఆజ్ఞాచక్రమనియు షట్చక్రములకు పేళ్లుకలిగెను.

మఱి ఆమూలాధారంబునకంటె రెండంగుళంబులమీఁదను స్వాధిష్ఠానంబునకు రెండంగుళంబులదిగువను కుక్కుటాండంబువలె నాడీచక్రముండును. దానియందు డెబ్బదిరెండువేలనాడులు పుట్టి కొన్ని మీఁదుగను కొన్ని క్రిందుగను కొన్ని ప్రక్కగను భూమియందలి నదులవలె శరీరంబున వ్యాపించుకొనియుండును. వానిలో పదినాడులు ముఖ్యంబులు, అందును హలాశనీవాలీ రక్తావ్యాయంబులనెడి మూఁడునాడులు క్రిందుగపాఱి

కుహూనాడి మలంబును శినీవాలీనాడి మూత్రమును రక్తాహ్వయనాడి శుక్లశోణితంబులను విసర్జనము చేయుచుండును. పూషాలం అలంపూష అను రెండునాడులు కర్ణములయందుచేరి వర్ణధ్వనిస్వరమిశ్రరూపంబులైన శబ్దంబుల వినఁజేయుచుండును. గాంధారి హస్తిజిహ్వ అను నాడులు కన్నులలో వ్యాపించి దశవిధరూపగ్రహణంబు చేయించుచుండును. మఱి బ్రహ్మదండికి కుడియెడమ పార్శ్వములందుండెడి యిడ పింగళ అను నాడులు హృదయము దాఁకవచ్చి ఆహృదయమందలి ప్రాణవాయువుతోడ భ్రూమధ్యమందుచేరి గంగయమునలను పేళ్లుగలవియగును. అందు సూర్యుఁడనెడి పేరుగల యిడానాడి కుడినాసికయందు జేరి తపిని తాపిని ధూమ్రి మరీచి జ్వాలిని రుచి సుషుమ్న భోగద విశ్వబోధిని ధారుణి క్షమ అనెడు పండ్రెండుపేళ్లుగల పండ్రెండంగుళములవరకు ప్రాణవాయువును వెలుపల తిరుగఁజేసి వానిలో నాలుగంగుళములు క్షీణింపఁజేసి యెనిమిదంగుళముల్లదాఁక ప్రాణవాయువును మరల లోపలికీడ్చుకొనును. చంద్రుఁడను పేరుగల పింగళానాడి యెడమనాసికలోఁ జేరి ప్రాణవాయువును అమృత మానద పూష తుష్టి పుష్టి రతి ధృతి శశిని చంద్రిక కాంతి జ్యోత్స్న శ్రీ ప్రీతి అంగద పూర్ణ పూర్ణామృత అను పదియాఱుపేళ్లుగల పదియాఱంగుళంబులపొడవున వెలుపల వ్యాపింపఁజేసి యెనిమిదంగుళంబుల క్షీణింపజేసి యెనిమిదంగుళంబులదాఁక ప్రాణవాయువును లోపలికీడ్చుకొనును. మఱి సూర్యచంద్రసంజ్ఞలుగల ఇడాపింగళానాడులు రెండును ఒకదినమున యిరువదియొక్కవేల ఆఱునూఱు మాఱులు ఉచ్ఛ్వాసనిశ్వాసరూపంబులచేత మాఱిమాఱి పలుమాఱు తిరుగుచుండును. చంద్రనాడీచక్రమందుబుట్టిన శుక్లనాడి సుషుమ్న కుండలీశక్తి నాసికశ్యక బ్రహ్మనాడి అను పేళ్లు గలదియై పశ్చిమంబుదాఁకవచ్చి నాభీచక్రంబునుండి తనతోడవచ్చిన నూఱునాడుల నక్కడవిడిచి తాను నాలుకకొననుజేరి సరస్వతియను పేరుపడసి కొఁదనాలుక దవుడలు మెడ తల పండ్లు పెదవులు నాసికమిశ్రములు అను నెనిమిదిస్థానములయందు ఏబదియొక్క అక్షరములనుపలికించును అచ్చటనణఁగి అంతర్గమనంబున పశ్చిమమార్గంబుగ భ్రూమధ్యంబునకుదిగి ముందటి యిడాపింగళలలో సంగమమగును అది త్రివేణీసంగమము, త్రికూటము, శృంగాటము, చతుష్పథము అను పేళ్లుగలదగును. ఇది ఆజ్ఞాచక్రము. ఈయాజ్ఞాచక్రంబునకు మనోరూపంబుగ చిచ్ఛక్తి సహస్రారంబునుండి దిగివచ్చి అచ్చటనునించి ఇంద్రియములను సర్వవిషయములయందుఁ బ్రవర్తింపఁజేయును. జగత్సృష్టిస్థితిసంహార తిరోధానానుగ్రహములనెడి వ్యాపారములను చేయు పంచకర్తల కాజ్ఞాపించుటవలన ఆజ్ఞాచక్రమనిపేరు. దీనిమీఁద చిచ్ఛక్తికి ఒక అంగుళము నెత్తుకు శక్తియని దానిపై మూడంగుళముల వఱకు వ్యాపిని యని ఆవల నాలుగంగుళములదాక సమనయని ఆమీఁద నాలుగంగుళముల వఱకు ఉన్మనియని పేళ్ళుగలుగును. ఈపండ్రెండంగుళముల మీఁద బ్రహ్మరంధ్రము. ఇదే ద్వాదశాంతము. దీనియందు వేయిదళములుగల సహస్రారచక్రము గలదు. అది మాట

యిరువదియైదు చిన్నరేకులుంగల ఎనిమిది పెద్దరేకులు గలిగియుండును. ఇదే అష్టదళ పద్మము. దీనిమధ్యమందు శివబీజమైన హకారమును శక్తిబీజమైన సకారమును ఈరెంటి నడుమ త్రాసుముంటివలె శివశక్తులకు ఐక్యస్థానమై శివకళయగుజ్ఞానము హెచ్చినపుడు హకారముప్రక్కను, శక్తికళయగు ప్రపంచజ్ఞానము హెచ్చినపుడు సకారముప్రక్కను వ్రాలుచు బిందురూపమయిన బుద్ధితత్వము వెలుఁగుచుండును. ఇదే మూలాక్షరము. దీనిఁదెలిసి లక్ష్యముంచినవారే పరమహంసలు, అవధూతలు, జీవన్ముక్తులు, మఱియీహకారబిందుసకారములే పతిపాశ పశువులు నాదబిందుకళలు సోమసూర్యాగ్ని మండలములు పురుషపుత్రస్త్రీ ప్రవాహములు శుక్లమిశ్రరక్తపాదుకలు అనిచెప్పఁబడును. మఱి ఈహకారబిందుసకారములు తమ్మునమ్మినవారి సంసారబంధంబు హరించునవి గావున హంసయనఁబడును. మఱిహకారము సోమము సకారము అగ్నిబిందువే సూర్యపదము. వీనిమైక్యమే అగ్నిష్టోమయజ్ఞము. ఇదేకర్మకాండవిదులుచేయు బహిర్యజ్ఞము. మఱి తత్పదమే హకారము త్వంపదమే సకారము. వీనిమైక్యమైన అసిపదమే బిందువుగావున జ్ఞానులకు నిదియే జీవేశ్వరైక్యరూపమగు యోగయజ్ఞము. మఱి యీహంసయే గురుపాదుక గావున అజపాగాయత్రీ మంత్రజపముసహస్రము సమర్పింపఁబడును. మఱి యిదే జ్ఞానాజ్ఞానమిశ్రితమైన ప్రపంచమందు నీళ్ళనెడి అజ్ఞానమునువిడిచి పాలనెడి జ్ఞానమును వహించుఁగావున హంసపక్షియనఁబడును. మఱి ఈహంస అష్టదళపద్మమందలితూర్పు రేకుపైవ్రాలిన పుణ్యకర్మమును చేయవలెననుతలంపును ఆగ్నేయదళమందు వ్రాలిన సోమఱితనము ఆలస్యమాలోనైనవృత్తులును దక్షిణపుదళమందు ఒఱిగిన క్రూరపుబనులు గావింపవలయునను సంకల్పములును నైరృతిదళమందుచేరిన పాపకార్యములు సలుపవలయునెడిబుద్ధులును, పశ్చిమదళమందునిలిచిన ఆడుటపాడుటలేక వీనినిచూచుట మొదలగునవి చేయవలయునెడి యోచ్నికలును, వాయవ్యదళమందు చేరిన నడుచుట పరుగెత్తుట దుముకుట మొదలగునవి చేయవలయునను కోరికలును ఉత్తరపుదళమందు వ్రాలిన పదార్థముల ననుభవింపవలయునునవి లోనగు నభిలాషలును, ఈశాన్యదళమందుచేరిన దానములు త్యాగములు మొదలగునవి చేయవలెననెడి యిచ్ఛలును కమలమధ్యమందు చేరిన వైరాగ్యము ఉపశాంతిదమము మొదలగుసాత్వికవృత్తులును, కేసరములందుఁ బ్రవేశించినజాగ్రత్తయు దుద్దునందుఁజేరిన స్వప్నంబును పద్మనాళమున దిగిన నిద్రయును గలుగును. మఱి ఈపద్మమును విడుచుటయే తురీయము. అని హంసోపనిషత్తునందుఁ జెప్పఁబడెను.

అ[illegible]సాక్షాత్కరించిన యిష్టదేవత స్వకీయవృత్తాంతము వివరించుటనుగూర్చి చెప్పఁబడు[illegible]ది.

చ. వలగొని మ్రొక్కి భక్తి నిలుచోవంబడి యుండఁ గృపార్ద్రదృష్టిచేఁ
గలయఁగఁ జూచి వత్స శివకామిని వేడ్కఁ జిదంబరంబు మ
న్నిలయముగా వసించు నతి నిర్మల కేవల ముక్తిదాత్రినై
వలనుగ వచ్చితిన్ నిన భవద్ధృదయేచ్ఛ నెఱింగి ప్రోవఁగన్. ౧౧

టీ. భక్తిన్=శ్రవణకీర్తనస్మరణ పాదసేవన అర్చనవందన దాస్యసఖ్య ఆత్మనివేదనములనెడి తొమ్మిది యవయవములుఁగలిగి బాహ్యము, అనన్యము, ఏకాంతము అను త్రివిధరూపముగు భక్తిచేత వీనిలో బాహ్యభక్తి పరోక్షజ్ఞానమునకును, అనన్యభక్తి అపరోక్షజ్ఞానమునకును, ఏకాంతభక్తి సద్రూపముగు పరబ్రహ్మమును చిద్రూపిణియగు పరబ్రహ్మశక్తియును చంద్రచంద్రికలవలె నొక్కటేయను నిశ్చయజ్ఞానమువలనఁగలిగెడి నిత్యానందం బనుభవించుటకును కారణమని భావము. వలగొని=ప్రదక్షిణముచేసి, మ్రొక్కి=సాష్టాంగనమస్కారముచేసి, నిలువంబడియుండన్=నిలిచియుండఁగా, కృపార్ద్రదృష్టిచేన్-కృప=కరుణారసముచేత, ఆర్ద్ర=తడుపఁబడిన, దృష్టిచేన్=చూపుచేత, కలయఁగన్=శిరస్సునుండి పాదములదనుక, చూచి=మీనదృష్టిచేతవీక్షించి, వత్స=పుత్ర, శివకామినిన్ = నేను శివకామసుందరిని, వేడ్కన్=కుతూహలముతోడ, అతి...యునై-అతి=మిక్కుటమైన, నిర్మల=అణవ కార్మిక మాయికమాయేయతిరోధానములనెడు మలరహితమైన, కేవల=సజాతీయ విజాతీయ స్వగతభేదశూన్యమైన, ముక్తి=అతివ్యాప్తి అవ్యాప్తి అసంభవములనెడి త్రిదోషరహితలక్షణలక్షితమైన మోక్షమును, దాత్రినై=భక్తులకునిచ్చుదాననై, చిదంబరంబు = చిదాకాశము, లోక దేవ, రాజ, నటన, కనక, జ్ఞానములనెడు పంచసభలుఁగలిగి ఆనందతాండవ పురమను పేరుగల చిదంబరము, మన్నిలయముగాన్=నాయునికిపట్టుగా, వసింతున్=ఉందును, వలనుగన్ = చక్కఁగా, భవద్ధృదయేచ్ఛన్=నీమనమునందలియభిలాషను, ఎఱింగి=తెలిసి, ప్రోవన్ = రక్షించుటకై, వచ్చితిన్=ఏతెంచితిని.

తా. ఇవ్విధంబుగ ప్రత్యక్షమైనయిష్టదేవతకు భక్తితో ప్రదక్షిణ నమస్కారములుచేసి నిలిచియున్న నన్ను దయారసంబు చిలుకు చూపులఁజూచి కుమారా! నేనుశివకామసుందరిని భక్తజనులకు ముక్తియొసఁగ ప్రియముమీఱ ఆనందతాండవ పురమనెడు చిదంబరమందు వసింతును. గ్రంథరచనాశక్తిగల నీకోరిక నెఱిఁగి నిన్నురక్షింపవచ్చితిని అని యిష్టదేవత పలికెనని తాత్పర్యము.

అవతారిక:—ఇష్టదేవత తనపేర నీగ్రంథము నంకితమిమ్మని వరమిచ్చుట చెప్పఁబడుచున్నది.

తే. వినుము కైవల్యనవనీత మనఁగ దనరు
కృతి యొనర్పుము నా పేరఁ గీర్తి వెలయఁ
గానఁబడుచుందుఁ గైవల్యకాంతనగుచుఁ
బావనం బగు నీదు సంభవముఁ గృతియు. ౧౨

టీ. వినుము=పుత్రా యాలకింపుము, కైవల్యనవనీతము=కైవల్యనవనీతము, అనఁగన్=అనెడు నామముచేత, తనరుకృతిన్-తనరు=మనోహరమైన, కృతిన్=గ్రంథమును, కీర్తివెలయన్-కీర్తి=యశస్సు, వెలయన్=వర్ధిల్లునటుల, నాపేరన్=నాకంకితముగ, ఒనర్పుము=కవిత్వముచేయుము, కైవల్యకాంతనగుచున్=ముక్తికాంతనై, లేక ఈగ్రంథమునకు నాయికనగుటవల్ల లోకములయందెల్ల ముక్తికాంత నేనేయని ప్రసిద్ధికెక్కినదాననై, కానఁబడుచుందున్=నీకెల్లప్పుడును దర్శనమిచ్చుచుందును (అందున) నీదుసంభవము=నీజన్మమును, కృతియున్=గ్రంథమును, పావనంబు=పవిత్రము, అగున్=అవును.

తా. పుత్రా! కైవల్యనవనీతమనెడు వేదాంతశాస్త్రమును నాకంకితమిమ్ము. నేను నీకెల్లప్పుడును సంసారబంధ విచ్ఛిన్నంబగు విజ్ఞానరూపంబున దర్శనమిచ్చుచుందును. అందున నీజననమును, నీగ్రంథమును పవిత్రమగును. అని యిష్టదేవత వచియించెనని తాత్పర్యము.

అవ:—ఇష్టదేవత వరమిచ్చి అంతర్ధానమైనవెనుక కవి ఆవార్త తనవారలకుఁ దెలియఁబఱచుట చెప్పఁబడుచున్నది.

తే. అని తిరోహిత యయ్యె నాయంబ యంత
మదిఁ బ్రమోదము గదుర సామాన్యమనక
సాధు గురు విప్ర బుధులకు సరగఁ దెలిపి
వారియనుమతిఁ గృతిఁజేయఁ గోరినాఁడ. ౧౩

టీ. అని=ఇట్లుపలికి, ఆయంబ=లోకమాతయైన యాశివకామసుందరి, తిరోహిత యయ్యెన్=మఱుఁగుపడెను, అంతన్=తర్వాత, మదిన్=అంతఃకరణమందు, ప్రమోదము=సంతోషము, కదురన్=అతిశయిల్లఁగా, సామాన్యమనక=ఇష్టదేవత నాతోఁజెప్పినసంగతిసాధారణమనియెంచక, సరగన్=వేగముగ, సాధు...లకున్-సాధు=వివేకవైరాగ్యోపశాంతివృత్తులుగల సత్పురుషులకును, గురు=కారణాచార్యులకును, విప్ర=బ్రాహ్మణులకును, బుధులకున్=ఆత్మానాత్మవివేకముగల పండితులకును, తెలిపి=ఇష్టదేవత నాతోఁజెప్పినవార్తయెఱిఁగించి, వారియనుమతిన్=ఆయందఱయుత్తరవుచేత, కృతిన్=ఈగ్రంథమును, చేయన్=ఒనర్చుటకు, కోరినాఁడన్=ఇచ్ఛయించితిని.

తా. ఇష్టదేవతయగు త్రిపురసుందరి నాతోసంభాషించి వరమిచ్చి యంతర్ధానమైనవెనుక మహానందముతో నేనాసంగతి పెద్దలకును, ఆచార్యులకును, బ్రాహ్మణులకును, పండితులకును తెలియఁజేసి వారియాజ్ఞచేత నీజ్ఞానశాస్త్రము రచియింపఁబూనితినని తాత్పర్యము.

అవ:— ప్రతిజ్ఞారూపముగ నీగ్రంథమహిమఁ దెలుపఁబడుచున్నది.

క. పావనమఁట మత్కావ్యము, జీవనమఁట యోగితతికి శివకామినిసం
భావనమఁట నిగమాంత ల,తావనమట దీనిమానఁ దగ వేరికగున్.

టీ. మత్కావ్యము = నాచేతఁ జేయఁబడిన కైవల్యనవనీతమనెడి యీయోగశాస్త్రము, పావనమఁట = పవిత్రమైనదఁట, అనఁగా పరదేవత ప్రత్యక్షమై యీగ్రంథమును నీజన్మమును పవిత్రమగునని యానతిచ్చినందున నాచేతఁజేయఁబడిన యీశాస్త్రము పరమపవిత్రమైనదనిభావము. యోగితతికిన్ - యోగి=శివజీవైక్యపరులగు యోగీశ్వరుల యొక్క, తతికిన్=సమూహమునకు, జీవనమఁట=బ్రతుకుఁదెరువఁట, అనఁగా దీనిచే యోగీశ్వరులు ఉజ్జీవింతురనుట, శివకామిని = శివకామసుందరికి, సంభావనమఁట= కానుకగానియ్యఁబడినద్రవ్యమఁట, నిగమాంతలతావనమఁట-నిగమాంత=ఉపనిషదర్థములనెడి, లతా=తీఁగెలకు, వనమఁట = ప్రాఁకుడుచెట్లుగలతోఁటఁట, లేక అవనమఁట= సంరక్షకమైనదఁట, అనఁగా ఉపనిషదర్థములను ప్రతిపాదించునని భావము. ఏరికిన్= ఆరురుక్షులు, ఆరురోహులు, ఆరూఢులు, అనువారిలో నెవ్వరికైనను, మానన్=శ్రవణమనననిదిధ్యాసలు చేయక విడుచుటకు, తగవు=ధర్మము, అగున్=అవును, అనఁగా నీశాస్త్రమందఱిచేతఁ జదువఁదగినదని భావము.

తా. నాచేత రచియింపఁబడిన యీజ్ఞానశాస్త్రము పరమపావనమైనదనియును, యోగాభ్యాసపరులకు బ్రహ్మజ్ఞానమును వృద్ధిఁజేయునదియును, ఇష్టదేవతయగు శివకామసుందరికి అంకితముగాఁ జేయఁబడినదియును, వేదాంత మహావాక్యార్థములను ప్రతిపాదించునదియును గనుక ఆరురుక్షులును ఆరురోహులును ఆరూఢులును అగు బ్రహ్మజ్ఞానులకందఱికిని ఈగ్రంథముయొక్క శ్రవణ మనన నిదిధ్యాసములచేత తత్త్వజ్ఞానము స్థిరమై సర్వసందేహములు వీడునని తాత్పర్యము.

వ. అని నెయ్యంబున నియ్యకొని నిస్సారసంసారవైకల్యంబును మదీయ జననసాఫల్యంబును నగు నిక్కావ్యంబు వక్కాణింపంగడంగి యిందులకు వలయునసమంచిత సకలవిషయ సందోహంబు డెందంబునంగీలించి మోక్షసామ్రాజ్యాపేక్షకులకు మేలొనర్పం దలంచి విశిష్టశిష్టజన

**సంప్రదాయపూర్వకంబుగ మద్వంశ్యపారంపర్యక్రమంబు ప్రశస్యంబుగ నభివర్ణించెద.**

టీ. అని=గ్రంథమహిమయిట్టిదనిపలికి, నెయ్యంబునన్=ప్రీతితోడ, ఇయ్యకొని=ఇష్టదేవతతో గ్రంథమురచియింప నొప్పుకొని, నిస్సార...బును-నిస్సార = సత్తులేని, సంసార=దేహాదులే యాత్మయనుమతిభ్రమను, వైకల్యంబును = చెఱచునదియును, మదీయ...బును - మదీయ = నాయొక్క, జనన=పుట్టుకకు సాఫల్యంబును పరమపురుషార్థము గలిగించునదియును, అగుని కామ్యంబుగన్=అయిన ఈజ్ఞానశాస్త్రమును, వక్కాణింపన్ = రచియించుటకు, కడంగి=ప్రయత్నించి, ఇందులకున్ = ఈశాస్త్రరచనకు, వల...హంబుగన్-వలయు=ఉపయోగించునట్టి, సముంచిత = రమణీయములైన, సకలవిషయ=సమస్తవేదాంతగ్రంథముల భాష్యముల ముఖ్యాభిప్రాయములయొక్క, సందోహంబున్=సంఘమును, డెందంబునన్=అంతరంగమందు, కీలించి=చేర్చి, మోక్షసామ్రాజ్యాపేక్షకులన్ = మోక్షమనెడి రాజ్యాధిపత్యమునుగోరువారలకు, మేలు=హితమును, ఒనర్పన్=చేయుటకు, తలంచి=ఎంచి, విశి...గాన్-విశిష్ట=సమస్తులైన, శిష్టజన=మహనీయులగు గ్రంథకర్తలయొక్క, సంప్రదాయపూర్వకంబుగన్=నడవడిక మున్నుగఁగలుగునట్టుగ, అనఁగా తొల్లింటిగ్రంథకర్తలెల్ల తమవంశానుక్రమణికఁ జెప్పినట్లుగ, మద్వంశ్య...మంబు - మద్వంశ్య = నావంశమునఁబుట్టినవారియొక్క, పారంపర్య = పరంపరయొక్క, క్రమంబు=అనుక్రమణికను, ప్రశస్యంబుగన్=ప్రసిద్ధిగ, అభివర్ణించెదన్=వర్ణించుచున్నాను.

తా. అనిపలికి మిక్కిలి మక్కువతో గ్రంథనిర్మాణమునకు సమ్మతించి దేహేంద్రియమనఃప్రాణాదులే పరమాత్మయనెడు మతిభ్రమను చెఱుచునదియును నాపుట్టుకకు మోక్షమనెడు పరమపురుషార్థమును ఘటింపఁజేయునదియును నైన ఈ యోగశాస్త్రమును రచియింపయత్నించి దీనికి వలయునట్టి పంచదశి ప్రస్థానత్రయము అద్వైతబ్రహ్మసిద్ధి గాఢబ్రహ్మానందీయము లోనగు వేదాంతగ్రంథములయందలి ముఖ్యాంశములనుమనస్సుననుంచి మోక్షాపేక్షులకుహితముగావింపనెంచి సకలవిద్వత్కవుల సంప్రదాయప్రకారంబుగ నావంశపరంపరానుక్రమణికను వచించుచున్నానని తాత్పర్యము.

అవ:—సకలలోకోత్పత్తిస్థితిలయ కారణుఁడైన వాసుదేవమూర్తి వినుతింపఁబడుచున్నాఁడు.

**సీ. మాయామయావ్యక్త మహదాదియుతసహ, స్రవదన బాహూరు**
**చరణముఖశ, రీరంబుఁగొనినిర్వి కారాత్మసచ్ఛక్తి, యుతుఁడై విరా**
**ట్టన నానరియర్క, చంద్రాదిదేవతాకల్పితకర్మనోముఖేం, ద్రియము**

లై వరఁగ సద్ద్విజనృపోరు, భవశూద్రతతిముఖ బాహూరుపదము
ల, వఱల సర్వావయవముల వివిధ. తే. జంగమస్థావరంబుల సవన
సాధనముల నిగమాగమప్రమాణములఁ జేసి, వానిలోఁ దాను వసి
యింప వాసుదేవ, నామ మొప్పారె నా జగన్నాటకునకు. ౧౮

టీ. నిర్వికారాత్మ-నిర్వికార=గర్భముననుండుట, పుట్టుట, పెరుఁగుట, మాఱుట, చిక్కిపోవుట, చచ్చుటలనెడి యాఱువికారములులేని, ఆత్మ=పరబ్రహ్మము, మాయా... కంబుల్-మాయా=సత్త్వరజస్తమోగుణస్వరూపమగుమాయయొక్క, మయ=వికారమైన, అవ్యక్త=అవ్యక్తనామకతత్త్వస్వరూపమైన, మహత్=మహత్తత్త్వమె, ఆది=మొదలగు అహంకార ఆకాశ వాయు అగ్ని జలభూములనెడు సప్తావరణములతోడ, యుత=కూడినదియును, సహస్ర=వేలసంఖ్యలుగల, వదన=ముఖములును, బాహు=భుజములును, ఊరు=తొడలును, చరణ=పాదములును, ముఖ=మొదలుగాఁగల, అవయవములతోఁ గూడిన, శరీరంబుల్=దేహమును, కొని=ధరించి, అనఁగా ॥శ్రు. సహస్రశీర్షాపురుషః సహస్రాక్షస్సహస్రపాత్, సహస్రశీర్షం దేవం విశ్వాక్షం విశ్వసంభువం॥ అని తైత్తిరీయోపనిషత్తునందును ॥శ్లో. అనేకబాహూదరవక్త్రనేత్రమ్॥ అని భగవద్గీతలయందును గలదు గావున అనేకముఖభుజప్రముఖములుగల తనువును దాల్చి యని భావము. షట్ఛక్తియుతుఁడై-షట్=ఆఱువిధములై, శక్తి=హ్రాం హ్రీం హ్రూం హ్రైం హ్రౌం హ్రః అను బీజాక్షర సమన్వితలగు హృదయదేవి శిరోదేవి శిఖాదేవి కవచదేవి నేత్రదేవి అస్త్రదేవి అనునామములుగల సర్వజ్ఞశక్తి నిత్యతృప్తిశక్తి అనాదిబోధశక్తి సర్వస్వతంత్రశక్తి నిత్యమలుప్తశక్తి అనంతశక్తి అనెడి షట్ఛక్తులతోడ, యుతుఁడై=కూడినవాఁడై, విరాట్టు=లోకములయందు విశేషముగ ప్రకాశించువాఁడనెడి యవయవార్థముగల, విరాట్పురుషుండు=వీనికి వైరాజుఁడు వైశ్వానరుఁడు, అను పేళ్లునుగల్గు అనన్=అను నామముచేత, ఒనరి=ఒప్పి, అర్క... దేవతలు-అర్క=సూర్యుఁడు, చంద్ర=చంద్రుఁడు, ఆది=మొదలగు, దేవతలు=వేల్పులు, చక్షు...ములై-చక్షుః=నేత్రములు, మనః=అంతఃకరణము, ముఖ=మొదలగు, ఇంద్రియములై=జ్ఞానేంద్రియ కర్మేంద్రియ అంతరింద్రియములై, పరగన్=ప్రసిద్ధికెక్కఁగాను, ముఖబాహూరుపదములన్=ముఖములయందును భుజములయందును తొడలయందును పాదములయందును, సద్ద్విజ...తతి-సత్=శ్రేష్ఠులగు, ద్విజ=బ్రాహ్మణులయొక్కయు, నృప=క్షత్రియులయొక్కయు, ఊరుభవ=వైశ్యులయొక్కయు, శూద్ర=శూద్రులయొక్కయు, తతి=సమూహము, వఱలన్=ప్రకాశింపఁగాను, అనఁగా ॥బ్రాహ్మణోస్య ముఖమాసీద్బాహూ రాజన్యః కృతః, ఊరూ తదస్య యద్వైశ్యః పద్భ్యాగ్ం శూద్రో అజాయత॥ అను శ్రుతిప్రకారమున విరాట్పురుషుని ముఖ భుజ ఊరు పాదముల

యందు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులు పుట్టిరనిభావము సర్వావయవములన్ = శక్యైన అన్ని అంగములయందును, వివిధ...బులన్ - వివిధ = విధవిధములైన, జంగమ = తిరిగెడు పశుపక్షిక్రిమిజలచరాదులను, స్థావరంబులన్ = తిరుగని పర్వతవృక్షతృణాదులను, సవనసాధనములన్ - సవన = పాకహవిరాదియాగములను, సాధనములన్ = యజ్ఞమునకు పలయు అజినము, స్రుక్స్రువము, దృష్టిశేదము, బర్హిస్సులు, సమిధలు, పురోడాశము, కపాలములు, ముసలము, ఉలూఖలము, ఉపలములు చరుశ స్త్రిదోహనవేదికాణిపహ్నులు లోనగువానిని, నిగ...లన్ - నిగమ = ఋగ్యజుస్సామాథర్వము లనెడి వేదములను, ఆగమ = శ్రౌతస్మార్తములకు తగిన ప్రయోగకల్పములను, లేక, కామికాదివాతూలాంతాష్టావింశన్మహాగమములను, ప్రమాణములన్ = మంత్రస్వరవర్ణపద కాలక్రియాలోపములయందుఁ జేయఁదగిన ప్రాయశ్చిత్తాదులను దెలుపు ప్రమాణశాస్త్రములను, చేసి = కల్పించి, వానిలోన్ = తనచేతనిర్మింపఁబడినవానియందు, తాన్ = అహంపదలక్ష్యార్థ పరబ్రహ్మముగుతాను, వసియింపన్ = సముద్రమందుఁబుట్టిన అలలు బుగ్గలు తుంపురులు నురుగులు మొదలగువానియందు ఆసముద్రముజలమే వ్యాపించియున్నట్లు నివసించుటచేత, ఆజగన్నాటకునకున్ = పదునాల్గులోకములను నటియింపఁజేసెడి అపరబ్రహ్మమునకు, వాసుదేవనామము = వాసుదేవుఁడనుపేరు, ఒప్పారెన్ = ప్రకాశించెను. వ్యు. వసనివాసే ఇత్యస్మాద్ధాతోఃవసత్యసౌసర్వత్రేతి వాసుః దీవ్యతే ప్రకాశత ఇతి దేవః సచాసౌసచేతి వాసుదేవః అనివ్యుత్పత్తి. తా. చతుర్దశభువనము లెవనియందుఁ గలవో వానియం దెవఁడుండి వెలుఁగుచున్నాఁడో వాఁడు వాసుదేవుఁడని తాత్పర్యము. శ్లో. వాసనాద్వాసుదేవస్య వాసితంతే జగత్త్రయం, సర్వభూతనివాసోసి వాసుదేవనమోస్తుతే. అనునివి మొదలగువానిని గ్రహించునది.

తా. సూర్యునియందు సూర్యకిరణములవలె నిర్వికారపరబ్రహ్మమందు చిచ్ఛక్తి వేఱుపాటులేక యెడతెగక యుండును సూర్యకిరణములు లోకముల వెలిఁగింప వ్యాపించి యెండయను పేరుపొందినట్లు ఆచిచ్ఛక్తి ప్రపంచసృష్టికొఱకు బహిర్ముఖమైనవేళ మలినసత్త్వప్రధానమను పేరుగల జడశక్తియును సూర్యకిరణమందు లేకయే తోఁచిన యెండమావులవలె ఆజడశక్తివల్ల కాలత్రయమందులేని మాయగ్గెను. అది ఎండమావుతండము తీరున సమష్టిరూపమగు మూలావిద్య యని, ఎండమావులయందుఁదోఁచిన అలలు నురుగులు తుంపురులు బుగ్గలు లోనగువానివలె వ్యష్టిరూపమగు మూలావిద్య తూలావిద్య అని ద్వివిధమగును. ఎండమావులే జలముగఁ గనఁబడినట్లు ఆమాయయే అవ్యక్తమయ్యెను. ఆజలవ్యాపకమువలె ఆయవ్యక్తముయొక్క వ్యాపకమే మహత్తత్త్వమయ్యెను. ఆజలమందు తోఁచిన అలలు బుగ్గలు నురుగు తుంపురులు లోనగువానివలె ఆమహత్తత్త్వమువల్ల అహంకారమును, ఆయహంకారమువల్ల ఆకాశమును, దానివల్ల గాలియును, గాలివలన అగ్నియును, అగ్నివలన జలమును, దానివలన భూమియును ఉదయించెను. సూర్యకిరణముల

యందుఁ దోఁచిన యెండమావులజలములయందు ప్రతిఫలించినసూర్యునివలె మాయాతీతుఁడైన నిర్వికారపరబ్రహ్మము మాయామయములగుమహత్తు అహంకారము ఆకాశము వాయువు అగ్ని జలము భూమి అనెడుసప్తావరణములుగలదియును పెక్కుముఖములు కన్నులు చెవులు ముక్కులు చేతులు కడుపులు తొడలు అడుగులు లోనైన యవయవములుగలదియును అండపిండ భూతభువనభోగ్యరూపమైనదియు నైనగొప్పయాకృతినిపొంది సర్వజ్ఞశక్తి నిత్యతృప్తిశక్తి అనాదిబోధశక్తి సర్వస్వతంత్రశక్తి నిత్యములుప్తశక్తి అనంతశక్తి అనెడి యాఱుశక్తులుఁగలిగి విరాట్పురుషుఁడు వైరాజుఁడు వైశ్వానరుఁడు అనెడి పేళ్లుగలవాఁడై సూర్యుఁడు కన్నులుగాను దశదిక్కులు చెవులుగాను వాయుదేవుఁడు చర్మముగాను వరుణుఁడు జిహ్వగాను అశ్వినీదేవతలు నాసికగాను అగ్నిదేవుఁడు వాక్కుగాను ఇంద్రుఁడు భుజములుగాను ఉపేంద్రుఁడు పాదములుగాను బ్రహ్మ మేహనముగాను అండకోశములు మిత్రావరుణులుగాను మృత్యుదేవత గుదముగాను జయుఁడు సమానవాయువుగాను విశ్వయోని వ్యానవాయువుగాను అజుఁడు ఉదానవాయువుగాను విశిష్టుఁడు ప్రాణవాయువుగాను విశ్వకర్త అపానముగాను చంద్రుఁడు మనస్సుగాను బృహస్పతి బుద్ధిగాను క్షేత్రజ్ఞుఁడు చిత్తముగాను రుద్రుఁడు అహంకారముగాను సదాశివుఁడు శబ్దతన్మాత్రముగాను మహేశ్వరుఁడు స్పర్శతన్మాత్రముగాను రుద్రుఁడు రూపతన్మాత్రముగాను విష్ణువు రసతన్మాత్రముగాను చతుర్భుజుఁడు గంధతన్మాత్రముగాను తక్కినదేవతలు తక్కిన అవయవాదులుగాను పర్వతము లెముకలుగాను నదులు నరములుగాను వృక్షములును తీఁగెలును పొదలును రోమములుగాను పశువులు పక్షులు పురుగులు జలచరములును జంగమప్రాణులు మనోవృత్తులుగాను సముద్రంబు కడుపుగాను సప్తద్వీపములను మహావాయువు ఉచ్ఛ్వాసనిశ్వాసములుగాను ఆకాశము పొక్కిలిగాను వేదములును ఆగమములును శాస్త్రములును పురాణములును ఇతిహాసములును సంభాషణములుగాను యాగయోగతపఃకార్యములు క్రియలుగాను తన యవయవంబులు భువర్లోకముగాను అవయవకార్యములు భూలోకముగాను ఆయవయవాధిదేవతలు సువర్లోకముగాను గలిగి ముఖంబున బ్రాహ్మణులను బాహులయందు క్షత్రియులను తొడలయందు వైశ్యులను పాదములయందు శూద్రులను నిర్మించి వానియందు తానువసించి త్రిలోకములను స్వకీయమాయావిలాసముచేత నటింపఁజేయు మహాపురుషుఁడు వాసుదేవుఁడను పేరుగలిగి వెలుఁగునని తాత్పర్యము. ఈవాసుదేవుని శైవులు శివుఁడు, వైష్ణవులు విష్ణువు, బ్రహ్మవాదులు బ్రహ్మ, కర్మవాదు లింద్రుఁడు, తత్త్వవాదులు అక్షరుఁడు, ప్రకృతిపురుషవాదులు పరముఁడు భక్తివాదులు స్వరాట్టు నని యందు రనుట.

క. అవ్వాసుదేవుముఖముల, నివ్వటిలినవిప్రులదేవకే నిలువ నిపుణులై
తెవ్వారినైనజగములు, నివ్వెఱపడఁదవములందికే నగడుచుఁగళలన్.

టీ. అవ్వాసుదేవుముఖములన్=పైని జెప్పఁబడిన వాసుదేవునిముఖములయందు, నిర్వటిలినవిప్రులు-నిర్వటిలిన =ప్రకాశించిన, అనఁగా పుట్టిన, విప్రులు=తమ్మును ఇతరుల పాపములనుండి రక్షించునట్టి బ్రాహ్మణులు, కళలన్=అఱువదినాలుగువిద్యలచేత, నెగడుచున్=ప్రకాశించుచు, జగములు=చతుర్దశభువనములును, నివ్వెఱపడన్=అతిభీతిఁ జెందునటులు, తపములు=కృచ్ఛ్రచాంద్రాయణనిత్యనైమిత్తికానుష్ఠానాదివిధ్యుక్తతపస్సులను, లేక చలి చలిగాలి ఎండ మంచు ఆఁకలి దప్పి మొదలగువాని కోర్చి పేర్చిన పంచాగ్నిమధ్యమందు చేతులు పైకి నెత్తి సూర్యునిఁ జూచుచు కాలిబొటనవ్రేలి నేల నూని నిలిచి చేయుట మొదలగునుగ్రతపస్సులను, అంది=పొంది, ఎవ్వారినైనన్=సురలు నరులు లోనగువారిలో నెవ్వారినైనను, అడఁపన్=(నమ్రులుగాకున్న) నశింపఁజేయుటకును, నిలుపన్=(నమ్రులయిన)రక్షించుటకును, నిపుణులయిరి=సమర్థతగలవారయిరి.

తా. పరమపదవాసుఁడును సకలలోకనివాసుఁడును అయిన వాసుదేవునిముఖములయందుదయించిన బ్రాహ్మణులు అఱువదినాలుగువిద్యలయందు ప్రవీణులై పదునాలుగు లోకములయందలి జనులు వెఱపునొందఁ దగిన తపస్సులు సల్పి బ్రహ్మవిష్ణురుద్రాదిదేవతలనైనను మనుమాంధాతృ నిమిప్రముఖరాజులనైనను నిగ్రహింప ననుగ్రహింప సమర్థతగలవారై రనితాత్పర్యము. అఱువదినాలుగువిద్యలు-॥శ్లో॥ ఇతిహాసాగమాద్యశ్చ కావ్యాలంకారనాటకమ్। గాయకత్వం కవిత్వంచ కామశాస్త్రం దురోదరమ్। దేశభాషాలిపిజ్ఞానం లిపికర్మచ వాచకమ్। సంజ్ఞాని చాపదానాని స్వరశాస్త్రంతు శాకునమ్। సాముద్రికం రత్నశాస్త్రం రథాశ్వగజకౌశలమ్।మల్లశాస్త్రం సూదకర్మ భూరుహాణాంచ దోహదమ్।గంధవాదో ధాతువాదః ఖన్యావాదో రసస్యచ। జాలవాదోగ్నిసంస్తంభః ఖడ్గస్తంభో జలస్యచ।వాచః స్తంభో వయః స్తంభో వశ్యాకర్షణమేవచ।విద్వేషణోచ్చాటనేచ మారణం కాలవంచనమ్। పయసి ప్లవచాతుర్యం పాదుకాసిద్ధిరేవచ। మృత్సిద్ధిర్ఘుటికాసిద్ధిరింద్రజాలికమేవచ। అంజనం నష్టదృష్టేస్తు వంచనం స్వరవంచనమ్। మణిమంత్రౌషధానాంచ సిద్ధయశ్చోరకర్మచ। వృత్రలోహాశ్మమృద్దారువేణుచర్మాంజనక్రియాః। అదృశ్యకరణీ దూతకరణీ మృగయారతిః। వాణిజ్యం పాశుపాల్యంచ కృషిరాహావకర్మచ। లావకుక్కుటమేషాదియుద్ధకారణకౌశలమ్। చతుష్షష్టికలాస్త్వేతాః కలావిద్భిః ప్రకీర్తితాః॥"

క. అందుఁ బ్రభాకరపద్ధతిఁ
గొందఱు నియోగు లనఁగఁ ♦ గొఱలిరి జయమం
దుం దోడయి శంకరునకు
వందితజను లాఱువేల ♦ వా రయి రందున్. ౧౫

టీ. అందున్ = బ్రాహ్మణులయందు, కొందఱు = కొంతమంది, ప్రభాకరపద్ధతిన్-ప్రభాకర=ప్రభాకరగురునియొక్క, పద్ధతిన్ = మార్గముచేత-అనఁగా తొలుత

పూర్వమీమాంసాశాస్త్రపుపండ్రెండధ్యాయములకు భట్టాచార్యుఁడు కామనాకర్మపరముగ తనపేర భాట్టీయ మనెడు వ్యాఖ్యానముచేసెను. దానిని బ్రాహ్మణులెల్ల ననుసరించియుండిరి. వెనుక భట్టాచార్యశిష్యుఁడగు ప్రభాకరుఁడును ఆపండ్రెండధ్యాయములకే నిష్కామనాకర్మపరముగాను, ఉత్తరమీమాంసాశాస్త్రమందలి యేనిమిదధ్యాయములలో మొదటినాలుగధ్యాయములకు భక్తిపరముగాను తనపేరఁ బరఁగెడు ప్రాభాకరీయ మను వ్యాఖ్యానము చేసెను. కనుక అట్టివ్యాఖ్యానపద్ధతి ననుసరించి నడుచుటచేతననుట- నియోగులనఁగన్=భగవన్నియామకులై ఈశ్వరభక్తిగలిగి నిష్కామనాకర్మములఁ జేయుచు యోగాభ్యాసపరు లగుటవలన నియోగు లనునట్లుగాను, కొఱలిరి = ప్రకాశించిరి. అందున్=ఆనియోగులయందు, నందితజనులు=జనులచేత పొగడఁబడుచున్న, కొందఱు=కొంతమంది నియోగులు, శంకరునకున్=అద్వైతమతభాష్యకారులగు శ్రీశంకరాచార్యులకు, జయమందున్ = దుష్టమతఖండనముకొఱకు దిగ్విజయము చేయఁబోవునప్పుడు, తోడయి=పూర్వపక్షసిద్ధాంతముల నిర్ణయించుటయందు ఆఱువేలవిద్వజ్జనులు సహాయకులై, ఆఱువేలవారు=ఆఱువేలవారనెడు సంజ్ఞఁ గలవారై, అయిరి.

తా. ఆబ్రాహ్మణులయందు కొందఱు ప్రాభాకరీయపద్ధతి ననుసరించి నడుచుటచేత నియోగు లని ప్రసిద్ధి కెక్కిరి. ఆనియోగులలో ప్రముఖులయిన ఆఱువేలజనులు అద్వైతమతభాష్యకారులగు శ్రీశంకరాచార్యులు దుష్టమతఖండనము చేయ దిగ్విజయమునకుఁ బోవునపుడు పూర్వపక్షసిద్ధాంతముల నిర్ణయింప సహాయకు లగుటవల్ల ఆఱువేలవా రనుపేరు గలవారైరని తాత్పర్యము.

శా. ఆచంద్రార్కయశఃప్రతాపములచే నార్వేలవా రెల్లెడన్
వాచస్పత్యజరుద్రశేషు లన గీర్వాణాంధ్రకావ్యంబులన్
భూచక్రంబు వెలుంగఁ జేసి బహునైపుణ్యంబులం బుణ్యమా
ర్గాచారంబుల విప్రసంతతిని సర్వైశ్వర్యులై రం దొగిన్.

టీ. ఆచం...లచే-ఆచంద్రార్క=చంద్రసూర్యు లుండునంతకుఁగల, యశః=కీర్తులచేతను, ప్రతాపములచేన్ = పరాక్రమములచేతను, లేక-ప్రసిద్ధులగు చంద్రసూర్యులవంటి యశస్సును ప్రతాపమును గలవారగుటచేత, ఆర్వేలవారు=షట్సహస్రసంఖ్యచే నొప్పెడు కులముగలవారు, ఎల్లెడన్=అన్నిలోకములయందు, వాచస్పత్యజరుద్రశేషులు- (పాండిత్యమందు) వాచస్పతి = బృహస్పతి, అజ=బ్రహ్మ, రుద్ర=శివుఁడు, శేషులు=అనంతుడు, అనన్=జనులనునట్లుగా, లేక-ప్రజ్ఞావిశేషమందు బృహస్పతిని, కల్పనలయందు బ్రహ్మను, దుష్టనిగ్రహమందు రుద్రుని, వాచాలకమందు శేషాహిని పోలినవా రని, జనులు పొగడునట్లుగ-అనఁగా బృహస్పతి, బ్రహ్మ,రుద్ర, శేషులు, ఒక్క-

క్కవిషయమందే సమర్థతగలవారు, ఈయాలు వేలవారు, అన్నివిషయములలో, సమర్థత గలవారనుట-గీర్వా... బులన్-గీర్వాణ=సంస్కృతమయమైన, ఆంధ్ర=తెనుఁగుమయమైన, కావ్యంబులన్=గ్రంథములచేత, భూచక్రంబున్ = భూవలయమును, వెలుఁగఁ జేసి=ప్రకాశింపఁజేసి, బహువైపుణ్యంబులన్=పెక్కువిధములైన నేర్పులచేతను, పుణ్య...బులన్-పుణ్యమార్గ = న్యాయపద్ధతి ననుసరించిన, ఆచారంబులన్ = యాగయోగతపోనిష్ఠాదులు చేయుటచేతను, ఒగిన్=క్రమముగా, విప్రసంతతిన్=బ్రాహ్మణవంశమునందు, సప్తైశ్వర్యులైరి=అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశత్వము, వశిత్వము అనెడి అష్టమహాసిద్ధులు గలవారైరి. అందున్=ఆయాలు వేలవారియందు.

తా. శాశ్వతమగు నిర్మలకీర్తియును పరాక్రమమునుగల, ఆయార్వేలవారు, ప్రతిభయందు దేవగురువును, నవీనకల్పనావిశేషములయందు చతుర్ముఖుని, దుష్టనిగ్రహశిష్టపాలనములయందు రుద్రుని, వాగ్ధోరణియందు శేషాహిని పోలుదురని, జనులు పొగడునట్లుగ, సంస్కృతాంధ్రగ్రంథముల రచియించి, లోకములయందు ప్రసిద్ధపఱచి, సర్వకార్యముల నిర్వహించుటయందు, ననేకవిధములగు నేర్పరితనములచేతను, వేదశాస్త్రపద్ధతి మీఱక, యాగయోగతపోనిష్ఠలు మొదలగు వాని జరుపుటచేతను, బ్రాహ్మణసంఘమందు అణిమాద్యష్టసిద్ధిసంపదలు గలవారైరని తాత్పర్యము.

అణిమాద్యష్టైశ్వర్యములవివరము॥ అణుప్రమాణములయిన ప్రాణులయందు అణుప్రమాణుఁడై యుండుట అణిమ॥ బ్రహ్మ, విష్ణు, రుద్ర, మహేశ్వర, సదాశివ మాయాండములకంటె పెద్దవాఁడౌట, మహిమ॥ బ్రహ్మాండముకంటె, భారమై యుండుట, గరిమ॥ మేరువంతటి బరువు గలిగియుండి దూదియొక్కలేశమంతె తేలికయై యుండుట, లఘిమ॥ ఇష్టపదార్థములు లభింపఁజేసికొనుట ప్రాప్తి॥ గగనగమనాదిసిద్ధి ప్రాకామ్యము॥ సూర్య, చంద్ర, మహేంద్ర, ఉపేంద్ర, ప్రముఖదేవతలను, కార్యములయందు నియమించుట, యీశత్వము॥ సకలజంతువుల వశముచేసికొనుట వశిత్వము.

సీ. కృష్ణాధునీసుద♦క్షిణదిశ సప్తయో
జనదూరమై పూర్వ♦వనధిదరిసి
బహుసంపదల నొప్పు ♦ పందిళ్లపల్లియన్
దానియం దుండు రు♦దారయశులు
కాశ్యపగోత్ర సం♦కలితు లాపస్తంబ
సూత్రులు మద్వంశ్య ♦ సూరులందు
నారాయణుం డాది♦నారాయణుం డన
సకలసుగుణముల ♦ సమతఁ బరఁగె

తే. నాతనికి దేవి నరసమ • యార్యవినుత
వారి కుదయించి రిరువు ర•వార్యచరితు
లలర వేంకటనారసిం•హప్రధాని
యనఁగ రఘునాయకాహ్వయుం • డవనిలోన. ౨౦

టీ. అవనిలోనన్=భూమియందు, కృష్ణా...దిశన్-కృష్ణాధునీ=కృష్ణానదియొక్క, సుదక్షిణదిశన్ = చక్కనిదక్షిణపుదిక్కునందు, సప్తయోజనదూరమై, ఏడామడదూరముగలదై, పూర్వాననిధిదరిన్=తూర్పుసముద్రపుగట్టునందు, బహుసంపదలన్=ధనధాన్యపశుప్రముఖములగు ననేకవిధైశ్వర్యములచేత, ఒప్పుపందిళ్లపల్లియన్ దానియందున్=రమణీయమగు పందిళ్లపల్లి యనెడు గ్రామమునందు, ఉదారయశులు=మిక్కుటమైన కీర్తులు గలవారును, కాశ్యపగోత్రసంకలితులు = కశ్యపమహామునివంశమునఁ గూడినవారును, ఆపస్తంబసూత్రులు = ఆపస్తంబమహర్షిచేత నిర్మింపఁబడిన స్మార్తప్రయోగములు గలవారును నైన, మద్వంశ్యపూరుషులు=నాకులస్థు లయిన పెద్దలు, ఉందురు =వసింతురు, అందున్=ఆపెద్దలయందు, సకలసుగుణములసమతన్ = సకల-సమస్తములైన, సుగుణముల = శాంతశమదమాదిసాత్త్వికగుణములయొక్క, సమతన్=సమభావముచేత, నారాయణుండు=నారాయణమంత్రి, ఆదినారాయణుండు-ఆది = ప్రపంచసృష్టికి పూర్వమందుఁగల, నారాయణుండు=శ్రీమహావిష్ణువు, అనన్ = అనునట్లుగా, పరఁగెన్=లోకమునయందు ప్రసిద్ధికెక్కెను. అతనికిన్=ఆనారాయణమంత్రికి, ఆర్యవినుత=పూజ్యులైన పండితులచేత కొనియాడఁబడుచున్న, నరసమ=నరసమాంబ, దేవి =భార్య, వారికిన్=ఆనారాయణమంత్రికిని నరసమ్మకును, అలరన్=జను లానందింపఁగాను, అవార్యచరితులు = (దుర్గుణములచేత) అడ్డగింపఁబడని నడువడులు గలవారైన, వేంకటనారసింహప్రధాని = వేంకటనారసింహమంత్రి, రఘునాయకాహ్వయుండు= రఘునాయకుఁడను పేరుగల మంత్రి, అనఁగన్ = అనువారలు, ఇరువురు=ఇద్దఱు, ఉదయించిరి=పుట్టిరి.

తా. భూలోకమందు కృష్ణానదికి దక్షిణపుదిక్కున ఏడామడదూరమందుండు తూర్పుసముద్రపుగట్టున ధనధాన్యాదిసంపదలచేత మతల్లియగు పందిళ్లపల్లియనెడు గ్రామమందు ఎక్కుడయిన కీర్తులుగలవారును కాశ్యపసగోత్రమును ఆపస్తంబసూత్రమును గల, మాపెద్దలు వసింతురు వారిలో నారాయణమంత్రి శాంతశమదమాదిసమస్తప్రశస్తసద్గుణములుగల శ్రీమన్నారాయణుఁడే యని ప్రజలు పొగడ ప్రసిద్ధికెక్కెను. ఆ నారాయణమంత్రికి పండితులచేత వినుతింపఁబడుచున్న నరసమాంబ భార్య యయ్యెను. ఆదంపతులకు సత్పుత్రరత్నములు గల వేంకటనారసింహమంత్రియును రఘునాయకప్రగ్గడయును పుత్రు లయిరని తాత్పర్యము.

క. ఆ వేంకటనరసింహుఁడు
పావని లక్ష్మమను వేడ్కఁ బరిణయమై మున్
శ్రీవనిత నృహరిసరిఁ గనె
నేవురుసుతుల సురతరుల నెలమిఁ గధిక్రియన్. ౨౦

టీ. ఆవేంకటనరసింహుఁడు=నారాయణమంత్రిపుత్రులలోఁ జ్యేష్ఠుఁడును ప్రసిద్ధుఁడునునైన వేంకటనరసింహప్రధాని, పావనిన్ = పారంపర్యముగ యజ్ఞములు చేసినవారయింటి=అందుపడు పుట్టువలన నిత్యపవిత్రురాలైన, లక్ష్మమన్=ఘనదేశదీక్షితుని పుత్రికయగు లక్ష్మమ్మను, మున్ = పూర్వము, శ్రీవనితన్=లక్ష్మీదేవిని, నృహరిసరిన్=నరసింహాకారము ధరించిన విష్ణుదేవుఁడు పెండ్లియాడినరీతిని, వేడ్కన్=కుతూహలముతోడ, పరిణయమై=వివాహము చేసికొన్నవాఁడై, సురతరులన్=మందార పారిజాత సంతాన హరిచందన కల్పవృక్షముల నైదింటిని, కధిక్రియన్=క్షీరసముద్రము వలెనే, ఎలమిన్=సంతోషముతోడ, ఏవురన్=ఐదుగురను, సుతులన్=పుత్రులను, కనెన్=కనియెను

తా. నారాయణమంత్రిపుత్రులలోఁ బెద్దవాఁడైన యావేంకటనరసింహప్రధాని నిత్యపవిత్రురాలైన లక్ష్మాంబను నృసింహస్వామి పాలకడలికూఁతురగు లక్ష్మీదేవిని పెండ్లిచేసికొనినట్లు వివాహము చేసికొని క్షీరసముద్రము కల్పవృక్షములఁ గన్నట్లు లక్ష్మాంబయందు అయిదుగురుకొడుకులఁ గనెనని తాత్పర్యము.

క. అందిరువురుఁ బ్రఖ్యాతిని
జెందిరి బహుపుణ్యముల సుశేముషులను సం
క్రందనుఁ డన వేంకయ గో
విందుం డన రామయప్రవీణులయందున్. ౨౧

టీ. అందున్ = ఆవేంకటనరసింహప్రధాని కన్నపుత్రులైదుగురియందును, బహుపుణ్యములన్ = వేదోక్తకులాచారధర్మములగు శ్రౌతస్మార్తాదిసుకృతకార్యాచరణములచేత, వేంకయ=వేంకయమంత్రి, సంక్రందనుఁ డనన్ = శతక్రతుఁడగు దేవేంద్రుఁడో యన్నట్లుగాను, సుశేముషులన్=పరోక్షాపరోక్షజ్ఞానములచేత, రామయ=రామయప్రగ్గడ, గోవిందుఁ డనన్=పరబ్రహ్మమైన ఉపేంద్రుఁడో యన్నట్లుగాను, ప్రవీణులయందున్ = ఆత్మానాత్మవివేకముగల పండితులలో, ఇరువురును = వేంకయ రామయ ప్రధానులిద్దఱును, ప్రఖ్యాతిన్=ప్రసిద్ధిని, చెందిరి=పొందిరి.

తా. ఆనరసింహప్రధానిపుత్రులేవురియందును శ్రౌతస్మార్తాది పుణ్యకర్మాచరణములచేత వేంకయమంత్రి శతక్రతుఁడగు దేవేంద్రుఁడో యన్నట్లుగాను పరోక్షా

పరోక్షజ్ఞానములచేత రామయప్రధాని ఉపేంద్రుఁడగు విష్ణుదేవుఁడో యన్నట్లుగాను ప్రసిద్ధికెక్కి రని తాత్పర్యము.

మ. ధర సాధించి యమాదినిష్కల సుభద్రాకాంత నుద్వాహమై
సొరిదిం బాకహవిర్మఖాఖిలమఖస్తోమంబు సోమంబు వా
సరపూర్వాణిలసత్కృప నలిపి సత్సప్తసంతానముల్
వరశేషాచలయజ్వ నా నగడె విద్వత్సంఘ మగ్గింపఁగన్. ౨౩

టీ. ధరన్=పుడమియందు, యమాదినిష్కలన్-యమ=యమమే, ఆది=మొదలైన అవయవములతోఁగూడిన, నిష్కలన్=మంత్రయహఠరాజయోగములను-లేక-రాజయోగమునకు ముఖ్యములైన నిర్గుణపంచదశయోగాంగములను, సాధించి=వాడుకకుఁ దెచ్చుకొని, సుభద్రాకాంతన్=సుభద్రాసోమిదేవిని, ఉద్వాహమై=పెండ్లియాడినవాఁడై, సొరిదిన్=క్రమముగాను, పాక...మంబున్-పాక=స్మార్తు లాచరింపవలసిన షోడశసంస్కారములతోఁగూడిన పాకములు, హవిః=శ్రౌతమం దాచరింపవలసిన హవిస్సులు, ముఖ=మొదలగు, అఖిల=సమస్తములయిన, మఖ=యజ్ఞములయొక్క, స్తోమంబున్=సంఘమును, అనఁగా వైశ్వదేవము ప్రతిపదస్థాలీపాకము ఈశానసర్పబలులు తిసాన్ప్తికలు మాసదర్శశ్రాద్ధపిండపితృయజ్ఞములు నిత్యోపాసనము కూశ్మాండగణహోమములు అనెడు సప్తపాకయజ్ఞములను అగ్న్యాధేయము అగ్నిహోత్రము దర్శపూర్ణమాసేష్టులు ఆగ్రాయణేష్టిచాతుర్మాస్యలు నిరూఢపశుబంధము సౌత్రామణి అనెడు సప్తహావిర్యాగములు నని భావము. సోమంబున్=అత్యగ్నిష్టోమము ఉక్థ్యము షోడశివాజపేయము అప్తోర్యామము అనెడి సోమసంస్థలతోఁగూడిన అగ్నిష్టోమమును-సత్...ములు-సత్=ప్రశస్తములైన, సప్త=ఏడైన, సంతానములు=చెఱువు త్రవ్వించుట ధనము పూడ్చుట అగ్రహారము కట్టించుట దేవాలయ ప్రతిష్ఠించుట తోఁటవేయించుట గ్రంథములు రచియించుట బావి త్రవ్వించుట అనెడు సప్తసంతానములను, వాసర...సత్కృపన్ - వాసరపూర్వాణి=గోదావరీతీరమందలి వాసర యనుపట్టణమందుండు సరస్వతీదేవియొక్క, లసత్=మనోహరమైన, కృపన్=దయచేత, అనఁగా లంకాపురియందు శాంకరీదేవి కాంచీపురమందు కామాక్షీదేవి ప్రద్యుమ్నయందు శృంఖలాదేవి క్రౌంచపట్టణమందు చాముండీదేవి అలంపురియందు జోగులాంబ శ్రీశైలంబున భ్రమరాంబిక కొల్లాపురియందు మహాలక్ష్మి పిఠాపురమందు పురుహూతిక ఉడ్యాణపట్టణమందు గిరిజాదేవి మాణిక్యపట్టణమందు చిత్రకోటిక అయశ్చిత్రపట్టణమందు కామురూపిణి జ్వాలాపట్టణమందు జ్వాలాముఖి వాసరయందు సరస్వతి ప్రయాగయందు మాధవి కాశియందు విశాలాక్షి కాత్యాయనీపట్టణమందు కాత్యాయని జంబుకేశ్వరమందు అఖిలాండి కన్యాకుమారియందు కౌమారి అని పదునెనిమిది శక్తిపీఠములు విష్ణువునకు నూటయెనిమిది దివ్యతిరుపతులును

శివునకు వేయిన్నూటయొనిమిది దివ్యస్థలములును గలయట్లుగ శక్తికిని గలవు. వీనిలో వాసరాసరస్వతినిగూర్చి పండ్రెండేండ్లు కందమూలఫలంబుల భక్షించి యింద్రియంబుల శిక్షించి తపంబు చేసి ఆ మెదయచేత ననుట-సలిపి = పాకహవిర్యాగాదుల నొనరించి, విద్వత్సంఘము=పండితసమూహము, అగ్గింపఁగన్ = పొగడఁగా, వరశేషాచలయజ్వ-వర=శ్రేష్ఠుఁడైన, శేషాచలయజ్వ=శేషాద్రిసోమయాజి, నాన్=అనునట్లు, నెగడెన్= ప్రసిద్ధికెక్కెను.

తా. మంత్రలయహఠరాజయోగములకు పూర్వోత్తరాంగములయిన యమము నియమము ఆసనము ప్రాణాయామము ప్రత్యాహారము ధ్యానము ధారణ సమాధి అనెడి యష్టాంగములను రెండియు యమ నియమ త్యాగ మౌన దేశ కాల ఆసన మూలబంధ దేహసామ్య దృక్స్థితి ప్రాణయామ ప్రత్యాహార ధ్యాన ధారణ సమాధు లనెడి నిర్గుణ పంచదశయోగాంగములను సాధకముచేసి సుషిద్రాసోమిదేవిని పెండ్లియాడి వైశ్వదేవము ప్రతిపదస్థాలీపాకము ఈశానసర్పబలులు త్రిస్రాష్టకలు మాసదర్శశ్రాద్ధపిండపితృయజ్ఞము లు నిత్యోపాసనము కూశ్మాండగణహోమములు అనెడి సప్తపాకయజ్ఞములను అగ్న్యాధేయము అగ్నిహోత్రము దర్శపూర్ణమాసేష్టులు ఆగ్రయణేష్టి చాతుర్మాస్యలు నిరూఢపశు బంధము సౌత్రామణి అనెడు సప్తహవిర్యాగములను అత్యగ్నిష్టోమము ఉక్థ్యము షోడశి వాజపేయము అతిరాత్రము అప్తోర్యామము అనెడు సోమసంస్థలతోడ అగ్నిష్టోమమును చెఱువు త్రవ్వించుట ధనము పూడ్చుట అగ్రహారము కట్టించుట దేవాలయము ప్రతిష్ఠించుట తోఁట వేయించుట గ్రంథముల రచియించుట బావి త్రవ్వించుట అనెడి సప్తసంతానములను వాసరాపురంబున నివాసముచేయు సరస్వతీదేవియనుగ్రహంబుచేత నొనరించి విద్వాంసులు పొగడ శేషాద్రిసోమయాజి యనుపేర లోకంబున ప్రసిద్ధి కెక్కె నని తాత్పర్యము.

యోగాంగములగు యమనియమాదులవివరము॥ జీవసాక్షియగు ప్రత్యగాత్మకును ఈశ్వరసాక్షియగు పరబ్రహ్మమునకును ఘటాకాశమహాకాశములవలె ఐక్యము కలుగుటయే యోగము. అది చిత్తపరిపక్వము లేనివారికి అభ్యాసయోగ మని చిత్తపరిపక్వము గలవారికి యోగ మని రెండువిధములు. అందు అభ్యాసయోగము ప్రాణాయామ మనఁ బడును. ఆప్రాణాయామము ప్రాకృత మని వైకృత మని కేవలకుంభక మని మూఁడువిధ ము లగును. ఆమూఁటియందు ప్రాకృతము మంత్రయోగము. వైకృతము లయయోగము. కేవలకుంభకము హఠయోగము. వీనిలో మంత్రయోగము అజపము జపము క్రియ స్మర ణము లనెడు నాలుగురూపములు గలది. అందు నేఁటిదినము సూర్యోదయము మొదలు కొని రేపటిదినము సూర్యోదయమువఱకు మూలాధారాదికమలములకు నధిదేవతలయిన గణపతి మొదలగువారికి ॥శ్లో॥ షట్ఛతాని గణేశాయ షట్సహస్రం స్వయంభువే। విష్ణవే

షట్సహస్రంతు షట్సహస్రం పినాకినే । సహస్రమాత్మనే చైవ సహస్రం పరమాత్మనే। సహస్రమేకం గురవే అర్పయామి కృతంజపమ్॥ అను శ్లోకప్రకారంబుగ ఇరువదియొక వేలయాఱువన్నూఱు హంసగాయత్రీ మంత్రజపము సమర్పించుటే అజపారూపమంత్రయోగము. ఋషిచ్ఛందదేవతాబీజశక్తికీలక అంగన్యాస కరన్యాసధ్యాన కవచ హృదయ మాలా పంజర అర్గళ స్తోత్ర దిగ్బంధన దిగ్విమోక ప్రాణప్రతిష్ఠలును యంత్రవిగ్రహాద్యారాధనములును గలిగి మొదట ప్రణవమును నడుమ దేవతానామము చతుర్థ్యంతముగను కడపట వశ్యమారణ స్తంభనమోహన విద్వేషణ ఉచ్చాటన ఆకర్షణ ఆవేశనముల నెడి అష్టకర్మములకు తగిన నమః స్వాహా హుం ఫట్ వౌషట్ వషట్ ఖేట స్వధా మొదలగు పల్లవములను ప్రణవాదిగఁ జేర్చి యిష్టసిద్ధికొఱకు జపింపఁబడునది జపరూప మంత్రయోగము ఇది గాయత్రీ మొదలుగ శైవశాక్త వైష్ణవకాపాలికగాణాపత్యసౌరాదిసమయ మంత్రభేదములచేత ఏడుకోట్లవిధములై యుండును. శ్రౌతస్మార్తాదికర్మములయందును గర్భాదానాదిషోడశసంస్కారములయందును యాగాదులయందును వేదోక్తపురాణోక్త మంత్రములను నోటఁజెప్పుచు చేతులతో చరు ఆజ్య సమిత్ అక్షత పుష్ప చందన దర్భ జలాది పదార్థములచేత అచ్చటచ్చట క్రమముగ క్రియలనడిపించునదియే క్రియారూపమంత్రయోగము శ్రీరామ శివ గోవింద నారాయణ మహాదేవాదినామములను రాగతాళ నృత్యవాద్యములతోడ ప్రాధాన్యంబుగ భజన సేయుట ఆ శ్రీరామాదినామములను కోటి సంఖ్యగ వ్రాయుట ఆదేవతానామములతోడనే ఆదేవతారూపముల వ్రాయుట లోనగునవి స్మరణరూపమంత్రయోగము. లయయోగ మనఁగ ॥ శ్లో. మనోత్ర విలసతే బిందుః ప్రాణాత్ర విలసతే కరా। ఉభయోర్లీయతే నాదం లయ ఇత్యుచ్యతే బుధైః॥ అనాహతస్య శబ్దస్య తస్య శబ్దస్య యో ధ్వనిః । ధ్వనేరంతర్గతం జ్యోతిర్జ్యోతిరంతర్గతం మనః । తన్మనో విలయం యాతి తద్విష్ణోః పరమం పదమ్॥ ఇత్యాదిప్రమాణములచేత కొట్టఁబడకనే మ్రోగుచుండెడి అనాహతచక్రమందలి దశవిధప్రణవనాదముల నెఱిఁగి దశమనాద మెచ్చట లీన మగుచున్నదో అచ్చట ప్రకాశాగ్రస్థితమైన చిత్కళాదర్శనముతోఁ గూడి తద్దర్శనమందు మనోలీన మగుటయే లయయోగ మనంబడును. ఈలయయోగము మృడానికి మృడుఁడు లక్షవిధంబులం దెలిపె. గ్రంథవిస్తరభీతిచే నిచ్చట వ్రాయఁబడదు. హఠయోగ మనఁగ ధర్మప్రభువు పాలించురాజ్యమందలి పుణ్యనదీతీరమందు శాస్త్రోక్తక్రమంబుగ హఠయోగమఠము కట్టించుకొని యోగవిశిష్టుఁడగు గురుని సన్నిధి నుంచుకొని వారిచేత నిర్ణయింపఁబడిన ప్రకారముగ పథ్యములఁ జేయుచు భోజనాభ్యంగనాదులచేత శరీరరక్షణము చేయుచు గుదాకుంచనముచేత నీళ్లు పీల్చి అధోమలములఁ గడిగి విడుచుచు కల్పఘృతములచేతను గంధూషాదులచేతను వక్షస్థలకంఠగతకఫపిత్తాదులఁ గ్రక్కుచు అంజన నస్యాదులచేత కపాలనాసికాగత దుష్టజలమలాదుల విసర్జించుచు శీత

కాలమం దుష్ణమును ఉష్ణకాలమందు శీతమును గలుగఁజేయు పవిత్రంబగు భస్మంబు శరీరమందెల్లఁ బూయుచు సాత్త్వికాహారంబుల భుజించుచు కాయశుద్ధియు గురుదేవతాభక్తియుఁ గలిగి పరిశుద్ధాంతఃకరణుఁడై మితాహారవిహారనిద్రాజాగ్రత్తుల గలవాఁడై స్థిరాసనుండై మూలబంధ ఉడ్యాణబంధ జాలంధరబంధములతోడ ఘ్రాత్కారసీత్కార శీతల కేవలాద్యష్టవిధకుంభకములచేత ప్రాణవాయునిరోధనము చేసి కాయసిద్ధి సంపాదించి ఆకాశగమన దూరదృష్టి దూరశ్రవణ ఘుటికా పాదుకాసిద్ధులును అణిమాద్యష్టసిద్ధులును స్వేచ్ఛామరణాదులు గలిగియుండుట హఠయోగము. జ్ఞానయోగ మనఁగ గురువులవలన వేదాంతశాస్త్రవిషయములను పలుమాఱును శ్రవణముచేసి మనననిదిధ్యాసములను గావించి వైరాగ్యోపశాంతి వివేకస్ఫూర్తులు గలిగి సదా పరబ్రహ్మాపరోక్షస్ఫూర్తిచేత జీవన్ముక్తిని పొంది విదేహముక్తిపర్యంతము ప్రారబ్ధ మనుభవించుచుండుటే జ్ఞానయోగము. ఇదే రాజయోగము. ఈమంత్రలయ హఠ రాజ యోగములలో ఏయోగము నభ్యసింపఁ దలఁచినను వారిచేత యమ నియమ ఆసన ప్రాణాయామములు నాలుగును ముందుగ నభ్యసింపఁదగినవి. ఇవే పూర్వాంగములు. ప్రత్యాహార ధ్యాన ధారణ సమాధులు నాలుగును యోగపూర్తియందు నభ్యసింపఁదగినవి. ఇవే ఉత్తరాంగములు. మఱి పూర్వాంగములయిన యమ నియమ ఆసన ప్రాణాయామములు నాల్గింటియందును యమము అహింస సత్యము అస్తేయము బ్రహ్మచర్యము అపరిగ్రహము అని యైదువిధములు అందు.

అహింసాలక్షణము - అహింస - ఏజంతువునుగాని చంపకుండుట.

ఉత్సాహ. ఈరు పేను నల్లి చీమ యీఁగ మొదలు జంతులన్
క్రూరసర్పవృశ్చికాదిగురువిషప్రదావళిన్
ఘోరమృగముల న్వధింపఁ గోరకునికి నాగమో
క్తోరుహింస సేయ రెండు నొప్పు నాయహింసమున్.

తా. ఈరు పేను నల్లి చీమ ఈఁగ లోనగు స్వల్పజంతువులను క్రూరములైన పాములు తేళ్లు మండ్రగబ్బలు మొదలగు విషజంతువులను భయంకరములైన శరభములు సింహములు ఏనుఁగులు పులులు చిఱుతపులులు అడవిపందులు మొదలగు మృగములను చంపకయుండుటయును వేదోక్తములగు యజ్ఞములయందు పశువులఁ జంపుటయును ఈ రెండును అహింసయే అని తాత్పర్యము.

సత్యలక్షణము.

క. ఉన్నది కన్నది విన్నది, యున్నట్లుగఁ బలుకుటయును నొరునకు సత్యా
పన్నత గలుగఁగఁ గల్లా, జోన్నతిగల కల్లమాటయును సత్య మగున్.

తా. ఉన్నసంగతి యున్నట్టుగను చూచినసంగతి చూచినట్టుగను విన్నసంగతి

విన్నట్టుగను తప్పక చెప్పుటయును ఒకనికి సంభవించినఆపదఁ దప్పి మేలు గలుగుట కయి యాడినకల్లమాటయును సత్యమే యగు నని తాత్పర్యము.

అస్తేయలక్షణము - అస్తేయము=దొంగిలింపకుండుట.

క. ప్రస్తుతిగ నెట్టిదశఁ బర, వస్తువులం ద్రికరణముల వర్జించుట తా
నస్తేయ మనుచుఁ జెప్పుదు, ర స్తమితాజ్ఞానతంత్రు లైనమునీంద్రుల్.

తా. ఎట్టికష్టకాలమందయినను పరులసొమ్ము నపహరింప మనసునఁ దలఁపక అపహరింపుమని నోటఁ జెప్పక చేత ముట్టకయుండుట అస్తేయమని తాత్పర్యము.

బ్ర హ్మ చ ర్య ల క్ష ణ ము.

క. కాంతల నందఱ నామత,శాంతకముగఁ బరిహరించు టది మే లొండే
నెంతయు నిజభార్యావ్రత,సంతుష్టినిఁ జెంద బ్రహ్మచర్యంబ యగున్.

తా. స్త్రీసంపర్కంబు మరణించుదనుక లేకయైనను ఋతుకాలములయందు తన భార్యం గలసి తనివినొందుచున్న నయినను బ్రహ్మచర్యంబని తాత్పర్యము.

అపరిగ్రహలక్షణము - అపరిగ్రహము=దానములఁ గైకొనకుండుట.

ఆ. దానపూర్వకంబుగా నెవ్వరేమైన, నొసఁగ సంగ్రహింపకునికి సత్య
తముగ శిష్యు లొసఁగుద్రవ్యంబుఁ గొనుటయా, నవఘ తదపరిగ్రహంబు వత్స.

తా. ధనధాన్యాదులను దానపూర్వకంబుగ నెవ్వరిచ్చినను పుచ్చుకొనక శిష్యులిచ్చిన పుచ్చుకొనుట అపరిగ్రహ మని తాత్పర్యము.

శౌచలక్షణము - శౌచము=పరిశుద్ధము.

తే. శౌచములు రెండుదెఱఁగులై చనుఁ బ్రసిద్ధి, మృత్తికాజలములచేత మఱియు బాహ్య
మమలినాభ్యంతరపుశౌచ మనఁగ భావ, శుద్ధి యని కద పచియింతు రిద్ధమతులు.

తా. బాహ్యపరిశుద్ధ మని ఆంతరపరిశుద్ధ మని పరిశుద్ధము రెండువిధములు. వానిలో మృత్తికచేతను జలముచేతను చేయఁబడునది బాహ్యపరిశుద్ధము. కామక్రోధలోభమోహమదమత్సరదంభములు మొదలయిన దుర్గుణసంఘములతోడను అణవకార్మికమాయికమాయేయతిరోధానములనెడు పంచమలములతోడను కూడక మనస్సు నిర్మలమయి యుండుటే ఆంతరపరిశుద్ధమని విజ్ఞానసంపన్నులగు పండితులు పల్కుదురని తాత్పర్యము.

త్రి వి ధ త పో ల క్ష ణ ము.

శ్లో. దేవద్విజగురుప్రాజ్ఞ పూజనం శౌచమార్జవమ్
బ్రహ్మచర్య మహింసాచ శారీరం తప ఉచ్యతే,
అనుద్వేగకరం వాక్యం సత్యప్రియహితంచ యత్
స్వాధ్యాయాభ్యాసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే,

మనఃప్రసాదసౌమ్యత్వం మౌనమాత్మవినిగ్రహః
భావసంశుద్ధిరిత్యేతత్తపో మానస ఉచ్యతే.

తా. దేవతలను బ్రాహ్మణులను గురువులను పండితులను పూజించుటయును బాహ్య పరిశుద్ధమును ఆర్జవమును బ్రహ్మచర్యవ్రతమును అహింసయును కలిగియుండుట శరీర సంబంధమైనతపస్సు॥ మనోవేదనగలుగఁజేయునది గాక సత్యమై వినసొంపై మేలుగలుగఁజేయునదియై యుండు మాటలాడుటయును వేదమూలమంత్రములను పఠించుటయును వాక్సంబంధమయినతపస్సు॥ మనస్సునకు సమాధానమయిన మంచినడవడియును వాఙ్నియమమును మనోనిగ్రహమును మనశ్శుద్ధి గలిగియుండుటయును మనస్సంబంధమైన తపస్సు అని తాత్పర్యము.

క. మనమున వాక్కునఁ గాయంబునఁ దలఁపులఁ బలుకులను బ్రబుద్ధతి నుపవా
సనిరూఢి యిద్ధపూర్వో, క్తనియతిఁ బచరించు టిదియ తపమగుఁ బేర్మిన్.

సంతోషలక్షణము.

క. ఆపదలను శోభనముల, నాఁపక చనఁజూచుచును స్వయంస్వాగతవి
త్తాపత్తిన ముద మందుట, దీపితసంతోష మని కథింతురు ప్రాజ్ఞుల్.

తా. శుభాశుభకార్యములను నిలుపక తగినకాలములయందే జరిపించుచు పేరాశ పడక తనకు లభించినద్రవ్యముతోడనే తృప్తిపొందుట సంతోషమని తాత్పర్యము.

స్వాధ్యాయలక్షణము - స్వాధ్యాయము = వేదమూలమంత్రపఠనము.

తే. మఱియు స్వాధ్యాయ మన మూలమంత్రపఠన
మది విచారింప వాచక మని యుపాంశు
వనియు మానసికం బని యనఘ మూఁడు
తెఱఁగులయి యుండుఁ దెలిపెదఁ దెలియ వినుము.

క. ఒరులు వినఁ గొనుట వాచక, మొరులు వినకయుండఁ గొనుటయు నుపాంశువు న
క్షరవిరళముఁ గొని మది సం, స్మరియించుట మానసికము స్వాధ్యాయ మగున్.

తే. అందు వాచకజపమున కధికతర ము,పాంశుజప మయ్యుపాంశుజపమున కధిక
తరము మానసజప మగు దాని కధిక, తరము లేదని తెలియు మోధర్మనిరత.

తా. స్వాధ్యాయము వాచక మని ఉపాంశు వని మానసిక మని మూఁడువిధములు. అందు అన్యునికి వినఁబడునట్లు పఠించుట వాచకము. అన్యునికి వినఁబడకుండునట్లు పఠించుట ఉపాంశువు. ప్రత్యక్షరమును విరళించి మనస్సునందే జపించుట మానసిక మని తాత్పర్యము.

ఈశ్వరప్రణిధానలక్షణము - ఈశ్వరప్రణిధానము=దేశికేశ్వరపాదపద్మార్చనము.

సీ. కరణంబు లఖిలోపకరణంబులును గాఁగఁ బ్రాణంబు లుపచారభటులు గాఁగ
గంగాప్రముఖనాడికలు జలంబులుగాఁగ షట్కమలములు పుష్పములుగాఁగ
జఠరాగ్నిహోత్రముజ్జ్వలధూపముంగాఁగఁ బటుజీవకళలు దీపంబుగాఁగ
నందితానందంబు నైవేద్యముంగాఁగ రవిశశిజ్యోతు లారతులుగాఁగ
నంగదేవాలయమున సహస్రకమల, పీఠమున శాంతిజనకజోపేతుఁ డగుచుఁ
జెలఁగుపరమాత్ము రాము నర్చించుచుంట, తత్త్వవిదు లీశ్వరప్రణిధాన మండ్రు.

తా. జ్ఞానేంద్రియములును కర్మేంద్రియములును అంతరింద్రియములును పూజా పాత్రములుగాను, దశవిధప్రాణములు పనివాండ్రుగాను, గంగాయమునాసరస్వత్యాది నామములుగల ఇడ పింగళ సుషుమ్న మొదలగునాడులు అభిషేకాదిజలములుగాను, ఆధారాదిషట్కమలములు పుష్పములుగాను, జఠరాగ్ని ధూపముగాను, చిత్కళలు దీపములుగాను, బ్రహ్మానందము నైవేద్యముగాను, సూర్యచంద్రమండలజ్యోతులు హారతులుగాను శరీరమనెడుదేవాలయమందలి సహస్రారకమలమనెడుసింహాసనమున శాంతియనెడు సీతతోఁ గూడిన పరబ్రహ్మమగు శ్రీరాముని నెల్లప్పుడు పూజించుచుండుటయే యీశ్వర ప్రణిధాన మని బ్రహ్మవాదులైనపెద్దలు పలుకుదు రని తాత్పర్యము.

యోగాసనముల లక్షణములు - వీరాసనము.

క. ఒకతొడపై నొకపాదము, నొకపాదముమీఁదఁ దొడయు నునిచి శరీరం
బకుటిలగతి నిల్పినఁ దక్కక యది వీరాసనంబు కైవడి యరయ్యేన్.

తా. ఒకతొడమీఁద నొకపాదమును మఱియొకపాదముమీఁదఁ దక్కినతొడ యుఁ జేర్చి శరీర మవక్రముగ నిల్పెనేని వీరాసన మనుట.

స్వస్తికాసనము.

క. పిక్కలతొడలనడుములం, దొక్కటఁ బదతలము నిడి సమున్నతి నొడలిక్
నిక్కించిన నీయాసన, మక్కజముగ స్వస్తికాహ్వయం బగు జగతిన్.

తా. జంఘోరువులనడుమ పాదములఁ జొనిపి శరీరము చక్కఁగ నిక్కించెనేని స్వస్తికాసన మనుట.

పద్మాసనము.

శా. వామాంకంబున దక్షిణాంఘ్రియును దద్వామేతరాంకంబునన్
వామాంఘ్రిన్ ఘటియించి పశ్చిమదిశా వ్యాప్తంబులౌ చేతులన్
నేమంబారఁగఁ గాళ్లయంగుళములం జేకొన్నఁ బద్మాసనం
బా ముక్కుం గొనఁ జూపునుం జుబుకహృద్వ్యాప్తసంగముం గల్గినన్.

తా. ఎడమతొడమీఁద కుడిపాదమును కుడితొడపై నెడమపాదము నునిచి వెనుక ప్రక్కగ కుడిచేత నెడమతొడమీఁదనున్న కుడికాలిపెద్దవ్రేలును ఎడమచేత కుడితొడ మీఁదనున్న యెడమకాలిబొటనవ్రేలును పట్టుకొని రొమ్మున గడ్డముంచి భ్రూమధ్య మందు దృష్టి నిలిపె నేని పద్మాసన మనుట.

మతాంతరపద్మాసనము.

సీ. అది పద్మబంధంబె యగు నైన నుత్తానచరణంబు లూరుసంస్థములుగాఁగ
నూరుమధ్యంబున నుత్తానకరతలద్వయమును రాజదంతములమొదల
హత్తి యుండెడిరసనాగ్రంబుఁ దొంటి భాతిన యున్నచుబుకంబుదృష్టి గలిగి
మారుతం బల్లనఁ బూరించుచుండిన నది పద్మ మగు మతాంతరమునందు
మఱి నిదియుమత్స్యమతము పద్మమునఁ బూర్వ,మట్లయుండుచు సంస్ఫుటహస్తయుగ్మ
మున గుదాకుంచనముఁ జలదనిలపూరి,తము విసర్జనవిధియు ధ్యానమును వలయు.

తా. ఎడమతొడపైని కుడిపాదమును కుడితొడపై నెడమపాదమును వెలికిల నుంచి హస్తములు రెండుతొడలపై వెలికిలనుంచి నాసాగ్రమందు లక్ష్యముంచి దంతమూలమున నాలుక హత్తించి వక్షమందు గడ్డముంచి మెల్లమెల్లఁగ వాయువును పూరించుచుండెనేని మతాంతరపద్మాసన మగును. మఱి మునుపటివలె పద్మాసనమందుండి చుబుకంబు వక్షంబున హత్తించి చిత్తంబునందు ధ్యానముచేయుచు నపానవాయువు నూర్ధ్వముగా రేచించి కుండలిశక్తియుక్తముగ నిలిపి ప్రాణవాయువు విడువఁగా నధికజ్ఞానబోధ గలుగును. దీని చేత నాడీద్వారమందు గాలి నిల్చు. నిట్లు మృతులగువారు ముక్తులగుదు రిదే బద్ధపద్మాసనము. ఇదే ముక్తపద్మాసనము.

యోగాసనము.

క. యోగసటజానుయుగసం,యోగంబునఁ బదతలంబు లుర్వి నిలిపి లో
నీగినకరముల నుండిన, యోగాసన మండ్రు దీని యోగవిధిజ్ఞుల్.

తా. హంసదండము మోకాళ్లక్రింద నుంచికొని పాదముల నేలపై నిలిపి తొడల నడుమ చేతులఁ జొనిపి పిక్కలఁ బట్టుకొని యాత్మావలోకనముఁ జేయుచుండెనేని యోగశాస్త్రవిదులు దీనిని యోగాసన మందురని తాత్పర్యము.

కూర్మాసనము.

క. పీడఁబడినగుల్ఫంబులఁ, గూడఁగ సంధించి పట్టి గుద మలపడఁగాఁ
బీడించినఁ గూర్మాసన, మీడితమతి నెఱుఁగుదురు యమీంద్రులు దీనిన్.

తా. ఆధారమున కుభయపార్శ్వములయందు రెండుకాళ్లమడిమలు హత్తించి నిక్కి చక్కఁగాఁ గూర్చుండెనేని కూర్మాసన మని తాత్పర్యము.

### ఉ త్థా న కూ ర్మా స న ము.

తే. కుక్కుటాసనబంధంబుఁ గూర్చినట్టి, కరయుగంబుల మెల్లనఁ గంధరంబు
బంధనముఁ జేసి వెలికిలఁబడినకూర్మ, మట్లు పడఁగ నుత్థానకూర్మాసనంబు.

తా. కుక్కుటాసనస్థుఁడై యుండి రెండుచేతులఁ గంఠము పట్టుకొని కూర్మమువలె వెలికిలఁబడి యుండెనేని యుత్థానకూర్మాసన మనుట.

### భ ద్రా స న ము.

తే. అండముల క్రింది నెలవులయందు నుభయ,పార్శ్వములు రాయ రెండుగుల్ఫములఁ బెట్టి
పార్ష్ణి పదములఁ గరములఁ బట్టి నిశ్చ,లాత్ముఁడై యుండెనేని భద్రాసనంబు.

తా. అండములకు క్రింది ప్రక్కలయందు చీలమండల నునిచి మడిమల రంటిని రెండుచేతులఁ బట్టి కదలకుండిన భద్రాసన మనుట. ఈయాసనస్థుఁడగువాఁడు సర్వవిషములను వ్యాధులను జయించును.

క. భాసురపద్మాసనసి,ద్ధాసనములు వరములఁట గృహస్థులకుం బ
ద్మాసనమే మేలగు సి,ద్ధాసనము గృహస్థవిరతనాతీతులకున్.

తా. గృహస్థాశ్రమస్థులు పద్మాసనసిద్ధాసనస్థులై యుండుట యుత్తమమైనను గృహస్థులకుఁ బద్మాసనమును దక్షిణయాశ్రమస్థులకు సిద్ధాసనమును మేలనుట.

### సి ద్ధా స న ము.

శా. యోనిస్థానముఁ బార్ష్ణిభాగఘటనాయుక్తి న్నిబంధించుచుం
దాన న్మేఢ్రిముమీఁద నోజ నొకపాదం బూన సిద్ధాసనం
బౌ నం దింద్రియనిగ్రహంబును సుదేహస్థాణుభావంబుయో
గానందైకమనంబు భ్రూయుగళమధ్యాలోకముం గల్గినన్.

తా. ఎడమకాలిమడిమ మూలాధారమందు కుడికాలిమడిమ లింగస్థానమం దుంచి శిరోగ్రీవాభుజములఁ జక్కఁగా నిక్కించి భ్రూమధ్యావలోకనముఁ జేయుచుండిన సిద్ధాసన మగును. దీనిచే నింద్రియనిగ్రహము శరీరపాటవము నిర్మలచిత్తప్రాప్తి గలుగును.

### మ తాం త ర సి ద్ధా స న ము.

క. వెండియును సవ్యగుల్ఫము, దండముపైఁ బెట్టి మీఁద దక్షిణగుల్ఫం
బుండఁగ నవక్రముగఁ గూ,ర్చుండిన సిద్ధాసనంబ యౌఁ బక్షమునన్.

తా. లింగముమీఁద నెడమమడిమ నుంచి దానిపై కుడిమడిమ నుంచి ముందువలె నాసాగ్రము వీక్షించుచుండిన నిది మతాంతరసిద్ధాసన మనుట. దీనిని వజ్రాసన మని ముక్తాసన మని గుల్ఫాసన మని బహువిధములఁ జెప్పుదు రది సకలాసనములలో మేలయినది. ముక్తిద్వారకవాటపాటనపటువైనది.

సింహాసనము.

శా. అండాధస్థలి నూరుపార్శ్వముల సవ్యాసవ్యగుల్ఫద్వయం
బ్రాండొంటి న్గ్రిమహీనభంగి నిడి దోర్యుగ్మాంగుళు ల్జానులం
దుండ న్వ్యప్రసరించి నిక్కి వివృతాస్యుండైన సింహాసనం
బొం డేమిం గనఁబోక నాసికముఁ దా నోలిం బరీక్షింపఁగన్.

తా. అండములక్రిందినెలవులయందు తొడలవెనుకభాగములు సోఁకునట్లు కుడియెడమమడిమల మార్చియుంచి కుడియెడమచేతులవ్రేళ్లను మోఁకాళ్లమీఁద సవ్యంబుగ వెడల్పుగ నుంచి నిక్కి కూర్చుండి నోరుదెఱచికొని భ్రూమధ్యమందలిచిద్బిందువుఁ దిలకించుచున్న సింహాసన మనుట.

కుక్కుటాసనము.

క. జలజాసనంబునం గరములు జానూరువులమధ్యమునఁ జొనిపి ధరణిన్
నిలిపి గగనమున నంగం, బలవడ నిలుపంగఁ గుక్కుటాసన మయ్యెన్.

తా. పద్మాసనమున నుండి మోఁకాళ్లతొడలసందుల చేతులఁ దూర్చి హస్తముల నేల నూని పైకెగసినట్లుండిన కుక్కుటాసన మనుట.

గోముఖాసనము.

క. వామదిశ పృష్ఠపార్శ్వము, ధామముగా దక్షగుల్ఫతలమును నట్ల
వ్వామపుగుల్ఫమునలనిడ, గోముఖ మీయాసనంబు గోముఖభాతిన్.

తా. ఎడమకాలిమడిమ కుడివీఁపుప్రక్కగాను కుడికాలిమడిమ యెడమవీఁపువైపుగాను మోఁకాలిమీఁద మోఁకాలు గదియ నుంచి యొడలు చక్కఁగ నిక్కించి భ్రూమధ్యావలోకనము చేయుచుండెనేని గోముఖాసనం బగును.

ధనురాసనము.

క. మును పాదాంగుష్ఠంబులు, దనచేతులు చెవులు దాఁక ధనువు దివియున
య్యనువున నెడమఁగుడి దివియ, ధనురాసన మండ్రు యోగతత్త్వవిధిజ్ఞుల్.

తా. పాదాంగుష్ఠములరెంటిని రెండుచేతుల ధనురాకృతిగ వీఁపువెనుక చెవులకు సరిగాఁ బట్టి యుండిన ధనురాసనం బగును.

మయూరాసనము.

మహాస్రగ్ధర. ధరణి న్హస్తస్థలంబు ల్దగుల నిలుపుచు న్దండముం బోలెఁ దత్కూ
ర్పరయుగ్మన్యస్తనాభీభవనతలయుఁగోద్భాసియై యున్నతాస్య
స్థిరుఁడై యాకాశదేశస్థితి నిలిచినఁ దా శ్రీమయూరాసనం బా
హరియించు న్రోగదోషాత్యశనవిషసమూహంబుల న్రంహయుక్తిన్.

తా. చేతుల నేల నూని మోఁచేతుల నాభియిరుప్రక్కల నుంచి ముఖము పైకెత్తి కాళ్లు చాఁచి నెమలితోఁకవలె పైకెత్తిన మయూరాసన మగును. దీనిచే నుదరగుల్మాది రోగములు సర్వపాపములు వేగిరముగా నశించును. జఠరాగ్ని ప్రజ్వరిల్లి విషమునైనఁ జీర్ణింపఁజేయును

సీ. ఊర్ధ్వసంస్థితనాభియును నధస్తాలువు నూర్ధ్వభానుఁడు నధోయుక్తశశియు
నూర్ధ్వపాదంబులు నొగి నధశ్శిరమును గలయది విపరీతకరణసంజ్ఞ
గలకపాలాసనక్రమ మయ్యె గురువాక్యమున నిది సిద్ధించు జనుల కెలమి
నిత్యంబు నభ్యాసనిరతున కీకపాలాసనం బఖిలరోగాళిఁ జెఱుచు
జఠరవహ్ని నర్థిలఁజేయు జగతి నట్టి, సాధకునకు నాహారంబు సంగ్రహింపఁ
జను బహుళముగ నల్పభోజనముచేత, ననిలవేగంబు విడిపించు నతనితనువు.

ఈయాసనముఁ బ్రతిదినము యామమాత్ర మభ్యాసము చేయుచుండిన మూఁడు నెలలకుఁ బిదప వలిపలితవిరహితాంగుఁడును మృత్యుంజయుఁడు నగును.

శ్లో. నాభిస్థానే వసేదగ్నిః హృత్స్థానే దివాకరః,
భ్రూమధ్యవసతిశ్చంద్రః చంద్రాగ్రేచ వసేన్మనః.

తా. తలక్రిందుగ నిలిచి భ్రూమధ్యమందలిచిద్బిందువును జూచుచుండెనేని కపాలాసన మనుట.

ముక్తాసనము.

క. పదగుల్ఫంబున గుదముం, గదియంగా నిల్పి యంకగతమై యుండం
బద మొకటి సంఘటించిన, నది ముక్తాసన మవ్రక్ర మగు మే నమరన్.

తా. ఎడమకాలిమడిమచే మూలాధారమును గప్పి కుడియడుగు నెడమతొడమీఁద నునిచిన నది ముక్తాసనమగును.

టిట్టిభాసనము.

క. వెలికిలఁ బాణితలంబులు, దలమీఁదం జేర్చి ధరణితలమున నిలుపం
గలిగెడునట్లుగఁ గరములు, నలపశ్చిమ మెత్తఁ డిట్టిభాసన మయ్యెన్.

తా. పాదములు వెలికిల నుండ శిరస్సుపైఁ గదియించి చేతులతోఁ బూనికగా నిలిచి వెనుకటిభాగమును పైకెత్తఁగాఁ డిట్టిభాసన మగును.

పశ్చిమతానాసనము.

చ. పదముల భూమి దండములభాతిగఁ జాఁచి కరాంగుళంబులన్
బదయుగళాగ్రము ల్బిగియఁబట్టి లలాటము జానుయుగ్మమున్
బదిలముగా ఘటింప నిది పశ్చిమతానము దీన రోగముల్
గదియవు పశ్చిమంబునను గారి యగున్ జఠరాగ్నికార్శ్యముల్.

తా. నేలమీఁద రెండుకాళ్లు చక్కఁగాఁ జాఁచి రెండుకాళ్ల బొటనవ్రేళ్లు రెండు చేతులఁబట్టికొని మోఁకాళ్లమీఁద లలాటం బుంచెనేని పశ్చిమతానాసనము. ఇందున వాయువు పశ్చిమమార్గముగా నడుచుటవలన జఠరాగ్ని ప్రజ్వరిల్లి కడుపు పల్చనై రోగములు నశించును.

పూర్వతానాసనము.

తే. వరుస మీఁగాళ్లు నేల మోవంగ మడిచి, మడిమలును బిఱుఁదులుఁ గూర్చి మస్తకంబు నడుముఁ గరకూర్పరంబుల నదిమి మోఁపి, నడు మెగయ నున్నఁబూర్వతానం బటండ్రు.

తా. కాలివ్రేళ్లు మడిచి భూమిమీఁద నిల్పి మడమలను బిఱుఁదులును జేర్చి శిరస్సునుఁ జేతులతోడ నడుము మోఁచేతులతోడ నదిమి పట్టుకొని నడుము నిక్కించిన పూర్వతానాసన మనుట.

భద్రాసనము.

మ. పదతలము ల్ధరాతలముపైఁ గడు పగ్గల నిల్పి లోతొడల్
గదిసిన జంఘలు న్మతి లలాటము మోఁపిన జానుయుగ్మముల్
త్రికములక యుండుహస్తపరిపీడితజానువు గల్గియుండెనే
నిది యగు భద్రకాసన మహీనసుఖాస్పద మండ్రు సంయములు.

తా. పిఱుఁదులు క్రింద మోఁపినయినను మోఁపకయైనను గొంతుకూర్చుండి మోఁకాళ్లమీఁద శిర ముంచుకొని మోఁకాళ్ళను చేతులతోఁ జుట్టి పట్టుకొనిన భద్రకాసనము. అది యత్యంతసుఖాస్పదమనుట.

కామదహనాసనము.

చ. అవనితలంబుఁ బొందఁగఁ బదాంగుళమూలము లోలి నిల్పి జానువులు నభస్థలంబునన నూల్కొనఁ బార్ష్ణియుగంబు యోనియుక్
దవులఁగ యోగదండఘటనాస్థితిహస్తతలంబు లుండెనే
నవిరళమైన కామదహనాసన మండ్రది యోగతత్పరుల్.

తా. మునివ్రేళ్లు నేలమీఁద నిల్పి మోఁకాళ్లు క్రింద నూనక పిఱుఁదులు మడిమలు నొత్తియున ట్లుండి హంసదండములమీఁద జేతుల నూని నిక్కి భ్రూమధ్యావలోకనము చేయుచున్న యోగశాస్త్రవిదులు కామదహనాసన మని పల్కుదు రనుట.

ప్రాణాయామలక్షణము.

తే. ప్రణవపంచాక్షరష్టాక్షరాదికముల, మాత్రగాఁ జేసి పూరకమాత్రలకును
రెట్టి కుంభకమున నిల్పి రేచకంబు, నాడిశోధనమట్ల చేయంగవలయు.

తే. సోముదెస గాలిఁ గొనుచు సుషుమ్నఁ బట్టి, సూర్యుదెస వీడి క్రమ్మఱసూర్యువలని పింగళంబునఁ గొని పట్టి పిదప నిగుడ, విడువవలయు యథాశక్తి నడుగ కెపుడు.

ఓంకారము పంచాక్షరము అష్టాక్షరము మొదలగుమంత్రములలో ఒక్కమంత్రమును ఒక్కమాత్రగాఁ జేసి పూరకమందు నిర్ణయములగు మాత్రలకంటె రెట్టిగా కుంభకమునందు నిలిపి రేచకమునందు పూరకమందలిమాత్రలలో సగము నిర్ణయించి సుషుమ్నానాడియందలి వింతలఁ జూడవలయును. మఱియు ఎడమముక్కున ప్రాణవాయువును పూరించి సుషుమ్నయందు నిల్పి కుడిముక్కున విడిచి మరల కుడిముక్కున పూరించి సుషుమ్నయందు నిల్పి యెడమముక్కున విడుచుచు నీరీతిన నెల్లప్పుడు యథాశక్తి ప్రాణాయామము చేయుచుండవలయు ననుట॥ ఈ ప్రాణాయామము ప్రాకృతమని వైకృతమని కుంభకమని త్రివిధము. అందు నేఁటిదినమునూర్యోదయము మొదలు రేపటిదినము నూర్యోదయమువఱకు మూలాధారకమలంబున గణపతికి ఆఱునూఱును స్వాధిష్ఠానకమలమున బ్రహ్మకు ఆఱువేలును మణిపూరకకమలంబున విష్ణుదేవునకు ఆఱువేలును అనాహతకమలంబున రుద్రునకు ఆఱువేలును విశుద్ధకమలంబున నీశ్వరునకు సహస్రంబును ఆజ్ఞేయకమలంబున సదాశివునకు సహస్రంబును సహస్రారంబున గురువునకు సహస్రంబును అజపాగాయత్రీమంత్రజపమును సమర్పించుటే ప్రాకృతప్రాణాయామము॥ రేచకపూరకకుంభకములచేత తొలుత అధస్సంచారముగల ప్రాణవాయువునందు ఊర్ధ్వసంచారముగల యపానమును వెనుక అపానమందు ప్రాణమును చేర్చుట వైకృతప్రాణాయామము॥ మూలబంధ ఉడ్యాణబంధ జాలంధర బంధములఁ గావించి రేచకపూరకములను నిలిపి ప్రాణాపానములను రెంటిని రేపగ లొక్కతక్కగ నిలుపుట కుంభకప్రాణాయామము॥ రేచక మనఁగ ప్రాణవాయువును మూలాధారమునుండి బ్రహ్మరంధ్రపర్యంతము సుషుమ్నానాళద్వారముగ నుత్థాపనము చేయుట॥ పూరక మనఁగ బ్రహ్మరంధ్రపర్యంతము రేచించినవాయువును మరల సుషుమ్నానాళద్వారముగ మూలాధారమునఁ జేర్చుట॥ కుంభక మనఁగ రేచించినవాయువును బ్రహ్మరంధ్రమందు మాత్రాసంఖ్యగ నిలుపుట. ఇదే యూర్ధ్వకుంభకము. పూరించినవాయువును మాత్రాసంఖ్యగ మూలాధారమున నిలుపుట అధోకుంభకము.

మూలబంధ మనఁగ ఎడమమడిమచేత గుదస్థానమును బంధించుట ఉడ్యాణబంధ మనఁగ కుడిమడిమచేత బొడ్డును మూయుట. జాలంధరబంధ మనఁగ గడ్డము ఱొమ్మునందుంచుట.

మఱియొకవిధమగు ప్రాణాయామము కుడిముక్కు యిడ, ఇదే సూర్యనాడి, యెడమముక్కు పింగళ, యిదే చంద్రనాడి వీనియందు సంచరించుప్రాణవాయువును బ్రహ్మబీజమైన ప్రణవమందలి అకారఉకారమకారములను మూటిని మూడుమాత్రలనుగాఁ జేసికొని వానిలో అకారముచేత సూర్యనాడిని పండ్రెండుమాత్రలకాలమును మకారముచేత చంద్రనాడిని పదియాఱుమాత్రలకాలమును పూరించి ఉకారముచేత రెండునాడులనుచేర్చి పదిమాత్రలకాలము సుషుమ్నయందు కుంభించి పిదప నశినాళంబుచేత క్రమంబుగా పూ

రించుట ప్రాణాయామము. ఇట్లు బాల్యకౌమార యౌవన వృద్ధ నిష్కళ లనెడు పేళ్ళుగల ప్రాతఃకాలము మధ్యాహ్నకాలము సాయంకాలము అర్ధరాత్రికాలము వీనియందు ప్రతి దినమును ప్రతివేళను ఇరువదిమార్లు తప్పక ప్రాణాయామము చేయుచుండెనేని వాయువు స్థిరపడి వెనుక కేవలకుంభకమునకు మార్గ మగును. ఈప్రాణాయామలక్షణము లనేకవిధము లుగ నుండును గావున గురూపదేశమున తెలిసికొనవలయును.

ప్రత్యాహారలక్షణము.

వర్ణరూప ధ్వనిరూపములైన సకలశబ్దములను వినుట మృదువు కఠినము ఉష్ణము శీతము మొదలగు స్పర్శములను తెలిసికొనుట, పొట్టి పొడుగు లావు సన్నము నలుపు తెలుపు పసుపు ఎఱుపు ఆకుపచ్చ మిశ్రము లని పదివిధములైన రూపములను చూచుట, ఉప్పు పులుసు కారము తీపు చేదు వగరు అనుషడ్రసములను ఎఱుగుట, సుగంధ దుర్గంధ మిశ్ర గంధములను మూరుకొనుట, సుశబ్దములను అపశబ్దములను పలుకుట, ఇచ్చుట పుచ్చుకొనుట లోనగు పనులను చేయుట నడుచుట ఎగురుట పరుగెత్తుట మొదలగుపనులను గావించుట, మలవిసర్జనము చేయుట, సురతాగులచే నానందించుట, సంశయించుట, నిశ్చయించుట, చంచలించుట, అభిమానించుట, అనుగుణములనుండి శ్రోత్రము త్వక్కు చక్షువు జిహ్వ ఘ్రాణము వాక్కు హస్తము పాదము పాయువు గుహ్యము అనెడు పదునాలుగింద్రియములను త్రిప్పుట ప్రత్యాహారము.

ధ్యానలక్షణము.

ధ్యానము సగుణధ్యానము నిర్గుణధ్యానము అని రెండువిధములు అందు హృదయ పద్మమందు తటస్థలక్షణస్వరూపుండైన విరాట్పురుషుని నిలిపి మనస్సుచేత సమస్తవస్తువు లను గల్పించి షోడశోపచారములను జేసి ధ్యానించుటయే సగుణధ్యానము॥ పద్మాసనంబున నుండి శరీరంబునిక్కించి హస్తంబునను తొడలపై నుంచి నేత్రంబులను మూసి స్థూల సూక్ష్మకారణశరీరములను పదునాలుగింద్రియంబులును దశవిధప్రాణంబులును దృశ్య ములు ఆదేహేంద్రియప్రాణంబులు నేఁ గాను. వీనిని వీక్షించుసాక్షిని. సాక్షిని నే ననెడు వృత్తియును దృశ్యమే గనుక ఆవృత్తిని జూచుసాక్షిని అని మాయాకల్పితములై విజాతీయములగు యుష్మత్ప్రతీతిప్రత్యయగోచరాదు లనెడు బహిర్దృశ్యములను సజాతీ యములగు అస్మత్ప్రతీతి ప్రత్యయ గోచరాదు లనెడి యాంతరదృశ్యములను ఆదృశ్యము లను సాక్షి ననెడువృత్తిని నిషేధించుచు సత్యజ్ఞానానందనిర్మలాఖండస్వరూపమై సర్వ దృక్కగు పరబ్రహ్మము తా ననెడు దృఢము గలుగుదాఁక నెల్లప్పుడు నిర్వికల్ప బ్రహ్మ నిష్ఠ గలిగియుండుటే నిర్గుణధ్యానము.

ధారణాలక్షణము.

మూలాధారము స్వాధిష్ఠానము మణిపూరము అనాహతము విశుద్ధము ఆజ్ఞేయము సహస్రారము అనెడు కమలములయందు వానికి నధిదేవతలయిన గణపతి బ్రహ్మవిష్ణు

రుద్రేశ్వర సదాశివగురువులను అక్కడక్కడ ధ్యానించునపుడు మనస్సును నిలుపుటే ధారణ.

సమాధిలక్షణము.

శ్లో. సవికల్పో నిర్వికల్పస్సమాధిర్ద్వివిధా భవేత్
దృశ్యశబ్దానువిద్ధోయం సవికల్పః పునర్ద్విధా.

తా. సమాధి సవికల్ప మని నిర్వికల్పమని ద్వివిధము.అందు సవికల్పకము దృశ్యానువిద్ధసవికల్పక మని శబ్దానువిద్ధసవికల్పక మని యిరుతెఱఁగులు గలది యగును ఈరెండును నిర్వికల్ప మొక్కటియును గూడి మూడువిధము లయ్యెను ఈమూడును బాహ్యాంతరభేదములచేత బాహ్యదృశ్యానువిద్ధసవికల్పకసమాధి యని బాహ్యశబ్దానువిద్ధసవికల్పకసమాధి యని బాహ్యనిర్వికల్పకసమాధి యని అంతరదృశ్యానువిద్ధసవికల్పకసమాధి యని అంతరశబ్దానువిద్ధసవికల్పకసమాధి యని అంతరనిర్వికల్పకసమాధి యని ఆఱువిధములు అందు తనకంటె నన్యములుగ తోఁచెడు బ్రహ్మవిష్ణురుద్రేశ్వర సదాశివాది పిపీలికాంతమగు సమస్తచేతనములును తృణాదిమేరుపర్యంతమగు నచేతనములును తన తెలివియందుఁ బుట్టిగిట్టినవి కాఁబట్టి అవి తన ప్రజ్ఞానకల్పితము లని ఆప్రజ్ఞానమే పరబ్రహ్మ మని ఆపరబ్రహ్మమే తా నని చూచుట బాహ్యదృశ్యానువిద్ధ సవికల్పకసమాధి॥ శివరామగోవిందనారాయణ వాసుదేవమహాదేవాదిసకలనామములలో తనచెవికి వినఁబడిన నామము తాను గా నని విడిచి సర్వనామవిలక్షణ మైన పరబ్రహ్మవస్తువును యోజించుటే బాహ్యశబ్దానువిద్ధసవికల్పకసమాధి॥ కామాదిస్వశక్తిపర్యంతముగల వృత్తులు తనయందుఁ గలిగినప్పుడు వాని నన్నింటిని అప్పుడప్పుడు ఒక్కటొక్కటిని క్రమముగా నేను గానని నిగ్రహించి వీనికన్నిటికిని విలక్షణ మైన పరబ్రహ్మమును భావించుటే అంతరదృశ్యానువిద్ధసవికల్పకసమాధి॥ రాగద్వేషకామక్రోధలోభమోహమదమత్సరేర్ష్యాసూయాదర్పాహంకారాది స్వశక్తిపర్యంత మైన సకలాంతరవస్తునామములను నేను గానని విడిచి సర్వవిలక్షణ మైన పరమాత్మ నూహించుటే అంతరశబ్దానువిద్ధసవికల్పకసమాధి. ఈచతుర్విధసవికల్పకసమాధులయందు సుస్థిరత గలిగి అంతరబాహ్యములయందు తనకు నన్య మేమియు తోఁచక తోఁచినను సముద్రమందు ముంచినకుండలోపల వెలుపల పరిపూర్ణమై ఆకాశమందుంచిన కుండలోపల వెలుపల శూన్య మైన ట్లుండుటే బాహ్యనిర్వికల్పకసమాధి॥ పైనఁ జెప్పినవృత్తు లేవియు లేక అఖండపరిపూర్ణసచ్చిదానందపరబ్రహ్మస్వరూపమై యుండుటే అంతరనిర్వికల్పకసమాధి.

ఆ. ఎదుటఁ గానుపించు నెల్లచిదాభాస, కళలు తనకు వేఱు గానటంచుఁ
దెలియుతెలివి నెపుడుఁ దెలియుట బాహ్యదృ,శ్యానువిద్ధ మనఁగ నలరు వత్స.

క. అంతరమగు ద్విదళంబున, వింతగఁ జూపట్టుకళల వీక్షించుచుఁ దా
సంతస మందుచు నుండుట, యాంతరదృశ్యానువిద్ధ మనఁబడు సుమతీ.

తే. బాహ్యమునఁ బెక్కుగా వినఁబడెడిశబ్ద, తతులఁ దెలిసెడుతెలివియే తానటంచుఁ
దెలిసి యానంద రసమునఁ దేలుచుంట, బాహ్యశబ్దానువిద్ధమై పరఁగు వత్స.

క. అంతర్హృదయనభంబున, సంతత మొగి మ్రోయుప్రణవశబ్దంబుల నా
ద్యంతము వినుతనుఁ దెలియుట, యాంతరశబ్దానువిద్ధ మనఁబడుఁ బుత్రా.

ఆ. బాహ్యదృశ్యశబ్దపటలంబుఁ గనునాత్ముఁ, గనుట బాహ్యనిర్వికల్ప మాంత
రస్థదృశ్యశబ్దరాశిఁ గన్గొనునాత్ముఁ, గనుట లోని నిర్వికల్ప మనఘ.

## పంచదశయోగాంగములవివరణము.

యమము నియమము త్యాగము మౌనము దేశము కాలము ఆసనము మూలబంధము దేహసామ్యము దృక్స్థితి ప్రాణాయామము ప్రత్యాహారము ధ్యానము ధారణ సమాధి అని నిర్గుణయోగాంగములు పదియేను విధములు.

యమలక్షణము:— పంచభూతములు త్రిశరీరములు అనెడు బాహ్యదృశ్యములును చతుర్దశేంద్రియములు దశవిధప్రాణములు అనెడి అంతర్దృశ్యములును పరబ్రహ్మమే యనియును అపరబ్రహ్మమే తా ననియును తలంచి వికల్పము లేకయుండుటే యమము.

నియమలక్షణము:—వర్ణరూప ధ్వనిరూపములైన సర్వశబ్దములను చెవితో వినుచు, మృదువు, కఠినము వేఁడిమి, చల్లన మొదలగుస్పర్శములను, చర్మముచేత గ్రహించుచు, దశవిధరూపములను కంటితోఁ జూచుచు, షడ్రసములను నాలుకచేతఁ దెలిసికొనుచు, సుగంధ, దుర్గంధ, మిశ్రగంధములను, ముక్కుచేత, ఆఘ్రాణించుచు, సుశబ్దాపశబ్దములను నోటఁ బలుకుచు దానప్రతిగ్రహాదిసర్వకార్యములను హస్తములతోఁ జేయుచు,పాదములతో నడుచుచు, నాలుగువర్ణములకు, నాలుగాశ్రమములకు తగినపనుల నెల్లప్పుడు చేయుచు, అంతఃకరణముచేత ఇహపరవిషయముల నూహించుచు తిరుగు నెడల కన్ను చెవి మొదలయినయింద్రియములలో ఈయాయింద్రియములు మాచుట వినుట లోనగువిషయములలో ఈయావిషయము లంటి సదా యుచున్నవి, నేనీయింద్రియములను ఇంద్రియవిషయములను సాక్షినై వీక్షించువాఁడను, సచ్చిదానందస్వరూపుఁడను, త్రిగుణసంబంధములయిన శాంతఘోర మూఢవృత్తులును బ్రాహ్మణత్వాది జాతులును దీర్ఘహ్రస్వస్థూల సూక్ష్మాది రూపములను, శివ రామ గోవింద నారాయణ మహాదేవాదినామములును లేనివాఁడను. అని యెఱిఁగి యెల్లప్పుడుల్లాసంబుతో తన్ను తాను వీక్షింపుచు ఈనేమమును వదలకయుండుటే నియమము.

త్యాగలక్షణము:—నేను ప్రత్యగాత్మస్వరూపుఁడను, శరీరేంద్రియమనఃప్రాణాదులు నేఁ గానని వానియం దభిమానము వదలుటయే త్యాగము.

మౌనలక్షణము:—„యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ" అను శ్రుతిచేత వాక్కువలన ఇట్టిది అట్టిది అని పలుకరాక మనస్సుచేత ఇట్టిది అట్టిది అని

యూహింపరాక వెలుఁగుపరమాత్మ తానై మితముగ సంభాషించుచు సంభాషించినమాట లివి యని జ్ఞప్తియుంచక నిస్సంకల్పుఁడై యెల్లప్పుడు బ్రహ్మానందామృతము ననుభవించుచు నుండుటయే మౌనము.

దేశలక్షణము:—ఆత్మానాత్మజ్ఞానముగల పండితులచేతను గురూపదేశముచేతను తెలిసికొనఁబడునదియై జ్ఞానభూముల నేడింటిని మీఱినదై అంతరింద్రియ జ్ఞానేంద్రియ కర్మేంద్రియ ప్రాణ అవ్యక్తమహదాదులప్రవర్తనములును కామ క్రోధ లోభ మోహ మద మత్సర భయ సుఖదుఃఖజననమరణాదులును ఆధ్యాత్మిక ఆధిభౌతిక ఆధిదైవిక ములనెడు త్రితాపములును కామక్రోధాదిక్షుద్రశత్రువుల బాధలును లేక కాలత్రయ మందుఁగలదై నిర్మలమై అప్రాకృతమై సర్వశ్రేష్ఠమై నిరతిశయానందస్వరూపమై మెఱయుపరబ్రహ్మమే యేకాంతదేశము. ఆస్థలంబున నివసించుభక్తుఁడు జీవన్ముక్తుఁడై ఆనందయుక్తుఁ డగును

కాలలక్షణము:—అఖండమైనకాలమును చిగుళ్లు ఆకులు మొగ్గలు పూలు పిందెలు కాయలు పండ్లు మొదలగువానియుత్పత్తిస్థితిలయములకు సాధనముగ విభాగించుచు పంచకర్తల యుత్పత్తి స్థితిలయములకు ముందును వెనుకను వృద్ధిక్షీణములు లేక ఒక్కటిగాగ వెలుఁగుచు కాలనియమము లేక ప్రకాశిల్లుపరబ్రహ్మమే కాలము. యోగి అకాలస్వరూపము తానై నిమేషాది పంచకర్తల ప్రళయాంతమైన కాలమునకు లోఁబడక మెఱయుచుండును.

ఆసనలక్షణము:—సూక్ష్మశరీరమందుండు ప్రాణవాయుధర్మమగు కదలుట హస్తపాదాదులను చాఁచుట ముడుచుట పరుగెత్తుట యెగురుట గుముకుట మొదలగునవియు స్థూలశరీరధర్మమైన శరీరపీడయును కారణశరీరధర్మమగు బడలిక మందము నిద్ర ఆయాసము మొదలగునవియును బ్రహ్మము తానగుటచేతఁ గలుగవు గావున ఆపరబ్రహ్మము తానై యుండుటే సుఖాసనము.

సిద్ధాసనలక్షణము:—పుట్టుట పెరుగుట తఱుగుట చచ్చుటలు లేక యెల్లప్పుడు నేది ప్రకాశిల్లునో యోగులు అపరోక్షజ్ఞానదృష్టిచేత శోధించి చూచి దేనియం దైక్యమైనతోడనే సకలసిద్ధులు గలవా రగుదురో ఆపరబ్రహ్మమే సిద్ధాసనము.

మూలబంధలక్షణము:—అష్టపాశబంధములకు ముఖ్యకారణమైన మూలప్రకృతిసంబంధము దేనిని సందర్శించినమాత్రమున నే వీడునో ముప్పదియాఱుతత్త్వములకు ఏది కారణమై యున్నదో ఆపరబ్రహ్మమే మూలబంధము.

దేహసామ్యలక్షణము:—సముద్రమున నదులు చేరి యభేదముగ నున్నట్లు బ్రహ్మానందమందు చతుర్దశేంద్రియగుణములగు శబ్దము స్పర్శము మొదలగునవి చేరి ఆనందమయమై యుండుటే దేహసామ్యము.

దృక్స్థితిలక్షణము:—చెవి చర్మము కన్ను నాలుక ముక్కు నోరు హస్తము పాదము గుదము గుహ్యము అనెడు వెలుపలిదశేంద్రియముల వృత్తులైన శబ్దము స్పర్శము రూపము

రసము గంధము వచనము దానము గమనము విసర్జనము ఆనందము అనువాని నెఱుంగునది బాహ్యలక్ష్యము. మనస్సు బుద్ధి చిత్తము అహంకారము అనెడు అంతరింద్రియముల వృత్తులయిన సంశయము నిశ్చయము చంచలము కర్తవ్యము అనువాని నెఱుఁగునది అంతర్లక్ష్యము. వెలుపలి లోపలి యింద్రియముల విషయముల నెఱుఁగునది అంతరబాహ్యమధ్యలక్ష్యము. జ్ఞానేంద్రియమనోవృత్తుల నెఱుఁగునది షణ్ముఖీలక్ష్యము. అంతరబాహ్యమధ్యషణ్ముఖీలక్ష్యముల నెఱుఁగునది శాంభవీలక్ష్యము. ఇది యన్నిలక్ష్యములలో నుత్తమ మయినది. ఆశాంభవీలక్ష్యముచేత సర్వదృక్కగు పరబ్రహ్మమందు దృష్టి నిలిపి వికల్పము లేకయుండుటే దృక్స్థితి.

ప్రాణాయామలక్షణము:—పంచప్రాణములను చతుర్దశేంద్రియములను వానివృత్తులను పరబ్రహ్మ మని ఆపరబ్రహ్మము తా నని భావించుటే ప్రాణాయామము మనస్సునకు వెలుపలఁ గనఁబడెడు ఘటము పటము మొదలగునవి యనెడు నామములును రూపములును లోపలఁ గనఁబడెడు కామము క్రోధము లోభము మొదలగునవి యనెడు నామములును రూపములును మాయాకల్పితములు గనుక అవి తాను గా నని నిషేధించి సచ్చిదానంద పరబ్రహ్మము తా నసెడుభావము నంతరంగమున నిల్పి ఆభావమును తొలఁగనీయక ప్రజ్ఞను పరబ్రహ్మమందు లీనముచేసి యుండుటే ప్రాణాయామము.

ప్రత్యాహారలక్షణము:—పరబ్రహ్మసంబంధముల్లైన సచ్చిదానంద నిత్యనిర్మల శాంతశమదమాద్యనంత కల్యాణగుణములను ప్రకృతి సంబంధములయిన కామ క్రోధ లోభమోహాది దుర్గుణములను పరమాత్మ గా భావించుటే ప్రత్యాహారము.

ధ్యానలక్షణము:—స్థూలసూక్ష్మకారణశరీరములు జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు దశవిధప్రాణములు మనోబుద్ధిచిత్తాహంకారములు మొదలగునవి యనెడు దృశ్యములు నేఁ గాను. వీనిని తెలిసికొనెడుసాక్షిస్వరూపుఁడను. అని యెంచి ఆనిలుకడ తప్పక యుండుటే ధ్యానము.

ధారణాలక్షణము:—కర్తృకరణ కార్యరూపమైన మనస్సు దేనిని సంకల్పించునో దేనిని మాచునో ఆసంకల్పించినది మాచినది పరమాత్మ యనుసంకల్పమును ఆమనస్సునందే స్థిరపఱచుట ధారణాయోగము.

"శ్లో. యద్యత్పశ్యతిచక్షుర్భ్యాం తత్తదాత్మేతి భావయేత్
యద్యత్స్పృశతిహస్తాభ్యాం తత్తదాత్మేతి భావయేత్
యద్యచ్ఛృణోతి కర్ణాభ్యాం తత్తదాత్మేతి భావయేత్."

ఇట్లని కైవల్యోపనిషత్తునందు.

శ్లో. మనసా వచసా దృష్ట్యా గృహ్యతేన్యైరపీంద్రియైః,
అహమేవ న మత్తోన్య దితి బుధ్యధ్వమంజసా.

అని భాగవతమందు.

సమాధిలక్షణము:—జాగ్రత్తు స్వప్నము సుషుప్తి తురీయము అనెడి యవస్థలయందును ఆయవస్థలయందుఁ దోఁచిన సమస్తభోగ భోగసాధన శూన్య సాక్షాత్కారములనెడి సకలమును పరమాత్మయేయని యెల్లప్పుడు దర్శించుట సమాధి.

మ. కర మాయజ్వ సుపుత్రులన్ స్వసములన్ గౌండిన్యగోత్రంబు వి
స్తర మొందం గనె ముప్వుర న్నలువురన్ సంస్తవ్యలౌ స్త్రీల నం
దరయన్ రెండవకాంత సామ్య యయి కామాంబాభిధానంబుచేఁ
బరఁగెన్ శ్రీత్రిపురాంబయో యనఁ బరబ్రహ్మానుసంధానయై. ౨౮

టీ. ఆయజ్వ=ఆశేషాద్రిసోమయాజి, కౌండిన్యగోత్రంబు=కౌండిన్యమహర్షి వంశము, కరము=మిక్కిలి, విస్తరమొందన్=వర్ధిల్లునట్లు, స్వసములన్=తనతో సమానులైన, ముప్వురన్=ముగ్గురైన, సుపుత్రులన్=శ్రేష్ఠులయిన కుమారులను, సంస్తవ్యలు=జనులచేత కొనియాడఁదగినవారు, ఔ స్త్రీలన్=అగునట్టి స్త్రీప్రజలను, కొమార్తెలననుట. నలువురన్=నలుగురుని, కనెన్=కనియెను. అందఱన్=ఆయాఁడుబిడ్డలయందు, అరయన్=విచారింపఁగా, రెండవకాంత=రెండవకన్యక, సామ్యయయి=త్రిగుణసమావస్థగలదై, అనఁగా శుద్ధసత్త్వప్రధానగుణము గలది యాయి యనుట. శ్రీత్రిపురాంబయో యనన్=పూజ్యురాలయిన త్రిపురసుందరియో యనునట్లు, లక్ష్మీపార్వతీసరస్వతీస్వరూపిణియైన దేవి త్రిపురసుందరి యనఁబడును. ఆదేవివలెనే యనుట. పరబ్రహ్మానుసంధానయై-పరబ్రహ్మ=సచ్చిదానందనిత్యపరిపూర్ణస్వరూపుఁడగు పరమశివునియొక్క, అనుసంధానయై=సలక్షణవిలక్షణములచేత ధ్యానించుటగలదై, పరతత్త్వము నెఱిఁగి ధ్యానించునదియై యనుట. కామాంబాభిధానంబుచేన్=కామమ్మ యను నామముచేత, పరఁగెన్=లోకమునఁ బ్రసిద్ధి కెక్కెను.

తా. ఆశేషాద్రిసోమయాజి సుభద్రాసోమిదేవివలన కౌండిన్యమహామునిగోత్రము మిగుల పవిత్రమై వృద్ధిపొందునటులు స్వధర్మములయందును యాగయోగతపోనిష్ఠలయందును వేదశాస్త్రాధ్యయనాదులయందును విధినిషేధప్రాయశ్చిత్తకామ్యములగు శ్రౌతస్మార్తక్రియలయందును తనతో సాటియైన యజ్ఞనారాయణసోమయాజులు రాజేశ్వరసోమయాజులు సుబ్బయపంతులు అనెడు ముగ్గురుకొడుకులను సకలజనులచేత పొగడఁబడుచు పుట్టినయింటికి మెట్టిన యింటికి యశస్సును గలుగఁజేసిన త్రిపురసుందరి కామాంబ ఆదిలక్ష్మి శ్యామలాంబ అనెడు పేళ్లుగల నలుగురు కూఁతులను గనెను. ఆకూఁతులయందు రెండవదియైన కామాంబ శుద్ధసత్త్వగుణముగలిగి పరబ్రహ్మోపాసన చేయుచు శ్రీత్రిపురసుందరియో యనునట్లు లోకమునఁ బ్రసిద్ధి కెక్కెనని తాత్పర్యము.

తే. ఆర్తజనరక్షణుఁడు కనుపర్తివేంక
యాభిధానప్రధాని కామాంబ యనెడు
ధీయుతను బెండ్లియై కీర్తిఁ దేజరిల్లి
సుతుల నిరువుర సుజనసమ్మతులఁ గనియె. ౨౫

టీ. ఆర్తజనరక్షణుఁడు-ఆర్త = ఆధివ్యాధిదారిద్ర్యాదులచేత పీడితులైన, జన= ప్రజలను, రక్షణుఁడు=పోషించువాఁడైన, కనుపర్తి...ప్రధాని-కనుపర్తి=కనుపర్తియ నెడు గ్రామనామమే గృహనామముగాఁగల, వేంకయాభిధానప్రధాని=వేంకటనృసిం హమంత్రికి జ్యేష్ఠపుత్రుఁడగు వెంకయప్రెగ్గడ, కామాంబయనెడు, ధీయుతన్=శేషాద్రి సోమయాజి రెండవకూఁతురును విజ్ఞానసంపన్నురాలునునైన కామమ్మయనునామెను, పెం డ్లియై=వివాహముచేసికొన్నవాఁడై, కీర్తిన్=యశస్సుచేత, తేజరిల్లి=ప్రకాశించి, సుజ నసమ్మతులన్-సుజన=జ్ఞానవిజ్ఞానసంపన్నులయిన పండితులకు, సమ్మతులన్=ఇష్టులైనట్టి, ఇరువురన్=ఇద్దఱయిన, సుతులన్=పుత్రులను, కనియెన్=పొందెను.

తా. ఆధులు వ్యాధులు దారిద్ర్యము మొదలగువానిచేత బాధింపఁబడెడు బీదలను ఆదరించు స్వభావముగల వెంకయప్రెగ్గడ మహాబుద్ధిశాలినియైన కామమ్మను పెండ్లియాడి యామెవలన సజ్జనప్రియులగు నిద్దఱుకొడుకులఁ బడసె నని తాత్పర్యము.

క. ఆయిరువురిలో నరసయ
నాయనుసంభవుఁడు ధర్మనయగుణధైర్య
శ్రీయుతుఁ డఖిలజనచయ స
హాయుఁ డగుచు వెలసెఁ బ్రజ్ఞ నతిముద మొదవన్. ౨౬

టీ. ఆయిరువురిలోన్=ఆకనుపర్తివెంకయప్రెగ్గడ కామాంబయందుఁ గనినపుత్రు లిద్దఱిలో, నరసయ=నరసయప్రధాని, నాయనుసంభవుఁడు=నాతమ్ముఁడును,ధర్మ... తుఁడు-ధర్మ=సర్వశాస్త్రమోచితసత్కర్మాచరణములతోడను, నయ=నీతిశాస్త్రపద్ధతి మీఱని నడవడికతోడను, గుణ=శాంతశమదమాదికళ్యాణగుణములతోడను, ధైర్య=పరకా ర్యనిర్వాహకబుద్ధినిశ్చలతతోడను, శ్రీ=సంపదలతోడను, యుతుఁడు=కూడినవాఁడును, అఖిలజనచయసహాయుఁడు-అఖిల=సమస్తులైన, జన=బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రా దిజనులయొక్క, లేక చెవిటి గ్రుడ్డి మూఁగ కుంటి యతి బ్రహ్మచారి అవధూత దరిద్ర కవి గాయక పాఠకాదిజనులు-వీరియొక్క, చయ=సంఘమునకు, సహాయుఁడు = శరీర వాగ్ధనవస్త్రాన్నపానాదులచేత సాహాయ్యము చేయువాఁడును, అగుచున్ = అయి, ప్రజ్ఞన్=పరబ్రహ్మవిషయక జ్ఞానముచేత, అతిముదము=అష్టవిధానందములలో మేలయిన నిజానందము, ఒదవన్=కలుగఁగా, వెలసెన్=లోకమున ప్రసిద్ధికెక్కెను.

తా. అకనుపత్నిపెంకయప్రెగ్గడ కామాంబవలనఁ గన్నకొడుకు లిద్దఱియందు నర సయప్రధాని నాకు సహోదరుఁ డయి తనవర్ణమునకు ఆశ్రమమునకు తగినయాచారము లును నీతిశాస్త్రము ననుసరించిన నడవడికయును శాంతము శమము దమము జీవకారుణ్య ము గురుదేవతాభక్తి పరకార్యనిర్వాహకశక్తి మొదలగు మంచిగుణములును ధన ధాన్య పశు పుత్ర పుత్రీ ప్రముఖసంపదలును గలిగి యెల్లజనులకు ధన ధాన్య వస్త్ర పశు వాక్శ రీరసహాయాదులచేత నుల్లాసము పుట్టించుచు పరబ్రహ్మనిష్ఠచేత నిజానందంబు పొందుచు లోకమున ప్రసిద్ధిఁ జెందె నని తాత్పర్యము.

క. వేంకటరామయ యనునా
మాంకితుఁడను హరిహరేశ్వరారాధన స
త్కైంకర్యపరుఁడ సర్వవ
శంకరుఁడ యథార్థవాదజనసమ్మతుఁడన్. ౭౭

టీ. వేంకటరామయ=వేంకటరామయ్య, అనునామాంకితుఁడన్=అనెడు పేరుచేత గుఱుతుగలవాఁడను, హరి...పరుఁడన్-హరిహరేశ్వర=విష్ణు శివులకు పరుఁడయిన సగుణ పరబ్రహ్మముయొక్క, ఆరాధన = చతుష్షష్ఠ్యుపచారములయందును, సత్=సత్పురుషుల యొక్క, కైంకర్య=స్థానాంగభావాత్మము లనెడుచతుర్విధశుశ్రూషలయందును, పరుఁ డన్=ఆసక్తిగలవాఁడను, సర్వవశంకరుఁడన్=సమస్తజనులును స్వాధీనముగఁ గలవాఁ డను, ఎల్లజనులకు విధేయుఁడ ననుట. యథా...తుఁడన్-యథార్థ=సత్యమగుపరబ్రహ్మ మును, వాద=ప్రతివాదించునట్టి, జన=బ్రహ్మవేత్తలయొక్క, సమ్మతుఁడన్=అభిప్రా యానుసారముగ ప్రవర్తించువాఁడను.

తా. వేంకటరామయ్య యనెడుపేరుగలవాఁడను, కేశవశివులకు పరుఁడయిన సగు ణబ్రహ్మమును పూజించువాఁడను, సత్పురుషులకు శుశ్రూషలు చేయువాఁడను, ఎల్లజను లకు స్వాధీనమయినవాఁడను, అద్వైతమతస్థుఁడను అని తాత్పర్యము.

చతుర్విధశుశ్రూషలక్షణము:—గురువులయొక్క యిండ్లు తోఁటలు తోఁపులు భూములు పశువులు ధనములు ధాన్యములు లోనైనవానిని రక్షించుట స్థానశుశ్రూష. గురువునకు అభ్యంగనస్నానము పాదసంవాహనము మొదలగువానిఁ జేయుట అంగశు శ్రూష. గురుఁడే తల్లి తండ్రి చుట్టము స్నేహితుఁడు విద్య ధనము దాత దైవము రక్ష కుఁ డని తలచుట భావశుశ్రూష. గురువున కిష్టములగు పదార్థములు అడుగకమునుపే సంతుష్టితో ఇష్టిగఁ దెచ్చి యిచ్చుట యాత్మశుశ్రూష.

వ. అగు నేను.

టీ. అగునేను, అగు=పైఁజెప్పఁబడిన ప్రవర్తనముగలవాఁడ నయినట్టి, నేను= తల్లిదండ్రులగు కామాంబ వెంకయప్రెగ్గడలచేత వేంకటరామయ యని పూర్ణపట్టాభి

షేకదీక్షయందు చిదానందనాథగురువులచేత విద్యానందనాథుఁ డని నామకరణము చేయఁబడిన నేను.

## షష్ఠ్యంతములు.

క. శ్రీశివకామికి స్వర్ణా, కాశసభానాయకికిఁ బ్రకాశవిమర్శా
ఖ్యాశావసనానందా, వేశికి శ్రీచక్రనగరవిభవేశ్వరికిన్. ౨౮

టీ. శ్రీశివకామికిన్ - శ్రీ = అణిమ, మహిమ, లఘిమ, ఈశత్వము, వశిత్వము, ప్రాకామ్యము, భుక్తి, ఇచ్ఛ, ప్రాప్తి, సర్వకామసిద్ధి అని పదివిధములైన ఐశ్వర్యములతోఁ గూడిన, శివకామికిన్ = స్వయంప్రకాశుఁడై, యోగులచేత కోరఁబడుచున్న పరమశివుఁడే నాయకుఁడుగాఁగలదానికి, స్వర్ణాకాశసభానాయకికిన్ - స్వర్ణాకాశ = చిదంబరమహాక్షేత్రమందలి, సభా = దేవ, రాజ, నటన, చిత్సభలలో మేలైన కనకసభకు, నాయకికిన్ = కర్త్రియైనదానికిని, అనఁగా పరమశివునికంటిమంటలచేత భస్మంబైనమన్మథుని గూర్చి విలపించుచున్న రతిదేవిని బ్రహ్మవిష్ణువులు చూచి జాలినొంది యూరడించి మన్మథుని బ్రతికింప నెంచి ఆతనిభస్మంబు ప్రోగుఁ గావించి మంత్రించుచుండ అందు భండాసురుండను రక్కసుఁ డొక్కఁడు పుట్టి అప్రతిమపరాక్రమంబుతో జగంబు లాక్రమించి లోకుల వ్యాకులపెట్టుచు సకలప్రాణులవీర్యంబు భక్షింపఁగా ప్రాణు లెల్ల నిర్వీర్యులయి కుందుచుండిరి. అప్పుడు వేల్పులు మహేశ్వరునిపాలి కేగి భండాసురుని దుండగంబు లన్నియు విన్నవించి వానిని ద్రుంపు మని ప్రార్థింపఁగా అతఁడు దేవతలు లోనగు సమస్తప్రాణులను సమిధలు నెయ్యి మొదలగువానిగఁ జేసి సర్వసంహారయాగంబు గావించి యాగపరిపూర్తియందు మహానందముతో నాట్యము చేయుచుండఁగా ఆయాగహోమకుండమందు చిచ్ఛక్తి పుట్టి ఫాలాక్షుని వీక్షించి ఆతనికటాక్షముచేత అక్షయంబైన అనంతశక్తిగలదై భండాసురుని వధించి మన్మథబ్రహ్మేంద్రాది సర్వప్రాణులను మరల సృజించి వారు తన్నుఁ గొలువ మిన్నయగు సంతుష్టితో కనకసభయందుఁ గూర్చుండి నిటలాక్షుని యానందనటనమును జూచుచు ఆసభకు నాయకిగా నుండె నని దేవీభాగవత దేవీపురాణ బ్రహ్మాండమార్కండేయాదిపురాణములయందు, ప్రకాశ . . . వేశికిన్ - ప్రకాశ = ప్రకాశపదమనెడు, విమర్శ = విమర్శపదమనెడు, ఆఖ్య = పేళ్ళచేత చెప్పఁదగిన, ఆశావసన = దిక్కులే వస్త్రముగాఁగల పరమశివునియొక్క, ఆనంద = నిత్యనిరుపాధికనిరతిశయానందమందు, ఆవేశికిన్ = ప్రవేశించియుండుదానికిని, అనఁగా ప్రకాశాత్మకపద మని విమర్శాత్మకపద మని మంత్రశాస్త్రమందు రెండుపదములు గలవు. అవి రెండును రెండుమంత్రములు. మఱి అహంశబ్దమందలి అకారమే ప్రకాశాత్మకపద... రూపము. హకారమే విమర్శాత్మకపద మంత్రార్థకలాస్వరూపము... అహంశబ్దము. ఈశబ్దలక్ష్యార్థస్వరూపమే పరమశివుఁడు. అట్టిపరమశివునియానంద మను

భవించునది యని అర్థము. ౹౹శ్లో. అకారస్సర్వవర్ణాగ్ర్యః ప్రకాశః పరమశ్శివః, హకారోంత్యకలారూపో విమర్శాఖ్యః ప్రకీర్తితః, అనయోస్సామరస్యం యత్పరస్మిన్నహ మితి స్ఫుటమ్౹౹ అని యోగినీహృదయవ్యాఖ్యానమందు.—౹౹శ్లో. అకారో మంగళార్థస్స్యాదర్ధకారో ధర్మదాయకః, తస్మాచ్ఛ్రేష్ఠతరం ప్రోక్తో మునిభిర్బ్రహ్మవాదిభిః౹౹ అని వామకేశ్వరమహాతంత్రమందు.—౹౹అహమహమితి జ్ఞానం తదేవ స్వరూపకమ్౹౹ అని శాక్తసూత్రభాష్యమందు —శ్రీచక్ర...రికే-శ్రీచక్ర=శ్రీచక్రరూపమైన, నగర=పట్టణమందలి, విభవ=ఐశ్వర్యములకు, ఈశ్వరికే=దొరసానియైనదానికిని.

తా. అణిమ మహిమ లఘిమ ఈశత్వము వశిత్వము ప్రాకామ్యము భుక్తి ఇచ్ఛ ప్రాప్తి సర్వకామసిద్ధి యనెడి యైశ్వర్యములు గలిగి తనంతట తాను వెలుఁగుచు పరమ యోగులచేత నారాధింపఁగోరఁబడు పరమశివుని పట్టపుదేవియైనదానికి, చిదంబరమహాక్షేత్రమందుఁగల దేవసభ రాజసభ నటనసభ చిత్సభలకంటె నేటయిన కనకసభకు దొరసానియైనదానికిని, ప్రకాశపదవిమర్శపదములే యాకృతిగాఁగల పరమశివానందమును పొంది యుండుదానికిని, శ్రీచక్రపురమందలి మహదైశ్వర్యములను పరిపాలించుదానికిని అని తాత్పర్యము.

శ్రీచక్రనగరవివరణము.

సర్వలోకాధారమై సువర్ణమయమై మణిమయములయిన చఱియలుగలదై వేలుపుల కెల్ల నిల్లయి వేయిశిఖరములు గలిగి వెలిఁగెడు మేరుపర్వతపు తూర్పుశిఖరమున బ్రహ్మపట్టణమును నిర్ఋతిశిఖరమున విష్ణుపట్టణమును వాయుశిఖరమున రుద్రపట్టణమును గలవు. ఈమూఁడువీడులకు నడుమను రత్నకాంతులచేత దిక్కులను విదిక్కులను వెలుఁగఁజేసెడు నన్నూఱామడపొడుగుగల శిఖరముమీఁద విశ్వకర్మనిర్మితమై ఒక్కటికంటె నొక్కటి మిక్కిలి పొడుగులయి నడుమనడుమ ఏడామడల వెడలుపు గలదైన యిరువది యయిదు కోటలును తొమ్మిదిచక్రంబులును గలిగి నలుచదరమై సర్వలోకమనోహరమై బ్రహ్మాది సకలదేవతావందనీయమై యోగిజనానందకందమై శ్రీచక్రపురము కరము మెఱయుచుండును.

అవీటి మొదటిదైన యినుపకోట: వేయిన్నియాఱునూఱామడల నిడివియును అంతియవెడలుపును గలిగి మిన్నొరయుచున్న ఱెక్కలుబులుఁ గోపురంబులు బురుజాలుఁ మొదలగునవి గలిగి కన్నులపండువై యుండును.

రెండవదియైన యుక్కుకోట: పెక్కులయిన గంటలమ్రోఁతలుఁ మింట నంతట తళతళయను చాయలు చీఁకట్లను చిట్లింప మెఱయుచుండును దీనికి మొదటికోటకు నడుమ నుండుస్థలమందు కాచి పూచి పండి నిండి యుండెడియొల్లమ్రాఁకులయు మ్రాఁకుల ప్రోకలయందు అల్లిబిల్లిగ అల్లికొన్న దాఁకలు ఏలకులు లోనగువానితీఁగెలయు పూవు

గుత్తులనుండి పడియుతేనెల సోనలం ద్రాగి మూగి వీగి జుమ్మని మ్రోయుతుమ్మెదకదుపులును కోకిలలు చిలుకలు నెమళ్లు గోరవంకలు మొదలగు పులుఁగులరొదలును వలపులకు నాలవాలంబులగు మలయానిలంబులు బంగారుతామరలు కలువలు నీటికోళ్లు హంసలు కొంగలు మొదలగు జలపక్షులును తియ్యనితేటనీళ్లుగల కోనేళ్లును గలిగి యొప్పు సింగారపుఁదోఁటలును స్వర్ణరత్నమయంబులై బహువిధంబులైనగృహంబులును పెక్కులు గలిగి యుండును అందు నీలమణి కాంతుల తృణీకరించు దేహంబుగల మహాకాలుఁడనువాఁడు కాళియనెడుతనసుందరినిఁగూడి త్రిపురసుందరినిఁ బూజించుచు విజ్ఞానవంతుండై మహదైశ్వర్యవంతుండై మహాభోగయుక్తుండై దుఃఖవిముక్తుండై సంచరించుచుండును.

మూఁడవదియగు రాగికోట: సకలదేవతామునిసంఘనేత్రానందపాత్రంబై సుజనస్తోత్రచరిత్రంబై యొప్పును. దీనికిని రెండవకోటకును నడుమ నుండెడిస్థలము మణిమయములైన చిగుళ్లు రెమ్మలు కొమ్మలు పూవులు కాయలు పండ్లు గలకల్పవృక్షముల చాళ్లతోఁగూడిన యుద్యానవనములును మనోహరంబులైన ఏళ్లును కొలఁకులును పక్షులును ఏడంతస్తులుగల యిండ్లును మొదలగునవిగలిగి భాసిల్లుచుండును. అందు స్వరూపంబులతో నుండెడిచైత్రవైశాఖమాసముల సిరులనెడి యిద్దఱుముద్దరాండ్రతోఁగూడి త్రిపురసుందరి నర్చించుచు జ్ఞానవిజ్ఞానభోగభాగ్యారోగ్యపుత్రసంపదలుగలిగి వసంతుఁడనెడు పురుషుఁడు మెలఁగుచుండును.

నాలుగవదియైన తగరపుకోట: మొల్లంబై తెల్లనికాంతులచేత మిన్నెల్ల వెలుంగఁజేయుచు మింటినంటిన శిఖరసమూహంబులుగలిగి నెలయును. దీనికిని మూఁడవకోటకును నడుమనుండెడి నెలవునందు పరిమళంబులను వెదచల్లుపిల్లగాడుపులను సంతానమనెడు కల్పవృక్షంబులతోఁటలును మొదలగునవి గలిగియుండును అందు భాస్కరుని తిరస్కరించు తేజస్సును ఇంద్రసంపదను క్రిందుపఱుపఁజాలిన యైశ్వర్యమును రాజరాజేశ్వరీచరణకమలభక్తియును గలిగి నిజరూపములఁ దాల్చిన జ్యేష్ఠాషాఢమాసములకలుములనెడు నెలతలతోఁగూడి గ్రీష్మర్తువనెడి పురుషుఁడు విహరించుచుండును.

ఐదవదియైన పిత్తళికోట: వియత్తలమునెల్ల మెఱయించుచు ఉన్నతములై చెన్నగుచున్న శిఖరంబులును రంగారుబంగారుటెక్కెంబులును గలిగి వెలుఁగును. దీనికిని నాల్గవకోటకును నడుమనుండు పుడమి గుబురుకొని జబురుగ నుండు హరిచందనమనెడు కల్పవృక్షములతోఁటలు పద్మాకరములైన పద్మాకరములు నడబావులు మొదలైనవి గలిగి విలసిల్లుచునుండును. అందు స్వరూపముల ధరించి యుండు శ్రావణభాద్రపదములసంపదలనెడి చేడియలతోఁగూడి త్రిపురసుందరిని పూజించుచు వర్షర్తువను పురుషుఁడు క్రీడించును.

ఆఱవదియైన పంచలోహపుకోట: రత్నఖచితంబులగు శిఖరంబును కెక్కడంబు లును కుందనంపుబొమ్మలును గలిగి సర్వలోకసుందరంబై యుండును. దీనికిని ఐదవప్రాకారమునకును మధ్యమమున నుండుభూమి యెల్లప్పుడును వికసించినపుష్పములతోఁ గూడిన మందారము లనెడికల్పవృక్షములుగల వనములు, పరిమళమిళితంబులైన మందమారుతంబులు లోనగునవి గలిగి రమణీయమై యొప్పును. అందు నిజరూపంబులఁ బూనిన, ఆశ్వయుజకార్తికమాసముల శ్రీలనెడిపడఁతులతోడ, శరదృతు వనెడుపురుషుఁడు సంతతము లోకమాతయగు త్రిపురాంబ నర్చింపుచు సంతుష్టితో నిష్టభోగంబు లనుభవింపుచు నుండును.

ఏడవదియైన వెండికోట: తనకాంతులచేత నెగంతముల నెల్లఁ దెల్లగఁ జేయుచు లెక్కలకు నెక్కుడైయైన శృంగసంగము గలిగి వెలుఁగును. దీనికిని ఆఱవప్రాకారమునకును మధ్యనుండు ప్రదేశము మిన్నంటిన వృక్షశాఖలుగల పారిజాతములనెడు కల్పవృక్షములును, అవ్యక్తమధురధ్వనులఁ జేయు కోయిలలు లోనైన పక్షులగుంపులును, సుందరమందిరములును మొదలైనవి గలిగి యొప్పును. అందు స్వరూపముల ధరించిన మార్గశీర్ష పుష్యమాససంపద లనెడు స్త్రీలతోడ త్రిపురసుందరిని బూజించుచు సర్వైశ్వర్యములు గలిగి కంతునకు సామంతుడైన హేమంతఋతు వనెడు పురుషుఁడు వసించును.

ఎనిమిదవదియైన బంగారుప్రాకారము: మిన్నొరయుచున్న రత్నంపుగోపురంబులును, మణులబొమ్మలును, బంగరుకెక్కడంబులును లోనగునవి గలిగి వన్నెకెక్కుచుండును దీనికిని ఏడవప్రాకారమునకును మధ్యనుండు స్థలము, కదంబవనములును, పుష్పవల్లితిప్పలును, పూఁదేనెకాలువలును, సుగంధసమేతంబులై చల్లని నీటితుంపురులతోఁ గూడిన మందమారుతంబులును, మనోహరంబులగు మందిరంబులును లోనగునవి గలదగును. అందు మాఘఫాల్గునమాసముల సిరులనెడుస్త్రీలతోడ త్రిపురసుందరీదేవి నర్చించుచు సమస్తసంపదలతో శిశిరఋతు వనెడుపురుషుఁడు వసించును. ఆకదంబవనమందు సప్తప్రాకారములు గలిగి, త్రిపురసుందరీదేవిమంత్రిణియైన శ్యామలాంబికగృహ ముండును. దీనియందు బంగారుమెట్లుగల మాణిక్యమంటపమం దుండెడి రత్నసింహాసనముమీఁద బిందువును మూఁడుకోణములును, ఐదుకోణములును, ఎనిమిదికోణములును, పదునాలుగుదళములును, నాలుగుదళములును, భూపురత్రయమును, ఆకోణములయందు అఱువదియేని మిదియక్షరములును గల చక్రము రాణించుచుండును. ఆచక్రమందు కుసుంబారంగు గలిగి సరిగంచులమించు దివ్యవస్త్రమును, కుంకుమపుష్పదివ్యగంధంబును, కదంబప్రముఖ దివ్యపుష్పహారంబులను, రత్నఖచితదివ్యభూషణంబులను ధరించి శిరస్సునందు దాల్చిన బాలచంద్రరేఖ నుసుట నాణిముత్యాలచేర్పుక్కరంగులను ధిక్కరింప ఎడమబుజంబుపై నొఱిగినకస్తురికొప్పును, నగుమొగంబున దిద్దినకస్తురిబొట్టును, చీఁకటిమూఁకలచాయ నెక్క

సక్కెంబులాడెడి రామచిలుకలను బెదరింప తాంబూలరసంబున నెఱ్ఱవాఱిన పెదవివాలు దొండపండును దిరస్కరింప ఈడిగంపుచేడియలు ఇరుగడల నిలిచి సురటులు వీవనలు వీవ చిఱునవ్వువెన్నెలలు చెన్నలరుచెక్కిళ్ళపై చిందులు ద్రొక్క ఒక్కచేత చిలుకను, వేఱొక్కచేత కమలంబును బూని చెవులపైఁ దాల్చినకలువపూవులయందలి కొదమతుమ్మెదలరొదలు శ్రుతుల ననుసరింప అంగుళంబులంగులు దంతపుమెట్లపై నీలమణికాంతుల యట్లు మెఱయ వీణె గోట మీటుచు, తనయేలికసానియగు త్రిపురసుందరీదేవిపై గద్యపద్యకీర్తనంబుల నతిహృద్యంబుగఁ బాడుచు నాదానుసంధానంబునం జొక్కుచు భక్తిపారవశ్యంబున మ్రొక్కుచు సంగీతమాతృకయగు శ్యామలాదేవి వసించును.

తొమ్మిదవదియైన పుష్యరాగప్రాకారము: మిన్నెల్ల బంగారునీరుపూసినతెఱంగున వెలుంగఁజేయుచు మణులబొమ్మలును, మిక్కుటంబులైన బంగరుటెక్కెంబులును, మణిగోపురంబులును, బురుజులును లోనగునవి గలిగి వెలుఁగును. దీనికి నెనిమిదవప్రాకారమునకును నడుమనుండు పుష్యరాగమణిమయమగు ధరణిమీఁద రాజరాజేశ్వరిని ధ్యానించుచు సిద్ధులు వసింతురు.

పదియవదియగు పద్మరాగమణికోట: దిక్కులన్నియు జ్వలింపఁజేయుచు రమణీయంబులగు మణిమయంబులైన ధ్వజంబులు, కాంచనపాంచాలికలు గోపురంబులు గృహంబులు తోరణంబులు లోనైనవి గలిగి రాజిల్లుచుండును దీనికిని తొమ్మిదవయావరణమునకును నడుమనుండు పద్మరాగమణిమయంబగు ధరణిమీఁద చక్రేశ్వరిని పూజించుచు మహానందముతో చారణు లుందురు.

పదునొకండవదియగు గోమేధికమణియావరణము: లోకరమణీయములైన మణిగోపురంబులు మందిరంబులు లోనగునవి గలిగియుండును. దీనికిని పదియవప్రాకారమునకును మధ్యమున నుండు గోమేధికమణిమయంబైన భూమియందు యోగినీబృందముతోడఁ గూడి సంకర్షిణియగు త్రిపురసుందరిని ఆరాధించుచు వటుకదేవతాసంఘాతము వసించును.

పండ్రెండవది యైన వజ్రరత్నప్రాకారము: మిన్నగలించుచున్న సువర్ణగోపురంబులు, టెక్కెంబులు మొదలగునవి గలిగి విలసిల్లుచుండును. దీనికిని పదునొకండవయావరణమునకును, నడుమ నుండువజ్రమయమైననేల తోఁటలు, తోఁపులు, బావులు, తటాకములు, మణిగృహంబులు లోనగునవి గలిగి రంజిల్లుచుండును. అందు రంభ, మేనక, ఊర్వశి మొదలైన అచ్చరమచ్చెకంటులు లోకేశ్వరి యయినరాజరాజేశ్వరిని అర్చించుచు ప్రమోదముతో నుందురు.

పదుమూఁడవదియైన వైడూర్యప్రాకారము: తనకాంతులను దిక్కులయందు వెదఁజల్లుచు వైడూర్యమణిగోపురంబులు మొదలగునవి గలిగి భాసిల్లును. దీనికిని పండ్రెండవయావరణమునకును మధ్యమందుండు భూమి, శృంగారవనంబులు, మణిమందిరంబులు

మొదలైనవి గలిగి రంజిల్లును. అందు పరదేవత నుపాసించుచు అనంత, వాసుకి, తక్షక, కర్కోటక, శంఖ, కులిక, పద్మ, మహాపద్మ ప్రముఖసర్పములును, బలిచక్రవర్తి మొదలైన దనుజులును వాసము చేయుదురు.

పదునాలుగవది యైన యింద్రనీలమణిప్రాకారము: అంతరిక్షంబు నెల్ల నల్లగఁ జేయుచు రత్నగోపురంబులు, తోరణంబులు, మందిరంబులు, పతాకలు, కనకపుబొమ్మలు మొదలగునవి గలిగి వెలుఁగును. దీనికిని పదుమూఁడవ ప్రాకారమునకును, నడుమనుండు స్థలము, నీలంపు మెట్లు గలకోనేరులు, నడబావులు, గృహంబులు, మండపంబులు మొదలగునవి గలిగి యొప్పును. అందు, మను, మాంధాతృ, భగీరథ, గయ, శశిబిందు, పృథు, భరత, ప్రముఖరాజులు పరదేవికి నమస్కరించుచుందురు.

పదియైదవదియైన ముత్తెముల ప్రాకారము: తనవెల్లనిచాయలచేత మిన్నెల్ల తెల్లగఁ జేయుచు పుత్తళిబొమ్మలు, మణితోరణంబులు, గోపురంబులు, టెక్కెంబులు మొదలైనవిగలిగి మెఱయుచుండును. దీనికిని పదునాలుగవ ప్రాకారమునకును, నడిమిచోటు మనోహరంబులయి బహువిధంబులయినయిండ్లు, తోఁటలు, ఆదిగాఁగలవి గలిగి విలసిల్లును. అందు తూర్పుదిక్కున దేవేంద్రుండు ఐరావతంబు నెక్కి వజ్రాయుధంబు చేతఁబూని, శచీదేవితోఁగూడి రాజరాజేశ్వరి నారాధించుచునుండును. ఆదిక్కుమూలను, హవ్యకవ్యవాహుఁడైన అగ్నిదేవుఁడు తగరు నెక్కి స్రుక్కును, స్రువంబును, విసనకఱ్ఱను, అన్నపాత్రంబును, శక్త్యాయుధంబును, చిల్లకోలను ధరించి, స్వాహా స్వధ అనెడు భార్యలతోఁ గూడి, త్రిపురసుందరి నర్చింగుచుండును. దక్షిణపుదిక్కున, యముఁడు మహిషంబు నెక్కి దండాయుధంబు చేఁబూని, శ్యామలాదేవితోఁగూడి త్రిపురాంబను పూజించుచు వసించును. ఆదిక్కుమూలను నిర్ఋతి నరుని నెక్కి, బల్లెంబును, ఇనుపకఱ్ఱను, ఖడ్గమును, ఖేటమును ధరించి దీర్ఘాదేవీసమేతుండై, త్రిపురాదేవిని ఆరాధించుచుండును. పశ్చిమదిక్కున వరుణుండు మకరంబు నెక్కి అల్లెత్రాడు కరంబునం దాల్చి కాళియను భార్యతోఁగూడి, త్రిపురాంబ నర్చించుచు వాసముచేయుచుండును. పడమటిదిక్కుమూలను, వాయుదేవుఁడు జింక నెక్కి ధ్వజాయుధంబు పూని అంజనాదేవీసమేతుండై గోరక్షప్రముఖయోగులు గొలువ నుండును. ఉత్తరఁపుదిక్కున కుబేరుఁడు హయంబు నెక్కి ఖడ్గంబు దాల్చి చిత్రరేఖతోఁగూడి మాణిభద్ర ప్రముఖయక్షులు గొలువ, మహాత్రిపురసుందరి నర్చించుచు వసించును. ఉత్తరపుదిక్కుమూలను రుద్రుండు వృషభంబు నెక్కి, త్రిశూలాదిదివ్యాయుధంబులు ధరించి పార్వతీదేవితోఁగూడి త్రిపురసుందరీసేవాపరుండై యుండును.

పదియాఱవదియైన గరుడపచ్చలకోట: గోపురంబులు మొదలగునవి గలిగి రమణీయమై యుండును. దీనికిని పదియైదవకోటకును నడుమనుండు ఆకుపచ్చరంగుగల ప్రదేశము

బంగారుతాటియడవులు, తోఁటలు, తోఁపులు, గృహంబులు లోనగునవి గలిగి వెలుఁగును. అచ్చట పచ్చలతోఁ గట్టఁబడి సర్వజనమనోజ్ఞమైన శ్యామలాంబగృహమును, దండనాయకియయిన వారాహిదేవిగృహమును గలదు. మఱి యాగృహమందలి, అచ్చమగు గరుడపచ్చలమంటపమం దుండెడు స్వర్ణసింహాసనముమీఁద, బంగారుతామరపుష్పము గలదు. దానిదుద్దుమీఁద, బిందువును ముక్కోణమును, వర్తులమును, షడ్దళములను, వృత్తద్వయమును, నూటపదియక్షరములను గల చక్రమందు, వరాహముఖంబును, కమలపత్రంబులంబోలిన నేత్రంబులను, చంద్రకిరీటంబును, కుందనపుతగడులచాయం దెగడుశరీరంబును, సంజకెంజాయల రంజిలఁజేయు నల్లనివస్త్రంబును, కుంకుమపువ్వు, గంధంబును, రక్తపుష్పహారంబులను, పద్మరాగమణిఖచితభూషణములను ధరించి, నాఁగలిని, ఇనుపరోఁకలిని, శంఖమును, వరదాభయముద్రలను, హస్తములయందుఁ బూని, యున్మత్త, కపాలి, భీషణ, డమరు, భాస్కర, రవిభిక్షుక, కాళి, చండ, మహామంత్రాను లనెడి యష్టభైరవులు, జంభిని మొదలగుసేనలతోఁ గూడి కొలువన వారాహిదేవి వసించును.

పదునేడవదియయిన పగడపుకోట: యనేకపగడపుగోపురంబులు బొమ్మలు తెక్కెంబులు బురుజులు మొదలగునవి గలిగి యందంబై యుండును. దీనికిని పదియారవ యావరణమునకును మధ్యనుండు స్థలము చొక్కంపుకుందనంబున గట్టినలోగిండ్లును రతనాలబండ్లును ఉద్యానవనంబులును మొదలగునవి గలిగి రంజిల్లును. అందు సిందూరవర్ణముగల యోగినీసంఘము లుండును.

పదునెనిమిదవదియయిన నవరత్నప్రాకారము: రత్నగోపురంబులు మొదలగునవి గలిగి రాజిల్లును. దీనికిని పదునేడవయావరణమునకును నడుమను తనకాంతులచేత దిక్కులను విదిక్కులను మిక్కుటంబుగ వెలుఁగఁజేయు మాణిక్యమంటపమునందు నీలమేఘంబు డాలును డీలుసేయంజాలు శరీరంబును తెల్లఁదామరరేకులను కాకుచేయు నేత్రంబులును వైజయంతీవనమాలికకును కౌస్తుభమణికిని ఇందిరాసుందరికిని మందిరంబగు విశాలవక్షంబును శంఖంబుంబోలినకంఠంబును వేదండంబుల తొండంబులంబోలినహస్తంబులును సౌందర్యసదనంబగు వదనంబును గలిగి కిరీట మకరకుండలాంగద కంకణాంగుళీయకహారనూపురాదిభూషణరత్నకాంతులు దిక్కులం బిక్కటిల్ల బంగారుపచ్చడంపుడంబులు విడంబింప శంఖచక్రగదాఖడ్గశార్ఙ్గంబులప్రభలు మిన్నుముట్టులం గ్రమ్మ బంగరురెక్కలు గలగరుడునిపై నెక్కి ప్రహ్లాద పుండరీక ద్రౌపదీ ముచుకుంద గజేంద్రాదిభక్తజనరక్షకుండును దుష్టరాక్షసశిక్షకుండును కరుణావరుణాలయుండును నందారుజనమందారుండును ఆశ్రితాభీష్టదాయకుండును సర్వలోకనాయకుండును జిష్ణుండును నైన విష్ణుదేవుఁ డుండును.

పందొమ్మిదవదియైన రత్నప్రాకారము: చంద్రమండలము నొరసెడి మణిశిఖరంబులును గోపురంబులును కొక్కెంబులును పైఁడిబొమ్మలును మొదలుగునవి గలిగి రమణీయమై యుండును. దీనికిని పదునెనిమిదవయావరణమునకును నడుమనుండు స్థలము రత్నగృహంబులు ఉద్యానవనంబులు ఆదిగాఁగలవి గలిగి వెలయును మఱియు నందు అపరంజి స్తంభములు వేయిగల రత్నమంటపము గలదు. దానియందు త్రిపురసుందరికి నమస్కరించుచు చంద్రార్ధధరుండును భవానీసహితుండు నైనయీశానుండు నంది భృంగి మొదలగుగణాధ్యక్షులును రుద్రగణంబులును గొలువ మహానందంబుతో వసించును.

ఇరువదియవదియైన మణిప్రాకారము: గోపురంబులు లోనగునవి గలిగి సుందరమై యుండును. దీనికిని పందొమ్మిదవయావరణమునకును మధ్యమునందు ధరణి స్వర్ణమణిమయంబులై భువనంబులం బోలినవనంబులును నందనవనంబుతో దీటయిన తోఁటలును మొదలగునవి గలిగి రంజిల్లును. అందు రాజహంసకలధ్వానంబులును తేఁటిదాఁటులపాటలరొదలును అదనంబగుచుండ బంగారుతామరలుగల అమృతంపునడబావులు రెండు రాజిల్లుచుండును.

ఇరువదియొకటవదియైన బుద్ధిమయమగు ప్రాకారము: మనోహరమై యుండును. దీనికిని ఇరువదియవప్రాకారమునకును మధ్యమున నున్న సువర్ణమయమైన భూమియందు కెంపుటిటికలంగట్టిన యిట్టలంపు మెట్లును మాణిక్యముల యరుఁగులును పడవలును గలిగి చాల విశాలంబై బ్రహ్మానందభోగము నొసఁగెడియమృతంపునడబావి గలదు. అందొక్క నావమీఁద ప్రమదంబున నెఱ్ఱవాఱె యిప్పపూమొగ్గలంబోనిబుగ్గలయందు దగ్గఱికమూపు పాఁజూలకమ్ములు మొదలుగునగలను సరిగపట్టుదువ్వలువను కస్తురిపూసగలను గమగమవలచు గందంబును దాల్చి చక్కఁదనంబునకు ఇక్కలగు పెక్కండ్రు జవరాండ్రు ఓడలనడపు పైఁడితెడ్లను చేతులం బూని కొలువ అమృతేశి యనుపేరుగల వారుణీదేవి యుండును.

ఇరువదిరెండవదియైన అహంకారావరణము: మిక్కిలి యున్నతమై యుండును. దీనికిని ఇరువదియొకటవకోటకును నడుమనుండు స్థలమందు పరిమళంబును తిన్నఁదనంబునుగల చల్లగాలి పొలయుచుండును. అచ్చట తీరంబులను మీఱి పాఱు తరంగసంఘములు గలిగి పులుఁగులయు తుమ్మెదలయు కోలాహలరవంబులచేత శోభితంబులగు వనసమూహంబులచేత దట్టముగ చుట్టఁబడి ఆనందమయంబైన నడబావి యొప్పును. దానినీటి నడుమనుండు కురువిందరత్నమయంబగు గొప్పతెప్పమీఁద కానుగుచిగుళ్లనల్లఁదనంబు నుల్లంఘించుశరీరంబును చందురునియందంబు క్రిందుపఱచు వదనంబును బేడిసమీలను బేలుపోఁజేయంజాలు క్రాలుఁగన్నులును తుమ్మెదపిక్కలనిక్కులను మొక్కపఱచు నెఱికురులును, పున్నమనాఁటిజాబిల్లివెన్నెలచెన్నును సన్నగింపఁజేయుచిఱునవ్వును గలిగి

రతనాలకమ్మలడాలు చిన్నారిచెక్కిళ్లపై నిమ్మలు మాప కుంకుమపుష్పగంధచ్ఛాయలు సంజకెంజాయల నపహసింప పాలిండ్లబరువున నడుము నసేఁక సౌందర్యశరధులగు వధూజాలంబులు గొలువ ఎక్కుడినవిల్లు చేఁబూని కురుకుల్లాదేవి వసించియుండును.

ఇరువదిమూఁడవదిదైన సూర్యప్రాకారము: పదునాలుగులోకములను వెలిఁగించుచుండును. దీనికిని ఇరువదిరెండవకోటకును నడుమనుండు స్థలమందుఁగల దేదీప్యమానంబగు మాణిక్యమంటపంబులోని రత్నసింహాసనముమీఁదనుండు సువర్ణపద్మకర్ణికనడుమ పద్మరాగమణిమయములైన కిరీటకుండలాదిభూషణములను ఎఱ్ఱనిపూదండలను గంధమును వస్త్రములను ధరించి చతుష్షష్టిచ్ఛాయాశక్తులతోఁగూడి మార్తండభైరవుఁడు వసించును.

ఇరువదినాల్గవదిదైన చంద్రప్రాకారము: నేత్రానందకరమై యుండును. దానికి ఉత్తరపుభాగి మెల్ల మంచుకొండవలె తెల్లనై మొల్లంబగు చల్లఁదనంబుగల లేగాడుపులును పండువెన్నెలతండమును చుక్కలగుంపులును గలిగి యుల్లసిల్లుచుండును. అందు సుధానిధి యయిన చంద్రుండు సాంద్రవైభవని స్తంద్రుండై యుండును.

ఇరువదియైదవది యయినశృంగారావరణము: సువర్ణరజతరత్నమయములైన శృంగంబులును, గోపురంబులును, ధ్వజములును మొదలగునవి గలిగి వెలుఁగును. దీనికిని ఇరువదినాలుగవకోటకును నడుమనుండు స్థలమందు రమణీయమణిమందిరంబులును ఉపవనంబులును మొదలగునవి గలిగి యుండును. మఱి యీశృంగారావరణమును చుట్టుకొని రత్నాకరమును పరిహసించుశృంగారపరిఖ యుండును. దీనికి నధిపతియైన మన్మథుఁడు ఈపరిఖగట్టున నుండెడుమణిఖచితంబయిన సువర్ణగృహమందు శృంగారదేవతలతోఁగూడి వసించియుండును.

ఇరువదియయిదవయావరణమునకు నవ్వల సర్వగీర్వాణులచేత సేవింపఁబడుచు చింతామణిమయంబయిన ప్రాకారముగల మంటపము గలదు. దీనికిని శృంగారావరణమునకును నడుమను పదిత్రాళ్ళవెడల్పుగల సువర్ణపర్ణములును ఆమడపొడుగుగల బంగారు కాఁడలును మృదువులై అయిదుత్రాళ్ళపొడుగుగలకేసరములును ఎల్లప్పుడు స్రవించుచున్న మకరందమును త్రాగుటకై జుమ్మని మ్రోయుచు కమ్ముకొనియుండు తుమ్మెదలును గలిగి రంజిల్లుబంగారుతామరయడవిగలదు. అచ్చట చందనవృక్షములయు తామరలయు వాసనలను కొల్లఁగొని కమ్మపుపుప్పొడితిప్పలను ఎల్లయెడల వెదచల్లుచు చల్లగాలి మెల్లఁగ వీచుచుండును. మఱి యచ్చట మహాత్రిపురసుందరీదేవియొక్క చింతామణిమయమైన గృహము గలదు. అచ్చట పూజార్హములయిన పంచపాత్రములు గలవు. వానిలో ॥శ్లో॥ ధూమార్చిరుష్ణా జ్వలినీ జ్వాలినీ విస్ఫులింగినీ, సుశ్రీ సురూపా కపిలా హవ్యకవ్యవహా దశ॥ అను పదికళలు గలిగి క్రోశముపొడుగున నుండుచు ధర్మము నొసఁగెడి అగ్నిమం

డల మనెడి ఆధారపాత్రము గలదైన ॥శ్లో. తపినీ తాపినీ ధూమ్రా మరీచిర్జ్వాలినీ రుచిః, సుషుమ్నా భోగదా విశ్వబోధినీ ధారిణీ క్షమా॥ అను పండ్రెండుకళలు గలిగి అర్ఘ్యప్రద మగు సూర్యమండలమనెడి యర్ఘ్యపాత్రమందు, ॥శ్లో. అమృతా మానదా పూషా తుష్టిః పుష్టీ రతిర్ధృతిః, శశినీ చంద్రికా కాంతిర్ జ్యోత్స్నా శ్రీః ప్రీతిరంగదా, పూర్ణా పూర్ణామృతా కామదాయిన్య స్స్వరజాః కలాః॥ అను పదియాఱుకళలు గలిగి కామ ప్రదమైన చంద్రమండలమనెడి దివ్యామృత ముండును. ఆయమృతము, ॥శ్లో. సృష్టి ర్బుద్ధిస్స్మృతిర్మేధా కీర్తిర్లక్ష్మీర్ధృతిః స్థితిః, స్థిరాసిద్ధిరితి ప్రోక్తా కచవర్గకలా దశ, అకార ప్రభవో బ్రహ్మా కలాభిః పాతు సర్వదా॥ అను బ్రహ్మకళలు పదియును, ॥శ్లో. జరాచ పాలినీ శాంతిరీశ్వరీ రతికామికా, వరదా హ్లాదినీ ప్రీతిర్దీర్ఘాస్యుః టతవర్గకాః, ఉకార ప్రభవో విష్ణుః కలాభిః పాతు సర్వదా॥ అను విష్ణుకళలు పదియును ॥శ్లో. తీక్ష్ణా రౌద్రీ భయా నిద్రా తంద్రీ క్షుత్క్రోధినీ క్రియా, ఉద్గారీచైవ మృత్యుశ్చ పయ వర్గకలా దశ, మకారప్రభవో రుద్రః కలాభిః పాతు సర్వదా॥ అను రుద్రకళలు పది యును, ॥శ్లో. షవర్ణాశ్చ చతస్రస్స్యుః పీతా శ్వేతారుణా సితా, ఇత్యాఖ్యా చేశ్వర కళా రక్షాం కుర్వంతు సర్వదా॥ అను నీశ్వరకళలు నాల్గును, ॥శ్లో. నివృత్తిశ్చ ప్రతి ష్ఠాచ విద్యా శాంతి స్తథైవచ, ఇందిరా దీపికా చైవ రేచికా మోచికా పరా, సూక్ష్మా సూక్ష్మామృతా జ్ఞానామృతాశ్చాప్యాయినీ తథా, వ్యాపినీ వ్యోమరూపాచ షోడశస్వర జాః కలాః, ఏతాస్సదాశివమయాః పాతు సర్వార్థసిద్ధయే॥ అను సదాశివకళలు పదియాఱును ఆవహింపఁజేయఁబడి పంచరత్నాదిన్యాసములతోఁగూడి యొప్పును. ఈతీరుననే గంగాది పుణ్యనదీజలపూరితంబగు తీర్థకలశంబును క్షీరసముద్రోద్భవంబగు దక్షిణావర్త శంఖంబు మున్నుగ పాద్య ఆచమనీయ స్నాన నిర్మాల్యపాత్రములు గంధ పుష్పాక్షత ములచేత అలంకృతములై పురుష శ్రీ దుర్గా భూ బ్రహ్మ విష్ణు రుద్రాదిసూక్తములచేత మంత్రింపఁబడి యుండును ఆపూజాపాత్రముల క్రింద మహాత్రిపురసుందరీచరణారవింద వందనార్చనపరులగు బ్రహ్మ విష్ణు రుద్ర మహేశ్వర సదాశివులుగృహములు దేదీప్యమాన ములుగ వెలుగుచుండును. మహాత్రిపురసుందరీమందిరమునకు అగ్నిమూలను ఆదేవికి నుత్ప త్తిస్థానమై జాజ్వల్యమానముగ నూఱుయోజనములపొడుగున మండెడిచిదగ్నికుండమును నైరృతిమూలను ఆచిదగ్నివలె ప్రకాశించుచు దివ్యమణిమయమై బంగరుచిఱుగంటలును టెక్కెంబులును సింహధ్వజంబును గలిగి సూర్యచంద్రాగ్నికాంతులను మీఱి నూఱామడల పొడుగుగల దేవీదివ్యరథమును వాయవ్యమూలను పసిఁడిటెక్కెములుగలిగి రత్నమయం బైన శ్యామలాదేవీరథమును ఈశాన్యమూలను నూత్నరత్నకాంతులు దిక్కులఁ బిక్క టిల్ల గంటలమ్రోఁతలును పడగలపటపటధ్వనులును దిక్కుల నంట సేనానాయకియగు వారాహీరథంబును గలదు. భవానీగృహంబునకు తూర్పుద్వారమందు మాతంగియును

శ్యామలాదేవిగృహంబును వారాహిమందిరమును గలిగియుండును. ఆయిండ్లయందు శ్యామలయును వారాహియును సపరివారంబుగ మహావైభవంబుతో నుందురు. ఆమధ్యభాగంబున ఆమడనిడివియు వెడలుపునుగల దేవీగృహంబునకు నాలుగుద్వారములయందును చతురామ్నాయమంత్రదేవతలు చతురంగసేనలతోఁగూడి ఆభరణకాంతులును ఆయుధకాంతులును దిక్కులను విదిక్కులను కప్పికొన కావలియుందురు ఇదియే శ్రీచక్రమను పురము గృహరూపమును నగును. ఆగృహమందలి రత్నమయమగు తిన్నెనడుమను సర్వానందమయబిందుపీఠమందు శ్రీదేవి నివసించును. ఆపీఠముక్రింద ఒకటిలోనొకటి గలిగియుండెడి తొమ్మిదిచక్రములు గలవు.

మొదటిదియైన త్రైలోక్యమోహనచక్రము: నలుచదరముగనుండెడుమూఁడుప్రాకారములును నాలుగువాకిండ్లును గలిగి వెలుఁగును. అందు మొదటియావరణమందు పరదేవతయొక్క దేహకాంతులే రూపముగ ధరించి అణిమసిద్ధి లఘిమసిద్ధి యీశత్వసిద్ధి వశిత్వసిద్ధి ప్రాకామ్యసిద్ధి భుక్తిసిద్ధి యిచ్ఛాసిద్ధి ప్రాప్తిసిద్ధి సర్వకామసిద్ధి అనెడుసిద్ధదేవతలును రెండవయావరణమందు బ్రహ్మ మహేశ్వర కుమార విష్ణు వరాహ మాహేంద్రరూపముల ధరించిన దేవతలశక్తులగు బ్రాహ్మి మాహేశ్వరి కౌమారి వైష్ణవి వారాహి మాహేంద్రి అను షట్ఛక్తులును చాముండ మహాలక్ష్మి యనెడుపరదేవతాశక్తులును మూఁడవయావరణమున సర్వసంక్షోభిణి సర్వవిద్రావిణి సర్వాకర్షిణి సర్వావశీకారిణి సర్వోన్మాదిని సర్వమహాంకుశి సర్వఖేచరి సర్వబీజ సర్వయోని సర్వత్రిఖండ అనుపేళ్లుగల దశముద్రాదేవతలును వసించి తమశరీరకాంతులు బాలభాస్కరుని తిరస్కరింప పరిమళమిళితగంధంబులయు పుష్పహారంబులయు గంధంబులు గంధవహునకు గంధవహనామంబు సార్థకత్వంబు గావింప భూషణఖచితచింతామణిప్రముఖమణిఘృణిగణంబులు భూమ్యంతరిక్షంబులకు చిత్రవర్ణత్వంబు సంపాదింప ఆయుధదీధితులు దిక్కులం బిక్కటిల్లి వింతకాంతి గలిగింప సరిగంచులమించుపట్టుపుట్టంబులయుట్టలంపుచాయలు తటిల్లతలనిక్కుస్రుక్కింప తురంగ మాతంగరథాంగాది చతురంగసేనలు కొలువ తమతమ రాజ్యంబులను పూజ్యంబుగ నేలుచుండుదురు. వీరు ప్రకటయోగినులు. వీరి కందఱకు సర్వాధ్యక్షయగు త్రిపుర యనెడు చక్రేశ్వరి దీనియగ్రభాగమందుండు రత్నసింహాసనమున ప్రకటయోగినీగణములు సపరివారలై కొలువ మహానందముతో నుండును.

రెండవదియైన సర్వాశాపరిపూరకచక్రము: పదియాఱుదళములుగలిగి వెలుఁగును. ఆదళములయందు కామాకర్షిణి బుద్ధ్యాకర్షిణి అహంకారాకర్షిణి శబ్దాకర్షిణి స్పర్శాకర్షిణి రూపాకర్షిణి రసాకర్షిణి గంధాకర్షిణి చిత్తాకర్షిణి ధైర్యాకర్షిణి స్మృత్యాకర్షిణి నామాకర్షిణి బీజాకర్షిణి ఆత్మాకర్షిణి అమృతాకర్షిణి శరీరాకర్షిణి అనెడుషోడశాకర్షిణీ దేవతలు దివ్యగంధవస్త్రపుష్పహారభూషణంబులం దాల్చి ఆయుధదీధితులు మింట నంట

శత్రుభయంకరులై మహాత్రిపురసుందరీపూజాపరలై దేవియొక్క యాజ్ఞాప్రకారముగ సంచరింతురు. వీరికెల్ల నాయకిరాలైన త్రిపురేశియను చక్రేశ్వరి చక్రమందలి దేవతలు గొలువ అగ్రభాగమందుండు మణిపీఠమున మహానందముతో నుండును.

మూఁడవదియైన సర్వసంక్షోభణచక్రము: అష్టదళములుగల పద్మమువలె మనోహరమైయుండును. ఆచక్రదళములయందు గుప్తతరయోగినులని ప్రసిద్ధికెక్కిన అనంగకుసుమ అనంగమేఖల అనంగమదన అనంగమదనాతుర అనంగరేఖ అనంగాంకుశ అనంగవేగిని అనంగమాలిని అనుపేళ్లుగలయష్టదేవతలు పాశమును అంకుశమును వరదముద్రను అభయముద్రను హస్తములయందు ధరించి రెండ్లనికోకిలను ఆవికలను దివ్యపుష్పమాలికలను దివ్యగంధమును దివ్యాభరణములను పూని మహాత్రిపురసుందరీధ్యానానందమగ్నలై సర్వకార్యనిర్వాహకలై యుందురు. వీరికెల్ల నాయకిరాలైన త్రిపురసుందరియను చక్రేశ్వరి చక్రదేవతలు తన్ను సేవింప మున్నుగనున్న మణిసింహాసనంబున వసించియుండును.

నాలుగవదియైన సర్వసౌభాగ్యదాయకచక్రము: పదునాలుగుముక్కోణములు గలిగి నేత్రానందపాత్రంబై రంజిల్లును. ఆచక్రకోణములయందు సంప్రదాయయోగినులనఁబరఁగిన సర్వసంక్షోభిణి సర్వవిద్రావిణి సర్వాకర్షిణి సర్వాహ్లాదిని సర్వసమ్మోహిని సర్వస్తంభిని సర్వజృంభిణి సర్వవశంకరి సర్వరంజని సర్వోన్మాదిని సర్వార్థసాధని సర్వసంపత్ప్రపూరణి సర్వమంత్రమయి సర్వద్వంద్వక్షయంకరి అనుపేళ్లుగల పదునాలుగుదేవతలు వసించి తమయొడలిడాలు ఎల్లెనిపగపెంపు తీఁగెలువంబును నడంపఁగా అప్రాకృతదివ్యగంధపుష్పమాల్య వస్త్రభూషణధారిణులై ఆయుధపాణులై రాజరాజేశ్వరీచరణారుణారవిందసేవకలై తదీయాజ్ఞానిర్వాహకలై యుందురు. వీరికెల్ల దొరసానిరాలైన త్రిపురవాసినియను చక్రేశ్వరి చక్రదేవతలు మిగుల భక్తితోఁ గొలువ రతనంపుపెద్దగద్దియపై మిక్కిలి సంతోషంబుతో వసించియుండును.

అయిదవదియైన బహిర్దశార మనెడుపేరుగల సర్వార్థసాధకచక్రము: సర్వజనానందకందంబై ప్రకాశిల్లును. దానియందు కులోత్తీర్ణయోగినులని ప్రసిద్ధికెక్కిన సర్వసిద్ధిప్రద సర్వసంపత్ప్రద సర్వప్రియంకరి సర్వమంగళకారిణి సర్వకామప్రద సర్వదుఃఖవిమోచని సర్వమృత్యుప్రశమని సర్వవిఘ్ననివారిణి సర్వాంగసుందరి సర్వసౌభాగ్యదాయిని. అనుపేళ్లుగల పదుగురు దేవతలు తమయొడలిచాయలకును చిఱునగవులడాలునకును ముఖంబులసొగసునకును నఖంబులరంగునకును జాబిల్లి ఫెతిల్లి వెలవెలపోవ దివ్యభూషణపుష్పహారగంధవస్త్రధారిణులై చతురంగసేనాసమేతలై అభయవరదముద్రలును పాశాంకుశంబులును కరంబులయందు కరంబు మెఱయ భర్తృపుత్రపుత్రీపౌత్రప్రముఖసమేతలై మహైశ్వర్యయుక్తలై మహాత్రిపురసుందరీసేవాసక్తలై యుందురు. వీరికెల్ల ఏలికసాని

రైన త్రిపురాశ్రీయనెడుచక్రేశ్వరి చక్రమందలిదేవతలు భజింప స్వర్ణసింహాసనంబున నివసించియుండును.

ఆఱవదియైన అంతర్దశారమనెడు సర్వరక్షాకరచక్రము: యోగిజననేత్రానందపాత్రంబయి భాసిల్లును. దీనియందు నిగర్భయోగినులనెడి నామములుగల సర్వజ్ఞ సర్వశక్తి సర్వైశ్వర్యప్రద సర్వజ్ఞానమయి సర్వవ్యాధివినాశిని సర్వాధారస్వరూపిణి సర్వపాపహర సర్వానందమయి సర్వరక్షాస్వరూపిణి సర్వేప్సితఫలప్రద అనుపేళ్లుగల దేవతలు జపమాలికలను పుస్తకములను హస్తములయందు ధరించి పచ్చకర్పూరమువంటిదేహచ్ఛాయలుగలిగి దివ్యవస్త్రభూషణపుష్పగంధంబులఁ దాల్చి చతురంగబలసమేతలై తళతళ మెఱయునాయుధంబులఁ బూని రాజరాజేశ్వరీచరణకమలభక్తియుక్తలై సంత్యక్తభవబంధలై యుందురు వీరికెల్ల వల్లభియగు త్రిపురమాలినియను చక్రేశ్వరి చక్రదేవతలు గొలువ రత్నసింహాసనంబున నివసించియుండును.

ఏడవదియైన సర్వరోగహరచక్రము: ఎనిమిదికోణములుగలిగి మెఱయును. అందు రహస్యయోగినులనెడు వశిని కామేశ్వరి మోదిని విమల అరుణి జయిని సర్వేశ్వరి కౌళిని అనుపేళ్లుగల వాగ్దేవతలు ఎఱ్ఱనిచీరంబులను దివ్యభూషణవస్త్రపుష్పహారగంధంబులను విండ్లు అమ్ములు ఖడ్గంబులు గండ్రగొడ్డండ్లు శూలంబులు లోనగునాయుధంబులను వహించి మించినభక్తితో చతురంగబలంబులఁ గొలువ పుత్రపుత్రీనస్త్రీభర్తృసహితలై సర్వైశ్వర్యయుక్తలై త్రిపురసుందరీపాదారవిందవందనాసక్తలై వసింతురు. వసుకోణమునకు నడుమను ముక్కోణమునకు మీఁదను నుండుచతురస్రమందు వైరుల నురుమాడు కామేశ్వరాస్త్రపాశుపతాస్త్ర బ్రహ్మాస్త్రాదిసకలదివ్యాస్త్రదేవతలును చాపబాణపాశాంకుశత్రిశూలశంఖచక్రాదిదివ్యాయుధశాలలును ఆశాలలకు మీఁదివలయముననుండు రత్ననిర్మితగృహములయందు సకలజనవంద్యమానలగు కామేశ్వరి భగమాలిని నిత్యక్లిన్న భేరుండ వహ్నివాసిని మహావజ్రేశ్వరి శివదూతి త్వరిత కులసుందరి నిత్య నీలపతాకిని విజయ సర్వమంగళ జ్వాలామాలిని చిత్ర మహానిత్యలనెడు పూర్వాపరపక్షతిథిదేవతలును ఆదేవతాగృహములకు పైన వివిధమను సంప్రదాయజ్ఞలయి త్రివిధములుగా నుండెడిపరమేశ్వరపరమేశ్వరమయి మిత్రేశమయి షష్ఠీశమయి ఉడ్డీశమయి చర్యానాథమయి లోపాముద్రమయి అగస్త్యమయి అనుదేవౌఘదేవతలును కాలతాపనమయి ధర్మాచార్యమయి ముక్తకేశీశ్వరమయి దీపకళానాథమయి అనెడుసిద్ధౌఘదేవతలును విష్ణుదేవమయి ప్రభాకరదేవమయి తేజోదేవమయి మనోదేవమయి కల్యాణదేవమయి రత్నదేవమయి వాసుదేవమయి శ్రీరామానందమయి అనెడు మానవౌఘదేవతలును వీరికి పైన రత్నఖచితస్వర్ణపీఠములయందు అతిసుందరులగు హృదయదేవి శిరోదేవి శిఖాదేవి కవచదేవి నేత్రదేవి అస్త్రదేవి అను

షడంగదేవతలను వసింతురు. వీరికందఱకు నాయకియగు త్రిపురాసిద్ధచక్రేశ్వరి చక్రదేవతలు బలసి యోలమితో కొలువ సువర్ణసింహాసనంబున అధివసించియుండును.

ఎనిమిదవదియైన సర్వసిద్ధిప్రదాయకచక్రము: మూఁడుకోణములుగలదై సనకసనందనాదియోగిజనహృదయరంజకమై రాజిల్లును. దీని అగ్రకోణమందుండు కామగిర్యాలయమందలి అగ్నిమయమయినపీఠముపైని వాగ్భవస్వరూపిణియును కాదివిద్యామయపరబ్రహ్మాత్మకశక్తియును నైన కామేశ్వరీదేవి పాశమును అంకుశమును అమృతకలశమును కపాలమును వరదాభయముద్రలను తనయాఱుకరంబులలో ధరించి భూషణమణిఘృణీజాలంబులు దిక్కులం బర్వ దివ్యవస్త్రగంధపుష్పహారంబులు ధరించి చతురంగసేనాపరివారంబులు గలిగి మిత్రేశనాథనవయోనిచక్రాత్మతత్త్వసృష్టికృత్యసహితేచ్ఛాశక్తిసమేతయై నిండోలగంబున కొలువుదీరి యుండును.

దక్షిణకోణమందు హాదివిద్యాస్వరూపిణియై సూర్యమండలమయ మయిన జాలంధరపీఠమున షష్ఠీశనాథాదులతోఁగూడి దశారద్వయ చతుర్దశారచక్రములకు కర్త్రి యయి విద్యాతత్త్వస్థితికృత్యజ్ఞానశక్తిస్వరూపిణి యయి కామరాజాత్మక కామకళాస్వరూపిణి యయి బ్రహ్మాండకోటులను పుట్టింపఁ బెంప సమర్థత గలది యయి సమస్తపరివారసహిత యయి విష్ణురూపశక్తి యయి పుష్పమాలికాచందనవస్త్రభూషణ సమేత యయి లేఁతపగడంపుతీఁగెలం బోలిన ఆఱుచేతులయందు చాపమును బాణములను పాశమును అంకుశమును పుస్తకమును జపమాలికను ధరించి వజ్రంబులవంటిదేహకాంతిగల వజ్రేశ్వరి వసించియుండును.

వామకోణమందు సాదివిద్యాస్వరూపమైనదియును చంద్రమండలమయ మగు పూర్ణగిరిగహ్వరమున ఉడ్డీశానందనాథాదులతోఁ గూడినదియును చతురశ్ర షోడశదళ అష్టారద్వయచక్రములకు నధికారిణియును శివతత్త్వసంహారకృత్యక్రియాశక్తిశక్తిబీజస్వరూపము గలదియును పరాపరస్వరూప మయినదియును రుద్రాత్మకశక్తియును చంద్రసమానశరీరచ్ఛాయ గలదియును అయిన భగమాలినీదేవి తనయాఱుకరములయందు విల్లును అమ్ములను పాశమ్మును అంకుశమ్మును పుస్తకమ్మును అభయముద్రను పూని రత్నభూషణ వస్త్ర గంధ మాల్యంబులను దాలిచి పరివారవారంబులు గొలువ నలువుమీఱ వసియించి యుండును. వీరి కెల్ల దొరసానియైన త్రిపురాంబాచక్రేశ్వరి సర్వాభరణభూషితయయి అగ్రభాగమందుండు రత్నసింహాసనముపై వసించి త్రిపురసుందరీధ్యానతత్పరయయి యుండును.

ముక్కోణమునకు నడుమనుండు ప్రజ్ఞానస్వరూపమును సర్వానందమయమును యోగిజనధ్యేయమును నైనబిందువందు మాయామయములైన యంత్రపాశములచేత కట్టఁ

బడిన నల్లపట్టు తెరచీరయును మల్లెలు మొల్లలు లోనైనపుష్పమాలికలచేత నలంకృతమైన పచ్చపట్టుచాందినీయును బంగారుమయమైన మణిఫలకయును తత్త్వమయములగు రత్న సోపానములును పట్టుతలగడలును హంసతూలికలపఱుపును గల పంచబ్రహ్మాకారమైన మంచము గలదు. దానియందు త్రిలోకసుందరుఁడును కామేశ్వరుఁడును నైన పరమశివుఁడు పాశమును అంకుశమును చెఱకువిల్లును పూవుటమ్ములును తన నాలుగుచేతులయందు ధరించి దివ్యవస్త్రభూషణచందనపుష్పమాలికలను దాల్చి మిక్కిలి చక్కనగు కెమ్మలాదులు పెక్కుమంది వింజామరలు తాంబూలపుపెట్టియ తమ్మపడిగ మొదలగునవిపూని కొలువ మహోత్సవంబుతో కూర్చుండియుండును. వాని యెడమతొడయనెడి పీఠమందు త్రిలోకమోహినియును, సృష్టిస్థితిసంహారాది సర్వవ్యవహారకారణభూతయును సర్వతంత్రస్వతంత్రయును శాంతరసస్వరూపిణియును సకలలోకజననియును దివ్యవస్త్రదివ్యభూషణ దివ్యగంధ దివ్యపుష్పమాలికాధారిణియును కుంకుమపువ్వులకాంతులం బోలిన దేహకాంతి గలదియును సమస్తచక్రపరివారసమేతయును పరబ్రహ్మచక్రమయియును మహోడ్యాణ పీఠస్వరూపిణియును చర్యానందనాథాదిసమేతయును సర్వస్వామినియును నైన పరబ్రహ్మిణి యనుత్రిపురసుందరీదేవి వసించియుండును.

మఱి యీశ్రీచక్రమందలి నవచక్రములలో త్రైలోక్యమోహనమను చక్రమందు రతియను స్థాయిభావముగల శృంగారరసస్వరూపిణిగాను సర్వాశాపరిపూరకచక్రమందు ఉత్సాహమను స్థాయిభావముగల వీరరసాత్మికగాను సర్వసంక్షోభణచక్రమందు శోకమను స్థాయిభావముగల కరుణారసాత్మికగాను సర్వసౌభాగ్యదాయకమందు భయమను స్థాయిభావముగల భయానకరసాత్మికగాను, సర్వార్థసాధకమందు జుగుప్స యనుస్థాయిభావముగల బీభత్సరసాత్మికగాను సర్వరక్షాకరమందు క్రోధమను స్థాయిభావముగల రౌద్రరసాత్మికగాను సర్వరోగహరమందు హాసమను స్థాయిభావముగల హాస్యరసాత్మికగాను సర్వసిద్ధిప్రదాయకమందు విస్మయమను స్థాయిభావముగల అద్భుతరసాత్మికగాను సర్వానందమయమందు శమమను స్థాయిభావముగల శాంతరసాత్మికగాను త్రిపురసుందరీదేవి యున్నది కనుక చక్రములయందుఁగల దేవత లందఱును ఆయారసములు గలవారై యుందురు

శ్రీచక్రలేఖనక్రమము శ్రీచక్రము సృష్టి స్థితి సంహారభేదములచేత కైలాసప్రస్తార మేరుప్రస్తార భూపురప్రస్తార క్రమముగ లిఖింపఁబడును. బిందువును ముక్కోణమును అష్టకోణమును దశారద్వయమును చతుర్దశకోణమును అష్టదళమును షోడశదళమును త్రివలయమును భూపురత్రయమును వరుసగ నొకటిమీఁద నొకటి అనులోమముగ వ్రాయుట సృష్టిక్రమము భూపురత్రయ మాదిగ బిందువుదాఁక విలోమముగ

వ్రాయుట సంహారక్రమము. సాధకునికుడిచేతియందలి బొటనవ్రేలియంగుష్ఠమును ప్రమాణముగ నేర్పఱచుకొని గృహమందు పూజించుటకు మూఁడు ఐదు తొమ్మిదిఅంగుళముల ప్రమాణమును దేవాలయమఠములయందు పూజింప పదునొకండు పదుమూఁడు పదునైదు అంగుళముల ప్రమాణమును గనుక నీలెక్కలలో తన కిష్టమైనది యొక్కలెక్క కొలతగా నిర్ణయించుకొని యెన్నియంగుళములలో చక్రము నిర్మింపఁదలఁచెనో ఆకొలతకు సరిగ తనయంగుళములో అణువు మొదలుగా తగినభాగములు తొంబదియాఱు గలయట్టుల సరిచూచుకొని ఆభాగములలో నడిమయమునకు క్రింద ఇరువదినాలుగుభాగములు పైన నిరువదినాలుగుభాగములు త్రోసి నడుమనుండిన నలుబదెనిమిదిభాగములను, ఒక వర్తులాకారముగ లిఖించి ఆవర్తులముయొక్క మీఁదియందు మొదలుకొని సూర్యరేఖ ఆఱుభాగములును, చంద్రరేఖ ఆఱుభాగములును, అంగారకరేఖ అయిదుభాగములును, బుధరేఖ మూఁడుభాగములును, బృహస్పతిరేఖ మూఁడుభాగములును, శుక్రరేఖ నాలుగుభాగములును, శనిరేఖ మూఁడుభాగములును, రాహురేఖ ఆఱుభాగములును, కేతురేఖ ఆఱుభాగములును, కేతురేఖమొదలుగ వర్తులపుక్రిందియంచు ఆఱుభాగములుగాను అంతు నలుబదియెనిమిదిభాగములు సరిపఱచుకొని సూర్యాదినవగ్రహరేఖలొకటిక్రింద వొకటి తప్పక వ్రాసి ఒకటవరేఖకొనలు మూఁడుభాగములును రెండవరేఖకొనలు నాలుగుభాగములును నాలుగవరేఖకొనలు పదియాఱుభాగములును అయిదవరేఖకొనలు పదునెనిమిదిభాగములును ఆఱవరేఖచివరలు పదియాఱుభాగములును ఎనిమిదవరేఖతుదలు నాలుగుభాగములును తొమ్మిదవరేఖకొనలు మూఁడుభాగములును తుడిచి మూఁడవ యేడవ రేఖలకొనలు తుడువక మొదటిదైన రవిరేఖకొనలు రెండును ఆఱవదియైన శుక్రరేఖామధ్యమందునను రెండవదియైన చంద్రరేఖకొనలు రెండును, తొమ్మిదవదియైన కేతురేఖామధ్యమందునను మూఁడవదియైన అంగారకరేఖకొనలు రెండును క్రిందివృత్తపుమధ్యమందునను నాలుగవదయిన బుధరేఖకొనలు రెండును ఎనిమిదవదయిన రాహురేఖామధ్యమందునను అయిదవది యయిన బృహస్పతిరేఖకొనలు రెండును ఏడవదయిన శనిరేఖామధ్యమందునను ఆఱవదియయిన శుక్రరేఖకొనలు రెండును రెండవదియయిన చంద్రరేఖామధ్యమందునను ఏడవదియయిన శనిరేఖకొనలు రెండును మీఁదివృత్తమధ్యమందునను ఎనిమిదవదియయిన రాహురేఖచివరలు రెండును మొదటిదియయిన సూర్యరేఖామధ్యమందునను తొమ్మిదవదియయిన కేతురేఖతుదలు రెండును మూఁడవదియయిన అంగారకరేఖామధ్యమందునను చేర్పవలయును ఇట్లు చేర్పఁగా మూఁడురేఖలు కూడినమర్మస్థానములు పదునెనిమిదియును రెండురేఖలు కూడినయిరువదినాలుగుసంధులును ముక్కోణము అష్టకోణము దశకోణములు రెండును చతుర్దశకోణమును అంతు నలుబదిమూఁడు ముక్కోణములును రెండుప్రక్కలయందు డమరుకములవంటిరేఖలు లాఱును గల అంతర

చక్రమగును. దీనిమీఁద పదునొకండుపాళ్లకొలతగల ఒక్కవృత్తము వ్రాసి దానియం దు ఎనిమిదిదళములు లిఖించి దానిపైని తొమ్మిదిపాళ్లకొలతలో నొకవృత్తము వ్రాసి దాని యందు పదియాఱుదళములు లిఖించి దానిపయిని ఒక్కపాలుకొలతలో మూఁడువలయ ములును వానిపయిని ఒకపాలు విడిచి ఒకచతురశ్రరేఖయును అవ్వలిరెండుపాళ్లలో రెండుచతురశ్రరేఖలును చతుర్ద్వారయుక్తముగ భూపురత్రయము లిఖింపవలయును. ఇట్లు వ్రాయఁగా తొంబదియాఱుపాళ్లును సరియగును. ఇదే పురుషప్రమాణము. తొలుత ము క్కోణము నడుమను బిందువును బిందువునందు కామరాజబీజమును ముక్కోణమందు శక్తి తారత్రయమును అష్టకోణమందు అ క చ ట త ప య శ వర్గములును ప్రథమదశారమం దు యకారము మొదలు క్షకారము తుదగాఁగల పదియక్షరములును ద్వితీయదశారమందు కవర్గ చవర్గములును చతుర్దశారమందు టకారాది భకారాంతమగు పదునాలుగు అక్షరము లును వ్రాయవలయును. అష్టదళములయందు అ ఇ ఉ ఋ ౡ ఏ ఓ అం అను వర్ణములును పదియాఱు దళములయందు అకారము మొదలగు పదియాఱు స్వరములును భూపురము యొక్క మూఁడురేఖలలో మొదటిరేఖయందు అణిమాది దశసిద్ధులును రెండవరేఖయందు బ్రాహ్మి మొదలు మహాలక్ష్మి తుదగాఁగల అష్టమాతృకలును మూఁడవరేఖయందు దశము ద్రా దేవతాబీజములును లిఖించి వీనిమీఁద ‌॥శ్లో॥ బీజం ప్రాణశ్చ శక్తిశ్చ దృష్టి ర్వశ్యం తథైవచ, మంత్రయంత్రాదిగాయత్రీ ప్రాణస్థాపనమేవచ, భూతదిక్పాలకానాంచ యం త్రస్యాంగాని వై దశ॥ అనెడుదశాంగములను వ్రాసి గురుముఖముగా త్రుటియుక్తి అను ఫలములచేత ఎఱిఁగి ఉపాసించువారికి సర్వార్థసిద్ధులును పరమపురుషార్థసిద్ధియును నిగ్ర హ అనుగ్రహ ఘుటికా పాదుకా మారణ స్తంభన మోహనదృష్టి గగనగమనాది సిద్ధులును లభించును. మఱి యీచక్రమందలి ముక్కోణమును అష్టకోణమును దశారములు రెండు ను చతుర్దశారమునుగూడి యీయయిదును శక్తిచక్రములు. ముక్కోణమందలి బిందువు ను బహిరష్టదళమును షోడశదళమును భూపురత్రయమును ఈనాలుగును శివచక్రములు. ॥శ్లో॥ చత్వారి శివచక్రాణి శక్తిచక్రాణి పంచచ, నవచక్రమిదం జ్ఞేయం శ్రీచక్రం శివయోర్వపుః॥ అని త్రిపురసారసింధువునందు. మఱియు దీనిని హయగ్రీవవ్యాసదు ర్వాసోఽగస్త్య దత్తాత్రేయ వసిష్ఠాది సర్వమహర్షులును గోరకనాథ మత్స్యేంద్రనా థాదిసిద్ధులును కాళిదాసప్రముఖులును ఆరాధించి తాము పొందినమహిమ లందఱును పొందవలయు నని యెంచి శారదా తిలక జ్ఞానార్ణవ కులార్ణవ సౌభాగ్యరత్నాకర తంత్ర సార తంత్రరాజాది మంత్రశాస్త్రములు రచియించిరి. కావున ఈరహస్యము నాకుఁ దెలి సినంత సంగ్రహించి వ్రాసితిని. బుద్ధిమంతు లగువారు పైఁజెప్పిన శారదాతిలకాది శాస్త్ర ములను లలితా స్తవరత్న యోగినీహృదయ కామకలాతంత్రదివ్యమంగళధ్యాన లలితో

పాఖ్యాన దుర్వాసఃకృత లలితాస్తవరత్న పరశురామసూత్ర శాక్తసూత్రాదులను శోధించి అశేషము విశేషముగఁ దెలిసి సంతోష మొందవలయును.

మఱి యీ శ్రీచక్రనగరము, ప్రాకృతము, అప్రాకృతము, కేవలాప్రాకృతము అని మూఁడువిధములు. అందు బ్రహ్మ విష్ణు రుద్ర మహేశ్వర సదాశివ విరాట్పురుషాండములలోఁగల కైలాసమందును క్షీరాబ్ధియందును మేరువందును పాతాళమందును మందరమందును ఆయాఅండముల ప్రమాణములకొలఁదిగ నిడివియును వెడలుపును పొడువును గలిగియుండు శ్రీపురములు ప్రాకృతములు. బ్రహ్మాదసకలాండములలో వసించువారికి ఆయాఅండములకు పయినుండు మఱియొకయండమందలి శ్రీపురములు అప్రాకృతములు. అన్నియండములకు పైనుండెడి శ్రీనగరము కేవలాప్రాకృతము.

మఱియు చర్మము నెత్తురు మెదడు చేప ఎముకలు అనునైదును శక్తిమూలకములు. శుక్లము, తేజస్సు, ప్రాణములు, జీవము అను నాలుగును శివమూలకములు. ఈతొమ్మిదియును గల ''అష్టాచక్రా నవద్వారా దేవానాం పూరయోధ్యా, యో వై తాం బ్రహ్మణో వేదా అమృతేనావృతాం పురీం, తస్మై బ్రహ్మచ బ్రహ్మాచ ఆయుః కీర్తిం ప్రజాం దదుః'' ఇత్యాది శ్రుతులనుబట్టి మూలాధార నాడీచక్ర స్వాధిష్ఠాన మణిపూరక అనాహత విశుద్ధి ఆజ్ఞేయ సహస్రారములనెడి తొమ్మిది చక్రములును నవరంధ్రములును గలిగి సర్వదేవతానివాసంబగు శరీరమును పంచభూతములు శక్తిసంబంధములు మాయాశుద్ధవిద్య మహేశ్వర సదాశివచక్రములు నాలుగును శివమూలకములు. ఈతొమ్మిదియునుగల అండమును శ్రీచక్రమునకుఁగల నవరేఖలే నవఖండములుగాఁగల భూమియును నవగ్రహాత్మకమగు ఖగోళమును నవరంధ్రాత్మకమగు దేహమును శ్రీచక్రము గావున ఈ శ్రీచక్రమును తెలిసి యుపాసించువారికి నవగ్రహపీడలు తొలఁగి సర్వసిద్ధులు లభించును.

''శ్లో. ప్రకృతిం పురుషం చైవ విద్ధి పార్థ ఉభావపి'' అను గీతావచనమునుబట్టి బ్రహ్మవేత్తలయినవారు ప్రకృతిపురుషులను విచారించి తొలుత ప్రకృతివికారములను అసత్యములుగఁ దెలిసి పిమ్మట ప్రకృతిపురుషులయైక్యము నెఱిఁగి అద్వైతనిష్ఠ సలుపుచునుందురు గనుక బుద్ధిమంతులగువారు ఈచక్రవిషయమును చక్కఁగఁ దెలిసికొనవలయును.

''శ్లో. బీజాక్షరయుతం చక్రం యతీనాముత్తమోత్తమమ్, బీజాక్షరవిహీనంతు గృహస్థానాం ప్రశస్తకమ్'' అని మంత్రరత్నవ్యాఖ్యానమందలి పంచదశతరంగమందుండుటవలన యతీంద్రులు చక్రమును బీజాక్షరములను లిఖించి పూజింపవలయును. గృహస్థులు పూజాకాలమున చక్రమున బీజాక్షరము లున్నట్లు భావించి పూజింపవలయును గనుక గృహస్థుల కుపయోగముగ బీజాక్షరములు వ్రాయఁబడవు.



క. చేటీభవదఖిలమహా, ఖేటాంగన కమలరత్నకేయూరకన
త్కోటీరకు రవిశశిమయ, తాటంకకు సకలదైత్యదర్పదళనకున్. ౨౯

టీ. చేటీ...గనకున్, చేటీభవత్ = చేలికత్తెలగుచున్న, అఖిల = సమస్తులైన, మహాఖేట = వేలుపులలో మేటులయిన బ్రహ్మేంద్రాదులయొక్క, అంగనకున్ = స్త్రీలుగలదానికిని - అనఁగా బ్రహ్మ విష్ణు రుద్ర మహేశ్వర సదాశివ దేవేంద్రాదిదేవతలభార్యలైన సరస్వతీ లక్ష్మీ పార్వతీ ఉన్మనీ మనోన్మనీ శచీదేవీ ప్రముఖదేవతాస్త్రీ లందఱు నీమహాదేవికి నూడిగములు చేయుచున్నా రని భావము. "శ్లో. సచామరరమావాణిసవ్యదక్షిణసేవితా, సచామరాభ్యాం శ్రీవాగ్భ్యాం పార్శ్వయోరుపవీజితామ్, బ్రహ్మాణీకోటిసహితై ర్బ్రహ్మకోటిభిరర్చితామ్, లక్ష్మీనారాయణానాంచ కోటిభిః పరిసేవితామ్, రుద్రాణీకోటిసహితై రుద్రకోటిభిరావృతామ్" అని లలితాసహస్రనామ దివ్యమంగళాస్తోత్రములయందు, అమల...రకున్, అమల = నిర్దోషములయిన, రత్న = మణిఖచితములయిన, కేయూర = భుజకీర్తులును, కనత్ = ప్రకాశించుచున్న, కోటీరకున్ = కిరీటమును గలదానికిని, రవి...కకున్, రవి = సూర్యునియొక్క, శశి = చంద్రునియొక్క, మయ = స్వరూపములయిన, తాటం

కకుబ్=కమ్మలుగలదానికిని, ‹‹శ్లో. తాటంకయుగళీభూతతపనోడుపమండలా›› అని లలితాసహస్రనామమందు, సకల...నకుబ్, సకలదైత్య=మధుఁడు కైటభుఁడు లోనైన సర్వరాక్షసులయొక్క, దర్ప=గర్వమును, దళనకుబ్=నశింపఁజేసినదానికిని.

తా. సరస్వతీదేవి, లక్ష్మీదేవి, పార్వతీదేవి, ఉన్మనీదేవి, మనోన్మనీదేవి, శచీదేవి మొదలయిన దేవతాస్త్రీలందఱు పనికత్తెలుగాఁగలదానికిని దివ్యములయిన మణులు చెక్కిన భుజకీర్తులును కిరీటమును గలదానికిని సూర్యచంద్రులే కమ్మలుగాఁగలదానికిని, మధుఁడు, కైటభుఁడు, రక్తబీజుఁడు, మహిషాసురుఁడు, శుంభ, నిశుంభులు, ధూమ్ర, చండ, ముండులు మొదలయినరక్కసుల నెల్ల చక్కాడినదానికిని అనితాత్పర్యము.

క. పంచశివాసనకు మహా, పంచాననగమనకును బ్రపంచేశ్వరికిన్
పంచసురతరుసఖీముఖ, పంచకయుతభూరిమంటపస్వామినికిన్. ౩౦

టీ. పంచశివాసనకుబ్, పంచశివ=పరమశివుని సద్యోజాత వామదేవ అఘోర తత్పురుష ఈశాన ముఖములవలనఁ బుట్టిన బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వర సదాశివులనెడు పంచకర్తలే, ఆసనకుబ్=పీఠముగఁగలదానికిని-అనఁగా అగ్ని, నిర్రృతి, వాయు, ఈశాన దిక్కులయందు బ్రహ్మ విష్ణు రుద్రేశ్వరులు నలుగురును నాలుగు కాళ్లుగాను, సదాశివుఁడు పైపలకగాను గలపీఠమందు వసించునని యని భావము. ‹‹శ్లో. పంచప్రేతాసనాసీనా పరబ్రహ్మస్వరూపిణీ, పంచప్రేతమంచాధిశాయినీ›› అని లలితాసహస్రనామమందు, ‹‹శ్లో. శివాకారే మంచే పరమశివపర్యంకనిలయామ్›› అని సౌందర్యలహరియందు, వ్యు.ప్రకర్షేణ ఇతః ప్రేతః అని వ్యుత్పత్తి ప్రసిద్ధముగ సజీవులై యుండువారని యర్థము. పంచకర్తలీమెకరుణచేత నుజ్జీవించుచున్నవారనుట బ్రహ్మ విష్ణు రుద్ర మహేశ్వర సదాశివులనెడు పంచకర్తలే యధిదేవతలుగాఁగల స్వాధిష్ఠానాది పంచచక్రములకు మీఁదనుండు సహస్రారమందు విజ్ఞానమయంబగు బిందుస్వరూపంబున వసించునది గావున పంచశివాసన యనుట. మహాపంచాననగమనకుబ్, మహా=గొప్పదియైన, పంచానన=సింహమే, గమనకుబ్=వాహనముగాఁగలదానికిని, లేక పంచానన=సచ్చిదానంద పరబ్రహ్మమయిన పరమశివుని, గమనకుబ్=విజ్ఞానరూపిణి యగుటచేత పొందుదానికిని అని యర్థాంతరము. ప్రపంచేశ్వరికిబ్, ప్రపంచ=పరబ్రహ్మాంశములయిన, సద్రూప, చిద్రూప, ఆనందరూపములు మూఁడును ప్రకృత్యంశములయిన నామరూపములు రెండును అనెడు నైదంశములతోఁగూడినలోకమునకు లేక పరమశివునిపంచముఖముల వలనఁ బుట్టిన భూ, జల, వహ్ని, వాయు, గగనము లనెడుపంచభూతసమ్మేళనమువలనఁ గలిగిన ప్రపంచమునకు, ఈశ్వరికిబ్=పంచకర్తృరూపిణియై పంచకృత్యములఁ జేయుటకు దొరసానియైనదానికిని ‹‹శ్లో. సృష్టికర్త్రీ బ్రహ్మరూపా గోప్త్రీ గోవిందరూపిణీ,

సంహారిణీ రుద్రరూపా తిరోధానకరీశ్వరీ, సదాశివానుగ్రహదా పంచకృత్యపరాయణా॥ అని లలితాసహస్రనామము, పంచ...మినికిన్-పంచ=అయిదైన, సురతరు=మందారము, పారిజాతము, సంతానము, కల్పకము, హరిచందనము అనెడు కల్పవృక్షములును, సఖీ=సరస్వతి, లక్ష్మి, పార్వతి, ఉన్మని, మనోన్మని అను పంచసఖులును, ముఖ=మొదలయిన, పంచక=పంచవర్గములుగల, కపిల సురభి లోనగు పంచకామధేనువులతోడను, స్వర్గరత్న, గగనరత్న, మర్త్యరత్న, నాగరత్న, పాతాళరత్నములనెడు పంచరత్నములతోడను, పంచామృతకలశములతోడను, పంచకోశములతోడను, మఱియును తక్కినవస్తుపంచకములతోడను, యుత=కూడిన, భూరి = సువర్ణమయమైన, మంటప=చింతామణిమయమంటపమునకు, స్వామినికిన్=రాణియైన దానికిని.

తా. బ్రహ్మ విష్ణు రుద్ర మహేశ్వర సదాశివమయ మయిన సింహాసనమున నివసించుదానికిని, సింహవాహనముగలదానికిని, లోకమునకు దొరసానియయినదానికిని, పంచకల్పవృక్షములు పంచసఖులు పంచకామధేనువులు పంచరత్నములు మొదలగునవి గలిగి యొప్పెడి పసిఁడిచింతామణిమంటపమధ్యమందు వసించుదానికిని అని తాత్పర్యము.

ఈపద్యమున మహాపంచాననగమనకు అనుచోట మహచ్ఛబ్దప్రయోగమునకు ప్రయోజన మేమి యనిన పూర్వము బ్రహ్మ విష్ణువులు హంస గరుడ వాహనంబుల నెక్కి శివసందర్శనంబుకై మహావిలాసంబగు కైలాసంబునకు పోయి సుబ్రహ్మణ్యస్వామియొక్క వాహనమయిన నెమిలియును పడగ యయిన కోడియును, ఉపరిభూతములచేత ప్రేరింపఁబడి అలిగి హంస గరుడపక్షులం జంపిన సుబ్రహ్మణ్యుండు వానిని బ్రతికించి బ్రహ్మ విష్ణువులను గౌరవించి పంపించి నెమిలిని, కోడిని, ఉపరిభూతములను కోపంబుతోఁ జూచి మీరు రాక్షసులయి పుట్టుఁడని తిట్టిన అవి కశ్యపబ్రహ్మవలన మాయ యనుదానియందు నెమిలియును, కోడియును, శూరపద్మాసురుఁడుగాను ఉపరిభూతములు రెండును సింహవక్త్ర తారకాసురులుగాను పుట్టి దేవతాస్త్రీలను చెఱఁబెట్టి దేవతలచేత వెట్టిగొనుచు బాధపెట్టిన సుబ్రహ్మణ్యుండు వారిని గిట్టింపఁగా శూరపద్ముడు ముందటియట్ల కుమారునకు వాహనమును పడగయు నయ్యెను. తారకుఁడు మూషకమై గణపతికి వాహనమయ్యెను. సింహవక్త్రుఁడు సింహం బయి, త్రిపురసుందరీదేవికి వాహనం బయ్యెను గనుక మహాపంచాననగమనకు నని ప్రయోగింపఁబడెను. ఇట్లని స్కాందపురాణమందలి శివరహస్యఖండమందుఁగలదు.

క. సద్యోముక్తిప్రదకు న,విద్యాంధతమోర్కనిభకు నవివిధాగమవి
   ద్వేద్యకు సంప్రదాయకు శ్రీ,విద్యకు నాద్యకుమహాబ్జవిపిననిలయకున్.

టీ. సద్యోముక్తిప్రదకున్, సద్యః=తన్నారాధించిన జన్మమందే, ముక్తి=అపరోక్షసాక్షాత్కారజీవన్ముక్తిని, ప్రదకున్=ఇచ్చునట్టిదానికిని, అవి...నిభకున్, అవి

ద్యా=ఒకదానిని మఱియొకటిగా తోఁపింపఁ జేయునట్టి అజ్ఞానమనెడు, అంధతమః=కటికచీఁకటికి, అర్క=సూర్యునితోడ, నిభకున్=సమానమయినదానికిని, వివిధా... నకున్, వివిధ=బహువిధములయిన, ఆగమ=కామికాదివాతులాంతములయిన యిరువది యెనిమిది ఆగమములను, లేక చతుర్వేదములను, గర్భాధానాదిసకలకర్మములఁ జేయుటకు నిర్ణయము లయిన ఆపస్తంబీయాదికల్పములను, విత్ = తెలిసికొనిన విద్వాంసులచేత, వేద్యకున్=తెలియఁదగినదానికిని, సంహృద్యకున్=మిక్కిలి మనోహరమయినదానికిని, శ్రీవిద్యకున్; శ్రీ=నిత్యమంగళస్వరూపమయిన, విద్యకున్ = షడామ్నాయ మంత్రదేవతామయమగు బ్రహ్మవిద్యాస్వరూపమయినదానికిని, ఆద్యకున్=సర్వమునకు మొదటిదయినదానికిని, మహా...కున్, మహా=గొప్పదియయిన, అబ్జవిపిన = తామరయడవియే, నిలయకున్=గృహముఁగాఁగలదానికిని, ఈతామరయడవిసంగతి శ్రీనగరముయొక్క యిరువదియయిదవ యావరణమున వివరింపఁబడియున్నది.

తా. తనపాదపద్మములను ఆరాధించిన జన్మమందే, "అహం బ్రహ్మాస్మి" అనెడు విజ్ఞానమును గలుగఁజేసి జీవన్ముక్తిని ఇచ్చుదానికిని సూర్యుఁడు కాఱుచీఁకటిని పోఁగొట్టినట్టు అజ్ఞానమును నశింపఁజేయుదానికిని వేదములు ఆగమములు మొదలగునవి తెలిసినవారిచేత తెలియఁబడుదానికిని, మిక్కిలి మనోహరమయినదానికిని, సకలమంత్రదేవతామయమయిన బ్రహ్మవిద్యాస్వరూపమయినదానికిని సృష్టిస్థితిలయము తిరోధానము అనుగ్రహము అనెడు పంచకృత్యములనుజేయు బ్రహ్మ విష్ణు రుద్ర మహేశ్వర సదాశివులయుత్పత్తి స్థితిలయాదులకు కారణమయినదానికిని అని తాత్పర్యము.

క. శ్రీమన్మాతకు సుగుణ,స్తోమకుఁ ద్రిపదత్రికూట సుషమాంగకు స
త్కామితఫలసంధాతకు, సోమార్ధాంశకు ననంత శోభాయుతకున్.

టీ. శ్రీమన్మాతకున్, శ్రీ=లక్ష్మీసరస్వతులకును వారితో సాటియయిన పార్వతీదేవికిని, మత్=నాకును, మాతకున్=తల్లియయినదానికిని, లేక శ్రీమత్=సర్వసంపదలతోఁ గూడిన మాతకున్=బ్రహ్మాదులకును లోకములకును సృష్టికారణ మయినదానికిని, లేక, శ్రీమత్=శోభాయుక్తములయిన, మాతకున్ = జ్ఞాతృజ్ఞానజ్ఞేయములనెడి ఆంతరత్రిపుటియును ద్రష్టృదర్శన దృశ్యములనెడి మధ్యత్రిపుటియును కర్తృ హేతు క్రియలనెడి బాహ్యత్రిపుటియును, మాతృ మాన మేయములయందు అంతర్భూతములు గనుక మానమేయములు రెండును మాతృనిష్ఠము లగుటవలన మాతృశబ్దమున కర్థము ప్రత్యగాత్మ గనుక ప్రత్యగాత్మస్వరూపురాలయినదానికిని, "శ్లో. స్వాత్మైవ త్రిపురా దేవీ లలితా విశ్వవిగ్రహా" అని దేవీభాగవతమందు, "శ్లో. జ్ఞాతా జ్ఞానం తథా జ్ఞేయం ద్రష్టా దర్శనదృశ్యభూః, కర్తా హేతుః క్రియా యస్మాత్తస్మై జ్ఞప్త్యాత్మనే నమః" అని బృహ

ద్వ్యాసిక్తమందు, ॥శ్లో. లక్ష్మీ సరస్వతీ ధాత్రీ త్రివర్గసంపద్విభూతిశోభాసు, ఉపకరణ వేషరచనావిద్యాసు శ్రీరితి ప్రథితా॥ అని వ్యాడికోశము; సుగుణస్తోమకున్, సుగుణ= శాంతశమదమాదికల్యాణగుణములయొక్క, స్తోమకున్=సమూహముగలదానికిని, త్రిపద త్రికూటసుషమాంగకున్, త్రిపద=మూఁడుపాదములుగల గాయత్రియును, త్రికూట= వాగ్భవకామరాజశక్తులనెడి మూఁడుకూటములుగల పంచదశాక్షరియును, సుషమా=మిగుల శోభిల్లుచున్న, అంగకున్=శరీరముగఁగలదానికిని, అనఁగా శిరస్సుమొదలు కంఠమువఱ కును, కంఠముమొదలు నడుముదాఁకను, నడుము మొదలు పాదములదనుకనుగల దేహము గాయత్రీమంత్రమందలి ప్రథమద్వితీయ తృతీయపాదములును పంచదశాక్షరియందలి ప్రథమద్వితీయ తృతీయకూటములును అని యెఱుంగవలయును. ॥శ్లో. శ్రీమద్వాగ్భవ కూటైకస్వరూప ముఖపంకజా, కంఠాధఃకటిపర్యంతమధ్యకూటస్వరూపిణీ, శక్తికూటై కతాపన్నకట్యధోభాగధారిణీ, మూలమంత్రాత్మికా మూలకూటత్రయకళేబరా॥ అని లలి తాసహస్రనామము, ఈత్రికూటములలో ప్రథమకూటము సరస్వతి ద్వితీయకూటము లక్ష్మీదేవి తృతీయకూటము పార్వతీదేవియును గనుక త్రిశక్తిస్వరూపిణి యని భావము. త్రిసంజ్ఞ లన్నియు త్రికూటము లని యూహ్యము. సత్కామితఫలసంధాతకున్, సత్= సత్పురుషులచేత, కామిత=కోరఁబడిన, ఫల=ధర్మార్థకామమోక్షములనెడు ఫలములను, సంధాతకున్ = ఒనగూర్చుదానికిని, సోమార్ధాంశకున్, సోమ = పరమశివునియొక్క, అర్ధాంశకున్ = సగభాగముగలదానికిని, అనంతశోభాయుతకున్, అనంత=నాశములేని, శోభా=కాంతిశోభ, యుతకున్=కూడినదానికిని.

తా. లక్ష్మీ సరస్వతీ పార్వతీదేవులకును బ్రహ్మ విష్ణు రుద్రేంద్రాదులకును, ఎల్ల లోకములకును, నాకును తల్లి యయినదానికిని, శమము దమము శాంతి తితీక్ష మొదలగు మంచి గుణము లన్నియును గలదానికిని, గాయత్రీ పంచదశాక్షరీమంత్రములే శరీరము గఁగలదానికిని, తన్ను సేవించు సత్పురుషుల కోరికల నెల్ల కొల్లగ నిచ్చుదానికిని, పరమ శివుని అర్ధశరీరము గలదానికిని, తఱుఁగని ప్రకాశముగలదానికిని అని తాత్పర్యము.

వ. సమర్పితంబుగా నాయొనర్పంబూనిన కైవల్యనవనీతం బను జ్ఞాన శాస్త్రంబునందలి విషయనిర్ణయప్రారంభం బెట్టి దనిన. 33

టీ. సమర్పితంబుగాన్=సమర్పణముగా, నాయొనర్పంబూనిన = నేనురచియింప నుపక్రమించిన, కైవల్యనవనీతంబు=కైవల్యనవనీతము, అనుజ్ఞానశాస్త్రంబునందలి=అనె డు వేదాంతశాస్త్రమందుఁగల, విషయ...భంబు, విషయ=సంగతులయొక్క, నిర్ణయ= నిశ్చయములయొక్క, ప్రారంభంబు=పుట్టుగడ, ఎట్టిది=ఏలాగంటిది, అనినన్=అనఁగా.

తా. అపరదేవతకు సమర్పణముగా నాచేత చేయ నారంభింపఁబడిన కైవల్యనవ

నీతమనెడు వేదాంతశాస్త్రమందుఁగల విషయవివరణముల ప్రారంభము ఏలాగనఁగా నని తాత్పర్యము.

## గ్రంథారంభము.

**అవతారిక.**—సకలజనులు అనాయాసముగ అపరోక్షజ్ఞానానుభవము గలవారగుటకై ఈగ్రంథమందు ప్రతిపాదింపఁబడునదియును బ్రహ్మనిష్ఠులసమాధియందు తోఁచునదియును “ప్రజ్ఞానం బ్రహ్మ” యను సాక్షాత్కారమహావాక్యమునకు లక్ష్యార్థమయినదియును నైనపరమాత్మ విశేషణముగఁ గొనియాడఁబడుచున్నయది.

**మ.** వనితాదీషణసక్తముక్తజన సత్స్వాంతాభ్రివజ్జీవచే
తనమాత్రుం డయి త్రాలు నెందులను జిత్సప్తావనులావనిలో
ఘనమౌ తుర్యధరిత్రి యాధరణి సాక్షాత్కారుఁడై యొప్పున
య్యనఘైకాత్మవరాంఘ్రిపద్మయుగళంబ శ్రాంత మేఁ గొల్చెదన్.

టీ. వని...డయి, వనితా=స్త్రీ, ఆది=మొదలైన, ఈషణ=దారేషణ ధనేషణ పుత్రేషణములయందు, సక్త=ఆశతో కూడినట్టి, ముక్త=కూడనట్టి, జన = అజ్ఞానవిజ్ఞానులయొక్క, సత్ =ప్రశస్తములైన, స్వాంత=అంతఃకరణములయందు, అభ్రివత్ =నాలుగుభూతములయందు నిండియున్న యాకాశమువలె, జీవ=జీవులకు, చేతనమాత్రుండయి=కూటస్థచైతన్యస్వరూపుఁడై - లేక -ఈషణాత్రయమునం దభిలాషగల పామరులహృదయములయందు శబ్దగుణముగల భూతాకాశమువలె కించిత్ జ్ఞత్వాదిగుణముగల జీవస్వరూపుఁడై, ఆ ఈషణములయం దభిలాషలేని పండితుల అంతఃకరణములయందు దేని నంటని చిదాకాశమువలె విజ్ఞానపరబ్రహ్మస్వరూపుఁడై అని క్రమాలంకారము, ఎందులన్ =శైవ శాక్త వైష్ణవ గాణాపత్య సౌర కాపాలికము లని యెన్నిక కెక్కిన షడ్దర్శనములయందును, చిత్సప్తావనులు,చిత్ =జ్ఞానశాస్త్రసంబంధములైన,సప్త=ఏడయిన, అవనులు=శుభేచ్ఛ విచారణ తనుమానసి సత్వాపత్తి అసంసక్తి పదార్థభావన తురీయము లనెడి జ్ఞానభూములు, త్రాలున్ =శ్రేష్ఠములై వెలుఁగును. అనఁగా సకలసమయములయందు జ్ఞానభూములే యుత్తమము లైన వనుట, వానిలోన్ = అజ్ఞానభూములేడింటిలోపల, తుర్యధరిత్రి=కడపటిదైన తురీయభూమి, ఘనమౌన్ = ఉత్కృష్టమైనదగును, ఆధరణిన్= ఉత్కృష్టమైన యాతురీయభూమియందు, సాక్షాత్కారుఁడై =తురీయాతీతస్వరూపము చేత బ్రహ్మవిద్వరిష్ఠులకు ప్రత్యక్షమైనవాఁ డగుచు అనఁగా తురీయమే తురీయాతీతము గనుక ఆతురీయాతీతస్వరూపముచేతఁ గనబడినవాఁ డయి యనుట. ఒప్పు... ళంబు, ఒప్పు=ప్రకాశించెడు, అయ్యనఘ=ఆధ్యాత్మిక ఆధిభౌతిక ఆధిదైవికములనెడి త్రివిధదుఃఖములఁ బోఁగొట్టువాఁడైన, ఏక=సజాతీయ విజాతీయ స్వగతభేదశూన్యుఁ

డైన, ఆత్మపర=సర్వోత్కృష్టుఁడైన పరమాత్మయొక్క, అంఘ్రిపద్మ=తత్పదత్వంపద వాచ్యార్థములైన జీవేశ్వరు లనెడు పాదపద్మముల యొక్క, యుగళంబు=జంటను, ఏష=మోక్షార్థినైన నేను, ఆశ్రాంతంబు=ఎల్లప్పుడును, కొల్చెదన్=తత్పదత్వంపదల క్ష్యార్థములగు ప్రత్యగాత్మపరమాత్మ లొక్కటియే యనెడు నభేదజ్ఞానముతోడ సేవిం చుచున్నాను.

తా. దేనిని అంటీ అంటని మింటివలె ఈషణత్రయమందు అభిలాషగల అజ్ఞానుల హృదయములయందును ఆ యీషణత్రయమం దాసక్తిలేని బ్రహ్మజ్ఞానుల హృదయముల యందును జీవసాక్షిస్వరూపుఁడగుచు సర్వసమయములయందు పొగడ్తఁజెందిన జ్ఞానభూ ములలో నుత్తమమైన తురీయభూమియందు జ్యోతిర్మయుం డగుచు బ్రహ్మవిత్ విద్వర విద్వరీయ విద్వరిష్ఠులకు తురీయాతీతస్వరూపముచేత సాక్షాత్కరించుచుండెడు నిష్క ళంకపరబ్రహ్మముయొక్క పాదపద్మములను సేవించుచున్నా నని తాత్పర్యము.

## జీవచేతనవివరణము.

మఱి యీపద్యమునందు జీవచేతనమాత్రుండయి అని యుండుటవలన అంతఃక రణమును, దాని కధిష్ఠానమగు చైతన్యమును అంతఃకరణమందు ప్రతిబింబించిన చైత న్యంబును గూడి జీవుఁ డనఁబడును. కేవలాంతఃకరణంబునకు జీవత్వము చెప్పవల దనిన అంతఃకరణాశ్రయమగు శరీరమునకును జీవత్వంబు చెప్పవలెను. అది నశించునది గావున జీవత్వము సిద్ధింపదు గనుక కేవలాంతఃకరణంబునకు జీవత్వము చెప్పఁగూడదు. మఱియు శరీరము అపరిశుద్ధము దానికంటె అంతఃకరణంబు పరిశుద్ధము గనుక అంతఃకరణంబునకు జీవత్వము చెప్పవల దనిన అద్దము లోనగునవి పరిశుద్ధద్రవ్యములు గావున వానికిని జీవ త్వము సిద్ధింపవలయును. అవి బాహ్యదృశ్యములు గాన వానికి జీవత్వము రాఁగూడదు గనుక కేవలాంతఃకరణంబునకు జీవత్వంబు చెప్పవొప్పదు. అద్దము లోనగునవి బాహ్య పదార్థములు. అంతఃకరణంబు ఆంతరపదార్థము గనుక దానికి జీవత్వము చెప్పవల దనిన ఇంద్రియములును ఆంతరములే గనుక వానికిని జీవత్వంబు చెప్పవలయును. అవి అంధ త్వ మందత్వపటుత్వములు గలవి గావున వానికి జీవత్వంబు కూడదుగనుక అంతఃకరణం బునకు జీవత్వంబు చెప్పరాదు. మఱియు అంతఃకరణము ఇంద్రియాదులకంటె అంతరం బు గనుక దానికి జీవత్వము చెప్పవల దనిన ఇంద్రియాదుల అజ్ఞానంబు ఆయజ్ఞానంబు అంతఃకరణంబునకంటె అంతరంబు గనుక దానికిని జీవత్వంబు రావలయును. అది అభా వరూపము గలది గనుక దానికి జీవత్వంబు చెప్పఁగూడదు కాఁబట్టి ఆంతర్య మయినను కేవలాంతఃకరణంబునకు జీవత్వంబు చెప్పఁగూడదు. మఱియు జీవుఁడు చేతనుఁడు గావు నను అంతఃకరణము అచేతనము గనుకను దానికి జీవత్వము చెప్పరాదు. అయితే కేవల

ప్రతిబింబమునకు జీవత్వంబు చెప్పవద మనిన అంతఃకరణములేక ప్రతిబింబము లేదు గనుక కేవల ప్రతిబింబమునకు జీవత్వంబు చెప్పఁగూడదు. అయితే ప్రతిబింబంబుకొలకు అంతఃకరణంబు నంగీకరించి కేవల ప్రతిబింబంబునకు జీవత్వంబు చెప్పవదమనిన ప్రతిబింబమునకు స్వయంవికారాదులు గలిగియున్నను కర్తృత్వాదివికారము లేదు గనుక కేవల ప్రతిబింబమునకు జీవత్వంబు చెప్పఁగూడదు. అయితే అధిష్ఠాన చైతన్యంబునకు జీవత్వంబు చెప్పవద మనిన ఆచైతన్యంబు నిర్వికారంబు గనుక వికారస్వరూపమైనజీవత్వము ఆయధిష్ఠాన చైతన్యంబునకు గూడదు. అయితే అంతఃకరణంబును ప్రతిబింబమును కూడి జీవుఁడని చెప్పవదమనిన ఇవి రెండును కల్పితంబులుగనుక అటులు చెప్పినజీవునకు నిత్యత్వము సిద్ధింపదు. అందువలన ముక్తుఁడు లేకపోవుచున్నాఁడు కాఁబట్టి అంతఃకరణమును ప్రతిబింబమునుగూడి జీవుఁడని చెప్పఁగూడదు. అధిష్ఠానచైతన్యంబును ప్రతిబింబచైతన్యంబును గూడి జీవుఁడని వక్కాణింత మనిన కేవలచైతన్యము నిర్వికారము గనుక ఆబింబప్రతిబింబ చైతన్యంబులకు కర్తృత్వభోక్తృత్వాది వికారలక్షణమయిన జీవత్వంబు నుడువఁగూడదు. అయితే అధిష్ఠానచైతన్యంబును అంతఃకరణంబునుగూడి జీవుఁడని యందు మనిన దర్పణంబును దర్పణాధిష్ఠానచైతన్యంబునుగూడి జీవుడు కావలెను. వానికి జీవత్వము కూడదు గనుక అధిష్ఠానచైతన్యమునకు అంతఃకరణమునకు జీవత్వము వాక్రువ్వఁగూడదు కాఁబట్టి అంతఃకరణంబును అంతఃకరణాధిష్ఠానచైతన్యంబును అంతఃకరణప్రతిబింబ చైతన్యంబును గూడి జీవుఁ డని చెప్పవలెను. మఱియును జీవత్వంబునకు ఇంతమాత్రము చాలదు. కర్తృత్వభోక్తృత్వాది విశిష్టత్వంబు జీవత్వంబు గాన కర్తృత్వభోక్తృత్వాదులు సిద్ధించుటకు అంతఃకరణంబుతోఁడి సూక్ష్మశరీరమునకు జీవత్వము సిద్ధింపవలెను. ఇంతే కాదు సూక్ష్మశరీరము స్థూలశరీరమును విడిచి యుండదు గనుకను ఇంద్రియములకు వాని వాని గోళకములను విడిచి స్వకీయవిషయగ్రహణము కూడదు గనుకను బ్రాహ్మణత్వాద్యభిమానము లేక కర్తృత్వము కూడదు గనుకను స్థూలశరీరంబును గావలయును. అసంగుఁడయిన ఆత్మకు అజ్ఞానంబు లేదు. అజ్ఞానంబు లేక శరీరంబు రాదు గనుక అజ్ఞానంబును అధిష్ఠానచైతన్యంబును ప్రతిబింబచైతన్యంబును అంతఃకరణంబును శరీరత్రయంబును వీనియందుఁగల అధ్యాసయును గూడి జీవుఁ డని చెప్పఁబడును గనుక విరాట్పురుషుఁడు మొదలగు సర్వప్రాణిసంఘమును జీవసంజ్ఞగలది యగును. స్థూల సూక్ష్మ కారణ శరీరములకంటె వ్యతిరిక్తుఁడై అవస్థాత్రయ సాక్షియై పంచకోశవిలక్షణుఁడై నిత్యుఁడై నిర్వికారుఁడై శుద్ధుఁడై పుణ్యపాపముల నంటనివాఁడై సర్వసంబంధశూన్యుఁడై సత్యుఁడై కాలత్రయాబాధ్యుఁడై సచ్చిదానందస్వరూపుఁడయిన వాఁడు చేతనుఁడు. ‘‘శ్లో. పాశబద్ధో భవేజ్జీవః పాశముక్తో భవేచ్ఛివః’’ అని తత్త్వరత్నాకరమందు.

అవతారిక.—ఈపద్యమందు పరమాత్మ సలక్షణముగ నుతింపఁబడుచున్నది

మ. జగదాదిస్థితినాశము ల్సలుపఁగా స్రష్టాచ్యుతేశాఖ్యలన్
దగఁ జెన్నొందిన యనంతరూపుఁడయి ముత్పాథోధిచిత్సూర్యుఁడై
మిగులన్ విశ్వవిముక్తుఁడై సకలుఁడై మేరాపారమధ్యస్థుఁడై
భగవంతుం డయి వెల్గునిర్గుణపరబ్రహ్మంబుఁ బ్రార్థించెదన్. ౩౪

టీ. జగదాదిస్థితినాశముల్, జగత్=జనన లయములుగల భూలోక భువర్లోకసువర్లోకములయొక్క, ఆది=ఉత్పత్తిని, స్థితి=ఉనికిని, నాశములు=లయమును, చలుపఁగాన్=చేయుటకు-లేక-భూర్భువస్స్వర్లోకములు తమోరజస్సత్త్వగుణాత్మకములై యుండుటచేత శబ్దస్పర్శాదివిషయజాలము భూలోకము. ఇంద్రియసంఘము భువర్లోకము. ఇంద్రియాధిదేవతారూప మగునది సువర్లోకము. ఈత్రిలోకముల యుత్పత్తిస్థితిలయములఁ జేయుటకై, స్రష్టాచ్యుతేశాఖ్యలన్ - స్రష్ట=బ్రహ్మయనెడు, అచ్యుత=విష్ణువనెడు, ఈశ=రుద్రుఁడనెడు, ఆఖ్యలన్=పేళ్లచేత, తగన్ = ఒప్పిదముగా, చెన్నొంది=ప్రకాశించి, అనఁగా "జాగరితే బ్రహ్మ, స్వప్నే విష్ణుః, సుషుప్తౌ రుద్రః" అని బ్రహ్మోపనిషత్తునందును "సర్వం ఖల్విదం బ్రహ్మ" యని తైత్తిరీయోపనిషత్తునందును చెప్పియున్నది గనుక పరబ్రహ్మస్ఫురణమే త్రిమూర్తులని సర్వ మని భావము. అనంతరూపుఁడై, అనంత=మితిలేని, రూపుఁడై=చరాచరరూపములు గలవాఁడగుచు "శ్రు. ఏకో దేవో బహుధా నివిష్టః" అని శ్రుతి. "ఏకో విష్ణుర్మహద్భూతం పృథగ్భూతాన్యనేకశః, త్రీన్ లోకాన్ వ్యాప్య భూతాత్మా భుఙ్క్తే సర్వభుగవ్యయః" అని. ముత్పాథోధిచిత్సూర్యుఁడై, ముత్=అష్టవిధానందములలో మేలైన సహజానందమనెడు, పాథోధి=సముద్రముం దుదయించిన, చిత్=జ్ఞానమనెడు, సూర్యుఁడై=అర్కుఁడై, లోకమందు సముద్రమున చంద్రుఁ డుదయించినట్లు ప్రసిద్ధముగ పూర్వకవుల ప్రయోగము లుండఁగ సూర్యుఁడు సముద్రమునఁ బుట్టినట్లుగ చెప్పుట అప్రయుక్తమనుదోష మని యెంచవలదు. సూర్యుఁడు తూర్పుసముద్రమునఁ బుట్టి పడమటిసముద్రమందు గ్రుంకుచున్నాఁడను లోకవార్తయును శ్రుతిస్మృతియునుగలదు. "శ్రు. అర్కాగ్ శోచితం తగం సరిరస్య మధ్యే అజస్రం జ్యోతిర్నభసా సర్పదేతి సన ఇంద్రః కామవరం దదాతు సప్తయుంజంతి రథమేకచక్రం, ఏకో అశ్వో వహాతి సప్తనామా త్రినాభిచక్రమజరమనర్వం యేనేమా విశ్వాభువనాని తస్థుః, భద్రం పశ్యంత ఉపసేదురగ్రే తపోదీక్షామృషయస్సువర్విదః" అని. మఱి "రాకామధ్యగతశ్చంద్రస్సూర్య ఇత్యభిధీయతే" అనునిఘంటువును బట్టి సంపూర్ణపూర్ణిమనాఁడు ఉచ్చస్థానమునకు వచ్చినచంద్రుఁడు సూర్యుఁ డనఁబడును గనుక నిజ్ఞానము ఆనందసముద్రభాగమం దుదయించుటవలన నిశ్చంచలమైన దని భావము. మిగులన్=మిక్కిలి, విశ్వవిముక్తుఁడై-విశ్వ=ప్రపంచమువలన, విముక్తుఁడై = విడువఁ

బడినవాఁ డగుచు-లేక - విశ్వశబ్దమునకు ప్రణవ మర్థము గనుక ప్రణవాతీతుఁ డగుచు, సకలుఁడై=ప్రణవమందలి పదియా అుకలలతోఁ గూడినవాఁ డగుచు-లేక-శివశక్తికలలతోఁ గూడినవాఁ డగుచు, అనఁగా, ,,శ్లో. అహం పంచాక్షరం చైవ త్వంతు పంచదశాక్షరీ, పృథ్వీ బ్రహ్మా జలం విష్ణు స్తథా రుద్రో హుతాశనః, ఈశ్వరః పవనశ్చైవ ఆకాశేతు సదాశివః" అనెడు స్మృతులచేత పంచాక్షరాధిదేవతలగు బ్రహ్మ విష్ణు రుద్రేశ్వర సదాశివు లనెడు పంచకర్తృరూపములైన పృథివ్యాది పంచభూతముల గుణములగు శబ్ద స్పర్శరూపాదులు పదియైదును గూడి శక్తికల యగును. ఈపదియైదుకలలకు విలక్షణములైన పంచభూతములకలలగు నివృత్తి ప్రతిష్ఠా విద్యా శాంతి శాంత్యతీతము లైదును జేరి పదియాఱునదియైన శివకళ యగును గనుక శ్రీమచ్ఛంకరాచార్యవిరచిత శివానందలహరియందు, ,,శ్లో. కలాభ్యాం చూడాలంకృతశశికలాభ్యాం" అని యుమామహేశ్వరస్తుతి చేసిరి. మఱియు సౌందర్యలహరియందు, ,,శ్లో. శివశ్శక్త్యా యుక్తో యది భవతి" యని శ్రీశంకరభగవత్పాదులవారు చెప్పినందున శివశక్త్యైక్యమే నిరతిశయానంద [illegible] యు సర్వప్రపంచ మనియు అనులోమవిలోమ రూపముగ వచియించిరి గనుక శ్రీపురుషరూపములెల్ల శక్తిశివకళ లగును గనుక ఈయుభయకలలతోఁ గూడినవాఁ డగుచు-లేక - బ్రహ్మ, విష్ణు, రుద్ర, మహేశ్వర, సదాశివులకలలతోఁ గూడినవాఁ డగుచు, బ్రహ్మాదిదేవతాకలావివరము, [వెనుకఁ జెప్పఁబడినది.] మేర్వారమధ్యస్థుఁడై, మేర్వార=శ్రీచక్రముయొక్క, మధ్యస్థుఁడై=మధ్యభాగమగు బిందువందు వసించువాఁ డగుచు, శ్రీచక్రవిషయము ఇరువదియొనిమిదవ పద్యమునఁ జూడవలెను-లేక-మేరు=బ్రహ్మాండమధ్యమందలి మేరుగిరిచివరనుండు, అర=శింశుమారచక్రముయొక్క, మధ్యస్థుఁడై=నిమేషాది ప్రళయాంతమగు కాలవిలక్షణరూపముచేత మధ్యమందు వెలుఁగుచున్నవాఁ డగుచు-లేక-బ్రహ్మదండి యను పేరుగలదై శరీరమునకు వెనుకప్రక్కనుండు పెద్దయెముక మేరు వనఁబడును. దానితుద నుండుసహస్రారచక్రమునందు హంసరూపమున వసించువాఁ డగుచు, భగవంతుం డయి=సర్వజ్ఞ నిత్యతృప్తి అనాదిబోధ స్వస్వతంత్ర నిత్యమలుప్త అనంతము లనెడి షట్ఛక్తులు గలవాఁ డగుచు-లేక, మహత్త్వధైర్య కీర్తి శ్రీజ్ఞానవైరాగ్యము లనెడి షడ్గుణైశ్వర్యములు గలవాఁ డగుచు, లేక, ,,శ్లో. ఉత్పత్తించ వినాశంచ భూతానామాగతిం గతిమ్, వేత్తి విద్యామవిద్యాంచ సవ్యాం భగ ఇతీరితః" అను స్మృతినిబట్టి పుట్టుట గిట్టుటలను ప్రాణుల రాకపోకలను విద్యను అవిద్యను ఎఱుఁగుట గలవాఁ డగుచు, వెల్గు... బ్రహ్మంబుఁ, వెల్గు=ప్రకాశించునట్టి, నిర్గుణ = త్రిగుణరహితుఁడైన, పరబ్రహ్మంబుఁ=పరమాత్మను, ప్రార్థించెదఁ=వేఁడుకొనుచున్నాను.

తా. తననిర్వికల్పజ్ఞానము బహిర్ముఖమై ప్రకృతిరూపముగ పరిణమింపఁగా ఆప్రకృతి ధర్మములైన సత్త్వరజస్తమోగుణములవలనఁ బుట్టిన సువర్లోక భువర్లోక భూలో

కములను పుట్టించి పెంపు త్రుంపు స్వరూపలక్షణముచేత నిర్గుణుండగు తానే తటస్థలక్షణము చేత సగుణుండగుచు బ్రహ్మ విష్ణు రుద్రస్వరూపముల ధరించినవాఁడై స్థావర జంగమాత్మకములగు సకలప్రాణిస్వరూపుఁడై ఆనందసాగరమందుఁ బుట్టిన జ్ఞానసూర్యుఁడై ప్రణవరూపప్రపంచ విలక్షణుఁడై శివశక్తికళాసహితుఁడై మేరుచక్రమునడుమ వసించువాఁడై షడ్గుణైశ్వర్యసంపన్నుఁడై సర్వశక్తియుక్తుఁడై సచ్చిదానంద నిత్య నిర్గుణ పరిపూర్ణలక్షణసమేతుఁడై వెలిఁగెడు పరమాత్మను ప్రార్థించుచున్నా నని తాత్పర్యము.

అవతారిక.—కృపానిధియై గురురూపముచేత సాక్షాత్కరించిన ఆపరబ్రహ్మము నిరాకారముగ కొనియాడఁబడుచున్నది.

చ. ఎవనియపారసత్కరుణ నెందుల నేఁ బరిపూర్ణమై మదిన్
దవిలిన వెల్ల మిథ్యలుగదా యని యెన్ని తదీయబోధచే
నవిరళనైజభావ మెద నందితిఁ గుడ్యగతాభ్రలీలఁ ద
త్పవిమలదేశికప్రవరుపాదసరోజము లాశ్రయించెదన్. ౩౬

టీ. ఎవనియపారసత్కరుణన్, ఎవని=ఏమహితగురువుయొక్క, అపార=మితిమీరిన, సత్=శ్రేష్ఠమైన, కరుణన్=నిర్వ్యాజకృపచేత, ఎందులన్=అంతటను, ఏన్=నేను, పరిపూర్ణమై=నిండియున్నవాఁడనై, అనఁగా పరబ్రహ్మస్వరూపుఁడనై, మదిన్=అంతఃకరణమందు, తవిలిన వెల్లన్=తోఁచిన జీవేశ్వర జగద్భ్రాంతు లన్నియును, మిథ్యలు గదా యని=అసత్యములే యని, ఎన్ని=తలఁచి, అనఁగా నామరూపాత్మకమగు సర్వము బ్రహ్మము గాదని తలఁచి, తదీయబోధచేన్=ఆనిర్వికల్పజ్ఞానముచేత, కుడ్యగతాభ్రలీలన్=గోడనంటిన గగనమువలె, అనఁగా గోడకు వెలుపల లోపల మిన్నావరించి యున్నట్లు, సర్వప్రపంచమునకు లోపల వెలుపల వ్యాపించియున్నట్టి, అవిరళనైజభావమున్-అవిరళ=మిక్కుటమైన, నైజ=స్వీయమైన, భావమున్=బ్రహ్మాకారమును, ఎదన్=అంతరంగమందు, అందితిన్=పొందితినో, అనఁగా, ప్రకృతిభ్రమచేత స్వస్వరూప విస్మృతిని బొంది గురూపదేశమునఁ గలిగిన దివ్యజ్ఞానమువలన భ్రమవీడఁగానే "అహం బ్రహ్మాస్మి" యను నిశ్చయము అంతరంగమున స్థిరముగఁ గలవాఁడనైతినో యనుట, తత్పవి...ములు, తత్=అట్టి, ప్రవిమల=పరమపవిత్రుఁడయిన, దేశికప్రవర=గురూత్తముని యొక్క, అనఁగా కారణగురువుయొక్క, పాదసరోజములు=అడుగుదామరలను, ఆశ్రయించెదన్=సేవించుచున్నాను.

తా. ఏమహానుభావుని యపారకృపచేత బ్రహ్మాదిస్తంబపర్యంతమై సకలమందును "సర్వం ఖల్విదం బ్రహ్మ" అను శ్రుత్యర్థమునుబట్టి నిండియున్నాఁడనో ఎవనికరుణచేత నాయందుఁ దోఁచిన జీవేశ్వర జగత్తు లనెడు దృశ్యములు, "శ్లో. దృశ్యం సర్వమనాత్మ

స్యా ద్ద్రగేవాత్మా వికారిణి॥ అనుస్మృతిప్రమాణముచేత నశించునవి యని పరబ్రహ్మము సత్య మని తలఁచి గోపనంటిన మింటిగలె సర్వవ్యాపక పరబ్రహ్మమయమగు నానిజస్వ రూపము నేనై తేజరిల్లితినో అట్టి అతీతస్వరూపుఁడయిన కారణాచార్యుని పాదపద్మము లను భజించుచున్నా నని తాత్పర్యము.

అవతారిక.—గురురూపముననున్న పరబ్రహ్మము సాకారముగ వినుతింపఁ బడు చున్నది.

మ. మదహంకారముఖాఖిలాన్వితమహామాయన్ వివస్వంతునిన్
గదియం జేరినమంచుభంగిఁ బరఁగన్ ఖండించి త్వన్మేధయుం
దుదయంబై నయథార్థ మీా వదియె నే నూహింపుమీా యంచుస
మ్ముద ముప్పొంగఁగఁ దెల్పుదేశికవిరాణ్మూర్తిన్ సదా కొల్చెదన్.

టీ. మద...మాయన్, మత్=నాయొక్క, అహంకార=గర్వమే, ముఖ=మొద లయిన, అఖిల=సకలముతోడ, అనఁగా రాగము ద్వేషము కామము క్రోధము లోభము మోహము మదము మాత్సర్యము డంభము దర్పము ఈర్ష్య అసూయ అహంకార మనెడు వానితోడ, అన్విత=కూడిన, మహామాయన్ = మూలాతూలారూపమైన యజ్ఞానమును, వివస్వంతునిన్=సూర్యుని, కదియన్=అన్యవహితముగ, చేరిన=సమీపించిన, మంచు భంగిన్=హిమమువలె, పరఁగన్=లెస్సగా, ఖండించి=నఱికి, త్వన్మేధయందున్=నీతెలివి యందు, ఉదయంబు=ఆవిర్భవించినది, వినయథార్థము=అయినకూటస్థబ్రహ్మము, ఈవు= నీవే, అదియె=ఆసచ్చిదానందస్వరూపమైన కూటస్థబ్రహ్మమే, నేను=సచ్చిజ్ఞానానంద స్వరూపుఁడయిన నేను, ఊహింపుమీా=భావింపుమూ, అంచున్=అని, సమ్ముదము=నిరతి శయానందము, ఉప్పొంగఁగన్=వెల్లివిరియఁగా, తెల్పు...ర్తిన్, తెల్పు=బోధించు చున్నట్టి, దేశిక=ఆచార్యునియొక్క, విరాణ్మూర్తిన్=అప్రాకృతదివ్యమంగళవిగ్రహ మును, సదా=ఎల్లప్పుడు, కొల్చెదన్=భజించుచున్నాను.

తా. అవిషయమగు తన్ను విషయరూపముగ పరిణమింపఁజేయుటకు తనయందవి నాభావముగ నున్న అవ్యక్తనామక మూలప్రకృతియే మహదహంకారాది సప్తావరణ రూపమై వ్యష్టిసమష్టిరూపులయిన జీవేశ్వరులను గల్పించి వారికి భోగసాధనములుగ స్థూలసూక్ష్మకారణమహాకారణ శరీరములను జాగ్రత్స్వప్నసుషుప్తితురీయావస్థలను విశ్వ తైజసప్రాజ్ఞప్రత్యగాత్మవిరాట్ హిరణ్యగర్భ అవ్యాకృత పరమాత్మనామములను, అన్న మయాది పంచకోశములను నిర్మించి యెల్లప్పుడు జీవేశ్వరజగద్భ్రిమలను మాపుచున్న ఆయవ్యక్తనామక మహామాయను వర్షకిరణములు హిమకిరణములు ఉష్ణకిరణములు గలిగి వెలుఁగుచున్న సూర్యుఁడు తనహిమకిరణమువలన పుట్టినమంచు తన్నావరింపఁగా దాన్నిని

తనయుష్ణకిరణములవేఁడిమిచేత నశింపఁజేసినట్లు తనయందలి స్వరూపజ్ఞానమువలన నుద యించిన వృత్తిజ్ఞానముచేత ఆమాయను నశింపఁజేసి వెనుక నిలిచిన సత్యము జ్ఞానము ఆనందము నిత్యము నిర్మలము అనెడుపంచలక్షణములుగల పరబ్రహ్మమే నీవు ఆపరబ్ర హ్మమే నేను అని నిరాయాసముగ సాక్షాత్కరించి యుపదేశించిన గురుమూర్తి నెల్ల ప్పుడు సేవించుచున్నా నని తాత్పర్యము.

## రాగద్వేషాదుల వివరణము.

రాగము ద్వేషము కామము క్రోధము లోభము మోహము మదము మాత్సర్యము ఈర్ష్య అసూయ దంభము దర్పము అహంకారము అని పదమూఁడువిధములు. అందు రాగ మనఁగా పరస్త్రీవిషయకముగఁ గలిగెడు చిత్తవృత్తి. ఇందువలన మహాబలశాలి యగు రావణుఁడు సీతాదేవిని చెఱఁబెట్టి పుత్రమిత్రభాతృబంధుపరివారంబులతోడ మడిసెను.

ద్వేష మనఁగా ఒకఁడు అపకారము చేయఁగా వానికి మరల అపకారము చేయ వలయు ననెడిచిత్తవృత్తి. ఇందువలన హిరణ్యకశిపుఁడు దురాచారుఁడయిన తనయను జుని వరాహరూపుఁడయిన హరి పొరిగొనె నని ద్వేషించి దూషించి ఆమాధవుని వధింప శపథంబు చేసిన ఆనారాయణుండు నరసింహరూపముచేత వానిని సంహరించెను.

కామ మనఁగా ఇండ్లు తోఁటలు మాన్యములు ధనములు ధాన్యములు పశువులు స్త్రీలు మొదలగువానిని ఎక్కువగ సంపాదింపవలయు ననెడి చిత్తవృత్తి. దీనివలన నర కాసురుఁడు అనేకస్త్రీలను దెచ్చి చెఱఁబెట్టినందున శ్రీకృష్ణమూర్తి వానిని జంపెను.

క్రోధ మనఁగా తాను చేయునట్టి పనులకు విఘ్నము చేయువానిని శిక్షింపవలయు నని ఉగ్రముగఁ గలిగెడు చిత్తవృత్తి. ఇందువలన బకాసురుఁడు ఏకచక్రపురని వాసులగు బ్రాహ్మణులను బాధించుచుండ వారలప్రేరేపణంబున భీముఁడారక్కసుని చక్కాడెను.

లోభ మనఁగా తనకు లభించిన పదార్థంబుల నితరుల కియ్యఁగూడ దనుచిత్త వృత్తి. ఇందువలన రాజరాజగు దుర్యోధనుఁడు తనజ్ఞాతులగు పాండవుల కియ్యవలసిన సగభాగము నియ్యనందున పుత్రమిత్ర సహోదరబంధువులతోడ వారిచేత మడిసెను.

మోహ మనఁగా పుత్రకళత్రధనాదులయందు మిక్కుటపు ప్రేమ గలిగి యుక్తా యుక్తముల నెఱుఁగని చిత్తవృత్తి. ఇందువలన దశరథమహారాజు తనభార్యయగు కైక యందలి ప్రీతిచేత సత్యశీలాదిసద్గుణనిధియైన శ్రీరాముని అడవులకుఁ బంపి అందున తానును మృతినొందెను.

మద మనఁగా సకలసంపదలు గలిగి గర్వాంధుఁడై నేనేమి చేసినను చెల్లునని తోఁచెడు చిత్తవృత్తి. ఇందువల్ల జమదగ్నిమహర్షి యొక్క హోమధేనువును కార్త

వీర్యార్జునునిపుత్రులు క్రొవ్వుచేత నపహరించి పరశురాముని నెదిరించినందున యుద్ధమం దతనిచేత తామును తమతండ్రియగు కార్తవీర్యుఁడును నీల్గిరి.

మాత్సర్య మనఁగా ఇతరులు తనకంటె నెక్కుడగు విద్యయును ఐశ్వర్యమును చక్కఁదనమును భోగమును వర్చస్సును శరీరబలమును పరాక్రమమును గలవారై యుండఁగాఁ జూచి యోర్వఁజాలక మండిపడు చిత్తవృత్తి. ఇందువలన శిశుపాలుఁడు ధర్మరాజు చేయు రాజసూయయాగమందు కృష్ణుని వైభవమును జూచి యోర్వక తిట్టి చక్రాయుధముచేత గిట్టెను.

ఈర్ష్య యనఁగా నాకు వచ్చిన కష్టములు ఇతరులకు రావలయు నను చిత్తవృత్తి. ఇందువల్ల అరుణాత్ముఁ డనువాఁడు తనతో సమానుఁడగు బాణునకు దుఃఖములు రాఁగోరి అతనిచేత ప్రాణములు గోలుపోయెను.

అసూయ యనఁగా తనకుఁ గలిగినసుఖములు ఇతరులకుఁ గలుగరా దనుచిత్తవృత్తి. ఇందువలన పుండ్రకదేశపురాజగు వాసుదేవుఁడు వాసుదేవుఁడనుపేరు నాకుఁ దగును గాని మఱియొకనికిఁ దగునా యనెడువిరోధముచేత వాసుదేవుఁడైన శ్రీకృష్ణమూర్తితో మచ్చరించి చచ్చెను.

దంభ మనఁగా తాను చేసినపనులు పరు లెఱిఁగి హెచ్చుగ మెచ్చవలయు నను చిత్తవృత్తి. ఇందువల్ల అపూర్వుఁడు తనయాగమును జూడు మని దుర్వాసునితోఁ బలికిన అతఁడు ఇది దంభ మనఁగా అందుకు అపూర్వుఁ డలిగి దుర్వాసుని దూషించి విఫలము నొందెను.

దర్ప మనఁగా నేను సర్వవిషయములయందు సమర్థుఁడను నాకు సాటియైన మేటి యేచోటను లేఁడను చిత్తవృత్తి. ఇందువల్ల త్రిలోకకంటకుఁడైన దశకంఠుఁడు క్రొవ్వి యెవ్వరిని చవ్వచేసి నా కెవ్వ రీడని తిరుగుచుండ విష్ణుదేవుఁడు శ్రీరాముఁడై యుదయించి కదనంబున వానిని వధించెను.

అహంకార మనఁగా ఓరీ నిన్ను శిక్షించువాఁడ నని యెలుఁగవా నే పట్టినపట్టును తుదముట్టింపక నట్టనడుమ విడిచిపెట్టునట్టి వాఁడను గాను అని యితరుల నదలించు చిత్తవృత్తి. దీనివలన మధుఁడు కైటభుఁడు అనెడు టక్కరిరక్కసులు అహంకరించి విష్ణుదేవునితో కలహించి కాలముచేసిరి కనుక బుద్ధిమంతులును భగవత్సేవాపరులును ముముక్షువులును నైనవారు ఈదుర్గుణములను దగ్గఱకుఁజేరనియ్యక పెద్దల సేవించుచు నుండవలయును.

అవతారిక:——గురుపదంబులకు వందనంబు గావించి తత్కృపచేతఁ జెప్పఁబూనిన ఈశాస్త్రమందు ముముక్షువులకు ముఖ్యముగఁ దెలియఁదగిన సంబంధము విషయము

ప్రయోజనము అధికారి అనెడి అనుబంధచతుష్టయమందలి అధికారి విషయము అను రెండును ఈపద్యమందుఁ జెప్పఁబడుచున్నవి.

ఉ. నాకముఁబోక నాదినిధనంబులు లేక వెలుంగుదేశిక
శ్రీకరు భక్తి సంస్తుతులఁ జేసి కనుంగొని బంధముక్తులన్
దూఁకొన శక్తి లేక మదిఁ దూలినవారల కెల్ల శాస్త్రముల్
చేకొని తద్గతాంశములఁ జేర్చి యొనర్చెద దీనిఁ బూనికన్. ౩౮

టీ. నాకముఁబోకన్=మొదలును తుదయును లేనియాకాశమువలె, అనినిధనంబులు=జననమును నాశమును అనఁగా షడ్వికారములును, లేక=కలుగక, వెలుంగు=ఎల్లప్పుడును ప్రకాశించెడు, దేశిక శ్రీకరున్ = మోక్షసంపదను గలిగించుకారణాచార్యుని, భక్తిన్=అనురాగముచేత, సంస్తుతులన్=స్తోత్రములను, చేసి=కావించి, బంధముక్తులన్-బంధ=అజ్ఞానరూపమగు జన్మబంధమును, ముక్తులన్ = పునరావృత్తిరహితమగు జీవవిదేహముక్తిని, కనుంగొని=తెలిసికొని, దూఁకొనన్=బంధములను త్రెంచి మోక్షమునఁ బ్రవేశించుటకు-అనఁగా పొందుటకు, శక్తిలేక=అనేకవిధములుగఁ జెప్పెడు అనేకశాస్త్రముల శోధించి ముఖ్యార్థములను దెలిసికొన సామర్థ్యములేక, మది=మనస్సు, దూలినవారికిన్=చలనము నొందిన ముముక్షువులకు, ఎల్లశాస్త్రములు = సకలవేదాంతశాస్త్రములను, చేకొని = గ్రహించి, తద్గతాంశములన్=ఆశాస్త్రములలోని ముఖ్యవిషయములను, చేర్చి=ఒకటిగాఁ గూర్చి, దీనిన్=ఈకైవల్యనవనీతమనెడి మోక్షశాస్త్రమును, పూనికన్=ప్రయత్నముతో, ఒనర్చెదన్=రచియించుచున్నాను.

తా. మొదలును తుదయును లేని ఆకాశమువలె పుట్టుట గిట్టుట లేక భూతభవిష్యద్వర్తమానములనెడి త్రికాలములయందు ఒక్కరీతిగ వెలుఁగుచుండెడి పరమశివస్వరూపుఁడైన నాగురువునకు నమస్కరించి యిది బంధము, ఇది ముక్తి అని తెలిసి బ్రహ్మజ్ఞానమును పొందుటకు ముఖ్యసాధనములగు వేదాంతశాస్త్రములు అనేకములై అనేకవిధములుగ చెప్పుచుండుటవలన వాని నెల్ల శోధించి వానియందలి ముఖ్యవిషయములను తెలిసికొన శక్తిలేక తహతహపడెడు ముముక్షుజనులకు ఉపకారముగ సకలవేదాంతశాస్త్రములలోని ముఖ్యవిషయముల నన్నింటిని సంగ్రహించి యీశాస్త్రమును రచియించుచున్నానని తాత్పర్యము.

అనేకవేదాంతశాస్త్రములలోని ముఖ్యవిషయము లెల్ల దీనియందు కలిగియుండుటయే విషయము. బంధమును ముక్తిని తెలిసి సాధనచతుష్టయసంపత్తి గలిగినముముక్షువే అధికారి.

అవతారిక:—ఈపద్యమందు సంబంధమును, ప్రయోజనమును చెప్పఁబడుచున్నది.

మ. వెలయున్ బ్రహ్మసుపర్వగోచ్యుతమహోవేదాంతదుగ్ధాబ్ధి యం
దలివాగ్దుగ్ధములన్ గ్రహించిరి స్వశాస్త్రప్రోఖలం బూర్వులా
కలశాలిం గొని యే విచారశుచి నింకం బూర్వపక్షోదకం
బులు సిద్ధాంతపయస్య ముబ్బఁదనరం బాలొప్పెందఁ గాఁచన్ భువిన్.

టీ. భువిన్=భూమియందు, బ్రహ్మ...దుగ్ధాబ్ధి-బ్రహ్మ = "చతుష్పాత్పరబ్రహ్మ" అను శ్రుతినిబట్టి, అవిద్య విద్య ఆనందము తురీయము అనెడునాలుగుపాదములు గల పరబ్రహ్మమనెడు, సుపర్వగో=కామధేనువువలన, చ్యుత=స్రవించినట్టి, మహో=గొప్పదియైన, వేదాంత=ఉపనిషత్తులనెడు, దుగ్ధాబ్ధి=క్షీరసముద్రము, వెలయున్=ప్రకాశించును. పూర్వులు=బ్రహ్మవిద్యావిశారదులైన మునుపటిపండితులు, స్వశాస్త్రప్రోఖలన్-స్వ=తమచేత నిర్మింపఁబడిన, శాస్త్ర=బ్రహ్మతత్త్వశాస్త్రములనెడు, ప్రోఖలన్=కడవలయందు, అందలివాగ్దుగ్ధములన్-అందలి = ఆశాస్త్రములనెడిపాలకడవలయందలి, వాక్=మహావాక్యములనెడి, దుగ్ధములన్=పాలను, గ్రహించిరి=నిండించికొనిరి. ఏన్=నేను, ఆకలశాలిన్=ఆపాలకుండలతండమును, కొని=గ్రహించి, విచారశుచిన్-విచార=శోధనయనెడు, శుచిన్=అగ్నిచేత, పూర్వపక్షోదకంబులు, పూర్వపక్ష=పూర్వులవాక్యార్థములనెడు, ఉదకంబులు=జలములు, ఇంకన్=అడుగంటునట్లుగను, సిద్ధాంతపయస్యము, సిద్ధాంత=స్వమతసిద్ధాంతమనెడి, పయస్యము=మీఁగడ, ఉబ్బన్=పైకి తేలునట్లుగను, పొలొప్పెందన్=చక్కఁగా, కాఁచన్=కాఁచఁగాను, తనరన్ = ఆపాలు మిగుల తియ్యనై యొప్పెను. తాత్పర్యము పైపద్యముతో. ని. పిఠరః స్థాల్యుఖా కుండ మని అమరము.

మ. ఫలితంబైనతదీయదుగ్ధములఁ జేర్పన్ వృత్తిధీతక్రమున్
గలుపయ్యెం దగఁ దెల్వికవ్వ మిడి చిల్కన్ భాసిలెం దానఁ గే
వలకైవల్యనవోద్ధృతంబు బుధసేవ్యంబై వెసన్ దీని నాఁ
కలి దీఱం దినువారు దుర్విషయమృత్ఖండంబు లాసింతురే. ౪౦

టీ. ఫలితం...ములన్-ఫలితంబు=పరిపక్వములైనవి, ఐనతదీయదుగ్ధములన్=అయినట్టి యాపాలయందు, వృత్తిధీతక్రమున్-వృత్తిధీ = వృత్తిజ్ఞానమనెడు, తక్రమున్=మజ్జిగను, చేర్పన్=చేమిరిపెట్టఁగా, కలుపయ్యెన్=పేరిపెరుగయ్యెను, దానన్=ఆపెరుగునందు, తెల్వికవ్వమున్-తెల్వి=స్వరూపజ్ఞానమనెడి, కవ్వమున్ = మంథానమును, ఇడి=ఉంచి, తగన్=చక్కఁగా, చిల్కన్=మథింపఁగాను, కేవల...తంబు-కేవల = ముఖ్యమైన, కైవల్య=మోక్షమనెడి, నవోద్ధృతంబు=వెన్న, బుధసేవ్యంబై-బుధ=పండితులచేత, సేవ్యంబై=శ్రవణాదులచేత ననుభవింపఁదగినదై, భాసిలెన్ = ప్రకాశించెను,

వెసన్=వేగముగ, దీన్నిన్=ఈకైవల్యనవనీతశాస్త్ర మనెడివెన్నను, ఆఁకలి = ఇతరశాస్త్రాపేక్షయను క్షుధ, తీఱన్=లేనట్టుగ, తినువారు=పఠనాదులచేత ననుభవించువారు, దుర్వ...బులు-దుర్విషయ = మోక్షప్రాప్తి కనర్హములైన శృంగార ద్యూత యుద్ధాదులకథలనెడు, మృత్ఖండంబులు = మంటిపెళ్లలను, ఆసింతురే = శ్రవణరూపముగ ననుభవింపఁగోరుదురా.

తా. పుడమియందు అవిద్య విద్య ఆనందము తురీయము అనెడి నాలుగుకాళ్లుగల పరబ్రహ్మమనెడు కామధేనువు కలదు. దానియొక్క నాలుగువేదములనెడి నాలుగు స్తనములనుండి స్రవించిన వెయ్యిన్ని నూటయేనుబది ఉపనిషత్తులయందలి వాక్యార్థములనెడు గొప్పపాలసముద్రము మెఱయుచుండును. ఆసముద్రమందలి వాక్యార్థములనెడు పాలను ముంగుండెడి పండితులు తాము రచియించిన వేదాంతశాస్త్రములనెడు కడవలలో నింపిరి. ఆకుండలను విచారణ యనెడు అగ్నిలో నుంచి వానియందలి పూర్వపక్షమనెడు నీరడుగు పట్టునట్టుగను సిద్ధాంతమనెడుమీఁగడ పైకి ఉబుకునట్టుగను కాఁచఁగా ఆపాలు మధురమై యొప్పెను. పక్వములైన యాపాలయందు వృత్తిజ్ఞానమనెడు చల్లను చేమిరిపెట్టఁగా పేరి పెరుగయ్యెను. దానియందు అపరోక్షసాక్షాత్కార స్వరూపజ్ఞానమనెడి కవ్వము నుంచి శ్రవణ మనన నిదిధ్యాసములనెడు వానిచేత చిలుకఁగా కైవల్యనవనీతశాస్త్రమనెడి వెన్న పుట్టెను. దీనిని వేగముగ శృంగార యుద్ధ చోరాది వర్ణనములుగల గ్రంథములు అగ్నిష్టోమాతిరాత్రాది కర్మధర్మశాస్త్రములు మూర్త్యంతరమతానుష్ఠాన పూజాధ్యానాదుల వివరణములు ఎఱుఁగవలయు ననెడి మట్టిపెళ్లలను వినికిడిరూపముగ ననుభవింపక కైవల్యనవనీతశాస్త్ర మనెడి వెన్ననే యనుభవింతు రని తాత్పర్యము. బ్రహ్మమువలనఁ గలిగినయీశాస్త్రము ఆబ్రహ్మమునే ప్రతిపాదించుటచేత ఈరెంటికిఁగల అనుబంధమే సంబంధము. ఈశాస్త్రమునే పఠించి జీవన్ముక్తిని పొందుటే ప్రయోజనము.

అవతారిక.—ఈశాస్త్రము పఠించువారికి గ్రంథవిస్తరభీతి తోఁపకుండుటకై ప్రకరణవిభాగము చెప్పఁబడుచున్నది.

శా. శ్రీకంఠున్ గిరిజాపతిన్ స్మరహరున్ సేవించి యాత్మేశ్వరున్
సాకారంబుగఁ దత్త్వబోధ మనఁగా సందేహనాశం బనా
సాకల్యోదయయుగామలప్రకరణాంచత్సర్వశాస్త్రార్థను
శ్రీకైవల్యనవోద్ధృతాఖ్య మగునీసచ్ఛాస్త్ర మేఁ జేసెదన్. ౮౧

టీ. శ్రీకంఠున్=విషము కుత్తుకయందుఁ గలవాఁడును,అనఁగా మోక్షవిరోధియగు అజ్ఞానమనెడి విషమును మ్రింగినవాఁ డనుట. గిరిజాపతిన్=పార్వతీదేవికి వల్లభుఁడును, లేక, పరబ్రహ్మము తనయందు తోఁచి తన్ను వ్యాపించికొని భిన్న అభిన్న భిన్నా

భిన్న అనెడు పేళ్లుగల మూలప్రకృతికి నియామకుఁడును, స్మరహరుఁ=మన్మథసంహార కుఁడును, లేక, నిస్సంకల్పుఁడును, ఆత్మేశ్వరుఁ, ఆత్మ = దేహేంద్రియాదులు నే ననెడు నాకు, ఈశ్వరుఁ=మోక్షరూపమగు పరమైశ్వర్యము నిచ్చునట్టి పరమశివుని, సాకారంబుగఁ = కిరీటమకరకుండలాదిసర్వభూషణభూషితములైన అవయవములు గలిగి సకలోపనిషణ్మయమగు అప్రాకృతదివ్యమంగళవిగ్రహునిగాను, సేవించి = ఆరాధించి, తత్త్వబోధము=తత్త్వబోధము, అనఁగాఁ=అనునట్లుగాను, సందేహనాశంబు=సందేహనాశనము, అనాఁ=అనునట్లుగాను, సాకల్యో...ఖ్యము-సాకల్య=సమగ్రములైన, ఉరు=ఘనములైన, యుగ=రెండైన, అమల=నిర్మలములైన, ప్రకరణ=భాగములచేత, అంచత్=ఒప్పిదమగుచున్న, సర్వ=సకలములైన, శాస్త్ర = వేదాంతశాస్త్రములయంద లి, అర్థ=తాత్పర్యములచేతను, సు=సుష్ఠైన, శ్రీకైవల్యనవోద్ధృతాఖ్యము=శోభాయుక్తమగు కైవల్యనవనీత మనెడు పేరుగలది, అగు=అయిన, ఈచిచ్ఛాస్త్రము = ఈజ్ఞాన శాస్త్రమును, ఏఁ=నేను, చేసెదఁ=రచియించెదను.

తా. విషమును కంఠమందు ధరించినవాఁడును పార్వతీదేవికి భర్తయును మన్మథుని సంహరించినవాఁడును నాకు ప్రభువైనవాఁడును అయిన పరమశివమూర్తిని స్తోత్రముచేసి తత్త్వబోధము సందేహనివారణము అనెడు రెండుప్రకరణములుగల కైవల్యనవనీతమనెడి యీజ్ఞానశాస్త్రమును రచియించుచున్నా నని తాత్పర్యము.

అవతారిక.— ఈపద్యమందు వేదాంతశ్రవణాధికారికి ముఖ్యములైన సాధనచతుష్టయసంపత్తిలక్షణము చెప్పఁబడుచున్నది.

శా. నిత్యానిత్యపదార్థధీ యిహపరానేకార్థలబ్ధానుభో
గత్యాగంబు శమాదిషట్కము సదా కైవల్యమం దిచ్ఛయుఁ
శ్రుత్యంతశ్రవణాధికారి కరయఁ శోభిల్లు ముఖ్యంబులై
ప్రత్యగ్వస్తువు నంద సాధనములై ప్రజ్ఞానమూలంబులై. ౪౨

టీ. అరయఁ=విచారింపఁగా, శ్రుత్యంతశ్రవణాధికారికిఁ-శ్రుత్యంత=వేదాంత శాస్త్రముయొక్క, శ్రవణ=వినుటకు, అధికారికిఁ=తగినవానికి, నిత్యానిత్యపదార్థధీ-నిత్య=నామరూపములులేని సత్యమగు పరబ్రహ్మమనెడి, అనిత్య = అసత్యమగు నామరూపములుగల బ్రహ్మవిష్ణురుద్రాది పిపీలికాంతమగు సమస్తప్రాణిసంఘసమేతమగు ప్రపంచమనెడి, పదార్థ=వస్తువులయొక్క, ధీ=వివేకమును, ఇహ...గంబుఁ-ఇహ=ఇహలోకసంబంధములైన, పర=పరలోకసంబంధములైన, అనేక = అపరిమితములైన, అర్థ=వస్తువులయందు, లబ్ధ=ప్రాప్తములయొక్క, అనుభోగ=అనుభవించుటయందు, త్యాగంబు=విరక్తియును, శమాదిషట్కము-శమ=శమమే, ఆది=మొదలగువానియొక్క, షట్కము

=ఆరును, అనఁగా శమము, దమము, ఉపరతి, తితిక్ష, శ్రద్ధ, సమాధానము అనునవి యును, సదా=ఎల్లప్పుడును, కైవల్యమందున్=మోక్షమందు, ఇచ్ఛయున్ = అపేక్ష యును, ప్రత్యగ్వస్తువున్ = సత్యజ్ఞానానందస్వరూపమగు పరబ్రహ్మమును, అందన్= పొందుటకు, సాధనములై=ఉపకరణములై, ప్రజ్ఞానమూలంబులై-ప్రజ్ఞాన=బ్రహ్మజ్ఞాన మును గలిగించుటకు, మూలంబులై=ఆదికారణములై, ముఖ్యంబులై = సకలసుగుణసంప దఁ గలిగింప ప్రధానములై, శోభిల్లున్=ప్రకాశించును.

తా. రూపనామములుగల అంతరబాహ్యదృశ్యమయమయిన ప్రపంచమెల్ల అని త్యమని రూపనామములులేక సర్వవిలక్షణమై వెలుఁగుపరబ్రహ్మము నిత్యమని తెలిసికొ నుటయును ఇహలోకమందలి స్త్రీలును పుష్ప చందన భూషణ వస్త్రములును తోఁటలు గృహములు భూములును ధన ధాన్య పశు వస్తు వాహనములును, పరలోకమందుఁగల స్వర్గ సత్య వైకుంఠ కైలాసాదులయందలి సాలోక్య సామీప్య సారూప్య సాయుజ్యా దిపదవులయందును గల భోగములయందు వమనాన్న మూత్ర పురీషాదులయందువలె ఇచ్ఛ లేక యుండుటయును శమము దమము ఉపరతి తితీక్ష శ్రద్ధ సమాధానము అనెడి సుగుణము లారును గలిగి యుండుటయును తీవ్రమోక్షేచ్ఛయును అనెడు సాధనచతు ష్టయసంపత్తి వేదాంతశాస్త్రశ్రవణము చేయువానికి ముఖ్యముగ తొలుతఁ గలిగియుండ వలయునని తాత్పర్యము.

అవతారిక.—ఈపద్యమునందు శమాదిషట్కమునకు వివరణము చెప్పఁబడుచున్నది.

ఉ. లో వెలి డిందినన్ గరణలోకము తా శమము న్దమంబు నా
నావిధయుగ్మరాజి మది నాటకయున్నఁ దితీక్ష శ్రద్ధ యౌఁ
గేవలభక్తి వాక్యవిధి గీల్కొన నెమ్మది సమ్మతంబు స
ద్భావననౌ మహోపరతి పాయ స్వధర్మములం గ్రమంబుగన్. ౪౩

టీ. లోన్=లోపలి, వెలిన్=వెలుపలి, కరణలోకములు, ఇంద్రియసమూహము లు, డిందినన్=నశించెనేని, శమము=అంతరింద్రియనిగ్రహమును, దమంబు=బాహ్యేం ద్రియనిగ్రహమును, ఔన్=అగును. నానావిధయుగ్మరాజి-నానావిధ = బహువిధము లయిన, యుగ్మ=వల్లన, వేఁడిమి సుఖము దుఃఖము మొదలగుజంటలయొక్క, రాజి= పఙ్క్తి, మదిన్=చిత్తమందు, నాటకయున్నన్=అంటకయుండెనేని, తితీక్ష=ఓర్పు, ఔన్=అవును, కేవలభక్తి-కేవల=ముఖ్యమయిన, భక్తి = గురువేదాంతమహావాక్యముల యందలి ప్రీతి, శ్రద్ధయౌన్=శ్రద్ధయగును. వాక్యవిధి-వాక్య=గురూపదేశమహావాక్య ములయొక్క, విధి=నిర్ణయము, నెమ్మదిన్=అంతఃకరణమందు, కీల్కొనన్=చేరనేని, సమ్మతంబు=సమాధానము, ఔన్=అవును. సద్భావనన్=పరబ్రహ్మభావముచేత, క్రమం

బుగాన్=నెరుసంగా, స్వధర్మములన్, స్వ=తమతమయొక్క, ధర్మములన్=విహితములయిన కర్మములును ఆశ్రమములయు క్రియలను, హాయన్ = విడిచెనేని, మహోపరతి, మహా = అతిశయమయిన, ఉపరతి=ఉపరతియనునది, ఔన్=అవును.

తా. శమము దమము ఉపరతి తితిక్ష శ్రద్ధ సమాధానము లనునవి యాఱును శమాదిషట్కసంపత్తి యనఁబడును. అందు మనస్సు బుద్ధి చిత్తము అహంకారము అనెడి అంతరింద్రియములను వానివృత్తులయిన సంకల్ప వికల్ప నిశ్చయ చంచల కర్తృత్వము లను వాని కధిదేవతలగు చంద్ర బృహస్పతి క్షేత్రజ్ఞ రుద్రులయందు ధ్యానారాధనాదులచేత చేర్చి ఆయధిదేవతలకు అధిదేవతయగు పరమాత్మయందు ఆయింద్రియాధిదేవతల నైక్యపఱచి తదేకనిష్ఠగా నుండుట శమము. వర్ణధ్వని, స్వర, మిశ్ర రూపములగు చతుర్విధశబ్దములను గ్రహించునట్టి శ్రోత్రేంద్రియమును చల్లన వేఁడిమి మృదువు కఠినము మిశ్రము అని అయిదువిధములయిన స్పర్శగ్రహణములగల త్వగింద్రియమును, పొట్టి పొడుగు లావు సన్నము ఎఱుపు తెలుపు నలుపు పసుపు ఆకుపచ్చ మిశ్రమ మని పదివిధములైన రూపముల గ్రహించునట్టి నేత్రేంద్రియమును, ఉప్పు కారము పులుసు చేఁదు వగరు తీపు మిశ్రము అని యేడువిధములైన రుచులను గ్రహించెడి జిహ్వేంద్రియమును, సుగంధము దుర్గంధము మిశ్రగంధము అని మూఁడువిధములైన గంధములను గ్రహించెడి నాసికేంద్రియమును, సువచనము దుర్వచనము మిశ్రవచనము అనెడి త్రివిధవచన సంభాషణములుగల వాగింద్రియమును, దానము ప్రతిగ్రహము అనునవిగల హస్తేంద్రియమును గమనము ఆగమనము అనునవిగల పాదేంద్రియమును రత్యానందముగల గుహ్యేంద్రియమును విసర్జనముగల పాయురింద్రియమును దిక్కులు గాలి సూర్యుఁడు వరుణుఁడు అశ్వినీదేవతలు అగ్ని దేవేంద్రుఁడు విష్ణువు మృత్యువు బ్రహ్మ అను అధిదేవతలయందు ధ్యానారాధనవ్రతోపవాసాదులచేత చేర్చి ఆయధిదేవతలకు అధిదేవతయగు పరబ్రహ్మమందు ఆయధిదేవతల నైక్యముచేసి తదేకనిష్ఠగా నుండుట దమము. వేదోక్తకులాచార కర్మములు విడువఁగూడనివైనను బ్రహ్మనిష్ఠకు విఘ్నములగుటవలన వానిని క్రమముగా విడుచుచు ఆత్మనిష్ఠను ప్రబలించుచు చిత్తవృత్తి నటు పోనియ్యక బ్రహ్మసమాధియందు మరలించుట ఉపరతి. ప్రారబ్ధవశమునఁ గలిగెడి శీతోష్ణసుఖదుఃఖ మానావమాన నిందాస్తుతి లాభాలాభ జయాపజయ జరామరణ శోకమోహ క్షుత్పిపాసాదులు మొదలైన సకలద్వంద్వములలో నేది ప్రాప్తించినను తననిష్ఠను వదలక వానివలన కలిగెడి ఖేదమోదములను సహించియుండుట తితీక్ష. ప్రభుమిత్రస్త్రీలతో సమానములగు శ్రుతిస్మృతులను పురాణేతిహాసములను ద్యూతచోరియుద్ధశృంగారాదికథలను తనకు ప్రయోజనమును గలుగఁజేయని సామాన్యశాస్త్రములను స్వప్రయోజనముల నపేక్షించెడి అనాచార్య

లను విడిచి ప్రతిప్రయోజనములనొల్లని సదాచార్యులయందును, ఆఁకలి పోఁగొట్టుకొను టకై తనవద్దకు వచ్చెడిబ్రహ్మవిదుఁడు మొదలగువానియందును విశ్వాసము గలిగియుండుటే శ్రద్ధ సచ్ఛాస్త్రములయందుఁగల విషయములను ఆలోచించి మనస్సునందు సమాధాన పఱచుకొనుటయే సమాధానము అని తాత్పర్యము.

అవతారిక.—సాధనములు లేక పనులను సాధింపఁజాలననియు ఆసాధనములు గలిగి యుండుటవలన నయ్యేడిలాభ మిదియనియు ఈపద్యమందుఁ జెప్పఁబడుచున్నది.

ఉ. సాధన మెద్ది లేక భువి ◊ సాధ్యము లంద సమర్థు లెవ్వ రీ
సాధనము ల్గ్రహింపఁ గడు ◊ సన్మతి యబ్బు నవీనబుద్ధికిన్
బోధ యొనర్పఁ జెంద దవి ◊ పొందిన భూతభవంబులందు నా
సాధకు లెల్లపుణ్యముల ◊ సల్పినవారలు గారె కావునన్.　　౪౪

టీ. భువిన్=భూమియందు, సాధనము = ఉపకరణము, ఎద్దిలేక = ఏదియులేక, సాధ్యములన్=కార్యములను, అందన్ = చెందుటకు, సమర్థులు=నేర్పరులు, ఎవ్వరు= ఏవారుగలరు, అనఁగా లేరనుట, ఈసాధనములు = నిత్యానిత్యవస్తువివేకాదిచతుర్విధ సాధనములను, గ్రహింపన్=తెలిసికొనఁగా, కడున్ = మిక్కిలి, సన్మతి=విజ్ఞానము, అబ్బున్=లభించును, నవీనబుద్ధికిన్ = నూతనవివేకికి-లేక అభ్యాసికి-అనఁగా పూర్వజన్మములయందు వేదశాస్త్రాధ్యయనాదులను కులోచిత వేదశాస్త్రోక్త శ్రౌత స్మార్త నిత్య నైమిత్తిక విధి నిషేధ కామ్య ప్రాయశ్చిత్తాది సత్కర్మములను, ఈశ్వరప్రీతిగా చేయక, యీశ్వరప్రణిధానమున భక్తి నిలుపక, కర్ణాకర్ణికగా విని శ్రవణనిమిత్తమై వచ్చినఛాత్రుఁడు నూతనవివేకి. అట్టివానికి ఆచార్యుఁ డెంత బోధించినను చిత్తనైర్మల్యము లేనందున, నిత్యానిత్యవస్తువివేకాదిసాధనములు వానిమనస్సున నిలువ వనుట. మఱి యాచార్యకృతసోపానపంచకమందు, ౹౹శ్లో. వేదో నిత్యమధీయతాం తదుదితం కర్మ స్వనుష్ఠీయతాం, తేనేశస్య విధీయతామపచితిః కామ్యే మతి స్త్యజ్యతామ్, పాపౌఘః పరిధూయతాం భవసుఖే దోషోఽనుసంధీయతా, మాత్మేచ్ఛా వ్యవసీయతాం నిజగృహాత్తూర్ణం వినిర్గమ్యతామ్. ౧ సంగస్సత్సు విధీయతాం భగవతే భక్తిర్దృఢాధీయతాం, శాంత్యాదీన్ పరిచీయతాం దృఢతరం కర్మాశు సంత్యజ్యతామ్, సద్విద్వానుపసర్ప్యతాం ప్రతిదినం తత్పాదుకే సేవ్యతాం, బ్రహ్మైకాక్షరమర్థ్యతాం శ్రుతిశిరఃపక్షోఽను సంధీయతామ్ ౹౹ అని బోధయొనర్పన్=ఆసాధనచతుష్టయమును బోధింపఁగా, చెందవు=మనస్సున నాటవు, పొందినన్=మనస్సున నాటియుండె నేని, భూతభవంబులందున్=పూర్వజన్మములయందు, ఆసాధకులు=మోక్షోపకరణములైన ఆసాధనములు గలవారు,ఎల్లపుణ్యములన్=సకలధర్మములను, సల్పినవారలు కారె=ఒనర్చినవారే కదా, కావునన్=కనుక,

తా. కుమ్మరివాఁడు, సాలెవాఁడు, కంసలవాఁడు మొదలగువారు ఎంతటి ప్రవీణులయినను తమకు సాధనములైన దండము చక్రము మృత్తిక తురి, వేమ, తంతువులు పట్టెడు సుత్తె, త్రాసణము, పటకారు, బంగారు మొదలగువానియందు ఒక్కటి లేకయున్నను కుండలు, వస్త్రములు, సొమ్ములు మొదలగువాని నిర్మింపలేనట్లు, నిత్యానిత్యవస్తువివేకము, ఇహాముత్రార్థఫలభోగవిరాగము, శమాదిషట్కసంపత్తి, ముముక్షుత్వము, అనెడుసాధనములలో ఏది లేకున్నను బ్రహ్మజ్ఞానము కలుగదు. నూతనవివేకులకు ఎంత బోధించినను వారిహృదయములయందు ఈసాధనములు నాటముగ నాటవు. నాటెనేని పూర్వజన్మములయందు వారు బహువిధములైన వేదశాస్త్రోదితసత్కర్మము లన్నియును ఏకోటంతలు లేక చేసినవార లని తాత్పర్యము.

అవతారిక:—తీవ్రపరిపక్వచిత్తముగల సచ్ఛిష్యుఁడు ఆచార్యుని సందర్శింపఁగోరుట వక్కాణింపఁబడుచున్నది.

చ. అట నధికారి చండవిలయానలకీలలభాతి ఘోరదు
ర్ఘటచటులత్రితాపములఁ గంది కృశించుచు గ్రీష్మమందుఁ బ్ర
స్ఫుటరవిదీప్తిఁ దప్తమగు సూక్ష్మతనుక్రిమిభంగి సర్వసం
కటములు వాయఁ జిద్వనధిఁ గన్గొన నాత్మఁ దలంచె నెంతయున్.

టీ. అటన్=సాధనచతుష్టయసంపత్తిగలిగినపిమ్మట, గ్రీష్మమందున్=వేసఁగియందు, ప్రస్ఫుటరవిదీప్తిన్, ప్రస్ఫుట=మిక్కుటమైన, రవి=సూర్యునియొక్క, దీప్తిన్=తేజస్సుచేత, తప్తము=పరితపించుచున్నట్టిది, అగుసూక్ష్మతనుక్రిమిభంగిన్-అగు=అయిన, సూక్ష్మ=సన్నమైన, తను=శరీరముగల, క్రిమి భంగిన్=పురుగువలె, అధికారి = సాధనచతుష్టయసంపన్నుఁడు, చండవిలయానలకీలలభాతిన్-చండ=వేఁడిమిగల, విలయానల=ప్రళయాగ్నియొక్క, కీలలభాతిన్=మంటలవలె, ఘోర ... ములన్-ఘోర=భయంకరములైన, దుర్ఘట=పొందఁగూడని, చటుల=కఠినములైన, త్రితాపములన్=ఆధ్యాత్మికము ఆధిదైవికము ఆధిభౌతికము అనెడుపీడలచేత, కంది=కళదప్పి, కృశించుచున్=శోషించుచు, సర్వసంకటములు=సకలదుఃఖములును, వాయన్=తొలఁగుటకై, చిద్వనధిన్=జ్ఞానసముద్రుఁడైన యాచార్యుని, కన్గొనన్=చూచుటకు, ఎంతయున్=మిక్కిలి, ఆత్మన్=అంతఃకరణమందు, తలంచెన్=సంకల్పించెను.

తా. వేదాంతశ్రవణమునను వేదాధ్యయన ధర్మజిజ్ఞాసలు మున్నుగాఁగల కర్మకాండయందు సిద్ధమైన సచ్ఛ్రోత్రియుఁడే అధికారి యనిన బ్రహ్మజ్ఞానసాధకమగు సాధనచతుష్టయముగల అధికారిము వర్ణాశ్రమాదినిర్బంధములు లేనిదై పరిపక్వమైన యంతఃకరణముగలవారికి లక్ష్యమై యున్నది కాఁబట్టి మీఁదఁ జెప్పిన సాధనచతుష్టయ

సంపన్నుఁడగువాఁడే అధికారి. అట్టియధికారి ప్రళయకాలానలజ్వాలలవలె దహించుచుండెడు ఆధ్యాత్మికము ఆధిదైవికము ఆధిభౌతికము అనెడి త్రివిధతాపములవలనఁ గలిగిన దుఃఖములలోఁ జిక్కి మిడమిడఁ గాలెడియెండలోఁ దగిలి పరితపించు సన్నిపురుగు శీతలజలములుగల కొలఁకుఁ జేరఁగోరుతీరున జ్ఞానసముద్రుఁడయిన ఆచార్యుని సన్నిధానమునంటి సన్నిధానముఁ జేరఁగోర నని తాత్పర్యము.

## తాపత్రయస్వరూపనిరూపణము.

తాపత్రయము ఆధిభౌతికము ఆధ్యాత్మికము ఆధిదైవికము అని మూఁడువిధములు. వీనిలో ఆధిభౌతిక మనఁగా, పంచభూతవికారములై చెవి మొదలైన యింద్రియములకు గోచరించుచున్నయి తన కన్యములై తోఁచెడినామరూపములుగల నరులు పులులు పాములు తేళ్లు ఈఁగలు చీమలు దోమలు నల్లులు మొదలగు సమస్తదుష్టజంతువులవలన కలిగెడిబాధలును, తన కన్యులైన దారపుత్రమిత్రాదులకు సంభవించు వ్యాధులు మొదలగువానివలన తనకుఁ గలుగు దుఃఖముచేత పరితపించుటయును ఆధిభౌతికము.

ఆధ్యాత్మిక మనఁగా తనశరీరేంద్రియములకు కలిగెడి తలనొప్పి క్షయము కాసము శ్వాసము గుల్మము అతిసారము మూత్రకృచ్ఛ్రము మూలవ్యాధి జ్వరము మొదలగువానివలనఁ గలిగెడి బాధలును గ్రుడ్డితనము చెవుడు మూఁగతనము లోనగునవి ప్రాప్తించినపుడు తాను దేహేంద్రియాదులకు విలక్షణుఁడై యుండియు నేను వ్యాధిగ్రస్తుఁడను నేను గ్రుడ్డిని మూఁగను చెవిటిని అని దుఃఖించుటయును ఆధ్యాత్మికము.

ఆధిదైవిక మనఁగా తన కన్యమగు సర్వప్రపంచమునకు అతివృష్టి అనావృష్టి అత్యాతపము అనాతపము ఓరుగాలి మొదలగు దైవికృతములైన బాధలు సంభవించినప్పుడు తాను నిర్మలుఁడనని తెలియక లోకమున కిట్టిబాధలు పుట్టె. నే నెట్లు జీవింతును? ఈబెడద లెట్లు సహింతును అని దుఃఖించుటయే ఆధిదైవికము.

అవతారిక.—అతితీవ్రపరితాపక్రాంతఃకరణముగల శిష్యుఁడు ఆచార్యునిదర్శనముఁ జేయువిధముఁ జెప్పఁబడుచున్నది.

ఉ. భూరిసుతాంగనాముఖరభూరితరాశలఁ జిక్కి వీడి తా
ఘోరకిరాతుఁ డొడ్డునురిఁ గొల్కి కిఁ దప్పి యుపాయత న్బయల్
దేరుకురంగశాబకముతీరున దేశికుచెంత జిత్తచేఁ
జేరక మేలు గాంచి మదిఁ జింత దొలంగ నెఱంగి యిట్లనున్. ౪౬

టీ. తాన్=తానైన యధికారి, భూరి...శలన్-భూరి=సువర్ణము-అనఁగా ధనము, సుత=పుత్త్రుఁడు, అంగనా=భార్య, ముఖర = మొదలగువానియందలి, భూరితర=

మిక్కిలి యొక్కవలైన,ఆశలక్=కోర్కులయందు, చిక్కి=తగిలి,వీడి=పురాకృతసుకృతపరిపాకమునఁ గలిగిన వైరాగ్యముచేత విడివడి, ఘోర...కొల్కికిక్-ఘోర=భయంకరుఁడైన,కిరాతుఁడు=వ్యాధుఁడు, ఒడ్డు=పన్నినట్టి, ఉరి=ఉచ్చుయొక్క, కొల్కికిక్=కొక్కమునుండి, ఉపాయతక్=యుక్తిచేత, తప్పి=తొలఁగి, బయ...తీరునక్-బయల్దేరు=వెలువడెడు, కురంగశాబకముతీరునక్=జింకపిల్లవలె, దేశికుచెంతక్=ఆచార్యునిసన్నిధికి, తేత్తిచేఁ జేరక=ఐట్టిచేతితోఁ బోక, మేలు గాంచి=శుభేచ్ఛను పొంది,మదిక్=అంతఃకరణమందు, చింత=వ్యాకులము, తొలంగక్=వీడిపోవుటకై, ఎలుంగి=మ్రొక్కి, ఇట్లనెక్=ఈప్రకారము పలికెను. ॥శ్లో. అగ్నిహోత్రగృహం క్షేత్రం గర్భిణీం వృద్ధ బాలకౌ,రిక్తహస్తేన నోపేయా ద్రాజానం దైవతం గురుమ్.॥

తా. వేఁటకానియురిలోఁ చిక్కి మెలపునఁ దప్పించికొని వెడలినలేడిపిల్లవలె సాధనచతుష్టయసంపత్తిగల అధికారి యీషణత్రయమనెడి ఉరివలన విడివడి యీసంసారబంధము నాకేలీలఁ గలిగెను? ఇది యేలాగునఁ దొలఁగును? నే నెవ్వఁడను? నాకు కర్తయెవఁడు? ఈతాపత్రయాగ్ని యేతీరున చల్లాఱును? అని విచారించి సచ్ఛిష్యులనడుమ నెమ్మదిగఁ గూర్చుండి షడ్గుణైశ్వర్యసంపన్నుఁడును, సమిధలు చేతఁగలవాఁడును, శ్రోత్రియుఁడును, బ్రహ్మనిష్ఠుఁడును, సర్వలక్షణలక్షితుఁడును నైనసదాచార్యునిసమీపమునకు ఆకులు పూవులు పండ్లు సమిధలు దర్భలు మొదలగువానిని కానుకగాఁ గొని చేరి ధన్యోస్మియని మ్రొక్కి మనోవ్యాకులము తొలఁగించుకొనుటకై విజ్ఞాపనము చేయఁబూనెనని తాత్పర్యము.

ఈషణత్రయాదుల వివరణము. ఈషణత్రయ మనునది పుత్రేషణ ధనేషణ దారేషణము లనెడు మూఁడురూపములు గలదై సర్వప్రాణులను భ్రమింపఁజేయుచున్నది. అందు కొడుకులయందలి యాశ పుత్రేషణము. ధనమందలియాశ ధనేషణము. భార్యలయందలియాశ దారేషణము.

లోకమునందు బ్రహ్మవేత్తలకంటె ఇతరులయిన కొందఱు పండితులును పామరులును వేదశాస్త్రేతిహాసపురాణాదులయందుఁగల ॥పుత్రేణ లోకాన్ జయతి, అపుత్రస్య గతిర్నాస్తి, పున్నామ్నో నరకాత్త్రాయత ఇతి పుత్రః, పున్నామ్నో నరకాద్యస్మాత్పితరం త్రాయతే స్వయమ్, తస్మాత్పుత్ర ఇతి ప్రోక్తస్స్వయమేవ స్వయంభువా॥

॥క. విను గార్హపత్యమనున, య్యనలము విహరింపఁబడి తదాహవనీయం
బన వెలుఁగునట్లు వెలుఁగును, జనకుఁడు దాఁ బుత్త్రుఁడై నిజద్యుతితోడన్,

క. తాన తననీడ నీళ్లుల,లో నేర్పడఁ దోఁచునట్లు లోకస్తుత త
త్సూను జనకుండు చూచి మహానందముఁ బొందు నతిశయప్రీతి మెయిన్.

క. నీపుణ్యతనువులవలన, యీపుత్త్రకుఁ డుద్భవిల్లి నేఁ డెంతయు నొప్పెన్
దీపంబువలన నొండొక, దీపము ప్రభవిల్లినట్లు తేజం బెసఁగన్.

మ. విపరీతప్రతిభాష లేమిటికి నుర్వీనాథ యీపుత్త్రగా
త్రపరిష్వంగసుఖంబుఁ జేకొనుము ముక్తాహారకర్పూరసాం
ద్రపరాగప్రసరంబు చందనముఁ జంద్రజ్యోత్స్నయుక్ బుత్త్రగా
త్రపరిష్వంగమునట్లు జీవులకు హృద్యంబే కడుఁ శీతమే.

క. అనుదినసంతోషణములు, జనితశ్రమతాపదుఃఖసంశోషణముల్
తనయులసంభాషణములు, జనకులకును గర్ణయుగళసద్భూషణముల్"

అనుశ్రుతులను స్మృతులను పద్యములను చదివియును వినియును వానికి నిజమైన అర్థములను దెలియక విపరీతార్థముల నూహించి అవే సత్యము లని పుత్త్రులుగలవారికే యిహపరలోకములయందు సుఖములు గలవని లేనివారికి సుఖములు లేవని పుత్త్రులు తల్లిదండ్రులవంశములవారి నెల్ల పుణ్యలోకములకుఁ బంపుదు రని పుత్త్రులవలననే కాని పితృఋణంబు తీఱ దని తాము భ్రమపడుటయే కాక లోకులనుసహితము భ్రమపెట్టుచున్నారు కాఁబట్టి పుత్త్రులవలన ఇహపరలోకములయందును మోక్షమందును ప్రయోజన మేమాత్రము లేకపోవుటను పుత్త్రులు లేనివారుసయితమును పుణ్యలోకప్రాప్తి గలిగి ముక్తు లగుటను పుత్త్రులు గలిగియును వారు తమకంటె ముందుగ గిట్టిన తమతమపుణ్యకర్మ యోగాభ్యాసాదులచేతనే సద్గతులను పొందుటను పుత్త్రులు పుట్టకమునుపును పుట్టినవెనుకను పుట్టిగిట్టినతర్వాతను అధికదుఃఖములను గలిగించుటను పుత్త్రశబ్దమునకు నిజమైన అర్థమును వివరింపఁబడుచున్నవి. ॥శ్లో. అలభ్యమానస్తనయః పితరౌ క్లేశయేచ్చిరమ్, లబ్ధో హి గర్భపాతేన ప్రసవేన చ బాధతే, జాతస్య గ్రహరోగాది కుమారస్య చ ధూర్తతా, ఉపనీతేఽప్యవిద్యత్వ మనుద్వాహశ్చ పండితే, యూనశ్చ పరదారాది దారిద్ర్యం చ కుటుంబినః, పుత్త్రదుఃఖస్య నాస్త్యంతో ధనీ చేన్మ్రియతే తదా, ఏవం వివిచ్య పుత్త్రోఽసౌ ప్రీతిం త్యక్త్వా నిజాత్మని, నిశ్చిత్య పరమప్రీతిం వీక్ష్యతే తదహర్నిశమ్" అని యాజ్ఞవల్క్యోపనిషత్తునందు ఉండుటఁబట్టి పుత్త్రులు పుట్టియును పుట్టకయును తల్లిదండ్రులకు ఎల్లప్పుడును దుఃఖములనే యిచ్చుచున్నారు. ఎట్లనఁగా కొడుకులులేని వారు అపుత్త్రులమైతి మనెడుదుఃఖముచేత ఒక్కబ్రాహ్మణుని రప్పించి అతనిని పెద్దగద్దియపైఁ గూర్చుండఁబెట్టి నమస్కరించి స్వామీ మాకు కుమారులు లేకపోయిరే మాకేమిగతి యన అతఁడు కొన్ని శాస్త్రములను జూచి మీరు పాపకర్ములు కాఁబట్టి పుత్త్రులు లేనివారైతిరి. రామేశ్వరాది పుణ్యతీర్థములను సేవించిన పాపములు నశించి పుత్త్రసంతు లగుదు రనఁగా అతనిమాట పాటించి తీర్థయాత్త్రలను బహుదినములు చేసి స్నానదానములు తిలహోమములు సర్పశాంతులు నాగప్రతిష్ఠలు అశ్వత్థప్రదక్షిణములు

మొదలైనవి చేసి చేసి విసికి వేసరి దారినడచు బడలికచేతను చక్కనిభోజనాదులు లేక పోవుటచేతను కలిగెడికాయక్లేశము మొదలగు సకలదుఃఖములను అనుభవించియును ఇష్టసిద్ధి నెఱవేఱక మఱియొకమంత్రశాస్త్రజ్ఞుని రావించి తమ అభిప్రాయమును తెలిపి యిందున కేమిద్యైన ఉపాయంబు చెప్పవలెనని వేఁడికొనఁగా ఆమంత్రశాస్త్రవేది మీకు ప్రతిబంధములు ఉండుటచేత అఖండముపెట్టి మంత్రపురశ్చర్య చేయించి ముగ్గులు వేసికొని మంత్రించి ఆప్రతిబంధములను తొలించుకొంటిరేని పుత్రులు కలుగుదు రని చెప్పఁగా ఆమాటలు విని అందుకు తగినప్రయత్నములు చేయఁగా ఆమాంత్రికుఁడు పుట్టమ్మ మాచకమ్మ మాతంగి సహాదేవి మొదలైనదేవతలకు తృప్తిచేయవలయు నని వారిచేత విశేషద్రవ్యము వ్యయము చేయించి యిఁక మీకు బిడ్డలు పుట్టుటకు అడ్డంకి లేదని పోవును. అప్పుడు వారు అందునను కొడుకులు గలుగక పోవుటకు కలవిలపడి వెలవెలపోయి మఱియొకశాస్త్రజ్ఞునియొద్దకు పోయి మాకు సంతానము లేదు. మా కేది దిక్కు. అని యడిగిన అతఁడు శాస్త్రగ్రంథములు చూచిచూచి ఆహా మీరు మహాపాపాత్ములు గనుక సంతానము లేకపోయెను. మీ రిరువురును నిరాహారులై మిక్కిలి నేమముతో నోటిబీగములు వేసికొని తిరుపతికి పోయి వేంకటేశ్వరుని సందర్శించి నూఱువరాలు కానుకపెట్టి పక్వాన్నములతోడ సమారాధనములు పిండిదీపారాధనములు అఖండములు మొదలైనవి చేసి నియమము తప్పక యిల్లు చేరి తిరుగా బ్రాహ్మణసంతర్పణములను చేయించిన మీకు కొమరులు పుట్టుదురు. సందేహము లేదని చెప్ప ఆతనిమాటలు నమ్మి ఆతీరున జరుపఁగా అప్పటికిని సంతానము లేక దుఃఖములలో మునుఁగుచు తేలుచు, ‹‹శ్లో. కోటరాంతర్గతో వహ్నిస్తరుమేకం దహిష్యతి, కుపుత్రస్తు కులే జాతః స్వకులం నాశయేత్వరమ్›› అని యుండుటవలన సద్గుణసంపదగల పుత్రుఁడు గలుగవలయు నని భగవంతుని ప్రార్థించుచు నుందురు కాఁబట్టి పుట్టనిపుత్రులు తల్లిదండ్రులను బహువిధముల దుఃఖములఁ బెట్టుచున్నా రనుటకు సందేహము లేదు. పుట్టినపుత్రులు దుఃఖపెట్టుట యెట్టు లనిన సంతానకాంక్షగలవారికి దైవాధీనంబున తనంతటనే గర్భము నిలిచి కొన్నిదినములకు ఏదియైన ఒకకర్మమువలన కడుపు దిగఁబడును. అందున తల్లిదండ్రులు దుఃఖింతురు. అట్లు గాక ఆగర్భము పదినెలలు నిండునంతవఱకు నిలిచి యుండెనేని ప్రసవకాలమందు ప్రసవవేదనచేత బహుబాధలు కలుగును. ఆబాధలు చూడఁజాలక మంత్రసాని మొదలగువారు అయ్యా తిరుమలభట్లా మీభార్య ప్రసవవేదనచేత మిక్కిలి బాధపడుచున్నది. ప్రార్థన లేమైన చేయుఁ డని చెప్పుదురు. అప్పు డతఁడు నేను ప్రార్థన లన్ని మునుపే చేసితిని. కుమారునికి ఆశపడినందుకు ‹కొండనాలుకకు మందు పెట్టితే ఉన్ననాలుక ఊడి పోయె› నన్నట్లు పెద్దప్రాణమునకే సందవచ్చెను. ఇఁక నేమి చేయుదును. అది బ్రతికితే చాలును. దేవుఁడు మమ్మును సకలవిధముల శోధించి దుఃఖపెట్టుచున్నాఁ డనును

గనుక ఒకవేళ పెద్దప్రాణమునకు మోసము వచ్చెనేని అందువలనను దుఃఖమే ప్రాప్తించుచున్నది. అట్లుగాక సుఖముగా ప్రసవించెనేని ఆపుట్టినవానికి ముట్టుదోషము పక్షిదోషము సంధికట్టు మొదలైనవి తాఁకును. సోఁకులు మొదలైనవి సోఁకును. అవి చూచి వానికి రక్షలు కట్టించి విభూతి మంత్రింపించి బహు శ్రమపడి పెంచుదురు. అటులుగాక నిశ్చింతఁగా పెరిఁగెనేని ఆకుమారుఁడు పదియేఁడులయీడు గలవాఁడై గుండగొయ్యతనముచేత ఊరిలోఁగల చిన్నవాండ్రనందఱను కొట్టి తానును వారిచేత దెబ్బలపడి వచ్చి తనవారికిని ఊరివారికిని కలహములు పెట్టును. ఇందుచేతను తల్లిదండ్రులకు దుఃఖమే కలుగును; ఆవిధముగాఁ గాక బుద్ధిమంతుఁడై యుండెనేని వానికి ఉపనయనము చేసి చదువవేయుదురు. వాఁడు చదువరి గాకపోయెనేని వానిమూఢత్వమును తలఁచక చదువుచెప్పెడి ఉపాధ్యాయునితో మాచిన్నవానికి తిన్నగా చదువు చెప్పక మావద్ద ద్రవ్యము తీసికొని తింటివి. నీకు ఋణముండి యిచ్చితిమి. అని జగడము చేయుదురు. బిడ్డకు చదువు రాకపోయె నని వేదన చెందుచుండుదురు. అందువలనను వారికి దుఃఖమే సంప్రాప్తమగును. మఱి ఆకుమారుఁడు విద్యావిహీనుఁడు గాక చదువరి అయ్యెనేని వానికి వివాహము చేయవలయునని కన్యకలు గలవారియిండ్లకు పోయి పడుచును అడిగిన ఒకఁడు మున్నూఱువరహాలిమ్ము. తలసామాను మొదలగు నగలు పెట్టుమనియు మఱియొకఁడు ఏనూఱువరహాలిమ్మనియు కోరిన సొమ్ములు పెట్టుమనియు అడుగునపుడు తమకు ద్రవ్యోత్పత్తి లేకపోయెను గదా యనియు ఇంకొకఁడు కన్యాదానము చేయుటకు సమ్మతిపడిన వధూవరులకు పొంతనములు సరిపడకపోవునపుడు అది తమయిష్టానుసారముగ కుదిరినను పొంతనములు అనుకూలింపకపోయెను గదా యనియును దుఃఖింతురు. కాఁబట్టి యిందువలనను కుమారుఁడు దుఃఖమునే కలిగించును. ఆతీరునఁ గాక అన్నివిషయములు చక్కఁబడి వివాహ మయ్యెనేని ఆపడుచు చక్కఁదనమును సుగుణములును గలది గాకపోయెనేని అదియును మనోవేదనకే కారణ మగును. అట్లుగాక అన్నివిషయములలో చక్కఁగా నుండినను క్షయరోగివలె చిక్కిపుడకతీరున నుండెనేని దానికి కూశ్మాండఘృతము మొదలైనఔషధములు చేయుచుండఁగా ఆకుమారుఁడు కామాతురుఁడై భార్య తనకు ఉపయోగింపదని యెంచి జారుఁడై పరస్త్రీలను కలయుచుండును. అందున వ్యాధులు సంభవించినను ద్రవ్యము వ్యయమైనను దుఃఖము కలుగుటయే కాక వాఁడు పరస్త్రీలను అపహరించిన వారిమగలు మొదలగువారు వానిపై ఫిర్యాదులు చేసిన నగరివారు దండింతురు. ఇందువలనను తల్లిదండ్రులకు దుఃఖమే ప్రాప్తించును. ఈవిధముగాఁ గాక ఆపుత్రుని భార్య యెదిగి సంసారమునకు వచ్చి బిడ్డలు పుట్టి సంసారము బాహుళ్య మయ్యెనేని దారిద్ర్యదశవలన బిడ్డలతోడ పుత్రుఁడు కష్టపడుచుండఁ జూచి తల్లిదండ్రులు దుఃఖింతురు. అపుడు జనులు వారలం జూచి యేల విలపించుచున్నా

వులు చేసినవాఁ డగుటచేతను తపస్సంపన్నులగు వసిష్ఠ దుర్వాస ఆదిమహర్షులను పూజించినవాఁ డగుటచేతను ఆపుణ్యంబువలన స్వర్గలోకప్రాప్తియును బ్రహ్మాదిదేవతాదర్శనంబును గలిగెను గాని శ్రీరాముని కొడుకుగాఁ గనుటవలనఁ గాదు. అందువనే యనిన పునరావృత్తిరహితమైన పరమపదప్రాప్తి గలుగును గాని పునర్జన్మహేతువులగు స్వర్గాది లోకప్రాప్తి గలుగదు. మఱి హిరణ్యకశిపుఁడు ప్రహ్లాదుఁడను తనపుత్రునివలన బహు దుఃఖముల ననుభవించి తుదకు వానికారణంబుననే మరణించెను. మఱియు ధృతరాష్ట్రుఁడు దుర్యోధనాదులైన నూఱుగురు కొమరులఁ గని వారు మడియుటవలన మిగుల వగల ననుభవించి తనపుణ్యముచేతనే పరమగతిని జెందెను. మఱికొందఱు పుత్రదుఃఖముచేత చచ్చి నరకమును జెందిరి. కనుక ఈపుత్రులవలన తల్లిదండ్రులకు దుఃఖములును మరణములును నరకములును గలుగుట సుప్రసిద్ధ మగుచున్నది. అయితే "అపుత్రస్య గతిర్నాస్తి" అనుశ్రుతి అసత్యమా యనిన ఆశ్రుతికి నిజమైన అర్థమును వివరించెదము. "పుత్" అనెడు ఘోరనరకమునుండి తల్లిదండ్రులను లేవనెత్తి రక్షించువాఁడు పుత్త్రుఁ డని ఆ శ్రుతికి అర్థము నరక మనఁగా దుఃఖము. స్వర్గ మనగా సంతోషము అని పెద్దలఅభిప్రాయము. "క. తనసంతోషమె స్వర్గము, తనదుఃఖమె నరకమండ్రు తథ్యము సుమతీ" అని సుమతిశతకము గనుక తాను ఏదియైన ఒక్కమహాదుఃఖములోఁ జిక్కి తిక్కఁగొని పొక్కుచు ఆహారనిద్రలుమాని ఉసురులు తొరఁగవలయునను నిశ్చయము గలిగియుండు నప్పుడు తనకు దేహము మొదలుగాఁగల ప్రపంచ మెల్ల కల్ల ప్రపంచవిలక్షణుఁడై వెలుఁగుపరబ్రహ్మ మొక్కటియే సత్యము. సత్యజ్ఞానానందస్వరూపపరబ్రహ్మమునగు నాకు దుఃఖము లెక్కడివి? అను దివ్యజ్ఞానమును పుట్టించి ఆదుఃఖములనుండి తన్నుద్ధరించునది విజ్ఞానము గనుక అట్టి నిత్యానిత్యవస్తువిభాగజ్ఞానము కలుగుటయె పుత్రుఁడు కలుగుట. ఆజ్ఞానము లేకపోవుటయె పుత్త్రుఁడు లేకపోవుట కాఁబట్టి పరమవైరాగ్యసంపన్నుఁడై పరమార్థజ్ఞానమును శ్రవణ మనన నిదిధ్యాసములవలన ప్రబలించి పుత్త్రాదిసర్వదుఃఖములను వీడి చిత్తవిశ్రాంతి గలిగి ఆత్మస్వరూపుఁడై నతనయందే పరమప్రీతి యుంచి సర్వదా ఆత్మనిష్ఠగలిగి మోక్షము నొందవలయు నని వేదాంతసిద్ధాంతము. మోక్షప్రాప్తికి జ్ఞానవైరాగ్యములే ముఖ్యకారణములనుటకు శ్రుతిస్మృతులు. "న కర్మణా న ప్రజయా ధనేన త్యాగేనైకేనామృతత్త్వమానశుః" అని ఉపనిషత్తు. "జ్ఞానాదేవ తు కైవల్యమ్" అని శ్రుతి. "పాకస్యవ హ్నివద్ జ్ఞానం వినా మోక్షో న సిధ్యతి"అని ఆత్మబోధప్రకాశిక. "నహి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే" అని భగవద్గీత. "న కర్మణా మనుష్యానైర్న దానైస్తపసాపి వా, కైవల్యం లభతే మర్త్యః కింతు జ్ఞానేన కేవలమ్" అని శివగీత.

## ధనేషణవివరణము.

"శ్లో. యస్యాస్తి విత్తం స నరః కులీనస్స పండితస్స శ్రుతవాన్ గుణజ్ఞః, స

ఏవ వక్తా సచ దర్శనీయ స్సర్వే గుణాః కాంచనమాశ్రయంతి॥ అని భర్తృహరియును, ॥శ్లో. ధనమార్జయ కాకుత్స్థ ధనమూలమిదం జగ॥త్తని వసిష్ఠును, ॥క. పరమపదము నర్థమునన పౌరవముఖ్యా॥ ॥గీ. విత్తసముపార్జనము సేయుసృత్తులందుఁ, జిత్త మిడినట్టివానికిఁ జేటు లేదు॥ ॥క. ధనమూలము జగ మంతయు, ధనవంతున కిష్టమగుపదార్థము లెల్లం, దనచేతిలోని వగుటను, ధన మార్జింపంగ నెవ్విధంబున నలయుక్॥ ॥క. ఒడమె గల వెడఁగునైనను, బుడమిం గలవార లెల్ల భూషింతురు శ్రీ, వెడవాసిన దూషింతురు, కడుఁ బేదఱికమునకంటెఁ గష్టము గలదే॥ అని నన్నయభట్టారకుఁడును వచియించుటచేత లౌకికశాస్త్రజ్ఞానముగల కొందఱు పండితులును పామరులును వినజనులు పైప్రమాణములకు నిజమైన అర్థ మెఱుఁగక అర్థము సమస్తపురుషార్థములలో ఉత్తమమైన దనియును ఆయర్థము గలవాఁడే మంచివంశమును పాండిత్యమును సకలవేదశాస్త్రార్థవిషయజ్ఞానమును అన్నిమంచిగుణములును వాచాలకత్వమును చక్కఁదనమును గలవాఁడనియును అధన మొక్కటి లేకపోయినేని పైనఁ జెప్పిన మంచి వంశము పాండిత్యము మొదలగునవి కలిగియున్నను వ్యర్థము లనియును వానికి నూటచెల్లుబడియును భోగమును గలుగ దనియును ధనము సంపాదించుటయందే ఆసక్తిగలవానికి కీడు మూఁడ దనియును ఇహపరలోకములకు ధనమే ముఖ్యకారణ మనియును పరమపదముసహితము ధనమువల్లనే లభించు నదియును ధనవంతునకు కోరినవస్తువు లెల్ల కొల్లఁగ దొరకును కాఁబట్టి యేవిధముచేతనైనను ధనమును సంపాదింపవలయును అనియును ధనముగల వెట్టివానినైనను లోకులు పొగడుదురు. ధనములేని మంచివానినైనను లోకులు నిందింతురు గనుక పేదఱికమునకంటె చెడ్డది జగత్తునందు లేదనియును విత్తంబుగలవానికి జగత్తంతయును హస్తగతంబై యుండునదియును భర్తృహరి వసిష్ఠ నన్నయభట్టారకుఁడు మొదలగు పండితసార్వభౌములు పలుకుచుండుటచేత ఆపలుకులకు నిజార్థము తెలియక అర్థమునే పరమపురుషార్థముగ నమ్మి దానికొఱకు పడరానిపాట్లెల్లఁ బడుచు తిరుగరానిచోట్లెల్లఁ దిరుగుచు చేయరానిపనులెల్లఁ జేయుచు ఉన్నారు. ॥శ్లో. అర్థానామార్జనే దుఃఖ మార్జితానాం చ రక్షణే, నాశే దుఃఖం వ్యయే దుఃఖం ధిగర్థం దుఃఖభాజనమ్॥ అని మనువువచనమును, ॥శ్రు. ఆశాపిశాచీమవమానయంతం ఆలోకయంతం జగదింద్రజాలమ్॥ అని మహావాక్యరత్నావళియందును, ॥తే. అర్థవంతుఁడై భోగంబు లనుభవించు, చున్నయప్పుడ యిది యిట్టు లుండనేర, దస్థిరము తాను లోనుగా నని యెఱుంగు, నతఁడు వగఁ బొందఁ డేది యెట్లయిన నధిప॥ అని భారతమందును గలదు గనుక కాలత్రయమందును దుఃఖహేతువయిన ధనముమీఁద జ్ఞానవంతులగువారు ఆశ యుంచక దానిరాకకు ఆనందించక పోకకు దుఃఖించక తా మనుభవించుచు ఒకరికి ఇచ్చుచు నిత్యసంతుష్టి గలిగి ఉందురు. పామరులు త్రికరణక్లేశము లోర్చి ధనమును సంపాదించి దానిని తా మనుభవింపక ఒకరికిని

పెట్టక పంటచేనికి కావలియున్న బొమ్మవలె ఉండఁగా కడపట ఆధనము దొంగలపాలవును. లేక అగ్నిపాలవును. దుర్వ్యాజ్యములు సంభవించి రాజులపాలవును. ఎవ్వరైన అపహరింతు రని యెంచి పూడ్చిపెట్టిన నేలపాలవును కనుక ధనము తనకు దుఃఖమును గలిగించుటకే కారణ మగుచున్నది. నోరుగట్టి కడుపుగట్టి మూట గట్టిన ధనమును వ్యర్థముగ లోకమునందు పోఁగొట్టుకొన్నవారిని ఆదిగులుచేతనే చివికిచివికి మడిసినవారి నెందఱఁ జూడము. మఱియు ధనమును వృద్ధిఁ బొందింపక సెలవుచేయుచున్న తిన్నతిన్నగ సన్నగించు నని యెన్ని గృహములు భూములు తోఁటలు మొదలగువానిని కుదువపెట్టుకొని వడ్డికి ఇచ్చిన ఆగృహములు మొదలగు వానికి హక్కుదారులు పెక్కుమంది వేఱుగఁ గల రనియును కుదువపెఱచినవానికి హక్కు లేదనియును తగవులు పొసఁగినను లేక దొంగసొత్తులైనను తా నిచ్చిన సొత్తునకు విపత్తు కలుగుటకు అనుమానము లేదు. అదియును తనకు దుఃఖమునకే హేతు వగుచున్నది. అట్లు గాక తా నిచ్చినరొక్కము మొక్కపోక ఒక్కసారిగ వచ్చునన్నయెడల, ॥శ్లో॥ పుస్తకం వనితా విత్తం పరహస్తగతం గతమ్, అథవా పునరాయాతి నష్టం భ్రష్టాచ ఖండశః॥ అను ప్రమాణమునుపట్టి కొంచెముకొంచెము గానే తా నిచ్చినది వచ్చి చేరునుగాని ఒక్కసారిగ వచ్చునని వక్కాణింపరాదు. విశేషలాభము నపేక్షించి సరకులు గొని సముద్రమున నావలమీఁదను మెట్టను బండ్లమీఁదను దూరదేశములకు పంపునప్పుడు తప్పుగాలివాన మొదలగువానివలన ఓడకు అపాయము సంభవించినను దొంగలు మొదలగువారివల్ల సరకులకు క్షీణము వచ్చినను అదియును తనకు వేదనకే కారణము. అట్లు గాక తాను నిశ్చయించినదేశములకు సరకులు చేరి విక్రయించునప్పుడు అప్పులిచ్చినను వెలలు తగ్గినను చెదలు లోనగువానివలన చెడినను నిప్పు దొంగతనము మొదలయినవానివలన నష్టముగలిగినను అదియును వగపునకే నిమిత్త మగును. అట్లు కాక యేఅపాయములు లేక వెలకలిగి విక్రయించి ఆధనమును హుండీ చేసినయెడల ఆహుండీకి గడువుప్రకారము సాహుకారు ధనమియ్యక యేదియైన ఒక్కసాకు చెప్పినపక్షమున హుండీ వ్రాసి యిచ్చినవానిని ధన మిమ్మనిన వాఁడు నేను దివాలా యెత్తితి నని వేషము వేసికొని అదియును సంతాపమునకే కారణము. అట్లు గాక ధనము ఇంట చేరనేని దానిని బంధువులు చుట్టములు పక్కములు పుత్రులు సోదరులు స్నేహితులు భార్యలు మొదలగువారు అపహరింపఁజూతురు. వీఁడేమఱక జాగ్రత్త కలిగి ఉన్నయెడల బంధువులు మొదలయినవారితలంపు కొనసాగనందున వారు చంపయత్నింతురు. తనవారీతీరున నుండ పెరవారలఁ జెప్పనేల. మఱి యీ ధనము ప్రాణఘాతుకి. పూర్వము శివజ్ఞానియను మహాపురుషుఁడు తనభార్యతోడ అడవికేగి కట్టెలు గొట్టి మోపులు గట్టి విక్రయపెట్టి పొట్ట నిండించుకొనుచుండును. ఇటులు కాలము కడుపుచు ఒక్కనాఁడు కట్టెలు కొట్టుచుండఁగా ఆదంపతులకు ఒక్కపొద

యందు ధనము కనఁబడెను. వా రది మాచి ప్రాణఘాతుకి యని వెఱచి పఱచునప్పుడు ఆమార్గమందు వచ్చుచున్న అన్నదమ్ము లిద్దఱు వారిని జూచి మీ రేల పరుగెత్తెద రని అడిగి వారివలన సంగతి యంతయును ఎఱిఁగి ఆప్రాణఘాతుకి యెట్టిదో మాతము రండని వారలతో ఆపాదయొద్దకు పోయి ధనమును మాచి వారిని పిచ్చి వెుచ్చినవారినిగా తలఁచి పొమ్మని సెలవిచ్చి దారి సాగిపోనిచ్చి ఆయన్నదమ్ము లిద్దఱు చాల ఒద్దికతో రొక్కమెల్లఁ గొని మహోల్లాసముతోడ సల్లాపము లాడుచు ఒక్కగ్రామసమీపము చేరి పంచుకొందమని మఱుఁగుచోట నుంచి అన్న అక్కడనే కావలి యుండి తమ్ముని భోజనపదార్థములు తెమ్మని వేగిరము రమ్మని గ్రామములోనికి పంపెను. అతఁడు పోవుచు ఈరొక్క మెల్ల నే నొక్కఁడనే దక్కించుకొన్నయెడల పెక్కుకాలము చక్కఁగ జీవింపవచ్చును. వీనికి పంచి యియ్యనేల? అని యోంచి అన్నను జంప నిశ్చయించి భోజనవస్తులు కొని కొన్ని తాను భుజించి తక్కినవానిలో విషము నిండించి తెచ్చుచుండెను. ధనమువద్ద కావలియున్న అన్న తమ్ముని నఱుక తలపెట్టి తనతావున నున్నకత్తికి పదునుపెట్టి కనుపెట్టియుండఁగా తమ్ముఁడు వచ్చి తినువస్తువులమూట ఒంగి క్రింద పెట్టు సమయంబున అన్న చట్టున లేచి ఒక్కపెట్టుతో తమ్ముని మెడ నఱికి వాని నొక్కచోట పూడ్చి విషమిళితమైన అన్నముఁ దిని తానును చచ్చెను గనుక, ॥శ్లో. మాతాపుత్రవిరోధాయ హిరణ్యాయ నమోనమః॥ అనుస్మృతినిబట్టి ఆహా ధనము వారి నెట్టిదశకుఁ దెచ్చెను? మూడుఁడు. మఱియు ॥క. మద మెచ్చును ధన మెచ్చిన, మద మెచ్చినదుర్గుణములు మానక హెచ్చున్, మద ముడుగును ధన ముడిగిన, మద ముడిగిన దుర్గుణములు మానక యుడుగున్॥ అనునీతివాక్యమువలన మదమును దుర్గుణములును గలుగుటకు కారణము లనేకము లున్నను దుర్గుణములకు ప్రబల ధనమే ముఖ్యకారణము. కౌరవులును పాండవులును ధనముకోసమే కద పదునెనిమిదిదినములు చతురంగబల సమేతులయి పోరిరి. తుదకు వారేమైరి. రావణాదిరాక్షసులు ధనమదముచేత స్త్రీలోలురయి అన్యస్త్రీలను ధనములను అపహరించి చచ్చిరి కనుక, ॥శ్లో. పాకస్య వహ్నివద్ జ్ఞానం వినా మోక్షో న సిద్ధ్యతి॥ అను ఆచార్యవాక్యమువలన సద్గతికి జ్ఞానము కారణము గాని ధనము కారణము కాదు.

పూర్వము ఒకకాకి మాణిక్యములహారమును ముక్కునఁ గఱచుకొని వచ్చి తనకొత్తునగు కృష్ణసర్ప మున్నపుట్టలోఁ బడ విడిచిపెట్టినం జూచి జను లాపుట్టను ద్రవ్వి పామును జంపి హారమును గైకొనిరి ఆహా మూడుఁడు హారము సర్పమును ఏదారికిఁ దెచ్చెను. మఱియు సత్రాజిత్తనువాఁడు సూర్యునిగుఱించి తపస్సు చేసిన మెచ్చి సూర్యుఁడు వచ్చి దినమునకు ఎనిమిది బారువులమేలిమిబంగారు పుట్టించునట్టి రత్న మొక్కటి యిచ్చెను. దానిని సత్రాజిత్తు తనయింట నుంచి ద్రవ్యమును చేర్చుచుండఁగా సత్రాజిత్తు

తమ్ముఁడు ప్రసేనుఁడు ఆరత్నమును ధరించి అడవికి పోఁగా అతనిని సింహము చంపి ఆమణి గొనిపోయెను. ఆసింహమును జాంబవంతుఁడు వధించి ఆరత్నమును గొనిచని తన యింట నుంచుకొనెను. అవ్వల శ్రీకృష్ణమూర్తి లోకాపవాదమును పొందుకొన దానినిదెచ్చి సత్రాజిత్తున కిచ్చెను. ఆసడి శతధన్వుఁడెటిఁగి సడి కోర్చి సత్రాజిత్తునుజంపి ఆమణిని అపహరించుకొని పోఁగా కృష్ణమూర్తి ఆశతధన్వుని జంపి మణి దెచ్చి సత్యభామ కిచ్చెను కావున ధనము ప్రాణహాని చేయుటకు ముఖ్యకారణము అగుటయే కాక మాన హానినిసహితము కలుగఁజేయును. ఎట్లనఁగా ధనముగలవాఁడు సుగుణవంతుఁడుగాక స్త్రీలోలుఁడైనను త్రాగుబోతైనను జూదరియైనను మానహాని గలుగుటకు సందియము లేదు గనుక ఇహలోక సుఖములకు సాధకమైనదియును సర్వదుఃఖములకు ఆలయమయి నదియును ఐనధనముపై మిక్కిలి మక్కువ యుంచక యిహపరలోకసుఖనాశనకరమును పరమమోక్షప్రదమును నిరతిశయానంద సంధాయకమును అయిన బ్రహ్మజ్ఞానమనెడు మ హాధనమును ఆర్జించి దుర్జయులైన అంతరశత్రువులను నిర్జించి ఊర్జితపడి ఉండువాఁడే పుణ్యపురుషుఁడని వేదాంతసిద్ధాంతము.

## దారేషణవివరణము.

దారేషణ మనఁగా భార్య మొదలైన స్వీయ పరకీయ సామాన్యఅనెడి స్త్రీల యందు ఎవరిపైనైనను మమత గలిగియుండుట. ॥శ్లో. సన్న్యాసమగ్నిహోత్రంచ ద్విజాతీనాం ప్రశస్యతే॥ అను సిద్ధాంతవచనమునుబట్టి పురుషులు బ్రహ్మచర్య వ్రత మును నెఱవేర్చినవెనుక మోక్షేచ్ఛ గలవారైరేని సన్న్యాసాశ్రమమును కామసుఖేచ్ఛ గలవారైరేని అగ్నిహోత్రముగల గృహస్థాశ్రమమును కైకొనవలయును. అందు బ్రహ్మ చర్యమునుండి సన్న్యాసమును కైకొన్నవారు సాంఖ్యులు. బ్రహ్మచర్యమునుండి గృహ స్థాశ్రమమును అంగీకరించి అవల సన్న్యాసమును కైకొన్నవారు కర్మయోగులు. ॥సీ. కెలఁకుల నున్నతంగేటిజున్ను గృహమేధి యజమానుఁ డంకస్థితార్థపేటి, పండినపె రటికల్పకము వాస్తవ్యుండు దొడ్డిపెట్టిన వేల్పుగిడ్డికాఁపు, కడలేనియమృతంపునడబావి సంసారి సవిధమేరునగంబు భవనభర్త, మరుదేశపథమధ్యమప్రప కులపతి యాఁకటి కొద వుసస్యము కుటుంబి, బధిరపంగ్వంధబిక్షుకబ్రహ్మచారి, జటిపరివ్రాజకాతిథిక్షపణకావ, ధూతకాపాలికాద్యనాథులకుఁ గాన, భూసురోత్తమ గార్హస్థ్యమునకు సరియె॥ అని మనుచరిత్రమునందుఁ గలదు గనుక సమస్తాశ్రమములలో శ్రేష్ఠమైన గృహస్థాశ్రమము నకు ముఖ్యసాధన మైనదియును ॥శ్లో. కార్యేషు మంత్రీ కరణేషు దాసీ భోజ్యేషు మా తా శయనేషు రంభా, ధర్మానుసారీ క్షమయా ధరిత్రీ షాడ్గుణ్యభార్యా కులముద్ధరంతి॥ అను స్మృత్యర్థప్రకారము పురుషునకు సర్వకార్యములయందు యుక్తాయుక్తములను బో ధించుటచేత మంత్రియును శరీరసంరక్షణమందు పనికత్తెయును ప్రియముతో భుజింపఁ

బెట్టుటయందు తల్లియును కామభోగములయందు రంభయును కులమునకును ఆశ్రమమునకును మతమునకును తగిననడువడి గలిగియుండునదియును భూదేవివంటిసహనము గలదియును అయినభార్య కులమును ఉద్ధరించు నని ఉండుటచేతను, ॥క. సతియును గుణవతియుఁ బ్రజా, పతియు నన్వ్రతయు నైనవనిత వసుజ్ఞా, న్వితదృష్టిఁ జూచుసతి దు,ర్మతి కిహము బరముఁ గలదె మహిఁ బరికింపన్॥ ॥క. సంతతగృహమేధి ఫలం, బంతయుఁ బడయంగ నోపు ననుగుణభార్యా, వంతుం డగువాఁడు క్రియా, వంతుఁడు దాంతుండు పుత్రసంతుండు నగున్॥ ॥సీ. ధర్మార్థకామసాధన కుపకరణంబు గృహనీతివిద్యకు గృహము విమల, చారిత్రశిక్ష కాచార్యకం బన్వయస్థితికి మూలంబు సద్గతికి నూఁత, గౌరవంబున కేకకారణం బన్నతస్థితి గుణమణుల కాకరము హృదయ, సంతోషమునకు సంజనకంబు భార్యయ మూవె భర్తకు నొండ్లు గావు ప్రియము, లెట్టిఘట్టములను నెట్టియాపదలను నెట్టితీఱములను ముట్టఁబడిన, నంత లెల్లఁ బాయు నింతులఁ బ్రజలను, నొనరఁజూడఁ గనినజనుల కెందు॥ వ. మఱియు భార్య పురుషునం దర్ధం బగుటంజేసి మున్న పరేతయైన పతివ్రత పరలోకంబునం దనపురుషుం గూడఁ దదాగమనంబు ప్రతీక్షించుచుండు. పురుషుండు మున్న పరేతుండైనఁ బదంపడి తానును బరేతయై తనపురుషుం గూడ నరుగు నట్టిభార్య నవమానించుట యధర్మంబు. మఱియు నప్పురుషుండు భార్యయందుఁ బ్రవేశించి గర్భంబునఁ బుత్రుండై తాను నుద్భవిల్లుం గావున ॥అంగాదంగాత్సంభవతి॥ యనునది యాదిగాఁగల వేదవచనంబులయందు జనకుండును బుత్రుండు నను భేదంబు లేదు॥ అని ఆదిపర్వము. ॥తే. అఖిలదుఃఖరోగార్తున కౌషధంబు, సురుచిరంబుగ భార్యయ మూవె యెందు, నొనఁ భార్యాసమేతుఁడై యున్నవాని, కెంతయాపద లయ్యును నెఱుకపడవు॥ ॥క. అలయు నెడ డయ్యు నెడ నాఁ,కలియుఁ దృషయు నైనయెడలఁ గడుకొని ధరణీ, తలనాథ పురుషునకు ని,మ్ముల భార్యయ పాచుఁ జిత్తము నదుఃఖంబుల్॥ అని ఆరణ్యపర్వమునను ఉండుటచేత లౌకికశాస్త్రజ్ఞానముగల పండితులును పామరులును పైనిఁజెప్పఁబడిన ప్రమాణవచనములకు నిజార్థము తెలియక సామాన్యార్థముల నూహించి భార్యయే పరమపురుషార్థ మని యెంచి తాము భ్రమపడుటయే కాక ఇతరులనుసహితము భ్రమపెట్టుచున్నారు. ॥శ్రు. ఆదిమధ్యావసానేషు దుఃఖం సర్వమిదం యతః, స్త్రియం త్యక్త్వా జగత్త్యక్తం జగత్త్యక్త్వా సుఖీ భవే॥త్తని మహావాక్యరత్నావళియందుఁ గలదు గావున విచారింపఁగా సంసారము ఎల్లప్పుడు దుఃఖకరమైనది. అట్టి సంసారమునకు మూలమైన భార్యవలనిప్రయోజనము జ్ఞానులకు ఏమాత్రమును గలుగదు. ఎందువల్ల ననఁగా భార్య రాకమునుపును దుఃఖము వచ్చినతర్వాత చెప్పినట్లు విని ఉపచారములు చేయక అట్టుఁబెట్టుచు గృహచ్ఛిద్రములను బయలుపఱచుచు కలవి లేనివి కొన్నికల్పించి యితరులతోఁజెప్పి గౌరవమునకు హానిగలిగించునదియైనను జారత్వ

చోరత్వముం గలదియైనను గయ్యాళియైనను మూర్ఖురాలైననుజ్ఞానహీనురాలైనను ప్రీతి లేనిదైనను రోగిణియైనను రూపలావణ్యములు లేనిదైనను అనాచారము గలదయినను నాగరకము లేనిదైనను రుచులు మీఱ పాకములు చేయలేనిదైనను తనకు దుఃఖమే కలిగించుచున్నది. అట్లుగాక సద్గుణములును రూపలావణ్యములు మొదలగునవియును గలదైనను తనయందు అతిప్రీతి గలదైయున్నను అది బిడ్డలులేక గొడ్డురాలైయుండెనేని అదియును తనకు వేదనకే కారణము అగుచున్నది. మఱి ఆభార్య తనకు రత్నాలసొమ్ములు సరిగచీరెలు సరిగ ఱవికలు తెచ్చి యిమ్మని బాధించినంతట దారిద్ర్యమువలన అవి తాను తెచ్చి యియ్యనందున అది వగచుచుండెనేని అదియును తనకు వేదనకే హేతు వగును మఱియును రోగములవలనఁగాని పిశాచాదులవలనఁగాని బాధపడుచుండ వైద్యులను మాంత్రికులను రావించి దానిని నివారించువిషయమున శరీరప్రయాసయును ద్రవ్యవ్యయమును ఎక్కువయయ్యెనేని అదియును తనకు వేదనాకర మగుచున్నది. అట్లుగాక ఆభార్య రోగములు మొదలైనవి లేక మంచిగుణములు చక్కఁదనము సంతానము మొదలగునవి గలిగి మెలఁగుచు ఉన్నట్టుండి గిట్టెనేని దానిని తలఁచితలఁచి కలకాలము విలపించుచు నుండవలసివచ్చును. కనుక ॥శ్లో. కామః క్రోధశ్చ లోభశ్చ దేహే తిష్ఠంతి తస్కరాః, జ్ఞానరత్నాపహారాయ తస్మాజ్జాగ్రత జాగ్రత, మాతా నాస్తి పితా నాస్తి నాస్తి బంధుసహోదరాః, అర్థం నాస్తి గృహం నాస్తి తస్మాజ్జాగ్రతజాగ్రత, ఆశయా బధ్యతే లోకే కర్మణా బహు చింతయేత్, ఆయుఃక్షీణం నజానాతి తస్మాజ్జాగ్రత జాగ్రత, జన్మ దుఃఖం జరా దుఃఖం జాయా దుఃఖం పునః పునః, సంసారసాగరం దుఃఖం తస్మాజ్జాగ్రత జాగ్రత॥ అను వచనప్రమాణములనుబట్టి దేహేంద్రియాదులకు వేఱైన ఆత్మయగు తనకు మాతృ పితృ కళత్ర పుత్ర మిత్రాదు లెవ్వరునులేరు కావున, ॥సత్యం మాతా పితా జ్ఞానం ధర్మో భ్రాతా దయా సఖీ, శాంతిః పత్నీ క్షమా పుత్రః షడేతే మమ బాంధవాః॥ అను పాండవగీతా ప్రమాణమునుబట్టి సర్వదుఃఖనాశకరం బైన పరమోపశాంతి యనెడు భార్యతోఁ గూడి క్రీడించుచు బ్రహ్మానందసముద్రమున మునిఁగి యుండుపుణ్యపురుషుఁడు జీవన్ముక్తుఁడై బహిస్సంసారమునతోసంత్యక్తుఁడై సుఖించు నని శాస్త్రసిద్ధాంతము. మఱి యీపద్యమునందు మకర యని చెప్పఁబడిన ఆయుస్సు అహంకారము చిత్తము శరీరము బాల్యము యౌవనము వార్ధకము సంసారము కాలము మొదలగువానిని గ్రహింపవలయును. వీనివివరణములు బాహుళకములు గావున గ్రంథవిస్తరభీతిచేత నిచ్చట వివరింపఁబడవు. వలయువారు జ్ఞానవాసిష్ఠమందు వైరాగ్యప్రకరణమునఁ జూడవలయును.

అవతారిక.—ఆచార్యునితో శిష్యుఁడు విన్నపముచేసికొనుట చెప్పఁబడుచున్నది.

శా. మాయాకారవృతిన్ గుటుంబశిఖితోన్మధ్యంబునం జిక్కితిం
బాయం జాలక తాపకీలల భవోత్పాదాబ్జసచ్ఛాయకున్

ఛాయం జేర్చి కృపామృతంబు మెయినిండం జల్లి పాలింపు కో
శాయామోగ్ర నికుంజముల్ నఱికి వాక్యార్థాసిచే దేశికా. ౪౭

టీ. దేశికా=ఓయాచార్యుఁడా, మాయాకారప్రతిక్, మాయా=వ్యష్టిసమష్టినామ రూపాత్మకమహదాది సప్తావరణములే స్వరూపములుగాఁగల ప్రకృతియొక్క, ఆకార=మహత్తు, అహంకారము, పంచభూతములు అనునవియే రూపములుగాఁగలదియైన, ప్రతిక్=కంపకోటయందు-అనఁగా ఒకసృష్టి పుట్టి లయించి మఱియొకసృష్టి పుట్టునట్టి సందున నుండెడి యేమి లేని పట్టబట్టబయలగు శూన్యమే అవ్యక్తనామకమూలప్రకృతి ఈశ్వరాధీనముగ నున్ననియును తనచేత అనుభవింపఁదగినదియును అయిన సంచితము కాలకర్మములనుబట్టి ఆయీశ్వరునిచేత మూలప్రకృతియందు త్రోయఁబడి భూమిలోఁ బడిన మఱ్ఱివిత్తు మొలకబయలుపడక మొదటిరూపము చెడి నాని ఉబ్బునట్లు జగత్సృష్టికి కారణముగ బయలుపడక బలిసియుండునదియే మహత్తత్త్వము మఱ్ఱివిత్తునుండి మొలక వెలుపలికి వచ్చినట్లు ఆమహత్తత్త్వమునుండి పుట్టినదియే అహంకారము. ఆమొలక ప్రబలి వృక్షమయినట్లు ఆయహంకారమునుండి శబ్దమే గుణముగాఁగల ఆకాశము పుట్టెను. అవృక్షమునకు కొమ్మలు రెమ్మలు చిగుళ్లు ఆకులు మొగ్గలు పువ్వులు పిందెలు కాయలు పండ్లు మొదలగునవి యేర్పడినట్లు ఆయాకాశమువలన శబ్దస్పర్శములే గుణములుగాఁగల గాలియును ఆగాలివలన శబ్దస్పర్శరూపములనెడు మూఁడుగుణములుగల అగ్నియును ఆయగ్నివలన శబ్దస్పర్శరూపరసములనెడు నాలుగు గుణములుగల జలమును ఆజలమువలన శబ్దస్పర్శరూపరసగంధములనెడి అయిదు గుణములుగల భూమియునుపుట్టెను. ఇవి యనునవే యేడుకోటలు. ఈకోటలు విజ్ఞానాగ్నిచేత కాలిపోవును గాన కంపకోట యనఁబడును. అట్టికంపకోటయందు, కుటుంబశిఖి=దారపుత్రాదులతోఁగూడిన సంసారమనెడు నిప్పు-లేక శరీరేంద్రియప్రాణాదులు నేను నావి అనునదియే నిప్పు, తన్మధ్యంబునక్=ఆయగ్నినడుమను, తాపకీలలక్=ఆధ్యాత్మికఆధిభౌతిక ఆధిదైవికములనెడి త్రితాపములయొక్క, కీలలక్=మంటలనుండి, పాయంజాలక=విడిచిపోనేరక, చిక్కితిక్=తగులుకొంటిని. భవత్పాదాబ్జసచ్ఛాయమునక్, భవత్ = నీయొక్క, పాద = అడుగులనెడు, అబ్జ=కమలముల యొక్క, లేక, అప్=సముద్రజలమందు, జ=పుట్టినకల్పవృక్షముల యొక్క, సత్ =శ్రేష్ఠమైన, ఛాయమునక్=నీడను, డాయక్=కదియునట్లు, చేర్చి=చేరఁదీసి, కృపామృతంబు=దయారసము, మెయినిండక్ = దేహమందంతటను, చల్లి=చిలికి, వాక్యార్థాసిచేక్, వాక్యార్థ=ఉపదేశరూపములైన తత్త్వమసి మొదలగు మహావాక్యార్థములనెడు, అసి చేక్=ఖడ్గముచేత, కోశా...ములు, కోశ=పంచకోశములనెడు, ఆయామ=విశాలములయిన, ఉగ్ర=ఘోరములయిన, నికుంజములు = పొదరింట్లను, నఱికి=ఖండించి, పాలింపు = రక్షింపుము.

తా. స్వామీ వ్యష్టిసమష్టి నామములును రూపములును ఆకృతిగాఁగల మాయవలనఁబుట్టిన మహత్తు అహంకారము ఆకాశము గాలి అగ్ని జలము భూమి అనెడుకంపకోట లేడింటిలోఁ సంసారమనెడి అగ్ని. ఆయగ్నియొక్క గనగన మండుచుండెడు త్రివిధతాపములనెడు మంటలలోఁ జిక్కి బయలుదేఱలేక పరితపించుచున్న నన్ను మీపాదములనెడు కల్పవృక్షములనీడను చేరఁదీసి కరుణారసమనెడు చల్లనినీట ముంచి తత్త్వమసి మొదలగు ఉపదేశమహావాక్యార్థమనెడి కత్తిచేత అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ ఆనందమయములనెడు గొప్పతీఁగెయింప్లను నఱికి నన్ను రక్షింపు మని తాత్పర్యము.

## పంచకోశవివరణము.

పరమాత్మ పంచకోశవిలక్షణుఁ డని వేదములు వాదించుచున్నవి గావున పంచకోశములను ఎఱుఁగకయే వానికి విలక్షణుఁ డయిన పరమాత్మ నెఱుఁగరాదు గనుక ఆపంచకోశములను వివరించెదను. అన్నమయము ప్రాణమయము మనోమయము విజ్ఞానమయము ఆనందమయము అని కోశము లయిదువిధములు.

ప్రశ్న:—అన్నమయకోశ మనఁగా ఎట్టిది? ఉ:—అన్నమువలన పుట్టి అన్నమువలననే వృద్ధిఁ బొందుచున్నదయి స్తంభమువలె స్థూలమై చేతులు కాళ్లు మొదలైన అవయవములు గలదై షడ్భావ వికారములు గలదై సప్తధాతుమయమై కనఁబడెడి స్థూలశరీరమే అన్నమయకోశము.

ప్రశ్న:—ప్రాణమయకోశ మనఁగా ఏలాగంటిది? ఉత్త:—వాక్కు పాణి పాదము పాయువు గుహ్యము అనుకర్మేంద్రియము లయిదును ప్రాణ అపాన వ్యాన ఉదాన సమానము లనెడు ప్రాణము లయిదును గూడి ప్రాణమయకోశము.

ప్రశ్న:—మనోమయకోశమనఁగాఎట్టిది?ఉత్త;—మనస్సు శ్రోత్రము త్వక్కు చక్షువు జిహ్వ ఘ్రాణము అనెడిజ్ఞానేంద్రియము లయిదును జేరి మనోమయకోశము.

ప్రశ్న:—విజ్ఞానమయకోశమనఁగా ఏలాగంటిది? ఉత్త:—బుద్ధియును జ్ఞానేంద్రియములయిదును గలసి విజ్ఞానమయకోశము.

ప్రశ్న:—ఆనందమయకోశమనఁగా ఎట్టిది? ఉత్త:— ప్రియము మోదము ప్రమోదము అనెడివృత్తులతోఁగూడి అజ్ఞానమే ప్రధానముగాఁగల అంతఃకరణమే ఆనందమయకోశము ప్రియమనఁగా ఇష్టమయిన పదార్థమును కనినమాత్రముననే కలిగెడిసంతోషము ప్రియము. ఆపదార్థ ముతనహస్తగతమయినపిమ్మటఁ గలిగెడిసంతోషము. మోదము. ఆహస్తగతమయినవస్తువును అనుభవించినతోడనే కలిగినసంతోషము ప్రమోదము.

ప్రశ్న:—వీనికి కోశములని సంజ్ఞ యేల గలిగెను?

ఉత్త:—కత్తిని ఒరయును వీణెను గవిసెనయును అరఁటిబొందెను పట్టలును పసి

రికపురుగును పసిరికతిత్తియును చింతపండును చింతగుల్లయును కప్పుకొనినట్లు పరమాత్మను కనఁబడనీయక కప్పుకొనియున్నవి గనుక వీనికి కోశములను పేళ్లు గలిగెను.

ప్రశ్న:—అయితే దృష్టాంతమందు ఒరయును కత్తియును గవిసెనయును వీణెయును అరఁటి పట్టలును బొందియును పసిరికతిత్తియును పురుగును చింతగుల్లయును చింతపండును వేఱైనవనుటవలనను సమానధర్మములు గలవి కానందునను ఒకదాని నొకటి అనుసరించి ప్రకాశించునవి కానందునను ఆయొర మొదలైనవి ద్రవ్యములను మూసికొని యుండునట్టి వగును గాని దార్ష్టాంతికమందు కోశములు స్వసత్తవలన ప్రకాశించునవి గాక ఆత్మసత్త ననుసరించి జీవించి ప్రకాశించుచునుండు పంచకోశములు పరమాత్మను కప్పునట్టిశక్తిగలవి యెట్లగును?

ఉ:—సూర్యునికిరణములవలనే కలిగి ఆసూర్యునిసత్తచేతనే ప్రబలుచు ఉండెడు మేఘము సూర్యుని మఱుఁగుపెట్టినట్లును అగ్నిసత్తవలనఁ గలిగి అగ్నిసత్తవలననే సెగడుచున్న పొగ అగ్నిని కప్పుచున్నట్లును రజ్జుసత్త ననుసరించి తోఁచెడిసర్పము ఆత్రాటిని కప్పుచున్నట్లును మట్టివల్లపుట్టిన పుంటలు పుట్టిని మఱుఁగుపెట్టినట్లుగను స్వర్ణమును పట్టి పుట్టిన నగలు స్వర్ణమును కప్పుచున్నట్లును ఆత్మసత్త ననుసరించి వృద్ధినొందు పంచకోశములు పరమాత్మను కప్పునట్టిశక్తిగల వయ్యెను.

ప్రశ్న:—అయితే పరమాత్మకు పంచకోశవ్యతిరిక్తత్వము ఎటులు సిద్ధించును ?

ఉ:—కత్తి ఒర మొదలైనవి భేదము లేక ఒకటిగానే వ్యవహరింపఁబడుచు ఒకటిగానే తోఁచినను విచారింపఁగా కత్తియును ఒరయును వేఱైనవులే వేదాంతశాస్త్ర విచారణచేత పరమాత్మ త్రికాలములయందును పంచకోశంబులకంటె విలక్షణుఁడై తోఁచుటవలనఁ పంచకోశవ్యతిరిక్తత్వమే లభించును.

ప్రశ్న:—పంచకోశవిలక్షణుఁడయిన పరమాత్మకు పంచకోశములతోఁ చేరక కలదా? ఉ:—కలదు. ప్రశ్న:—ఆచేరిక యెట్లు గలిగినది? ఉ:—అన్యోన్యాధ్యాసము చేత కలిగినది. ప్రశ్న:—అన్యోన్యాధ్యాస మనఁగా నేమి? ఉ:—ఒకవస్తువునందలి గుణము మఱియొకవస్తువునందు తోఁచుట.

ప్రశ్న:—అన్నమయకోశమునకును పరమాత్మకును కూటము ఎట్లు గలిగెను?

ఉ:—జీవము సామాన్యము వికారము చిహ్నము కర్మము విశేషము జాతి ఆశ్రమము నామము రూపము సంస్కారము వేషము క్రియ అనెడువానివలన కలిగినది.

ప్రశ్న:—అది ఎట్లు? ఉ:—నేను జీవుఁడననుట జీవాధ్యాసము. నేనుమనుష్యుఁడననుట జాత్యధ్యాసము నేను పుట్టి పెరిగి యింతవాఁడుగయి క్షీణించి మరణించుచున్నాననుట వికారాధ్యాసము నేను పురుషుఁడను స్త్రీని నపుంసకుఁడను అనుట చిహ్నాధ్యాసము. నేను బ్రాహ్మణుఁడను క్షత్రియుండను వైశ్యుఁడను శూద్రుఁడను అనుట వర్ణాధ్యా

షము. నేను ఆంధ్రుఁడను ద్రవిడుఁడను కర్ణాటకుఁడను వెలనాటిని వేగినాటిని ములికినాటిని ప్రాజ్ఞ్నాటిని నియోగిని గుజరాతిని మహారాష్ట్రుఁడను కాశ్యపసగోత్రిని భారద్వాజసగోత్రిని ఆశ్వలాయనసూత్రిని ఆపస్తంబసూత్రిని బోధాయనసూత్రిని కాత్యాయనసూత్రిని అనుటవిశేషజాత్యధ్యాసము నేను బ్రహ్మచారిని గృహస్థుఁడను వానప్రస్థుఁడను సన్న్యాసిని అనుట ఆశ్రమాధ్యాసము. నేనుకృష్ణదాసుఁడను రామదాసుఁడను ఎల్లంభట్టను తిప్పంభట్టను పోలంభట్టను అనుట నామాధ్యాసము నల్లనివాఁడను ఎఱ్ఱనివాఁడను అనుట రూపాధ్యాసము నేను దీక్షితుఁడను సోమయాజిని ప్రతివసంతయాజిని మహావ్రతయాజిని వాజపేయయాజిని పౌండరీకయాజిని అనుట సంస్కారాధ్యాసము నేను మాయావాదిని, తత్త్వవాదిని, విశిష్టాద్వైతవాదిని, పరమభాగవతుఁడను, శైవుఁడను, శాస్త్రజ్ఞుఁడను, పౌరాణికుఁడను, యోగీశ్వరుఁడను, గంగాదిపుణ్యతీర్థవాసిని, అనుట వేషాధ్యాసము. నేను ఉపాధ్యాయుడను, జ్ఞానిని, పెండ్లికుమారుఁడను, ఇష్టంగిని, కుమ్మరిని, మంగలిని, చాకలిని, మణిహాగాఁడను, కరణమును అనుట క్రియాధ్యాసము. ఇవి మొదలయిన అన్నమయకోశమందుఁగలలక్షణములు అవిషయమయిన ఆత్మయందు ఆత్మయందుఁగల సచ్చిదానందలక్షణములు విషయమయిన అన్నమయకోశమందును తోఁచుచున్నవి గావున అన్నమయకోశమునకును పరమాత్మకును ఐకమత్యము వచ్చినది.

ప్ర:— ప్రాణమయకోశమునకును పరబ్రహ్మమునకును కూటమి యెటులుగలిగినది?

ఉ:— నేను ఆఁకలియును దప్పియును సామర్థ్యమును బలమును పరాక్రమమును గలవాఁడను వాచాలుఁడను దాతను మూఁగను కుంటిని గ్రుడ్డిని అనునివి మొదలయిన ప్రాణమయకోశమందుఁగల గుణములు పరమాత్మయందును పరమాత్మయందుఁగల సచ్చిదానందనిత్య నిర్మలగుణములు ప్రాణమయకోశమందుఁ గలవిగాను ప్రాణముగలవాఁడనగుటచేత తోఁచుచున్నవి గనుక ప్రాణమయకోశమునకును పరమాత్మకును కూటమి వచ్చినది.

ప్ర:— మనోమయకోశమునకును పరమాత్మకును చేరిక యెటులు?

ఉ:— నేను సంకల్పమును వికల్పమును గలవాఁడను దుఃఖిని మోహిని కామిని క్రోధిని ద్వేషిని వినువాఁడను పుట్టించువాఁడను ఇచ్ఛగలవాఁడను రసజ్ఞుఁడను ఆఘ్రాణించువాఁడను చెవిటివాఁడను నాలుకలేనివాఁడను ముక్కులేనివాఁడను అనునివి మొదలగు మనోమయకోశనిష్ఠములయిన సంకల్పాది ధర్మములు ఆత్మయందు ఆత్మధర్మములయిన సచ్చిదానందములు మనోమయకోశమందును మనస్సుండుటచేత తోఁచుచున్నవి కాఁబట్టి మనోమయకోశమునకును ఆత్మకును కూటమి వచ్చినది.

ప్ర:— విజ్ఞానమయకోశంబునకును పరమాత్మకును కూటమి యెటులు వచ్చినది?

ఉ:— నేను కర్తను నిశ్చయముగలవాఁడను బుద్ధిమంతుఁడను ఊహాపోహాలలో

చతురుఁడను ఏకసంథాగ్రాహిని శ్రోత్రియుఁడను విరక్తుఁడను పండితుఁడను లోకాంతరంబునకు పోవువాఁడను అనెడు విజ్ఞానమయకోశనిష్ఠములయిన ధర్మంబులు ఆత్మయందును ఆత్మధర్మములయిన సచ్చిదానందంబలు విజ్ఞానమయకోశమందును బుద్ధియుండుటవలన తోఁచుచున్నవి గనుక విజ్ఞానమయకోశమునకును ఆత్మకును కూటమి వచ్చినది.

ప్ర:—ఆనందమయకోశమునకు పరమాత్మకును కలయిక యెట్లు వచ్చినది ?

ఉ:—నేను భోక్తను అసంతుష్టుఁడను సుఖిని రాజసుఁడను సాత్త్వికుఁడను తామసుఁడను తజ్జ్ఞుఁడను మూఢుఁడను శక్తుఁడను భ్రాంతుఁడను అనునివి మొదలయిన ఆనందమయకోశధర్మంబులు ఆత్మయందును ఆత్మధర్మంబులగు సచ్చిదానందములు ఆనందమయకోశమందును ఆనందముండుటవలన తోఁచుచున్నవి. కాఁబట్టి ఆనందమయకోశమునకును పరమాత్మకును కూటమి వచ్చినది గనుక పంచకోశములకంటె పరమాత్మ విలక్షణుఁ డగుటను దృష్టాంతపూర్వకముగా ఎఱిఁగించెదము. నాయావు నాదూడ నాభార్య నాపుత్త్రుఁడు అని తన్ననుసరించుకొని తోఁచెడి ఆవులో నగునవి తాను గానట్లు దార్ష్టాంతికమందును నాశరీరము నాప్రాణము నామనస్సు నాబుద్ధి అని నన్ను సంబంధించుకొని తోఁచెడు పంచకోశములును తాను కానందున పంచకోశములకంటె వ్యతిరిక్తుఁడ నని యెఱుఁగవచ్చును. దృష్టాంతమందు ఆవు బలిసినది దూడ చిక్కినది కోడె బ్రదుకదు కుమారుఁడు చెప్పినట్టు వినఁడు భార్య యింటికి స్వతంత్రురాలయినను బిడ్డలు లేనిది నాధనము సెలవుచేయకుము. అది తనకు హితమయినకార్య మొక్కటియును చేయలేదు. కూఁతురు మహామూఢురాలై యున్నది కుమారుఁడు దుష్టుఁడై యున్నాఁడు అనెడు పశువు మొదలగువానియందలి వికారములును విషయములును తన్నంటనియట్లు దార్ష్టాంతికమందు అన్నమయకోశనిష్ఠమైన జీవత్వమనుష్యత్వాదిధర్మములును ప్రాణమయకోశనిష్ఠమయిన క్షుత్పిపాసాది గుణములును మనోమయకోశనిష్ఠమయిన సంకల్పాదిధర్మములును విజ్ఞానమయకోశనిష్ఠమయిన కర్తృత్వాదిగుణములును ఆనందమయకోశనిష్ఠమయిన భోక్తృత్వాదివికారములును పంచకోశవ్యతిరిక్తుఁడును సాక్షియును అయిన తన్ను కాలత్రయమందును స్పృశింపలేవు. కాఁబట్టి యిట్లు విచారించి యెఱుఁగుటయే పంచకోశవ్యతిరిక్తజ్ఞానము.

ప్ర:—ఈపంచకోశవ్యతిరిక్తజ్ఞానము రావచ్చునా? ఉ:—రావచ్చును.

ప్ర:—ఎట్లు రావచ్చును ? ఉ:—అధ్యయనకాలమందు అధ్యయనము చేయు పురుషులచేత ఉచ్చరింపఁబడిన శబ్దంబులను విభజించుటకు వశముగాకున్నను శ్రోత్రేంద్రియముచేత విని వివేకముగల బుద్ధిచేత ఇది వీనిశబ్దము ఇది వీనిశబ్దము అని యెఱిఁగినట్టులే జలమందుఁగల వేఁడిమిని వేఱుపఱచుటకు తనచేతఁ గాకపోయినను త్వగింద్రియ

ముచేత స్పృశించి వివేకసమేతమైన బుద్ధిచేత జలంబును ఉష్ణమును ప్రత్యేకించి యెఱిఁగినచందమునను గోడయందు వ్రాయఁబడిన చిత్తరువులోని తెలుపు ఎఱుపు నలుపు పసుపు ఆకుపసుపు మిశ్రము పొట్టి పొడుగు లావు సన్నముగా నుండెడురూపంబులను పంచుటకు అవి గాకపోయినను చక్షురింద్రియముచేత వీక్షించి వివేకసహితమయిన బుద్ధిచేత ఇది గోడ యివి దీనియందు తోఁచెడిచిత్రప్రతిమలు నీలపీతాదివర్ణము లని తెలిసికొనినచందమునను నీటిలోఁ గలసిన షడ్రసములను విభాగింప సాధ్యము కాకున్నను రసనేంద్రియముచేత అనుభవించి వివేకయుక్తమయిన బుద్ధిచేత ఇది ఉప్పు ఇది పులుసు ఇది తీపు ఇది వగరు ఇది చేఁదు ఇది కారము అని ప్రత్యేకంబుగా ఎఱిఁగినవిధమునను వస్త్రములు నాశ్రయించియున్న పరిమళములను వేఱుచేయ శక్యముగాకున్నను ఘ్రాణేంద్రియముచేత ఆఘ్రాణించి వివేకశీలమైన బుద్ధిచేత ఇది సుగంధము ఇది దుర్గంధము ఇది మిశ్రగంధము అని తెలిసికొనిన తీరునను దార్ష్టాంతికమందును పంచకోశంబులను వానితోఁ గూడియున్న ఆత్మను పంచుటకు అశక్యమయినను వివేకయుక్తంబగు బుద్ధిచేత పంచకోశస్వరూపము లిట్టివనియు ఆత్మస్వరూపము ఇట్టి దనియు విచారించిన యెడల పంచకోశములతో ఆత్మకు కాలత్రయమందును సంబంధము లేదని యెఱుఁగవచ్చును

ప్ర:—త్రాడు మొదలగువానియందు ఆరోపింపఁబడిన సర్పము మొదలగునవి త్రాడు మొదలగువానికంటె వేఱుగ లేనట్లు పరమాత్మయందు ఆరోపింపఁబడిన పంచకోశములును పరమాత్మకంటె అన్యముగ లేవు. ఈదృష్టాంతముచేత రజ్జువు ముత్తెపుఁజిప్ప ఎండమావులు అనెడు జ్ఞానము వచ్చినతర్వాత సర్పము వెండినీళ్లు అనెడుభ్రమ లేనియట్లు దార్ష్టాంతికమందును ఆత్మవిషయికజ్ఞానము కలిగిన పిమ్మట పంచకోశములనెడు వ్యవహారము విడువక వచ్చుచున్నది గనుక ఆరోపితములయిన పంచకోశములును అధిష్ఠానమైన ఆత్మకంటె వ్యతిరిక్తముగ లేవని బుద్ధియందు ఏవిధమున దృఢము గలుగును?

ఉ:—ఎండమావులను జూచి నీరని భ్రమసి త్రాగఁదలఁచినవాఁడు విచారించి యివి జలములు గావు ఎండమావులు అనుజ్ఞానము వచ్చినను ఎండమావులను జూచినప్పుడు జలముగాఁ దోఁచుచున్నట్లుగానే పరమాత్మయందు తోఁచినపంచకోశములు పరమాత్మకంటె వేఱుగా లేవని యెఱిఁగినను తిరుగ పంచకోశముల ప్రతీతి రావచ్చును.

ప్ర:—దృష్టాంతమయినయెండమావులయందు జలప్రతీతిమాత్రమేగాని స్నానపానాదులు చేయవలయు ననుభ్రమ కానము. దార్ష్టాంతికమందు ఆత్మకంటె వేఱుగా పంచకోశములు లేవని యెఱిఁగినతర్వాతను పంచకోశముల ప్రతీతియును వానివ్యవహార

ములును వచ్చుచున్నవే రావచ్చునా ? ఉ:—రావచ్చును. ప్ర:—అది యెట్లు? ఉ:—మృత్తికయందు ఆరోపింపఁబడినకుండలు మూకుళ్లు చట్లు మొదలయినవి మట్టికంటె వేఱుగ లేవని తెలిసినను ఆకుండలు లోనగువాని ప్రతీతియును వ్యవహారమును వచ్చిన తీరునను సువర్ణమందు ఆరోపింపఁబడిన కడియములు కిరీటములు మొదలయిన భూషణ ములు సువర్ణమునకంటె వేఱుగా లేవని యెఱిఁగినను ఆకడియములు మొదలగువాని రూపములును నామములును వ్యవహారములును వచ్చినవిధముగాను ఆత్మయం దారోపిం పఁబడిన పంచకోశములును అధిష్ఠానమయిన ఆత్మకంటె అన్యముగ లేవని యెఱిఁగినను పంచకోశములనెడు ప్రతీతియును వ్యవహారమును రావచ్చును. ఈదృష్టాంతమందు కుండలు మొదలగునవి కనఁబడుచు వ్యవహారమునకు వచ్చినను సూక్ష్మబుద్ధిగలవానికి మట్టికంటె వేఱుగ కుండలు లోనైనవి లేవని మనస్సునందు స్థిరమయినతీరున దార్ష్టాంతికమందు పంచకోశములు తోఁచుచు వ్యవహారమునకు వచ్చినను సూక్ష్మబుద్ధిగలవానికి పరబ్రహ్మ ముకంటె వ్యతిరిక్తముగ పంచకోశములు లేవని బుద్ధియందు దృఢము గలుగవచ్చును. ఈతీరున ఎఱుఁగుటయే పంచకోశవ్యతిరిక్తజ్ఞానము.

ప్ర:—ఈవిచారణకు ప్రయోజన మేమి ? ఉ:—ఆత్మ అవస్థాత్రయమునందు అనుస్యూతుఁడై ఉన్నాఁడు. పంచకోశములు అవస్థాత్రయమునందు అనుస్యూతములై యుండలేదు. కాఁబట్టి పంచకోశములు తోఁచుచు వ్యవహారమునకు వచ్చినను ఇవి పురు షాన్నాపరం కించిత్తను శ్రుతిప్రమాణమును పట్టి పరబ్రహ్మముకంటె వ్యతిరిక్తముగలేవని యెఱిఁగినవాఁడే కృతార్థుఁడు విద్వాంసుఁడు జీవన్ముక్తుఁడు పరబ్రహ్మము అని వేదాంత సిద్ధాంతము.

అవ:—ఇట్లు వినయభయభక్తులు గలిగి విన్నవించుచున్న శిష్యునితోడ శ్రీగురు మూర్తి పలుకుట చెప్పఁబడుచున్నది.

మ. జనయిత్రీప్రతిమానుఁడైన గురుఁ డాసచ్ఛాత్రుఁ గూర్చుండుమా
యని కూర్మక్రియ నెంచి చూచికృపమత్స్యంబట్ల మూర్ధిన్ శయం
బొనరం జేర్చి పులుంగుమాడ్కి నిడి నీయుత్పత్తులం బాప నొం
డనఘా యుక్తివెలుంగు దాని విని యభ్యాసం బొనర్పందగున్. ౭౮

టీ. జనయిత్రీప్రతిమానుఁడు-జనయిత్రీ=మోసి కనిపెంచిన తల్లితోడ, ప్రతి మానుఁడు=సమానుఁడు-ఐనగురుఁడు = అయినకారణాచార్యుఁడు, ఆసచ్ఛాత్రున్= ఉత్తమాధికారమును, తీవ్రపరిపక్వాంతఃకరణమును, గలిగి తనకు నమస్కరించి నిలిచి యున్న యాశిష్యుని, కూర్చుండుమీాయని = వసింపుమాయని, అనఁగా ఆచార్యుఁడు శిష్యుని పరిపక్వచిత్తము నెఱిఁగి, కూర్మమువలె తలఁచుట మత్స్యమువలె చూచుట

పక్షివలె తాఁకుటలచేత ఆగామి సంచితప్రారబ్ధకర్మములను ఎడఁబాసి సచ్చిదానందస్వరూపునిఁగఁ జేయఁబూని కూర్చుండుమనెనని భావము. కృపఁ=నిర్వ్యాజకరుణచేత, కూర్మక్రియఁ=తాఁబేలువలెను, ఎంచి=శ్రేయోవంతుఁడగుఁగాక యనితలఁచి, అనఁగా తాఁబేలు ఒకచోట గ్రుడ్లుపెట్టి మఱియొకచోటనుండి ఆగ్రుడ్లను తలఁచునపుడు అవి యెల్ల పిల్లలై మఱి అప్పుడప్పుడు ఆపిల్లలను తలఁచుటవలన వానికి ఆఁకలిదప్పులు లేక పెరుఁగుట స్వభావము గాన ఆతాఁబేలువలె గురుఁడు శిష్యునకు విషయసుఖములను మమతాహంకారములను ప్రబలఁజేసెడి ఆగామికర్మములు తొలఁగి సద్గుణములు ప్రబలి బ్రహ్మజ్ఞానము వర్ధిల్లి మోక్షసుఖము లభించునుగాక యని అంతరత్రిపుటీరూపమైన అంతఃకరణమందు తలఁచె నని భావము. మత్స్యంబట్లు=చేఁపవలె, కృపఁ=దయచేత, చూచి=వీక్షించి, అనఁగా మత్స్యములు గ్రుడ్లుపెట్టి తఱి యెఱిఁగి వానికై తిరిగి చూచునప్పుడు అవి యెల్ల పిల్లలై ఉల్లసిల్లుట ప్రసిద్ధము గనుక అనాదిగా వెంటనంటియున్న సంచితకర్మసంబంధములై కాయికవిషయములైన ప్రాకృతదుష్టలక్షణములు నశించి బ్రహ్మానందసంపదలంద హేతువులగు అప్రాకృతభాగ్యలక్షణములు గలవానిఁగా మధ్యత్రిపుటీరూపమైన కడగంటిచూపుచేతఁ జూచెనని భావము. పులుంగుమాడ్కిఁ=పక్షివలె, మూర్ధ్నిఁ=శిరస్సునందు, శయంబు=అభయహస్తమును, చేర్చి=ఉంచి, అనఁగా పక్షి గ్రుడ్లుపెట్టి వానిని తనఱెక్కలచేత పొదుగఁగా అవి పిల్లలై స్తన్యపానము స్నానము మొదలగునవిగల నరశిశువులవలె వృద్ధిపొందుట సహజము గనుక నితఁడు ప్రారబ్ధరూపముగ ప్రాప్తించిన అనుభవ మంతయు నశించి స్వస్వరూపజ్ఞానవంతుఁ డగుటకు నిత్యానందస్వరూపమయి పరిపూర్ణముగా వ్యాపించుటకు బాహ్యత్రిపుటీరూపమయిన పద్మచక్రశంఖవజ్రహలాదిరేఖలుగల తన అభయహస్తమును అతని మస్తకమందు చేర్చి సకలావయవములను తడివెనని భావము. అనఘా=నిర్మలుఁడా, కడుఁ=మిక్కిలి, నీయుత్పత్తులఁ=నీజన్మములను, పాపఁ=తొలఁగించుటకు, ఒండుయుక్తి=ఒకమేలయిన యుపాయము, వెలుంగుఁ = ఒప్పును, దానిఁ=ఆయుక్తిని, విని=ఆకర్ణించి, అభ్యాసంబుఁ=యోగాభ్యాసమును, ఒనర్పం దగుఁ=చేయఁదగును.

తా. పదినెలలు మోసి కని పెంచి వాత్సల్యము గలిగి యుండు తల్లితో సాటిరైన గురువు శిష్యుని తనచేరువను కూర్చుండఁబెట్టుకొని తాఁబేటివలె మేలుగలుగవలయునని తలఁచి చేఁపవలె కటాక్షవీక్షణముచేత వీక్షించి పక్షివలె హస్తముచేత మస్తకమును గప్పి నీజన్మములను తొలంగింప నిరపాయమయిన యుపాయ మొక్కటి గలదు. దానిని అక్కఱతో విని యోగాభ్యాసము చేయు మనెనని తాత్పర్యము.

అవ:—శిష్యుఁడు గురుని వాక్యములను ఆలించి ఆనందించి ఆచార్యునితోడ తన యభిప్రాయమును తెలుపుట చెప్పఁబడుచున్నది.

ఉ. తొలఁగు భవద్భవంబు లనఁ దోయరుహాకరమందు మగ్నుఁడై
వెలసినభాతి శీతలత వేదన లూఁటఁ జెంద భక్తి లో
పల మితి మీఱి పై కుబికి భాసిలుభంగిఁ బదాంబుజన్మముల్
వెలయఁగ రాల బాష్పములు వెండియు జోత యొనర్చి యిట్లనెన్.

టీ. భవద్భవంబులు-భవత్=నీయొక్క, భవంబులు=జన్మములు, తొలఁగున్=వదలును, అనఁగా ఇఁకపై నీకు జన్మములు లేవు-అనన్=అని పలుకఁగానే, తోయరుహాకరమందున్=తటాకమందు, మగ్నుఁడై=క్రుంకినవాఁడై, వెలసినభాతిన్=ప్రకాశించినట్లు, శీతలతన్=చల్లఁదనముచేత, వేదనలు=దుఃఖములు, అనఁగా తాపత్రయదుఃఖములు, ఊఁటఁజెందన్=ఉపశమిల్లఁగాను, భక్తి=అనురాగము, లోపలన్=అంతరంగమందు, మితిమీఱి=హద్దుమించి, పైకుబికి=మీఁదికుబికి, పదాంబుజన్మముల్=పాదపద్మములు, వెలయఁగన్=ప్రకాశించునట్లు, బాష్పములు=ఆనందబాష్పములు, రాలన్=వర్షింపఁగా, వెండియున్=మఱల, జోతయొనర్చి = సాష్టాంగనమస్కారముచేసి, ఇట్లనెన్=ఈవిధమునఁ బలికెను.

తా. బ్రహ్మసృష్టి మొదలుకొని క్రమక్రమముగా వచ్చిన పాపజన్మములును మిశ్రజన్మములును పుణ్యజన్మములును తొలఁగు ఉపాయమున్నదని ఆచార్యుఁడు పలుకఁగా శిష్యుఁడు విని కళత్రపుత్రమిత్రధనకనకవస్తువాహన సహితమైనగృహము దగ్ధమగునప్పుడు గృహాధిపతియగువాఁడు అతిప్రయాసముచేత తానుమాత్రము వెలుపలికి వచ్చి శరీరవేదన తీఱఁగా తేటచల్లనినీళ్లు గలతామరకొలఁకునందు దుమికి దేహతాపము తీఱి హాయి చెందునట్లు గురుదయారససరస్సునందు మునిఁగి తాపత్రయాగ్నివలనిసంతాపములు చల్లాఱఁగా భక్తిరసము అంతఃకరణమందుండి మేరమీఱి వెల్లివిరసిన తీరున ఆనందబాష్పములు రాలఁగా గురుచరణకమలములయందు పడి సాష్టాంగనమస్కారము చేసి నిలిచి గురునితో విన్నవింపఁదొడఁగె నని తాత్పర్యము.

అవ:—ఇట్లు విన్నవింపఁదొడఁగిన శిష్యుఁడు తనకు అహంభావము లేకపోవుట ఆచార్యునకు తెలియుటకై తనభక్తినైచ్యమును తెలియఁజెప్పుకొనుచున్నాఁడు.

మ. భవదుక్తాధ్వమునం దశక్తి నడువం బ్రాల్మాలిన న్నన్ను బాం
ధవ యొప్పన్నిజభృత్యుమాడ్కిఁ గృపచేతం బ్రోవు మాత్మేశ నా
భవము ల్వాయ నుపాయ మున్నదని మున్ వాక్రుచ్చి తీవాయుపా
యవతంసం బిదియంచుఁ దెల్పుము నిరాయాసంబునం బేర్మితోన్.

టీ. ఆత్మేశ=స్మృత్యనుభవరూపములైన సర్వవ్యవహారములకు కారణమైనబుద్ధికి నాయకుఁడవైన ఓగురుమూర్తీ, భవదుక్తార్థమునందున్, భవత్=మీచేత, ఉక్త=ఉపదేశింపఁబడిన, అర్థమునందున్=మార్గమందు, అశక్తిన్=సామర్థ్యములేకపోవుటచేత, నడువన్=ప్రవర్తించుటకు, ప్రాల్మాలినన్=బద్ధకించినను, నన్నున్=మూఢుఁడనైన నన్ను, నిజభృత్యుమాడ్కిన్=తమదాసునివలె, బాంధవమొప్పన్=గురువు శిష్యుఁడు అనెడు సంబంధ మతిశయించునట్లు, కృపచేతన్=నిర్వ్యాజకరుణచేత, ప్రోవుము=రక్షింపుము, ఈవు=పరమాత్మస్వరూపివైననీవు, మున్=ముందు, నాభవములు=నాజన్మములు, పాయన్=తొలఁగుటకు, ఉపాయ మున్నదని=యుక్తిగలదని, వాక్రుచ్చితి=పలికితివి, ఆయుపాయవతంసంబు=ఆశ్రేష్ఠమైనయుక్తి, ఇది యంచున్=ఈలాటిదని, నిరాయాసంబునన్=శాస్త్రజ్ఞానము లేక ఊరక వ్యర్థముగ ప్రశ్నలఁ జేయుచున్నాఁడనెడు ఆయాసము లేక, పేర్మితోన్=వాత్సల్యముతోడ, తెల్పుము=అనుగ్రహింపుము.

తా. ఓగురుస్వామీ! నేను తాముపదేశించినప్రకారము నడువ బద్ధకించినను మీసేవకుఁడనైన నన్ను దయాదృష్టిచేత చూచి గారవించి రాఁగల జన్మపరంపరలను తొలియఁదగిన యుక్తి యొక్కటి గలదని ఆనతిచ్చితివి. దానిని నాకుఁ దెలియఁజెప్పి రక్షింపవలయు నని తాత్పర్యము.

అవ:— ఇట్లడిగిన శిష్యునకు అహంకారము మమకారము మొదలైనదుర్గుణములు తొలఁగె నని తెలిసి ఆత్మస్వరూపమును ఉపదేశింప దేశికులు యత్నించుచున్నారు.

మ. విని తచ్ఛిష్యునివిన్నపం బెడసె దుర్వృత్తు ల్వీని కీదేహి పా
వనుఁ డయ్యెం జుమి యంచుఁ బల్కుఁదొడఁగెన్ గైవైశంబమృత్కీటకం
బు నిజాకార మొనర్ప దానికడ సత్పుష్పంధయం బారవం
బు నితాంతం బొనరించుభాతిఁ గడు సంపూర్ణానుకంపాత్ముఁడై.

టీ. తచ్ఛిష్యునివిన్నపంబు=ఆశిష్యునివిజ్ఞాపనమును, విని=ఆలకించి, వీనికిన్=ఇతనికి, దుర్వృత్తులు=రాగద్వేషాదులతోఁగూడిన చెడ్డనడుపడులు, ఎడసెన్=తొలఁగెను, ఈదేహి=ఈపురుషుఁడు, పావనుఁడయ్యెంజుమి=జన్మాంతరసుకృతవిశేషములచేత ఆణవకార్మికమాయికమాయేయతిరోధానములనెడు పంచమలములవలన విడువఁబడెను సుమా, అంచున్=అని, సత్పుష్పంధయంబు, సత్=శ్రేష్ఠమైన, పుష్పంధయంబు=అమృతసంజీవిని యనుక్రియ గలిగి పురుగును మరల బ్రతికించునట్టి తుమ్మెద, ఇట్లనుటచేత శరీరాభిమానమును వదలించి కేవలపరబ్రహ్మాకారము చేయ నుపదేశించు సద్గురు వనుట, మృత్కీటకంబున్=కుమ్మరపురుగును, నిజాకారము=తనస్వరూపమును, ఒనర్పన్=చేయుటకు, దానికడన్=ఆకుమ్మరపురుగుచేరువను, నితాంతంబు=మిక్కిలి, ఆర

వంబుఁ=ధ్వనిని, ఒనరించుభాతిఁ=చేయుచున్నవిధమున, సంపూర్ణానుకంపాత్ముఁడై=నిండునెనరుతోఁ గూడినమనస్సుగలవాఁడై, కడుఁ=మిక్కిలి, వైళంబ=శీఘ్రముగా, పల్కఁదొడఁగెఁ=దేశికుఁడు శిష్యునకు ఉపదేశింప నారంభించెను.

తా. గురుస్వామి శిష్యుని మనవిని విని యితఁడు పంచమలసంబంధములైన కామము క్రోధము మొదలుగాఁగల దుర్గుణములను వీడి పవిత్రుఁడాయెను. అని తలఁచి తుమ్మెద మట్టిలోఁ దిరిగెడు కుమ్మరపురుగును రెట్టించిన ప్రేమతో తనరూపమ్ముగఁ జేయుటకు దానిచేరుసను జేరి విరామము లేక ఆరావమును సల్పినతీరున శిష్యునకు పంచోపనిషన్మయమైన పరబ్రహ్మమును సూత్రభాష్య గీతాభాష్య ఉపనిషద్భాష్యములనెడి ప్రస్థానత్రయార్థపూర్వకముగ ఉపదేశింప దేశికుఁడు పూనెనని తాత్పర్యము.

ఈపద్యమున శిష్యునకు కుమ్మరపురుగు పోలికను గురువునకు తుమ్మెదపోలికను చెప్పుటచేత తన్ను మఱుఁజేయు ప్రకృతిభ్రమరూపమైన ఆంతర బాహ్య దృశ్యస్వరూపసంసారమనెడు బురదలోఁ జిక్కి తిక్కఁగొని జననమరణప్రవాహములోఁ బడి ఆధివ్యాధులచేత బాధనొందుచు ఉండువాఁడగుటచేత శిష్యునకు కుమ్మరపురుగుసాదృశ్యమును చిదాకాశమనెడు ఆకాశగమనమును విన సొంపగు సచ్ఛాస్త్రప్రసంగమనెడు గానమును పుష్పరసపానమనెడు స్వానుభవానందరసపానమును గలవాఁడగుటచేత సత్యజ్ఞానానందస్వరూపుఁడయిన ఆచార్యునకు తుమ్మెదపోలికయును చెప్పఁబడెను.

అవ:—తన్ను తా నెఱుఁగనిపురుషుఁడు జన్మపరంపరలలోఁ జిక్కి తొక్కటపడుటయును ఆజన్మములు తొలఁగునుపాయమును ఆజన్మములు కలిగినవిధమును అవియుండెడి కాలప్రమాణమును గురువులు శిష్యునకుఁ జెప్పుచున్నారు.

**మ. తనుఁ దాఁ గానమిఁ గాలనేమిఁ బడి దుర్దాంతాశుగావర్తమం**
**దు నజస్రంబుఁ జరించు శుష్కఛదనస్తోకక్రియ న్ధాత్రి ని**
**ల్వ నివాసం బిసుమంత లేక జననవ్రాతంబులోఁ జిక్కఁ గా**
**వున స్వాత్మానుభవంబుదాఁక సుత నీ వూహింపు మీయర్థమున్.**

టీ. సుత=కుమారా, తాఁ = దేహేంద్రియాదులకు విలక్షణుఁడైన తాను, తనుఁ=పరబ్రహ్మమైన తన్ను, కానమిఁ=తెలియనందున, దుర్దాంతాశుగావర్తమందుఁ-దుర్దాంత=సొందశక్యముగాని, ఆశుగావర్తమందుఁ=సుడిగాలియందు, అజస్రంబుఁ=ఎల్లప్పుడును, చరించుశుష్కఛదనస్తోకక్రియఁ-చరించు=తిరుగుచున్న, శుష్క=ఎండిన, ఛదన=ఆకుయొక్క, స్తోకక్రియఁ=అల్పమువలె, అనఁగా తునుకవలెను, ధాత్రిఁ=పుడమియందు, నిల్వఁ=ఉండుటకు, నివాసంబు=స్థానము, ఇసుమంతలేక=

కొంచమైనను లేక, స్వాత్మానుభవంబుదాఁకక్=తాను తన్నెఱుఁగెడువఱకు, కాలనేమిక్-కాల = నిమేషము మొదలు ప్రకృతిప్రళయాంతమైన కల్పితకాలమనెడు, నేమిక్=బండిచక్రపుటంచునందు, పడి=పాలి, జననవ్రాతంబులోక్ = జన్మపరంపరయందు, చిక్కిక్=తగులుకొనును, కావునక్=కాఁబట్టి, నీవు=మోక్షముగోరెడు నీవు, ఈయర్థముక్=ఈయభిప్రాయమును, ఊహింపుము=నేనును ఈలాగున జన్మము లెత్తితి నని యూహింపుము.

తా. ఓయి శిష్యుఁడా జీవసాక్షియైన కూటస్థుఁడగు తాను ఈశ్వరసాక్షియైన పరబ్రహ్మమును తన్నుఁగా తెలియనివాఁడు స్థూలసూక్ష్మకారణదేహభ్రమలలోఁ దగిలి నేను జీవుఁడను బ్రాహ్మణాదివర్ణములు గలవాఁడను సుఖిని దుఃఖిని అనునివి మొదలగు మాయికములైన దుర్భ్రమలను పొంది హాయి లేక యుగసంవత్సరమాసాదికల్పితభేదములుగల కాలమనెడు చక్రమందు చిక్కుపడి దిక్కు గానక సుడిగాలిలోఁ జిక్కిబడిన పడిగ గిరగిర తిరిగెడు చెత్తవలె నానావిధజంతువుల గర్భములలో పుట్టుచు పుణ్యపాపమిశ్రకర్మఫలములగు సుఖదుఃఖముల ననుభవించి గిట్టుచు ఈవిధమున అస్మచ్ఛబ్దలక్ష్యార్థమగు పరబ్రహ్మమే నేననునట్టి తెలివి పుట్టువఱకు నుండును కాఁబట్టి నీ వీగుట్టును మనస్సునఁ బెట్టి నేనును ఆత్మజ్ఞానము లేనందున ఈతీరున పుట్టుచు గిట్టుచు ఉంటి నని తెలిసికొని నిన్ను నీ వెఱుఁగునట్టి నిష్ఠయందు పట్టుదల కలిగి యుండుమని తాత్పర్యము.

అవ:—శిష్యుఁడు జీవేశ్వరోపాధులను విడిచి పరబ్రహ్మమగువిధమును ఆచార్యులు బోధించుచున్నారు.

మ. తానై కన్గొనఁ దన్నుఁ దాఁ దనకు నాధారేశు నాయీశుఁడే
హీనోపాధులు వీడి వెన్కఁ దగ నూహింపం బరబ్రహ్మమా
నే నీజ్ఞానము నీవె నన్నడుగ నీకిచ్చం దెల్పితిక్ దీని స
న్మానింపక్ నిను నంట వేవ్యథలు స్వాత్మన్ బ్రజ్ఞ భాసిల్లఁగన్. ౫౩

టీ. తాక్=కార్యోపాధియైన తూలావిద్యతోఁగూడిన జీవభ్రాంతిగల తాను, తన్నుక్=కూటస్థుఁడగు తన్నును, తనకుక్ = అవిద్యోపాధిగల తనకు, ఆధారేశుక్-ఆధార=ఆశ్రయుఁడైన, ఈశుక్=కారణోపాధియైన మూలావిద్యతోఁగూడిన యీశ్వరుని, కన్గొనక్=గురూపదేశముచేత జీవేశ్వరవాచ్యార్థములను పరిశీలించి చూడఁగా, ఆయీశుఁడే=ఆయీశ్వరుఁడే, తానై=తనయందు వ్యాపించియున్న తూలావిద్య చెడి మూలావిద్యతోఁ గూడినవాఁడై, వెన్కక్=పిమ్మట, తగక్=లెస్సగా, హీనోపాధులు=తమస్థూలసూక్ష్మకారణోపాధు లన్నియును, ఊహింపక్=శ్రుతియుక్త్యనుభవములచేత ఆలోచింపఁగాను, వీడి=ఆయుపాధు లన్నింటిని వదలి, పరబ్రహ్మమాక్=

పరబ్రహ్మమగుదు. కాబట్టి, ఈవు=నీవు, నన్నున్=పరబ్రహ్మమైన నన్నుఁగూర్చి, అడుగన్=యథార్థజ్ఞాన ముపదేశింపు మని అడుగఁగాను, ఏన్=నేను, ఈజ్ఞానమున్=ఈ బ్రహ్మజ్ఞానమును, నీకున్=నీకు, ఇచ్చన్=ఆశతో, తెల్పితిన్ = తెలియఁజెప్పితిని, దీనిన్=ఈయుపదేశమును, సన్మానింపన్=గౌరవించితివేని, అనఁగా అనుష్ఠించినయెడల, స్వాత్మన్-స్వ=జ్ఞాతృస్వరూపుఁడవైన నీయొక్క, ఆత్మన్=తెలివియందు, ప్రజ్ఞ=బ్రహ్మజ్ఞానము, భాసిల్లఁగన్=ప్రకాశింపఁగాను, ఏవ్యథలు=ఏవిధములైన దుఃఖములును, నినున్=నిన్ను, అంటవు=తగులవు.

తా. ఓయి శిష్యుఁడా ‘‘కార్యోపాధిరయం జీవః కారణోపాధిరీశ్వరః’’ అనెడు స్మృతినిబట్టి కార్యోపాధియైన అజ్ఞానమును అంతఃకరణమును దానికి అధిష్ఠానమైన బ్రహ్మాభిన్నకూటస్థచైతన్యమును ప్రతిబింబచైతన్యమును శరీరత్రయమును వీనియందలి అధ్యాసమును గూడి జీవుఁడనఁబడును. కారణోపాధియైన మాయయును అంతఃకరణమును దానికి అధిష్ఠానమైన బ్రహ్మచైతన్యమును ప్రతిబింబచైతన్యమును శరీరత్రయమును వీనియందలి అధ్యాసమును కూడి యీశ్వరుఁడనఁబడును. పైనిఁ జెప్పఁబడిన లక్షణములుగల జీవుఁడైన తాను గురూపదేశమువలన తన్నును తనకు ఆధారమైన యీశ్వరుని విచారించి కించిజ్జ్ఞత్వాదిగుణములుగల జీవత్వమును జహల్లక్షణచేత విడిచి అజహల్లక్షణచేత సర్వజ్ఞత్వాదిగుణములుగల యీశ్వరత్వమును పొంది పిమ్మట జీవేశ్వరోపాధికారణములై తూల, మూల అనుసంజ్ఞలుగల అవిద్యను మాయను వానికార్యములైన శరీరాదులును సర్వజ్ఞత్వాదిగుణములునుగల యీశ్వరత్వమును జహల్లక్షణచేత వదలి అజహల్లక్షణచేత దానికి ఆధారభూతుఁడును సచ్చిదానందాదిగుణములు గలవాఁడును అయిన పరబ్రహ్మము తా నగును కనుక నీవును నామాటలయందు నమ్మకము గలిగి బ్రహ్మనిష్ఠగలవాఁడవైతివేని నీయంతఃకరణమందు అపరోక్షజ్ఞానము ప్రకాశించి సర్వదుఃఖములు తీఱి ముక్తుఁడవగుదు వని తాత్పర్యము.

అవ:—గురువు తన్ను తా నెఱుఁగవలయును అని పలుకఁగా శిష్యుఁడు ఆమాటకు దేహము నెఱుఁగుట యని యెంచి తనయభిప్రాయమును పలుకుచున్నాఁడు.

శా. నన్నేఁ గానని వానిఁగాఁ గని యుపన్యాసించి తీ విప్డు మున్
దన్నుం గానని వాఁడు నేలఁ గలఁడే తత్త్వజ్ఞ యట్లుండ నా
పన్నుల్గారె భవాబ్ధి వారు పడి సంప్రాప్తాపవర్గాత్ములై
యున్నారా కృప గల్గెనేని నను మీ రూహించి తెల్పందగున్.

టీ. తత్త్వజ్ఞ=బ్రహ్మవిదుఁడవైన ఓయాచార్యుఁడా, ఇప్డు=ఈసమయమందు, ఈవు=నీవు, ఏన్=నేను, నన్నున్=నన్ను, కానని వానిఁగాన్=ఎఱుఁగనివానిఁగాను,

కని=తెలిసి, ఉపన్యాసించితివి=పలికితివి, మున్=పూర్వము, నేలన్=భూమియందు, తన్నున్=తన్ను, కానని వాఁడు=ఎఱుఁగని వాఁడు, కలఁడే=ఉన్నాఁడా, అట్లుండన్=అందఱును తమ్మను తా మెఱిఁగియుండఁగా, భవాబ్ధిన్ = జన్మములనెడు సముద్రమందు, వారు=తెమ్మెఱిఁగినవారు, పడి=కూలి, ఆపన్నులగ్గా రే=ఆపదలఁ జెందినవారు కారేదా, సంప్రాప్తాపవర్గాత్ములు-సంప్రాప్త=పొందఁబడిన, అపవర్గాత్ములు=మోక్షమే స్వరూపముగాఁగలవారు, ఐయున్నారా = అయియున్నవారా, అనఁగా లేదుగదా యనుట, కృపగల్గినేని=దయగలిగియుండెనేని, ననున్=నన్ను, మీరు=అపరోక్షజ్ఞానముగలమీరు, ఊహించి=ఆలోచించి, తెల్పందగున్=ఉపదేశింపఁదగును.

తా. స్వామీ నన్ను నే నెఱుఁగని మూఢునిఁగాఁ దలఁచి నిన్ను నీ వెఱుఁగుమని పలికితివి. లోకమందు అందఱును తమ్మను తాము తెలిసియేయున్నారు. వారు ముక్తులు గాక నరకవాసు లగుటకు కారణ మేమి? జన్మదుఃఖములలో మునిఁగియున్న నన్ను ఆదరించి తా ననుమాట కర్థము వివరించి అది యనుభవమునకు వచ్చునటులు తెలుపుఁ డని తాత్పర్యము.

అవ:—గురువులు శిష్యుని ప్రశ్నమునకు ఉత్తరువు వక్కాణించుచున్నారు.

చ. తను విది దేహి యాతఁ డని తత్త్వ మెఱింగినవాఁడె తన్నుఁ దాఁ
గనినరుం డన న్విని జగంబున దేహము గాక దేహి యే
డన గురుఁ డంత వానిహృదయానుభవం బెదఁ గాంచి మోమునం
బెనఁగొని హర్షశోకములు పెల్లుగఁ గ్రాలఁదొడంగెఁ బల్కఁగన్.

టీ. ఇది=ఈకనఁబడుచున్నట్టిది, తనువు=పంచకోశాత్మకమైన స్థూలదేహము, ఈతఁడు=దేహేంద్రియములకు విలక్షణుఁడైన ప్రత్యగాత్మ, దేహి=దేహమందుండెడువాఁడు, అని=ఇట్లని, తత్త్వమున్=నిజమును, ఎఱింగినవాఁడె = తెలిసినవాఁడే, తన్నున్ = కూటస్థుఁడైన తన్ను, తాన్=తాను, కనిననరుండు = తెలిసినపురుషుఁడు, అనన్ = అనిపలుకఁగా, విని=ఆలించి, జగంబునన్ = లోకమందు, దేహము గాక=షడ్భావవికారసహితమైన శరీరముతప్ప, దేహి = కూటస్థపరబ్రహ్మము, ఏడి=ఎక్కడనున్నాఁడు, అనన్ = అని శిష్యుఁడు పలుకఁగానే, గురుఁడు = దేశికుఁడు, అంతన్=పిమ్మట, వానిహృదయానుభవంబున్ = ఆశిష్యునిమనస్సునందలి అభిప్రాయమును, ఎదన్=అంతఃకరణమందు, కాంచి=తెలిసి, మోమునన్=ముఖమందు, హర్షశోకములు=సంతోషమును పరితాపమును, పెనఁగొని=పెరిగొని, పెల్లుగన్=మిక్కుటముగా, క్రాలన్=ప్రకాశింపఁగా, పల్కఁగన్=చెప్పుటకు, తొడంగెన్=ఉపక్రమించెను.

తా. ఓయిశిష్యుఁడా యిది అసత్యమును అచేతనమును దుఃఖమయమును ఐన దేహము. ఈతఁడు సచ్చిదానందకూటస్థపరబ్రహ్మము అని యెఱిఁగినవాఁడే తన్ను తాను తెలిసినవాఁడు అని గురువు పలుకఁగానే శిష్యుఁడు దేహమే తాననుబుద్ధి మనస్సునందు పెనఁగొనఁగా స్వామీ లోకమునందు దేహము తప్ప దేహి యెక్కడఁ గలఁడనెను. గురుఁడామాట విని శిష్యునిహృదయపరిపాక మెఱిఁగి మోదమును ఖేదమును ముఖమున పెనఁగొనఁగా శిష్యునకు బోధింపఁబూనె నని తాత్పర్యము.

అవతారిక:—ఈస్థూలదేహమునకంటె ప్రత్యగాత్మ వేఱుగా లేనియెడల అవస్థాత్రయమును ఎఱిఁగెడివాఁ డెవఁ డని ఆచార్యులు శిష్యుని అడుగుచున్నారు.

మ. ఎవఁ డీదేహముకంటె దేహి మఱి నే నీక్షింప లే దంటి వీ
వవలోకించుట యట్టిదైనఁ గడు మోహస్వప్నమం దెవ్వఁ డు
ద్భవమా దానిఁదొఱంగిచూచుఁ బటునిద్రన్ శూన్యమెవ్వండుమ
క్కువ నీరెంటిఁ బ్రబోధమం దెఱుఁగునీగోప్యంబుఁ దెల్పం దగున్.

టీ. ఈదేహముకంటెన్ = ఈస్థూలశరీరమునకంటె, దేహి=కూటస్థుఁడు, మఱి యెవఁడు=వేఱొకఁ డెక్కడ నున్నాఁడు, నేన్=నేను, ఈక్షింపలేదంటివి=చూడలేదని చెప్పితివి, ఈవు=నీవు, అవలోకించుట=చూచుట, అట్టిదైనన్=దేహమే ఆత్మ యనునిశ్చయము కల్గినయెడల, కడున్=మిక్కిలి, మోహస్వప్నమందున్=భ్రిమయొక్కస్వప్నకలయందు, ఎవ్వఁడు = ఏపురుషుఁడు, ఉద్భవమాన్=పుట్టును, దానిన్=ఆస్వప్నమును, తొఱంగి=విడిచి, పటునిద్రన్=గాఢసుషుప్తియందు, శూన్యమున్=సుఖదుఃఖాదులు ఏవియును లేకపోవుటను, ఎవ్వండు=ఏపురుషుఁడు, చూచున్ = అవలోకించును, అనఁగా తెలిసికొనునో యనుట. ప్రబోధమందున్ = మెలఁకువయందు, మక్కువన్= ప్రేమచేత, ఈరెంటిన్=ఈస్వప్నసుషుప్తులను, ఎఱుంగున్=ఎవ్వఁ డెఱుఁగును, ఈగోప్యంబున్=ఈరహస్యమును, తెల్పందగున్=తెలియఁజెప్పదగును.

తా. ఓయిశిష్యుఁడా యీస్థూలదేహమునకంటె వేఱుగా శరీరి లేఁడని పలికితివి. లేనియెడల స్వప్నావస్థయం దెవఁడుండి స్వప్నవృత్తాంతములను సుషుప్తియం దెవఁడుండి ఆసుషుప్తియందలి సుఖదుఃఖము లేవియును ఎఱుఁగక అనుభవించుచు జాగ్రత్తి వచ్చినవేళ స్వప్నవృత్తాంతమును నిద్రలోని సుఖదుఃఖములను తెలిసి యెవఁడు చెప్పుచున్నాఁడో వానిని తెలుపు మని శిష్యుని అడిగె నని తాత్పర్యము.

అవతారిక:—స్వామీ దేహత్రయమందు అవస్థాత్రయమును ఎఱిఁగెడువాఁడు ఒకఁడు కలఁడు లేఁడు అనెడుసందేహము కలుగుచున్నది. వానిని నివారింపుఁ డనిశిష్యుఁడు అడుగుచున్నాఁడు.

శా. జాగ్రత్స్వప్నములందుఁ దోఁచెడుసమస్తగ్రాహ్యముల్ సుప్తియం
దగ్రాహ్యంబు లగుం దలంచు మదిలోన్ నాస్వప్నసుషుప్తులం బున
ర్జాగ్రంబం దొకఁ డుండునా యనెడునీసందేహ మింపొందెఁ బ్ర
త్యగ్రాదిత్యశతాభ హృత్తమము పాయన్ దానిఁ దెల్పం దగున్.

టీ. జాగ్రత్స్వప్నములందున్=స్థూలసూక్ష్మశరీరావస్థలైన మెలఁకువయందును కలయందును, తోఁచెడుసమస్తగ్రాహ్యముల్-తోఁచెడు=స్ఫురించుచుండెడి, సమస్తగ్రాహ్యముల్=సర్వేంద్రియములచేత ఎఱుఁగఁదగిన సంకల్పవికల్పాదివిషయములన్నియును, సుప్తియందున్=గాఢనిద్రావస్థయందు, అగ్రాహ్యంబులగున్=లేనివగును, పునర్జాగ్రంబందున్=మరలఁ గలిగెడుజాగ్రదవస్థయందు, ఆస్వప్నసుషుప్తులు=కడచినసూక్ష్మదేహావస్థయైన ఆస్వప్నావస్థయందు జరిగినసంగతులను కారణశరీరావస్థయైన సుషుప్తియందలి సుఖాసుఖములను, మదిలోన్=తెలివియందు, తలంచున్=స్మరించును, [కనుక] ఒకఁడు=ఈజాగ్రత్స్వప్నసుషుప్తులలోని సంగతులను ఎఱుఁగువాఁడు దేహత్రయమునకంటె అన్యముగా ఒకఁడు, ఉండునా=కల్గునా, అనెడునీసందేహము=అనునట్టి నీయీయనుమానము, ఇంపొందెన్=కలిగెను, ప్రత్యగ్రాదిత్యశతాభ=ఉదయించుచున్న నూఱుగురుసూర్యులతేజస్సునంటి తేజస్సుగల ఓగురుస్వామీ, హృత్తమము=అంతఃకరణమందలి భేదజ్ఞానమనెడు కటికిచీఁకటి, పాయన్=తొలఁగునట్లు, దానిన్=ఆసందేహమును, తెల్పం దగున్=నివృత్తియగునట్లుగా బోధింపఁదగును.

తా. ఓగురుమూర్తీ స్థూలశరీరావస్థయైన జాగ్రత్తయందు జ్ఞానేంద్రియ కర్మేంద్రియ అంతరింద్రియములనెడు చతుర్దశేంద్రియములచేత తా ననుభవించిన సుఖదుఃఖములను సూక్ష్మశరీరావస్థయైన కలయందు తా ననుభవించిన సుఖదుఃఖములను కారణశరీరావస్థయైన నిద్రయందు తాను సుఖముగా నుండుటను మరల తనకు మెలఁకువ వచ్చినప్పుడు చెప్పుట అనుభవముగ నున్నది గనుకను శరీరములు మూఁడును అచేతనము లగుటచేత మూఁడవస్థలలోని సంగతులను చెప్పఁజాలవు గనుకను దేహములకంటె వేఱుగా ఒకఁ డున్నాఁడేమో అనెడుసందేహము గలుగుచున్నది గనుక దీనిని తీర్చుమని శిష్యుఁడు గురువులను అడిగెనని తాత్పర్యము.

అవతారిక:—తొలుత దేహమే తా ననుకొనెడు శిష్యుని దేహవిలక్షణుఁడ నను బుద్ధిపుట్టించి తటస్థలక్షణముచే ఆదేహతత్త్వములను వివరించి పిదప చిద్రూపమైనపర బ్రహ్మలక్షణమును విశదపఱచుచున్నారు.

మ. తరుశాఖాగ్రముఁ జూపి శాబకశశిన్ దారాళిఁ గాన్పించి పు
ష్కరమం దంత నరుంధతిం దెలుపుజోకన్ స్థూలతత్త్వంబు మున్

వరుసన్ సూక్ష్మనిదాన మావెనుక భావంబందు నూహించి స
ద్గురుఁడాశిష్యునిఁగూర్చి పల్కఁదొడఁగెన్ గోర్కుల్ వెసన్ మీఱఁగన్.

టీ. తరుశాఖాగ్రముఁ=చెట్టుకొమ్మకొనను, మాపి = ముందుగాఁ గనఁబఱచి, [తర్వాత] శాబకశశిన్=బాలచంద్రుని, పుష్కరమందున్=ఆకాశమందు, తారాలిన్=నక్షత్రపఙ్క్తిని, కాన్పించి=కనఁబఱచి అనఁగా సప్తర్షి మండలమును జూపి, అంతన్=పిమ్మట, అరుంధతిన్=అతిసూక్ష్మమైన అరుంధతీనక్షత్రమును, తెలుపు క్రీకన్=మాపునట్లును, మున్=ముందుగా, సద్గురుఁడు=శ్రేష్ఠుడైన గురుమూర్తి, స్థూలతత్త్వంబున్=జీవేశ్వరాదిసమస్తప్రాణులకుఁగల పంచభూతమయమైన జ్ఞానేంద్రియాదిస్థూలసృష్టి తత్త్వములను, వెనుకన్=పిమ్మటను, వరుసన్=క్రమముగాను, సూక్ష్మనిదానమున్, సూక్ష్మ=అణువునకు అణువగు సూక్ష్మస్వరూపమైన, నిదానమున్=మొదటికారణమును, భావంబందున్=అంతరంగమందు, ఊహించి=పరిశీలించి, కోర్కులు=అభిలాషలు, వెసన్=త్వరగా, మీఱఁగన్=వృద్ధిఁబొందునటులు, ఆశిష్యునిఁగూర్చి=ఆయంతేవాసినిగుఱించి, పల్కన్=వాక్రుచ్చుటకు, తొడఁగెన్=పూనెను.

తా. లోకమందు జనులు భూమియందుండెడి చెట్టుకొమ్మకొనను మాపించి విదియనాఁటి నెలబాలుని మాపినట్లుగాను ఆకాశమందలి సప్తర్షి మండలమును మాపించి అరుంధతీదేవిని మాపినట్లుగాను ఆచార్యుఁడు శిష్యునకు తొలుత జ్ఞానేంద్రియకర్మేంద్రియాది స్థూలతత్త్వములను మాపి వెనుక సూక్ష్మస్వరూపమును సర్వకారణమునుఅగు పరబ్రహ్మమును తెలుప నారంభించెనని తాత్పర్యము.

అవ:—తానై ప్రకాశించు చిద్రూపమును తానని యెఱుఁగుటకు జగజ్జీవపరములుగా తోఁచెడి ఆరోపయుక్తిని అద్వితీయ కూటస్థ బ్రహ్మముగాఁ దోఁచెడి అపవాదయుక్తిని ఆయారోపములనకుఁ గలిగిన నామములను గురువులు శిష్యునకు చెప్పుచున్నారు.

శా. ఆరోపం బపవాద మీయుభయమం దారోపమా బంధ మా
ధారంబై తగు ముక్తిఁ జెంద నపవాదం బంచు వేదాంత మా
యారోపంబున కాఖ్యలం దెలుపు నధ్యాసం బసత్యంబు నా
సారోదారకుమార కల్పన మనన్ సర్వజ్ఞు లూహింపఁగన్. ౫౯

టీ. సారో...మార-సార=శ్రేష్ఠుఁడవైన, ఉదార=గంభీరుఁడవైన, కుమార=పుత్రుఁడా, ఆరోపంబు=పరబ్రహ్మమందు జీవేశ్వరజగములుగా తోఁచిన అసత్యమును, అపవాదము=ఆతోఁచిన అసత్యమును కడకు తోసెడిఉపాయమును, ఈయుభయమందున్=ఈరెంటియందును, ఆరోపము=ఆరోపమనునది, బంధము=సంసారరూప

ప్రతిబంధము, ఔను=అగును, ముక్తి=సంసారబంధవిముక్తిని, చెందన్=పొందుటకు, అపవాదంబు=అపవాదయుక్తి,ఆధారంబై=ఉనికిపట్టయి,తగున్=ఒప్పును, అంచున్=అని, వేదాంతము=ఉపనిషచ్ఛాస్త్రము, ఆరోపంబునకున్=అమిథ్యకు, అధ్యాసంబు=అధ్యాసము, అసత్యంబు=అనృతము, నాన్=అనఁగాను, కల్పనము=నాస్తికత్వము, అనన్=అనునట్లుగాను, ఆఖ్యలన్=నామధేయములను, సర్వజ్ఞులు=పండితులు, ఊహింపఁగన్=ఆలోచించునట్లు, తెలుపున్=తెలియఁజేయును.

తా. ఓయిశిష్యుఁడా ఆరోపమని అపవాదమని రెండుయుక్తులు గలవు. వానియందు ఆరోపము బంధమని అపవాదము ముక్తియని వేదాంతశాస్త్రములయందు చెప్పఁబడును. వీనిలో ఆరోపమునకు అధ్యాసమని కల్పనమని అసత్యమని నామములు గలవని తాత్పర్యము.

అవ:—గురువులు శిష్యునకు అధ్యాసమును దృష్టాంతపూర్వకముగఁ జెప్పుచున్నారు.

మ. ఒకదానిన్ మఱియొండువస్తు వను మోహోద్రేక మధ్యాస మౌ
నకలంకస్థితిఁ గాంచు మెట్లనిన రజ్జ్వాశీవిషభ్రాంతి య
ర్కకరక్షీరము శుక్తిరౌప్య మగచోరప్రజ్ఞయుం బుత్ర మృ
త్తికఁ దేజోభ్రమ మభ్రనీల మన ధీఁ దీపించు నీకల్పనల్· ౬౦

టీ. పుత్ర=కుమారా, ఒకదానిన్ = ఒకపదార్థమును, మఱియొండువస్తువు=వేఱొకపదార్థము, అనుమోహోద్రేకము, అను = అనునట్టి, మోహ = మఱపుయొక్క, ఉద్రేకము=అతిశయము, అధ్యాసము = అధ్యాసమనునది, ఔను=అగును. అకలంకస్థితిన్, అకలంక=నిష్కళంకమైన, స్థితిన్=బుద్ధినిలుకడచేత, కాంచుము=తెలిసికొనుము, ఎట్లనినన్ = ఆతెలిసికొనుట యేలాగనఁగా, రజ్జ్వాశీవిషభ్రాంతి-రజ్జు=త్రాటియందు, ఆశీవిష=సర్పమనెడు, భ్రాంతి=భ్రమయును, అర్కకరక్షీరము-అర్కకర=సూర్యకిరణమందు, అనఁగా ఎండయందు, క్షీరము=నీరమను భ్రమయును, ‹‹ని. నీరక్షీరాంబు శంబరం›› అని అమరము. అనఁగా ఎండమావులను చూచి జలమనుకొనుట. శుక్తిరౌప్యము-శుక్తి=ముత్యపుఁజిప్పయందు, రౌప్యము=వెండియనుభ్రమయును, అగచోరప్రజ్ఞయున్-అగ=మోడుచెట్టునందు, చోరప్రజ్ఞయున్=చోరుఁడను బుద్ధిభ్రమయును, మృత్తికన్=మట్టియందు, తేజోభ్రమము=తేజోరూపమైన భ్రమయును, అనఁగా కాచాద్యాభరణభ్రమయును, అభ్రనీలము-అభ్ర=అవిషయాకాశమందు, నీలము=విషయరూపమగు నలుపువన్నమును, అనన్=అనునట్టి, ఈకల్పనలు=ఈవికారములు, ధీన్=బుద్ధియందు, దీపించున్=ప్రకాశించుచుండును.

తా. ఓయిశిష్యుఁడా లోకమునందు ఒకవస్తువును జూచి మఱియొకవస్తువునుగా తలఁచు భ్రమయే అధ్యాస మనఁబడును. ఏలాగనఁగా త్రాఁడును చూచి పామని యెండమావులను చూచి జలమని ముత్తెపుచిప్పను చూచి వెండియని మోడుచెట్టును చూచి దొంగయని మంటిలోఁ బుట్టినవంటరాళ్లను జూచి రత్నములని యీతీరున మనోవికారములు తోఁచుటే అధ్యాసమని తాత్పర్యము.

అవ:—తొలుతఁ జెప్పిన దృష్టాంతమువలె పరబ్రహ్మమందుఁ దోఁచినజగజ్జీవపరములను దృష్టాంతపూర్వకముగాఁ దెలుపుచున్నారు.

మ. అనఘా యీగతి నద్వితీయము షడధ్వాతీతమున్ యోగచి
ద్ఘనహృద్వేదశిరోర్థవేద్యము నిరాగంబున్ నిరూపాహ్వదు
ర్మనమున్ దానయి వెల్గుచుండుపరమాత్మం దోఁచు విశ్వంబు భూ
వనవహ్న్యాదులు భోగభోగ్యవితతుల్ వత్సా మదిన్ గాంచుమా.

టీ. అనఘా=నిష్కల్మషుఁడవైన, వత్సా=కుమారా, ఈగతిన్=పైనఁ జెప్పిన దృష్టాంతప్రకారముగాను, అద్వితీయమును=తనకంటె రెండవది లేనిదియును, షడధ్వాతీతమును=శివసంబంధములును శక్తిసంబంధములును అయిన ఆగమశాస్త్రములయందు ప్రసిద్ధములగు మంత్రపదవర్ణతత్త్వభువనకళలనెడు షడధ్వములను మీఱినదియును, యోగ...ద్యమును-యోగ=మంత్రలయహఠరాజయోగములనెడు చతుర్విధయోగములయందును, చిత్=అపరోక్షజ్ఞానమునందును, ఘన=అతిశయులైన బ్రహ్మవేత్తలయొక్క, హృత్=అంతరంగములచేతను, వేదశిరః=సకలోపనిషత్తులయొక్క, అర్థ=ముఖ్యాభిప్రాయములచేతను, వేద్యమును=తెలియఁదగినదియును, నిరాగంబును=రాగద్వేషకామక్రోధలోభాదిదుర్గుణములు లేనిదియును, నిరూపాహ్వదుర్మనమును=రూపనామములుగల మాయాప్రపంచమును గల్పించునట్టి దుష్టమానసము లేనిదియును, తానై=తానేయయి, వెల్గుచుండుపరమాత్మన్=ప్రకాశించునట్టిపరబ్రహ్మమందు, విశ్వంబున్=యుగపత్సృష్టిగా క్రమసృష్టిగా కనఁబడెడు ప్రపంచమును, భూవనవహ్న్యాదులు-భూ=భూమియును, వన=జలమును, వహ్ని=అగ్నియును, ఆదులు=మొదలగువాయువును ఆకాశమును కాలమును దిక్కులను మనస్సును, భోగభోగ్యవితతులు-భోగ=ప్రాణులయొక్క పదార్థానుభవములు, భోగ్య=అనుభవింపఁదగిన సకలపదార్థములు,వీనియొక్క, వితతులు=సమూహములును, తోఁచున్=ఆవిర్భవించుచుండును, మదిన్=అంతఃకరణముచేత, కాంచుమా=తెలిసికొనుమా.

తా. పుత్రా, మీఁదఁ జెప్పినదృష్టాంతప్రకారము రెండవది లేనికూటస్థబ్రహ్మమైనదియును శైవశాక్తాగమప్రసిద్ధములగు మంత్రపదవర్ణతత్త్వభువనకళలనెడు షడధ్వ

ములకంటె విలక్షణమైనదియును మంత్రలయహఠరాజయోగాభ్యాసములచేతను అప రోక్షజ్ఞానముచేతను అతిశయములైన మహాత్ములహృదయములచేత ఉపనిషత్తులముఖ్యా భిప్రాయములచేతను తెలియఁదగినదియును రాగము ద్వేషము కామము మొదలగువికార రహితమైనదియును రూపములును నామములునుగల ప్రపంచమును కల్పించునట్టి దుష్ట మనోవ్యాపారము లేనిదియును తానే తానుగా ప్రకాశించునదియును అగు పరబ్రహ్మ మందు భూలోకభువర్లోకసువర్లోకాత్మకమగు ప్రపంచమంతయును పృథివ్యాదిపంచ భూతములును సమస్తప్రాణులును వీరలకు కలిగెడిభోగేచ్ఛలును ఆయాభోగములకు తగిన పదార్థములును తోఁచునని తాత్పర్యము.

## షడధ్వవివరణము.

మంత్రాధ్వము పదాధ్వము వర్ణాధ్వము తత్త్వాధ్వము భువనాధ్వము కళాధ్వము అని అధ్వములు ఆఱువిధములు. అందు మంత్రాధ్వము—సద్యోజాతము వామదేవము అఘోరము తత్పురుషము ఈశానము హృదయము శిరస్సు శిఖ కవచము నేత్రము అస్త్రము అని పదునొకొండు విధములు.

పదాధ్వము— మహాదేవ సద్యాదీశ్వర మహాతేజయోగాధిపతి ముంచముంచ ప్రథమ ప్రథమ సర్వ సర్వ భవ భవ భవోద్భవ సర్వభూతసుఖప్రద సర్వసాన్నిధ్యకర బ్రహ్మవిష్ణు రుద్రపర అనార్చితానార్చిత అస్తుతాస్తుత పూర్వస్థిత సాక్షి సాక్షి తురుతురు పతంగ ప తంగ పింగపింగ జ్ఞానజ్ఞాన శబ్దశబ్ద సూక్ష్మసూక్ష్మ శివ సర్వసర్వ ఓంనమశ్శివ ఓంనమోనమో నమశ్శివ ఓంనమరూపి అరూపి ప్రథమప్రథమ తేజస్తేజ జ్యోతిర్జ్యోతి అరూప అనగ్ని అధూమఅభస్మ అనాది నానానా ధూధూధూధూ ఓంభూః ఓంభువః ఓగ్ంసువః అనిధన నిధ ననిధనోద్భవ శివ సర్వపరాపరాత్మ భువనేశ్వర ధ్యానహార ఓంనమశ్శివ సర్వప్రభు శివ ఈశానమూర్ధ్నే తత్పురుషవక్త్ర అఘోరహృదయ వామదేవగుహ్య సద్యోజాతపాద ఓంనమః గుహ్యాతిగుహ్యగోప్త అనిధన సర్వయోగాధికృత సర్వవిద్యాధిప జ్యోతీరూప పరమేశ్వర పరమేశ్వర అచేతనాచేతన వ్యోమ్నివ్యోమ్ని వ్యాపిక్ వ్యాపిని వ్యోమ వ్యాపిని వ్యోమరూప సర్వవ్యాపిని శివానంత అనాధ అనాశ్రిత ధ్రువ శాశ్వత యోగ పీఠ సంస్థిత నిత్యయోగి ధ్యానహార అద్యోంకారములని పదములు ఎనుబదియొకటి.

వర్ణాధ్వము —అం ఆం ఇం ఈం ఉం ఊం ఋం ౠం ఌం ౡం ఏం ఐం ఓం ఔం అం అః కం ఖం గం ఘం ఙం చం ఛం జం ఝం ఞం టం ఠం డం ఢం ణం తం థం దం ధం నం పం ఫం బం భం మం యం రం లం వం శం షం సం హం ళం క్షం అని వర్ణాధ్వము ఏఁబదియొకవిధము.

తత్త్వాధ్వము.—పృథివి ప్రకృతి బుద్ధి అహంకారమనశ్శ్రోత్రత్వక్ చక్షుర్జిహ్వా ఘ్రాణవాక్ పాణి పాద పాయు గుహ్య శబ్ద స్పర్శ రూప రస గంధ ఆకాశ వాయు

పృథ్వి జల మాయా కాల నియతి కల విద్య రాగ పురుష సదాశివ ఈశ్వర శుద్ధవిద్య శివ శక్తి అని తత్త్వములు ముప్పదియాఱు.

భువనాధ్వము.—భద్రకాళి వీరభద్ర త్రిలోచన నఖలిప్సువివాహ సంహార త్రిదశేశ్వర త్ర్యక్షగణాధ్యక్ష విభు శంభుదంష్ట్రి వజ్రఫణీంద్ర ఉదుంబర గ్రసన మారుతాశన క్రోధన అనంత వృషధర వృష బలిప్రియ భూతపాల జ్యేష్ఠ శర్వ సురేశ్వర వేదపారగ జ్ఞానభూ సర్వజ్ఞ ఈశానవిద్యాధిప ప్రకామద ప్రసాద శ్రీ ధరరత్నధర లక్ష్మీధర జటాధర సౌమ్యధర ధన్వరూప నిధీశ మేఘవాహన కపర్ది పంచశిఖ పంచాంతక క్షయాంతకతీక్ష్ణ సూక్ష్మ వాయువేగ లఘుశీఘ్రసునాద మేఘనాద జలాంతక దీర్ఘబాహు జయభద్ర శ్వేతమహాబల పాశహస్తఅతిబలబలదంష్ట్రి లోహిత ధూమ్ర విధు పాతక ఊర్ధ్వకేశ క్షయాంతక క్రూరదంష్ట్రి దంష్ట్రిమారణనిర్ఋతి ధర్మపతి అధర్మపతి వియోక్తసంయోక్త కర్త విధాతధాతహరమృత్యు ధర్మ అక్షయాంతక ధ్వాంతక వజ్రబాహుదహనజ్వలన హరఘాతుక పింగళహుతాశన అగ్నిరుద్ర త్రిదశాధిపపినాకిశాస్త అన్యాయ విభూతి వినర్ధన వజ్రదేహబుధఅజకపాలీశరుద్ర విష్ణు బ్రహ్మహాటకేశ్వరకూశ్మాండ కాలాగ్ని రుద్ర శ్రీకర్ణ సోమ కౌమార వైష్ణవ బ్రాహ్మ్యభైరవ కృతఅకృత స్థలేశ్వర సుబ్రాహ్మ్య ప్రాజేశ సౌమ్య ఇంద్ర గాంధర్వ యక్ష రాక్షస పైశాచ సుస్థలేశ్వర శంఖుకర్ణకాలాం జన మండలేశ్వర మహాండద్విరండభసకలాండ స్థాణుస్వర్ణాక్షభద్రకర్ణ గోకర్ణ మహాలయ అవిముక్త రుద్రకోటివస్త్రాపద భీమేశ్వరమహేంద్ర అట్టహాసవిమలేశ్వర నఖలనాఖల కురుక్షేత్ర గయాక్షమహాభైరవకేదార శ్రీశైలమహాకాల మధ్యమేశ్వర ఆమ్రాదికేశ్వర జలేశ్వర హరిశ్చంద్ర అపలేశ్వర ఢుంఢిముండిభారభూతి ఔషధిపుష్కరనైమిశ అమరేశ్వర అంగుష్ఠమాత్రార్క ఈశాన ఏకేక్షణ ఏకపింగళ ఉద్భవ అభవ వామదేవమహాద్యుతిశిఖేద ఏకవీరక్రోధచండఘోర పంచాంతక సంవర్తజ్యోతిష మహాక్రోధమహాచండ ఏకశివ అనంత అజ ఉమాపతి ప్రచండఏకపాద ఈశాన భవ ఉగ్ర భీమ అనంత సూక్ష్మ శివోత్తమ ఏకనేత్రఏకరుద్ర త్రిమూర్తి శ్రీకంఠశిఖండి వామ జ్యేష్ఠ రౌద్రికాళి కల వికర్ణబలవికర్ణబల ప్రమథన సర్వభూతదమన మనోన్మని అనాశ్రిత అనాథునఅనంతవ్యో మరూపవ్యాపినిఊర్ధ్వగామిని రోచిక మోచిక దీపకఇందికశాంత్యతీత శాంతి విద్యా ప్రతిష్ఠనివృత్తి అని భువనములు ఇన్నూటయిరువదినాలుగు.

కళాధ్వము.—నివృత్తి ప్రతిష్ఠ విద్య శాంతి శాంత్యతీత అని కళలు ఐదు. ఈ పంచకళలలో మంత్ర పద వర్ణతత్త్వ భువనములును భువనములు. తత్త్వములలోను చేరియున్నవి.

నివృత్తికళయందు సద్యోజాత పద్భ్యాంనమః హృదయాయ నమః అనెడు రెండుమంత్రములును మహాదేవపదము మొదలు ఓంనమ యనెడు పదమువఱకుగల యిరు

పదియేడు పదములును క్ష అనువర్ణమును పృథివీతత్త్వమును ఆతత్త్వమందు భద్రకాళి యనెడు భువనము మొదలుకొలాగ్ని రుద్రభువనమునఱకుఁగల నూటయెనిమిదిభువనములును చేరినవి. ఈభువనములలో భద్రకాళి వీరభద్రి అనురెండుభువనములును బ్రహ్మాండమునకు మీఁదను త్రిలోచనభువనము మొదలు శంభుభువనమునఱకుఁగల పదిభువనములును మీఁదిదిక్కునను దంష్ట్రిభువనము మొదలు వృషభువనమునఱకుఁగల పదిభువనములును క్రిందిదిక్కునను బలిప్రియభువనము మొదలు విద్యాధిప భువనమునఱకుఁగల పదిభువనములును ఈశాన్యపుదిక్కునను ప్రకామదభువనము మొదలు నిధీశభువనమునఱకుఁగల పదిభువనములును ఉత్తరపుదిక్కునను మేఘవాహనభువనము మొదలు శీఘ్రిభువనమునఱకుఁగల పదిభువనములును వాయవ్యదిక్కునను సునాదభువనము మొదలు బలభువనమునఱకుఁగల పదిభువనములును పశ్చిమదిక్కునను దంష్ట్రిభువనము మొదలు నిరృతిభువనమునఱకుఁగల పదిభువనములును నైరృతిదిక్కునను ధర్మపతిభువనము మొదలు ధర్మభువనమునఱకుఁగల పదిభువనములును దక్షిణపుదిక్కునను క్షయాంతకభువనము మొదలు అగ్నిరుద్రభువనమునఱకుఁగల పదిభువనములును ఆగ్నేయదిక్కునను త్రిదశాధిపభువనము మొదలుకపాలీశభువనమునఱకుఁగల పదిభువనములును తూర్పుదిక్కునను రుద్రభువనము మొదలు కాలాగ్ని రుద్రభువనమునఱకుఁగల ఆఱుభువనములును అండమధ్యమందును ఉండును. ఇవే అష్టోత్తరశతరుద్రభువనములు శతరుద్రీయసంజ్ఞగలవి. ఈభువననామములే భువనాధిపతులనామములు.

ప్రతిష్ఠాకలయందు వామదేవగుహ్యాయనమః శిరసేస్వాహా అనెడురెండుమంత్రములునుగూఁప అనుపదము మొదలు భువనేశ్వరపదమునఱకుఁగల పదములు ఇరువదియొక్కటియును టం అనువర్ణము మొదలు శం అనువర్ణము తుదగాఁగల వర్ణములు ఇరువదినాలుగును ప్రకృతితత్త్వము మొదలు జలతత్త్వమునఱకుఁగల యిరువదిమూఁడుతత్త్వములును శ్రీకర్ణభువనము మొదలు అమరేశ్వరభువనమునఱకుఁగల యేఁబదియాఱుభువనములునుచేరినవి ఈభువనములలో శ్రీకర్ణభువనము మొదలు అకృతభువనమునఱకుఁగల యెనిమిదిభువనములును ప్రకృతితత్త్వమందును స్థలేశ్వరభువనము అహంకారతత్త్వమందును బ్రాహ్మ్యభువనము మొదలు ఎనిమిదిభువనములునుబుద్ధితత్త్వమందును సుస్థలేశ్వరభువనము మనస్తత్త్వమందును శంఖకర్ణభువనము శ్రోత్రాదిజ్ఞానేంద్రియతత్త్వ పంచకమందును కాలాంజనభువనము వాగాదికర్మేంద్రియతత్త్వపంచకమందును మండలేశ్వరభువనము మొదలు సకలాండభువనమునఱకుఁగల నాలుగుభువనములును శబ్దాదితన్మాత్రతత్త్వపంచకమందును స్థాణుభువనము మొదలు వస్త్రాపదభువనమునఱకుఁగల యెనిమిదిభువనములును ఆకాశతత్త్వమందును భీమేశ్వరభువనము మొదలు గయాభువనమునఱకుఁగలయెనిమిదిభు

వనములును వాయుతత్త్వమందును భైరవభువనము మొదలు హరిశ్చంద్రభువనమువఱకుఁగల యెనిమిదిభువనములును అగ్నితత్త్వమందును అపశీశ్వరభువనము మొదలు అమరేశ్వరభువనమువఱకుఁగల యెనిమిది భువనములును జలతత్త్వమందును ఉండును.

విద్యాకలయందు అఘోరహృదయాయనమః శిఖాయై వౌషట్ అనెడు రెండు మంత్రములును ధ్యానహారపదము మొదలు వ్యాపిణీ వ్యాపినీపదమువఱకుఁగల యిరువది పదములును ఘం అనువర్ణము మొదలు ఞం అనువర్ణమువఱకుఁగల యేడువర్ణములును మాయాతత్త్వము మొదలు పురుషతత్త్వమువఱకుఁగల యేడుతత్త్వములును అంగుష్ఠమాత్రార్క్యభువనము మొదలు భీమభువనమువఱకుఁగలయిరువదియెనిమిదిభువనములును చేరినవి. యీభువనములలో అంగుష్ఠమాత్రార్క్యభువనము మొదలు మహాద్యుతిభువనమువఱకుఁగల యెనిమిదిభువనములును మాయాతత్త్వమందును శిఖేద ఏకవీర అనెడు రెండుభువనములును కాలతత్త్వమందును క్రోధీశ భువనము మొదలు పంచాంతకభువనమువఱకుఁగల నాలుగుభువనములును నియతితత్త్వమందును సంవర్తజ్యోతిష అనెడు రెండుభువనములును కలాతత్త్వమందును మహాక్రోధమహాచండభువనములు రెండును విద్యాతత్త్వమందును ఏకశివభువనము మొదలు ప్రచండభువనమువఱకుఁగల ఐదుభువనములును రాగతత్త్వమందును ఏకపాదభువనము మొదలు భీమభువనమువఱకుఁగల అయిదుభువనములును పురుషతత్త్వమందును ఉండును.

శాంతికలయందు తత్పురుషవక్త్రాయనమః కవచాయహుం అనెడు రెండుమంత్రములును వ్యోమవ్యాపినీపదము మొదలు ధ్యానహారపదమువఱకుఁగల పంద్రెండుపదములును కం ఖం గం అనెడు మూఁడువర్ణములును సదాశివ ఈశ్వరశుద్ధవిద్య అనెడు మూఁడుతత్త్వములును అనంతభువనము మొదలు మనోన్మనీభువనమువఱకుఁగల పదియేడుభువనములును చేరినవి. ఈభువనములలో అనంతభువనము మొదలు ఏకనేత్రభువనమువఱకుఁగల నాలుగుభువనములును సదాశివతత్త్వమందును ఏకరుద్రభువనము మొదలు శిఖండిభువనమువఱకుఁగల నాలుగుభువనములును ఈశ్వరతత్త్వమందును వామభువనము మొదలు మనోన్మనీభువనమువఱకుఁగల తొమ్మిదిభువనములును శుద్ధవిద్యాతత్త్వమందును ఉండును.

శాంత్యతీతకలయందు ఓంశివాయ నమః ఈశానమూర్ధ్నే నమః అస్త్రాయ ఫట్ అనుమంత్రములు మూఁడును ఆద్యోంకారపదమును అం అనువర్ణము మొదలు అః అనువర్ణమువఱకుఁగల పదియాఱువర్ణములును శివశక్తి అనెడు రెండుతత్త్వములును అనాశ్రితభువనము మొదలు నివృత్తిభువనమువఱకుఁగల పదిహేనుభువనములును చేరినవి. ఈభువనములలో అనాశ్రితభువనము మొదలు ఇందిరాభువనమువఱకుఁగల పదిభువనము

లును శివతత్త్వమందును శాంత్యతీతభువనము మొదలు నివృత్తిభువనమువఱకుఁగల అయి దుభువనములును శక్తితత్త్వమందును ఉండును.

ఓం శివాయ నమః మొదలగుమంత్రములు పదునొకండును ఆద్యోంకారపదము మొదలు ఎనుబదియొకపదములును అకారము మొదలు ఏఁబదియొక్క వర్ణములును శివ తత్త్వము మొదలు ముప్పదియాఱుతత్త్వములును అనాశ్రితభువనము మొదలు ఇన్నూట యిరువదినాలుగుభువనములును నివృత్తికళ మొదలు ఐదుకళలునుగల వి షడధ్వములని శైవ శాక్తాగమములయందును పాంచరాత్రమందును తమతమ మతానుసారముగ పూర్వా చార్యులచేత చెప్పఁబడినవి వీనిలో నివృత్తిప్రతిష్ఠాకళలు రెండును శుద్ధాధ్వమనియును విద్యాకళ మిశ్రాధ్వమనియును శాంతిశాంత్యతీకళలు రెండును శుద్ధాధ్వమనియును చెప్పనొప్పును ఈపంచకళలే పరమేశ్వరునిపంచముఖములును పంచకృత్యములును పంచ శక్తులును పంచకర్తలును పంచభూతములును పంచాక్షరములును ప్రాణనమందలి అకా రము ఉకారము మకారము అర్ధమాత్ర అవర్ణము అనెడు పంచవర్ణములును తారకము దండము కుండలము అర్ధచంద్రకము బిందువు అనెడు పంచస్థానములును అగును.

ఈషడధ్వములకు అతీతమైన పరమ శివస్వరూపమే స్వజాతీయవిజాతీయస్వగత భేదశూన్యాద్వితీయనిర్గుణపరబ్రహ్మ మనియును అట్టిపరబ్రహ్మమందు ముత్తెపుచిప్ప వెండి యని భ్రమముతోఁచినట్లు త్రివిధజగత్తులును తోఁచుచున్నవనియును గ్రహింప వలయును. ఈషడధ్వవిచారణ కామికము యోగజము చింత్యము కారణము అజితము దీప్తము సూక్ష్మము జగతి అంశుమానము సుప్రభేదకము విజయము విశ్వాసము స్వాయంభువము అనలము వీరము రౌరవము మకుటము విమలము చంద్రజ్ఞానము బింబము ప్రోద్గీతము లలితము సంతానకము స్వారోత్తమము పారమేశ్వరము కిరణము భేదము వాతూలము అనెడి యిరువదియెనిమిది ఆగమములయందును ఆగమాంతములయిన చర్యా క్రియాయోగజ్ఞానపాదములయందును చెప్పఁబడియున్నది. ఈఆగమములు పరమేశ్వరుని పంచముఖములలో సద్యోజాత వామదేవ అఘోర తత్పురుషముఖములు నాలిగింటియం దును ఇరువదియును ఈశానముఖమందు ఎనిమిదియును బ్రహ్మచతుర్ముఖములవలన నాలుగువేదములును ఉద్భవిల్లినట్లు అపరిమితసంఖ్యలుగలవై కలిగెను. ఇందుకు ॥శ్లో. లక్షంతు చతురో వేదా ద్విలక్షం సూపశాస్త్రకమ్ । షోడశం మాలినీశాస్త్రం ద్వాత్రిం శం భరతముచ్యతే॥ అర్బుదం శిల్పశాస్త్రంతు ఆగమంతు చతుర్దశ । ఆయుర్వేదం త్రిల క్షంచ చాతుర్లక్షంచ జ్యోతిషమ్॥ అనుప్రమాణముచేత ఆగమసంఖ్య తెలియఁదగి నది. పాంచరాత్రశాక్తాది సకలసమయతంత్రములకును ఈశైవాగమములే కారణములు అగుటవలన ఇవి యిచట వ్రాయఁబడినవి. మఱియు సర్వసమయమంత్రములును సప్త

కోటిభేదములుగలవై యుండఁగా మంత్రార్ధ్వమందు పదునొకండుమంత్రములుమాత్రము చెప్పుటకు హేతు వేమనిన పరమశివుని పంచముఖములయందే సకలాగమమంత్రములును పుట్టుటచేత సద్యోజాతాది పంచమంత్రములును ఆమంత్రములకు ముఖ్యములైన షడంగ దేవతామంత్రములును చేరి పదునొకండు మంత్రములని చెప్పఁబడెను.

మఱియు ‹‹శ్లో. మకారం మననం చైవ త్రకారం త్రాణముచ్యతే। మననత్రాణ మిత్యాహుర్మంత్రమిత్యభిధీయతే›› అనున్యాయముచేత పరబ్రహ్మము మననమునకును రక్షణమునకును విలక్షణమగుటవలన మంత్రార్ధ్వాతీతమును సర్వదేశవ్యాపకత్వము గలుగుటవలన పదార్ధ్వాతీతమును అవర్ణమగుటవలన వర్ణార్ధ్వాతీతమును సర్వతత్త్వవిలక్షణమగుటవలన తత్త్వార్ధ్వాతీతమును సర్వస్వామి యగుటవలన భువనార్ధ్వాతీతమును నిష్కళమగుటవలన కళార్ధ్వాతీతమును అగును.

అవ:—పరబ్రహ్మమందు కల్పితములైన జగజ్జీవేశ్వరులయుగపత్సృష్టిని క్రమసృష్టిని చెప్పఁబూని రెండువిధములైన యుగపత్సృష్టియందు ఒకవిధమైన యీసృష్టిని చెప్పుచున్నాఁడు.

మ. అది యేలీల యనన్ సుషుప్తిగతి నవ్యక్తం బభావంబ యై
మొదలం గల్గు ననాదిజీవచయ మామూలప్రధానంబునం
దొదుఁగున్ దానికిఁ గాలతత్త్వమను పేరూహింప లోమోము నె
మ్మది వీడం గలిగెన్ గుణత్రయము సామాన్యంబుగాఁ బుత్త్రకా.

టీ. పుత్త్రకా=కుమారా, అది = ఆ పరమాత్మయందుతోఁచిన జీవేశ్వర జగద్భ్రాంతి, ఏలీలయనన్=ఏప్రకారము కలిగెననఁగా, సుషుప్తిగతిన్=గాఢనిద్రవలె, అవ్యక్తంబు=మూలప్రకృతి, అభావంబయై = ఏవియును లేనిదియై, మొదలన్=తొలుత, కల్గున్=కలిగియుండును, అనాదిజీవచయము, అనాది=ప్రపంచసృష్టికి పూర్వమున నున్నట్టి, జీవ=స్థావరజంగమప్రాణులయొక్క, చయము = సమూహము, ఆమూలప్రధానంబునందున్=ఆయవ్యక్తమందు, ఒదుఁగున్ = అణఁగియుండును, ఊహింపన్=యోజింపఁగా, దానికిన్=ఆప్రకృతికి, కాలతత్త్వమనుపేరు = కాలతత్త్వమనెడునామము, కల్గున్=కలిగియుండును, లోమోమునెమ్మదిన్=అంతర్ముఖమై పరబ్రహ్మమందు హాయిగా నుండుటను, వీడన్=విడలఁగానే, గుణత్రయము=సత్త్వరజస్తమోగుణములు, సామాన్యంబుగాన్=తమతమస్వభావవృత్తులతోడ,కలిగెన్=ఆ అవ్యక్తమందుజనించెను.

తా. నిత్యమును నిర్గుణమును నిరుపాధికమును అయినపరబ్రహ్మమందు జీవేశ్వర జగద్భ్రమము తోఁచినవిధము ఎట్లనఁగా తానైన పరమాత్మను తన్నుఁగా తెలియఁబఱ

చుటకు తనకు అభిముఖముగా తనయందు కలిగినతెలివియే జీవేశ్వరజగత్తులు కనఁబడక యుండ ఆచరించునిద్రవలెనే పరబ్రహ్మమగు తన్ను మఱుఁగుపడఁజేయ అవ్యక్తతత్త్వమయ్యెను. మఱినపుఉండయందు బంగారపుపొడి యిమిడియున్నతీరునను చిగుళ్లు ఆకులు మొగ్గలు పువ్వులు మొదలగునవి కాలమందు అణఁగియున్నపోలికను ఉత్పత్తిలేని జీవసంఘము ఆ అవ్యక్తమందు లీనమై ఉండుటవలన ఆ అవ్యక్తము కాలతత్త్వమను పేరుగలదగును. అది అంతర్ముఖస్వరూపమైన స్వస్వరూపజ్ఞానమును ఎడఁబాసి బహిర్ముఖమగుటవలన దానియందు సత్త్వరజస్తమోగుణములు సర్వప్రపంచనిర్మాణకారణములై ఉదయించె నని తాత్పర్యము.

అవతారిక:—మఱియొకవిధమైన యుగపత్సృష్టిక్రమమును చెప్పుచున్నారు.

మ. ఒకమార్గం బిది వేఱొకండు గల దీవూహింపు మవ్యక్తనా
మకతత్త్వంబె మహత్తనం బరఁగె సమ్యగ్బృంహమై యందుస
ర్వకలాప్రజ్ఞ జనించె గర్వ మతిదుర్వారంబుగా దాన మా
నక చెన్నొందెగుణత్రయంబనుచు నామ్నాయంబువాక్రుచ్చెమున్.

టీ. సర్వకలాప్రజ్ఞ, సర్వ=సమస్తములైన, కలా=చతుష్షష్టి విద్యలయందును, లేక ప్రణవమందలి జాగ్రజ్జాగ్రత్త మొదలగు పదియాఱుకలలయందును, ప్రజ్ఞ=వివేకము గలశిష్యుఁడా, ఇది=ఇప్పుడు చెప్పినది, ఒకమార్గంబు=ఒకవిధము, వేఱొకండు=మఱియొకవిధము, కలదు=ఉన్నది, ఈవు=నీవు, ఊహింపుము=తెలిసికొనుము, అవ్యక్తనామకతత్త్వంబె=ముందటి అవ్యక్తమను మూలప్రకృతియే, సమ్యగ్బృంహమై=లెస్సగా బలిసినదై, మహత్తనన్=మహత్తత్త్వమను పేరుచేత, పరఁగెన్=ప్రసిద్ధికెక్కెను. అందున్=ఆమహత్తత్త్వమందు, అతిదుర్వారంబుగాన్=మిక్కిలి నిరాటంకముగా, గర్వంబు=అహంకారము, జనించెన్=పుట్టెను. దానన్=ఆయహంకారతత్త్వమువలన, మానక=విడువక, గుణత్రయంబు=సత్త్వరజస్తమోగుణములు మూఁడును, చెన్నొందెన్=ప్రకాశించెను. అనుచున్=అని, ఆమ్నాయంబు=వేదము, మున్=పూర్వమే, వాక్రుచ్చెన్=పలికెను.

తా. ఓయి శిష్యుఁడా రెండువిధములైన యుగపత్సృష్టియందు ఒక్కవిధము చెప్పితిని. రెండవవిధమును చెప్పెదను వినుము. అవ్యక్తమను పేరుగల మూలప్రకృతి మట్టిలోఁబడిన విత్తనము చెమ్మచేత నాని గట్టిగానుండుటమాని ఉబ్బినతీరున జీవాదృష్టసాహాయ్యముచేత మహత్తత్త్వమను పేరుగల దాయెను. విత్తనమునుండి మొలక పైకివచ్చినట్లు ఆమహత్తత్త్వమువలన అహంకారతత్త్వము కలిగెను. ఆయహంకారతత్త్వమువలన సత్త్వరజస్తమోగుణములు కలిగెను అని తాత్పర్యము.

సూర్యుని తెలుపుటకు సూర్యునియందలి ప్రకాశము బహిర్ముఖమై సూర్యునకు ఎదురుతిరిగి సూర్యుని మాపక నదులు సముద్రములు లోనగువానిని చూపించునట్లు శుద్ధచైతన్యమైనతన్ను తెలుపుటకు తనయందేపుట్టి తనతట్టుగానే తిరిగి తన్ను మాపని తనతెలివియందు కలిగినమఱపే అవ్యక్తమని ఆసూర్యప్రకాశము పర్వతవృక్షాదులను మాపుటకు పరాఙ్ముఖమును సూర్యుని మాపుటకు అభిముఖమును అయినట్లు ఆతెలివి జగద్వ్యాపారరూపముగ బహిర్ముఖమును తన్ను తెలిసికొనుటకు అంతర్ముఖమును అయినయెడ మే మహత్తత్త్వ మని ఆసూర్యకిరణములవలన కలిగినయెండమావులయందును జలమందును ఆసూర్యుఁడు ప్రతిఫలించినవిధమున ఆమహత్తత్త్వమగు అంతఃకరణమందు తాను జీవుఁడ ననుకొనుటే అహంకారమని ఆసూర్యప్రతిబింబము నిలుకడగ నుండినట్లు జీవభ్రాంతిరైన అహంకారతత్త్వము నిలుకడగ నుండుటే సత్త్వగుణమని ఆసూర్యప్రతిబింబము కదలుట ఊగులాడుట మొదలుగుచలనములను పొందినట్లు కామక్రోధలోభాదివృత్తులయందు చరించుటే రజోగుణమని ఆసూర్యుఁడు తనస్వరూపజ్ఞానమును మఱచి ప్రతిబింబచలనాదులే తనవి యని భ్రమసి ఆభ్రమయందు మునిఁగియుండుట కదలని అజ్ఞానులచేత వాడుకొనఁబడినట్లు విషయవికారములయందు మునిఁగి యిహపరముల నెఱుఁగక యుండుటే తమోగుణ మని అనుభవమందు తెలియనగును.

ఈపద్యమున జనించె గర్వ మతిదుర్వారంబుగా నని ప్రయోగింప కారణ మేమనిన సంస్కృత ప్రాకృతవైకృతహూణద్రవిడకర్నాటమహారాష్ట్రసౌరాష్ట్ర మహమ్మదీయాది సకలభాషలను యచ్ఛబ్దతచ్ఛబ్దైతచ్ఛబ్దయుష్మచ్ఛబ్దాస్మచ్ఛబ్దాత్మశ్శబ్దములనెడి ఆఱుశబ్దములలో అణఁగియున్నవి. వీనిలో యచ్ఛబ్దతచ్ఛబ్ద ఏతచ్ఛబ్దార్థములు యుష్మచ్ఛబ్దార్థమందును అస్మచ్ఛబ్దఆత్మన్శబ్దార్థములు రెంటిలో అస్మచ్ఛబ్దము ఆత్మన్శబ్దార్థమందును అణఁగియున్నవి. కనుక పదార్థములు రెండును శబ్దములు ఆఱును అగును. శ్రీమచ్ఛంకరభగవత్పాదకృతమహాభాష్యమందలి అధ్యాసప్రకరణమున సకలశబ్దములను అణఁచి "యుష్మదస్మత్ప్రత్యయగోచరయోర్విషయవిషయిణోస్తమఃప్రకాశవద్విరుద్ధస్వభావయోః" యని ఉదాహరించిరి. తా నెఱుఁగకమునుపు ఎవఁడో ఏదో తా నెఱిఁగినవెనుక వాఁడు అది తనచేరువకు వచ్చినప్పుడు ఇతఁడు ఇది యెదురుగా వచ్చినప్పుడు నీవు అగుచున్నది. కుండలోనీళ్లే కుండవెలుపలి చెమ్మ ఐనట్లు తానను ఆత్మశబ్దార్థము వ్యావహారికదశయందు బహిర్గతమై నేనను అస్మచ్ఛబ్దార్థమగుచున్నది. ఈశబ్దార్థములు రెంటిలో దృగ్దృశ్యసంజ్ఞలుగల అస్మద్యుష్మచ్ఛబ్దార్థములైన నేను నీవు అనురెంటిలో దీపముచేత చూపఁబడుపదార్థములు దీపమును తెలిసికోలేనితీరున నాచేత మాపఁబడిన నీవనునది నన్ను తెలిసికోఁజాలక వ్యర్థమగును. అస్మచ్ఛబ్దార్థమగు తానునది యచ్ఛబ్దాదిసర్వజడ

శబ్దార్థములయందు ప్రవేశించి సర్వజ్ఞత్వ సర్వేశ్వరత్వ సర్వాంతర్యామిత్వ స్వస్వ తంత్రత్వసర్వస్రష్టృత్వ సర్వభోక్తృత్వ సర్వసంహారకత్వ సర్వపాలకత్వ సర్వవ్యాప కత్వ సర్వశక్తిమత్త్వములు కల్గి నిరాటంకముగ సర్వవ్యవహారముల చేయుచు తాను తానుగానే ఉండును గనుక జనించెగర్వ మతిదుర్వారంబుగా నని ప్రయోగింపఁబడెను.

అవతారిక:—మీఁదఁ జెప్పినగుణత్రయమందు కలిగిన జగజ్జీవేశ్వరుల క్రమసృష్టిని చెప్పఁదొడఁగి ముందుగా పరుఁడైన యీశ్వరుని ఉత్పత్తిని వక్కాణించుచున్నారు.

చ. నిరవయవాత్మదీప్తి కధి నింగి తెలుంగునఁ దద్గుణంబులన్
సరవిగఁ దోఁచు నం దమలసత్త్వమె మాయ యనంగ నొప్పు నీ
శ్వరుఁ డన నందుఁ దత్ప్రతిభ వర్తిలుఁ గూడినఁ దద్గుణంబులన్
వరుస నిమిత్తహేతు వనివర్తనమైనఁ దదీయ ఛాయయౌన్. ౬౮

టీ. నిరవయవాత్మదీప్తి, నిరవయవాత్మ = అంగ ప్రత్యంగసాంగోపాంగములతో కూడినశరీరములేని పరబ్రహ్మముయొక్క, దీప్తి = ప్రతిబింబము, అనఁగా పరమాత్మ అంగచతుష్టయసహితశరీరము లేనిదనుట. శిరస్సు కడుపు చేతులు అంగములు వ్రేళ్లు పెదవులు ముక్కులు ప్రత్యంగములు. చెవులు కన్నులు సాంగములు. వస్త్రభూషణపుష్పచందనములు ఉపాంగములు. కధిన్ = సముద్రమందు, నింగితెలుంగునన్=ఆకాశము ప్రతిబింబించినట్లు, తద్గుణంబులన్=మూలప్రకృతియొక్క ఆసత్త్వరజస్తమోగుణములయందు, సరవిగన్=లెస్సగా, తోఁచున్ = కనఁబడును. అందున్=ఆత్రిగుణములయందు, అమలసత్త్వము, అమల=నిర్మలమైన, సత్త్వము=సత్త్వగుణము, మాయ యనంగన్= బ్రహ్మచ్ఛాయను తనయందు ప్రతిఫలింపఁ జేసికొనుటచేత మాయ యనుపేరుగలదై, ఒప్పున్=రాణించును. అనఁగా తెల్లనిరంగును ఉత్తమమును అయిన సత్త్వగుణము మాయ యనుపేరు గలదనుట. అందున్=ఆమాయయందు, తత్ప్రతిభ, తత్=ఆయనయప కూన్యమైన పరబ్రహ్మముయొక్క, ప్రతిభ=నీడ, కూడినన్=కలియఁగానే, ఈశ్వరుఁ డనన్=ఈశ్వరుఁ డనునామముచేత, వర్తిలున్=తేజరిల్లును, అనఁగా మాయాప్రతిబింబ చైతన్యమే యీశ్వరుఁ డనుట, తద్గుణంబులన్=ఆమూఁడుగుణములయందును, వరుసన్ =క్రమముగా, తదీయఛాయ=ఆపరబ్రహ్మముయొక్క ప్రతిబింబము, అనివర్తనమైనన్ =తోఁచకపోయెనేని, నిమిత్తహేతువు=ముఖ్యకారణము, ఔన్=అగును.

తా. కోనేళ్లు ఏళ్లు చెఱువులు బావులు మొదలగువానియందు ఉత్పత్తిస్థితిలయములు లేని ఆకాశము ప్రతిబింబించునట్లు మొదట పరబ్రహ్మమందు లేకయేఉన్నట్లుగ తోఁచుచున్న మలినసత్త్వస్వరూపయగు మూలప్రకృతియొక్క సత్త్వరజస్తమములనెడు

మూఁడుగుణములయందు పరమాత్మ ప్రతిబింబించుచుండును. అందు తెలుఁపువన్నెయును ఉత్తమమును శాంతవృత్తియును కలసత్త్వగుణము మాయయనుపేరుచేత తేజరిల్లును. దానియందు ప్రతిబింబించిన నిత్యనిర్గుణనిర్వికార పరబ్రహ్మచ్ఛాయ యీశ్వరుఁడను నామధేయము కలిగి వెలుఁగును. ఏగుణములయందును ప్రతిబింబింపనివేళ పరమాత్ముఁడు నిమిత్తకారణ స్వరూపుఁడై ఉండునని తాత్పర్యము.

అవ:—ఆయీశ్వరునికారణశరీరోత్పత్తివిధమును జీవసమూహోత్పత్తివిధమును చెప్పుచున్నారు.

మ. గురుహేత్వంగమును సుప్తిమోదమయసత్కోశంబునామాయయౌఁ
గర మవ్యాకృతుఁ డంతరాత్మ యనునాఖ్యల్దాన భాసిల్లుఁ ద
త్పరుఁ డౌ నీశున కారజోగుణ మవిద్యానామమౌ దాన వి
స్ఫురితప్రాణిసమూహ మయ్యె విలసద్భూమాత్మచిచ్ఛాయచేన్.

టీ. తత్పరుఁడు=ఆమాయయందు తోఁచియును దానియందే ఆసక్తిగలవాఁడు, ఔనీశునకున్=అయినయీశ్వరునకు, ఆమాయ=సత్త్వగుణస్వరూపమయిన ఆమాయయే, గురుహేత్వంగమును-గురు=శ్రేష్ఠమైన, హేత్వంగమును=కారణశరీరమును, సుప్తి=దానియందుఁగల నిద్రావస్థయును, మోద...బును-మోదమయ = ఆనందరూపమైన, సత్=ప్రశస్తమైన, కోశంబు=కోశమును, ఔన్=అగును. కరము=మిక్కిలి, అవ్యాకృతుఁడు=అవ్యాకృతుఁడు, అంతరాత్మ=అంతర్యామి, అనునాఖ్యలు=అనెడుపేళ్లు, దానన్=ఆనిద్రావస్థయందు అభిమానముగల యీశ్వరునకు, భాసిల్లున్ = ప్రకాశించును. ఆరజోగుణము=ప్రకృతియందు పుట్టిన ఆరజోగుణము, అవిద్యానామము=అవిద్యయనుపేరుగలది, ఔన్=అగును. దానన్ = ఆయవిద్యయందు, విలసద్భూమాత్మచిచ్ఛాయచేన్-విలసత్=మనోహరమైన, భూమ=నిరతిశయమైన, ఆత్మ=పరబ్రహ్మముయొక్క, చిచ్ఛాయచేన్=జ్ఞానప్రకాశముచేత, విస్ఫు...హము-విస్ఫురిత=లెస్సగా తోఁచఁబడిన, ప్రాణి=జంతువులయొక్క, సమూహము=సముదాయము, అయ్యెన్=కలిగెను.

తా. ఓయిశిష్యుఁడా మాయయందు కల్పింపఁబడిన యీశ్వరునకు ఆమాయయే కారణదేహమును నిద్రావస్థయును ఆనందమయకోశమును అగును. ఆకారణదేహమందు అభిమానముగల యీశ్వరునకు అవ్యాకృతుఁడు అంతర్యామి అనుపేళ్లు గలిగియుండును. ఎఱుపువన్నమును నడిమిరకమును ఘోరవృత్తియునుగల రజోగుణము అవిద్యయను పేరుగలదగును. దరియందలి సముద్రజలమే అలలు బుగ్గలు నురుగులు తుంపురులు అయినవిధమున అవిద్య నానావికారములు గలదగును. అట్టి అవిద్యయందు ప్రతిబింబించిన బ్రహ్మ

చ్ఛాయవలన బహుప్రకారములైన వికారములుగల జీవసముదాయములు పుట్టెనని తాత్పర్యము.

అవ:—జీవకారణశరీరోత్పత్తియును ఆకారణశరీరమును పొందిన జీవునకు కలిగిన అభిమాననామములను చెప్పి తమోగుణకల్పనము చెప్ప నుపక్రమించుచున్నారు.

చ. ఉడుక యవిద్యయం దదియ ♦ యూరట నొందెడు ప్రాణి కీశ్వరుం
బడిగొనుమాయజోక నగు ♦ బ్రాజ్ఞుడు నాఁ బరమార్థకుండు న
త్తఱి నభిమాననామములు ♦ తద్దయు సత్త్వరజోగుణంబు లీ
తెఱఁగున నయ్యె నింక విను ♦ తేటగఁ బుత్ర తమోవికారమున్.

టీ. పుత్ర=కుమారా, అవిద్యయందున్=రజోగుణరూపమైన అవిద్యోపాధియందు, ఉడుక=విడువక, ఊరటన్=విశ్రాంతిని, ఒందెడుప్రాణికిన్, ఒందెడు=పొందెడి, అనఁగా నివసించెడు, ప్రాణికిన్=జీవునకు, ఈశ్వరున్=అంతర్యామిని, పడిగొనుమాయజోకన్=ఆవరించునట్టి మాయవలెనే, అదియ=ఆయవిద్యయే, అగున్=అవును. అనఁగా మాయ యీశ్వరునకు కారణశరీరమును సుషుప్త్యవస్థయును ఆనందమయకోశమును ఐనవిధమున జీవునకును రజోగుణస్వరూపమైన అవిద్యయే కారణశరీరమును సుషుప్త్యవస్థయును ఆనందమయకోశమును అవుననుట. అత్తఱిన్=జీవుఁడు సుషుప్త్యవస్థనుపొందియుండెడిసమయమందు, ప్రాణికిన్=జీవునకు, పరమార్థకుండు=పరమార్థకుఁడును, ప్రాజ్ఞుఁడును=ప్రాజ్ఞుఁడును, నాన్=అనుపట్లుగాను, అభిమాననామములు=కారణదేహమందు అభిమానముతో కూడి యున్నందున కలిగిన పేళ్లు, అగున్=అవును. తద్దయున్=మిక్కిలి, సత్త్వరజోగుణంబులు-సత్త్వ=మాయారూపమైన సత్త్వగుణమును, రజోగుణంబులు=అవిద్యారూపమైన రజోగుణమును, ఈతెఱఁగునన్=ఈతీరున, అయ్యెన్=ఆయెను. ఇంకన్=ఇఁకమీఁద, తమోవికారమున్=తమోగుణముయొక్క కల్పనను, తేటగన్=వివరముగ, వినుము=ఆలింపుము.

తా. ఓయిశిష్యుఁడా సత్త్వగుణమందు ప్రతిబింబించిన బ్రహ్మచ్ఛాయయే యీశ్వరుఁ డనియును ఆయీశ్వరుని ప్రతిబింబింపఁజేసికొనిన ఆసత్త్వగుణమే మాయ అనియును ఆమాయయే ఆయీశ్వరునకు కారణశరీరమును సుషుప్త్యవస్థయును ఆనందమయకోశమును అయినతీరున రజోగుణరూపమైన అవిద్యయందు ప్రతిబింబించిన బ్రహ్మచ్ఛాయ బహువిధములయిన అవిద్యావికారములచేత భిన్నభిన్నములై అనేకజీవసంఘమయ్యెను. ఆజీవులకు ఆ అవిద్యయే కారణశరీరములును సుషుప్త్యవస్థలును ఆనందమయకోశములును అయ్యెను. ఆకారణశరీరమందు అభిమానముగల జీవునకు ప్రాజ్ఞుఁడు పరమార్థకుఁడు అను నామములు గలిగెను. ఇదివఱకు చెప్పినది సాత్త్వికరాజస గుణ

భూతకార్యములు. ఇఁకమీఁద తామసగుణభూతకార్యములను వక్కాణించెదను. అక్కఱ గలిగి చక్కఁగ వినుమని తాత్పర్యము.

అవ:—జీవేశ్వరుల సూక్ష్మ శరీరోత్పత్తిక్రమమును చెప్పుచున్నారు.

శా. మాయాలాస్యవినోది యై వెలయునాత్మస్వామి వీక్షించినన్
గాయిశ్రేణికి భోగసాధనములన్ గల్పింపఁ గాలాంబుద
ప్రాయం బైన తమంబుఁ బ్రావరణమై భాసిల్లె విక్షేపమై
చేయం దత్ప్రతిభాన మావరణ మశ్రేయస్కరం బం దగున్. ౬౨

టీ. మాయాలాస్యవినోదియై, మాయా=త్రిగుణాత్మిక యైన మూలప్రకృతియను స్త్రీయొక్క, లాస్య=నృత్యమందు, అనఁగా సత్యమైన పరబ్రహ్మమును, నామరూపములుగల, అసత్ప్రపంచజగత్తుగాను, అసత్యమగు జగత్తును సత్యమగు పరబ్రహ్మముగాను, తోఁపఁజేయుట యనెడు నృత్యమందు, వినోదియై=ఉల్లాసముగలవాఁడై, వెలయునాత్మస్వామి, వెలయు=ప్రకాశించుచుండెడు, ఆత్మస్వామి = బ్రహ్మవిష్ణు రుద్రాదిసమస్తజీవులకును ప్రభువగు పరబ్రహ్మము, కాయిశ్రేణికిన్=కారణదేహములతో నున్న జీవేశ్వరాది సకలచేతన సమూహములకును, భోగసాధనములన్, భోగ=సుఖదుఃఖాదుల అనుభవములకు తగిన జాగ్రదవస్థలతో కూడిన స్థూలదేహములను, సాధనములన్=ఆ స్థూలదేహములకు కారణభూతములైన స్వప్నావస్థలతోఁగూడిన సూక్ష్మదేహములను, కల్పింపన్=నిర్మించుటకు, కాలాంబుదప్రాయంబైన=నల్లమబ్బుతో సాటియైన, తమంబున్=తమోగుణమును, వీక్షించినన్=చూడఁగానే, ప్రావరణమై=ఆవరణశక్తియై, భాసిల్లెన్=ప్రకాశించెను. తత్ప్రతిభానము=ఆ ఆవరణరూపమైన తమోగుణమందు ప్రతిబింబించిన పరమాత్మప్రకాశము, విక్షేపమై=విక్షేపశక్తియై, చేయన్=జగన్నిర్మాణమును చేయుటకు, భాసిల్లెన్=ప్రకాశించెను. అందున్=ఆయావరణవిక్షేపశక్తులయందు, ఆవరణము=ఆవరణశక్తి, అశ్రేయస్కరంబు=మోక్షధర్మములను చెఱచునది, అగున్=అవును.

తా. బూటకములకు మూటయైన మాయయనెడి ఆటకత్తెయొక్క నటనమును మాచుటను వేడుకగల పరబ్రహ్మము ఆకాశము తేటయైన జలము అద్దము మొదలగువానియందు ప్రతిబింబించినట్లు చేతనాచేతన ప్రాణిసమూహమునకు తగిన స్థూల సూక్ష్మశరీరములను కలిగించుటకు తమోగుణమును వీక్షింపఁగానే అది ఆవరణశక్తి అయ్యెను. ఆ ఆవరణమందు ప్రతిబింబించిన బ్రహ్మచ్ఛాయయే విక్షేపశక్తి అయ్యెను. ఆ ఆవరణ విక్షేపశక్తులలో ఆవరణశక్తి మిక్కిలి చెడ్డదని తాత్పర్యము.

అవతారిక:—విక్షేపశక్తివలన కలిగినసూక్ష్మాతిసూక్ష్మపంచభూతములు ప్రబలి అతి సూక్ష్మభూతములును స్థూలభూతములును అయిన విధములను చెప్పుదున్నారు.

శా. అవిశ్లేషమునందు నాకసము నయ్యాకాశమం దాశుగం
బావాతంబున వీతిహోత్రమును నయ్యగ్నిం గనం బుష్కరం
బావారిన్ ధరయున్ జనించె నివి యల్పానల్పరూపంబులన్
జీవేశాదుల కెల్ల భోగతతులన్ జేయ న్నిదానంబులౌ. ౬౮

టీ. అవిశ్లేషమునందున్=అవిశ్లేషశక్తియందు, ఆకసమును=శబ్దగుణముగల ఆకాశమును, అయ్యాకాశమందున్=ఆ ఆకాశమందు, ఆశుగంబును = స్పర్శగుణముగలగాలియును, ఆవాతంబునన్=ఆగాలియందు, వీతిహోత్రమును=రూపతన్మాత్రముగల అగ్నియును, అయ్యగ్నిన్=ఆ అగ్నియందు, కనన్=విచారింపఁగా, పుష్కరంబును=రసతన్మాత్రముగల జలమును, ఆవారిన్=ఆజలమునందు, ధరయున్=గంధతన్మాత్రముగల భూమియును, జనించెన్=పుట్టెను. ఇవి = ఈపంచభూతములును, అల్పానల్పరూపంబులన్, అల్ప=చిన్నవియైన, అనల్ప=పెద్దవియైన, రూపంబులన్ = స్వరూపములచేత, జీవేశాదులకెల్లన్, జీవ=అవిద్యోపాధి గతులయిన సమస్త ప్రాణులు, ఈశ=మాయోపాధిగతుఁడయిన యీశ్వరుఁడు, ఆదులకెల్లన్=మొదలగు బ్రహ్మ విష్ణు రుద్ర మహేశ్వర సదాశివాది దేవతల కందఱకును, భోగతతులన్=స్థూలసూక్ష్మదేహములును, చేయన్=నిర్మించుటకు, నిదానంబులౌన్=ముఖ్యకారణము లగును.

తా. తమోగుణమందు ప్రతిబింబించిన, బ్రహ్మచ్ఛాయయే స్వరూపముగాఁగల అవిశ్లేషశక్తివలన శబ్దమే స్వరూపముగాఁగల ఆకాశమును ఆ ఆకాశమువలన రూపరహితమైన స్పర్శమే గుణముగాఁగల వాయువును ఆవాయువువలన రూపమే గుణముగాఁగల అగ్నియును ఆఅగ్నివలన రసమే గుణముగాఁగల జలమును ఆజలమువలన గంధమే గుణముగాఁగల భూమియును జనించెను. ఈపంచభూతములు తొలుత పుట్టినపుడు, పరమాణువుల యంతటివిగా నుండి సూక్ష్మాతిసూక్ష్మపంచభూతములని అవల మూలప్రకృతి త్రిగుణములలో సత్త్వగుణముతో చేరినప్పుడు అణువులయంతటివిగానుండి సత్త్వాతిసూక్ష్మపంచభూతములని, రజోగుణముతో చేరినపుడు సూక్ష్మములైన రజములయంతటివిగా నుండి రజస్సూక్ష్మపంచభూతములని తమోగుణముతో చేరినప్పుడు ఇసుకయంతటివిగా నుండి తమఃస్థూలపంచభూతము లని పంచీకృతములైనపుడు మహాపంచభూతము లని పేళ్లుగలవై వ్యష్టిరూపులయిన సకల జీవులకును సమష్టిస్వరూపుండైన యీశ్వరునకును బ్రహ్మాదిసమస్తదేవతలకును, స్థూల సూక్ష్మ శరీరములను నిర్మించుటకు కారణములగునని తాత్పర్యము. భూతము లనఁగా బహిరింద్రియగ్రాహ్య విశేషగుణవత్త్వము. అనఁగా జ్ఞానేంద్రియ కర్మేంద్రియములచేత గ్రాహ్యములై విశేషగుణములు కలవి యగుటవలన భూతము లనఁబడును.

## జీవేశ్వరజగదుత్పత్తిచక్రము.

ముక్కోణమందలి వర్తులాకృతి పరబ్రహ్మము.




## జీవేశ్వరజగదుత్పత్తిచక్రవిషయము.

మొదట సజాతీయ విజాతీయ స్వగతభేదశూన్యమగు నిర్గుణ పరబ్రహ్మము గలదు. దానియందు చంద్రునియందలి చంద్రికవలె ఎడఁబాటులేక యెల్లప్పుడును కూడియుండి అపరబ్రహ్మమునందు వ్యాపించి పరబ్రహ్మశక్తి ఒక్కటి ప్రకాశించుచుండును. అదే మూలప్రకృతి. మహాత్రిపురసుందరి. ఆమూలప్రకృతి అమలసత్త్వప్రధాన మలినసత్త్వప్రధాన అనెడు రెండురూపములు గలది. వీనిలో అమలసత్త్వ

ప్రధాన బ్రహ్మజ్ఞానమును మలినసత్త్వప్రధాన లోకవ్యవహారజ్ఞానమును కలిగించును. ఈరెంటిలో మలినసత్త్వప్రధాన సత్త్వగుణము రజోగుణము తమోగుణము అనెడు మూఁడుగుణములు గలది.

వీనిలో సత్త్వగుణము తెలుపురంగును, ఉత్తమమును, మాయయను పేరును కలది యగును. దీనియందు ప్రతిఫలించిన బ్రహ్మచ్ఛాయయే యీశ్వరుఁడు. ఆయీశ్వరునకు ఈమాయయే కారణశరీరమును, సుషుప్త్యవస్థయును, ఆనందమయకోశమును అగును. ఈమాయోపాధిని పొందిన యీశ్వరునకు అవ్యాకృతుఁడని అంతర్యామియని పేరు. ఈ యీశ్వరునిరాజసాహంకారమే బ్రహ్మయును, సాత్త్వికాహంకారమే విష్ణువును, తామసాహంకారమే రుద్రుఁడును, త్రిగుణసామ్యమే యీశ్వరుఁడును, శుద్ధసాత్త్వికాహంకారమే సదాశివుఁడును అగును.

రజోగుణము ఎఱ్ఱనిరంగును, మధ్యమమును, అవిద్యయను పేరును కలదగును. దీనియందు ప్రతిఫలించిన పరబ్రహ్మచ్ఛాయ యీ అవిద్యచేత ఖండఖండములై కంసలవాని మైనపు ముండలోని బంగారపుపొడివలె నానావిధజీవులును అగును. ఈజీవులకు ఈ అవిద్యయే కారణశరీరమును, సుషుప్త్యవస్థయును, ఆనందమయకోశమును అగును. ఈ అవిద్యోపాధిగలజీవునకు ప్రాజ్ఞుఁడని పరమార్థుఁడని పేరు.

త్రిగుణములతో వేనియందును పరబ్రహ్మము ప్రతిఫలించనప్పుడు నిమిత్తకారణమగును. ఈజీవేశ్వరులకు భోగసాధనములయిన స్థూలసూక్ష్మశరీరములను కల్పింపఁదలఁచి పరమాత్మ తమోగుణమును వీక్షించెను.

తమోగుణము నల్లనిరంగును అధమమును, ఆవరణశక్తియును అగును. దీనియందు ప్రతిఫలించిన బ్రహ్మచ్ఛాయ విక్షేపశక్తి అగును. ఈవిక్షేపశక్తివలన శబ్దగుణముగల ఆకాశము ఉదయించెను. ఇది పరాశక్తియును, అనుగ్రహకృత్యమును, ఈశానముఖమును, శాంత్యతీతకలయును, యకారమును, గుండ్రనిరూపమును, పసుపురంగును కలది. దీనికి అధిదేవత సదాశివుడు. దీనివలన గలగలశబ్దము అనుష్ణాశీత స్పర్శము అనెడు రెండు గుణములుగల వాయువు ఉదయించెను.

ఈవాయువు ఆదిశక్తియును, తిరోధానకృత్యమును, తత్పురుషముఖమును, శాంతికళయును, వకారమును, షట్కోణాకృతియును, రూపరహిత స్పర్శగుణమును, ఆకుపచ్చరంగును గలది. దీని కధిదేవత యీశ్వరుఁడు. దీనివలన బగబగయను శబ్దము ఉష్ణస్పర్శము ఎఱ్ఱనిరూపము అనెడు మూఁడుగుణములుగల అగ్ని జనించెను.

ఈయగ్ని క్రియాశక్తియును, సంహారకృత్యమును, అఘోరముఖమును, విద్యాకలయును, శికారమును ముమ్మూలరూపును గలది. దీని కధిదేవత రుద్రుఁడు. దీనివలన

బుడబుడశబ్దమును, శీతస్పర్శమును, శ్వేతరూపమును, మధురరసమును అనెడు నాలుగు గుణములుగల జలము పుట్టెను.

ఈజలము, జ్ఞానశక్తియును, స్థితికృత్యమును వామదేవముఖమును ప్రతిష్ఠాకలయును మసృణమును అర్ధచంద్రాకారమును గలది. దీని కధిదేవత విష్ణువు దీనివల్ల కటకటశబ్దమును, కఠినస్పర్శమును, చిత్రరూపమును, ఉప్పు మొదలగురసములును గంధగుణమును అను ఐదుగుణములుగల పృథివి పుట్టెను.

ఈపృథివి ఇచ్ఛాశక్తియును సృష్టికృత్యమును సద్యోజాతముఖమును నివృత్తికళయును నకారమును చతురస్రమైన రూపమును వేఁడి చల్లనకానట్టి స్పర్శమును చిత్రవర్ణమునుగలది. దీని కధిదేవత బ్రహ్మ.

ఈప్రకారముగా కలిగిన పంచభూతములయందును తొలుత చెప్పిన మలిన సత్త్వ ప్రధానయగు మూలప్రకృతియొక్క మూఁడుగుణములతో చేరి సత్త్వసూక్ష్మ రజస్సూక్ష్మ తమస్స్థూలభూతములని మూఁడువిధము లగును. వీనిలో సత్త్వ రజస్సూక్ష్మ పంచభూతములు అపంచీకృతములై సూక్ష్మ శరీరమునకు కారణము లగును. తమస్స్థూలభూతములు పంచీకృతములై స్థూలశరీరమునకు కారణము లగును.

అంతారకా — సూక్ష్మశరీరమునకుఁగల పదియేడుతత్త్వములలో పంచతన్మాత్రభూతములు ప్రకృతి త్రిగుణములతో చేరినవనుక సత్త్వ సమష్టి వ్యష్టి సూక్ష్మభూతముల వలన కలిగిన తత్త్వములను చెప్పుచున్నారు.

శా. ఆతన్మాత్రము లేను నాగుణములం దైక్యంబులౌ నందుఁ ద
చ్ఛ్వేతాయత్తసమష్టిభాగములు ధీచిత్తంబులౌ వ్యష్టిత
ద్భూతంబు ల్పటుధీంద్రియంబు లగు సత్పుత్రా విన్మయీ యేడిలన్
బూతప్రజ్ఞకు సాధనంబు లగుచుం బొల్పొందు సూక్ష్మాకృతిన్.

టీ. సత్పుత్రా = శ్రేష్ఠుఁడైన ఓకుమారుఁడా, ఆతన్మాత్రములేనును = అవిక్షేప శక్తివలనఁ గలిగిన పంచభూతములగుణములైన శబ్ద స్పర్శ రూప రస గంధములైదును, ఆగుణములందున్ = ఆమూలప్రకృతియందలి మలినసత్త్వ ప్రధానమువలనఁ బుట్టిన సత్త్వరజస్తమోగుణములయందు, ఐక్యంబులు = కలసినవి, ఔన్ = అగును. అనఁగా పంచభూతములు సత్త్వగుణముతో చేరినపుడు సత్త్వసూక్ష్మ పంచభూతములని రజోగుణముతో చేరినపుడు రజస్సూక్ష్మ పంచభూతములని తమోగుణముతో చేరినపుడు తామసస్థూల పంచభూతములని మూఁడువిధము లగును. వీనిలో సత్త్వసూక్ష్మభూతములును రజస్సూక్ష్మభూతములును సూక్ష్మ శరీరమునకు కారణము లగుననుట, అందున్ = ఆ సత్త్వరజస్సూక్ష్మభూతములయందు - తచ్ఛ్వే...ములు, తత్ = ఆ, శ్వేత = తెలుపు

రంగుగల సూక్ష్మభూతములను, ఆయత్తి = పొందిన, సమష్టిభాగములు = సమష్టి సంజ్ఞగల భూతములపొల్లు, అనఁగా సత్త్వరజోభూతములు సమష్టి వ్యష్టి భేదముల చేత సత్త్వసమష్టిసూక్ష్మభూతములని సత్త్వవ్యష్టిసూక్ష్మభూతములని రజస్సమష్టి సూక్ష్మభూతములని రజోవ్యష్టిసూక్ష్మభూతము లని నాలుగువిధము లగును. వానిలో సత్త్వసమష్టి సూక్ష్మభూతములు, ధీచిత్తంబులు = బుద్ధియును చిత్తమును, ఔఁ= అగును, అనఁగా సత్త్వ సమష్టి సూక్ష్మభూతము లైదును అంతఃకరణ మగును. దాని లోపలిసంచారము బుద్ధియును వెలుపలిసంచారము మనస్సును అగు ననుట. వ్యష్టితద్భూతంబులు=వ్యష్టియైన ఆసత్త్వ సూక్ష్మభూతములు, పటుధీంద్రియంబులు, పటు=నిపుణములయిన, ధీంద్రియంబులు=జ్ఞానేంద్రియములు, అగుఁ=అగును. అనఁగా శ్రోత్రము త్వక్కు చక్షువు జిహ్వ ఘ్రాణము అనుజ్ఞానేంద్రియములు అగుననుట ఇలఁ = భూమియందు, విన్క = వినుము, ఈయేడు=జ్ఞానేంద్రియమనోబుద్ధులు ఏడును, పూతప్రజ్ఞకుఁ=పవిత్రమయిన జ్ఞానమునకు, సూక్ష్మాకృతిఁ=లింగశరీరమందు, సాధనంబు లగుచుఁ = కారణములై, పొల్పొంగుఁ = వెలుఁగును.

తా. తొలుత విక్షేపశక్తివలన పుట్టిన పంచఁబడని పంచభూతముల శబ్దము స్పర్శము రూపము రసము గంధము అనెడు పంచతన్మాత్రలయందు, మూలప్రకృతియొక్క అమలసత్త్వప్రధానము మలినసత్త్వ ప్రధానము అనెడు రెండురూపములతో మలిన సత్త్వప్రధానమైన ప్రకృతియొక్క సత్త్వరజస్తమోగుణములు మూఁడును చేరి సత్త్వసూక్ష్మభూతములని రజస్సూక్ష్మభూతములని తమస్స్థూలభూతములని మూఁడు విధము లయ్యెను. అందు సత్త్వసూక్ష్మభూతములును రజస్సత్త్వసూక్ష్మభూతములును పంచఁబడనివై సూక్ష్మశరీరోత్పత్తికి కారణములయ్యెను. తమస్స్థూలభూతములు పంచఁబడనివై స్థూలశరీరమునకు కారణములయ్యెను. వీనిలో సూక్ష్మశరీరమునకు కారణములై పంచఁబడినవై సత్త్వరజస్సూక్ష్మభూతములు సమష్టివ్యష్టిభేదములచేత సత్త్వసమష్టిసూక్ష్మభూతములని సత్త్వవ్యష్టి సూక్ష్మభూతములని రజస్సమష్టి సూక్ష్మభూతములని రజోవ్యష్టిసూక్ష్మభూతములని నాలుగువిధము లయ్యెను. వీనిలో సత్త్వ సమష్టిసూక్ష్మభూతము లైదును అంతఃకరణ మయ్యెను. దానిలోపలి సంచారము బుద్ధియును వెలుపలి సంచారము మనస్సును అగును. సత్త్వవ్యష్టిసూక్ష్మభూతము లైదును శ్రోత్రము త్వక్కు చక్షువు జిహ్వ ఘ్రాణము అను జ్ఞానేంద్రియము లయ్యెను. ఈజ్ఞానేంద్రియములును మనస్సును బుద్ధియును జ్ఞానమునకు సాధనములై ప్రకాశించునని తాత్పర్యము.

అవతారిక:—రజస్సూక్ష్మ సమష్టివ్యష్టిభూత విభాగములవలన కలిగిన పదితత్త్వములను చెప్పి వీనితో తొల్లిటియేడుతత్త్వములును చేరి సూక్ష్మశరీరము కలిగె నని చెప్పుచున్నారు.

చ. అరయ రజోగుణోభయముగలందు సమష్టులు పంచవాయువుల్
వరుసఁ గ్రియేంద్రియంబు లగు వ్యష్టులు తొల్లిటియేడు వీనితోఁ
సరవిగఁ జేర భోగతనుసాధన మై తగుసూక్ష్మదేహమౌ
నరసురదైత్యపక్షిమృగనాగముఖాఖిలజంతుకోటికిన్. ౭౦

టీ. అరయఁగ=పరిశీలింపఁగా, రజోగుణోభయములందుఁ, రజోగుణ = ఘోర వృత్తియైన రజోగుణముతోఁగూడిన, ఉభయములందుఁ=సమష్టివ్యష్టి పంచ సూక్ష్మ భూతముల యందు, సమష్టులు=రజస్సమష్టిసూక్ష్మభూతములు, వరుసఁ=క్రమముగా, పంచవాయువులు=సమాన వ్యాన ఉదాన ప్రాణ అపానములనెడు పంచప్రాణవాయువులును, వ్యష్టులు=రజోవ్యష్టిసూక్ష్మపంచభూతములు, క్రియేంద్రియంబులు=వాక్కు హస్తము పాదము గుహ్యము గుదము అనెడుకర్మేంద్రియములును, అగుఁ = అవును. తొల్లిటియేడు=మునుపటి జ్ఞానేంద్రియ మనోబుద్ధు లేడును,వీనితోఁ=ప్రాణపంచకము కర్మేంద్రియపంచకము అనుపదింటితోఁ, సరవిగఁ=మనోజ్ఞముగ, చేరఁ=కూడఁగానే, భోగతనుసాధనము = స్థూలశరీరమునకు కారణము, ఐతగుసూక్ష్మదేహము=అయిరొప్పియుండునట్టిలింగ శరీరము, నర...టికిఁ, నర = మనుష్యులు, సుర=దేవతలు, దైత్య= అసురులు, పక్షి=పులుఁగులు, మృగ = మెకములు, నాగ=సర్పములు, ముఖ= మొదలయిన, అఖిల=సమస్తములైన, జంతు=ప్రాణులయొక్క, కోటికిఁ=సమూహమునకు, ఔఁ = అగును

తా. ఓయిశిష్యుఁడా సమష్టి వ్యష్టి భేదములుగల రాజసగుణ పంచభూతములలో రాజస సమష్టిభూతము లయిదును సమాన వ్యాన ఉదాన ప్రాణ అపానములనెడు పంచవాయువులును రాజసవ్యష్టిభూతము లయిదును వాక్కు హస్తము పాదము గుహ్యము గుదము అనెడు కర్మేంద్రియములును అయ్యెను. ఈపదింటితో ముందటి సత్త్వభూత సమష్టి వ్యష్టి విభాగములవలన కలిగిన మనోబుద్ధులు రెండును జ్ఞానేంద్రియము లయిదును కూడి పదియేడుతత్త్వములుగల సూక్ష్మశరీరము మనుష్యులు దేవతలు అసురులు పక్షులు మృగములు సర్పములు మొదలగు సకలజంతువులకును అగు నని తాత్పర్యము.

అవతారిక:—సూక్ష్మశరీరమును పొందిన జీవేశ్వరులకు నామధేయములు ప్రత్యేకమని అవస్థలును కోశములును ఒక్కటే యని చెప్పుచున్నారు.

మ. ఎలమిం దైజస హేమగర్భు లన జీవేశు ల్ప్రకాశింతు రు
జ్జ్వలతత్సూక్ష్మమునందు జానగుదశ స్వప్నం బగు న్వారికిన్
విలసత్ప్రాణమనస్సు ధీమయము లుర్వీం గోశము ల్లీల రా
జిలు నిట్లంచు శ్రుతు ల్మూర పలుకుం గ్రీంతింపు మాత్మం దగన్.

టీ. కుమార=అంతశ్శత్రువులైన కామక్రోధాదులను గెలిచిన శిష్యుఁడా, ఉజ్జ్వలతత్సూక్ష్మమునందుకా, ఉజ్జ్వల=ప్రకాశమానమైన, తత్సూక్ష్మమునందుకా=ముందు చెప్పఁబడిన సూక్ష్మశరీరమందు, ఎలమికా=ప్రేమతోఁ గూడిన, జీవేశులు, జీవ=అవిద్యోపాధిగతుఁడైన జీవుఁడును, ఈశులు=మాయోపాధిగతుఁడైన యీశ్వరుఁడును, తైజసహేమగర్భులనకా=తైజసుఁడు హిరణ్యగర్భుఁడు అనునట్లుగాను, ప్రకాశింతురు=వెలుగుచుందురు. అనఁగా కారణశరీరమందు అభిమానము కలిగి ఉండునప్పుడు జీవునకు ప్రాజ్ఞుఁడని యీశ్వరునకు అవ్యాకృతుఁడని పేళ్లు కలిగినటీరున సూక్ష్మదేహమందు చేరిన జీవునకు తైజసుఁడని యీశ్వరునకు హిరణ్యగర్భుఁడని నామధేయములు కలిగియుండు ననుట. వారికికా = ఆజీవేశ్వరులకు, జానగుదశ, జానగు = అందమైన, దశ=అవస్థ, స్వప్నంబు=కల, అగుకా=అవును. ఉర్వికా = పుడమియందు, వారికికా=ఆజీవునకును ఈశ్వరునకును, విలసత్ప్రాణ మనస్సుధీమయములు, విలసత్=ఒప్పిదమునైన, ప్రాణ=ప్రాణమయము, మనః=మనోమయము, సుధీమయములు=విజ్ఞానమయము, కోశములు=అనెడుకోశములు, లీలకా=విలాసారముగా, రాజిలుకా=తేజరిల్లును, శ్రుతులు=వేదములు, ఇట్లంచుకా = జీవేశ్వరులకు పేళ్లును అవస్థలును కోశములును కలుగు నని, పలుకుకా = వక్కాణించును, ఆత్మకా=బుద్ధియందు, తెగకా = లెస్సగా, చింతింపుము=ఈయర్థమును ఆలోచనచేయుము.

తా. ఓయిశిష్యుఁడా సూక్ష్మశరీరమును పొందినజీవునకు తైజసుఁడు ఈశ్వరునకు హిరణ్యగర్భుఁడు అనెడు నామధేయములు గలుగును. ప్రాణమయము మనోమయము విజ్ఞానమయము అనెడు కోశములును స్వప్నావస్థయును ఒకటియే అగు నని వేదములు పలుకును గనుక నీసంగతి నేయంతరంగమందున నిలుపుమని తాత్పర్యము.

## సూక్ష్మశరీరపంచీకరణచక్రవిషయము.

పంచీకృతములుకాని సత్త్వసూక్ష్మభూతములను రజస్సూక్ష్మభూతములను సమష్టివ్యష్టిభేదములచేత సత్త్వసమష్టిసూక్ష్మభూతములని సత్త్వవ్యష్టిసూక్ష్మభూతములని రజస్సమష్టిసూక్ష్మభూతములని రజోవ్యష్టిసూక్ష్మభూతములని నాలుగువిధము లగును. వానియందు సత్త్వసమష్టిసూక్ష్మభూతములైదును అంతఃకరణ మాయెను. అది లోపలి సంచారము కలదైనప్పుడు బుద్ధి వెలుపలిసంచారము కలదైనప్పుడు మనస్సు అని రెండువిధము లగును. సత్త్వవ్యష్టిసూక్ష్మ పంచభూతములు శ్రోత్రము త్వక్కు చక్షువు జిహ్వ ఘ్రాణము అనెడుజ్ఞానేంద్రియము లయ్యెను. రజస్సమష్టిసూక్ష్మ పంచభూతములు సమానము వ్యానము ఉదానము ప్రాణము అపానము అనెడు పంచప్రాణవాయువు లయ్యెను. రజోవ్యష్టిసూక్ష్మ పంచభూతములు వాక్కు పాణి పాదము గుహ్యము

పాయువు అనెడు కర్మేంద్రియములయ్యైను. ఈపదియేడు తత్త్వములతో కూడినదే సూక్ష్మశరీరము. దీనియందు చేరిన యీశ్వరునకు హిరణ్యగర్భుఁడని సూత్రాత్మయని పేరు. దీనియందు చేరిన జీవునకు తైజసుఁడని స్వప్నకల్పితుఁడని పేరు. ఈ జీవేశ్వరులకు ఈ సూక్ష్మదేహమందు స్వప్నావస్థయును ప్రాణమయము మనోమయము విజ్ఞానమయము అనెడు మూఁడు కోశములును కలిగి ఉండును. ఎట్లనఁగా సూక్ష్మదేహవ్యాపారమగు స్వప్నవృత్తాంతమును మేలుకొనునపుడు చెప్పుటవలన సూక్ష్మదేహమందు విజ్ఞానమయకోశ ముండును. ప్రాణధర్మములైన లేచుట కూర్చుండుట ముడుచుట చాఁచుట నడుచుట అనెడు అయిదుపనులును అప్పు డుండుటవలన ప్రాణమయకోశ ముండును. మనోరాజ్య మేలుటవలన మనోమయకోశ ముండును. మఱియును అంతఃకరణము ప్రాణాది పంచవాయువులతోఁ గూడిన ప్రాణమయకోశ మని మనస్సు కర్మేంద్రియములతోఁ గూడిన మనోమయకోశ మని బుద్ధి జ్ఞానేంద్రియములతోఁ గూడిన విజ్ఞానమయకోశ మని గ్రహింపవలయును. కొందఱు సూక్ష్మదేహమునకు తత్త్వములు పందొమ్మి దందురు. అప్పుడు మనస్సులో భేదమయిన చిత్తమును బుద్ధిలో భేదమయిన అహంకారమును పదియేడుతత్త్వములలో చేర్ప పందొమ్మి దగును. ౹౹శ్లో. పంచప్రాణ మనోబుద్ధి దశేంద్రియ సమన్వితమ్, అపంచీకృతభూతోత్థం సూక్ష్మాగం భోగసాధనమ్౹౹ అని శ్రీమచ్ఛంకరాచార్య విరచితాత్మబోధప్రకాశికయందు.

## సూక్ష్మశరీరపంచీకరణచక్రము.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| సత్త్వసూక్ష్మభూతములు. | అపంచీకృతసూక్ష్మ భూతములు. | ఆకాశము | వాయువు | అగ్ని. | జలము. | పృథివి. | సత్త్వరజస్సూక్ష్మ భూతములు. |
| | సత్త్వసమష్టిసూక్ష్మభూతములు. | మనస్సు. చంద్రుడు. | | | బుద్ధి. బృహస్పతి. | | అంతఃకరణము అధిదేవతలు. |
| | సత్త్వవ్యష్టిసూక్ష్మభూతములు. | శ్రోత్రము దిక్కులు | త్వక్కు. వాయువు | చక్షువు. సూర్యుడు | జిహ్వ. వరుణుడు | ఘ్రాణము అశ్వినులు | జ్ఞానేంద్రియములు. అధిదేవతలు |
| రజస్సూక్ష్మభూతములు. | రజస్సమష్టిసూక్ష్మభూతములు. | సమానము జయుఁడు | వ్యానము విశ్వయోని | ఉదానం అజుఁడు | ప్రాణము విశిష్టుడు | అపానం విశ్వకర్త | పంచవాయువులు అధిదేవతలు |
| | రజోవ్యష్టి సూక్ష్మభూతములు. | వాక్కు. అగ్ని. | పాణి. ఇంద్రుడు | పాదము ఉపేంద్రుడు | గుహ్యం బ్రహ్మ. | వాయువు మృత్యువు | కర్మేంద్రియములు. అధిదేవతలు |
| | జీవసూక్ష్మదేహతత్త్వాధిదేవతలే యీశ్వరసూక్ష్మదేహతత్త్వములు. | | | | | | |

అవతారిక.—సూక్ష్మశరీరోత్పత్తిని చెప్పి స్థూలప్రపంచసృష్టిక్రమమును చెప్పఁబోవుచున్నారు.

మ. తనయా తెల్పితి సూక్ష్మకల్పనల నిం కేదాఁకన్ భువిన్ స్థూలక
ల్పన లింక న్వినిపింతు సూక్ష్మమున మున్ భాసిల్లుజీవేశు లీ
తనువం దెల్ల భుజింపఁ జేసె విను తత్స్వాంతేశుఁ డీదేహులన్
గని పంచీకరణంబుఁ దాన నగు లోకం బెల్ల విఖ్యాతిగాన్. ౭౨

టీ. తనయా=ఓయికుమారా, ఇందాఁకన్=ఇంతమట్టునకు, సూక్ష్మకల్పనలన్-సూక్ష్మ=జీవేశ్వరుల సూక్ష్మశరీరములయొక్క, కల్పనలన్ = పుట్టుకలను, తెల్పితిన్ = ఎఱిఁగించితిని, ఇంకన్=ఇఁకమీఁద, భువిన్=పుడమియందు, స్థూలకల్పనలు = స్థూల దేహములపుట్టుకలను, వినిపింతున్ = తెలియఁజెప్పెదను, సూక్ష్మమునన్ = పదియేడు తత్త్వములతోఁ కూడిన లింగశరీరమందు, మున్=ముందు, భాసిల్లుజీవేశులు=ప్రకాశించుచుండెడు తైజస హిరణ్యగర్భులనెడు పేళ్లుగల జీవుఁడును ఈశ్వరుఁడును, ఈతనువందున్=చెప్పఁబోయెడి యీస్థూలదేహమందు, ఎల్ల భుజింపన్=జ్ఞానేంద్రియ కర్మేంద్రియములచేత అనుభవింపఁదగిన సకలవిషయములను తెలిసి అనుభవించుటకు, తత్స్వాంతేశుఁడు-తత్=ఆజీవేశ్వరులయొక్క, స్వాంత=మనస్సులయందలి, ఈశుఁడు=నియామకుఁడగు పరమాత్మ, ఈదేహులన్=సూక్ష్మశరీరములను పొందిన యీతైజస హిరణ్యగర్భులను, కని=వీక్షించి, పంచీకరణంబున్=స్థూలపంచభూత భాగములచేరికవలన కలిగిన జీవేశ్వరులస్థూలదేహములను, చేసెన్=ఒనర్చెను, దానన్=అస్థూల పంచభూత విభాగముల చేరికచేతనే, లోకం బెల్లన్=జగ మంతయును, విఖ్యాతిగాన్ = ప్రసిద్ధముగా, అగున్=కలుగును.

తా. ఓయి శిష్యుఁడా! యింతవఱకు జీవేశ్వరులయొక్క సూక్ష్మశరీరముల ఉత్పత్తిక్రమములను తెలియఁజెప్పితిని. ఇఁక స్థూలదేహములు పుట్టినవిధములను చెప్పెదను. ముందు ఆజీవేశ్వరులు తైజసహిరణ్యగర్భులను పేళ్లచేత లింగశరీరమందు స్వప్నసుఖములను అనుభవించుచుండి ఈస్థూలదేహమందు సకలేంద్రియములచేత ఆయా యింద్రియ విషయములను అనుభవించుటకు ఆజీవేశ్వరులను చూచి అంతర్యామియగు పరమాత్మ పంచీకరణము చేసెను. ఆపంచీకరణమే సకలలోకము లగు నని తాత్పర్యము.

అవ.—జీవేశ్వరుల స్థూలశరీరోత్పత్తిహేతువైన తామసస్థూలభూతపంచీకరణమును చెప్పుచున్నారు.

శా. ఐదీరైదుగ నొప్పుభూతములయం దర్ధంబుఁ బక్కిద్వయం
బై దీపింప నొనర్చి చేర్పఁగఁ దదీయార్ధోపభాగంబులం
దైదై దుగ్గ వెలుంగుఁ దత్త్వములు బ్రహ్మాండాదులుం బిండముల్
భూదేవోత్తమ భూతభోగ్యభువనంబు ల్తత్స్వరూపంబు లౌ. ౭౩

టీ. భూదేవోత్తమ, భూ = భూమియందుండెడు, దేవ = దేవతలైన బ్రహ్మవేత్తలలో, ఉత్తమ = శ్రేష్ఠుఁడవైన శిష్యుఁడా, ‟శ్రు. బ్రహ్మచర్యేణ తపసైవ దేవాః” అని శ్రుతి (తా. పరబ్రహ్మమందు సంచరించుటయనెడు తపస్సుచేతనే దేవత లగుచున్నారు.) అట్టివారు బ్రహ్మవేత్తలు. వారిలో శ్రేష్ఠుఁడా యనుట. భూతములు = భాగించుటకు తగిన తామసస్థూలపంచభూతములు, ఐదు = ఐదును, ఈరైదుగన్ = సత్త్వగుణ రజోగుణ భూతములవలెనే తామస సమష్టి పంచభూతము లని తామస వ్యష్టి పంచభూతము లని రెండైదులుగాను, ఒప్పన్ = ప్రకాశించును, అందున్ = ఆసమష్టి పంచభూతములయందు, అర్ధంబున్ = భాగించుటకు తగిన వ్యష్టిభూతములను ఐదింటిని పట్టి - ద్వయంబు = రెండుపదులు, విదీపింపన్ = అయి ప్రకాశించునట్లు, ఒనర్చి = చేసి, అనఁగా ఒక్కొకవ్యష్టిభూతమును నాలుగుగా భాగించి, తదీయార్ధోపభాగంబులందున్ - తదీయ = ఆతామసస్థూలభూతసంబంధములైన, అర్ధ = సగములైన వ్యష్టిభాగములయొక్క, ఉపభాగంబులందున్ = నాలుగుగా చేయఁబడిన పాళ్లయందు, చేర్పఁగన్ = ఇతరభూతార్ధ వ్యష్టి భాగముల ఉపభాగములతో చేర్పఁగా, అనఁగా వ్యష్టిభాగోపభాగములు ఇతరభూతార్ధవ్యష్టిభాగముల ఉపభాగములతో చేరఁగా విడుదల అయినస్థలములలో చేర్పఁగా ననుట. ఐదైదుల్గన్ = ఇరువదియైదుగాను, తత్త్వములు = జ్ఞాతమొదలైన తత్త్వములు, వెలుఁగున్ = ప్రకాశించును, తత్స్వరూపంబులు = ఆయిరువదియైదుతత్త్వముల రూపములే, బ్రహ్మాండ = బ్రహ్మాండమే, ఆదులును = మొదలుగాఁ గలవియును, అనఁగా బ్రహ్మాండ విష్ణ్వండ రుద్రాండ మహేశ్వరాండ సదాశివాండ విరాట్పురుషాండములును, పిండములు = చరాచరప్రాణికోట్లశరీరములును, భూత... బులు, భూత = ఆకాశాదిమహాభూతములును, భోగ్య = సకలచేతనుల అనుభవములకు తగిన అన్నాదిభోగ్యద్రవ్యములును, భువనంబులు = ప్రాణులకు నివాసములైన లోకములును, ఔన్ = అగును.

తా. ఓయి శిష్యుఁడా! తమోగుణముతో కూడిన స్థూలభూతము లైదును సమష్టివ్యష్టిభేదములచేత రెండురెండుగా చేయఁబడి తామససమష్టిస్థూల పంచభూతము లని తామసవ్యష్టిస్థూలపంచభూతము లని పది అయ్యెను. అందు తామస సమష్టిస్థూల పంచభూతములను భాగింపక నిలిపి వ్యష్టిస్థూలపంచభూతములను ఒక్కొక్కటిని నాలుగునాలుగుగా భాగించి యితరభూతార్ధ వ్యష్టి భాగముల ఉపభాగములతో చేర్పఁగా ఇరువది యయ్యెను. అవి తమతమ సమష్టిభాగములతో కూడి యిరువదియైదు తత్త్వము లగును. ఆతత్త్వము లొక్కటిగ కూడి బ్రహ్మాండ విష్ణ్వండ రుద్రాండ మహేశ్వరాండ సదాశివాండ విరాట్పురుషాండములును సకలప్రాణులకును స్థూలశరీరములును ఆప్రాణులకు ఉనికిపట్టులైన పదునాలుగు లోకములును అండ పిండ భువనములకు ఆశ్ర

యము లయిన ఆకాశాది మహాభూతములును అన్నాదిభోగ్యపదార్థములును ఆరయ నని తాత్పర్యము.

అవతారిక.—స్థూల శరీరమును పొందిన జీవేశ్వరుల అభిమాన నామములను అవస్థలను కోశములను చెప్పుచున్నారు.

చ. రస వెలుఁగొందు నీశుఁడు విరాట్పురుషుం డన జీవుఁ డొప్పు దు
ర్వ్యసనవిహీన విశ్వుఁ డన నా వారికి భిన్న సమాఖ్య లైనఁ బెం
పెసఁగ నభిన్న మన్నమయ మెన్నఁ గరం బొగి జాగరంబె తా
మస మోఁ బాసి కాంచుము కుమారక స్థూలశరీర మొందినన్.

టీ దుర్వ్యసనవిహీన, దుర్వ్యసన=నీచములయిన దేహేంద్రియాదులు సేన చెడు దుఃఖము, విహీన=లేనట్టి, కుమారక, కు=కుచ్ఛితములైన అంతఃబహిశ్శత్రువులను, మారక=సంహరించిన పుత్రా, రసన్=భూమియందు, ఈశుఁడు=మాయోపాధిగల యీశ్వరుఁడు, స్థూలశరీరమున్=పంచీకృతపంచభూతమయ మగు సమష్టిస్థూలదేహమును, ఒందినన్=చెందెనేని, విరాట్పురుషుం డనన్=వైరాజుఁ డనునట్లుగాను, వెలుఁగొందున్=ప్రకాశించును, జీవుఁడు=అవిద్యోపాధిగల చిదాభాసుఁడు, విశ్వుఁ డనన్=స్థూలశరీరమందు, వ్యావహారికుఁ డనుపేరుచేత, ఒప్పున్=రాణించును, వారికిన్=ఆయీశ్వరజీవులకు, భిన్నసమాఖ్యలు=వేఱువేఱుగా పేళ్లును, పెంపెసఁగన్=మనోహర మగునట్లుగా, ఐనన్=కలిగినను, కరంబు=మిక్కిలి, ఒగిన్=క్రమముగా, ఎన్నన్=పరిశీలించి చూడఁగాను, అన్నమయము=అన్నమయకోశమును, జాగరంబు=జాగ్రదవస్థయును, అభిన్నము=ఒక్కటే యగును. తామసమున్=మూఢత్వమును, ఎడఁబాసి=వదలి, కాంచుము=ఎఱుఁగుము.

తా. ఓయి శిష్యుఁడా! స్థూలశరీరమును పొందిన యీశ్వరునకు విరాట్పురుషుఁ డని జీవునకు విశ్వుఁ డని పేరు. ఆయీశ్వరునకును జీవునకును అన్నమయకోశమును జాగ్రదవస్థయును ఒక్కటే యగు నని తాత్పర్యము. ఈ యీశ్వరునిస్వరూపలక్షణము పదియాఱవపద్యమునఁ గలదు.

## స్థూలశరీర పంచీకరణ చక్రవిషయము.

పంచీకృతములైన తామస స్థూలభూతము లైదును సమష్టివ్యష్టిభేదములచేత ఒక్కొకటి రెండేసిగా పంచఁబడి తామస సమష్టిస్థూల పంచభూతము లని తామస వ్యష్టిస్థూలపంచభూతములని పదివిధము లగును. అందు తామస వ్యష్టి స్థూలపంచభూతములు తమతమ సమష్టిభాగములను విడిచి యితరవ్యష్టిభూతార్ధభాగముల ఉపభాగములలో చేరుటకై ఒకటొకటి నాలుగుగా భాగింపఁబడి యితరభూతములవ్యష్టి భాగముల ఉప

భాగములలో చేరి యుండటి తమతమ సమష్టి భాగములతో కూడి యిరువదియైదుతత్త్వము లగును. ఈతత్త్వములు ఒక్కటిగాఁ గూడి అండములును పిండములును భూతములును భువనములును భోగ్యములును అయ్యెను.

అండము లనఁగా బ్రహ్మాండ విష్ణ్వండ రుద్రాండ మహేశ్వరాండ సదాశివాండ విరాట్పురుషాండములు. అత్తికాయవలె ఉండునది బ్రహ్మాండము. అత్తికాయలు అనేకములు గల అత్తిచెట్టువలెను ఉండునది విష్ణ్వండము. అత్తిచెట్లు అనేకములుగల అత్తి తోఁటవలె ఉండునది రుద్రాండము. అట్టితోఁటలు అనేకములుగల గ్రామమువలె ఉండునది మహేశ్వరాండము. అట్టిగ్రామములు అనేకములుగల దేశమువలె ఉండునది సదాశివాండము. అట్టిదేశములు అనేకములుగల ప్రపంచమువలె ఉండునది విరాట్పురుషాండము. దీనినే మాయాండ మందురు.

పిండము లనఁగా అత్తికాయలో నుండెడు పురుగులును విత్తులునువలెనే బ్రహ్మాండములో ఉండెడి చేతనాచేతన రూపములైన సమస్తప్రాణుల శరీరములు.

భూతము లనఁగా అండ పిండ భువనములకు స్థానములైన ఆకాశాదిమహాభూతములు.

భువనము లనఁగా పదునాలుగు లోకములు. లేక భువనాధ్వమందలి యిన్నూట యిరువదినాలుగు భువనములు.

భోగ్యము లనఁగా సకలశరీరధారులకును భోగార్హములైన అన్నాది సమస్త భోగ్యద్రవ్యములును. ఈసర్వమును పంచీకరణమే అగును. వీనిలో వ్యష్టి స్వరూపుఁడైన ఒకజీవదేహ పంచీకరణ చక్రవిషయము దిగువను వ్రాయఁబడుచున్నది.

## ఆకాశపంచీకరణము.

తమోగుణముతో చేరిన ఆకాశముయొక్క సమష్టిభాగము జ్ఞాత. వీనికి విషయము జ్ఞేయము. సాధనము జ్ఞానము. అధిదేవత కూటస్థుఁడు. వీనికి ప్రత్యగాత్మ జీవసాక్షి. అంతర్యామి పరమాత్మ అనుపేళ్లు గలవు.

జ్ఞాత యనఁగా సర్వేంద్రియవిషయవ్యవహారములను తెలిసికొనువాఁడని అర్థము. వీనినే జీవుఁ డందురు. జ్ఞేయ మనఁగా సకలేంద్రియవిషయములు.

వ్యష్టభాగము నాలుగుగా భాగింపఁబడి వాయు వహ్ని జల భూముల వ్యష్టిభాగముల ఉపభాగములతో చేరును.

## తామసాకాశవ్యష్టిభాగనిరూపణము.

ఆకాశవ్యష్టిభాగములు నాలుగింటిలో ఒకటవభాగము వాయువుయొక్క వ్యష్టిభాగములు నాలుగింటిలో ఒకటవభాగముతో చేరి మనస్సు ఆయెను. దీనికి విషయము సంకల్ప వికల్పములు. అధిదేవత చంద్రుఁడు.

ఆకాశ వ్యష్టి భాగములు నాలుగింటిలో రెండవభాగము అగ్నియొక్క వ్యష్టి భాగములు నాలుగింటిలో ఒకటవభాగముతో చేరి బుద్ధి ఆయెను. దీనికి విషయము నిశ్చయము. అధిదేవత బృహస్పతి.

ఆకాశ వ్యష్టిభాగములు నాలుగింటిలో మూఁడవభాగము జలముయొక్క వ్యష్టి భాగములు నాలుగింటిలో ఒకటవభాగముతో చేరి చిత్తము ఆయెను. దీనికి విషయము చంచలత. అధిదేవత క్షేత్రజ్ఞుఁడు.

ఆకాశవ్యష్టిభాగములు నాలుగింటిలో నాలుగవభాగము పృథివియొక్కవ్యష్టి భాగములు నాలుగింటిలో ఒకటవభాగముతో చేరి అహంకారమాయెను. దీనికి విషయము నేననెడి అభిమానము. అధిదేవత రుద్రుఁడు. ఈజ్ఞాతృ మనోబుద్ధిచిత్తాహంకారము లైదును తామసాకాశవిభాగములు. ఇవే అంతఃకరణములు. అంతరింద్రియములు.

## వాయుపంచీకరణము.

తమోగుణముతో చేరిన వాయువుయొక్క సమష్టిభాగము వ్యానవాయువు. ఇది శరీరావయవములయందు అంతట వ్యాపించి భక్షితాన్నరసములను నఖశిఖ పర్యంతమును వ్యాపింపఁజేయును. దీని కధిదేవత విశ్వయోని.

వ్యష్టిభాగము నాలుగుగా భాగింపఁబడె ఆకాశ వహ్ని జలభూముల వ్యష్టిభాగముల ఉపభాగములతో చేరును.

## తామసవాయువ్యష్టిభాగనిరూపణము.

వాయువ్యష్టిభాగములు నాలుగింటిలో ఒకటవభాగము ఆకాశముయొక్కవ్యష్టి భాగములు నాలుగింటిలో ఒకటవభాగముతో చేరి సమానవాయువు ఆయెను. ఇది నాభియందు వసించి జఠరాగ్నిని ప్రజ్వరిల్లఁజేసి భక్షితచతుర్విధాన్నములను పచనము చేయును. దీనికి అధిదేవత జయుఁడు.

వాయువ్యష్టిభాగములు నాలుగింటిలో రెండవభాగము అగ్నియొక్క వ్యష్టిభాగములు నాలుగింటిలో రెండవభాగముతో చేరి ఉదానవాయువు ఆయెను. ఇది కంఠమందుండి భుజించిన అన్నపానాదులసహ్యాసహ్యములను తెలిసి సహ్యములను లోపలికి గ్రహించుచు అసహ్యములను వెలుపలికి త్రోయుచు కొండనాలుక దవుడలు కంఠము శిరస్సు దంతములు పెదవులు నాసిక మిశ్రము అనెడి యెనిమిది స్థానములయందును అకారాద్యక్షరములను పలికించుచు వాంతి మొదలగువానిని పుట్టించుచు నిద్రయందు సర్వేంద్రియములను అవిద్యయందు చేర్చి మెలఁకువయందు వానివాని నెలవులలో నిలుపును. దీని కధిదేవత అజుఁడు.

వాయువ్యష్టి భాగములు నాలుగింటిలో మూఁడవభాగము జలముయొక్కవ్యష్టి భాగములు నాలుగింటిలో రెండవ భాగముతో చేరి ప్రాణవాయువు ఆయెను. ఇదిహృద

యస్థానమున వసించి ముక్కుయొక్క కుడియెడమద్వారములవలన ఉచ్ఛ్వాసనిశ్శ్వాసరూపములచేత పండ్రెండు పదియారు అంగుళములపొడుగున వెలుపలికిని ఎనిమిది అంగుళముల పొడువున లోపలికిని ఇరువదియొక్కవేల ఆఱునూఱుమాఱులు వచ్చుచు పోవుచు ఉండును దీని కధిదేవత విశిష్టుఁడు.

వాయువ్యష్టి భాగములు నాలుగింటిలో నాలుగవభాగము భూమియొక్క వ్యష్టి భాగములు నాలుగింటిలో రెండవభాగముతో చేరి అపాన మాయెను. ఇది గుదస్థానమందు చేరి మలమూత్రములను శుక్లశోణితములను వెలుపలికి త్రోయుచుండును. దీనికి అధిదేవత విశ్వకర్త. ఇవి యైదును తామసవాయువిభాగములు. ఇవే ప్రాణాది పంచవాయువులు.

## అగ్ని పంచీకరణము.

తమోగుణముతో చేరిన అగ్నియొక్క సమష్టిభాగము చక్షురింద్రియము. దీనికి విషయము పొడుగు పొట్టి లావు సన్నము తెలుపు ఎఱుపు నలుపు పసుపు ఆకుపచ్చ మిశ్రము అనెడు పదివిధములయిన రూపముల గ్రహించుట. అధిదేవత సూర్యుఁడు.

తామసాగ్ని వ్యష్టిభాగము నాలుగుగా భాగింపఁబడి ఆకాశవాయుజలభూములతో చేరును.

## తామసాగ్నివ్యష్టిభాగ నిరూపణము.

అగ్నియొక్క వ్యష్టిభాగములు నాలుగింటిలో ఒకటవభాగము ఆకాశముయొక్క వ్యష్టిభాగములు నాలుగింటిలో రెండవభాగముతో చేరి శ్రోత్రేంద్రియ మాయెను. దీనికి విషయము సంస్కృతాదిభాషారూపశబ్దము, భేరీతాళమృదంగాదివాద్యరూపశబ్దము, పిల్లనగ్రోవినాదస్వరము మొదలగు స్వరరూపశబ్దము, మిశ్రము అనెడు చతుర్విధ శబ్ద గ్రహణము. అధిదేవత దశదిక్కులు.

అగ్నియొక్క వ్యష్టిభాగములు నాలుగింటిలో రెండవభాగము వాయువుయొక్క వ్యష్టిభాగములు నాలుగింటిలో రెండవభాగముతో చేరి త్వగింద్రియ మాయెను. దీనికి విషయము వేఁడిమి చల్లన మృదువు కఠినము మిశ్రము అనెడు పంచవిధస్పర్శము. అధిదేవత వాయువు.

అగ్నియొక్క వ్యష్టి భాగములు నాలుగింటిలో మూఁడవభాగము జలముయొక్క వ్యష్టిభాగములు నాలుగింటిలో మూఁడవభాగముతో చేరి జిహ్వేంద్రియ మాయెను. దీనికి విషయము ఉప్పు పులుసు కారము వగరు చేఁదు మధురము మిశ్రము అనెడు సప్తవిధరసముల గ్రహించుట. అధిదేవత వరుణుఁడు.

అగ్నియొక్క వ్యష్టిభాగములు నాలుగింటిలో నాలగవ భాగము భూమియొక్క వ్యష్టిభాగములు నాలుగింటిలో మూఁడవభాగముతో చేరి ఘ్రాణేంద్రియ మాయెను.

దీనికి విషయము సుగంధము దుర్గంధము మిశ్రగంధము అనెడు త్రివిధగంధముల గ్రహించుట. అధిదేవతలు అశ్వినీదేవతలు.

ఈ ఐదును తామసాగ్నివిభాగములు. ఇవే జ్ఞానేంద్రియములును, మధ్యేంద్రియములును అగును.

## జలభూత పంచీకరణము.

తమోగుణముతో చేరిన జలముయొక్క సమష్టిభాగము రసతన్మాత్రము. దీనికి విషయము మాధుర్యముగా నుండుట. ఇది పృథివియందును ఉండును. అధిదేవత విష్ణువు.

వ్యష్టిభాగములు నాలుగుగా భాగింపఁబడి ఆకాశ వాయువహ్ని భూములలో చేరును.

## తామసజలవ్యష్టిభాగ నిరూపణము.

జలవ్యష్టి భాగములు నాలుగింటిలో మొదటిభాగము ఆకాశముయొక్క వ్యష్టిభాగములు నాలుగింటిలో మూఁడవభాగముతో చేరి శబ్దతన్మాత్ర మాయెను. దీనికి విషయము ఏకదేశశబ్దము. అధిదేవత సదాశివుఁడు. ఈశబ్దము భూమియందు కటకట అని జలమందు బుడబుడ అని అగ్నియందు ధగధగ అని గాలియందు గలగల అని వినఁబడును.

జల వ్యష్టిభాగములు నాలుగింటిలో రెండవభాగము వాయువుయొక్క వ్యష్టిభాగములు నాలుగింటిలో మూఁడవభాగముతో చేరి స్పర్శతన్మాత్ర మాయెను. దీనికి విషయము ఏకదేశస్పర్శము. ఈస్పర్శగుణము భూమియందు కఠినముగాను జలమందు శీతలముగాను అగ్నియందు ఉష్ణముగాను ఉండును. దీని కధిదేవత మాహేశ్వరుఁడు.

జలవ్యష్టిభాగములు నాలుగింటిలో మూఁడవభాగము అగ్నియొక్క వ్యష్టిభాగములు నాలుగింటిలో మూఁడవభాగముతో చేరి రూపతన్మాత్ర మాయెను. దీనికి విషయము ఏకదేశరూపము. ఇది పృథివియందు రక్త నీలశ్వేత పీత చిత్రాదిరూపము. జలమందు శ్వేతరూపము. అగ్నియందు రక్తరూపము. దీని కధిదేవత రుద్రుఁడు.

జలవ్యష్టిభాగములు నాలుగింటిలో నాలగవభాగము పృథివియొక్కవ్యష్టిభాగములు నాలుగింటిలో నాలగవభాగముతో చేరి గంధతన్మాత్ర మాయెను. దీనికి విషయము ఏకదేశగంధము. ఇది భూమియందుమాత్రము ఉండును. దీని కధిదేవత బ్రహ్మ. ఈయైదును జలవిభాగములు. అవే పంచ తన్మాత్రలు.

## పృథివీపంచీకరణము.

తమోగుణముతో చేరిన, పృథివీసమష్టిభాగము, పాయ్వింద్రియ మాయెను. దీనికి విషయము మలవిసర్జనము. అధిదేవత మృత్యువు.

వ్యష్టి భాగము నాలుగుగా భాగింపఁబడి ఆకాశ వాయు వహ్ని జలములతో చేరును.

## తామసపృథివీవ్యష్టిభాగనిరూపణము.

పృథివీవ్యష్టిభాగములు నాలుగింటిలో మొదటిభాగము ఆకాశముయొక్క వ్యష్టిభాగములు నాలుగింటిలో నాలుగవ భాగముతో చేరి వాగింద్రియ మాయెను. దీనికి విషయము పుణ్యపాపమిశ్రవచనములు. అధిదేవత అగ్ని.

పృథివీ వ్యష్టిభాగములు నాలుగింటిలో రెండవభాగము వాయువుయొక్క వ్యష్టిభాగములు నాలుగింటిలో నాలుగవభాగముతో చేరి పాణీంద్రియ మాయెను. దీనికి విషయము దానప్రతిగ్రహములు. అధిదేవత ఇంద్రుడు.

పృథివీవ్యష్టిభాగములు నాలుగింటిలో మూడవభాగము అగ్నియొక్క వ్యష్టిభాగములు నాలుగింటిలో కడపటిభాగముతో చేరి పాదేంద్రియ మాయెను. దీనికి విషయము రాకపోకలు. అధిదేవత ఉపేంద్రుడు.

పృథివీవ్యష్టి భాగములు నాలుగింటిలో నాలుగవభాగము జలముయొక్క వ్యష్టిభాగములు నాలుగింటిలో చివరభాగముతో చేరి గుహ్యేంద్రియ మాయెను. దీనికి విషయము సంయోగానందము. అధిదేవత బ్రహ్మ. ఇవి పృథివీపంచకము. కర్మేంద్రియములు. బాహ్యేంద్రియములు.

### పంచీకరణకదంబము.

శ్లో. "జ్ఞాతా సమానవాయుశ్చ శ్రోత్రశ్శబ్దస్తథైవ చ,
వాణీ పంచ ఇదం ప్రోక్తమిత్యేతే వ్యోమపంచకమ్."

తా. జ్ఞాత సమానవాయువు శ్రోత్రము శబ్దము వాక్కు ఈయైదును ఆకాశతత్త్వకదంబమని తాత్పర్యము.

శ్లో. "మనశ్చ వ్యానవాయుశ్చ త్వక్స్పర్శశ్చ తథైవ చ,
పాణిపంచ ఇదం ప్రోక్తమిత్యేతే వాయుపంచకమ్."

తా. మనస్సు వ్యానవాయువు చర్మము స్పర్శము హస్తము ఈయైదును వాయుతత్త్వ కదంబ మని తాత్పర్యము.

శ్లో. "బుద్ధిశ్చోదానవాయుశ్చ చక్షూరూపం తథైవ చ,
పాదపంచ ఇదం ప్రోక్త మిత్యేతే హ్యగ్ని పంచకమ్."

తా. బుద్ధి ఉదానవాయువు చక్షుస్సు రూపము పాదము ఈయైదును అగ్నితత్త్వ కదంబ మని తాత్పర్యము.

శ్లో. "చిత్తంచ ప్రాణవాయుశ్చ జిహ్వాచ రస ఏవచ,
గుహ్యపంచ ఇదం ప్రోక్తమిత్యేతే జలపంచకమ్."

తా. చిత్తము ప్రాణవాయువు జిహ్వా రసము గుహ్యము ఈయైదును జలతత్త్వకదంబ మని తాత్పర్యము.

శ్లో. ॥అహం చాపానవాయుశ్చ ఘ్రాణగంధ స్తథై వచ,
పాయుపంచ ఇదం ప్రోక్త మిత్యేతే భూమిసంచకమ్.॥

తా. అహంకారము అపానము ఘ్రాణము గంధము పాయువు ఈయైదును పృథివీతత్త్వకదంబ మని తాత్పర్యము.

ఈయిరువదియైదు తత్త్వములును గూడి స్థూలశరీర మాయెను. దీనిని పొందిన యాత్మునకు విరాట్పురుషుఁ డని వైరాజుఁ డని వైశ్వానరుఁ డని పేరు. దీనిని పొందిన జీవునకు విశ్వుఁడని చిదాభాసుం డని వ్యావహారికుఁ డని పేరు. ఈజీవేశ్వరులకు ఈస్థూలదేహమందు అవస్థ జాగ్రత్త, కోశము అన్నమయము.

## పంచభూతతత్త్వస్తబకమున ఆకాశతత్త్వస్తబకము.

జ్ఞాత కూటస్థుఁ డనెడు అధిదేవతచేత ప్రేరేపింపఁబడి సమానవాయువుతోఁ గూడి శ్రోత్రేంద్రియద్వారముచేత చతుర్విధశబ్దములను గ్రహించి వాక్కుచేత వచియించుచుండును.

## వాయుతత్త్వస్తబకము.

ఈజ్ఞాత మనోరూపుఁడై చంద్రాధిదేవతాప్రేరకత్వముచేత వ్యానవాయువుతోఁ గూడి త్వగింద్రియద్వారమువలన పంచవిధస్పర్శములను గ్రహించి పాణీంద్రియముచేత స్పృశించుచుండును.

## అగ్నితత్త్వస్తబకము.

ఈజ్ఞాత బుద్ధిరూపుఁడై బృహస్పతిదేవతాప్రేరకత్వముచేత ఉదానవాయువుతోఁగూడి చక్షురింద్రియద్వారమువలన దశవిధరూపములను గ్రహించి పాదేంద్రియముచేత నడుచుచుండును.

## జలతత్త్వస్తబకము.

ఈజ్ఞాత చిత్తస్వరూపుఁడై క్షేత్రజ్ఞాధిదేవతాప్రేరకత్వముచేత ప్రాణవాయువుతోఁ గూడి జిహ్వేంద్రియద్వారమువలన సప్తవిధరసములను గ్రహించి గుహ్యేంద్రియముచేత ఆనందించుచుండును.

## పృథివీతత్త్వస్తబకము.

ఈజ్ఞాత అహంకారస్వరూపుఁడై రుద్రాధిదేవతాప్రేరకత్వమువలన అపానముతో గూడి ఘ్రాణేంద్రియద్వారముచేత త్రివిధగంధములను గ్రహించి పాయ్వింద్రియమువచేత మలమూత్ర శుక్లశోణితములను విసర్జించుచుండును.

## జీవేశ్వరస్థూలదేహపంచీకరణచక్రము.

| ఆకాశము | వాయువు | అగ్ని | జలము | పృథివి | పంచీకృతతామస స్థూలభూతములు | |
|---|---|---|---|---|---|---|
| జ్ఞాత జ్ఞేయము కూటస్థుఁడు. | మనస్సు సంకల్పవికల్పములు చంద్రుఁడు | బుద్ధి నిశ్చయము బృహస్పతి. | చిత్తము చలనము జీవుఁడు. | అహంకారము అభిమానము రుద్రుఁడు. | ఆకాశపంచకము విషయములు అధిదేవతలు. | అంతఃకరణములు అంతరింద్రియములు |
| సమానవాయువు పచనాదికము జయుఁడు. | వ్యానవాయువు పంచిపెట్టుట విశ్వయోని. | ఉదానవాయువు మ్రింగుట మొదలగునవి అజుఁడు. | ప్రాణవాయువులో వెలిఁదిరుగుట విశిష్టుఁడు. | అపానము మలమూత్రశుక్లముల వెడలించుట విశ్వకర్త | వాయుపంచకము విషయములు అధిదేవతలు. | |
| శ్రోత్రేంద్రియము చతుర్విధశబ్దము దిక్కులు. | త్వగింద్రియము పంచవిధస్పర్శము వాయువు. | చక్షురింద్రియము దశవిధరూపము సూర్యుఁడు. | జిహ్వేంద్రియము సప్తవిధరసము వరుణుఁడు. | ఘ్రాణేంద్రియము త్రివిధగంధము అశ్వినులు | అగ్నిపంచకము విషయములు అధిదేవతలు. | జ్ఞానేంద్రియములు ముఖ్యేంద్రియములు |
| శబ్దతన్మాత్రము ఏకదేశశబ్దము సదాశివుఁడు. | స్పర్శతన్మాత్రము ఏకదేశస్పర్శము మహేశ్వరుఁడు | రూపతన్మాత్రము ఏకదేశరూపము రుద్రుఁడు. | రసతన్మాత్రము ఏకదేశరసము విష్ణువు. | గంధతన్మాత్రము ఏకదేశగంధము బ్రహ్మ. | జలపంచకము విషయములు అధిదేవతలు. | పంచతన్మాత్రములు |
| వాగింద్రియము త్రివిధవచనము అగ్ని. | పాణీంద్రియము దానప్రతిగ్రహములు ఇంద్రుఁడు. | పాదేంద్రియము రాకపోకలు ఉపేంద్రుఁడు. | గుహ్యేంద్రియము సంయోగానందము బ్రహ్మ. | పాయ్వింద్రియము మలవిసర్జనము మృత్యువు. | పృథివీపంచకము విషయములు. అధిదేవతలు. | కర్మేంద్రియములు బాహ్యేంద్రియములు. |

పంచవింశతితత్త్వముల ఆధ్యాత్మిక ఆధిభౌతిక ఆధిదైవతవివరణము.

జ్ఞాత ఆధ్యాత్మికము. జ్ఞేయము ఆధిభౌతికము. కూటస్థుఁడు ఆధిదైవతము.
మనస్సు ఆధ్యాత్మికము. సంకల్పవికల్పములు ఆధిభౌతికము. చంద్రుఁడు ఆధిదైవతము.
బుద్ధి ఆధ్యాత్మికము. నిశ్చయము ఆధిభౌతికము. బృహస్పతి ఆధిదైవతము.
చిత్తము ఆధ్యాత్మికము. చంచలము ఆధిభౌతికము. క్షేత్రజ్ఞుఁడు ఆధిదైవతము.
అహంకారము ఆధ్యాత్మికము. అభిమానము ఆధిభౌతికము రుద్రుఁడు ఆధిదైవతము,
సమానవాయువు ఆధ్యాత్మికము. పచనము ఆధిభౌతికము జయుఁడు ఆధిదైవతము.
వ్యానవాయువు ఆధ్యాత్మికము, తిన్న అన్నరసములను అన్నినరములకును పంచిపెట్టుట ఆధిభౌతికము. విశ్వయోని ఆధిదైవతము.
ఉదానవాయువు ఆధ్యాత్మికము. ఇష్టపదార్థభక్షణము ఆధిభౌతికము. అజుఁడు ఆధిదైవతము.
ప్రాణవాయువు ఆధ్యాత్మికము. ఉచ్ఛ్వాసనిశ్వాసములచేత సంచరించుట ఆధిభౌతికము. విశిష్టుఁడు ఆధిదైవతము.
అపానము ఆధ్యాత్మికము. వెలుపలికి వెళ్లఁద్రోయుట ఆధిభౌతికము. విశ్వకర్త ఆధిదైవతము.
శ్రోత్రము ఆధ్యాత్మికము. చతుర్విధశబ్దగ్రహణము ఆధిభౌతికము. దిక్సమూహము ఆధిదైవతము.
త్వక్కు ఆధ్యాత్మికము. పంచవిధస్పర్శగ్రహణము ఆధిభౌతికము. వాయువు ఆధిదైవతము.
చక్షువు ఆధ్యాత్మికము. దశవిధరూపగ్రహణము ఆధిభౌతికము. సూర్యుఁడు ఆధిదైవతము.
జిహ్వ ఆధ్యాత్మికము. సప్తవిధరసగ్రహణము ఆధిభౌతికము. వరుణుఁడు ఆధిదైవతము.
ఘ్రాణము ఆధ్యాత్మికము. త్రిగంధముల గ్రహించుట ఆధిభౌతికము. అశ్వినులు ఆధిదైవతము.
శబ్దము ఆధ్యాత్మికము. ఏకదేశశబ్దగ్రహణముఆధిభౌతికము. సదాశివుఁడు ఆధిదైవతము.
స్పర్శము ఆధ్యాత్మికము. ఏకదేశస్పర్శగ్రహణము ఆధిభౌతికము. ఈశ్వరుఁడు ఆధిదైవతము.
రూపము ఆధ్యాత్మికము ఏకదేశరూపగ్రహణము ఆధిభౌతికము. రుద్రుఁడు ఆధిదైవతము.
రసతన్మాత్రము ఆధ్యాత్మికము. ఏకదేశరసగ్రహణము ఆధిభౌతికము. విష్ణువు ఆధిదైవతము.
గంధతన్మాత్రము ఆధ్యాత్మికము. ఏకదేశగంధగ్రహణము ఆధిభౌతికము. బ్రహ్మ ఆధిదైవతము.

వాక్కు ఆధ్యాత్మికము. పుణ్యపాపమిశ్రసంభాషణము ఆధిభౌతికము. అగ్ని అధిదైవతము. పాణి ఆధ్యాత్మికము. దానప్రతిగ్రహములు ఆధిభౌతికము. ఇంద్రుఁడు అధిదైవతము. పాదము ఆధ్యాత్మికము. గమనాగమనములు ఆధిభౌతికము. ఉపేంద్రుఁడు అధిదైవతము. గుహ్యము ఆధ్యాత్మికము. సంయోగానందము ఆధిభౌతికము. బ్రహ్మ అధిదైవతము. పాయువు ఆధ్యాత్మికము. విసర్జనము ఆధిభౌతికము. మృత్యువు అధిదైవతము.

"శ్రు. ఏతేవాదిత్యేకాదశస్థాః పృథివ్యామష్ట్యేకాదశస్థాప్సుసదో మహినైకాదశస్థాస్తే దేవా యజ్ఞమిమం జుషధ్వమ్." అను శ్రుతిప్రమాణముచేత ఈయాధిభౌతికములే భూలోకము తామసస్ఋష్టి ఆసురీసంపద. 'భూః'అనువ్యాహృతి గాయత్రియందలి ప్రథమపాదము. ఈఆధ్యాత్మికములే భువర్లోకము రాజసస్ఋష్టి. మానుషీసంపద. 'భువః' అనువ్యాహృతి. గాయత్రిద్వితీయపాదము. ఈ అధిదైవతములే సువర్లోకము. సాత్త్వికసృష్టి. దైవీసంపద, 'సువః' అనువ్యాహృతి. గాయత్రితృతీయపాదము. ఇప్పుడు చెప్పినవి తప్ప మిగిలిన నఖశిఖపర్యంతమైన శరీరమందలి సకలావయవముల యొక్కయు వెంట్రుకలు ఎముకలు నరములు ప్రేగులు, కండలు నెత్తురు, మెదడు మొదలగువానియొక్కయు, మనోవృత్తులగు కామము మొదలగు దుర్వృత్తుల సువృత్తుల యొక్కయు ఆధిభౌతిక ఆధ్యాత్మిక అధిదైవతములను తెలిసి యీదేహమును సకలదేవతామయ మని యెఱిఁగి సర్వసాక్షీనతామయుఁడును, విలక్షణుఁడును అయిన కూటస్థబ్రహ్మము తా ననెడి స్థిరత గలిగి యానందించువాఁడే బ్రహ్మవేత్త. "శ్రు. యావతీర్వై దేవతాస్తాస్సర్వా వేదవిది బ్రాహ్మణే వసంతి." అను శ్రుత్యర్థప్రకారము గ్రహింపవలయును. ఈగుట్టును పట్టుదలగా విచారింపక ఆధిభౌతిక ఆధ్యాత్మిక అధిదైవతముల తాపత్రయములచే కొట్టుపడి మట్టుమీఱిన జన్మపరంపరలలో తట్టుపడువాఁడే మూఢుఁడు. ఇదే వేదాంతశాస్త్రసిద్ధాంతము. ఇదే జీవేశ్వర జగత్సృష్టిక్రమము.

## పృథివీభూతపంచీకరణతత్త్వలయము.

పృథివియందలి అర్ధభాగముయొక్క నాలుగుభాగములలో ఒకభాగము ఆకాశమందలి అర్ధభాగముయొక్క నాలుగుభాగములలో నొకభాగముతో చేరి వాగింద్రియమాయెను. ఇది ఆ ఆకాశమునువిడిచి తనఅర్ధభాగమందుచేరెనేని వాగింద్రియములయించును.

పృథివియందలి అర్ధభాగముయొక్క నాలుగుభాగములలో ఒకభాగము వాయువునందలి అర్ధభాగముయొక్క నాలుగు భాగములలో ఒకభాగముతో చేరి హస్తేంద్రియ మయ్యెను. ఇది ఆవాయువును విడిచి తన అర్ధభాగమందు కూడెనేని హస్తేంద్రియము లయించును.

పృథివియందలి అర్ధభాగముయొక్క నాలుగుభాగములలో ఒకభాగము అగ్నియందలి అర్ధభాగముయొక్క నాలుగుభాగములలో ఒకభాగముతో చేరి పాదేంద్రియ

మారెను. ఇది ఆయగ్నినివిడిచి తన అర్ధభాగమందు కలిసెనేని పాదేంద్రియముపోవును.

పృథివియందలి అర్ధభాగముయొక్క నాలుగుభాగములలో ఒకభాగము జలమందలి అర్ధభాగముయొక్క నాలుగుభాగములలో ఒకభాగముతో చేరి గుహ్యేంద్రియ మారెను. ఇది యీజలమును విడిచి తన అర్ధభాగమందు కూడెనేని గుహ్యేంద్రియము లయించును.

పృథివియందలి సమష్టిభాగమైన అర్ధభాగము పాయ్వింద్రియ మారెను. దీనియందు తనవ్యష్టిభాగమైన అర్ధభాగమున మరల కలిసెనేని పాయ్వింద్రియము పోయి పృథివీభూత మగును.

## జలభూతపంచీకరణతత్త్వలయము.

జలమందలి అర్ధభాగముయొక్క నాలుగుభాగములలో ఒకభాగము ఆకాశమందలి అర్ధభాగముయొక్క నాలుగుభాగములలో ఒకభాగముతో చేరి శబ్దతన్మాత్ర మారెను. ఇది యీయాకాశమును విడిచి తన అర్ధభాగమందు చేరనేని శబ్దతన్మాత్రము నశించును.

జలమందలి అర్ధభాగముయొక్క నాలుగుభాగములలో ఒకభాగము వాయువందలి అర్ధభాగముయొక్క నాలుగుభాగములలో ఒకభాగముతో చేరి స్పర్శతన్మాత్ర మయ్యెను. ఇది యీవాయువును విడిచి తన అర్ధభాగమందు కలిసెనేని స్పర్శతన్మాత్రము లయించును.

జలమందలి అర్ధభాగముయొక్క నాలుగుభాగములలో ఒకభాగము అగ్నియందలి అర్ధభాగముయొక్క నాలుగుభాగములలో ఒకభాగముతో చేరి రూపతన్మాత్ర మారెను. ఇది యీయగ్నిని విడిచి తన అర్ధభాగమందు కూడెనేని రూపతన్మాత్రము లయించును.

జలమందలి అర్ధభాగముయొక్క నాలుగుభాగములలో ఒకభాగము పృథివియందలి అర్ధభాగముయొక్క నాలుగుభాగములలో ఒకభాగముతో చేరి గంధతన్మాత్ర మయ్యెను. ఇది యీపృథివిని విడిచి తన అర్ధభాగమందు చేరెనేని గంధతన్మాత్రము లయించును.

జలమందలి సమష్టిభాగమైన అర్ధభాగము రసతన్మాత్ర మారెను. దీనియందలి తనవ్యష్టిభాగమైన అర్ధభాగము తిరుగ చేరెనేని రసతన్మాత్రము పోయి జలభూత మగును.

## అగ్నిభూతపంచీకరణతత్త్వలయము.

అగ్నియందలి అర్ధభాగముయొక్క నాలుగుభాగములలో ఒకభాగము ఆకాశ

మందలి అర్ధభాగముయొక్క నాలుగుభాగములలో ఒకభాగముతో చేరి శ్రోత్రేంద్రియ మాయెను. ఇది యీ ఆకాశభూతమును విడిచి తన అర్ధభాగమందు చేరకేని శ్రోత్రేంద్రియము నశించును.

అగ్నియందలి అర్ధభాగముయొక్క నాలుగుభాగములలో ఒకభాగము వాయువునందలి అర్ధభాగముయొక్క నాలుగుభాగములలో ఒకభాగముతో చేరి త్వగింద్రియమయ్యెను. ఇది యీ వాయువును విడిచి తన అర్ధభాగమందు చేరకేని త్వగింద్రియము లయించును.

అగ్నియందలి అర్ధభాగముయొక్క నాలుగుభాగములలో ఒకభాగము జలమందలి అర్ధభాగముయొక్క నాలుగుభాగములలో ఒకభాగముతో చేరి జిహ్వేంద్రియమయ్యెను. ఇది యీజలమును విడిచి తన అర్ధభాగమందు చేరకేని జిహ్వేంద్రియము లయించును.

అగ్నియందలి అర్ధభాగముయొక్క నాలుగుభాగములలో ఒకభాగము పృథివియందలి అర్ధభాగముయొక్క నాలుగుభాగములలో ఒకభాగముతో చేరి ఘ్రాణేంద్రియ మాయెను. ఇది యీపృథివిని విడిచి తన అర్ధభాగమందు కూడకేని ఘ్రాణేంద్రియము లయించును.

అగ్నియందలి సమష్టిభాగమైన అర్ధభాగము చక్షురింద్రియ మాయెను. దీనియందు తన వ్యష్టిభాగమైన అర్ధభాగము చేరకేని చక్షురింద్రియము పోయి అగ్నిభూత మగును.

## వాయుభూతపంచీకరణ తత్త్వలయము.

వాయువునందలి అర్ధభాగముయొక్క నాలుగుభాగములలో ఒకభాగము ఆకాశమందలి అర్ధభాగముయొక్క నాలుగు భాగములలో ఒకభాగముతో చేరి సమానవాయువయ్యెను. ఇది యీ ఆకాశమునువిడిచి తన అర్ధభాగమందు కలిసికేని సమానవాయువు లయించును.

వాయువునందలి అర్ధభాగముయొక్క నాలుగు భాగములలో ఒకభాగము అగ్నియందలి అర్ధభాగముయొక్క నాలుగుభాగములలో ఒకభాగముతో చేరి ఉదానవాయువు అయ్యెను. ఇది యీ అగ్నిని విడిచి తన అర్ధభాగమందు కలిసికేని ఉదానవాయువు నశించును.

వాయువునందలి అర్ధభాగముయొక్క నాలుగుభాగములలో ఒకభాగము జలమందలి అర్ధభాగముయొక్క నాలుగుభాగములలో ఒకభాగముతో చేరి ప్రాణవాయువయ్యెను. ఇది జలమునువిడిచి తన అర్ధభాగమందు కూడకేని ప్రాణవాయువు లయించును.

వాయువునందలి అర్ధభాగముయొక్క నాలుగుభాగములలో ఒకభాగము పృథివి యందలి అర్ధభాగముయొక్క నాలుగుభాగములలో ఒకభాగముతో చేరి అపానము అయ్యెను. ఇది యీ పృథివిని విడిచి తన అర్ధభాగమందు కూడెనేని అపానము లయించును.

వాయువునందలి సమష్టిభాగమైన అర్ధభాగము వ్యానవాయువయ్యెను. దీనియందు తన వ్యష్టిభాగమైన అర్ధభాగము కలిసెనేని వ్యానవాయువు పోయి వాయుభూత మగును.

## ఆకాశభూతపంచీకరణతత్త్వోదయము.

ఆకాశమందలి అర్ధభాగముయొక్క నాలుగుభాగములలో ఒకభాగము వాయువు నందలి అర్ధభాగముయొక్క నాలుగుభాగములలో ఒకభాగముతో చేరి మనస్సు అయ్యెను. అది యీ వాయువును విడిచి తన అర్ధభాగమందు చేరనేని మనస్సు లయించును.

ఆకాశమందలి అర్ధభాగముయొక్క నాలుగు భాగములలో ఒకభాగము అగ్ని యందలి అర్ధభాగముయొక్క నాలుగుభాగములలో చేరెనేని బుద్ధి అయ్యెను. ఇది యీ యగ్నిని విడిచి తన అర్ధభాగమందు కూడెనేని బుద్ధి లయించును

ఆకాశమందలి అర్ధభాగముయొక్క నాలుగుభాగములలో ఒకభాగము జలమం దలి అర్ధభాగముయొక్క నాలుగుభాగములలో ఒకభాగముతోఁగూడి చిత్తమాయెను. ఇది యీజలమును విడిచి తన అర్ధభాగమందు కలిసెనేని చిత్తము లయించును.

ఆకాశమందలి అర్ధభాగముయొక్క నాలుగుభాగములలో ఒకభాగము పృథివి యందలి అర్ధభాగముయొక్క నాలుగుభాగములలో ఒకభాగముతో చేరి అహంకార మాయెను. ఇది యీపృథివిని విడిచి తన అర్ధభాగమందు కూడెనేని అహంకారము లయించును.

ఆకాశమందలి సమష్టిభాగమైన అర్ధభాగము జ్ఞాత అయ్యెను. దీనియందు తన వ్యష్టిభాగమైన అర్ధభాగము కూడెనేని జ్ఞాత అనునది పోయి ఆకాశభూత మగును.

ఈ పృథివియును జలమును అగ్నియును వాయువును ఆకాశమును పంచీకృతము లైనతామస స్థూలభూతములై యిరువదియైదు తత్త్వములై యిట్లు నిలుచును.

## సూక్ష్మశరీర తత్త్వోదయము.

స్థూలశరీరము కర్మజ మగుటవలన కర్మము క్షీణించెనేని స్థూలదేహమును క్షీణిం చును. సూక్ష్మదేహము సహజ మగుటవలన కత్తులచేత నఱకఁబడక నీళ్లచేత నానక నిప్పు చేత కాలక గాలిచేత శోషింపఁబడక వృత్తిప్రళయ, నిత్యప్రళయ, దేహప్రళయ, మనుప్రళయ, బ్రహ్మప్రళయ, విష్ణుప్రళయ, రుద్రప్రళయ, ఈశ్వరప్రళయ, సదా

శివప్రళయ, విరాట్పురుష ప్రళయములయందును చెడక విదేహముక్తిపర్యంతము ఉండును. ఇది చెడినఁగాని ముక్తికలఁగదు. ముక్తికోరినవాఁడు దీనిని ముందుగా చెఱుపుఁగోరక కారణశరీరమును చెఱుపవలెను. అది భ్రాంతిజ మగుటవలన అపరోక్షబ్రహ్మసాక్షాత్కారజ్ఞానముచేత భ్రాంతిని నశింపఁజేసినేని భ్రాంతివలన కలిగిన కారణశరీరమును నశించును. మఱి యీసూక్ష్మదేహము పైనఁజెప్పిన ప్రళయములయందు నశింపక కారణశరీరమందు చేరి కారణశరీరభ్రమ నివారించుదాఁక కాలకర్మవశములచేత మాటిమాటికి పుణ్యపాప మిశ్ర కర్మలభ్యములగు దేవ పశు పక్షి క్రిమిజలచర స్థావర మానుష స్థూల శరీరములతో కూడుచు వీడుచు ఉండును. కారణశరీర భ్రమ నివారించువేళ కారణ శరీరము నశింపఁగానే కారణ శరీరమందును నిల్వ చోటులేక స్థూలశరీరమందును నిల్వ తావులేక స్వస్వరూపహితమగు విష్ణుచందమున లయించును. అప్పు డాశరీరతత్త్వములు సమష్టివ్యష్టి భేదములతోడ క్షీణించి సత్త్వరజో భూతతన్మాత్రములై యుండును.

## భూతలయము.

మలినసత్త్వప్రధాన ప్రకృతియొక్క సత్త్వరజస్తమోగుణములు మూఁడును పంచభూతములతో కూడుటవలన సాత్త్వికపంచభూతము లని రాజసపంచభూతము లని తామసపంచభూతము లని మూఁడువిధము లగును. ఆమలిన సత్త్వప్రధాన ప్రకృతి బ్రహ్మవిచారణయందు అంతర్ముఖము గలదగును. అప్పుడు గుణవిజృంభణము అణఁగును. అందున పంచభూతములు త్రిగుణములతోడి కలయిక మాని తొలుత కలిగినవి కలిగినతీరువనే సూక్ష్మాతిసూక్ష్మభూతములై నిలుచును.

## సూక్ష్మాతిసూక్ష్మ పంచభూతలయము.

ప్రళయకాలములయందును బ్రహ్మనిష్ఠయందును పంచభూతములు లయించును. ప్రళయకాల భూతలయమువలన జన్మములకు కారణములైన ఆగామిసంచిత ప్రారబ్ధకర్మములు లయింపక ప్రళయాంతములయందు మరల జన్మములఁ గలుగఁజేయును. బ్రహ్మవిచారమువలన పంచభూతములును జన్మకారణములైన త్రివిధకర్మములను లయించుటవలన ముక్తి లగుదురు.

ప్రళయకాలసముద్రమందు మట్టిపెళ్ల కలిసి తనరూపము చెడినట్లు నూఱంతలు హెచ్చుగాఁగల జలమందు ఒకభాగమైన భూమి చేరి భూమి యనుపేరు పోయి జలభూతము నిలుచును.

కాలిన యినుపముద్దమీఁద నీటిచినుకు పడి నశించినట్లు నూఱుపాళ్లు హెచ్చుగాఁగల అగ్నియందు ఒక్క భాగమైన జలము చేరి నశించి అగ్నిభూతము నిలుచును.

మహావాయువుచేత దీపము చల్లాఱినట్లు నూఱంశలు హెచ్చుగాఁగల వాయువు నందు ఒకపాలైన అగ్ని చేరి లయించి వాయుభూతము నిలుచును.

ముక్కులోనిగాలి వెలుపలికి వచ్చి తెలియనట్లు నూఱుమడుఁగులు హెచ్చుగాఁగల ఆకాశమందు ఒకభాగమైన వాయువు చేరి వాయువనెడు పేరు చెడి ఆకాశభూతము నిలుచును.

కాఱుచీఁకటియందు మిన్నుమన్నులు కన్నులకు తెలియనట్లు నూఱంశములు హెచ్చుగాఁగల విక్షేపశక్తియందు ఒకపాలైన ఆకాశము లయించి విక్షేపశక్తి నిలుచును.

## ప్రకృతిలయము.

చిదాభాసరూపమైన మలినసత్త్వప్రధాన ప్రకృతిగుణములగు సత్త్వరజస్తమస్సులు మాయ అవిద్య ఆవరణశక్తు లనెడు పేళ్లుగలవై వెలయును. పరబ్రహ్మచ్ఛాయ మాయ అవిద్య ఆవరణశక్తులయందు ప్రతిబింబించుటచేత ఈశ్వరుఁడును జీవసమూహమును వీరికి భోగసాధనములను గలుఁగఁజేయుటకు కారణమైనవిక్షేపశక్తియును తోఁచెను. ఇట్టిమలినసత్త్వప్రధాన ప్రకృతి అచిత్తగుటవలన విచారదృష్టియందు మిథ్యాభూతమై తనకుజన్మస్థానమైన చిత్ప్రకృతియందు తనత్రిగుణములతో నొకలియఁగా అప్పుడు ఈశ్వర జీవ విక్షేపములు మూఁడును క్షీణించి అమల సత్త్వప్రధానయగు చిత్ప్రకృతి నిలుచును. అది సద్రూపుఁడును అస్మచ్ఛబ్దఆత్మశబ్దబ్రహ్మశబ్ద వాచ్యుఁడును స్వజాతీయ విజాతీయ స్వగత భేదశూన్యుఁడును స్త్రీపున్నపుంసకలింగరహితుఁడును సర్వ కార్యకారణ విలక్షణుఁడును కేవల నిర్గుణుఁడును అగు పరమాత్మయందు లయించును. ప్రకాశోష్ణశక్తులును అగ్నియును ఒక్కటే యైనట్లు ఈచిత్ప్రకృతియును చిద్రూప పరబ్రహ్మమును ఒక్కటే యని తలఁచవిచానికి ‹‹శ్రు. ద్వైతం సంసారమిత్యాహురద్వైతం పరమార్థతః›› అను ప్రమాణమునకు విరోధముగా అద్వైతసిద్ధి గలుగక ద్వైతమే ప్రాప్తించును కాఁబట్టి ‹‹శ్రు. ఏకమేవాద్వితీయం బ్రహ్మ›› అను శ్రుత్యర్థము నెఱిఁగి చిద్రూపిణియగు ప్రకృతియును అస్మచ్ఛబ్ద వాచ్యుఁడైన సద్రూపపర బ్రహ్మమును ఒక్కటే యనియును ఆపరబ్రహ్మమే తాననియును తలఁచి అష్టవిధానందములలో శ్రేష్ఠమైన ముఖ్యానందమును పొందువాఁడే ముక్తుఁ డని వేదాంతసిద్ధాంతము.

## దశవిధప్రళయవివరణము.

వృత్తిప్రళయము:—ప్రాణుల పుణ్యపాపమిశ్రకర్మఫలప్రాప్తి పరబ్రహ్మస్వరూపమయిన నిరాకార చిదాకాశమందు అణఁగియుండి జీవుల అదృష్టానుసారముగ కాల కర్మానుగుణ్యముచేత సముద్రమున అలలు బుగ్గలు తుంపురులును పుట్టుచు అణఁగుచు నుం డునట్లు చిదాకాశమున ప్రాప్తాప్రాప్తముగ వృత్తులు పుట్టుచు గిట్టుచు నుండును. అపుట్టి గిట్టెడియేమిలేని ఎట్టి బట్టబయలే వృత్తిప్రళయము.

అవస్థాప్రళయము:—అన్నత్రయము బలిసి అనేక వ్యవహారములను చేయుటకు జీవులకాలకర్మవశమున జాగ్రత్స్వప్నావస్థలుగల స్థూలసూక్ష్మశరీరములను పొంది వెలుపలికి వచ్చి వ్యాపించుచు లోపించుచు ఉండును. ఆలోపించినయెడమే నిద్ర. ఆనిద్రయే నిత్యప్రళయము.

శరీరప్రళయము:—పిమ్మట అన్నత్రయము ప్రబలి జాగ్రదాద్యవస్థలతోఁగూడి నిమేషము కాష్ఠ కల క్షణము ముహూర్తము అహోరాత్రము అనునవి గలిగినది దినము. అట్టి దినము పక్షము మాసము ఋతువు అయనము అనువానితోఁ గూడినది సంవత్సరము. అట్టిసంవత్సరముల మితిప్రకారము జీవించి మృతి నొందుటే శరీరప్రళయము.

మనుప్రళయము:—శుక్లకృష్ణపక్షములే అహోరాత్రములుగాఁగల పితృదేవతల యొక్క ఒక దినము మనుష్యులకు ఒకమాసము. అట్టిమాసములు పండ్రెండయ్యేనేని మనుష్యులకు ఒకసంవత్సరము. అదే దేవతలకు ఒక దినమగును. అట్టి దినములు మున్నూటయఱువది అయ్యేనేని దేవతలకు సంవత్సరమగును. అవి పండ్రెండువేలు కడచెనేని పదియేడులక్షల యిరువదియెనిమిదివేల సంవత్సరములుగల కృతయుగమును పండ్రెండులక్షల తొంబదియాఱువేలసంవత్సరములుగల త్రేతాయుగంబును ఎనిమిదిలక్షల అఱువది నాలుగువేల సంవత్సరములుగల ద్వాపరయుగంబును నాలుగులక్షల ముప్పదిరెండువేల సంవత్సరములుగల కలియుగంబును కడచును. ఆనాలుగుయుగములును గూడినదే ఒకమహాయుగము. అవి డెబ్బదియొకటి అయ్యేనేని ఒకమనువు చచ్చును. ఇదే మనుప్రళయము.

బ్రహ్మప్రళయము:—అట్టిమన్వంతరములు పదునాలుగు కడచెనేని చతుర్ముఖబ్రహ్మకు ఒకపగలగును. ఆపగటిలో స్వాయంభువ, స్వారోచిష, ఉత్తమ, తామస, రైవత, చాక్షుష, వైవస్వత, సూర్యసావర్ణి, దక్షసావర్ణి, బ్రహ్మసావర్ణి, ధర్మసావర్ణి, భద్రసావర్ణి, దేవసావర్ణి, ఇంద్రసావర్ణి అనెడు పదునలుగురుమనువులును లయింతురు. ఇఁక నంతకాలము కడచెనేని బ్రహ్మకు రాత్రి యగును. ఇందులో పగలు ఉదయకల్ప మని రాత్రి క్షయకల్ప మని చెప్పఁబడును. ఇట్టి దినములు మున్నూటఅఱువది యయ్యేనేని బ్రహ్మకు ఒక సంవత్సర మగును. అట్టి సంవత్సరములు నూఱు కడచెనేని బ్రహ్మప్రళయ మగును.

విష్ణుప్రళయము:—బ్రహ్మజీవితకాలము విష్ణువునకు ఒకమాసము. అట్టిమాసములు పండ్రెండు కూడినది ఒకసంవత్సరము. అట్టి సంవత్సరములు నూఱు కడచెనేని విష్ణువు మరణించును విష్ణుప్రళయములోపల బ్రహ్మ లనేకు లగుదురు.

రుద్రప్రళయము:—విష్ణువుయొక్క జీవితకాలము రుద్రమూర్తికి ఒకదిన మగును. అట్టి దినములు మున్నూటఅఱువది కూడినది ఒకసంవత్సరము. అట్టి సంవత్సరములు

నూరైన రుద్రుఁడు మృతి నొందును. ఆరుద్రునిజీవితకాలములోపల ననేకవిష్ణువులు పుట్టి గిట్టుదురు. ఇదే రుద్రప్రళయము.

మహేశ్వరప్రళయము:—రుద్రునిమూర్తిఆయుష్య మంతయు మహేశ్వరునకు ఒకజాము. అట్టి జాములు ఎనిమిది కలది ఒకదినము. అట్టి దినములు ముప్పది కలది ఒక్క నెల. అట్టి నెలలు పండ్రెండయిన సంవత్సరము. అట్టి సంవత్సరములు నూరైన మహేశ్వరుఁడు లయించును. ఆమహేశ్వరుని జీవితకాలములోపల రుద్రు లనేకులు పుట్టి గిట్టుదురు.

సదాశివప్రళయము:—మహేశ్వరుని ఆయు స్సంతయు సదాశివునకు రెండు గడియలకాలము. దీనినే ముహూర్త మందురు. అట్టి ముహూర్తములు ముప్పది కలది దినము. అట్టి దినములు మున్నూట అఱువది కలని సంవత్సరము. అట్టి సంవత్సరములు నూఱయ్యేని సదాశివుఁడు లయించును. అతని ఆయుస్సులోఁగా అనేక మహేశ్వరులు పుట్టి గిట్టుదురు. ఇదే సదాశివప్రళయము.

## విరాట్పురుషప్రళయము.

సదాశివుని ఆయుఃప్రమాణ మంతయు విరాట్పురుషునకు ఒక్కక్షణ మగును. అట్టిక్షణములు మున్నూటఅఱువది గలది ఒకదినము. అట్టిదినములు మున్నూట అఱువది గలది సంవత్సరము. అట్టి సంవత్సరములు నూఱయ్యేని మాయాప్రతిబింబేశ్వరుఁడైన విరాట్పురుషుఁడు నశించును. అతనిజీవితకాలములోపల అనేకసదాశివులు ఉదయించి లయింతురు. ఇదే విరాట్పురుషప్రళయము. ఇట్టి ప్రళయములు చిదచిత్స్వరూపిణియగు మూలప్రకృతియందుఁ గలుగుచు మణఁగుచు ఉండును. బ్రహ్మనిష్ఠగల మహాపురుషుఁడు ప్రకృతిని లయింపఁజేసి పరబ్రహ్మమై వెలుఁగును.

## పంచభూతబీజ వివరణము.

సీ. "నిలువుగీటులుఁ పది నిలిపి రేఖాషట్క, మడ్డంబుగా గీచి యాదిలిపులఁ
తొలిదొంతి క్రిందు క్రిందుల రెండురెండిడి, రెండవదాన నొండొండుఁ గూర్చి
కడపలిప్రాణంబు కడగమున్న లిఖించి, హెచ్చు లాదానిపైయింట నిలిపి
తరువాతిదొంతుల ధామంబులను గాదు, లొక్కటొక్కటి క్రమమొప్ప వ్రాసి
యడ్డముగఁ జూచె నయ్యె వా తొగ్నిభూమి, జలఖబీజంబు లివి కావ్యములకు మొదల
నిలుప ఖేదార్తిధనహర్ష నిధనంబు, లొసగుఁ గర్తకు భర్తకు నుదధిశయన."

ఇట్లు అప్పకవీయమందు.—

అ ఆ ఏ క చ ట త ప య ష యివి పదియును వాయుబీజాక్షరములు.
ఇ ఈ ఐ ఖ ఛ ఠ థ ఫ ర స యివి పదియును అగ్నిబీజాక్షరములు.

ఈ ఊ ఓ గ జ డ ద బ ల హ యివి పదియును భూమిబీజాక్షరములు.

ఋ ౠ ఔ ఘ ఝ ఢ ధ భ వ ళ యివి పదియును జలబీజాక్షరములు.

ఌ ౡ అం ఙ ఞ ణ న మ శ అః యివి పదియును గగనబీజాక్షరములు.

వీనిలో అకారాది షోడశస్వరములును జీవాక్షరములును యకారాది దశాక్షరములును ప్రాణమాతృకాబీజాక్షరములును ఔటచేత వీనిని త్రోయఁగా తక్కిన యిరువదియైదు వర్ణములును యిరువదియైదుతత్త్వము లని సమయవాదులు అందఱును నిర్ణయించి యుండుటచేత వీనికి పంచభూతబీజప్రకాశముగ పంచీకరణము వ్రాయఁబడుచున్నది.

## పంచభూతబీజపంచీకరణము.

### ఆకాశబీజపంచీకరణము.

మకారము జ్ఞాత, చేతనుఁడు.

నకారము మనస్సు.

ణకారము బుద్ధి.

ఞకారము చిత్తము

ఙకారము అహంకారము.

### వాయుబీజపంచీకరణము.

పకారము సమానవాయువు.

తకారము వ్యానవాయువు.

టకారము ఉదానవాయువు.

చకారము ప్రాణవాయువు.

ణకారము అపానము.

### అగ్నిబీజ పంచీకరణము.

ఫకారము శ్రోత్రము.

థకారము త్వక్కు.

ఠకారము చక్షువు.

ఛకారము జిహ్వ.

ఖకారము ఘ్రాణము.

### జలబీజపంచీకరణము.

భకారము శబ్దము.

ధకారము స్పర్శము.

ఢకారము రూపము.

ఝకారము రసము.

ఘకారము గంధము.

### పృథివీబీజపంచీకరణము.

బకారము వాక్కు.

దకారము హస్తము.

డకారము పాదము.

జకారము గుహ్యము.

గకారము వాయువు.

## మఱియొకవిధమైన స్థూలశరీర పంచీకరణము.

ఆకాశపంచీకరణము. ॥శ్లో॥ కామః క్రోధ స్తథా లోభో భయం మోహనమేవ చ, ఆకాశస్య గుణాః ప్రోక్తా స్సమాంశాః పరికీర్తితాః॥ తా. కోరిక కోపము లోభము భయము మోహనము ఈయైదును ఆకాశపంచకము.

వాయుపంచీకరణము. ॥శ్లో॥ ధావనం చలనం చైవ కుంచాకుంచ ప్రసారణమ్, వాయోః పంచ గుణాః ప్రోక్తాః సమాంశాః పరికీర్తితాః॥ తా. పరుగెత్తుట పాఁకుట ఆకుంచనప్రసారణముల ముడుచుట చాఁచుట ఈయైదును వాయుపంచకము.

అగ్నిపంచీకరణము. ॥శ్లో॥. క్షుధా తృష్ణా తథా నిద్రా చాలస్యం సంగమం తథా అగ్నేః పంచ గుణాః ప్రోక్తాస్సమాంశాః పరికీర్తితాః॥ తా. ఆఁకలి దప్పి నిద్ర ఆలస్యము సంగమము ఈఅయిదును అగ్నిపంచకము.

జలపంచీకరణము. ॥శ్లో॥. లాలా మూత్రం తథా స్వేదః శుక్లం శోణితమేవ చ, అపః పంచవిధాః ప్రోక్తాః జ్ఞాతవ్యంచ ప్రయత్నతః॥ తా. చొంగ మూత్రము చెమట రేతస్సు నెత్తురు ఈఅయిదును జలపంచకము.

పృథివీపంచీకరణము. ॥శ్లో॥. అస్థిమాంసత్వచో నాడీ రోమం చైవతు పంచకమ్, క్షితేః పంచగుణాః ప్రోక్తాః సమాంశాః పరికీర్తితాః॥. తా. ఎముకలు మాంసము చర్మము నరములు వెండ్రుకలు ఈఐదును పృథివీపంచకము; ఈయిరువదియయిదుతత్త్వములతోఁ గూడినదే స్థూలశరీరము.

అవ.—జీవేశ్వరులకు పేళ్లు తప్ప తక్కిన స్థూలసూక్ష్మ శరీరములు మొదలగునవి ఒక్కటే అయ్యేనని వారిని ఏతీరున ఎఱుఁగవచ్చునని చెప్పుచున్నారు.

మ. ఘనుఁ డొనీశున కల్పజీవునకు జాగ్రత్స్వప్నదేహాదు లొం
డనఁ దద్భేద మెఱుంగు టెట్లులు మదీయాచార్య చిత్తభ్రమం
బు నివారింపు మనం గుమార గను ముద్బుద్ధిఁ ద్వయోపాధులై
దనరుం గారణకార్యభేదములచేఁ దత్కృత్యముల్ పొల్పుగన్.

టీ. మదీయాచార్య=నాగురుమూర్తి, ఘనుఁడు=సర్వోత్కృష్టుఁడు, ఔనీశున కున్=అయిన యీశ్వరునకును, అల్పజీవునకున్=పామరుఁడైన జీవునకును, జాగ్రత్స్వప్నదేహాదులు-జాగ్రత్=జాగ్రదవస్థయందలి, స్వప్న=స్వప్నావస్థయందలి, దేహ=స్థూలసూక్ష్మదేహములు, ఆదులు = అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ కోశములు మొదలగునవి, ఒండనన్=ఒక్కటే అంటిరేని, తద్భేదము=ఆయీశ్వరజీవుల తారతమ్యమును, ఎఱుంగుట=తెలిసికొనుట, ఎట్లులు=ఏప్రకారము, చిత్తభ్రమంబు=మనశ్చంచలమును, నివారింపుము = పోఁగొట్టుము. అనన్=అని పలుకఁగా, కుమార=పుత్రా, తత్కృత్యముల్ = ఆజీవేశ్వరులకార్యములు, ద్వయోపాధులై = మాయావిద్యలనెడు ఉపాధులుగలవై, కారణ కార్యభేదములచేన్-కారణ=కారణోపాధి యనెడు, కార్య=కార్యోపాధియనెడు, భేదములచేన్=విభాగములచేత, తనరున్=ఆజీవేశ్వరుల భేదములు ప్రకాశించును, పొల్పుగన్ = చక్కఁగా, ఉద్బుద్ధిన్=విజ్ఞానముచేత, కను=ముద్రష్టవై చూడుము.

తా. ఓగురుస్వామీ! సర్వజ్ఞత్వము, సర్వేశ్వరత్వము, సర్వాంతర్యామిత్వము, సర్వస్వతంత్రత్వము మొదలగు మహాగుణములుగల యీశ్వరునకును నేను సాక్షిని,

దుఃఖిని, మూఢుఁడను, దరిద్రుఁడను అనునివి మొదలగు స్వల్పగుణములుగల జీవున కును, జాగ్రదవస్థయును, అన్నమయకోశమును, స్థూలదేహమును, స్వప్నావస్థయును; ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశములును, సూక్ష్మశరీరమును, ఒక్కటియే యని ఆనతిచ్చితిరి. అట్లైన జీవేశ్వరుల తారతమ్యములు ఏతీరున ఎఱుఁగవచ్చును అని శిష్యుఁడు పలుకఁగా గురువులు ఓయి శిష్యుఁడా! వ్యష్టిరూపముగల జీవుఁడు కార్య రూపమైన అవిద్యోపాధిగలవాఁడును సమష్టిరూపముగల యీశ్వరుఁడు కారణరూప మైన మాయోపాధిగలవాఁడును గనుక యీభేదములచేత జీవేశ్వరులను తెలిసికొమ్మని చెప్పిరని తాత్పర్యము.

అవ.—శిష్యుఁడు వ్యష్టి సమష్టిభేదములను అడుగఁగా గురువులు దృష్టాంతపూ ర్వకముగ చెప్పుచున్నారు.

చ. వనము సమష్టి వ్యష్టి కుభవం బగుమాడ్కిఁ జరాచరప్రచే
తనసముదాయ మంతయు వదాన్య సమష్టి యగుం దదీయచే
తన మొకఁ డుర్వి వ్యష్టి యని తత్త్వవిధిజ్ఞులు పల్కుచుందు రా
యనుభవ మేను దెల్పితి యథార్థముఁ గన్గొని మాను మజ్ఞతన్.

టీ. వదాన్య = మనోహరములైన మాటలుగల ఓశిష్యుఁడా. 'ని. వదాన్యోవల్గువాగపి' అని అమరము. ఉర్విన్ = భూమియందు, వనము = తోఁట, సమష్టి = సమష్టియను సంజ్ఞ గలది, కుభవంబు = వృక్షము, వ్యష్టి = వ్యష్టియనుసంజ్ఞగలది, అగుమాడ్కిన్ = అయినతీరుననే, చరాచరప్రచేతన సముదాయము-చర = తిరుగుచున్న మనుష్యులు, దేవతలు, పశువులు, పక్షులు మొదలయిన, అచర = తిరుగని వృక్షములు, పర్వత ములు మొదలయిన, ప్రచేతిన = ప్రాణులయొక్క, సముదాయము = గుంపు, అంత యున్ = సమస్తమును, సమష్టి యగున్ = సమష్టియను సంజ్ఞగలదగును. తదీయచేతన మొకఁడు = ఆస్థావరజంగమప్రాణిసంఘమందు ఒక్కప్రాణి, వ్యష్టియగున్ = వ్యష్టియ గును, అని = ఇట్లని, తత్త్వవిధిజ్ఞులు = పరబ్రహ్మము నెఱిఁగినవారు, పల్కుచుందురు = పచియించుచుందురు, ఏను, ఆయనుభవము = ఆయనుభూతిని, తెల్పితిన్ = చెప్పితిని, యథార్థమున్ = వ్యష్టి సమష్టులకు విలక్షణమైన పరబ్రహ్మమును, కన్గొని = సందర్శించి, అజ్ఞతన్ = అజ్ఞానమును, అనఁగా భేదబుద్ధిని, మానుము = విడువుము.

తా. పుత్రా! పెక్కుచెట్లుగలతోఁపు సమష్టి. ఒక్కచెట్టు వ్యష్టి. ఈతీరున సకల జీవుల [illegible]లను కూడి సమష్టి. ఒకజీవశరీరము వ్యష్టి యని బ్రహ్మవేత్తలు పలుకు చుందు[illegible] నీవును వ్యష్టికిని సమష్టికిని విలక్షణుఁడైన పరబ్రహ్మమును తెలిసికొని భేదబుద్ధిని మాను మని తాత్పర్యము.

అవ.—అధ్యారోప యుక్తినలన తనయందు తోఁచిన జగజ్జీవ పరములను తెలిపి ఆతోఁచినవి తోఁచినతీరునసే మఱల లయించుటకు అపవాద యుక్తిని చెప్పెద నను చున్నారు.

ఉ. కల్పన లెల్లఁ జెప్పితి వికల్పము నొందక వాని స్వప్నమ
ట్లల్పముగాఁ నెఱింగి విగతాంబుదఖాకృతి నొంది యద్భుతా
నల్పసుఖాస్పదుండవయి యాత్మవిముక్తినిఁ జెందఁ గూర్మి నేఁ
దెల్పెద నీకు వత్స సముదీర్ణముగా నపవాద మిమ్మెయిన్. 22

టీ వత్స=పుత్రా, కల్పనలెల్లన్ = లేకయే ఉన్నవిగా తోఁచిన జీవేశ్వరజగదు త్పత్తిక్రమములను, చెప్పితిన్=తెలిపితిని, వికల్పమున్=మనశ్చంచలమును, ఒందక= చెందక, వానిన్=కల్పితములైన జీవేశ్వరజగద్భ్రిమలను,స్వప్నమట్లు=కలవలె, అల్పము గాన్=తుచ్ఛముగా,ఎఱింగి=తెలిసి, విగతాంబుదఖాకృతిన్-విగత=తొలఁగిన, అంబు ద=మేఘముగల, ఖాకృతిన్=ఆకాశసామ్యమును, ఒంది=పొంది, అద్భుతానల్పసుఖా స్పదుండవై-అద్భుత=వింతయైన, అనల్ప=మిక్కుటమైన, సుఖ=ఆనందమునకు, ఆస్ప దుండవయి=ఉనికిపట్టయినవాఁడవై, ఆత్మవిముక్తినిన్ = జీవన్ముక్తిని, చెందన్=పొం దుటకు, నీకున్=ముముక్షువైన నీకు, కూర్మిన్=ప్రేమతో, అపవాదము=అపవాదయు క్తిని, సముదీర్ణముగాన్=విశదముగా, నేన్=నేను, ఇమ్మెయిన్=ఆరోపమును చెప్పిన చొప్పున నే, తెల్పెదన్=బోధించెదను.

తా. ఓయిపుత్రా! లేకయే ఉన్నవిగా తోఁచిన జీవేశ్వరజగత్తుల ఉత్పత్తిక్రమ ములను చెప్పితిని. సర్వసంశయములు మాని శరత్కాలమందు వెలుఁగుచున్న ఆకాశము తీరున నిర్మలహృదయము గలవాఁడవై జీవేశ్వరజగత్తులను కలవలె కల్లగాఁ దలఁచి నిర తిశయానందమును పొంది సర్వకారణమైన మోక్షమును చెందుటకు నీకు అపవాదయు క్తిని చెప్పుచున్నా నని తాత్పర్యము.

అవ.—అపవాదలక్షణమును చెప్పుచున్నారు.

ఉ. స్థాణువు గాఁడు చోరుఁ డిది త్రాడహిగా దనుమాడ్కి ధాత్రి ని
ర్వాణగురూక్తినేత్రమున రాజిలు వేదశిరోర్కకాంతివి
న్నాణముఁ బూని భూతభువనంబులు గావు పురంబు గాదు శ
ర్వాణిధవాంతరాత్మ లన రంజిలు నాయపవాద మెంతయున్. 23

టీ. ఇది=తెలుపఁబడునది, స్థాణువు = ఆకులు కొమ్మలులేనిమ్రాఁకు, చోరుఁడు గాఁడు=దొంగ కాఁడు, ఇది = తెలుపఁబడునది, త్రాడు=రజ్జువు, అహి గాదు=పాము గాదు, అనుమాడ్కిన్ = అనెడురీతుల, ధాత్రిన్ = భూమియందు, నిర్వాణగురూక్తి

నేత్రమునన్ = నిర్వాణ = మోక్షము నిచ్చునట్టి, గురు = దేశికునియొక్క, ఉక్తి = ఉపదేశవాక్యమనెడు, నేత్రమునన్ = కంటిచేత, రాజిలు... విజ్ఞానమున్ - రాజిలు = ప్రకాశించుచున్న, వేదశిరః = ఉపనిషత్తనెడు, అర్క = సూర్యునియొక్క, కాంతి = కిరణములయొక్క, విజ్ఞానమున్ = అందమును, అనఁగా వ్యాపకమును, పూని = వహించి, భూత భువనంబులు - భూత = ఆకాశాది పంచమహాభూతములును, భువనంబులు = చతుర్దశలోకములును, కావు = కానేరవు, పురంబు = శరీరము, కాదు = కానేరదు. శర్వాణీ ధవాంతరాత్మలు - శర్వాణి = మూల ప్రకృతియొక్క త్రిగుణములలో సత్త్వగుణ స్వరూపిణియగుపార్వతికి, ధవ = నాయకుఁడయిన సమష్టి స్వరూపుఁడగు ఈశ్వరుఁడును, అంతరాత్మలు = వ్యష్టి స్వరూపుఁడయిన జీవుఁడును, అనన్ = అనునట్లుగాను, ఆయపవాదము = ఆ అపవాదయుక్తి, ఎంతయున్ = మిక్కిలి, రంజిలున్ = ప్రకాశించును.

తా. ఓయిశిష్యుఁడా! యిది ఆకులును కొమ్మలును లేని కొయ్యగాని చోరుఁడు గాఁడు ఇది త్రాడు గాని సర్పము గాదు. అని స్నేహితుల మాటలచేత తెలిసికొన్నట్లు వేదాంతశాస్త్రమనెడు సూర్యతేజస్సాహాయ్యముగల గురూపదేశమహావాక్యార్థమనెడి జ్ఞాననేత్రముచేత తెలియఁబడునవి అన్నియును సమష్టి స్వరూపుఁడయిన యీశ్వరుఁడును వ్యష్టిస్వరూపుఁడయిన జీవుఁడును గాని ఆకాశాది పంచమహాభూతములును పదునాలుగు లోకములును నవద్వారములుగల దేహములును గావని తాత్పర్యము.

అవతారిక.__మఱియును గురువులు అపవాదయుక్తిని దృఢపఱచుచున్నారు.

ఉ. తంతుసువర్ణమృత్తికలు ధాత్రి దుకూలవిభూషణోఖకా
సంతతులై తదన్యపటుసంజ్ఞల నొంది తదాత్మకంబులై
సంతత మున్నభాతిఁ గన సర్వజగం బపవాదయుక్తి సు
స్వాంత పరాపరాత్మ యగు సాధనసాధ్యము లెందు వేఱగున్ ౭౯

టీ. సుస్వాంత = రాగద్వేషాదులు లేనిమనస్సుగల ఓయికుమారా, ధాత్రిన్ = భూమియందు, తంతుసువర్ణమృత్తికలు - తంతు = నూలును, సువర్ణ = కనకమును, మృత్తికలు = మన్నును, దుకూలవిభూషణోఖకాసంతతులై, దుకూల = వస్త్రములయొక్కయు, విభూషణ = ఆభరణములయొక్కయు, ఉఖకా = కుండలయొక్కయు, సంతతులై = సమూహము లగుచు, తదన్యపటుసంజ్ఞలన్ - తత్ = ఆతంతుసువర్ణమృత్తికలకంటె, అన్య = వేఱైన, పటు = స్ఫుటములైన, సంజ్ఞలన్ = నామములను, రూపములను, ఒంది = పొంది, అనఁగా నూలు వస్త్రములును బంగారు భూషణములును మన్ను కడవలును అయినను, తదాత్మకంబులై = ఆతంతు సువర్ణమృత్తికలే రూపములుగాఁ గలవై, సంతతము = ఎల్లప్పు

డును. ఉన్నభాతిన్ = ఉన్నట్లు, సర్వజగంబు = సమస్తలోకమును, కనన్ = చూపింపఁగా, అపవాదయుక్తిన్ = ఇవి వస్త్రములు, నగలు, కుండలును గావు. నూలు, బంగారము, మన్ను అని తెలిసినయుక్తిచేత, పరాపరాత్మ = పరా ప్రకృతికంటె, పర = విలక్షణమైన, ఆత్మ = పరబ్రహ్మము, అగున్ = అవును, ఎందున్ = ఏకాలమందును, సాధనసాధ్యములు, సాధన = కారణములును, సాధ్యములు = కార్యములును, వేఱగున్ = భిన్నములును, అనఁగా ఎప్పుడును కాననుట.

తా. ఓయి శిష్యుఁడా! చేలములు నూలని, ఆభరణములు బంగారమని, కుండలు మన్నని, ఎఱుఁగునప్పుడు కార్యములయిన వస్త్రములును, భూషణములును, ఘటములును కారణములయిన తంతు సువర్ణమృత్తికలును, ఒక్కటే యైనట్లు తనయందు తోఁచిన జీవేశ్వర జగములు పరబ్రహ్మమైన తానే అని తెలియుటే అపవాదయుక్తి యని తాత్పర్యము.

అని మునుపు చెప్పిన ఆవరణ విక్షేపశక్తులలో విక్షేపశక్తి కార్యముల నన్నిటిని శిష్యుఁడు తెలిసికొని ఆవరణశక్తిలక్షణమును గురువుల నడుగుచున్నాఁడు.

మ. క్షితి ద్వైవిధ్యతమంబునం దొకటి విక్షేపాఖ్య భాసిల్లి హృ
ద్గతసంకల్పజగం బొనర్చె నని వక్కాణించితీ వింక దు
ర్గతిదూరంబుగఁ దెల్పు మావరణ మేకార్యంబులం జేసె నా
గతకాలజ్ఞ యనంగఁ బల్కఁదొడఁగెం గారుణ్య మేపారఁగన్. ౨౦

టీ. క్షితిన్ = భూమియందు, ద్వైవిధ్య తమంబునందున్ - ద్వైవిధ్య = రెండు విధములైన, తమంబునందున్ = తమోగుణమునందు, ఒక్కటి = ఒక్కటి, విక్షేపాఖ్యన్ = విక్షేపమను పేరుచేత, భాసిల్లి = ప్రకాశించి, హృద్గత సంకల్ప జగంబున్ - హృత్ = మనస్సునందు, గత = పొందిన, సంకల్ప = ప్రకృతిగుణ పరిణామములయిన శాంత ఘోర, మూఢ, వృత్తులతో కూడినట్టి, జగంబున్ = ప్రపంచమును, ఒనర్చెన్ = చేసెను. అని = ఇట్లని, ఈవు = నీవు, వక్కాణించితి = తెలిపితివి, ఇంకన్ = ఇఁకమీఁద. దుర్గతిదూరంబుగన్ - దుర్గతి = జనన మరణ ప్రవాహరూపమయిన తప్పత్రోవకు, దూరంబుగన్ = తొలఁగియుండునట్లుగా, ఆగతకాలజ్ఞ = భవిష్యత్కాలకార్యములను తెలిసిన యాచార్యుఁడా, ఆవరణము = ఆవరణశక్తి, ఏకార్యంబులన్ = ఏపనులను, చేసెన్ = ఒనర్చెను, తెల్పుము = బోధింపుము, అనఁగన్ = అనియడుగఁగానే, కారుణ్యము = కరుణారసము, ఏపారఁగన్ = వర్ధిల్లఁగా, పలుకఁదొడఁగెన్ = ఉచ్చరింపఁబూనెను.

తా. ఓగురుస్వామీ! దుష్టమైన తమోగుణమువలనఁ బుట్టిన ఆవరణ విక్షేపశక్తులలో విక్షేపశక్తివలన కలిగిన మనస్సంకల్పరూపమైన ప్రపంచ విభాగ మంతయును

చెప్పితిరి. ఇఁక రెండవదియైన ఆవరణశక్తి యేకార్యములను చేయునో యెఱింగింపుఁ డనిన ఆచార్యుఁడు చెప్పఁబూనె నని తాత్పర్యము.

అవ.—శిష్యుని ప్రశ్నమునకు గురువులు ప్రత్యుత్తరమును వాక్రుచ్చుచున్నారు.

మ. తనకుం దాన సమానమైనపరమాత్మున్ స్వాత్మగాఁ జూచుస
ద్ఘనవిజ్ఞానులఁ దక్క రోదసి ఘనౌఘం బంధముం జేయున
ట్లనఘా నాస్తి నభాతి యం చిల నవిద్యావాదులై యున్నదు
ర్జనచిద్భానముఁ గప్పు నావరణ మాజన్మద్రుమావాలమై. ౮౧

టీ. అనఘా=కామాది దుర్వ్యసనములులేని ఓయికుమారా, తనకున్=ఆత్మపదలక్ష్యార్థమైన తనకు, తాన=తానే, సమానము=సాటి, ఐన పరమాత్మున్=ఐనట్టి పరబ్రహ్మమును, స్వాత్మగాన్=ప్రత్యగాత్మగాను, చూచుసద్ఘన విజ్ఞానులన్, చూచు=దర్శించుచుండెడి, సత్=శ్రేష్ఠమైన, ఘన=శ్రేష్ఠమైన, విజ్ఞానులన్=బ్రహ్మజ్ఞానముగల వారిని, తక్కన్=తప్ప, రోదసిన్=భూమిని ఆకాశమును, ఘనౌఘంబు=మేఘ సమూహము, అంధమున్=కటికచీఁకటిని, చేయునట్లు=ఏర్పడునవిధమున, నాస్తి=ద్వైతము లేదు, నభాతి=ద్వైతము ఉన్నయెడల ఏల కనఁబడదు. అంచున్=అని, ఇలన్=భూమియందు, అవిద్యావాదులై=ద్వైతములేనే లేదని వాదించుచున్నవారై, ఉన్న దుర్జన చిద్భానమున్-ఉన్న=కలిగినట్టి, దుర్జన=దేహాత్మబుద్ధిగల బౌద్ధ చార్వాక క్షపణ లౌకిక కార్మిక ద్వైత మూర్త్యంతర మాయావాది దుర్మతములుగల దుష్టజనులయొక్క, చిద్భానమున్=జ్ఞానప్రకాశమును, ఆవరణము=ఆవరణశక్తి, ఆజన్మద్రుమావాలమై, ఆజన్మ=బ్రహ్మసృష్టి మొదలుగాఁ గలిగిన జననమునెడు, ద్రుమ=వృక్షమునకు, ఆవాలమై=పాదియై, కప్పున్=మఱుఁగుపఱచును.

తా. ఆవరణశక్తి ఉపమానరహితమైన పరమాత్మను ప్రత్యగాత్మయగు తన్నుఁగా శ్రుతి యుక్తి అనుభవములచేత తెలిసికొనిన బ్రహ్మజ్ఞానులను తప్ప బ్రహ్మము లేనే లేదు. ఉండెనేని యేల కనఁబడదు? అని వాదించు బౌద్ధ చార్వాక క్షపణ లోకాయతిక లౌకిక శూన్యవాదులు మొదలైన మూఢజనులతెలివిని అపహరించి వారిజననమరణాదిదుఃఖములకు మూల మగు నని తాత్పర్యము.

అవ.—మఱి యీయావరణశక్తికృత్యములను విశేషముగ చెప్పుచున్నారు.

ఉ. కేవలుఁ దక్క సృష్టిముఖకృత్యనియుక్తుల నీశజీవులన్
లోవెలి నామరూపముల లోకములం బటుకాలభూతది
గ్దేవతలం దదీయగుణతేజములం బ్రసరింపనీయ కీ
యావరణంబు వెల్గు జననాదులఁ జేయు నభావభూతమై. ౮౨

టీ. ఈయావరణంబు=ఈయావరణశక్తి, కేవలుఁడు=ముఖ్యమగు పరబ్రహ్మమును, తక్కఁ=తప్ప, సృష్టిముఖకృత్య నియుక్తులఁ-సృష్టి=పుట్టించుటయే, ముఖ=మొదలయిన, కృత్య=పనులయందు, నియుక్తులఁ=పరబ్రహ్మముచేత నియమింపఁబడిన వారిని, అనఁగా సృష్టి స్థితి సంహారము తిరోధానము అనుగ్రహము అనెడు పనులను చేసెడు బ్రహ్మ విష్ణు రుద్ర మహేశ్వర సదాశివులను, ఈశజీవులఁ, ఈశ=సర్వసమష్టి స్వరూపుఁడగు విరాట్పురుషుని, జీవులఁ=వ్యష్టి స్వరూపులైన నానావిధ ప్రాణులను, లోనెలి నామరూపములఁ - లోన=సమస్తజీవుల అంతఃకరణములయందు తోఁచునట్టి, వెలి=వెలుపల తోఁచునట్టి, నామరూపములఁ=అంతఃకరణచతుష్టయజ్ఞానేంద్రియకర్మేంద్రియములనెడు కలిగెడు సర్వవస్తునామములను రూపములను, లోకములఁ=చతుర్దశభువనములను, పటుకాలభూతదిగ్దేవతలఁ-పటు=సమర్థములైన, కాల=కల్పితకాలమును, అకల్పిత కాలమును, భూత=పంచభూతములను, దిక్=పదిదిక్కులను, దేవతలఁ=దేవేంద్రుఁడు మొదలగు ముప్పదిమూఁడుకోట్లదేవతలను, తదీయగుణ తేజములఁ, తదీయ=పైనఁ జెప్పిన పంచకర్తలు, సర్వేశ్వరుఁడు, సకలజీవులు వీరిలోపల వెలుపల తోఁచెడు సకలవస్తునామములు, రూపములు, పదునాలుగులోకములు, కల్పితాకల్పిత కాలములు, దశదిశలు, ముప్పదిమూఁడుకోట్లదేవతలు-వీరియొక్క, గుణ=స్వభావగుణములను, తేజములఁ=ప్రకాశములను, ప్రసరింపనీయక=వ్యాపింపనీయక, జననాదులఁ=పుట్టుక మొదలగు షడ్భావ వికారములను, చేయఁ=ఒనర్చుటను, అభావభూతమై=త్రికాలములయందును లేకయే ఉన్నట్లుగా తోఁచుచున్నదై, వెల్గుఁ=ప్రకాశించును.

తా. ఓ యీ శిష్యుఁడా! యీయావరణశక్తి అద్వితీయపరబ్రహ్మము నుతప్ప బ్రహ్మవిష్ణురుద్రమహేశ్వర సదాశివులను విరాట్పురుషుని స్థావరజంగమరూపములైన సర్వప్రాణులను వీరల అంతర్బహిర్దృశ్యనామరూపములను, పదునాలుగులోకములను రెప్పపాటు మొదలు బ్రహ్మాదిప్రళయములవఱకైన కల్పితకాలమును, నిమేషాదివిభాగములు లేని అఖండాకార కాలమును, ఆకాశాదిపంచభూతములను, తూర్పు మొదలైన పదిదిక్కులను, ముప్పదిమూఁడుకోట్ల దేవతలను, వీరిస్వభావగుణములను, వివేకములను ప్రకాశింపనీయక పుట్టుట గిట్టుట మొదలగు వికారములను కలుగఁజేయుటకు శూన్యరూపము కలదై వెలుఁగు నని తాత్పర్యము.

అవ.—అధిష్ఠానము కనఁబడినప్పుడును కనఁబడనప్పుడును ఆరోపము కనఁబడదని అధిష్ఠానమునకు సమము విశేషము అనెడు రెండుసంజ్ఞలు గల వని ఆచార్యులు చెప్పుచున్నారు.

మ. క్షమ నారోపము డాఁగఁ దోఁచునె యధిష్ఠానంబు కాకున్న న
ట్లమలస్వాంత వెలుంగునే యదియు నాయాధార మింక న్విశే
షమనాఁ బుత్త్ర సమంబనాఁ వెలయు సచ్ఛాస్త్రంబులందుఁ ద్విభే
దములన్ స్పష్టముగాఁగఁ దెల్పెదఁ దదర్థం బాలకింపం దగున్.

టీ. అమలస్వాంత = నిర్మలమైన అంతరంగముగల, పుత్త్ర = ఓయి కుమారా, క్ష్మన్ = భూమియందు, అధిష్ఠానంబు = ఆధారవస్తువైన త్రాడు, ముత్తెపుచిప్ప, మోడు, అనునవి, డాఁగన్ = మఱుఁగుపడి యుండెనేని, ఆరోపము = ఆకల్పితమయిన పాము, వెండి, దొంగ, అనునవి, తోఁచునె = కనఁబడునా, అనఁగా అధిష్ఠానము కనఁబడనప్పుడు ఆరోపమును కనఁబడ దనుట. అదియున్ = ఆ యధిష్ఠానమును, అట్లు గాకున్నన్ = ఆవిధమున మఱుఁగుపడక కనఁబడుచుండెనేని, వెలుంగునే = ఆరోపము కనఁబడునా, అనఁగా అధిష్ఠానము కనఁబడినప్పుడును ఆరోపము కనఁబడ దనుట. ఇంకన్ = ఇఁకను, ఆ యాధారము = ఆ యధిష్ఠానము, విశేషమనాన్ = విశేష మని, సమంబనాన్ = సమ మని, ద్విభేదంబులన్ = రెండువిధములచేత, సచ్ఛాస్త్రంబులందున్ = వేదాంతశాస్త్రములయందు, వెలయున్ = ప్రకాశించును, తదర్థంబున్-తత్ = ఆవిశేష సమములయొక్క, అర్థంబున్ = తాత్పర్యమును, స్పష్టముగాఁగన్ = తేటగాను, తెల్పెదన్ = తెలుపుచున్నాను, ఆలకింపం దగున్ = నీవు వినఁ దగును.

తా. నిర్మలహృదయముగల ఓయిశిష్యుఁడా! ఆధారవస్తువులైన త్రాడు ముత్తెపుఁజిప్ప మోడుచెట్టు ఆకాశము సూర్యకిరణము మొదలగునవి కనఁబడనప్పుడు త్రాడు మొదలగువానియందు కల్పితములైన సర్పమును వెండియును చోరుఁడును నీలవర్ణమును ఎండమావులును కనఁబడవు. ఆధారవస్తువులైన త్రాడు ముత్తెపుఁజిప్ప మోడుచెట్టు ఆకాశము సూర్యకిరణము మొదలగునవి కనఁబడినప్పుడును పాము వెండి చోరుఁడు నీలవర్ణము ఎండమావులు మొదలగునవి కనఁబడవు. అతీరుననే పరబ్రహ్మము కనఁబడనప్పుడును జగత్తు భ్రమ అని తోఁచదు. పరబ్రహ్మము కనఁబడినప్పుడును జగద్భ్రమను తోఁచదు. కాఁబట్టి అధిష్ఠానమైనపరబ్రహ్మము సమ మని విశేష మని రెండుసంజ్ఞలు గలది. వీనియర్థమును తేటపఱచెదను. తెలిసికొమ్మని ఆచార్యుఁడు ఆనతిచ్చె నని తాత్పర్యము.

అవతారిక.—పరబ్రహ్మమందలి సమము విశేషము అనువాని భేదములను విశదపఱచుచున్నారు.

చ. ఇది యని తెల్పరానిసమ మీక్షణ మొందదది వీడ దెప్పఁ బెం
పొదవ విశేషరూపముల నొప్పినరజ్జ్వహులే యొకం గడుం
గదలుచుఁ గన్పడుం గులగుఁ గల్పన లొంటఁ బరాంతరాత్మల

కల్లదఁ గన డాఁగ రావరణ శ క్తి మేల్కొని వెల్గెడు నీశజీవులన్
వదలక మాయఁ జిక్కువడి వత్స వెలుంగరు దాన నజ్ఞులై. ౮౮

టీ. వత్స=కుమారా, ఇది యని=ఇటువంటి దని, తెల్పరాని సమము, తెల్పరాని=పలుకఁగూడని, సమము=సమమనునది, ఈక్షణము=దృష్టి, ప్రజ్ఞాన మని భావము. అది=ఆదృష్టి, ఎందున్=ఎచ్చటను, ఎప్డున్=ఏకాలమందును, వీడదు = తొలఁగదు, అనఁగా మఱుఁగుపడ దనుట. పెంపు=అభివృద్ధి, ఒదవన్=కలుగునట్లు, విశేషరూపములన్=విశేషమను దానియొక్క స్వరూపములచేత, ఒప్పిన = రజ్జ్వహులు, ఒప్పిన = తగిన, రజ్జు = త్రాడును, అహులు = సర్పములు, కల్పిత పటున్=కల్పింపఁబడిన పగులుచేత, ఏయెడన్ = ఎక్కడను, కడున్ = మిక్కిలి, కదలుచున్ = చలించుచు, కన్మఱుంగులగున్ = కంటికి కనఁబడక పోవును, పరాంతరాత్మలు = పరమాత్మయును, ప్రత్యగాత్మయును, అల్లు=అవిశేషసంజ్ఞలుగల రజ్జు సర్పములవలెనే, ఎదన్=మనస్సునందు, కనన్=విచారింపఁగా, డాఁగరు = ఆవరణశక్తిచేత మాయఁబడరు, ఆవరణము = ఆవరణశక్తి, మేల్కొనిన్ = విజృంభణముతో, వెల్గెడు నీశజీవులన్, వెల్గెడు = ప్రకాశించువట్టి, ఈశజీవులన్=ఈశ్వరుని, చిదాభాసుని, వదలక=విడువక, మాయన్=ఆవరణశక్తి కప్పను, దానన్=ఆకప్పుటచేత, అజ్ఞులై=మూఢులై, చిక్కుపడి=తగులుకొని, వెలుంగరు=తమ్మును తా మెఱుఁగెడుజ్ఞానము గలవారై ప్రకాశింపరు.

తా. ఓయి శిష్యుఁడా! సాటిలేక త్రికాలములయందును మఱుఁగుపడక సమమనెడు పేరుగల దృష్టి వెలుఁగుచుండును. విశేషసంజ్ఞగల త్రాడును పామును భ్రమచేత తోఁచినవి. కాఁబట్టి భ్రమ వీడఁగానే కనఁబడక పోవును. అటులనే పరబ్రహ్మమును ప్రత్యగాత్మను అజ్ఞానము మఱుఁగు చేయనేరక విశేషములైన జీవేశ్వరులను మఱుఁగు చేయునని తాత్పర్యము.

అవ.—ఆవరణశక్తికంటె విక్షేపశక్తి మంచి దని నిరూపించుచున్నారు.

శా. ఆవిక్షేపము ఖేవదం బనఁ దదీయాంగేంద్రియాదు ల్సదా
కైవల్యాప్తికి సాధనంబు లగు లోకం బం దహం బేరికిన్
భావింపన్ సుహృదంబు గాదె యటులన్ భాసిల్లునే రాత్రి స్వ
ర్భూవాసస్తుత దాఁచు నావరణ ముద్బోధం గడున్ దుష్టమై. ౮౯

టీ. స్వర్భూవాసస్తుత, స్వర్=స్వర్గలోకమునందు, భూ=భూలోకమునందు, వాస=వసించువారిచేత, స్తుత = స్తోత్రముచేయఁ బడుచున్న ఓయి శిష్యుడా, ఇచ్చట త్రిలోకములలో మొదటిది కడపటిది అయిన స్వర్గలోకమును భూలోకమును చెప్పుటచేత నడుమనుండు భువర్లోకమునుసహితము గ్రహింపవలెను. అనఁగా స్వర్గలోకవాసులైన ముప్పదిమూఁడుకోట్ల ఆదిత్యగణమును భువర్లోకవాసులైన ముప్పదిమూఁడుకోట్ల

రుద్రగణమును, భూలోకవాసులైన పదునొకండుకోట్ల వసుగణమును ‘‘శ్రు. భూరన్నయగ్నయే పృథివ్యైచ మహతే జసేస్వాహా, భువో వాయవేచాంతరిక్షాయ స్వాహా, సువరాదిత్యాయ దివే స్వాహా’’ అను ప్రమాణమువలన దేవపితృ కార్యములగు హవ్యకవ్యములచేతను తృప్తి నొందించి వారిచేత పొగడఁబడెడివాఁడా యని భావము. ఇట్లనుటచేత వేదాంతజ్ఞానము యజ్ఞాదులచేత పరిశుద్ధమైన అంతఃకరణము గలవానికే కాని యితరులహృదయమునకు అందదు గనుక శిష్యుఁడు యజ్ఞాదులచేత పరిశుద్ధుఁ డనుట లేక ముప్పదిమూఁడుకోట్ల దేవతలచేతను మనుష్యులచేతను కొనియాడఁబడుచున్నవాఁడా యని అర్థాంతరము. అవిక్షేపము=అవిక్షేపశక్తి, ఖేదదంబనన్=జగద్రూపముగ పరిణమించునది యగుటచేత దుఃఖము నిచ్చునది యని అంటివేని, తదీయాంగేంద్రియాదుల్, తదీయ=అవిక్షేపశక్తిదైన, అంగ=స్థూలసూక్ష్మదేహములును, ఇంద్రియ=అంతరింద్రియజ్ఞానేంద్రియకర్మేంద్రియములును. ఆదుల్ = మొదలగు జననమరణావస్థాభిమానజీవసంకల్ప వికల్ప నిశ్చయ చలనాభిమాన శబ్దస్పర్శరూపాదులును, సదా=ఎప్పుడును, కైవల్యాప్తికిన్ = జీవులమోక్షప్రాప్తికి, సాధనంబులగున్ = హేతువు లగును. అనఁగా ‘‘శరీరమాద్యం ఖలు ధర్మసాధనమ్’’ అనున్యాయముచేత దేహేంద్రియాదులతోఁగూడి సకల ధర్మములును చేసి బ్రహ్మజ్ఞానమును సంపాదించి ముక్తిని పొందవలెను గనుక ఆదేహేంద్రియాదులు ముక్తిసాధనము లనుట. లోకంబందున్=జగత్తునందు, ఏరికిన్=ఎవ్వరికిని, అహంబు=పగలు, భావింపన్=యోజింపఁగా, సుహృదంబు గాదే=హితమైనదే కదా, అట్టులన్=ఆపగటివలెనే, రాత్రి=రేయి, భాసిల్లునే=ప్రకాశించునా, అనఁగా నరులకు రాత్రిపగళ్లు సమమైనవైనను పగటివలెనే రాత్రిమేలైనది కాదు కనుక పగటివంటిదైన విక్షేపశక్తి చేయుమేలు రాత్రితో సాటియైన ఆవరణశక్తి చేయనేరదని భావము. ఆవరణము=ఆవరణశక్తి, కడున్ దుష్టమై=మిక్కిలి చెడ్డదై, ఉద్బోధన్=పరబ్రహ్మవిషయకజ్ఞానమును, దాఁచున్=మఱుఁగుచేయును.

తా. ఓయి శిష్యుఁడా! నీవు విక్షేపశక్తి దుఃఖమును కలుగఁజేయునది గనుక చెడ్డ దనెడుపక్షమున అవిక్షేపశక్తివలనఁ బుట్టిన స్థూలసూక్ష్మదేహములతోడను అంతరింద్రియ జ్ఞానేంద్రియకర్మేంద్రియములతోడను కూడి సకలపుణ్యకర్మములను చేసి చిత్తశుద్ధి గలిగి సాధనచతుష్టయసంపన్నుఁడై సద్గురువులసన్నిధియందు చేరి వేదాంతశాస్త్రశ్రవణమనననిదిధ్యాసములను చేసి బ్రహ్మజ్ఞానమును సంపాదించి ముక్తిని పొందవలెను గనుక సకలజీవులకును పట్టపగలు మనోహరమైన రాత్రి కానట్లు బ్రహ్మజ్ఞానమును ప్రబలించి ముక్తిని లభింపఁజేయుటకు సాధనమైన విక్షేపశక్తి దొడ్డదై బ్రహ్మజ్ఞాననాశనకారణమైన ఆవరణశక్తి చెడ్డదే యగు నని గురువు లానతిచ్చి రని తాత్పర్యము.

**అవ.—ఆవరణశక్తి విక్షేపశక్తికంటె చెడ్డ దని మఱియు నిరూపించుచున్నారు.**

మ. పరమేష్ఠిప్రముఖాఖిలప్రళయముల్ భాసిల్ల నందందులన్
బరఁగన్ లోకము లెల్ల డిందినఁ జతుష్పంథాంగులం దొక్కఁడై
న రసం బుట్టక ముక్తిఁ జెందెనొకో ముక్తా నామాట లాలింపు మా
వరణం బప్రతిపత్స్వరూప మయి కైవల్యంబు వంచించెడిన్. ౮౫

టీ. పరమేష్ఠిప్రముఖాఖిలప్రళయముల్ - పరమేష్ఠి=సృష్టికర్తయగు బ్రహ్మయే, ప్రముఖ=మొదలగు, అఖిల=సమస్తప్రాణులయొక్క, ప్రళయముల్ = మరణములును, అనఁగా వృత్తిప్రళయ అవస్థాప్రళయ దేహప్రళయ మనుప్రళయ బ్రహ్మప్రళయ విష్ణుప్రళయ రుద్రప్రళయ మహేశ్వరప్రళయ సదాశివప్రళయ విరాట్పురుషాదిప్రళయములు ననుట, భాసిల్లన్ = తోఁచుచుండఁగా, అందందులన్=ఆయాప్రళయములయందు, పరఁగన్ = ప్రసిద్ధముగ, లోకములెల్లన్ = పదునాలుగులోకములును, డిందినన్=లయించినను, చతుష్పంథాంగులందున్ = ఉద్భిజ్జములు జరాయుజములు స్వేదజములు అండజములు అని నాలుగువిధములయిన జీవులయందు, ఒక్కఁడైనన్=ఒకప్రాణియైనను, రసన్=భూమియందు, పుట్టక=జన్మింపక, మున్=ముందు, ముక్తిన్=కైవల్యమును, చెందెనొకో = పొందెనా, పొందలేదు గదా యనుట, నామాటలు = నావాక్యములను, ఆలింపుము=వినుము. ఆవరణంబు=ఆవరణశక్తి, అప్రతిపత్స్వరూపమయి=అజ్ఞానాకారమై, కైవల్యంబున్ = ముక్తిని, వంచించెడిన్ = మోసము చేయుచున్నది. అనఁగా లభింపకయుండునట్టులు చేయుచున్న దనుట.

తా. ఓయి శిష్యుఁడా! వృత్తిప్రళయము అవస్థాప్రళయము దేహప్రళయము యుగప్రళయము మనుప్రళయము బ్రహ్మప్రళయము విష్ణుప్రళయము రుద్రప్రళయము మహేశ్వరప్రళయము సదాశివప్రళయము విరాట్పురుషప్రళయము ప్రకృతిప్రళయము అనెడు యీప్రళయములయందు పదునాలుగులోకములును లోకాధిపతులును లోకస్థులయిన సమస్తప్రాణులును గిట్టి అజ్ఞానరూపముగలదై సకలజీవులవిజ్ఞానమును అపహరించుచున్నట్టి ఆవరణశక్తిమహిమవలన మరల పుట్టుచున్నారు గాని వారిలో ఒక్కప్రాణియైన ముక్తిని పొందినట్టు కనఁబడలేదు గనుక విక్షేపశక్తికంటె ఆవరణశక్తి మిక్కిలి చెడ్డ దని తాత్పర్యము.

ఆవరణశక్తిని లయింపఁజేసినవాఁడే ముక్తిని పొందు నని ముఖ్యాభిప్రాయము.

అవ.—ఆరోపమును ఆవరణమును విక్షేపమును సమానగుణములు గలవై యుండ విక్షేపము మోక్షకారణ మెట్లగు ననఁ జెప్పుచున్నారు.

శా. ఆరోపంబున కుద్ది యావరణ మారాజ్ఞనారీతి విక్షేప మా-
ధారం బీక్రియ ముక్తి కా నది యథార్థం బివ్విధం బందనం

గా రాదింతకు దానఁ గైనయవి నిక్కంబు లగునం బుత్ర సొం
పారఁ స్వప్నమృగేంద్రుచే మతి ప్రబోధావస్థ లైనట్టు లౌను. ౧౮౩

టీ. పుత్ర=కుమారా, ఆరోపంబునకుఁ=కల్పితమునకు, ఉద్ది=జతలైనది, ఆవరణము=ఆవరణశక్తి, ఔఁ=అగును, ఆరీతిఁ=ఆప్రకారముగానే, విక్షేపము=విక్షేపశక్తియును, ఔఁ=అగును, అనఁగా విక్షేపశక్తియును ఆయారోపావరణశక్తులవంటిదే అగు ననుట, అది=అవిక్షేపశక్తి, ముక్తికిఁ=జీవన్ముక్తికి, ఆధారంబు=ఆశ్రయము, ఏక్రియఁ=ఎటువలె, ఔఁ=అగును. అందుఁ=ఆవిక్షేపశక్తియందు, యథార్థంబు=సత్యమగు పరబ్రహ్మము, ఏవిధంబు=ఏప్రకారము, ఔఁ=అగును. అనఁగారాదు=అనిచెప్పఁ గూడదు, ఇంతకుఁ=ఇంతటికిని, దానఁ=ఆవిక్షేపశక్తివలన, ఐనయవి=కలిగినవి, అనఁగా పైనఁ జెప్పిన ముక్తియును పరబ్రహ్మమును వీనికి మునుపే విక్షేపశక్తి కార్యములయిన దేహేంద్రియాదులతోఁ గూడి చేసిన తపోయాగయోగ వ్రతకర్మ భక్తి వైరాగ్యోపశాంతులును తీర్థయాత్రా స్నానదానాదులును ఒకదాని కొకటి తోడుపడి జన్మపరంపరలనుండి వచ్చినయవి యనుట. కనఁ=విచారింపఁగా, నిక్కంబులు=సత్యములు, ఏలాగనఁగా, సొంపారఁ=రమణీయముగ=స్వప్నమృగేంద్రుచేఁ, స్వప్న=కలఁగాంచఁబడిన, మృగేంద్రుచేఁ=సింహముచేత, ప్రబోధావస్థ=మెలఁకువ, ఐనట్టులు=కలిగినవిధమున, మతి=తెలివి, ఔఁ=అవును. అనఁగా దేహేంద్రియాదుల తోఁగూడి హాయిగా ఉన్నప్పుడు నేను మూఢుఁడ నైతి ననెడు విచార ముదయించి ఆచార్యసన్నిధి చేరి వేదాంతశాస్త్రశ్రవణమనననిదిధ్యాసములను చేయఁగా బ్రహ్మసాక్షాత్కార మగు ననుట.

తా. ఓయి శిష్యుఁడా! లేనిదానిని కలదానిఁగ తోఁపించి భ్రమపెట్టెడి ఆరోపమువంటిదే ఆవరణశక్తి యగును. ఆయావరణశక్తివంటిదే విక్షేపశక్తియును అగును. అట్లుండఁగా విక్షేపశక్తిమాత్ర ముక్తిని కలిగింప సాధన మెట్లగును. దానివలన తోఁచిన పరబ్రహ్మము ఏతీరున సత్య మగును అని పలుకకుము విచారింపఁగా విక్షేపశక్తి వలన కలిగిన శరీరేంద్రియాదులతో కూడి చేసిన పుణ్యకర్మమువలన స్వర్గ సత్య వైకుంఠ కైలాసాది పుణ్యలోకపదవులను, పాపకర్మములవలన యమలోకాది అధోగతులను, మిశ్రకర్మమువలన మనుష్యలోకమును పొంది ఆయాలోకములయందుఁగల సుఖదుఃఖములను అనుభవించుట ప్రసిద్ధ మగుటచేత విక్షేపశక్తివలన కలిగిన వన్నియును సత్యమే యగును. మఱియును కలలో సింహమును చూచి భయపడి కలవరించుచు మెలఁకువను పొందినవెనుక ఆకలయును ఆ సింహమును మాయమై జాగ్రత్తి వచ్చి నెమ్మదిగ ఉన్న తీరున విక్షేపశక్తికార్యమయిన స్థూలదేహముతో కూడి జాగ్రదవస్థయందు బ్రహ్మవిచా

యవస్థ యగును. అన్యేచ్ఛన్ = తానుగాని దేహాదే తానను బుద్ధిచేతను, పరున్ = దేహేంద్రియాదులకు విలక్షణమయిన ప్రత్యగాత్మను, వీడి = వదలి, వేమఱున్ = పలుమాఱును, ఏన్ = నేను, జీవుఁడ నంచున్ = జీవుఁడనని, ఎదన్ = యుల్లమందు, ఎంచి = తలఁచి, సన్మానింపన్ = బహుమానింపఁగాను, విక్షేపము = విక్షేపమగు మూఁడవ యవస్థయగును. అక్క = అతోషన్ = శ్రద్ధతోడ, గురువాక్యపద్ధతిన్ - గురు = కార్యగురువులయొక్క, వాక్య = సమయాదేవతా మంత్రోపదేశముయొక్క, పద్ధతిన్ = మార్గముచేత, పరోక్షంబౌన్ = పరోక్షజ్ఞానమనెడు నాలుగవ యవస్థ యగును.

తా. ప్రత్యగాత్మ స్వరూపుఁడైన తాను తనతెలివికి కనఁబడక యుండుటే అజ్ఞానము, నాతెలివియందు పరబ్రహ్మము లేఁడు. ఉన్నపక్షమున కనఁబడఁడా అనుటయే ఆవరణము. దేహేంద్రియాదులకు విలక్షణుఁడైన ప్రత్యగాత్మయగు తన్ను మఱి దేహేంద్రియాదులతోఁగూడిన జీవుఁడ నని పలుమాఱును అనుకొనుచు సుఖదుఃఖము లనుభవించుచుండుటే విక్షేపము. శ్రద్ధతో కార్యగురువులసమయామంత్రోపదేశపద్ధతిని వదలక నడచుటే పరోక్షజ్ఞాన మని తాత్పర్యము.

మ. తగు నేప్రొ ద్దపరోక్ష మారయుటఁ దత్త్వంపదార్థైక్య మా
నుగతిన్ దుఃఖనివృత్తి యౌఁ బరమసచ్ఛుద్ధాత్మ నే నంచు గ
ర్వగతేశాత్మల భేదము ల్దొలఁగ శర్మం బౌఁ గడు న్ధన్యుఁడై
జగతి న్నిష్ఠ నొనర్ప వీని నిఁక దృష్టాంతంబుచేఁ దెల్పెదన్. ౯౧

టీ. తత్త్వంపదార్థైక్యమున్ - తత్ = సాక్షాత్కారము అనుభవము ఉపదేశము సంపూర్ణము అనెడు చతుర్వేద మహావాక్యములతో, తత్పదార్థ = తత్త్వమసియను సామవేదోపదేశ మహావాక్యమందలి తత్పదలక్ష్యార్థమైన అదియను పరబ్రహ్మమునకును, త్వం పదార్థ = యుష్మచ్ఛబ్దలక్ష్యార్థమైన నీ వనుకూటస్థునకును, ఐక్యము = అసిపదార్థమైన ఐకమత్యమును, ఏప్రొద్దు = ఎల్లప్పుడును, ఆరయుటన్ = విచారించుటచేత, అపరోక్షము = అపరోక్షమను పంచమావస్థ, తగున్ = ఒప్పును. అనుగతిన్ = ఆనందిమార్గముచేత, పరమసచ్ఛుద్ధాత్మ - పరమ = నిరతిశయమైన, సత్ = శ్రేష్ఠమైన, శుద్ధ = నిర్మలమయిన, ఆత్మ = పరబ్రహ్మము, నే నంచున్ = నేనని, గర్వగతేశాత్మలభేదములు - గర్వ = దేహాదులు నే ననెడి అహంకారమును, గత = పొందిన, ఈశ = సమష్ట్యభిమానియైన యీశ్వరుఁడ నే ననెడి, ఆత్మ = వ్యష్ట్యభిమానియైన జీవుఁడ నేననెడి, భేదములు = ఈయిరువుర భిన్నానుభవములు, తొలఁగన్ = వదలఁగాను, దుఃఖనివృత్తి = దుఃఖనివృత్తి యనెడి ఆఱవయవస్థ, ఔన్ = అగును. జగతిన్ = లోకమందు, కడున్ = మిక్కిలి, ధన్యుఁడై = కృతకృత్యుఁడై, నిష్ఠన్ = నిర్వికల్ప సమాధిని, ఒనర్పన్ = చేయఁగాను, శర్మంబు = ఆనందమనెడు

సప్తమావస్థ, ఔౘ = అగును. వీనిఁ = ఈమాయావస్థ లేడింటిని, ఇంకఁ=ఇఁకమీఁదను, దృష్టాంతంబుచేఁ =నిదర్శనముచేతను, తెల్పెదఁ=నిరూపించుచున్నాను.

తా. ‹‹తత్త్వమసి›› యనెడు మహావాక్యమందలి తత్పదత్వంపదములకు లక్ష్యార్థములైన పరబ్రహ్మ ప్రత్యగాత్మలకు ఎడతెగనిపొందిక కలుగుటయే అపరోక్షమనెడు పంచమావస్థ యగును. శరీరేంద్రియాదులు తా ననెడి అభిమానముతోఁగూడి నేనీశ్వరుఁడను. నేను జీవుఁడను అని అనుకొనక అద్వితీయ అఖండ అపరోక్ష స్వప్రకాశ పరమాత్మయే నేనని అనుకొనుటే దుఃఖనివృత్తి యనెడు ఆఱవయవస్థ యగును. పిమ్మట కృతకృత్యుఁడై నిర్వికల్పనిష్ఠయందు నిల్చుటే ఆనందమనెడు సప్తమావస్థ యగు నని తాత్పర్యము.

మఱి అజ్ఞానమును ఆవరణమును మలినప్రకృతిరూపము లని విక్షేపమును పరోక్షజ్ఞానమును మిశ్రమాయాస్వరూపములని, అపరోక్షమును దుఃఖనివృత్తియును ఆనందమును అనునవి శుద్ధమాయాస్వరూపము లని యెఱుఁగవలయును. వీనిలో అపరోక్షజ్ఞానమువలన పరోక్షజ్ఞానమును విక్షేపమును నశించును. దుఃఖనివృత్తివలన ఆవరణము చెడును. ఆనందమువలన అజ్ఞానము తొలఁగును అని తెలిసికొనవలయును.

అవ.—ఆసప్తావస్థలను దృష్టాంతపూర్వకముగా చెప్పుచున్నారు.

చ. పదపడి యొక్కచిత్రకథ ౹ భాసిలు నిందులకై వచించెదఁ
బదుగురు వేడ్క నీఁది నదిఁ ౹ బారమునం దమలో నొకండు సొం
పొదవ గణించి తన్నుడిగి౹యొక్కఁడు లెక్కకుఁ దక్కు వంచుఁ దా
నెదఁ దలపోసి విభ్రమత ౹ నేడ్వఁ దొడంగెఁ దదర్థ మెట్లనన్. ౯౨

టీ. పదపడి=పిమ్మట, ఇందులకై =ఈమాయావస్థ లేడింటికొఱకు, ఒక్కచిత్రకథ=ఒకవిచిత్రమైన చరిత్ర, భాసిలుఁ=ప్రకాశించును. వచించెదఁ=దానిని చెప్పుచున్నాను, పదుగురు=పదిమంది, వేడ్కన్=సంతోషముతో, నదిన్=ఏటిని, ఈఁది=దాఁటి, పారమునన్ =గట్టునందు, తమలోన్ = చేరినతమ పదుగురిలో, ఒకండు = ఒక్కఁడు, సొంపొదవన్=సంతోషము కలుగఁగా, తన్నుడిగి=తన్ను విడలి, గణించి=లెక్కపెట్టి, లెక్కకున్ = గణనకు, ఒక్కఁడు=ఒక్కమనుష్యుఁడు, తక్కువంచున్=కొఱఁతయని, తాన్ = తాను, ఎదన్=మనస్సునందు, తలపోసి = విచారించి, విభ్రమతన్=మోహముచేత, ఏడ్వఁదొడంగెన్ = శోకింపసాగెను. తదర్థ మెట్లనన్=ఆసంగతి యేలా గనఁగా.

తా. ఓయి శిష్యుఁడా! యీమాయావస్థలను ఏడింటిని దృష్టాంతముగ తెలియఁజేయుటకు ఒకవిచిత్రమయిన చరిత్రము గలదు వినుము. పదుగురు బాటసారులు నిండి

పాఱుచున్న ఒక్కయేటిని దాఁటి గట్టు చేరిరి. వారిలో ఒక్కఁడు పదుగురును గట్టు చేరిరో లేక నీటిలో కొట్టుకొనిపోయిరో అనెడు అనుమానముచేత తన్ను మాని తక్కినవారిని లెక్కపెట్టి తొక్కఁగొని ఒక్కఁడు తక్కువ తక్కువ అని పక్కలెగయ వెక్కివెక్కి పొక్కసాగె నని తాత్పర్యము.

అవ.—దృష్టాంతదార్ష్టాంతములకు నిదర్శనములను రెండుపద్యములచేతఁ జూపుచున్నారు.

మ. తనుఁ దాఁ గానని మోహ మజ్ఞత తిరోధానంబు లేఁ డీయెడం
గనఁ వాఁ డిట్లనఁ బుత్ర వానికయి దుఃఖం బాత్మలోఁ జెందఁ దా
ఘనవిక్షేపము పాంథుఁ డొక్కరుఁడు తత్కార్యంబు వీక్షించి గ్ర
ద్దన నున్నాఁ డన నాఁ బరోక్షము ప్రశస్తంబై వెలుంగున్ దగన్.

టీ. పుత్ర=కుమారా, తనున్=పదియవవాఁడయిన తన్ను, తాన్=తాను, కానని మోహము=తెలిసికొనని చిత్తభ్రమము, అజ్ఞత=అజ్ఞానము, ఈయెడన్=ఇచ్చట, కనన్=చూచుటకు, వాఁడు=ఆపదియవవాఁడు, లేఁడు=కనఁబడఁడు. ఇట్లనన్=ఈలాగని పలుకఁగా, తిరోధానంబు=ఆవరణము, ఔన్=అగును. వానికై=ఆపదియవవానికొఱకై, తాన్=లెక్కపెట్టెడుతాను, ఆత్మలోన్=మనస్సునందు, దుఃఖంబున్=శోకమును, చెందన్=పొందఁగా, ఘనవిక్షేపమగున్=గొప్పదయిన విక్షేపమగును. పాంథుఁ డొక్కరుఁడు=ఒకానొకబాటసారి, తత్కార్యంబున్=ఆపదియవవాని కృత్యమును, వీక్షించి=చూచి, గ్రద్దనన్=శీఘ్రముగ, ఉన్నాఁ డనన్=పదియవవాఁ డున్నాఁ డని పలుకఁగా, ప్రశస్తంబై=ప్రసిద్ధమై, తగన్=లెస్సగా, పరోక్షము=పరోక్షావస్థ, వెలుంగున్=ప్రకాశించును.

తా. ఓయి శిష్యుఁడా! పదియవవాఁ డయిన తన్ను తా నెఱుఁగక పోవుటే అజ్ఞానము. ఇచ్చట చూడ పదియవవాఁడు లేఁ డనుటే ఆవరణము. ఆపదియవవానికొఱకై శోకించుటే విక్షేపము. ఒక్కబాటసారి ఆపదియవవాని చేష్టను చూచి పదియవవాఁడు ఉన్నాఁ డని పలుకుటే పరోక్షజ్ఞాన మని తాత్పర్యము.

చ. అగు నపరోక్ష మా తెఱఁగు నంత యెఱింగి గణించి వారిలో
దిగు లెడఁబాపి తన్నుఁ గనఁ దెల్పినఁ బుణ్యపథస్థుఁ డొక్కరుం
డొగిఁ గడుఁ దన్నెఱింగి మది నొప్పిన దుఃఖనివృత్తి యంతఁ దా
మిగులఁగ సందియం బుడిగి మేలుఁ గనుంగొనియుంట మోదమా.

టీ. పుణ్యపథస్థుఁడు=ధర్మమార్గమున సంచరించువాఁడు, ఒక్కరుండు=ఒకబాటసారి, ఆతెఱఁగున్=ఆరీతిని, అంత యెఱింగి=సమస్తమును తెలిసికొని, గణించి=

ఆమనుష్యులను లెక్కపెట్టి, వారిలోన్=ఆపదుగురిలోపల, దిగులు=మనోవ్యాకులతను, ఎడఁబాపి = పోఁగొట్టి, తనున్ = పదియవతన్ను, కనన్ = ఎఱుఁగుటకు, తెల్పినన్= బోధింపఁగాను, అపరోక్ష మగున్=అపరోక్షజ్ఞానమగును ఒగిన్=క్రమముగా,కడున్= మిక్కిలి, తనున్=పదియవతన్ను, ఎఱింగి = తెలిసికొని, మది=మనస్సు, ఒప్పినన్= నిర్మలము కాఁగాను, దుఃఖనివృత్తి = దుఃఖనాశన మగును. అంతన్=పిమ్మట,తాన్= తాను, మిగులఁగన్=మిక్కుటముగా, అనఁగా బొత్తిగా, సందియం బుడిగి=సందేహ నివారణమై, మేలున్=తాను తానైన మోక్షలాభమును, గనుంగొని, పొంది, ఉంటన్= ఉండుటచేతను, మోదమౌన్=నిరతిశయానందమగును.

తా. ఓయి శిష్యుఁడా! ఆబాటసారి ఆపదుగురను వేఱువేఱుగా లెక్కపెట్టి నీవు పదియవవాఁడని చెప్పి చూపఁగా తన్ను తాను తెలియుటయే అపరోక్షజ్ఞానము. వెనుక తన్ను తా నెఱిఁగి శోక ముడుగుటయే దుఃఖనివృత్తి. పిమ్మట దృఢప్రజ్ఞచేత సందేహ ముడిగి యూరకుండుటయే ఆనంద మగు నని తాత్పర్యము.

సప్తావస్థలను దృష్టాంతదార్ష్టాంతములచేతఁ జెప్పుట.

భూలోకమందు లోకలోచనునిం బోలిన బ్రహ్మవర్చస్సుచేత మీఱి బ్రహ్మ భావమును పొంద బ్రహ్మాసనమునఁ గూర్చుండి బ్రహ్మవిద్యాతత్పరులగు బ్రాహ్మణబృందంబులు గొలువ బ్రహ్మాదులు పొగడునట్లుగ సగుణనిర్గుణాత్మకపరబ్రహ్మారాధనమును విరామము లేక చేయు పరమానందుఁడనెడు పరివ్రాజకశిరోమణి యొక్కరుఁడు గలఁడు. ఆతనికి లెక్కకు నెక్కుడైన యుక్కుతునియలఁబోలిన పెక్కుమంది శిష్యులు గలరు. అపరమానందుఁడు ఒక్కనాఁడు తనప్రక్కలను నిక్కపు చొక్కపుభక్తితో చేతు లెత్తి మ్రొక్కుచు చిత్తంబు లిగుర్కొత్తి పరిచర్యలు చేయుచున్న శిష్యప్రశిష్యసంఘములో గండ్రతనముగల శిష్యులను పదుండ్రను గని తనయుద్దేశమును వారితో నిర్దేశించి మన దేశంబునకు సదేశంబైన కాశ్మీరదేశంబునకు పొం డనిన వారు గురుని నిదేశంబును శిరః ప్రదేశంబున ధరించి కరంబు నయంబును భయంబును హృదయంబునం బొదల దినదినంబును వదలని పయనంబులతో వినయంబు నడచుచు కాశ్మీరదేశపుసదేశమున పోవునపుడు నడుమను ఏకాలంబున నడుగంటని మోఁకాలిబంటి నీటిపాఱుడుగల యేటిలో హుటాహుటి నడలతో ధాటిగ పోవునపుడు మెల్లమెల్లఁగా పైవెల్లువ పెల్లుగా వచ్చినందున తల్లడిల్లక డిల్లపడక కాలినడ తప్పుటచేత ముప్పుత్రిప్పులం బడి యేవొప్పునవో గురుని యాదిచేత ఆనదిని ఈఁది గట్టుచేరి ఒకతోట్టున మంచిపట్టును చూచి కూర్చుండిరి. వారిలో ఒక్కఁడు మచ్చికతో తనతో వచ్చినవాండ్రు పదుండ్రును గట్టు చేరిరో వెల్లువెల్లువలో ఏతట్టుగనైన కొట్టుకొని పోయిరో యెన్నవలెనన్న యెన్నికచేత లెక్కపెట్టుచున్న తన్ను విడిచిపెట్టుకొని తక్కినవారిని లెక్కించి ౹౹ లెక్కకు ఒక్కఁడు తక్కువయెన్ను. అయ్యో

పదియవవాఁడు పోవఁడయ్యెను. ఇరవు నుండి పదుగురము వచ్చితిమే॥ అని వాఁ డప్పుడు చచ్చిపోయిన పరితాపముతో పొరలిపొరలి కన్నీరు మున్నీరై పాఱ మొగంబు చిన్నవోవ ఎన్నెనిచి, ములనో యేడ్చుచుండెను. తక్కినవారును మొగములు ముడ్చుకొని పెక్కు లుబ్బ వెక్కివెక్కి యేడ్చుచుండిరి. ఈవడువున తుందుడుకు చెందుచు అందఱును రోద నంబు లదనంబుగ చేయుచుండ ఆబాటను పోవు బాటసారి వీరిరోదనంబులను విని కట కటపడి చేరువకు చేరి వారిరోదనకారణం బెఱిఁగి మనస్సు కరఁగి పదియవవాఁడు చదియ కున్నాఁడని చెవినాట చెప్పెను. వారు బాటసారిమాటను పాటించి గాటమైన ఆలమటను విడిచి పదియవవాఁడు చదియక యేడిక్కున నున్నాఁడని దశదిక్కులను చూచి పిలు వఁగా వాఁడు పలుకనందున మిగుల దిగులుపడుచు రోదించుచుండఁగా ఒక్కపుణ్య పురుషుఁ డక్కడికి వచ్చి వారివృత్తాంత మంతయు నెఱిఁగి నగి పొగలకుఁడు మీమిగులు దిగులును తీర్చెదను. మీసందేహమును పోకార్చెదను. అని వచియించి [illegible]త్మం ప్ర సెంచి చూపించి పదియవవాఁడవు నీవే యని మది కుదురఁ దెలిపినం దెలిసికొని అలజడి విడిచి యుల్లాసముచేత ఉల్లసిల్లెను. కాఁబట్టి మొట్టమొదట తన్నెన్నక సన్నసన్నగ విడి చిపెట్టి మిన్నకుండుటే అజ్ఞానము. పదుగురిలో మొదటివాఁడైన తన్ను పరిచ్ఛిన్నునిఁగఁ జేసిన మోసపుకారణమే ఆవరణము. తనకు తాను కనఁబడక దెందమందు కొంతలమం దుటయే ప్రక్షేపమైనవిక్షేపము. దారి నడుచువాఁడు వారిని వీక్షించి మంచిమాటలు వచి యించి మనఃక్షోభము నివారించి పదియవవాఁ డున్నాఁడని విదిత పఱచుటే మోక్షకా రణమైన పరోక్షజ్ఞానము, దశముఁ డేడ నున్నాఁడని దశదిశలను కనుఁగొనుచుండ సద్గు ణశరణ్యుఁడగు నగణ్యపుణ్యపురుషుఁ డొక్కఁడు అక్కడికి వచ్చి మచ్చికతో చెచ్చెర వారిసంగతి నెఱిఁగి తొందర నొందక ఆయందఱ నెంచి తన్ను కన్నులకు పన్నుగ చూపఁ గా తన్ను తా నెఱుఁగుటే మోక్షరూపమగు అపరోక్షజ్ఞానము. తన్ను తా నెఱిఁగినవె నుక బొబ్బలు పెట్టుచు మొగ మొబ్బ ఏడ్చుటను విడచిపెట్టుటే దుఃఖనివృత్తి. అవ్వల నివ్వటిలు గురునియుద్దేశకార్యమును సర్వము నిర్వహించి గురుసన్నిధానమును చేరుటయే ఆనందము.

ఇట్లు దార్ష్టాంతమందు జీవసాక్షియును ప్రత్యగాత్మస్వరూపుఁడును అయిన తన్ను మఱచుటే అజ్ఞానము.

దేహేంద్రియాదులకు విలక్షణుఁడయిన పరబ్రహ్మమగు తాను దేహేంద్రియాదు లతో కూడిన జీవుఁడ ననుకొనుటే ఆవరణము.

నేను కర్తను భోక్తను మనుష్యుఁడను బ్రాహ్మణాదిజాతులును బ్రహ్మచర్యాద్యా శ్రమములును శైవవైష్ణవాది మతములును ఉపాధ్యాయాదిజీవనోపాయవృత్తులును కల

వాఁడను. సుఖిని దుఃఖిని దరిద్రుఁడను ధనికుఁడను పుత్రులు మిత్రులు శత్రులు కళత్రములు చుట్టములు పక్కములు కలవాఁడను లేనివాఁడను చపలుఁడను మర్యాదలేనివాఁడను అల్పుఁడను పాపిని కృష్ణుఁడను రాముఁడను శివుఁడను శంకరుఁడను బ్రహ్మయ్యను పొట్టివాఁడను పొడుగాటివాఁడను సన్ననివాఁడను లావాటివాఁడను అని యనుకొనుచు ఖేదమోదములను పొందుచుండుటే విక్షేపము.

ఓయి మేము మీ కాచార్యులము, సద్గతులు గలుగఁజేయువారము మే ముపదేశించినవిషయములను ఎవ్వరికిఁగాని చెప్పకుము. మేము చెప్పిన నియమన ప్రకారము నడుపుము. నడిచితి వేని నీకు స్వర్గలోకము వైకుంఠము కైలాసము సత్యలోకము మొదలగు పుణ్యలోకముల ప్రాప్తికలుగును. నీతాతలండ్రులు మొదలగువారు మాకు శిష్యులై మేము చెప్పిన నొప్పున నడిచినందున ఈలోకమున పుత్రపౌత్రాభివృద్ధి గలిగి సకలసుఖము లనుభవించి పుణ్యలోకములలో సుఖముగ నున్నారు. ముందు మీవా రందఱు మాకు బహుగ నిచ్చిరి. నీ వేమి యిచ్చినను మాకే యియ్యవలెను. మఱి యెవ్వరి కిచ్చినను నిష్ఫలము. ఇతర మతములవారితో సంభాషింపకుము. వారిని చూడకుము. అని బోధింపఁగా వారిచిక్కులలో చిక్కి మక్కువతో ఎక్కువగ ఆయా మతాంతరములలోని మూర్త్యంతరములను ఆరాధించుచుండుటే పరోక్షజ్ఞానము.

పదియవవాఁడు పుణ్యపురుషునిం గని పదియవవాఁ డెక్కడనే యున్నాఁ డని వింటిని. వాఁడు పిలిచిన పలుకఁడు వానిం జూపుము. అని వేఁడఁగా అపుణ్యపురుషుఁడు ఒక్కొక్కనిఁగ నెంచి సంఖ్యచేసి తొమ్మండ్రను కనఁబఱచి పదియవవాఁడవు నీవే యని చెప్పిన తెలిసికొన్నట్లు సదాచార్యుఁడు తత్త్వమస్యాదిమహావాక్యార్థములను శ్రవణ మనన నిదిధ్యాసములను చేయించి నీవే పరబ్రహ్మ మని తెలుపఁగా "బ్రహ్మైవాహమస్మి" అనుస్థిరత గలిగి యుండుటే అపరోక్షజ్ఞానము.

పదియవవాఁడు తన్నుఁ దా నెఱిఁగినవెనుక దుఃఖమును విడిచినట్లు సద్గురూపదేశముచేత తాను ప్రత్యగభిన్న పరబ్రహ్మ మని తెలిసికొనిన తర్వాత నేను జీవుఁడను, సుఖిని, దుఃఖిని, కర్తను, భోక్తను, అనుకొనుట మొదలగునవి అజ్ఞానకార్యము లని తెలిసి నిర్వికారుఁడై యుండుటే దుఃఖనివృత్తి.

పిమ్మట పదియవవాఁడు తన్నుఁ దా నెఱింగి ఆనందించినట్లు "శ్రు మయ్యేవ సకలం జాతం మయి సర్వం ప్రతిష్ఠితమ్, మయి సర్వం లయం యాతి తద్బ్రహ్మాస్మ్యహమద్వయమ్." అను శ్రుత్యర్థమునుబట్టి నాయందే సర్వము పుట్టుచు పెరుఁగుచు గిట్టుచున్న దని నిరతిశయానందమును చెందుచుండుటయే ఆనందావాప్తి.

ఈ సప్తావస్థలలో అజ్ఞాన ఆవరణ విక్షేపములు మూఁడును బంధహేతువు లగును. పరోక్షము బంధప్రాప్తికిని మోక్షప్రాప్తికిని కారణ మగును. అపరోక్షమును అనర్థనివృ

త్తియును ఆనందావాప్తియును అనెడు మూఁడవస్థలును మోక్షప్రాప్తికి హేతువులగును. ఇట్లు విచారించి యీయేడవస్థలును ఆరోపితమైన అహంకారమునకే కాని అహంకారసాక్షిని నిర్వికారుఁడను అయిన నాకు లేవని యెఱుఁగువాఁడే ముక్తుఁ డని వేదాంతశాస్త్రసిద్ధాంతము.

అవ.—దశమపురుషుఁడు తన్ను తా నెఱిఁగినట్లు నన్ను నే నెఱుఁగఁ దెలుపవలయు నని అడిగినశిష్యునిఁ జూచి మహావాక్యార్థనిరూపణముచేత అద్వితీయస్వరూపుఁ డగు తన్నెఱిఁగించు చున్నారు.

చ. దశమనరుండు తన్నెఱిఁగి తా నగుభాతి మదీయతత్త్వముఁ
విశదముఁ జేయుమన్న సువివేక తదర్థము నీ వటంచు దు
ర్దశ లెడఁబాపి జీవశివతత్త్వము లొందుగఁ జెందఁ దెల్పుసం
భృశదసమానభావము నభిన్నమతిం గన వేడ్కఁ దెల్పెదన్.

టీ. దశమనరుండు=పదియవపురుషుఁడు, తన్నెఱిఁగి=తను తెలిసికొని, తా నగు భాతిన్ = తా నయిన విధమున, మదీయతత్త్వమున్—మదీయ = అస్మచ్ఛబ్దార్థ స్వరూపుఁడ నగు నాసంబంధమైన, తత్త్వమున్=యథార్థమును, విశదముఁ జేయుమన్నన్=తెలియఁబఱుపు మనఁగాను, సువివేక=మంచి వివేకముగల కుమారా, తదర్థము, తత్=సామవేదమందుఁ గల తత్త్వమసి యను మహావాక్యమందలి తత్పదమునకు కలిగిన వాచ్యార్థనిరసనపూర్వక లక్ష్యార్థమగు అపరమాత్మతత్త్వము, నీ వటంచున్=నీవని, అనఁగా, త్వంపద వాచ్యార్థనిరసనపూర్వక లక్ష్యార్థమగు కూటస్థబ్రహ్మము నీవేయని, దుర్దశలు=దురవస్థ గు జాగ్రత్స్వప్నసుషుప్త్యాదులను, ఎడఁబాపి = తొలఁగించి, జీవశివతత్త్వములు, జీవ=కించిద్జ్ఞత్వాదిగుణములుగల జీవునియొక్కయు, శివ=సర్వజ్ఞత్వాదిగుణములుఁగల యీశ్వరునియొక్కయు, తత్త్వములు = యథార్థస్వరూపములు, ఒందుగన్=ఏకముగాను, చెందన్ = పొందుటకు, తెల్పు...భావమున్, తెల్పు = తెలియఁబఱచుచున్న, సంభృశత్ = మిక్కిలి వెలుఁగుచున్న, అసమాన = సాటిలేనట్టి, భావమున్=తాత్పర్యమును, అభిన్నమతిన్ = అద్వితీయ జ్ఞానముచేత, కనన్ = దర్శించుటకు, వేడ్కన్=ఉల్లాసముతోడను, తెల్పెదన్=చెప్పుచున్నాను.

తా. ఓగురుస్వామీ! దశమపురుషుఁడు తన్ను తాను తెలిసికొన్నట్లు నేను నాస్వరూపమును ఎఱిఁగెడుమార్గమును నీవు తెల్పవలయు ననఁగా గురుస్వాములు ఓయి కుమారా! అది నీ వైతి వనెడి ఉపదేశమహావాక్యార్థప్రకారము జీవశివైక్యమును తెలుపుచున్నాను విను మని తాత్పర్యము.

అవ.—ఒక్కటియైన పరబ్రహ్మమే నాలుగు విధములుగ తోఁచు నని ఆకాశదృష్టాంతముచేత ఆచార్యులు వచియించుచున్నారు.

చ. ఘనఘటకంబుల న్వెలయుఖంబు లన న్నభ మొండు ధాత్రిఁ ద
ద్ఘనకనదంబరంబు లనఁ గన్పడు నాల్గుతెఱంగు లట్లు పా
వననిజచేతనం బొకటి వత్స మహేశ్వరజీవసంజ్ఞలన్
దనరును బ్రహ్మప్రత్యగభిధానములం జతురాత్మలై తగన్. ౯౬

టీ. వత్స=పుత్రా, ధాత్రిన్=భూమియందు, ఒండు=ఒక్కటియైన, నభము=ఆకాశమే, ఘనఘటకంబులన్, ఘన=మేఘముయొక్కయు, ఘట=కడవలయొక్కయు, కంబులన్=నీళ్లయందు, వెలయుఖంబు లనన్-వెలయు=ప్రకాశించుచున్నట్టి, ఖంబు లనన్=ప్రతిబింబాకాశము లనునట్లుగాను, తద్ఘనకనదంబరంబు లనన్-తత్=ఆమేఘమునందును కుండలయందుగాను, ఘన=మిక్కుటమైన, కనత్=ప్రకాశించుచున్న, అంబరంబు లనన్=ఆకాశము లనునట్లుగాను, నాల్గుతెఱంగులు=నాలుగు విధములను, కన్పడున్=తోఁచును, అట్లు=అతోఁచినవిధముగానే, పావన నిజచేతనంబు - పావన=నిర్మలమయిన, నిజ=స్వకీయమయిన, చేతనంబు=పరమాత్మస్వరూపము, ఒకటి=ఒక్కటే, మహేశ్వర జీవసంజ్ఞలన్ - మహేశ్వర=సమష్టి స్వరూపమగు మాయోపాధియందు కూడిన యీశ్వరుఁ డనియెడు, జీవ=అవిద్యోపాధిగతుఁడైన జీవుఁడనెడు, సంజ్ఞలన్=అడియాళములచేతను, బ్రహ్మ ప్రత్యగభిధానములన్-బ్రహ్మ=పరమాత్మయనెడు, ప్రత్యక్=కూటస్థుఁ డనెడు, అభిధానములన్=పేళ్లచేతను, చతురాత్మలు ఐ=నాలుగురూపము లయి, తగన్=సొంపుగాను, తనరును=ప్రకాశించును.

తా. ఓయి శిష్యుఁడా! ఒక్కయాకాశమే మేఘావచ్ఛిన్నాకాశ మని మేఘజల ప్రతిబింబాకాశ మని ఘటావచ్ఛిన్నాకాశ మని ఘటజలప్రతిబింబాకాశ మని నాలుగువిధము లయినట్లు ఒక్కఁడయిన పరబ్రహ్మమే మాయాప్రతిబింబితుఁడైన యీశ్వరుఁడు. అవిద్యాప్రతిబింబితుఁడయిన జీవుఁడు. ఈశ్వరసాక్షియైన పరమాత్మ జీవసాక్షియైన ప్రత్యగాత్మ అని నాలుగువిధము లయి ప్రకాశించు నని తాత్పర్యము.

అవ.—ఆరోపచైతన్యము లయిన జీవేశ్వర జగద్భ్రమలను విడిచి అధిష్ఠానచైతన్యమయిన పరబ్రహ్మమును పొందవలె నని వాక్రుచ్చుచున్నారు.

మ. మహిఁ దత్త్వంపదలక్ష్యవాచ్యములు బ్రహ్మప్రత్యగీశాత్మలా
రహి దుగ్ధాజ్యము లేకమైనగతిఁ జేరం బ్రాకృతం బాత్మఁ ద
త్సహితక్షీరముల న్మథించి నవనీతం బెత్తి తత్సారమా
మహితాజ్యం బొగిఁ గాంచిన ట్లనులసన్మాత్రంబు నొందం దగున్.

టీ. మహిన్=భూమియందు, రహిన్=మిక్కిలి, దుగ్ధాజ్యములు-దుగ్ధ=పాలును, ఆజ్యములు=నేయియును, ఏకమయినగతిన్=కలిసియున్నవిధమున, ఆత్మన్=అంతఃకర

దను వెవ్వేళల నూఁదుచిత్తిగతి నభ్యాసంబుగా నాడు రా
జసధర్మం బది నేను గా ననినఁ దత్సర్వంబు వేస్తై చెడున్. ౯౮

టీ. అసదర్థంబుగ = నశించునదియైన జీవేశ్వర జగద్భ్రమను, ఎడఁబాయుట= విడలుట, ఎట్లు=ఏప్రకారము, అనన్=అని యడుగఁగా, శవంబయి=శవమై, వీడుదేహంబు=విడలిపోవు దేహము, భూతసముద్భూతము = భూజలాగ్నివాయు గగనములనెడు పంచభూతములవలన పుట్టినది, కానన్ = కాఁబట్టి, తత్కార్యంబు-తత్ =కనమయ్యెడి ఆదేహముయొక్క, కార్యంబు = జాగ్రదవస్థ, అన్నమయకోశము, మొదలగువ్యవహారమంతయును, కానవనన్=నేను కాను నిషేధంబుఁగాను, ఊఁదుచిత్తిగతిన్=కొలిమి ఊఁదుతోలు తిత్తివలెను, నాసంబునందున్=ముక్కునందు, ఎవ్వేళలన్=ఎల్లప్పుడును, అసువు = ప్రాణవాయువు, అభ్యాసంబుగాన్ = వాడుకగా, ఆడున్ = ఉచ్ఛ్వాసనిశ్వాసములచేత తిరుగుచుండును. అది=అట్లు తిరిగెడు ప్రాణవాయువు, రాజస ధర్మంబు=రజోగుణ సంబంధమైన ప్రకృతిగుణము, కానన్=కనుక, నేను గా ననినన్=ఆరాజసగుణము నేను కానని తలఁచినచో, తత్సర్వంబున్ = ఆస్థూలశరీరము యొక్కయు, ప్రాణవాయువుయొక్కయు వ్యవహారమంతయును, వేస్తై=తనకు భిన్నమై, చెడున్ = నశించును.

తా. స్వామీ! అసత్యములయిన జీవేశ్వరజగత్తులనెడు భ్రమ తొలఁగెడి ఉపాయము ఎట్లని శిష్యుఁ డడుగఁగా కర్మజన్యమైన స్థూలశరీరము కర్మక్షయమందు తన్ను విడుచువేళను ప్రేతమై చెడును. ఆస్థూలశరీరము తామస పంచభూత వికారమైనది గనుక ఆశరీరకార్యములైన జాగ్రదవస్థయును అన్నమయకోశమును సమష్టివ్యష్టిస్వరూపులయిన యీశ్వరజీవులవిరాడ్విశ్వనామములును ఉచ్ఛ్వాసనిశ్వాసములచేత ముక్కునుండి లోపలికి పోవుచు వెలుపలికి వచ్చుచు నుండెడు ప్రాణవాయువును రజోగుణ వికారము లగుట వలన ఆరజోగుణము నేను గానని నిరాకరించినయెడల ఆస్థూలశరీర సంబంధములయిన సర్వవ్యవహారములును రజోగుణవికారములయిన ప్రాణాది పంచవాయువుల కార్యములును తన్నంటక వేరై నశించు నని తాత్పర్యము.

అవ.—గురువులు సూక్ష్మకారణ శరీరములును ఆత్మ కాదని చెప్పుచున్నారు.

మ. కరణాళిఁ బంచేంద్రియవర్గయుక్తనుదశాంగం బందుఁ గోశాదు ల
స్థిరము లన్తత్త్వమయంబు లౌటఁ జెడు యోజింపం దమోకృత్యమై
వరుసన్ జీవయుత ప్రమోదమయ హేతుత్వాంగం బచ్చొట వీ
ని రహిన్ బ్రహ్మమయంబు లంచుఁ దలఁప న్నేరంబు గాదే సుతా.

టీ. సుతా=కుమారా, వరుసన్ = క్రమముగా, కరణా...గంబు-కరణ = అంతఃకరణము యొక్కయు, అసు=ప్రాణవాయువు యొక్కయు, ఇంద్రియ=జ్ఞానకర్మేంద్రియములయొక్కయు, వ్రాత = సముదాయముతోడ, యుక్=కూడినట్టి, తను = సూక్ష్మమైన, దశ=అవస్థగల, అనఁగా స్వప్నావస్థగల, అంగంబు=లింగశరీరమును, అందున్=ఆలింగశరీరమందుఁగల, కోశాదులు, కోశ = ప్రాణమయ మనోమయ విజ్ఞానమయములనెడు కోశములును, ఆదులు=ఆకోశములయందు అభిమానముగల తైజస హిరణ్యగర్భులనెడు పేళ్లుగల జీవేశ్వరులును, సత్త్వమయంబౌటన్=సత్త్వగుణముతోఁ గూడిన అచిత్ప్రకృతి వికారము లగుటవలన, అస్థిరములు=నిత్యములు గావు, యోజింపన్=ఆలోచనచేయఁగా, జీవ...గంబు- ...=జీవులతోడ, యుత=కూడిన, ప్రమోదమయ=ఆనందమయ కోశమును, ...త్వంగంబు=సుషుప్త్యవస్థగల కారణశరీరమును, అచిత్త్వౌటన్=అవిద్య యగుట వలన, చెడున్=నశించును, పైనిన్=పైనఁ జెప్పిన స్థూలసూక్ష్మ కారణోపాధులు మూఁడును, బ్రహ్మమయంబు లంచున్ = పరబ్రహ్మస్వరూపము లని, తలఁపన్=ఆలోచన చేయఁగాను, నేరంబు గాదే=తప్పిదము గాదా.

తా. ఓయి శిష్యుఁడా! మనస్సును బుద్ధియును సమానము వ్యానము ఉదానము ప్రాణము అపానము అనెడు పంచప్రాణవాయువులును, శ్రోత్రము త్వక్కు చక్షువు జిహ్వ ఘ్రాణము అనెడు జ్ఞానేంద్రియము లైదును, వాక్కు పాణి పాదము పాయువు గుహ్యము అనెడు కర్మేంద్రియము లైదును గలది సూక్ష్మశరీరము. దాని కవస్థ స్వప్నము. ప్రాణమయము మనోమయము విజ్ఞానమయము అను మూఁడుకోశములును ఆసూక్ష్మశరీర స్వప్నావస్థలయందును కోశములయందును అభిమానముగల జీవేశ్వరులు తైజసహిరణ్యగర్భనామములును సత్త్వగుణముతోఁ గూడిన అచిత్ప్రకృతిస్వరూపము లగుటవలన అనిత్యములు. మఱి జీవేశ్వరులు కారణశరీరములును ఆనందమయకోశములును సుషుప్త్యవస్థలును ప్రాజ్ఞుఁడు అవ్యాకృతుఁడు. అనెడి అభిమాననామములును అనిత్యములు కనుక నాస్థూలసూక్ష్మకారణశరీరాదులు పరబ్రహ్మస్వరూపము లనుట నేర మని ఆచార్యులు వక్కాణించి రని తాత్పర్యము.

అవ.—సమాధియందు తోఁచిన శుద్ధచైతన్యము తా నగుటకు పంచకోశ విలక్షణుఁడు కావలయు నని చెప్పుచున్నారు.

మ. సమ మానందము సాక్షి కేవలముఁ జిత్సద్రూప మేకంబు ని
త్యముఁ బూర్ణంబు తిరం బన న్వెలుఁగుప్రత్యక్తత్త్వమే బ్రహ్మమా
విమలబ్రహ్మము ప్రత్యగాత్మ యని తా వీక్షించి భేదానృతా
దిమహాతుచ్ఛమహాకకోశము ల్ద్రొలఁగి సందేహంబు బాయం దగున్.

టీ. సమము=త్రిగుణములు త్రిధామములు త్రిపదములు త్రికూటములు మొదలగు త్రయములను మీఱిన శుద్ధసత్త్వ స్వరూపమగు సామ్యావస్థామయ మయినదియును, ఆనందము=నిత్యనిరుపాధిక నిరతిశయానందరూపమైనదియును, సాక్షి=సర్వవిలక్షణమైనదియును, కేవలమును=ముఖ్యమైనదియును, చిత్=సాధనాంతర నిరపేక్షస్వయం ప్రకాశమానజ్ఞానాకారమైనదియును, సద్రూపము=త్రికాలాబాధ్యమైనదియును, ఏకంబు=సజాతీయవిజాతీయ స్వగతభేద శూన్యమైనదియును, నిత్యము=ఎల్లప్పుడును ఉండునదియును, పూర్ణంబు=విభాగింపఁగూడనిదియును, తిరంబు=నిలుకడను పొంది యుండునదియును, అరక్=అనుచున్న, వెలుఁగు ప్రత్యక్తత్త్వమే=ప్రకాశించుచున్న కూటస్థస్వరూపమే, బ్రహ్మము=పరమాత్మవస్తువు, అవిమలబ్రహ్మము, అ=పైనఁ జెప్పఁబడిన, విమల=అనైకాత్మిక మాయిక మాయేయ తిరోధానముల నెడు పంచమలములు లేని, బ్రహ్మము=హీనాధిక సమానరహిత పరబ్రహ్మము, ప్రత్యగాత్మ యని = జీవసాక్షియగు కూటస్థుఁడని, తాన్=పరమాత్మ ప్రత్యగాత్మ స్వరూపుఁడైన తాను, వీక్షించి = అపరోక్షదృష్టిచేత తెలిసికొని, భేదా..ములు-భేద = భిన్న భిన్న స్వత్వములతోఁ గూడి యుండు నవియును, అనృత=అసత్యము లయినవియును, ఆది=మొదలయిన జడమును దుఃఖమును గలవియును, మహత్=ఎక్కుడయిన, కూహక=కపటముగల ప్రకృతిమయము లయినవియును నయిన, కోశములు=పంచకోశములను, తొలఁగి=వదలి, సందేహంబుక్=శరీరేంద్రియ ప్రాణకోశాదులకు వేఱయిన పరమాత్మ నేనౌదునో కానో అనెడి అనుమానమును, పాయందగుక్=విడువవలయును.

తా. ఓయి శిష్యుఁడా! సత్తును చిత్తును ఆనందమును సమమును స్థిరమును సాక్షియును ఏకమును నిత్యమును పూర్ణమును అయి వెలిఁగెడి పరబ్రహ్మమే కూటస్థుఁడు. కూటస్థుఁడే పరబ్రహ్మ మని తెలిసి అనృత జడదుఃఖములకు ఆలయములయిన పంచకోశములు నేను గానని వదలి సత్యజ్ఞానానంద నిత్యనిర్మలాదిలక్షణములతోఁ గూడిన పరబ్రహ్మము నే నవుదునో కానో అనెడు సందేహమును విడిచి పరబ్రహ్మమే నేననెడు నిలుకడ గలిగి యుండు మని తాత్పర్యము.

అవ.—శిష్యుఁడు సర్వదృశ్యములును నశించినవెనుక కనఁబడెడు శూన్యమునా నేను పొందుట యనెడిసందేహమును పొంది యథార్థము నడుగుచున్నాఁడు.

ఉ. అన్నమయాదికోశయుతమై తనరారుఁ దనుత్రయంబు వి
ద్వన్నుత దాని వీడి కన దృశ్యాంతము భాసిలు నిర్విశిష్టమై
భిన్నము గాక వేఱొకటి వేఱ్కొన లేక తదీయశూన్యమే
యెన్నఁగ నానిజానుభవమేమొ యథార్థముఁ దెల్పుఁడీ యనన్,

టీ. విద్వన్నుత = పండితులచేత కొనియాడఁబడుచున్న, గురుమూర్తీ, తనుత్రియంబు = స్థూలసూక్ష్మ కారణదేహములు మూఁడును, అన్నమయాది కోశయుతమై, అన్నమయ=అన్నమయమే, ఆది=మొదలుగు, కోశ=పంచకోశములతోడ, యుతమై = కూడినదయి, తనరారుక్=ఒప్పును, అనఁగా అన్నమయ కోశముతో కూడినది స్థూలదేహమును, ప్రాణమయము మనోమయము విజ్ఞానమయము అనెడు మూఁడుకోశములతో కూడినది సూక్ష్మశరీరమును, ఆనందమయకోశముతో కూడినది కారణశరీరమును అనుట, దానిక్=ఆశరీరత్రయమును, వీడి=తొలఁగి, కనక్=దర్శింపఁగా, ధ్వాంతము= గాఢాంధకారము, నిర్విశిష్టమయి=అన్నియును నశింపఁగా మిగిలినది, భిన్నముగాక= భాగింపఁబడక, పేర్కొనక్ = పలుకుటకు, వేఱొకటిలేక=అచీఁకటికంటె మఱియొకటిలేక, భాసిలుక్=ప్రకాశించును, ఎన్నఁగక్=విచారింపఁగా, తదీయశూన్యమే= ఏమియులేని ఆచీఁకటియే, నానిజానుభవమేమొ = నాయొక్క స్వానుభూతియేమో, యథార్థముక్ = సత్యమును, తెల్పుఁడు=తెలియఁజెప్పుఁడు, అనక్ = ఇట్లని శిష్యుఁడు పలుకఁగాను.

తా. ఓగురుస్వామి! అన్నమయకోశముతోఁ గూడిన స్థూలదేహమును ప్రాణమయము మనోమయము విజ్ఞానమయము అనెడు మూఁడుకోశములతోఁ గూడిన సూక్ష్మశరీరమును ఆనందమయకోశముతోఁ గూడిన కారణదేహమును ఈమూఁడు శరీరములయందుఁగల కోశములును తత్త్వములును అవస్థలును అభిమానులును కర్మజ సహజ భ్రాంతిజము లనుటవలన వీనిని క్రమముగా నేను గాననివిడిచిన వెనుక అంతట నిండి యేమియును లేక పాడుగానున్న అంధకారమేనా నేను పొందఁ దగినది? నాయందు కనికర ముంచి యథార్థమును చెప్పఁ డని శిష్యుఁ డడిగ నని తాత్పర్యము.

అవ.__నామరూపాత్మకములయిన అంతర్బహిర్గ్రాహ్యములను నశింపఁజేసి శుద్ధచైతన్యమగు తన్ను దర్శించుటకు చీఁకటిని జూచువాఁడు శూన్యుఁడు కానియట్లు శూన్యమును జూచునీవే సర్వసాక్షి వని చెప్పుచున్నారు.

మ. సుత ము న్నాదశముండు తన్మఱచి తా శోకించి యామీఁద స్నేహితవాక్యంబులఁ దన్నెఱింగె నతఁ డూహింప నదా శూన్యుఁడే
మతిచే శూన్యముఖాఖిలంబు గని భ్రాంత్యంబు బంచు వర్జించి త
ద్వ్యతిరి క్తంబుగ నున్న సన్మయము నీవై యుండవా చూడఁగన్.

టీ. సుత=కుమారా, మున్ను=పూర్వము, ఆదశముండు=అనదినిదాఁటిన వారిలో పదియవవాఁడు, తన్మఱచి=తన్నేమఱచి, తాక్=తాను, శోకించి=దుఃఖించి, ఆమీఁదక్= పిమ్మట, స్నేహితవాక్యంబులక్=ఆప్తునిమాటలచేత, తన్నుక్=మఱచిన తన్ను, ఎఱిం

గన్ = తెలిసికొనెను, అతఁడు = ఆతెలిసికొన్నవాఁడు, ఊహింపన్ = ఆలోచింపఁగా, సదా = కాలత్రయమందును, శూన్యుఁడే = లేనివాఁడా, మతిచేన్ = ప్రజ్ఞచేత, శూన్యము ఖాఖిలంబున్, శూన్య = శూన్యమే, ముఖ = మొదలయిన, అఖిలంబున్ = సర్వదృశ్యమును, అనఁగా శూన్యమును అవ్యక్తమహదహంకార పంచతన్మాత్ర పంచభూత జగజ్జీవేశ్వరులు మొదలగువారిని, కని = చూచి, భ్రామ్యం బంచున్ = అచిత్ప్రకృతివలన వలయిన దని, వర్జించి = వదలి, తద్వ్యతిరిక్తంబుగన్ - తత్ = ఆయచిత్ప్రకృతివలన నయిన అవ్యక్తము మొదలగువానికంటె, వ్యతిరిక్తంబుగన్ = విలక్షణముగా, ఉన్న = ఉన్నట్టి, సన్మయము = సద్రూపపరబ్రహ్మమును, చూడఁగన్ = ఆలోచింపఁగా, నీవయి యుండవా = నీవుగానే ఉండవా, అనఁగా ఆపరబ్రహ్మము నీవే యగుదు వనుట.

తా. ఓయి శిష్యుఁడా! పూర్వము గురునియాజ్ఞచేత నది యీఁది వచ్చినవారిలో పదియవవాఁడు తన్ను లెక్కపెట్టక తొమ్మిదిమందినే పలుమాఱును లెక్కపెట్టి పదియవవాఁడు లేఁడని శోకించి వెనుక స్నేహితునిమాటలచేత మఱచిన తన్ను తెలిసికొనెను. పదియవవాఁడు లేఁడని యేడుచునప్పుడును యేడువకమునుపును యేడుపుడిగినతర్వాతను వాఁడు శూన్యుఁడు కాక ఉన్నట్టుగానే విజ్ఞానముచేత జగజ్జీవేశ్వరులును పంచభూతములును పంచతన్మాత్రములును మహదహంకారములును అవ్యక్తమును శూన్యమును అనెడు దృశ్యములను వీక్షించు నీవు కాలత్రయమందును శూన్యుఁడవు కావు గనుక సర్వదృశ్యములును పుట్టుటకును గిట్టుటకును కారణమైన పరబ్రహ్మమును నీవు సందర్శించితి వేని ఆ పరబ్రహ్మము నీవే యగుదు వని తాత్పర్యము.

శూన్య మనఁగా అవ్యక్తాది సర్వమును నశించినవెనుక నుండునది.

అవ — అట్టి యద్వితీయ శుద్ధచైతన్యము తనసన్నిధానమందు సమస్తమును పుట్టి గిట్టుచుండు నని చెప్పుచున్నారు.

చ. తనువులు మూఁడుఁ దద్దశలుఁ దద్దశద్రష్టలుఁ గాలకృత్యముల్
  చనుఁ బలుమాఱుఁ దోఁచి యిల సాగరమం దలలట్లు వాని నే
  మని యొఱిఁగింతు ముస్వరుఁడు మత్తి మీపమునందు దక్షిణా
  ననుఁ డయి తెల్పుశాసనముఁ నమ్మి వెలుంగుము సర్వసాక్షివై.

టీ. ఇలన్ = పుడమియందు, తనువులు మూఁడున్ = స్థూల సూక్ష్మ కారణ శరీరములు మూఁడును, తద్దశలన్ - తత్ = ఆమూఁడు శరీరములవి యైన, దశలన్ = జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలు మూఁడును, తద్ద్రష్టలన్ - తత్ = ఆమూఁడవస్థలను, ద్రష్టలును = విలక్షణులయిన విశ్వ, తైజస, ప్రాజ్ఞులును, విరాట్ హిరణ్యగర్భ, అవ్యాకృతులును, కాలకృత్యముల్, కాల = భూతభవిష్యద్వర్తమానకాలములయందలి, కృత్యముల్ =

సకలజగద్వ్యాపారములును, సాగరమందున్=సముద్రమందు, అలలట్లు=తరంగములవలెనే, పలుమాఱును=మాటిమాటికిని, తోఁచి=అపరబ్రహ్మమందే పుట్టి, చనున్=నశించుచుండును, వానిన్=ఆజీవేశ్వరుల దేహములను అవస్థలను, అభిమాననామములను త్రికాలములందును కలుగుచుండెడు సకల జగద్వ్యాపారములను, ఏమని యెఱిఁగింతున్ = ఎన్నియని చెప్పఁగలుగుదును, అనఁగా సముద్రమందు పుట్టి గిట్టెడి తరంగము లెన్నియని చెప్ప నలవిగానితీరున శరీరములు మొదలగునవి యెన్నియని చెప్ప నశక్య మనుట. మున్=పూర్వమందు, హరుఁడు=శివుఁడు, మఱ్ఱిసమీపమునందున్=వటవృక్షముచెంత, దక్షిణాననుఁడై=దక్షిణపుముఖముగాఁ గూర్చున్నవాఁడై, తెల్పుశాసనమున్-తెల్పు=సనకసనందన సనత్కుమార సనత్సుజాతాదిమునిపుంగవులకు ఉపదేశించినట్టి, శాసనమున్=మౌనరూపమైన జ్ఞానముద్రను, నమ్మి=విశ్వసించి, సర్వసాక్షివై=ముందు చెప్పిన సకలమునకును ద్రష్టవై, వెలుంగుము=తేజరిల్లుము.

తా. ఓయి శిష్యుఁడా! సముద్రమునందు అలలు మొదలగునవి పుట్టి గిట్టుచున్నట్లుగానే పరబ్రహ్మమందు వ్యష్టి సమష్టి స్వరూపులైన జీవేశ్వరుల స్థూలసూక్ష్మ కారణదేహములును ఆశరీరసంబంధములైన జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలును ఆయావస్థలయందుఁ గల జీవుని విశ్వతైజసప్రాజ్ఞనామములును ఈశ్వరుని విరాడ్ఢిరణ్యగర్భావ్యాకృతనామములును భూతభవిష్యద్వర్తమానకాలములయందు కలిగెడుఉత్పత్తిస్థితిలయాదులనెడి సకలజగద్వ్యాపారములును కలుగుచు మాఁగుచు నుండును. పూర్వము సనకసనందనాదిమునీంద్రబృందములకు దక్షిణామూర్తిలీలను వహించిన పరమశివుఁడు మఱ్ఱిచెట్టుక్రిందఁ గూర్చుండి బ్రహ్మతత్త్వవిషయముల నన్నిటిని బోధించి కడపట నే ముద్రను పూని జీవభావముగల నీవే పరబ్రహ్మ మనెడి అర్థమును బోధించు చిన్ముద్రను చూపెను గనుక ఆచిన్ముద్రను నమ్మి సర్వసాక్షివై వెలుఁగు మని తాత్పర్యము.

## పరమశివుఁడు దక్షిణామూర్తియైన చరిత్రము.

బ్రహ్మకు పుత్రుఁడయిన దక్షుఁడు ఫాలాక్షునితో విరోధించి అరుద్రకముగ యజ్ఞము చేయఁదలఁచి వేదములయందలి రుద్రసంబంధములైన మంత్రములను త్రోసివేసి ముల్లోకములలోఁ గల వారినందఱను తనమందిరమందు సభచేర్చి పేర్చినయుల్లాసముతో వారితో తాను వేదములయందలి రుద్రప్రతిపాదక మంత్రములను నెట్టుటను యజ్ఞముచేయ తలపెట్టుటను చెప్పఁగా ఆసభ్యులలో కొందఱు అతని అభిమతము నంగీకరించిరి. వేదపాక్షికులగు కొందఱు అతనిం గని నిటలాక్షునియందలి విపక్షముచేతనైన యీనీపక్షమును ఒప్పమని వేదపక్షముగ వాదించి విపక్షులై ఆదక్షునికి ఆసభలోనున్న అతనిపక్షపువారికిని శాపము లిచ్చి అచ్చట నిలువక స్వేచ్ఛగాఁ బోయిరి. అంతట

దక్షుఁడు అంతటితో నిలువక తనపక్షమును అంగీకరించినవారిని చేర్చుకొని పెల్లుబుక యుల్లాసముతో యజ్ఞము చేయునపుడు ఆదక్షునకు పుత్రికయును శివునకు భార్యయును అయిన దాక్షాయణి రుద్రద్రోహమును సహింపక అలుకవహించి శరీరమును తొరఁగెను. ఆవెనుక ఫాలాక్షుఁడు దక్షునియకృత్యములవలన దాక్షాయణి క్షయించుటను విని అక్షులయందు నిప్పులు కుప్పలుగరాలఁగా విలయకాలమందలిజ్వాలనునిలీల మండుచు అత్యుగ్రకోపముతో వీరభద్రుని పుట్టించి నీ వీక్షణముననే పోయి దక్షునిజన్మమును భిన్నము చేసి రమ్మన్న అతఁడు వేగముగ యాగశాలకుఁ జేరి అధ్వరమును విధ్వంసముచేసి అక్కడి దేవతలను మునులను దక్షునితోడ చక్కాడెను. పిమ్మట నిటలాక్షుఁడు ఆగ్రహమును మాని అనుగ్రహమును పూని వేఁడుకొను దక్షుని బ్రతికించెను. అప్పుడు వీరభద్రుఁడు రుద్రునకు నమస్కరించి యేమి స్వామీ యిన్నేండ్లయందు నన్నేల పుట్టించి జన్మమును భిన్నము చేయు మంటిరి. ఇప్పుడు దేవరయేల చక్కఁజేసితిరి. అని యడుగఁగా రుద్రుఁడు వీరభద్రుని అభిప్రాయమును తెలిసి తంత్రీమంత్రమైన దీర్ఘక్రోధమును పూనఁదగదు. నామాట దాఁటఁబట్టి మొదట నిగ్రహమును వెనుక అనుగ్రహమును చూపి వేలుపులను చంపితిని. బ్రతికించితిని. బ్రతికియున్నఁగదా నాసామర్థ్యమును వేలుపు లెఱుఁగుదురు. అని యతనిని కొంత శాంతునిం జేసి అసురేంద్రుని పుత్రికయైన మాయ యనుదానికి శూరపద్మ సింహవక్త్ర తారకాసురు లనెడు రాక్షసులును అజముఖి యనెడు రాక్షసస్త్రీయును పుట్టునట్లుగ వరమిచ్చి వారు పుట్టి తన్నుఁ గూర్చి తపస్సు చేసిన ప్రత్యక్షమై వేయిన్ని నూటయెనిమిది మహాయుగములు జీవించియుండునట్లుగాను వేయిన్ని నూటయెనిమిది బ్రహ్మాండములు పాలించునట్లుగాను బ్రహ్మాదిదేవతలను నిరంతరమును బాధలు పెట్టునట్లుగాను కట్టడఁజేసి వీరభద్రునకు సంతుష్టిగావించి నిశ్చలుండుండెను అనంతరము బ్రహ్మేంద్రాదిసురముఖ్యులు ఆరక్కసులచేత పెక్కువిధములైన బాధల ననుభవించుచు ఓర్వఁజాలక గర్వ ముడిగి అపూర్వసంపద్విలాసములుగల కైలాసమునకు వచ్చి నందికేశ్వరునికి వందనము లిడి అతనియానతిచేత లోపలఁజొచ్చి ఓచంద్రశేఖరేశ్వరా! మేము రక్కసులచిక్కులలో చిక్కుకొని చాల నొచ్చి మీసన్నిధికి వచ్చి మాకష్టములను విన్నవించితిమి. మాయందు అక్కటిక ముంచి ఆరక్కసుల నుక్కడంగించి మమ్ముఁ రక్షింపుము. మాదిక్కు తప్ప వేఱొక్కదిక్కు లేక నీవే దిక్కని యిక్కడికి వచ్చితిమి అని మొఱలు పెట్టిన కరుణానిధియైన హరుఁడు నే నొకకుమారుని పుట్టించి మీయిక్కట్టులను పోఁగొట్టెద నని అశరీరవాక్కులచేత అందఱు వినఁ బలికెను. అందులకు బృందారకు లందఱు డెందములయందు ఆనందమును పొంది తమతమమందిరములు చేరి యెంతో సంతోషముతో నుండిరి. వెనుక లోకేశ్వరుఁడైన మహేశ్వరుఁడు మహాకైలాసమునందు అక్షీణకృపతో దక్షిణామూర్తియై మఱ్ఱివృక్షముక్రింద నుండఁగా సనకాదిమునీంద్రులు మనస్సులు

చిక్కుబెట్టి బహుకాలము తపస్సులు చేసి అనుగ్రహముగ మోక్షమార్గము తెలియఁగోరి కైలాసమునకు చేరి దక్షిణామూర్తిలీలతో నున్న పరమశివునకు నమస్కరించి తత్త్వజ్ఞానోపదేశమును పొందు ఉద్దేశముతో మీసదేశమునకు వచ్చితిమి. మాయభీష్టమును నెఱవేర్చి సంతుష్టి చేయుఁ డని వేఁడుకొనఁగా మృడుఁడు ప్రసన్నచిత్తుఁడై మన్ననతో వారికి తత్త్వజ్ఞానమును బోధించి జీవేశ్వరైక్యసూచక మగు తత్త్వజ్ఞానముద్రను అత్యుగ్రమైన కటాక్షముతో ఉపదేశించెను. ఇది పరమశివుని యిరువదియైదు లీలలలో ఒక్కటి. దీనిని సంక్షేపముగ వ్రాసితిని. దీని విశేషవివరము దశకాండమందు వీక్షింపవలెను.

అవ: — తన్నెఱుంగుటకు సాధనము తనతెలివితక్క వేఱొక్కటి లేదని దృఢముగ నక్కాణించుచున్నారు.

మ. అనయం బెల్ల నెఱుంగునన్నుఁ గన నే యర్థంబు భాసిల్లు నం
చనరా దాత్మరుచి న్వెలుంగు రవి నెంతైనన్ వెలింగింప నో
పనె వేఱొం డిలఁ దన్నుఁ దాన కనియెం బుత్రా దశప్రాణులం
దున ము న్నాదశముండు వేఱొకరుఁ డెందుం గానరాఁడే కనన్.

టీ. పుత్రా=కుమారా! ఇలన్=భూమియందు, అనయంబున్=త్రికాలములయందును, ఎల్లన్=సకలమును, ఎఱుంగునన్నున్-ఎఱుంగు=తెలిసికొనెడి, నన్నున్=కూటస్థుఁడ నయిననన్ను, కనన్=దర్శించుటకు, ఏయర్థంబు=ఏవస్తువు, భాసిల్లున్=ప్రకాశించును. అనఁగా నన్నెఱుఁగ నేకారణము గలదనుట. అంచున్=అని, అనరాదు=పలుకకుము, ఆత్మరుచిన్-ఆత్మ=తనయొక్క, రుచిన్=కాంతిచేత, వెలుంగురవిన్=ప్రకాశించుసూర్యుని, ఎంతైనన్=ఎచ్చటనయినను, వేఱొండు=మఱియొక వస్తువు, వెలింగింపన్=ప్రకాశింపఁజేయుటకు, ఓపునె=శక్తిగల దగునా, మున్=పూర్వమందు, దశప్రాణులందునన్=పదిమందిలోపల, ఆదశముండు=ఆపదియవవాఁడు, తన్నున్=తన్ను, తాన=తానే, కనియెన్=చూచెను, ఎందున్=ఎచ్చటను, కనన్=విచారింపఁగా, వేఱొకరుఁడు=ఆపదుగురుగాక మఱియొకపురుషుఁడు, కానరాఁడే=కనఁబడఁడు గదా.

తా. ఓయి శిష్యుఁడా! అంతర బహిర్దృశ్యముల నెల్ల చూచెడు నన్ను చూచుటకు వేఱొకసాధనము గలదని పలుకకుము. లోకమున స్వయంప్రకాశమానుఁడగు సూర్యుని ప్రకాశింపఁజేయుటకు వేఱొకప్రకాశము కలుగదు. మున్ను పదిమందిలో పదియవవాఁడు తన్ను తాను తెలిసికొనెను గాని వేఱొక్కఁడు వానిని తెలిసికొనలేదు గాన తన్ను తానే తెలిసికొనవలయు నని తాత్పర్యము.

అవ:— సర్వజ్ఞత్వ కించిజ్జ్ఞత్వములను, ఎఱుకమఱుపులను, తొలఁగించి శుద్ధ చైతన్యమును దర్శింపించుచున్నారు.

ఉ. స్వప్రభ వెల్గుసర్వఘనసాక్షికి వేఱొకఁ డుండు నన్న నా
స్వప్రతిపక్షి చెందు ననవస్థ కుతర్కమునన్ ఫలంబు గా
విప్రవరేణ్య శూన్య మవివేకముచే నగు దాని సర్వదృ
శ్యప్రతతిం దొలంగి కని స్వాత్మను దత్సుఖ మొందు మాత్మలోన్.

టీ. విప్రవరేణ్య=శిష్యును అన్యుని పాపములనుండి రక్షించువారిలో ఉత్తముం డైన ఓయి శిష్యుఁడా! స్వప్రభన్ = తన తేజస్సుచేత, వెల్గుసర్వఘనసాక్షికిన్, వెల్గు=ప్రకాశించుచున్న, సర్వ=సకలబాహ్యాభ్యంతర దృశ్యములకు, ఘన = అధికుఁ డయిన, సాక్షికిన్=ద్రష్టకు, వేఱొకఁడు=మఱియొకద్రష్ట, ఉండు ననన్=కలఁడని పలికితి వేని, ఆస్వప్రతిపక్షి-ఆ=అట్టి, స్వ=బ్రహ్మభిన్న మగుటవలనగు తనకు, ప్రతిప క్షి=శత్రుత్వముగలవాఁడు, కుతర్కమునన్=కుత్సితవాదముచేత, ఫలంబుగాన్=ప్రయోజనముగాను,అనవస్థన్=నిల్కడ లేనిదోషమును, చెందున్=పొందును. శూన్యము= సకలదృశ్యములు తొలఁగిన పిమ్మటఁ దోఁచిన అంధకారరూపమయిన అభావము. అవి వేకముచేన్=అజ్ఞానముచేత,అగున్=అవును. దానిన్=ఆశూన్యమును, సర్వదృశ్యప్రత తిన్-సర్వ=సమస్తమయిన, దృశ్య=బాహ్యాభ్యంతరేంద్రియ వ్యాపారములయొక్క, ప్రతతిన్=సమూహమును, తొలంగి=విడిచి, స్వాత్మన్ = తాను, తానయినవస్తువును, కని = అపరోక్షదృష్టిచేత దర్శించి, ఆత్మలోన్ = నిర్మలాంతఃకరణమందు, తత్సుఖ మున్=ఆబ్రహ్మానందమును, ఒందుము=చెందుము.

తా. ఓయి శిష్యుఁడా! స్వయంప్రకాశముచేత వెలిఁగెడు సర్వసాక్షియగు తా నయిన ప్రత్యగభిన్న పరబ్రహ్మమునకు సాక్షి మఱియొక్కఁడు కలఁడని వాదించువాఁ డు తనకు తానే శత్రునయి నిలుకడలేనిదోషమును పొందును. అందున వాఁడు కడతే ఱఁడు కనుక సర్వదృశ్యములను అవి నశించినవెనుక తోఁచెడుశూన్యమును మాయాకల్పి తము లని అవి తాను గా నని నిరాకరించి తాను తా నయిన పరబ్రహ్మమును అపరోక్షజ్ఞా నముచేత దర్శించి ఆనందింపు మని ఆచార్యులు పలికి రని తాత్పర్యము.

అవ:—తానై వెలిఁగెడు పరబ్రహ్మమే సర్వప్రపంచమై ప్రకాశించు నని చెప్పు చున్నారు.

చ. మధురతరైక్షవంబున నమర్చిన భక్ష్యములందుఁ గల్గు త
న్మధురమె తద్గుడస్వగుణమై తగుఁ గాన సమష్టియే సుమీ

బుధనుత వ్యష్టి యాకరణిఁ గొ ల్చినయీశ్వరజీవభేదదు
ర్వ్యథ లనుపిష్టముం దొలఁచి వర్తిలు మాత్మ మహామనీషచేన్.

టీ. బుధనుత = ఆత్మానాత్మవివేకముగల పండితులచేత కొనియాడఁబడుచున్న ఓయి శిష్యుఁడా! మధురతరైక్షవంబునన్-మధురతర=మిక్కిలి తియ్యఁదనముగల, ఐక్షవంబునన్=బెల్లముచేత, అమర్చు...లందున్-అమర్చిన=పెద్దపఱిచిన, ఖాద్యములందున్= అతిరసములయందు, కల్గుతన్మధురతమె = కలిగియున్న ఆతియ్యఁదనమే, తద్గుడస్వగుణమై=ఆబెల్లపుస్వభావగుణమై, తగుఁగానన్ = ఒప్పును గనుక, సమష్టియే సుమీ=బెల్లముతోఁ గూడిన ఆపెద్దపిండిముద్దయే సుమా, వ్యష్టి=చిన్నచిన్నవియైన అతిరసములు, ఆకరణిన్=బెల్లము గలసిన పిండిముద్దయే అతిరసము లయినట్లుగాను, పొల్చిన...ర్వ్యథలు-పొల్చిన = సమష్టివ్యష్టిభేదములచేత వేఱువేఱుగా ప్రకాశించుచున్న, ఈశ్వర=మాయోపాధిగతుఁడై కారణస్వరూపుఁడైన ఈశ్వరుఁ డనెడు, జీవ = అవిద్యోపాధిగతులయి కార్యస్వరూపులయిన జీవులనెడు, భేద=సర్వజ్ఞత్వము కించిజ్జ్ఞత్వము అనెడు భిన్నభావములవలన పుట్టిన, దుర్వ్యథలు=చెడ్డవ్యాకులములు, అనుపిష్టమున్= అనెడు పిండిముద్దను, తొలఁచి=విడిచి, ఆత్మన్=పరబ్రహ్మమందు, మహామనీషచేన్= నిరతిశయమయిన బ్రహ్మజ్ఞానముచేత, వర్తిల్లుము=ఐక్యరూపముగ సంచరించుము.

తా. ఓయి శిష్యుఁడా! మాధుర్యముగల బెల్లపుపెల్లతోఁ గలసినపిండితో చేసిన అతిరసములయందలి మాధుర్యము బెల్లపునిజగుణమైనట్లు మాయావిద్యోపాధులచేత సమష్టివ్యష్టిభేదములు గలిగి సర్వజ్ఞత్వకించిజ్జ్ఞత్వములచేత వెలిఁగెడి యీశ్వరజీవమయమైన ప్రపంచమనెడు పిండిని విడిచి తియ్యఁదనమనెడు అఖండైకరసమయమైన పరబ్రహ్మమునీవై వెలుఁగుమని తాత్పర్యము. ఇచ్చట బెల్లపుపెల్లనంటిది సచ్చిదానంద పరబ్రహ్మ మని ఆబెల్లముతోఁ గలసిన పిండినంటిది సమష్టిరూపుఁడైన యీశ్వరుఁ డని ఆపిండితో చేసిన అతిరసముల వంటివారు జీవు లని గ్రహింపవలెను.

అవ:—అద్వితీయపరబ్రహ్మమందు నిలుకడ సిద్ధించుటకు అధిష్ఠానములకు ఐక్యమేకాని ఆపరోపములకు ఐక్యములేదని చెప్పుచున్నారు.

ఉ. అరయన్ బ్రహ్మము తత్పదంబునకు లక్ష్యార్థంబు లీవైన స
ద్వరకూటస్థుఁడు త్వంపదంబునకుఁ దద్వాచ్యార్థయార్థంబు లీ
శ్వరజీవాత్మలుగా వెలుంగుచు వినాశం బొందు నైక్యంబు నొం
దరు మాయామయు లౌటఁ గాన సుత తద్బ్రహ్మాత్మ లేకం బగున్.

టీ. సుత=కుమారా! అరయన్=విచారింపఁగా, బ్రహ్మము=పరమాత్మ, తత్పదంబునకున్=తత్త్వమసి యను మహావాక్యమందలి తచ్ఛబ్దమునకును, ఈవు = నీవు,

ఏన సద్వ్యోమకూటస్థుఁడు-ఏన=అయినట్టి, సత్=త్రికాలాబాధ్యమైన, పర=శ్రేష్ఠమైన, కూటస్థుఁడు=ప్రత్యగాత్మ, త్వంపదంబునకున్ = త్వంపదమునకును, లక్ష్యార్థంబులు= లక్ష్యార్థములు, అనఁగా విజ్ఞానముచేత తెలిసికొనఁదగిన వస్తువు తద్వాచ్యార్థయుగ్మంబులు-తత్=ఆతత్పదత్వంపదములకు, వాచ్య=వాచ్యార్థములైన, అనఁగా పలుకుటకుఁ దగినవి యైన, ఉగ్యయుగ్మంబులు = ద్వివిధములయిన పదార్థములు, ఈశ్వరజీవాత్మలుగాన్-ఈశ్వర=సమష్టిస్వరూపుఁడైన యీశ్వరుఁడు గాను, జీవాత్మలుగాన్= వ్యష్టి స్వరూపుఁడైన జీవుఁడునుగాను, వెలుఁగుచున్=ప్రకాశించుచు, మాయామయలౌటన్-మాయా=మలినసత్త్వప్రధాన ప్రకృతియొక్క, మయలౌటన్=సత్త్వరజస్తమోగుణ వికారస్వరూపు లగుటచేత, వినాశం బొందురు= లయింతురు, ఐక్యంబు నొందరు=ఒక్కటి గానేరరు, కానన్=కనుక, తద్బ్రహ్మాత్మలు-తత్ = ఆతత్పదత్వంపద లక్ష్యార్థస్వరూపుఁడైన, బ్రహ్మాత్మలు = పరమాత్మయును ప్రత్యగాత్మయును, ఏకం బగున్=ఒక్కటే యగును.

తా. ఓయి శిష్యుఁడా! తత్పదమునకు లక్ష్యార్థము పరమాత్మయును వాచ్యార్థము ఈశ్వరుఁడును త్వంపదమునకు లక్ష్యార్థము ప్రత్యగాత్మయును వాచ్యార్థము జీవుఁడును గనుక లక్ష్యార్థములైన పరమాత్మకును ప్రత్యగాత్మకును ఐక్యము గలుగును. వాచ్యార్థములైన యీశ్వరుఁడును జీవుఁడును మాయామయు లగుటచేత ఒకరితో నొకరికి ఐక్యము గలుగక నశింతు రని తాత్పర్యము.

అవ.—గురువులు జీవేశ్వరులతారతమ్యములను చెప్పుచున్నారు.

ఉ. భేదము లీశజీవులయభిఖ్యలుఁ దన్మహదల్పశక్తిసం
మోద మతిప్రకాశగుణమూర్తులు ద్యోబలిసద్మముల్బలెన్
మేదినిఁ జెప్ప నొప్పు వినుమిథ్యలు గానఁ దదైక్య మొప్ప దా
భేదములం దొలంగి మదిఁ బెంపు దలిర్ప వెలుంగు మర్భకా. ౧౦౮

టీ. అర్భకా=పుత్రా, వినుము = ఆకర్ణింపుము, ఈశజీవులయభిఖ్యలున్, ఈశ= కారణోపాధిగల యీశ్వరునియొక్కయు, జీవుల = కార్యోపాధిగల చిదాభాసునియొక్కయు, అభిఖ్యలును = విరాట్టు హిరణ్యగర్భుఁడు అవ్యాకృతుఁడు విశ్వుఁడు తైజసుఁడు ప్రాజ్ఞుఁడు అను పేళ్లును, తన్మ... ర్తులును - తత్ = ఆయీశ్వరునియొక్కయు జీవునియొక్కయు, మహత్ =అధికములైన, అల్ప = స్వల్పములయిన, శక్తి=సామర్థ్యములును, సంమోద = ఆనందములును, మతి = జ్ఞానములును, ప్రకాశ = తేజస్సులును, గుణ = సర్వజ్ఞత్వమును కించిద్‌జ్ఞత్వమును, మూర్తులున్ = దేహములును, మేదినిన్= భూమియందు, ద్యోబలి సద్మముల్బలెన్=స్వర్గమువలెను పాతాళమువలెను, భేదములు=

దత్తుండను=దేవదత్తుఁడు, అనన్ = అని పలుకఁగా, తదీయమిశ్రము, తదీయ=ఆజహల్లక్షణ అజహల్లక్షణములయొక్క, మిశ్రము = చేరిక, అగున్=అవును, అనఁగా విడిచి విడువని లక్షణ మగు ననుట, ఉర్విన్=భూమియందు, విపశ్చిజ్జనుల్=పండితులు, మర్మవాక్యములన్=గూఢార్థములుగల మాటలయందు, వీనిచేన్=ఈమూఁడులక్షణములచేత, లక్ష్యమా నిజమున్=కనఁబడెడి సత్యమైన అర్థమును, రాణింపన్=స్పష్టమగునట్లుగాను, కందురు=గ్రహింతురు.

తా. ఓయి శిష్యుఁడా! గంగానదియందు గొల్లపల్లె యున్నదనిన ప్రత్యక్షవిరోధము గనుక గంగానదిని ప్రవాహమును విడిచి గంగనడిమిదిబ్బయందు గొల్లపల్లె యున్నదని గ్రహించుట జహల్లక్షణము. ఎఱ్ఱని నల్లనిగుఱ్ఱలుకట్టిన టెక్కెములు పోవుచున్నవనిన ప్రత్యక్ష విరోధము గావున ఆ టెక్కెములను విడువకయే వానిని పట్టుకొన్న మనుష్యులు పోవుచున్నారని యెఱుఁగుట అజహల్లక్షణము. బాల్యమునఁ జూచిన ఆ దేవదత్తుఁడే ముసలితనమునఁ జూచిన యీ దేవదత్తుఁడు అని గ్రహించుట జహదజహల్లక్షణము అని పండితులు శ్రుతిస్మృతిపురాణేతిహాసాదులలో గూఢార్థములుగల వాక్యములయందు ఈ మూఁడులక్షణముల చేత నిజార్థమును తెలిసికొందురని తాత్పర్యము.

అవ.—జహదజహల్లక్షణమును దృష్టాంతపూర్వకముగఁ జెప్పుచున్నారు.

చ. తగ నెఱిఁగింప నొప్పినయతం డితఁడే యనుశబ్దవాచ్యభి
న్నగతవిదేశకాల దశానామముల న్మఱి వాఁడు వీఁ డటం
చొగి ననుసర్వము న్విడిచి యూర్జితలక్ష్యముఁ బాయకున్నఁ బెం
పున నొక దేవదత్తుఁ డనుపూరుషుఁ గన్గొనఁ జూపు వేడుకన్. ౧౧౧

టీ. తగన్=తగునట్లుగా, ఎఱిఁగింపన్=[illegible]గాను, ఒప్పినయతండు=తెలిసికొనఁబడిన ఆపురుషుఁడే, ఇతఁడు = ఈపురుషుఁడు, అను...నామములన్, అను=అగునెడి, శబ్ద=సోయం దేవదత్త యను శబ్దమునందుండెడి, వాచ్య=వాచ్యార్థమందలి, భిన్న=వేఱుపాటును, గత=పొందిన విదేశ=దేశభేదమును, కాల=భూతభవిష్యద్వర్తమానకాలములను, దశ=బాల్యకౌమార యౌవనాద్యవస్థలను, నామములన్=ఆయాదేశకాలావస్థలయందు కలిగిన పేళ్ళను, మఱి=మఱియును, వాఁడు=వాఁడె, వీఁడు=ఈపురుషుఁడు, అటంచున్=అని, ఒగిన్=క్రమముగా, అనుసర్వమున్=అనువట్టి సర్వమును, విడిచి=విసర్జించి, ఊర్జితలక్ష్యమున్=[illegible]మయిన లక్ష్యార్థమును, పాయకున్నన్=విడువకయుండెనేని, పెంపుగన్=అతిశయము గాను. ఒక దేవదత్తుఁడు=ఒకఁడైన దేవదత్తుఁడు, అనుపూరుషున్=అనెడుమనుజుని, వేడుకన్=ఉల్లాసముతోడ, కన్గొనన్=దర్శించుటకు, చూపున్=కనఁబడుచును.

శా. ఓయి శిష్యుఁడా! పూర్వము కాశ్మీరదేశమునుండి దేవదత్తుఁ డనువాఁడు ఒకవ్యాపారమున చెన్నపురికి వచ్చెను. రామనాథపురమునుండి యజ్ఞదత్తుఁ డనువాఁడు ఒకవ్యాపారమున ఆచెన్నపురమునకే చేరి ఒకతరగరిద్వారమున నాయిద్దఱును కొంతకాలము వర్తకము చేసి సరకులైపోఁగానే వారివారిదేశములకు పోయిరి. పిమ్మట బహుకాలమునకు ఈదేవదత్తుఁడును యజ్ఞదత్తుఁడును మఱియొక వ్యాపారముచేత రాజమహేంద్రపురమందు చేరిరి. అప్పుడు యజ్ఞదత్తుఁడు దేవదత్తునిఁ జూచి అనుమానించి కొంతసేపటికి జ్ఞప్తితెచ్చుకొని ఆదేశమును ఆకాలమును ఆవయస్సును ఆవేషమును ఆవ్యాపారమును ఆపేరును ఆరూపమును ఈదేశమును ఈకాలమును ఈవయస్సును ఈవేషమును ఈవ్యాపారమును ఈరూపమును ఈపేరును శోధించి వదలి లక్ష్యార్థమైన దేవదత్తుని వదలక ఆదేవదత్తుఁడే యీదేవదత్తుఁ డని గ్రహించి సంభాషించి ఆనందించెను గనుక నిదే విడిచి విడువనిలక్షణ మని తాత్పర్యము.

అవ.—ఈదృష్టాంతమునకు మహావాక్యార్థమందు దార్ష్టాంతికమును చెప్పుచున్నారు.

చ. మతిఁ దత్త్వంపదవాచ్యముల్ దొలఁగ సన్మానింప లక్ష్యార్థముల్
తతతల్లక్ష్యయుగంబు నేక మని యాత్మన్భాసిలం జేసి సం
తత మద్వైతముఁ జూపుఁ దా నసిపదార్థం బెంతయుం గాన నా
శ్రుతివాక్యార్థ యథార్థము న్గనుమునీశుద్ధాంతరంగంబునన్. ౧౧౨

టీ. మతిన్=తెలివిచేతను, తత్త్వంపదవాచ్యముల్-తత్=అది అను తత్పదము యొక్కయు, త్వంపద=నీ వను త్వంపదముయొక్కయు, వాచ్యముల్=వాచ్యార్థము లయిన యీశ్వరజీవులు ఉపాధులతోఁ గూడి నశించువా రగుటను తెలిసి, తొలఁగన్=వదలునట్టుగాను, లక్ష్యార్థముల్=లక్ష్యార్థము లయిన పరమాత్మ ప్రత్యగాత్మలను, సన్మానింపన్=నశింపనివా రని తెలిసి గౌరవించునట్టుగాను (పిమ్మట) తతతల్లక్ష్యయుగంబున్-తత=అతిశయమైన, తత్=ఆతత్త్వంపదములయందలి, లక్ష్య=లక్ష్యార్థము లయిన పరమాత్మ ప్రత్యగాత్మలయొక్క, యుగంబున్=జంటను, ఏక మని=ఒక్కటే యని, అనఁగా పరమాత్మయే ప్రత్యగాత్మ యని ప్రత్యగాత్మయే పరమాత్మ యని, ఆత్మన్=ఉల్లమునందు, భాసిలన్=వెలుఁగునట్లుగాను, చేసి=ఒనర్చి, తాన్=తా నయిన, అసిపదార్థంబు=అసి యనుశబ్దమందలియర్థము, సంతతము=ఎల్లప్పుడును, అద్వైతమున్="బ్రహ్మమాత్ర మసన్నహి" యనెడు శ్రుతిచేత అసద్రహితమైన అఖండపరబ్రహ్మమును, ఎంతయున్=మిక్కిలి, చూపున్=కనఁబఱచును, కానన్=కావునఁ బట్టి, ఆశ్రుతివాక్యార్థయథార్థమున్-ఆ=ఆప్రసిద్ధమైన, శ్రుతి=సామవేదమందలి, వాక్య=తత్త్వమసి యను ఉపదేశమహావాక్యముయొక్క, అర్థ=బ్రహ్మాత్మలకు ఐక్యరూప మగు అసిపదార్థ

మందలి, యథార్థముగా = సత్యముగా, నీ శుద్ధాంతరంగంబునకా = నిర్మలమైన అంతఃకరణమందు, కనుము = ఎఱుఁగుము.

తా. ఓయి శిష్యుఁడా! నాచేత ఉపదేశింపఁబడిన సామవేదమహావాక్యమగు తత్త్వమసి యందలి తత్త్వంపదములకు వాచ్యార్థములై స్థూలశరీరాదులతోఁ గూడిన యీశ్వర జీవభేదములు తోఁచుచున్నట్లు తత్త్వంపదములకు లక్ష్యార్థములగు పరమాత్మ ప్రత్యగాత్మలు ఉపాధిరహితులగుటవలన వారినివిడువక జహదజహల్లక్షణచేత బ్రహ్మమే కూటస్థుఁడు. కూటస్థుఁడే బ్రహ్మమనెడు అఖండైకరసమగు అద్వితీయ పరబ్రహ్మమును అని యర్థము భాసించును గనుక ఆయర్థమును నీపరిశుద్ధాంతఃకరణమందు తెలిసికొనుమని తాత్పర్యము.

## చతుర్విధమహావాక్యార్థవివరము.

పరబ్రహ్మమును తెలియఁజేయునవియై పరబ్రహ్మమువలె [illegible]వవియై ప్రకాశించు నాలుగువేదములలో ఋగ్వేదమందు ,,ప్రజ్ఞానం బ్రహ్మ" అనెడు సాక్షాత్కార మహావాక్యమును, యజుర్వేదమందు ,,అహం బ్రహ్మాస్మి" యను అనుభవమహావాక్యమును, సామవేదమందు ,,తత్త్వమసి" యను ఉపదేశమహావాక్యమును, అథర్వవేదమందు ,,అయమాత్మా బ్రహ్మ" యను సమాప్తిమహావాక్యమునుగా నాలుగు మహావాక్యములు గలవు. ఈనాలుగు మహావాక్యములే నాలుగువేదములు గనుక ఆవేదములను ఆధారము చేసికొని యీవాక్యార్థములను విచారించెడు ముముక్షువులకు చిత్తశుద్ధి గలుగుటకు కర్మకాండమును గురువులయందును జ్ఞానశాస్త్రములయందును నమ్మకము గలుగుటకొఱకు భక్తికాండమును బ్రహ్మసాక్షాత్కారజ్ఞానముకొఱకు జ్ఞానకాండమును అనెడు మూఁడుకాండములు ఒక్కొక్క వేదమునకుఁ గలిగిన నాలుగు వేదములును ప్రత్యేకముగా విస్తరింపఁబడెను.

వేదములు నాలుగుగా నుండక ఐదు ఆఱు నూఱుగాఁ గాని లేక ఒక్కటిగాఁ గాని ఉండరాదా? అనిన ఒకవాక్యమందే వేదపురుషుని యభిప్రాయ మంతయును ముగియనందున తొలుత ఋగ్వేదమందు ,,ప్రజ్ఞానం బ్రహ్మ" యను సాక్షాత్కారవాక్యమును నిరూపించి దానిచేత అనుభవము గలుగనందున యజుర్వేదవాక్యమగు ,,అహం బ్రహ్మాస్మి" యను మహావాక్యముచేత అనుభవమును చూపెను. ఆయర్థము చక్కఁగా తెలియుటకు మూఁడవది యగు సామవేదమందలి ,,తత్త్వమసి" యను మహావాక్యముచేత ఉపదేశక్రమమును తెలిపెను. అదే సంపూర్ణ మని సమాప్తిని పొందుటకు అథర్వవేదమందు ,,అయమాత్మా బ్రహ్మ" యను మహావాక్యము జనించెను గనుక వేదములు అనేకములు గాక నాలుగే అయ్యెను.

మఱి నాలుగుమహావాక్యములలో ఉపదేశమహావాక్యమైన తత్త్వమసి యను దానియందు తత్పద మని త్వంపద మని అసిపద మని మూఁడుపదములు గలవు. వీనియందు అది యనెడి అర్థముగల తత్పదమునకు వాచ్యార్థ మని లక్ష్యార్థ మని రెండు గలవు. వానిలో వాచ్యార్థ మనఁగా మూలావిద్యాస్వరూపమగు మాయయందు పరబ్రహ్మచ్ఛాయాప్రతిబింబితుఁడైన యీశ్వరుండును, వానిస్థూలసూక్ష్మకారణశరీరములును జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలును, ఆయవస్థలయందుఁగల అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ ఆనందమయ కోశములును, ఆకోశములయందు అభిమానముగల విరాట్టు హిరణ్యగర్భుఁడు అవ్యాకృతుఁడు అనెడు నామములును, సర్వజ్ఞత్వాదిగుణములును గూడి తత్పద వాచ్యార్థము. వీని కన్నిటికిని విలక్షణమై సత్యజ్ఞానానంద నిత్యనిర్మలత్వములు గల పరమాత్మ తత్పదలక్ష్యార్థము. నీ వనెడు అర్థముగల త్వంపదమునకు వాచ్యార్థ మని లక్ష్యార్థ మని రెండు గలవు. వానిలో వాచ్యార్థ మనఁగా తూలావిద్యాస్వరూపమైన అవిద్యయందు ప్రతిబింబించిన బ్రహ్మచ్ఛాయాస్వరూపుఁడైన జీవుఁడును వానిస్థూలసూక్ష్మకారణశరీరములును ఆశరీరములయందుఁగల జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలును, ఆయవస్థలయందుఁగల అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ ఆనందమయ కోశములును, ఆకోశములయందు అభిమానముగల విశ్వతైజస ప్రాజ్ఞనామములును, కించిత్జ్ఞత్వాదిగుణములును గూడి త్వంపద వాచ్యార్థము. వీని కన్నిటికిని విలక్షణుఁడైన ప్రత్యగాత్మ త్వంపదమునకు లక్ష్యార్థము. ఎఱ్ఱావునకును నల్లావునకును ఐక్యము కూడనట్లు ఉభయవాచ్యార్థములకును ఐక్యము సంఘటింపదు. ఎఱ్ఱావుపాలకును నల్లావుపాలకును ఐక్యము కలుగునట్లు ఉభయలక్ష్యార్థములకును ఏకమత్యము కలుగును. పండితులు జహల్లక్షణ అజహల్లక్షణ జహదజహల్లక్షణ అనెడు మూఁడులక్షణములను గ్రహించి శ్రుతిస్మృతులయందలిశబ్దములకు అర్థములను నిర్ణయించునప్పుడు ఎక్కడ ఏలక్షణ ఉపయోగమో అక్కడ ఆలక్షణను ఉపయోగించి నిజమైన అర్థమును తెలిసికొందురు. వాచ్యార్థమును అంగీకరించినచోట ప్రత్యక్షవిరోధము తోఁచినపక్షమున అక్కడ లక్ష్యార్థమును అంగీకరింపవలయును. ఎట్లనఁగా ‘‘గంగాయాం ఘోషః ప్రతివసతి’’ అనెడువాక్యమందు గంగాజలమందు గొల్లపల్లె ఉన్న దన్నయెడల ప్రత్యక్షవిరోధము గనుక గంగాజల ప్రవాహమును విడిచి తీరమున గొల్లపల్లె యున్న దని యోంచవలెను. ఇదే జహల్లక్షణ.

‘‘మంచాః క్రోశంతి, కుంతాః ప్రవిశంతి, శోణో ధావతి, నీలో ధావతి’’ అనువాక్యములయందు మంచములు అఱచుచున్నవి. ఈఁటెలు పొడుచుచున్నవి. నల్లనియెఱ్ఱని టెక్కెములు పోవుచున్నవి అనుటయందు మంచములు అఱవనేరవు. ఈఁటెలు పొడువనేరవు. ఎఱ్ఱనినల్లని టెక్కెములు పోనేరవుగనుక మంచములనువిడువకయే మంచములను

విడువకరయే మంచముమీఁద నున్నవారు అఱచుచున్నారు. ఈఁటెలను విడువకయేయీఁ టెలను పట్టుకొన్నవారు పోవుచున్నారు. ఎఱ్ఱనినల్లనిధ్వజములను విడువకయే వానిని పట్టుకొన్నవారు పోవుచున్నారు అనుట అజహల్లక్షణ.

“సోఽయం దేవదత్తః” అనెడు వాక్యమునకు ముందు ఒక్కదేశమందు ఒక కాలమున ఒకవయస్సున ఒకరూపమున ఒకవేషమున ఒకవ్యాపారమున ఉన్న ఒకపురుషుని మఱియొకఁడు చూచి పిమ్మట బహుకాలము జరిగినవెనుక ఆపురుషునినే మఱియొకదేశమందు మఱియొకకాలమందు మఱియొకవయస్సున మఱియొకవేషమున మఱియొకరూపమున మఱియొకవ్యాపారమును చేయునపుడు చూచి మునుపు చూచినదృష్టి చేత ఆలోచించి వానితో మాటలాడి ఆదేశమును ఆకాలమును ఆవయస్సును ఆవేషమును ఆవ్యాపారమును ఈదేశమును ఈకాలమును ఈవయస్సును ఈవేషమును ఈరూపమును ఈవ్యాపారమును వదలి ఆపురుషుని వదలక ఆపురుషుఁడే యీపురుషుఁ డని ప్రత్యక్షముగ తెలియుట జహదజహల్లక్షణ.

ఇట్లే దార్ష్టాంతికమందు జహల్లక్షణ అజహల్లక్షణ జహదజహల్లక్షణ లెట్లనఁగా స్థూలసూక్ష్మకారణదేహములును, వానియందలి జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలును, వానియందలి అన్నమయాదిపంచకోశములును, విశ్వతైజసప్రాజ్ఞనామములు, అవిద్యాకల్పితము లౌటవలన నశించునవి ఆత్మనశింపనిది కనుక దేహేంద్రియాదులే ఆత్మ యనుట ప్రత్యక్షవిరోధము కాఁబట్టి ఆదేహేంద్రియాదులను వదలి వీనికి విలక్షణముగ పరమాత్మ యున్నాఁ డనుట జహల్లక్షణ. ఈజహల్లక్షణను అంగీకరించినయెడల ఉపాసకుఁడును ముముక్షువును లేకపోవుచున్నారు గావున అందునిమిత్తము జహల్లక్షణను గ్రహింపవలయును.

అజహల్లక్షణ యనఁగా ఈదేహేంద్రియాదులతో కూడి జీవుఁడైన తాను తనకు ఉపాస్యుఁడైన యీశ్వరుని మాయాకల్పితములైన స్థూలసూక్ష్మకారణ దేహములను, జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలను, వానిజ్ఞానేంద్రియ కర్మేంద్రియఅంతరింద్రియములైన సూర్యాదిదేవతలను, అన్నమయాదికోశములను విరాట్‌హిరణ్యగర్భ అవ్యాకృతనామములను, వాని కిరీట మకర కుండలాది భూషణములను, వస్త్రపుష్పహార చందనాదులను, వానివిచిత్రములను విడువక అపరోక్షజ్ఞానము కలిగెడువఱకు నవవిధములైన అంగములుగల త్రివిధభక్తులచేత ఆరాధించుచు స్తుతించుచు ధ్యానించుచు ఉండుటయే అజహల్లక్షణ.

జహదజహల్లక్షణ యనఁగా “ఏకమేవా ద్వితీయం బ్రహ్మ, నేహ నానాస్తి కించన, బ్రహ్మమాత్రమసన్నహి, పురుషాన్న పరం కించిత్, పురుష ఏవేదగ్ం సర్వం

సర్వం ఖల్విదం బ్రహ్మసత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" అను శ్రుతులను పట్టి నిర్మలాంతఃకరణుఁడై పరోక్షజ్ఞానము నశింపఁగా సాధన చతుష్టయ సంపన్నుఁడై సద్గురుని వద్ద చేరి తత్త్వమస్యాది మహావాక్యశ్రవణ మనననిదిధ్యాసములచేత లభించిన పూర్ణాపరోక్షజ్ఞానముగలవాఁడగుచు అవిద్యాకల్పితములైన జీవశరీరాదులను మాయాకల్పితములైన యీశ్వరశరీరాదులను విడిచి జీవసాక్షియైన ప్రత్యగాత్మను ఈశ్వరసాక్షి యయిన పరమాత్మను విడునక దీపప్రకాశమే దివిటీప్రకాశమైనట్లు త్వంపదలక్ష్యార్థమైన ప్రత్యగాత్మయే తత్పదలక్ష్యార్థమైన పరమాత్మ. ఆపరమాత్మయే ప్రత్యగాత్మ అని యొకటిఁగా నేయిగా నుండునే జహదజహల్లక్షణ.

"ప్రజ్ఞానం బ్రహ్మ" అను ఋగ్వేదమందలి సాక్షాత్కారమహావాక్యమునకు అర్థము. ఈవాక్యమందును ప్రజ్ఞానం బ్రహ్మ అని రెండుపదములు గలవు. వానిలో ప్రజ్ఞాన శబ్దమునకు, "శ్లో. ఏనేక్షతే శృణోతీదం జిఘ్రతి వ్యాకరోతి చ, స్వాద్వస్వాదూ విజానాతి తత్ప్రజ్ఞానమితీర్యతే" తా. స్వాధిష్ఠాన చిదాభాసుఁడైనజీవుఁడు కన్నులనుండి బయలుదేఱిన అంతఃకరణవృత్తితో కూడి ఏజ్ఞానమువలన నలుపు తెలుపు మొదలయినవానిని ఎఱుఁగుచున్నాఁడో చెవులనుండి బయలుదేఱిన అంతఃకరణవృత్తితో కూడి యేజ్ఞానమువలన సకలశబ్దములను వినుచున్నాఁడో ఘ్రాణేంద్రియమునుండి బయలు దేఱిన అంతఃకరణవృత్తితోఁ గూడికొని యేజ్ఞానమువలన త్రివిధగంధములను ఎఱుఁగుచున్నాఁడో వాక్కునుండి బయలుదేఱిన అంతఃకరణ వృత్తితోఁ గూడి యేజ్ఞానమువలన మాటలాడుచున్నాఁడో నాలుకనుండి బయలుదేఱిన అంతఃకరణవృత్తితోఁ గూడి యేజ్ఞానమువలన ఉప్పు పులుసు వగరు కారము మొదలగువానిని ఎఱుఁగుచున్నాఁడో మఱియునునోరు చేయి మొదలయిన సకలేంద్రియములనుండి బయలుదేఱిన అంతఃకరణవృత్తితోఁగూడి బాహ్యాంతరసర్వవిషయములను ఎఱుఁగుచున్నాఁడో అజ్ఞానమే ప్రజ్ఞానమనుపదమునకు అర్థము.

బ్రహ్మపదమునకు అర్థము, "శ్లో. చతుర్ముఖేంద్రదేవేషు మనుజాశ్వగజాదిషు, చైతన్యమేకం బ్రహ్మాత్మ ప్రజ్ఞానం బ్రహ్మమేద్యపి" తా. చతుర్ముఖబ్రహ్మమొదలయిన దేవతలందును మనుష్యులయందును గుఱ్ఱములు ఏనుఁగులు మొదలయినవానియందును కలసి యేచైతన్య మున్నదో ఆచైతన్యమే బ్రహ్మమనుపదమునకు లక్ష్యార్థము. బ్రహ్మపదమునకు బ్రహ్మమొదలు తనశరీరపర్యంతమైన సకలశరీరములును వాచ్యార్థము గనుక మాయాకార్యమని తోఁచియుఁడగినది. ఓయి శిష్యుఁడా! వాచ్యార్థమును తోఁచియుఁగా మిగిలినపరబ్రహ్మస్వరూపమే నాయందును నీయందును సర్వమందును ఉండెడి ప్రజ్ఞానమనెడి చైతన్యము అదియే బ్రహ్మస్వరూపము. చైతన్య మని ప్రజ్ఞాన మని బ్రహ్మ మని ఆత్మ యని పేర్లుమాత్రమే వేఱు గాని వస్తువు ఒక్కటే గనుక నేనే

బ్రహ్మ మని నిశ్చయించుకొనుము. ఇది బ్రహ్మజ్ఞానము. బ్రహ్మస్వరూప మని వాక్యార్థము.

"అహం బ్రహ్మాస్మి" అనెడి యజుర్వేదమందలి అనుభవ మహావాక్యమునకు అర్థము. అహం బ్రహ్మ అస్మి అని మూఁడుపదములు. వీనిలో అహంపదమునకు ॥శ్లో॥ పరిపూర్ణఃపరాత్మాస్మిన్ దేహేవిద్యాధికారిణి, బుద్ధేస్సాక్షితయా స్థిత్వా స్ఫురన్ అహమితీర్యతే॥ తా॥ సర్వత్ర పరిపూర్ణమైనపరమాత్మ బ్రహ్మవిద్యకు యోగ్యమైన యీశరీరమందు బుద్ధికి సాక్షిగా నుండుకొని స్ఫురించుచున్న అహమనెడి పదము లక్షణావృత్తిచేత చెప్పఁబడు ననిన అహమనునప్పుడు చైతన్యము నిర్వికారము గనుక అహ మననేరదు. అహంకారము జడము గనుక అహ మని తోఁచనేరదు. పరమాత్మస్వరూపమైన చైతన్యమే అహంకారముతోఁ గూడి అహమని స్ఫురించుచున్నది. కాఁబట్టి జడమయిన అహంకారమును వదలి చైతన్యమాత్రమే అహ మనెడిపదమునకు అర్థ మని యెఱుఁగుము.

బ్రహ్మ మనెడుపదమునకు అర్థము, ॥శ్లో॥ స్వతః పూర్ణఃపరాత్మాత్ర బ్రహ్మశబ్దేన వర్ణితః, అస్మీత్యైక్యపరామర్శస్తేన బ్రహ్మభవామ్యహమ్॥ తా॥ తనకు తానే పరిపూర్ణమైన పరమాత్మ యీమహావాక్యములయందు బ్రహ్మమనెడి పదమునకు లక్ష్యార్థము. ఏకారణమును బట్టి సర్వత్ర పరిపూర్ణుఁడై యుండెడి ఆత్మ పరబ్రహ్మమో ఆకారణమువలననే బుద్ధికి సాక్షియై యుండెడి నేనే పరబ్రహ్మమైతి నని అస్మి అనెడుపదముచేత ఐక్యమును ప్రతిపాదించుచున్నది గనుక నీవును అట్లే బుద్ధికి సాక్షివై యుండుటచేత నేనే పరబ్రహ్మ మని నిశ్చయించికొనుము.

"అయమాత్మా బ్రహ్మ" మనెడి అథర్వణమందలి సంపూర్ణ మహావాక్యమునకు అర్థము. ఈవాక్యమందు అయం ఆత్మా బ్రహ్మ అని మూఁడుపదంబులు గలవు. వానిలో అయం అనెడిపదమునకు అర్థము. ॥శ్లో॥ స్వప్రకాశాపరోక్షత్వ మయ మిత్యుక్తితో మతమ్, అహంకారాదిదేహాంతాత్ప్రత్యగాత్మేతి గీయతే॥ తా॥ అయం అనెడిపదముచేత స్వప్రకాశమై నిత్యాపరోక్షమై యుండునది యీయాత్మయే అని చెప్పఁబడుచున్నది. అహంకారము మొదలు స్థూలదేహపర్యంతమును నాయహంకారము నాదేహము అని యెఱిఁగెడి చైతన్యమే ప్రత్యగాత్మరూపము. ఇందుకు అర్థము. మాడఁబడెడిసమస్తమును బ్రహ్మమనెడి శబ్దముచేతను చెప్పఁబడిన లక్ష్యార్థము. జగదధిష్ఠానమైన బ్రహ్మమే స్వప్రకాశమైన ఆత్మ. ఆయాత్మస్వరూపమే తాను. ఇట్లని ఈనాలుగుమహావాక్యములయందును నీవే బ్రహ్మము, బ్రహ్మమే నీవు అని ప్రతిపాదించుచున్నది కనుక నీవే సచ్చిదానందస్వరూపమై అద్వితీయమైన ఆత్మస్వరూపుండవు. బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రవర్ణములు నీకు లేవు. బ్రహ్మచర్యాద్యాశ్రమములును, వానిధర్మములును నీకు లేవు. నీవు

అసంగుఁడవు కాలత్రయమందును నీవు జీవుఁడవు కావు గనుక నీకు ఆగామిసంచితప్రారబ్ధకర్మములు లేవు. అఖండైకరసమై సుఖస్వరూపమైన ఆత్మవు నీవు. ఇట్లని గురువులు హస్తస్పర్శము చేసి శిరస్సుపైని శ్రీహస్తమునిచి యనుగ్రహము చేసిరి. తర్వాత ఆశిష్యుఁడు బాహ్యాంతర ప్రపంచమును మఱచి కొంతసేపు నిర్వికల్పనిష్ఠయం దుండి తెరువ కన్నులు తెఱచి గురువులను చూచి దిగ్గన లేచి గురుస్వాములకు అనేకసాష్టాంగనమస్కారములు చేసి విజ్ఞాపనము చేయుచున్నాఁడు; స్వామీ! నేను కృతార్థుఁడనైతిని. నాకు మోహనివృత్తి యయ్యెను అని విజ్ఞాపనము చేసెను. ఈనాలుగు మహావాక్యముల అర్థమును వినిపించినను విన్నను చదివినను వ్రాసినను నరుఁడు కృతార్థుఁ డగును.

అవ.—ఇట్టి అద్వితీయబ్రహ్మము తానై వెలుఁగుటను దృష్టాంతపూర్వకముగ చెప్పుచున్నారు.

చ. కలశఘనాంబుపూరములఖంబు లసత్యములై తనర్చుఁ ద
త్కలశఘనాంబరంబులకుఁ గల్గదు భేదము జీవుఁ డీశ్వరుం
డలరు నసత్యుఁడై యటులె యాత్మజ స్వాత్మపరాత్మ లేక మాఁ
దలఁప శివోహ మం చచలధర్మముఁ జెంది వెలుఁగు మెంతయున్.

టీ. ఆత్మజ=కుమారా, తలఁపఁగా = విచారింపఁగా, కలశఘనాంబుపూరములఖంబులు-కలశ=కడవయందలి, ఘన = మేఘమందలి, అంబుపూరిము=నీళ్ళయందు కనఁబడెడు, ఖంబులు=ఆకాశములు, అసత్యములై=దబ్బరలై, తనర్చున్=ప్రకాశించును-అనఁగా ప్రతిబింబము లగుటచేత అసత్యము లనుట. తత్కలశఘనాంబరంబులకున్ - తత్=ఆ, కలశ=కుండయందలి, ఘన=మేఘమందలి, అంబరంబులకున్=ఆకాశములకు, భేదము=వేఱుపాటు, కల్గదు=ఉండదు. అనఁగా కుండకు వెలుపల లోపల నున్న ఆకాశమును, మేఘమునకు వెలుపల లోపల నున్న ఆకాశమును, కల్పితములు కానందున ఒక్కటే యనుట. అటులె=ఆప్రకారము గానే, జీవుఁడు=అవిద్యోపాధిగల చిదాభాసుఁడును, ఈశ్వరుండు = మాయోపాధిగల యీశ్వరుఁడును, అసత్యుఁడై = అసత్యమైనవాఁడై, అలరున్=ఒప్పును. స్వాత్మపరాత్మలు-స్వాత్మ = ప్రత్యగాత్మయును, పరాత్మలు=పరమాత్మయును, ఏకమౌన్=ఒక్కటే యగును, ఎంతయున్ =మిక్కిలి, శివోహమంచున్= నేనే పరబ్రహ్మ మని, అచలధర్మమున్ - అచల=చలింపని, ధర్మమున్ = అభిప్రాయమును, ఒంది=పొంది=వెలుఁగుము=ప్రకాశించును.

తా. ఓయి శిష్యుఁడా! కడవలోని జలమందును మేఘములోని జలమందును ప్రతిబింబించిన ఆకాశములు అసత్యము లగును. కుండకును మేఘమునకును వెలుపల లోపల నుండెడి ఆకాశములు రెండును కల్పితములు కానందున ఎల్లప్పుడును ఒక్కటే యగును.

అతీయనగా అవిద్యయందును మాయయందును బ్రహ్మచ్ఛాయచేత ప్రతిబింబింపఁబడిన జీవుఁడును ఈశ్వరుఁడును అసత్యు లగుదురు. జీవసాక్షియైన ప్రత్యగాత్మయును ఈశ్వర సాక్షియైన పరమాత్మయును నిత్యులై ఐక్య మగుదురు కాఁబట్టి అట్టి ఐక్యభావమును పొంది నేనే పరబ్రహ్మ మని నిశ్చలుఁడవై యుండు మని తాత్పర్యము.

మఱియును ఘటమువంటిది జీవస్థూలశరీరము. మేఘమువంటిది యీశ్వరస్థూలశరీరము ఘటమందలిజలమువంటిది జీవాంతఃకరణము. మేఘమందలిజలమువంటిది యీశ్వరాంతఃకరణము. ఘటజలమందలి అడుసువంటిది జీవావిద్య. మేఘజలమందలి అడుసువంటిదియీశ్వరమాయ. ఘటజలమందు ప్రతిబింబించిన ఆకాశమువంటివాఁడు జీవుఁడు. మేఘజలమందు ప్రతిబింబించిన ఆకాశమువంటివాఁడు ఈశ్వరుఁడు. ఘటమందలిజలము చలించునపుడు ఆజలప్రతిబింబమును చలించునట్టుల జీవాంతఃకరణము చలించునపుడు కించిత్ జ్ఞత్వాది జీవగుణములును మేఘమందలి జలము చలించునపుడు ఆజలప్రతిబింబమగు ఆకాశమును చలించునట్లు ఈశ్వరాంతఃకరణము చలించునపుడు సర్వజ్ఞత్వాదియీశ్వరగుణములును కలుగును. ఎఱ్ఱావునకును నల్లావునకును శరీరములును అవయవములును గుణములును భేదములై యుండుటచేత ఐక్యము కలుగక యెఱ్ఱావు నల్లావుపాలు వర్ణములును మాధుర్యములును సమముగఁ గలవి యైనందున ఐక్యములు కలిగినట్లుగాను జీవేశ్వరులకు శరీరములును గుణములును మొదలగునవి భేదములై యుండుటచేత నైక్యము కలుగక జీవసాక్షియగు త్వంపదలక్ష్యార్థమైన ప్రత్యగాత్మకును, ఈశ్వరసాక్షియగు తత్పదలక్ష్యార్థమైన పరమాత్మకును, సచ్చిదానందనిత్యనిర్మలత్వము లనెడుపంచలక్షణములు సమముగ కలిగియుండుటచేత ఐక్యము కలిగె నని మహావాక్యార్థముఖ్యాభిప్రాయము తెలియఁ వలయును

అవ.—సమాధియందు తన నిజస్వరూపమును దర్శించిన శిష్యునిలక్షణమును చెప్పుచున్నాఁడు.

ఉ. ప్రాణపదాత్మదేశికుఁడు పల్కినతత్త్వమసి న్వెలుఁగున  
ద్వాణులనామము ల్దెలిసి వానిఁ దొరంగక నిర్విశేషుఁడై  
ప్రాణమయాదులం బినపఁ బ్రజ్ఞ నభావముఁ బాసి ముఖ్యుని  
ర్వాణియె తాన యై వఱలె వైభవ మొప్పఁగ నద్వితీయుఁడై .౧౧౪

టీ. ప్రాణపదాత్మదేశికుఁడు = ప్రాణసమమైనతనగురుస్వామి, పల్కినతత్త్వమసిన్-పల్కిన=ఉపదేశించిన, తత్త్వమసిన్=తత్త్వమసి యనెడు మహావాక్యమందు, వెలుఁగు...నామములు-వెలుఁగు=ప్రకాశించుచున్న, సత్=ప్రశస్తములైన, వాణుల=తత్పదత్వంపదఅసిపదముల నెడువాక్కులయొక్క, నామములు=వాచ్యార్థనిరసనపూర్వక

లక్ష్యార్థములగు మేలులను, తెలిసి=ఎఱిఁగి, వానిన్=ఆమేలులను, తొరంగక=విడువక, నిర్విశేషుఁడై=నేతి నేతియను మహావాక్యములచేత మిగిలినవాఁడై, ప్రాణమయాదులన్-ప్రాణమయాది కోశములను, ఆమూలన్=కొలఁదులుగాఁగల వానిని అనఁగా అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ ఆనందమయ కోశములనుట. విదుపన్=విమర్శించుట, అభావమున్=బహిరంతరింద్రియముల నెల్ల వదలిన వెనుక శేషించియునులేని అభావమును, ప్రజ్ఞన్=అన్నిటిని విమర్శించి తోయఁగా మిగిలి తన్ను కనఁబడుదిజ్ఞప్తిని, పాసి=వదలి, అద్వితీయుఁడై=ఏకస్వరూపుఁడై, ముఖ్యనిర్వాణిరయి-ముఖ్య=కేవలమైన, నిర్వాణిరయి=ముక్తుఁడై, తానయ్యు=తానే అయి, స్థైర్యము=సచ్చిదానంద నిత్యపరిపూర్ణసంపద, ఒప్పన్=అతిశయించఁగా, వెలిఁగెన్=ప్రకాశించెను.

తా. తనకు ప్రాణప్రదమైన ఆచార్యునిచేత ఉపదేశింపఁబడిన తత్త్వమస్యాదిపదములను శోధించినపుడు అనాత్మను విడువక పంచకోశవిలక్షణుఁడై వెనుక తన కగపడుచున్న శూన్యము నతిక్రమించి సర్వమును ఎఱుఁగుచున్న యెఱుకను దాఁటి నేను కూటస్థబ్రహ్మము నెడు తలంపును సహితము వీడి అద్వితీయముగ ప్రకాశించు పరిపూర్ణ స్వరూపమును దర్శించెనని తాత్పర్యము.

అవ.—శిష్యుఁడు దేశికునిచేత ఉపదేశింపఁబడిన మహావాక్యార్థమును పొంది స్వానుభవనిష్ఠలో ఉండుట చెప్పఁబడుచున్నది.

చ. నిరతిశయానుభూతి సుఖనీరధిఁ బూర్ణముగా మునింగి ప్రా
క్కరణతనూముఖాఖిలవికారము లెల్ల నడంగఁ జిత్సుఖో
త్కరహృదఖండమైనతనుఁ గగ్గొనఁ దత్పరిపూర్ణదేశికుం
డురుతరబోధసుస్థిఁ గని నూర్జితభావముతోడ నిమ్మలన్. ౧౧౫

టీ. నిర...ధిన్, నిరతిశయ=ఇది కాదు ఇది కాదని త్రోయఁగా కడపట నిలిచిన, అనుభూతి=బ్రహ్మాభిన్నప్రత్యగాత్మానుభవముయొక్క, సుఖ=ఆనందమనెడు, నీరధిన్=సముద్రమందు, పూర్ణముగాన్=అంతట నిండియుండునట్లుగాను, మునింగి=మగ్నమయి, ప్రాక్కరణ...ములు, ప్రాక్=ముందటి అజ్ఞానదశయందలి విషయవ్యాపారములతో కూడియుండెడి, కరణ=జ్ఞానకర్మేంద్రియాంతఃకరణములు, తనూ=స్థూల సూక్ష్మ కారణ శరీరములును, ముఖ=మొదలయిన, అఖిల=సమస్తములయొక్క, వికారములు=రాగద్వేషాదిషోడశ వికారములు, ఎల్లన్=అన్నియును, అడంగన్=నశింపఁగాను, చిత్సు...దము-చిత్=విజ్ఞానమువలనఁ గలిగిన, సుఖ=విద్యానందముయొక్క, ఉత్కర=అతిశయముతోఁగూడిన, హృత్=అంతరంగముగలవాఁడై, అఖండము=బ్రహ్మాకారపరిపూర్ణము, అయినతనున్=అయినట్టి తన్ను, తత్పరిపూర్ణదేశికుండు, తత్=

ఆశిష్యుని పదేశే, పరిపూర్ణ=అంతట నిండియున్న, దేశికుండు=గురుస్వామి, కన్గొనఁగాన్=సమాధియందు కూడి యున్నతన్ను చూడఁగాను, ఉత్థితభావముతోడన్, ఉత్థిత=నిలుకడను పొందిన, అనఁగా బ్రహ్మాకారముగా నేర్పడిన, భావముతోడన్=అంతఃకరణవృత్తితోడ, ఇమ్ముగన్=సుఖముగా, అనఁగా అనాయాసముగా, ఉరుతర భోగ సుప్తిన్, ఉరుతర=సర్వాతిశయమైన, భోగ=అపరోక్ష జ్ఞానస్వరూపమైన, సుప్తిన్=స్వస్వరూపస్థితిరూపమైన నిద్రను, అనఁగా యోగనిద్రను, కనెన్=పొందెను.

తా. నేతి నేతి యనెడు మహావాక్యములచేత ఇది బ్రహ్మము కాదు ఇది బ్రహ్మము కాదు అని అన్నిటిని త్రోయఁగా కడపట నిలిచిన బ్రహ్మాభిన్న ప్రత్యగాత్మానుభవరూపమైన నిరతిశయానందసముద్రమందు లెస్సగా మునిఁగి మునుపు అజ్ఞానదశయందు తనస్వరూపముగానే కనఁబడుచున్న పదునాలుగింద్రియములవికారములైన రాగద్వేషాదులను స్థూలసూక్ష్మకారణదేహముల వికారములయిన జననమరణాదులును వదలింపఁగాను విజ్ఞానమయమైన కలిగినవిద్యానందముతోఁ గూడిన అంతఃకరణము పరబ్రహ్మాకారమయి పరిణమింపఁగాను అఖండపరిపూర్ణ మయిన తన్ను సచ్చిదానంద స్వరూపుఁడయిన ఆచార్యుఁడు కుతూహలముతో చూడఁగాను శిష్యుఁడు నిర్వికల్ప నిష్ఠయందుండె నని తాత్పర్యము.

అనంతరము సమాధినుండి బహిర్ముఖుఁడైన శిష్యునిస్వరూపము చెప్పఁబడుచున్నది.

మ. పరిపాకస్థితి నుండి కొంతతడవా పంథానురక్తిన్ లఘు
స్ఫురణన్ మేల్కని తన్మనంబుఁ గని యుద్బోధప్రమోదాశ్రుయు
గ్వరవక్త్రంబిల సోఁక మ్రొక్కి కరయుగ్మం బెత్తి వే చేర్చి మూ
ర్ధ్ని రహిన్ ధ్యాన మొనర్చి పల్కఁ దొడరెన్ ధీరస్థితప్రజ్ఞుఁడై.

టీ. ఆపంథానురక్తిన్=ముందుచెప్పఁబడిన నిష్ఠామార్గమందలి ఆశతోఁగూడిన, పరిపాకస్థితిన్, పరిపాక=మిక్కిలి పక్వమైన, స్థితిన్=ఉనికిచేత, కొంతతడవు=కొంతసేపు, ఉండి=నిష్ఠయందుండి, లఘుస్ఫురణన్=సూక్ష్మమయిన జ్ఞప్తిచేత, మేల్కని=జాగ్రత్తనొందినవాఁడయి, అనఁగా ప్రపంచజ్ఞప్తిగలవాఁడై యనుట. తన్మనంబున్=సమాధినుండి ప్రపంచవ్యవహార[illegible]కి వచ్చిన మనస్సును, కని=చూచి, ఉద్బోధప్రమోదాశ్రుయుగ్వరవక్త్రంబు, ఉద్బోధ=బ్రహ్మజ్ఞానముచేత కలిగిన, ప్రమోదాశ్రు=ఆనందబాష్పములతోడ, యుక్=కూడిన, వరవక్త్రంబు=శ్రేష్ఠమైన ముఖమును, ఇలన్=భూమియందు, సోఁకన్=తగులునట్లు, మ్రొక్కి=నమస్కరించి, కరయుగ్మంబు=రెండు చేతులను, ఎత్తి=పైకెత్తి, మూర్ధ్నిన్=శిరస్సునందు, వే=శీఘ్రముగా, చేర్చి=జోడిం

సత్కర్మములయందే నాబుద్ధి నిలుచునట్లు చేసి కాపాడుము, అనఁగా విధిమార్గానుసారమయిన యీపరమాద్వైతజ్ఞానమును కలిగించితి వనుట. పిదపన్=పిమ్మట, మర్త్యాకారమున్=మనుష్యశరీరమును, పూని=ధరించి, నాకుయ్యాలించి=నా మొఱను విని, పరార్థంబు=సర్వోత్కృష్టమయిన పరబ్రహ్మ సాక్షాత్కారము, చేకూరన్ = ఒనగూడునట్టులు, కృతార్థున్=ధన్యునిఁ జేసితివి, మీకియ్యన్=ఇట్టిమహోపకారమును చేసిన మీకు సమర్పించుటకు, వేఱొకటి=మఱియొక పదార్థము, ఏది=ఏదియును, కానన్=ఎఱుఁగను, అనఁగా సర్వమును నీవయి నీవే నేనయి ఉండుటవలన నితరవస్తువు ఒక్కటియును లేదనుట. ఇఁకన్=ఇఁకమీఁద, ఎందేన్ = ఎచ్చటను, కొంకనయి=దాసుఁడనయి, కొల్చెదన్ = సేవించుచున్నాను. అనఁగా నిట్టి పరిపూర్ణజ్ఞానమును విడిచి జగద్వ్యాపారము గలవాఁడ నగునప్పుడు "నాద్వైతం గురుణాసహ" అను ప్రమాణము చేత చతుర్విధశుశ్రూషలఁ జేయుచున్నా ననుట.

తా. ఓ యాచార్యుఁడా! సర్వాంతర్యామి వయిన నీవు నాయంతరంగమందు నివసించి యున్నరాని జన్మములను నేను పొందునప్పుడు నీవును నాతోడనుండి అనిష్ట జన్మములు తొలఁగుటకు సన్మార్గమున ప్రవర్తించువానిఁగఁ జేసి పిదప కర్మ భక్తి వైరాగ్య జ్ఞానములలో నాబుద్ధిని ప్రవేశింపఁజేసి నీవు మానుషవేషమున ప్రత్యక్షమయి నామొఱ ఆలకించి అపరోక్షబ్రహ్మసాక్షాత్కారమయిన అభేదముక్తిని ఉపదేశించితివి. ప్రత్యుపకార మేమియును నేఁ జేయఁజాలను గనుక నెల్లప్పుడును నిన్ను విడువక కొల్చెద నని తాత్పర్యము.

అవ — ఆచార్యులు సమాధిని చెఱుప మూఁడువిఘ్నములు గలవు వానిని నశింపఁజేయు మని శిష్యునితో చెప్పుచున్నారు.

శా. అంతేవాసి నుతింప నిక్కరణి నయ్యాచార్యుఁ డీక్షించి వే
చెంతం జేరఁగఁ జీరి శిష్యుని సుఖాసీనుం దగం జేసి వి
శ్రాంతిం బాపుట కంతరాయములు పుత్రా మూఁడు భాసిల్లు ను
స్స్వాంతం బొప్ప హరింప వాని నదె సత్సర్వోపకారం బగున్. ౧౧౮

టీ. ఇక్కరణిన్=ఈవిధముగాను, అంతేవాసి=శిష్యుఁడు, నుతింపన్=స్తోత్రము చేయఁగా, అయ్యాచార్యుఁడు = ఆగురుమూర్తి, శిష్యునిన్ = ఛాత్రుని, వే=శీఘ్రముగా, తగన్=బాగుగా, చెంతన్=సమీపమునకు, చేరఁగఁజీరి=చేరఁబిలిచి, ఈక్షించి=చూచి, సుఖాసీనున్=సంతోషముతో కూర్చున్నవానిఁగా, చేసి=ఒనరించి, పుత్రా=కుమారా, విశ్రాంతిన్ = నెమ్మదిని, పాపుటకున్ = పోఁగొట్టుటకు, అంతరాయములు=విఘ్నములు, మూఁడు = మూఁడు, భాసిల్లున్=వెలుఁగును, సుస్వాంతంబు=మంచిమ

నన్ను, ఒప్పఁగ్=ప్రకాశించుటకు, వానిక్=అవిఘ్నములను, హరింపఁగ్=నశింపఁజేయఁగాను, అది=అవిఘ్నములను నశింపఁజేయుటే, సత్సర్వోపకారంబు - సత్=మేలయిన, సర్వోపకారంబు=మాకు అన్నియుపకారములును చేసినట్లు, అగుక్=అవును.

తా. శిష్యుఁడు ఈవిధమున గురువును కొనియాడఁగాను ఆచార్యుఁడు శిష్యుని సంతోషముతో మాచి దగ్గఱకు రమ్మని పిలిచి కూర్చుండు మని ఓయి సమాధిని భంగము చేయు మూఁడువిఘ్నములు గలవు. మనస్సు నిర్మలమయి వెలుఁగుటకు వానిని నశింపఁజేయు మని బోధించె నని తాత్పర్యము.

అవ.—శిష్యుఁడు పరిపూర్ణపరబ్రహ్మ మైన నన్ను విఘ్నములు ఏతీరున చెఱుచు నని గురువులు చెప్పుచున్నారు.

మ. భువి నీ వే నను రెండు లేక యొకఁడై పూర్ణాత్మయై వెల్గునన్
గవిసంస్తుత్య కలంచు టెట్లు లన విఘ్నంబు ల్సుతా దేశిక
ప్రవరామ్నాయశిరోక్తుల న్వెలసినం బ్రజ్ఞాన మావిఘ్నముల్
వ్యవసాయాత్మకనిష్ఠ లేమిఁ జెఱుచున్ స్వాత్మానుభావం బొగిన్.

టీ. కవిసంస్తుత్య - కవి=విద్వాంసులచేత, సంస్తుత్య=కొనియాడఁబడుచున్న ఓగురుస్వామీ, భువిక్=భూమియందు, ఈవు = నీవు, ఏను=నేను, అను రెండు=అను నట్టివి రెండు, లేక=కలుగక, అనఁగా ద్వైతశూన్యమై యనుట. ఒకఁడయి = ఏకవస్తువై, అనఁగా శూన్యము కానిదయి యనుట. పూర్ణాత్మయై = అంతట నిండిన పరబ్రహ్మమై, వెల్గునక్=ప్రకాశించునట్టినన్ను, విఘ్నంబులు=అజ్ఞానము సందేహము విపరీతము అనెడు విఘ్నములు, కలంచుట = చంచలింపఁజేయుట, ఎట్లులు=ఏప్రకారము, అనక్ = అని శిష్యుఁడు పలుకఁగాను, సుతా = కుమారా, దేశికప్రవరామ్నాయ శిరోక్తులక్ - దేశికప్రవర=శ్రేష్ఠులయిన గురువులయొక్కయు, ఆమ్నాయశిరః=వేదాంతములయొక్కయు, ఉక్తులక్ = వాక్యములచేత, ప్రజ్ఞానము=బ్రహ్మజ్ఞానము, వెలసినక్=ప్రకాశించిన దయినను, వ్యవసాయాత్మకనిష్ఠ=శరీరేంద్రియ ప్రయాసముతోఁ గూడిన నిర్వికల్పబ్రహ్మనిష్ఠ, లేమిక్=లేనందున, ఆవిఘ్నముల్=అయంతరాయములు, ఒగిక్=వరుసగా, స్వాత్మానుభావంబు - స్వ=ప్రత్యగాత్మయగు తనయొక్కయు, ఆత్మ=పరమాత్మయొక్కయు, అనుభావంబు=ఐక్యానుభవమును, చెఱుచుక్=నశింపఁజేయును.

తా. ఓయి శిష్యుఁడా "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" అను శ్రుతిప్రమాణముచేత సర్వపరిపూర్ణమై నీవు నేను అనెడు ద్వైతభావము లేక ఒక్కటియై ప్రకాశించు పరబ్రహ్మము నేనయి యుండఁగా విఘ్నములు ఎక్కడ పుట్టి యేతీరున నన్ను చెఱుచును అని శిష్యుఁ డడుగఁగా వేదాంతశాస్త్రవాక్యములచేతను గురూపదేశమహావాక్య

ర్థములచేతను అపరోక్షబ్రహ్మసాక్షాత్కారజ్ఞానము లభించియున్నను నిర్వికల్పసమాధి లేనందున విఘ్నములు చిత్తవిశ్రాంతిసుఖమును చెఱుచునని తాత్పర్యము.

అవ.—శిష్యుఁడు బ్రహ్మనిష్ఠకు విరోధము లయిన విఘ్నములనామధేయములను వానిస్వరూపస్వభావములను అవి నశించువిధమును చెప్పుఁ డని గురువులను అడుగుచున్నాఁడు.

మ. జపనిష్ఠాప్రియ తెల్పుఁ డెవ్వి యన నజ్ఞానంబు సందేహముం
విపరీతం బన ముత్తెఱంగు లగునా విఘ్నంబు లాత్మీయ ని
ష్కపటజ్ఞానము మాయుఁ బాయు నవి యాకాశాభ్రములో వ్వలె నీ
విపులన్ సంశ్రవణాదులన్ సలుప నిర్వీర్యంబులై త్రుంగెడున్. ౧౨౦

టీ. జపనిష్ఠాప్రియా - జప= ''పూజాకోటిసమం స్తోత్రం స్తోత్రకోటిసమో జపః, జపకోటిసమం ధ్యానం ధ్యానకోటిసమో లయః.'' అనుస్మృతిచేత సప్తకోటి మహామంత్రములకును మూలమైనదియును ''వేదమాతా చ గాయత్రీ'' యనున్యాయము చేత వేదోత్పత్తికి కారణమైనదియును ఐనచిచ్ఛక్తియొక్క అనేకలీలలలో ఒకలీలాస్వరూపముగల గాయత్రీమంత్రజపమందును, నిష్ఠ=అట్టి జపమువలన కలిగిన మనోలయరూపమగు పరబ్రహ్మాకారనిర్వికల్పసమాధియందును, ప్రియ = ఆసక్తిగల ఓ యాచార్యుఁడా! ఆవిఘ్నములు = ముందుచెప్పిన బ్రహ్మజ్ఞానవిరోధములయిన విఘ్నములు, ఎవ్వి=ఏవి, తెల్పుఁడు = తెలియఁజేయుఁడు, అనన్ = శిష్యుఁడీప్రకారము అడుగఁగాను, అజ్ఞానంబును=అజ్ఞానము, సందేహమును=సందేహము, విపరీతంబును=విపరీతము, అనన్=అనునట్లు, ముత్తెఱంగులు=మూఁడువిధములు, అగున్=అవును. అవి=ఆమూఁడు విఘ్నములును, ఆకాశాభ్రములు - ఆకాశ=అంతరిక్షమును, అభ్రములు=మేఘములును, పోలెన్ = వలెనే, అనఁగా ఆకాశమును మేఘములు కప్పుచు విడుచుచున్నట్లుగానే, ఆత్మీయనిష్కపటజ్ఞానమున్ - ఆత్మీయ = బ్రహ్మాభిన్నకూటస్థసంబంధమైనదియును, నిష్కపట = మాలాతూలారూపమయిన ప్రకృతివికారములు లేనిదియును అయిన, జ్ఞానమున్ = స్వప్రకాశజ్ఞానమును, మాయున్ = ఒకప్పుడు మఱుఁగుపఱచును, పాయున్=ఒకప్పుడువిడుచును, ఈవిపులన్=ఈభూమియందు, సంశ్రవణాదులన్-సంశ్రవణ=ఆచార్యునివలన సచ్ఛాస్త్రములను వినుటయే, ఆదులన్=మొదలగు మనన నిదిధ్యాసములనువానిని, సలుపన్=ఒనర్పఁగాను, అవి = ఆ అజ్ఞానసందేహవిపరీతములు, నిర్వీర్యంబులై = బలహీనములయి, త్రుంగెడున్=నశించును.

తా. ఓయి ఆచార్యుఁడా! మునుపు తాముచెప్పిన విఘ్నముల నామధేయములను, వానిస్వరూప స్వభావములను, అవి తొలఁగువిధములను తెలుపు మని శిష్యుఁ డడు

గంగా గురువులు ఓయి శిష్యుండా! అవిఘ్నములు అజ్ఞానము స్వదేహము విపరీతము అని మూఁడుపేళ్లు గలవగును. అవి ఆకాశమున పుట్టిన మబ్బు. ఆకాశమునే కమ్మి ఆయాకాశమునందు పుట్టినగాలివల్లనే ఆమబ్బులు ఎగరఁగొట్టఁబడిన తీరున నీకు స్వస్వరూప విస్మృతి కలిగినప్పుడు నీయందు పుట్టిన అవిఘ్నములు నిన్నావరించి నీయందే కలిగిన బ్రహ్మజ్ఞానము ప్రబలినప్పుడు అవిఘ్నములు నిన్నువిడుచుచున్నవి గురువులవద్ద సచ్ఛాస్త్రములను వినుటచేతను అవిన్నశాస్త్రవిషయములను చింతనచేయుటచేతను అచింతనచేసిన విషయములకు లక్ష్యార్థమయిన పరబ్రహ్మమునందు మనస్సును నిర్వికల్పముగ నిలుపుటచేతను అవిఘ్నములు విడుచెడి సూపమాయు నని తాత్పర్యము.

అవ.—గురువులు అసంభావన సంశయభావన విపరీతభావనలు నశించుమార్గమును చెప్పుచున్నారు.

ఉ. స్తంభన మైనవహ్ని తనశక్తులఁ జూపనిమాడ్కి నొప్పుచి
జ్జృంభణ మంతరాయములుఁ జెంద జగం బపుడుండుసంశ్రవా
రంభ మొనర్ప నేగుఁ దగ సేరంగదహంమతి నస్తుచింతనన్
డింభక సందియం బుడుగు సీ డిందు నసజ్జగ మాత్మనిష్ఠచేన్. ౧౭౧

టీ. డింభక=కుమారా, స్తంభనమైనవహ్ని=జాలవిద్యలు గలవానియొక్క మణిమంత్రౌషధక్రియలవలన వేఁడిలేకుండ కట్టఁబడిన నిప్పు, తనశక్తులన్ = తనవిధమైన కాల్చుట మండుట మొదలయిన సామర్థ్యములను, చూపని మాడ్కిన్ = కనఁబఱచని యటులు, ఒప్పుచిజ్జృంభణము - ఒప్పు=మనోహరమైన, చిజ్జృంభణము=జ్ఞానప్రకాశమును, అంతరాయములు=అసంభావన విపరీతభావన సంశయభావన అనెడువిఘ్నములు, చెందన్=పొందఁగానే, అపుడు = జ్ఞానప్రకాశము విఘ్నములను చెందియున్న సమయమందు, జగంబు=నామరూపాది సకలదృశ్యములుగల లోకవ్యవహారము, ఉండున్ = కలుగును, సంశ్రవారంభము=వేదాంతశాస్త్రమునువినుట కారంభము,ఒనర్పన్=చేయఁగాను, రంగదహంమతి, రంగత్=చతుర్దశభువనరూపముగ ప్రకాశించుచున్న, అహంమతి=అజ్ఞానము, తగన్=లెస్సగా, ఏఁగున్ = విడిచిపోవును, వస్తుచింతనన్=పరబ్రహ్మధ్యానముచేత, సందియంబు = సంశయము, ఉడుగున్ = నశించును, అసజ్జగము = మాయామయమయిన జగత్తు,ఆత్మనిష్ఠచేన్=పరబ్రహ్మసమాధిచేతను,డిందున్=చెడును.

తా. ఓయి శిష్యుండా! ప్రకాశశక్తియును ఉష్ణశక్తియునుగల అగ్ని మణిమంత్రౌషధములచేత కట్టఁబడి వెలుఁగనట్లు విజ్ఞానము అసంభావన విపరీతభావన సంశయభావన లనెడు విఘ్నములను పొందినవేళ నామరూపములుగల మాయామయమైన లోకవ్యవహారము కలుగును. వేదాంతశాస్త్రమును వినుటచేత అజ్ఞానరూపమయిన అసంభా

దన వశించును. పరబ్రహ్మస్వరూపచింతనచేత సంశయము చెడును. నిర్వికల్పసమాధిచేత మాయామయము యగువిపరీతభావనారూపమయిన జగత్తు మాయమై పోవు నని తాత్పర్యము.

అవ — అవిఘ్నముల స్వరూపములను జెప్పుచున్నారు.

మ. అపిధానం బొనరించి జ్ఞప్తిం గడు దృశ్యశ్రేణిం గావించు నా
కపటం బైనయవిద్య నమ్మక గురూక్తం బైనయర్థంబు హృ
చ్చపలం బొందిన సందియంబు దనువే సత్యంబు లోకం బనన్
విపరీతం బని పల్కుచుందురు మహావేదాంతవేద్యుల్ సుతా. ౧౨౨

టీ. సుతా=సుమారా, ఆకపటంబు=అంతట మోసము చేయునది, ఐనయవిద్య=అయినట్టి అజ్ఞానము, జ్ఞప్తిన్=బ్రహ్మజ్ఞానమును, అపిధానం బొనరించి=మఱుఁగుపఱచి, కడున్=మిక్కిలి, దృశ్యశ్రేణిన్=వెలుపలి లోపలి విషయములగుంపును, గావించున్=కల్పించును, గురూక్తంబు, గురు=హితగురువులచేత, ఉక్తంబు=బోధింపఁబడినది, ఐనయర్థంబు=అయినట్టి బ్రహ్మాభిన్న ప్రత్యగాత్మవస్తువును, నమ్మక=విశ్వసింపక, హృచ్చపలంబున్, హృత్=మనస్సుయొక్క, చపలంబున్ = కదలికను, పొందినన్=పొందితేని, సందియంబు = సందేహము, అనఁగా సంశయము కలుగు ననుట. తనువు=దేహము, ఏన్=నేను, లోకంబు = జగము, సత్యంబు=నిజము, అనన్=అని పలుకఁగాను, విపరీతంబు = విపరీత మనునది, అని = ఇట్లని, మహావేదాంతవేద్యులు=ఘనములయిన ఉపనిషదర్థముల నెఱిఁగినవారు, పలుకుచుందురు=వచింతురు.

తా. ఓయి శిష్యుఁడా! దృఢ్రూపమైన తెలివిని మఱుఁగుపఱచి దృశ్యసమూహములను జూపించునది అజ్ఞానము. ఆచార్యోపదేశవాక్యార్థములను నమ్మక మనస్సున చంచలము గలిగి యుండుట సంశయము. అనిత్యమగు ప్రపంచమును నిత్య మనుటయు దేహము తా ననుటను విపరీత మని తాత్పర్యము.

## అసంభావన విపరీతభావన సంశయభావనల వివరము.

అసంభావన యనఁగా కటికచీఁకటియందు దారినడచువాఁడు పుట్ట మిట్ట గుట్ట చెట్టు మొదలగువానిని తెలియక నడచుచుండునటులే అజ్ఞాన మనెడి అంధకారముల తగిలి నామరూపజగత్తును ఆజగద్విలక్షణమయిన పరబ్రహ్మమును ఎఱుఁగక మూఢుఁడై యుండుట అసంభావన.

విపరీతభావన యనఁగా ఆచీఁకటిలో నడుచువాఁడు చెట్టు మోడును జూచి దొంగయని భ్రమసినట్లు జగద్విలక్షణమయిన బ్రహ్మమును తెలియక జగత్తును దానియందుఁ దోఁచెడునామరూపములతోఁ గూడిన దేవనరాసుర తిర్యగాదులను సత్యములుగాఁ దలంచుట విపరీతభావన.

సంశయభావన యనఁగా ఆప్రకారము చెట్టుమోడును చూచి చోరుఁడని భ్రమ పడి నడచుచుండ మఱియొకచాటసారి యెదురుపడి వానిభ్రమను విని ఓయి పూర్వము నేనిట్లే భ్రమపడి ఒక్కనివలన మోడుచెట్టనుట విని దాపునకు పోయి శోధించినం తట మోడుచెట్టే అయ్యెనని చెప్పఁగా వినియును సంశయము తీఱనట్లు సద్గురూపదిష్ట మయిన ఉపనిషత్ప్రమాణముచేత జగత్తు సత్యము కాదనియును అపరోక్షజ్ఞానముచేత అద్వితీయపరబ్రహ్మము తానేనియును తెలిసియును ఆబ్రహ్మము నేనౌదునో కానో యని సంశయించుట సంశయభావన.

ఈ యజ్ఞానవిపరీతసంశయభావనలను షల్లింగవిచారణచేత విడువవలయును.

అవ.—శ్రవణమనన నిదిధ్యాసముల వివరణమును చెప్పుచున్నారు.

మ. తగు షల్లింగవిధిం గనన్ శ్రుతుల కర్థంబు ల్తదైక్యార్థమున్
జగతిన్ శ్రద్ధ వినం గడున్ శ్రవణ మౌ స్వప్రజ్ఞఁ జింతింపఁగాఁ
దగులన్ సన్మననంబు దాని సునిదిధ్యాసంబు తన్నిష్ఠచే
నగు నీమూఁట విముక్తి యాత్మజ విదేహాత్మాఖ్యలన్ భిన్నమై. ౧౨౩

టీ. ఆత్మజ = కుమారా, శ్రుతులకున్ = ఋగ్యజుస్సామాథర్వములనెడు నాలుగు వేదములకు, అర్థంబులు = తాత్పర్యములు, కనన్ = తెలిసికొనుటకు, షల్లింగవిధిన్ - షట్ = ఆఱువిధములయిన, లింగ = గుర్తులయొక్క, విధిన్ = నిర్ణయముచేతను, తగున్ = పండితు లకు ఒప్పును, తదైక్యార్థమున్ - తత్ = ఆశ్రుతార్థముల యొక్క, ఐక్య = ఏకమత్యముగల, అర్థమున్ = పరబ్రహ్మతత్త్వమును, జగతిన్ = లోకమందు, కడున్ = మిక్కిలి, శ్రద్ధన్ = ఆచార్యాభిమానమనెడు భక్తిచేలిను, వినన్ = ఆకర్ణించెనేని, శ్రవణము = అసంభావనా వినాశకరమయిన శ్రవణమనునది, ఔన్ = అగును, స్వప్రజ్ఞన్ - స్వ = తనయొక్క, ప్రజ్ఞన్ = బుద్ధియందు, తగులన్ = అంటునట్లు, దానిన్ = ఆయైక్యార్థమును, చింతింపఁగాన్ = నిరంతరధ్యానముచేయఁగా, సన్మననంబు - సత్ = శ్రేష్ఠమయిన, మననంబు = మనన మనునది, ఔన్ = అగును, తన్నిష్ఠచేన్ - తత్ = ఆశ్రవణ మననములవలన కలిగిన పరబ్రహ్మ మందలి, నిష్ఠచేన్ = షడ్విధ సమాధులలో మేలయిన బాహ్యాభ్యంతర నిర్వి కల్ప బ్రహ్మ సమాధిచేతను, సునిదిధ్యాసంబు = విపరీతభావనను పోఁగొట్టు మేలయిన నిదిధ్యాసమనునది, ఔన్ = అగును, ఈమూఁటన్ = శ్రవణమనన నిదిధ్యాసములనెడి యీ మూఁటిచేతను, విముక్తి = కైవల్యము, విదేహ = దేహాంతమందు కలిగెడునది యనెడు, ఆత్మ = తాను దేహముతో కూడియుండునపుడు కలిగెడు జీవన్ముక్తి యనెడు, ఆఖ్యలన్ = పేళ్ళచేత, భిన్నమై = వేఱుపాటుగలదై, అగున్ = కలుగును.

తా. ఓయి శిష్యుఁడా! సకలవేదవేదాంతములకును ఉపక్రమము ఉపసంహారము మొదలయిన షడ్విధలింగములను గొని పండితులు అభిప్రాయములను గ్రహింతురు. జహదజహజ్జహదజహల్లక్షణములచేత ఆయభిప్రాయములను పరబ్రహ్మమందు సమన్వయము చేయుసద్గురువులసన్నిధానమందు జీవబ్రహ్మైక్యానుభవమును వినుటయే శ్రవణమును, అవినినయర్థమును సార్వకాలమును తనమనస్సునందు ఆలోచించుటయే మననమును, ఆమననమువలనఁ గలిగిన బ్రహ్మసాక్షాత్కారమును నిశ్చలఁజేయుటయే నిదిధ్యాసనమును అగును. ఈమూఁడును సాధనములుగాఁ గలవాఁడు జీవన్ముక్తిని విదేహముక్తిని పొందును అని తాత్పర్యము.

సమస్తవేదాంతగ్రంథములకును తాత్పర్యమును నిర్ణయించు షడ్విధలింగముల నిరూపణము.

లింగ మనఁగా గ్రంథార్థముల తాత్పర్యము తెలియఁజేయు సకలవేదాంతములకును అద్వితీయ పరబ్రహ్మమందు తాత్పర్యమును నిర్ణయించునది లింగము.

తాత్పర్య మనఁగా సమస్తవేదాంతములను ప్రత్యగభిన్నబ్రహ్మపరముగానే బోధించుటకు అనుకూలశక్తి గలది.

ఉపక్రమము, ఉపసంహారము, అభ్యాసము, అపూర్వత, ఫలము, అర్థవాదము, ఉపపత్తి అని లింగములు ఆఱువిధములు. వీనిలో ఉపక్రమమును ఉపసంహారమును కూడి ఒక్కలింగము. తక్కినవి నాలుగును ఒక్కటొక్కటి ఒక్కొక్కలింగ మగును. వీనికి సామాన్యలక్షణము లని విశేషలక్షణము అని రెండు గలవు. అవి యీక్రింద చెప్పఁబడుచున్నవి.

## ఉపక్రమలక్షణము.

ఉపక్రమమునకు సామాన్యలక్షణము ప్రారంభించుట. ఉపసంహారమునకు సామాన్యలక్షణము ముగించుట. సృష్టికిపూర్వమందు ఈజగత్తు నామములును, రూపములునులేనిదై సత్తామాత్రముగానే ఉన్నదనుట ఉపక్రమము. ఇదే విశేషలక్షణము.

## ఉపసంహారలక్షణము.

ఈకనఁబడెడు నామరూపములుగల జగత్తు ముందుచెప్పఁబడిన సత్తామాత్రమగు ఆపరబ్రహ్మమే స్వరూపముగాఁ గలది. అసత్తే సత్యము. అదే ఆత్మ అని పలుకుటయే ఉపసంహారము. ఈఉపక్రమోపసంహారములు రెండును అద్వితీయబ్రహ్మమునే బోధించుటవలన ఒక్కటే లింగము.

## అభ్యాసలక్షణము.

అభ్యాసమునకు సామాన్యలక్షణము వాడుకచేసికొనుట. వాచ్యార్థవిలక్షణమగు ప్రత్యగాత్మవయిన నీవే సజాతీయ విజాతీయ స్వగతభేదశూన్యమైన పరబ్రహ్మ మని గురువులు పలుమారును బోధింప శిష్యుఁడును నేనే పరబ్రహ్మ మని యెల్లప్పుడును వాడుకచేసికొనుట అభ్యాసము. ఇదేవిశేషలక్షణము. ఇదియును ప్రత్యగాత్మను గుఱించి ప్రత్యగాత్మునకే అద్వితీయ పరబ్రహ్మ స్వరూపమును తెలియఁజేయుటవలన రెండవ లింగము.

## అపూర్వతాలక్షణము.

అపూర్వతకు సామాన్యలక్షణము ఇతర ప్రమాణములచేత ఎఱుఁగరాకుండుట. ప్రత్యక్షప్రమాణము, అనుమానప్రమాణము, ఉపమానప్రమాణము, ఆగమప్రమాణము, అర్థాపత్తిప్రమాణము, అనుపలబ్ధిప్రమాణము, ఐతిహ్యప్రమాణము, సంభవప్రమాణము అనెడి అష్టప్రమాణములలో ఉపనిషత్ప్రమాణ మను పేరుగల ఆగమప్రమాణముచేతనే అద్వితీయపరబ్రహ్మము తెలియఁబడుచున్నాఁడు గాని యితరప్రమాణములచేత పరబ్రహ్మము తెలియఁబడఁడు అని పలుకుటయే అపూర్వత. ఇదే విశేషలక్షణము. ఈ అష్టప్రమాణములలో నాస్తికులకు ప్రత్యక్షప్రమాణమును, తార్కికులకు ప్రత్యక్షప్రమాణము మొదలు నాలుగుప్రమాణములును, పౌరాణికులకు ఎనిమిదిప్రమాణములును, పూర్వోత్తరమీమాంసాశాస్త్రావలంబనులయిన భాట్టీయ ప్రాభాకరీయులకు ప్రత్యక్షము మొదలు ఆఱుప్రమాణములును అని యెఱుఁగవలయును. ఈ అపూర్వతయును అద్వితీయాత్మనే ప్రతిపాదించుచున్నది గనుక మూఁడవలింగము. అష్టప్రమాణములలో ఆగమప్రమాణమును తార్కికవైయాకరణులు శబ్దప్రమాణ మని శైవవైష్ణవశాక్తాదులు ఆగమప్రమాణ మని వేదాంతులు ఉపనిషత్ప్రమాణ మని అందురు.

## ఫలలక్షణము.

ఫలమునకు సామాన్యలక్షణము ప్రయోజనము. అద్వితీయాత్ముఁడైన జ్ఞానికి ప్రారబ్ధకర్మము నశింపక యుండువఱకును దేహేంద్రియాదిప్రపంచము అసత్యమై తోఁచుచుండును. ప్రారబ్ధకర్మము నిశ్శేషముగా నశించెనేని జగత్తు బొత్తుగా తోఁచక అద్వితీయాత్మస్వరూపముగానే ఉండు ననుటయే ఫలము. ఇదే విశేషలక్షణము. ఇదియును అద్వితీయబ్రహ్మమునే ప్రతిపాదించుటచేత నాలుగవలింగము.

## అర్థవాదలక్షణము.

అర్థవాదమునకు సామాన్యలక్షణము ప్రత్యగాత్మయైన తనవిషయమును పరమప్రయోజన మని తెలుపక బ్రహ్మవిష్ణురుద్రాదిదేవతాంతర మతాంతర విషయములను

ముఖ్యప్రయోజన మని తెలుపుట సామాన్యలక్షణము. ఏవస్తువును వినుటచేత వినఁబడని వస్తువు వినఁబడుచున్నదో ఏవస్తువును మననముచేయుటచేత మననము చేయఁబడని వస్తువు మననము చేయఁబడుచున్నదో, ఏవస్తువును ఎఱుంగుటచేత ఎఱుంగఁబడని వస్తువు ఎఱుఁగఁబడుచున్నదో అదే అర్థవాదము. ఈయర్థవాదమునకు స్వార్థమందు తాత్పర్యము లేక అద్వితీయాత్మస్వరూపమందే తాత్పర్య మగుచున్నది గనుక నిది అయిదవలింగము.

## ఉపపత్తిలక్షణము.

ఉపపత్తికి సామాన్యలక్షణము యుక్తి. మట్టివల్ల పుట్టిన కుండలు చట్లు మూకుళ్లు మొదలగునవియును, బంగారువలన కలిగిన కడియములు కిరీటములు మొదలగునవియును, ఇనుమువలన కలిగిన ఖడ్గము, ఖంపము, ఈఁటెలు లోనగునవియును, కారణములయిన మట్టి, బంగారు, ఇనుము మొదలగువానికంటె వేఱుగా తోఁచినను విచారించునపుడు వేఱు కావు గనుక కారణములకు వేఱుగా కార్యములు లేవనెడి యుక్తి, ఉపపత్తి యనఁబడును. ప్రసిద్ధముగ కనఁబడుచుండెడు లోకమును ప్రత్యగాత్మస్వరూపమైన బ్రహ్మమే కాఁబట్టి దృష్టాంతమైన యీజగత్తు ప్రత్యగాత్మయగు పరబ్రహ్మము కంటె భిన్నము కాదనుటను ప్రతిపాదించుచున్నది గనుక నిది ఆఱవలింగము. ఇట్లు షడ్విధలింగములచేత శ్రుతులకు తాత్పర్యమును నిర్ణయించువానికి శ్రవణమాత్రముచే తనే అద్వితీయమైన బ్రహ్మజ్ఞానము కలుగును. సందేహము లేదు.

అవ.—ముందు చెప్పఁబడిన శ్రవణ మనన నిదిధ్యాసములు చేయవలసినకాల నిర్ణయమును చెప్పుచున్నారు.

చ. ఎద నుదయించుఁ ద్రిత్రిపుటు లెందనుకం దగ నంతదాఁక నిం
పొదవ నొనర్పఁగావలయు నూర్జితుఁడై శ్రవణాదు లంత నె
మ్మదిఁ గనఁ జేయ లే దొకటి మాయలఁ జెందక నింగిభంగి సం
ముదమున నిల్వ ముక్తుఁ డగుఁ బొల్పిన దాన విదేహముక్తుఁడౌ.

టీ. ఎందనుకన్=ఎంతవఱకు, త్రిత్రిపుటులు=అంతర-మధ్య, బాహ్యములని మూఁడువిధములయిన త్రిపుటులు, ఎదన్ = అంతఃకరణమందు, ఉదయించున్=పుట్టుచుండునో, అంతదాఁకన్ = అదివఱకును, ఊర్జితుఁడై = చలనములేనివాఁడై, ఇంపొదవన్=సంతోష మతిశయింపఁగాను, తగన్=బాగుగా, శ్రవణాదులు=శ్రవణ మనన నిదిధ్యాసములను, ఒనర్పఁగావలయున్=చేయవలయును, అంతన్=పిమ్మట, నెమ్మదిన్=చిత్తవిశ్రాంతిని, కనన్=పొందుటకొఱకై, ఒకటిన్ = ఒక్క కార్యమును, చేయన్=ఒనర్చుటకు, లేదు = కలుగదు, మాయలన్ = ప్రకృతివికారములయిన, రాగద్వేషాది

దుర్గుణములవిస్ఫులింగములను, చెందక = అంటక, నింగిభంగిన్ = ఆకాశమువలెను, సంముద మునన్ = నిరతిశయానందమునందు, నిల్వన్ = నిలిచియుండఁగాను, ముక్తుఁడగున్ = శరీరేంద్రియాభిమానము లేని జీవన్ముక్తి గలవాఁడగును, దావన్ = ఆజీవన్ముక్తిదశచేత, పొల్చినన్ = ప్రకాశించినపక్షమున, విదేహముక్తుఁడౌన్ = పునర్జన్మ మరణరహితమయిన విదేహముక్తి గలవాఁడగును.

తా. ఓయి శిష్యుఁడా! అంతరత్రిపుటులయిన జ్ఞాతృమనోబుద్ధిచిత్తాహంకారములనెడు అంతరింద్రియములవృత్తులును, మధ్యత్రిపుటులయిన శ్రోత్ర త్వక్ చక్షుర్జిహ్వాఘ్రాణములనెడు జ్ఞానేంద్రియముల వృత్తులును, బాహ్యత్రిపుటులయిన వాక్ పాణి పాద పాయు గుహ్యములనెడు కర్మేంద్రియములవృత్తులును సర్వేంద్రియకారణమైన మనస్సునందు ఎంతపర్యంతము పుట్టుచుండునో అంతపర్యంతమును వేదాంతశాస్త్రశ్రవణ మనన నిదిధ్యాసములను చేయుచుండవలయును. మనస్సునకు పోయి కలుగఁజేయుటకు శ్రవణాదులు తప్ప మఱియొక సాధనము లేదు. నాలుగుభూతములను అంటియును అంటకయున్న మింటివలెను మాయావికారములయిన రాగద్వేష కామక్రోధాది దుర్గుణములను అంటక స్వానుభూతికలిగి ప్రారబ్ధనాశపర్యంతమును కాలినగుడ్డవలె లోకవ్యవహారములకు ఉపయోగింపక మహానందమునందు ఓలలాడుచు ఉండెనేని జీవన్ముక్తిని పొందును. ఆజీవన్ముక్తిసుఖము కలిగి వెలుఁగుచు మహావాయువుచేత అకాలినగుడ్డ రాలిపోయి స్వరూపము కనఁబడనియటులు ప్రారబ్ధము మొదలంట చెడి జనన మరణ శూన్యమయిన విదేహముక్తి గలవాఁడగు నని తాత్పర్యము.

## త్రి త్రిపుటుల వివరము.

| | |
|---|---|
| అంతరింద్రియములు. | వానివృత్తులు. |
| జ్ఞాతృ | తెలిసికొనునది, తెలివి, తెలియఁబడునది. |
| మనస్సు | సంకల్పించునది, సంకల్పము, సంకల్పింపఁబడునది. |
| బుద్ధి | నిశ్చయించునది, నిశ్చయము, నిశ్చయింపఁబడునది. |
| చిత్తము | చంచలించునది, చంచలము, చంచలింపఁబడునది. |
| అహంకారము | అభిమానించునది, అభిమానము, అభిమానింపఁబడునది. |
| మధ్యేంద్రియములు. | |
| శ్రోత్రము | వినునది, వినికిడి, వినఁబడునది. |
| త్వక్కు | స్పృశించునది, స్పర్శము, స్పృశింపఁబడునది. |
| చక్షువు | చూచునది, చూపు, చూడఁబడునది. |

| | | | |
|---|---|---|---|
| జిహ్వ | రసముల నెఱుఁగునది, రసము, రసముకలది. | | |
| ఘ్రాణము | వాసనమూచునది, వాసన, వాసనకలది. | | |
| బాహ్యేంద్రియములు. | | | |
| వాక్కు | పలుకునది, | పలుకు, | పలుకఁబడినది. |
| పాణి | ఇచ్చునది, | ఈవి, | ఈయఁబడినది. |
| పాదము | నడుచునది, | నడక, | నడువఁబడినది. |
| పాయువు | విడుచునవి, | విడుపు, | విడువఁబడినది. |
| గుహ్యము | ఆనందించునది, | ఆనందము, | ఆనందింపఁజేయునది. |

ఈవృత్తు లన్నియును సత్త్వరజస్తమస్సు లనెడు గుణభేదములచేత ననంతములై యుండును. ఆత్రిగుణములు కలసి మలినసత్త్వప్రకృతి. ఆప్రకృతియొక్క చేరిక కలది మనస్సు కాఁబట్టి పైని జెప్పఁబడిన వృత్తు లెల్లను మనస్సునఁ బుట్టుచు పెరుఁగుచు గిట్టుచు నుండును. త్రిపుటి యనఁగా మూఁడువృత్తులు కలవి.

అవ—ఆబ్రహ్మవిదాదుల తారతమ్యములను చెప్పుచున్నారు.

ఉ. కామముఖారివర్గ మొకకాలమున న్వెలయం దొలంగు ని
ష్కామత నప్పుడే నిలువ స్వాంతమునం దల మియ్యు రప్పులం
దామరసచ్ఛదంబుగతిఁ దత్త్వవిదు ల్విహరింతు రెల్లెడం
బామరమూకులట్ల తమప్రజ్ఞలఁ జూపక కూడి లోకులన్. ౧౨౫

టీ. కామముఖారివర్గము-కామ=కోరికయే, ముఖ=మొదలుగాఁగల, అరివర్గము, అరి=అంతశ్శత్రువులయొక్క, వర్గము=సముదాయము, ఒకకాలమునన్=ఒకానొకవేళయందు, వెలయన్=ప్రకాశించెనేని, నిష్కామతన్=వైరాగ్యముచేత, అప్పుడే=తత్క్షణమే, తొలంగున్ = వదలిపోవును, అనఁగా నిరంతరబ్రహ్మనిష్ఠయందు సత్త్వరజస్తమోగుణమయ మగుప్రకృతి నశించియుండును గనుక అట్టి నిష్ఠగల బ్రహ్మవిదులయందు రజోగుణజన్యము లయినకామక్రోధాదులు ప్రకాశించినతోడనే అణఁగుననుట. స్వాంతమునన్=మనస్సునందు, నిలువన్=నిలుచుటకు, తల మియ్యరు=ఎడ మియ్యరు, తత్త్వవిదులు=బ్రహ్మజ్ఞానులు, అప్పులన్= జలములయందలి, తామరసచ్ఛదంబుగతిన్=తామరాకువలె, లోకులం గూడి = జనులతోఁ గలసి, పామరమూకులట్ల = అజ్ఞానులవలెను, మూఁగవాండ్రవలెను, తమప్రజ్ఞలన్=తమమహిమలను, చూపక= లోకులకు కనఁబఱుపక, ఎల్లెడన్=అంతటను, విహరింతురు=తిరుగుచుందురు.

తా. ఓయి శిష్యుఁడా! కామము క్రోధము మోహము లోభము మదము మత్సరము అనెడి అంతశ్శత్రువులు బ్రహ్మనిష్ఠులహృదయములయందు ఒకవేళ ప్రకాశించినను

వారు వైరాగ్యప్రాప్తి గలవారగుటచేత ఆకామక్రోధాదులను తమహృదయములయందు నిలువనీయరు. బ్రహ్మవేత్తలు నీటియందు తామరాకున్నవిధమున లోకులతో చేరికొని తమమహిమలను లోకులకు చూపక యేమియును తెలియనివారివలెను మూఁగవారివలెను తిరుగుచుందు రని తాత్పర్యము.

అవ — బ్రహ్మవిదాదుల మనోవృత్తిభేదములను వివరించెద ననుచున్నారు.

మ. విను మాపూర్ణవివేక మాకసము తాఁకె వేఱైనరీతిన్ లస
ద్ఘనసద్బ్రహ్మవిదుండు దద్వరుఁడు దద్వర్యుండు దనం బుత్ర పా
వనతద్బ్రహ్మవరిష్ఠుఁ డీజనులలోన్ వర్తిల్లు నీనలువురం
దునఁ దద్వేత్తకుఁ దద్వరాదులకుఁ జేతోభేదము ల్దెల్పెదన్. ౧౨౬

టీ. పుత్ర = కుమారా, ఆపూర్ణవివేకము = ఆయఖండజ్ఞానము, తాఁకె = తాఁకియున, ఆకసము = ఆకాశము, వేఱైనరీతిన్ = పృథివ్యప్తేజోవాయువులలోఁ జేరియును వేఱైన యట్టులు, లసద్ఘన సద్బ్రహ్మవిదుండు - లసత్ = మనోహరుఁడైన, ఘన = శ్రేష్ఠుఁడైన, సత్ = పూజ్యుఁడైన, బ్రహ్మవిదుండు = బ్రహ్మవేత్తయును, తద్వరుఁడు - తత్ = ఆబ్రహ్మవేత్తలలో, వరుఁడు = శ్రేష్ఠుఁడైన బ్రహ్మవిద్వరుఁడును, తద్వర్యుండు - తత్ = ఆబ్రహ్మవిద్వరులలో, వర్యుండు = ఉత్తముఁడైన బ్రహ్మవిద్వర్యుఁడును, పావనతద్బ్రహ్మవరిష్ఠుఁడు - పావన = పవిత్రుఁడైన, తత్ = ఆబ్రహ్మవిద్వరీయులలో, వరిష్ఠుఁడు = అతిశయుఁడయిన బ్రహ్మవిద్వరిష్ఠుఁడును, అనఁగా బ్రహ్మవిదుఁడు, బ్రహ్మవిద్వరుఁడు, బ్రహ్మవిద్వరీయుఁడు, బ్రహ్మవిద్వరిష్ఠుఁడు అనుట అనన్ = అని చెప్పఁబడిన, ఈజనులలోన్ = ఈనలుగురియందును, వర్తిల్లున్ = ఆయఖండజ్ఞానము ప్రకాశించును, ఈనలువురందునన్ = బ్రహ్మవిద్ బ్రహ్మవిద్వర బ్రహ్మవిద్వరీయ బ్రహ్మవిద్వరిష్ఠులనెడి యీనలుగురియందును, తద్వేత్తకున్ = ఆబ్రహ్మవిదునకును, తద్వరాదులకున్ - తత్ = ఆబ్రహ్మవిద్వర, బ్రహ్మవిద్వరీయ బ్రహ్మవిద్వరిష్ఠులకును, చేతోభేదముల్ = మనోవ్యాపారభేదములను, తెల్పెదన్ = వక్కాణించుచున్నాను. వినుము = ఆకర్ణింపుము.

తా. ఓయి శిష్యుఁడా! భూజలాగ్ని వాయుభూతములను అంటియును అంటక యున్న యింటివలె వెలిఁగెడి ఆయఖండజ్ఞానము బ్రహ్మవిదుఁడు బ్రహ్మవిద్వరుఁడు బ్రహ్మవిద్వరీయుఁడు బ్రహ్మవిద్వరిష్ఠుఁడు అనునలువురయందును సమముగా ప్రకాశించుచున్నను బ్రహ్మవిదునకును కడమనువ్వురకును కలిగినట్టిమనోవృత్తిభేదములను వివరించెదను వినుమని తాత్పర్యము.

అవ. — బ్రహ్మవిద్ బ్రహ్మవిద్వరబ్రహ్మవిద్వరీయబ్రహ్మవిద్వరిష్ఠు లనెడు జీవన్ముక్తులలో బ్రహ్మవిదునిలక్షణమును చెప్పుచున్నారు.

మ. మతి తన్బాయుతఱిం దగం గ్రియల సన్మానింపుచున్ ధైర్యసం
యుతుఁడై బ్రహ్మవిదుండు వెండియు స్వవిధ్యుక్తక్రియల్ లోకసం
హితుఁడై పాయక తెల్వి సల్పుఁ దనకున్ హేయంబులై నిష్ఠకుం
బ్రతిపక్షంబులుగా వెలింగిన సదా బ్రహ్మార్పణప్రజ్ఞచేన్. ౧౨౭

టీ. బ్రహ్మవిదుండు=బ్రహ్మవిద్, బ్రహ్మవిద్వర, బ్రహ్మవిద్వరీయ, బ్రహ్మవిద్వరిష్ఠులలో మొదటివాఁడైన బ్రహ్మవిదుఁడు, మతి = అంతర్ముఖమైన తెలివి, తన్ = ప్రత్యగాత్మస్వరూపుఁడైన తన్ను, పాయుతఱిన్ = బహిర్ముఖమై విడుచునప్పుడు, క్రియలన్ = లౌకికవైదికములగు సకలజగత్కార్యములను, తగన్ = లెస్సగా, సన్మానింపుచున్ = విమర్శించి గౌరవించుచు, వెండియున్ = పిమ్మట, ధైర్య సంయుతుఁడై = బహిర్వ్యాపారములను చేయుటచేత తన బ్రహ్మనిష్ఠ చెడునను దిగులు లేనివాఁడై, స్వవిధ్యుక్త క్రియల్ - స్వ = తనకు తగిన వర్ణాశ్రమములకు, విధి = వేదశాస్త్రములచేత, ఉక్త = చెప్పఁబడిన, క్రియల్ = శ్రౌతస్మార్త ధర్మకార్యములను, లోకసంహితుఁడై, ॥శ్లో. కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః, లోకసంగ్రహమేవాపి సంపశ్యన్ కర్తుమర్హసి, యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః, స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే॥ అను గీతాచార్యులవచనప్రమాణములను బట్టి జనకాదులు బ్రహ్మనిష్ఠు లయినను సత్కర్మానుష్ఠానపరులయి ముక్తు లయి రనియును పెద్దలు బహిర్ముఖు లయిన సమయమందు బ్రహ్మ నుద్దేశించి విధి నిషేధ ప్రాయశ్చిత్త కామ్యక్రియలు తాము చేయనియెడల వారే చేయలేదే మన కేల యని పామరులు ఆ పెద్దలహృదయ నిర్ణయములను తెలియక సత్కర్మములు విడిచి భ్రష్టు లగుదు రనియు, తాము చేయు సత్కృత్యములను చూచి భగవదాజ్ఞలగు వేదశాస్త్రములకు భయపడి పామరులు పుణ్యకర్మములను చేసి పిమ్మట చిత్తశుద్ధిగలిగి బ్రహ్మవేత్తలయి ముక్తులగుదు రని జగద్ధితమును కోరినవాఁడై, తెల్విన్ = బ్రహ్మజ్ఞానమును, పాయక = విడువక, తనకున్ = ప్రత్యగాత్మస్వరూపుఁడైన తనకు, హేయంబులై = పరోక్షజ్ఞానకారణము లగుటవలన దూష్యములై, నిష్ఠకున్ = తాను చేయు నిర్వికల్పసమాధికి, ప్రతిపక్షంబులుగాన్ = విరోధములుగాను, వెలింగినన్ = ప్రకాశించినను, బ్రహ్మార్పణప్రజ్ఞచేన్ = ॥శ్లో. బ్రహ్మార్పణం బ్రహ్మహవి ర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్, బ్రహ్మైవ తేన గన్తవ్యం బ్రహ్మకర్మసమాధినా॥ అను న్యాయమువలన పరబ్రహ్మమైన తనచేత చేయఁబడిన శ్రౌతస్మార్తాదిక్రియలఫలములను పరబ్రహ్మమునకే సమర్పించుచుండుటతో కూడిన, ప్రజ్ఞచేన్ = వివేకముచేతను, సల్పున్ = సత్కర్మములను చేయుచుండును.

తా. ఓయి శిష్యుఁడా! బ్రహ్మవిదుఁడు ప్రపంచజ్ఞానము కలవాఁడైనప్పుడు బ్రహ్మజ్ఞానమును విడువక సకలపుణ్యకర్మములను చేయుటచేత తన బ్రహ్మనిష్ఠ చెడు ననెడు

భీతిలేక తననిష్ఠకు కర్మములు విఘ్నకరము లని వదలక తనవర్ణాశ్రమములకు తగిన లౌకిక వైదికరూపములయిన సకలలోకకృత్యములను విమర్శించి లోకోపకారముకొఱకు పుణ్య కర్మములను చేయుచు కర్మఫలములయందు అభిలాష లేక బ్రహ్మార్పణము చేయుచుండు నని తాత్పర్యము.

అవ — బ్రహ్మవేత్తలప్రవర్తనావిశేషములను చెప్పుచున్నారు.

మ. అవివేకాన్వితకర్మసంచితభవప్రారబ్ధభేదంబులన్
భువి మర్త్యుల్విహరింతు రం దటుల సంపూర్ణాత్మవేత్తల్ గృషి
వ్యవహారాదులనైన సల్పుదురు రాజ్యంబైనఁ బాలింతు రా
ర్జవవృత్తిం దపమైన సల్పుదురు భిక్షంబైన క్షుచ్ఛాంతికై. ౧౨౮

టీ. అవి...బులన్-అవివేక = అజ్ఞానదశతోడ, అన్విత=కూడిన, కర్మ=పుణ్య పాప మిశ్రకర్మములచేత, సంచిత=సంపాదింపఁబడిన, భవ=పూర్వజన్మసంబంధమయిన, ప్రారబ్ధ=ఇచ్ఛ అనిచ్ఛ పరేచ్ఛ అని త్రివిధమైన ప్రారబ్ధముయొక్క, భేదంబులన్= విశేషములచేతను, మర్త్యుల్=మనుష్యులు, భువిన్ = భూమియందు, విహరింతురు= సంచరింతురు, అందున్ = ఆసంచరించెడు మానవులయందు, అటులన్=ఆప్రారబ్ధకర్మ భేదములచేత, సంపూర్ణాత్మవేత్తలు - సంపూర్ణ=అంతటనిండియున్న, ఆత్మ=కూటస్థుఁ డైన పరమాత్మను, వేత్తలు=తెలిసిన బ్రహ్మజ్ఞానులు, కృషివ్యవహారాదులనైనన్-కృషి= దున్నుట, వ్యవహారాదులనైనన్=ఉద్యోగము వర్తకము మొదలగువాని నయినను, సల్పు దురు=చేయుదురు, రాజ్యంబయినన్=రాజు మంత్రి స్నేహితులు బొక్కసము దేశము దుర్గము రథాంగ మాతంగ తురంగ భటాదులతోకూడిన సైన్యము అనెడి సప్తాంగములతో చేరిన రాజ్యమునయినను, పాలింతురు=ఏలుదురు, ఆర్జవవృత్తిన్=శాంతస్వభావముతో, తపమైనన్=కాయిక వాచిక మానసికరూప తపస్సునయినను, చేయుదురు=సలుపుదురు, క్షుచ్ఛాంతికై=ఆఁకలి తీఱుటకయి, భిక్షంబైనన్=తిరిపెము నయినను, చేయుదురు= ఒనరింతురు.

తా. ఓయి శిష్యుఁడా! అజ్ఞానదశయందు చేయఁబడిన పూర్వజన్మమందలి యిచ్ఛ అనిచ్ఛ పరేచ్ఛ అనెడి త్రివిధప్రారబ్ధవిశేషములచేత మనుజులు పుడమియందు తిరుగు దురు. వారియందు ఆప్రారబ్ధకర్మములచేత బ్రహ్మవేత్తలు దున్నుటను ఉద్యోగముచేయు టను వర్తకము చేయుటను సప్తాంగములతోకూడిన రాజ్య మేలుటను శాంతస్వభావముతో కూడినకాయిక వాచిక మానసికరూప తపస్సునుచేయుటను ఆఁకలి తీఱుటకై తిరిపెము నెత్తుటను చేయుదు రని తాత్పర్యము.

## ప్రారబ్ధత్రయనిరూపణము.

ఇచ్ఛాప్రారబ్ధ మని అనిచ్ఛాప్రారబ్ధ మని పరేచ్ఛాప్రారబ్ధ మని ప్రారబ్ధము మూఁడువిధములు. ఇవి వివేకులకును అవివేకులకును, సమానము లయి యున్నను వివేకిప్రారబ్ధమునకును అవివేకిప్రారబ్ధమునకును భేదము గలదు. ఎట్లనఁగా అవివేకిప్రారబ్ధము ఆశ్వయుజమాసమందలి మేఘమువంటిది. ఆమేఘము ఆశ్వయుజమాసమందు, స్వల్పముగ తోఁచి వెనుక అంతటను వ్యాపించి యేనుఁగుతొండములావుగల చినుకులతో కుండలతోడ ముంచి పంచినట్లు వర్షించి పైరులను ముదుఁగఁజేసి యిండ్లు గోడలు గుడులు గోపురములు చెట్లు మొదలగువాని నేలపాలు కావించి ప్రాణులకు బహువిధదుఃఖములను గలుగఁజేయురీతిగ అజ్ఞానికిని తొలుత స్వల్పముగానే యిచ్ఛపుట్టి, ఆమేఘమువలెనే హృదయాకాశమున వ్యాపించి పరులను బహువిధదుఃఖములను కలిగించి వానికిని ఇహపరలోకసుఖములను చెఱచి నరకముపాలు చేయును.

వివేకియిచ్ఛ పుష్యమాసమందలి మేఘమువంటిది. అది పుష్యమాసమందు మింట నాలుగుప్రక్కలను చుట్టుకొని యున్నను కొంచెముగ వానకురిసి పయిరులలో నగు వానికి చేటుపాటిల్లనీయక ప్రాణులకును సుఖమునే కలిగించి తాను నశించును. అట్లే వివేకియిచ్ఛ కర్మవశమున పుష్యమాసమందలి మబ్బువలెనే జబ్బుగాక హృదయాకాశమున వ్యాపించి యున్నను పరులను బాధింపక తనయిహపరలోకసుఖములకును హానిని సంపాదింపక దేహపోషణమాత్రమందే యుండును. ఈరీతిగ వివేకియిచ్ఛాప్రారబ్ధమునకును అవివేకియిచ్ఛాప్రారబ్ధమునకు తారతమ్యము తెలియవలెను.

మఱియును లోకమునందు అవివేకులు అసత్యము చేసి కన్నములు పోయి వచ్చిన వారిని దొంగిలించి తలకొట్టఁబడినవారిని కులస్త్రీలను చెఱఁబట్టి వాడిసెఁచేత మేను చెక్కఁబడినవారిని చూచి మన మీపనులు చేయరాదు. చేసితిమేని మనకును తప్పక ముప్పులు వచ్చు నని తెలిసియును వారు చేతకానివారు మనము సర్వసమర్థులము. అని గర్వించి ఆపనులను తాము చేసి తలకొట్టఁబడుచున్నారు. వివేకు లయినవారు కోరికలు కలుగుట దుఃఖహేతువు లని యెఱిఁగి ద్రవ్యార్జనపరులయిన సంసారులు అర్థములను సంపాదించుటయందును వానిని కాపాడుటయందును వానిని వెలవుచేయుటయందును దుఃఖపడుటను చూచి అర్థములు అనర్థహేతువులు వానియం దాసక్తి యుంచరాదు. ఉంచితిమేని యితరులకు దుఃఖములు సంభవించినట్లే తమకును దుఃఖములు సంభవించు నని తలఁచి, సర్వవిషయములయందును ఆసక్తి వదలి ప్రయత్నింపకయే దొరకినంతటితో తృప్తి నొందియుందురు. వారికి శరీరపోషణమాత్రమయిన పనులయందును శౌచాది క్రియలయందును ఇచ్ఛ పుట్టును గాని ఇతరవిషయములయందు ఇచ్ఛ పుట్టదు. ఇది వివేకులయిచ్ఛాప్రారబ్ధము.

అనిచ్ఛాప్రారబ్ధ మేది యనఁగా కోరకయే సంప్రాప్త మగుదుఃఖము. అది వివేకులకును అవివేకులకును ఒక్క విధముగానే యుండును. తల కాళ్లు చేయి తాఁకుటయును కన్నీరు గాఱుటయును వానచేత తడియుటయును ఎండవల్ల కొట్టుపడుటయును కాశము క్షయము గుల్మము మొదలైన వ్యాధులు కలుగుటయును పిడుగులు పడుటయును గుడి గోపురప్రాకార మంటపాదులు మీఁదఁ బడుటయును మొదలయినవానిచేత వచ్చినదుఃఖములు ఎండ వాన అగ్ని మొదలగువానివలన కలిగినసుఖములు వివేకులకును అవివేకులకును సమానమయి యుండును. వీనియనుభవములే అనిచ్ఛాప్రారబ్ధము.

పరేచ్ఛాప్రారబ్ధము అవివేకులకును వివేకులకును సమానమయి యుండును. ఎట్లనఁగా ఒక్క పురుషుఁడు మౌనముతో కూర్చుండి యుండఁగా మఱియొకఁడు వచ్చి వానికి ముఖ్యముగ నీ వీపని చేయవలె నని మిక్కిలి వేఁడుకొనఁగా దాక్షిణ్యముచేత ఆపని చేసి దానివలన వచ్చినసుఖదుఃఖములను అనుభవించుట ఈఅనుభవము వివేకులకును అవివేకులకును సయితము ఒక్క విధమ నగే యుండును. ఇట్లు ప్రారబ్ధత్రయాను క్షణములను విచారించి యీప్రారబ్ధములయనుభవము అహంకారమునకే కాని అహంకారవిలక్షణుఁడ నైన నాకు లేద ని యెఱుఁగువాడే ముక్తుఁ డని వేదాంతసిద్ధాంతము.

ఆన —బ్రహ్మవిద్ బ్రహ్మవిద్వర బ్రహ్మవిద్వరీయ బ్రహ్మవిద్వరిష్ఠుల వివాదములను మఱియును వివరించుచున్నారు.

మ. గత మాగామిఁ దలంచి చెందరు వ్యథం గౌతూహలం బాత్మ సం
గత మౌ దానిపురాకృతం బని నిరాకాంక్షం బరిగ్రాహ్యులై
మృతుఁ డుజ్జీవితుఁ డయ్యె నుష్ణఘృణి భూమిన్ సత్సుధారాశియై
పతితం బయ్యె ననన్ విచిత్ర మని స్వప్రజ్ఞావిదు ల్గాంతురే. ౧౨౭

టీ. స్వప్రజ్ఞావిదుల్ - స్వ=ప్రత్యగాత్మయైన తనయొక్క, ప్రజ్ఞా=వివేకమును, విదుల్=ఎఱిఁగినపండితులు, గతమున్ = కడచినకార్యమును, ఆగామిన్ = కాఁబోవు కార్యమును, తలంచి=స్మరించి, వ్యథన్ = దుఃఖమును, కౌతూహలంబున్ = సంతోషమును, చెందరు=పొందరు, ఆత్మసంగతము - ఆత్మ=మనస్సునందు, సంగతము=కూడిన ప్రారబ్ధకర్మానుభవమును, నిరాకాంక్షన్=అనిచ్ఛచేత, (ప్రాప్తించిన) పురాకృతం బని=పూర్వజన్మసంచితమని, పరిగ్రాహ్యులై=గ్రహించినవారయి, మృతుఁడు=పూర్వము చచ్చినవాఁడు, ఉజ్జీవితుఁడయ్యెన్=బ్రతికెను, ఉష్ణఘృణి=సూర్యుఁడు, భూమిన్=పుడమియందు, సత్సుధారాశియై=మేలయిన అమృతసముద్రమై, పతితం బయ్యెన్=పడెను, అనన్=ఇట్లని పలికినను, విచిత్ర మని=అద్భుతమని, కాంతురే=చూతురా.

తా. ప్రత్యగాత్మయగు తనవివేకమును ఎఱిఁగినపండితులు కడచిన కార్యములను కాఁబోవుకార్యములను తలఁచి ఖేదమును మోదమును పొందరు. అప్పుడు సంప్రాప్త

మైన ప్రారబ్ధకర్మానుభవమును అనిచ్ఛచేత ప్రాప్తించిన పూర్వజన్మార్జిత మని గ్రహించినవారై, పూర్వము ఎప్పుడో చచ్చినవాఁడు బ్రతికి వచ్చినాఁ డని పలికినను, సూర్యుఁడు అమృతసముద్రమువలె చల్లనై భూమిమీఁదికి వచ్చినాఁ డని వాక్రుచ్చినను, రాకపోకలు మాయాకార్యము లగుటవలన ఆమాటలు వింతగా స్వాంతమున తలఁచ రని తాత్పర్యము.

## ఆగామిసంచిత ప్రారబ్ధముల వివరము.

ఒకకాఁపువానికి తామ్రపర్ణీతీరమున పదిపొలములు గలవు. ఆపొలములను తానే దున్ని పైరుపెట్టును. ఒక్కొకపొలమునకు వేయికలములలెక్కను ఏఁడాదికి పదివేలకలములు పండును. వానియందు వేయికలములు తనయింటిగ్రాసమునకును ఏనూఱుకలములు విత్తనమునకును ఏనూఱుకలములు ధర్మమునకును వేయికలములు వ్యవసాయపుకర్చులకును వేయికలములు సర్కారు పన్నులకును పోఁగా మిగిలిన ఆఱువేలకలములను అమ్ముటకు పదిలపఱచి యుంచును. ఆధాన్యము సంచిత మనఁబడును. ఇంటిగ్రాసమునకు నిలిపినవేయికలములధాన్యము ప్రారబ్ధ మనఁబడును. పెద్దపైరును మొలకపయిరును ఎన్నువిడిచినపయిరును పండినపంటయును ఆగామి యనఁబడును. ఇట్లు ఏఁటేఁట జరుగుచుండ ఆయూరివారికిని ఆకాఁపునకును ప్రబలకలహము సంభవించెను. అప్పుడు పగవారు తెగఁబడి యిల్లు దూఱి దాఁచఁబెట్టినధాన్యమును దోఁచుకొనిపోయిరి. రాఁబోవు పంటధాన్యమెల్లను తుంటరితనముచేత కడుపుమంట ప్రబల కొల్లగాండ్రు కొల్లగొనిపోయిరి. పైరునంతయును జంగిలిపశువులు గుఱ్ఱములు గాడిదెలు మొదలయినవి మేసెను. అంతట కాఁపు ఏపు చెడి మాపును రేపును లోకులు చేసినతులువపనులకు వ్యాకులపడుచు కొల్లపోఁగా మిగిలినధాన్యమును భుజించుచు సామాన్యముగ కాలము గడపుచుండెను. అట్టిసమయమున తన్ను చుట్టికొనియున్నచుట్టములు హెచ్చినమచ్చికతో వచ్చి కాఁపును మాచిగ్రాసమునకు మోసము పొసఁగెనే అందుకు నీ వేమి చేయుచున్నా వని యడిగిరి. కాఁపు సంచితధాన్యము లెక్కకు మించి యుండెను. దానిని పగవారు అపహరించిరి. రాఁబోవు పంట కొల్లగాండ్రపాలయ్యెను. పయిరునెల్ల జంగిలి పశువులు మొదలగునవి మేసెను. ఇంటను పదిలపఱచియున్న ధాన్యమును భుజించుచున్నా ననెను. ఇట్లనుటచేత దృష్టాంతమందు ఆగామిసంచితములు నశించె నని ప్రారబ్ధ మనుభవించి తీఱవలె నని తెలియఁగవలెను. ఇఁక దార్ష్టాంతమందు ఆగామి సంచిత ప్రారబ్ధము లెట్లనిన లోకమందు అనాదియైన జీవుఁడు పుణ్యపాప మిశ్రకర్మములను చేయుచు రాఁగా ఒక్కదినమందు చేసిన పుణ్యపాపమిశ్రకర్మములు పెక్కుజన్మములకు హేతువు లగును. ఇట్లు తన జీవితకాలము వఱకు చేయుపుణ్యపాప మిశ్రకర్మములు రాసు లగును. వీనికే సంచిత మని పేరు. మరణించినవెనుక మరల పుట్టుటకై ఆసంచితమున పంచికొనఁబడిన కర్మము రాఁబోవుపుట్టుకకు కారణములైన పంచీకృత పంచమహాభూతమయ శరీరమును గలుగఁజేయును. ఆశరీ

రముచేత కొన్నిపుణ్యపాపమిశ్రకర్మములను చేసి ఆకర్మములవలన సుఖదుఃఖములను కొన్నిటి ననుభవించును. దీనికే ప్రారబ్ధ మని పేరు. దీని ననుభవించుచు మరణపర్యంతము చేసిన పుణ్యపాప కర్మములకు ఆగామి యని పేరు. ఇదియును ఆసంచితములో చేరుచు వచ్చును. ఇవ్విధముగ జీవుఁడు అనాదిగ కర్మములను చేయుచు వచ్చుచుండ సంచితము మించి వృద్ధిఁబొందుచు వచ్చును కనుక యీజీవుల జన్మములకు మితము కలుగదు. మిత మెప్పుడు కలుగుననఁగా ఇటులు చటులముగ పుణ్యపాపమిశ్రకర్మములను చేయుచు వచ్చుచుండ ఒక్కజన్మమందు ఒక్కపుణ్యకర్మపరిపాకమువలన సంసారదుఃఖము నివర్తించుకొనవలయు నను తెలివి కలిగి సంచితమునకు హేతువు లయిన కామ్యకర్మములను చేయుటవలన చిత్తశుద్ధి రానేరదు. సంసారదుఃఖము తీఱనేరదు అని యోజించి కామ్యకర్మములను విడిచి విధివిహితములయిన సత్కర్మములను చేసి ఆకర్మఫలములను భగవదర్పణము చేయు భక్తి కలుగును. ఆభక్తివలన చిత్తము శుద్ధియగును. దానివలన సద్గురులాభము కలుగును. ఆగురువునకు చతుర్విధ శుశ్రూషలు చేయుచు సాధనచతుష్టయ సంపన్నుఁడై వేదాంతశాస్త్రశ్రవణ మనన నిదిధ్యాసములను జేసి విజ్ఞానమును తాల్చి ఆవిజ్ఞానాగ్నివల్ల అజ్ఞానమును కాల్చి సర్వదుఃఖములను ప్రేల్చి రాగద్వేషాదుల చీల్చి జన్మబంధములను కూల్చి వెలుఁగుచుండును గనుక విజ్ఞానము కలిగినవెనుక చేయఁబడిన పుణ్యపాపమిశ్రకర్మఫలములు అకర్తయయిన వీనిని అంటనేరవు. మఱి యాపుణ్యపాపములకు గతి యేది యనిన ఈజ్ఞానిని భూషించువారు పుణ్యమును దూషించువారు పాపమును కొనిపోదురు. ॥శ్లో. ప్రారబ్ధం భోగతో నశ్యేత్తత్త్వజ్ఞానేన సంచితమ్, ఆగామి ద్వివిధం కర్మ తద్ద్వేషి ప్రియవాదినోః॥ అని యున్నది కాఁబట్టి యీ ఆగామిసంచితప్రారబ్ధములను తుదముట్ట విచారించి యివి అహంకారమునకుఁగాని అహంకారసాక్షినైన నాకు లేవని యెఱుఁగు వాఁడే ముక్తుఁడని వేదాంతసిద్ధాంతము.

అవ.—బ్రహ్మవిద్వర బ్రహ్మవిద్వరీయ బ్రహ్మవిద్వరిష్ఠులలక్షణములను చెప్పుచున్నారు.

చ. ఇతరులు మువ్వురుం దివిరి యీశ్వరనిష్ఠ వెలుంగ వారిలో
అతులవరుండు నిల్వఁ దను వన్నరసమ్ములఁ గోరు వర్యుఁ డం
చితగతిఁ దెల్ప నన్య లెదఁ జింతనఁ జేయుఁ దదన్నపానముల్
సతతసమాధి నట్టులఁ దలంపక యుండు వరిష్ఠుఁ డెంతయున్. ౧౩౦

టీ. ఇతరులు=మొదటి బ్రహ్మవిదునికంటె, అన్యులైన = మువ్వురును, బ్రహ్మవిద్వర, బ్రహ్మవిద్వరీయ, బ్రహ్మవిద్వరిష్ఠులు మువ్వురును, ఈశ్వరనిష్ఠ=పరబ్రహ్మసమాధిని, తివిరి=పూని, వెలుంగ=ప్రకాశింపఁగాను, వారిలో=ఆముగ్గురిలోపల, అతులవరుండు=సమానరహితుఁడగు బ్రహ్మవిద్వరుఁడు, తనువు=శరీరము, నిల్వ=నిలు

చుటకు, అన్నరసమ్ములన్ = అన్నమును నీళ్ళను, కోరున్ = అభిలషించును, పర్యుడు = బ్రహ్మవిద్వరీయుడు, అన్యులు = ఇతరులు, అనఁగా భక్తజనులు, అంచితగతిన్ = ఒప్పునట్టిరీతివల్ల, తెల్పన్ = ప్రబోధింపఁగా, తదన్నపానములు = ఆయన్నమును నీళ్ళను, ఎదన్ = హృల్లమునందు, చింతనఁజేయున్ = తలంచును, సతతసమాధిన్ = ఎడతెగని బ్రహ్మనిష్ఠవల్లను, అట్టులన్ = ఆ బ్రహ్మవిద్వ బ్రహ్మవిద్వరీయులవలె, వరిష్ఠుఁడు = బ్రహ్మవిద్వరిష్ఠుఁడు, ఎంతయున్ = ఏమాత్రమును, తలంపకయుండన్ = అన్నపానములను స్మరింపకయుండును.

తా. బ్రహ్మవిద్వరుఁడును బ్రహ్మవిద్వరీయుఁడును బ్రహ్మవిద్వరిష్ఠుఁడును పరబ్రహ్మనిష్ఠను పూని వెలుఁగుచుందురు. ఆమువ్వురిలో బ్రహ్మవిద్వరుఁడు శరీరము నిలుచుటకు తానుగానే నిష్ఠనుండి మేల్కాని అన్నపానములను కోరును బ్రహ్మవిద్వరీయుఁడు శిష్యులు మేల్కొల్ప నిష్ఠనుండి మేల్కాని ఆయన్నపానములను తీసికొనఁదలఁచును. బ్రహ్మవిద్వరిష్ఠుఁడు ఎడతెగని బ్రహ్మనిష్ఠలో నుండి తానుగాఁ గాని యితరులవలనఁ గాని మేలుకొనుటలేనందున అన్నపానముల నెప్పుడును తలఁపక యుండునని తాత్పర్యము.

అవ — బ్రహ్మవిద్వరాదుల ఫలితస్థితిని జెప్పుచున్నాఁడు.

చ. త్రిభువనదుర్లభామృతసుధీయుతు లాగతి నెంద ఱైనఁ ద
చ్ఛుభ మగుముక్తి యొండె యగుఁ క్షోణి సమాధిఁ బ్రయాసభేద మే
విభవ మొసంగు నాఁగ వర విశ్రుతవర్యవరిష్ఠు లెందు వా
రభయులు నిష్ఠఁ దత్త్వవిదుఁ డెందుఁ గొంతయు నంగలౌక్యముల్.

టీ. ఆగతిన్ = పైనఁ జెప్పినట్లు, త్రిభువనదుర్లభామృత సుధీయుతులు - త్రిభువన = భూలోక భువర్లోక సువర్లోకములచేత, దుర్లభ = పొందశక్యముగాని, అమృత = కైవల్యముయొక్క, సుధీ = జ్ఞానముతోడ, యుతులు = కూడియుండెడు జీవన్ముక్తులు, ఎందఱైనన్ = ఎంతమందియైనను, తచ్ఛుభమగుముక్తి = నిత్యమంగళస్వరూప మయినయామోక్షము, ఒండెయగున్ = ఒక్కటే యగును, క్షోణిన్ = భూమియందు, సమాధిన్ = సవికల్పకనిర్వికల్పక నిష్ఠచేత, ప్రయాసభేదము - ప్రయాస = శరీరేంద్రియనిగ్రహము మొదలగుశ్రమములతోకూడిన, భేదము = వేఱుపాటు, ఏవిభవమున్ = ఏభాగ్యమును, ఒసంగున్ = ఇచ్చును, నాఁగన్ = అని యడుగఁగా, వరవిశ్రుతవర్యవరిష్ఠులు - వర = బ్రహ్మవిద్వరుఁడు, విశ్రుత = ప్రసిద్ధుఁడయిన, వర్య = బ్రహ్మవిద్వరీయుఁడు, వరిష్ఠులు = బ్రహ్మవిద్వరిష్ఠుఁడు, ఎందున్ = ఎక్కడను, వారు = ఆమువ్వురును, అభయులు = జన్మమృత్యుసుఖదుఃఖాది భయములు లేనివారు, బ్రహ్మవిదుఁడు = మొదటివాఁడయిన బ్రహ్మవిదుఁడు, నిష్ఠన్ = బ్రహ్మనిష్ఠయందును, లౌక్యముల్ = వేదోక్తకులాచారధర్మములయిన స్నానసంధ్యాజపహోమవేదపాఠ దేవపితృతర్పణ వైశ్వదేవ దేవతార్చనములు మొదలు

యితరలోకవ్యవహారములు, ఎసంగన్=ప్రబలఁగా, కొంత=నిష్ఠయందు తక్కువను, అంతన్=పొందుదురు.

తా. ఓయి శిష్యుఁడా! భూలోక భువర్లోక సువర్లోకములయందలి జనులచేత పొందఁదరముగాని బ్రహ్మజ్ఞానముగల జీవన్ముక్తులు బ్రహ్మవిద్ బ్రహ్మవిద్వర బ్రహ్మవిద్వరీయబ్రహ్మవిద్వరిష్ఠులనెడు భేదములచేత ఎందరైనను మోక్షము ఒక్కటే యగును. అని యాచార్యుఁడు పలుకఁగా విని ఓస్వామీ! బ్రహ్మవిదాదులకు దేహేంద్రియనిగ్రహము మొదలగు శ్రమలతోఁ గూడిననిష్ఠాభేదము ఏమిభాగ్యము నిచ్చును? అనఁగా బ్రహ్మవిద్వర బ్రహ్మవిద్వరీయ బ్రహ్మవిద్వరిష్ఠులు కర్మములు చేయుటచేత పుణ్యలోకసుఖములు కలుగును చేయనందున పుణ్యలోకసుఖములు కలుగవు అనెడు భయము లేక యుందురు బ్రహ్మవిదుఁడు అభీతిలేకయే లోకులు చెడుదురనెడుభీతి గలిగి లోకోపకారముగ వేదోక్తములయిన కులాచారధర్మములగు స్నానసంధ్యావందన జప హోమ వేదపాఠ దేవపితృతర్పణ వైశ్వదేవ దేవతార్చనా తిథిపూజలును శిష్యులకు వేదాంతశాస్త్రముల బోధించుటయును కలవాఁడగుటచేత నిష్ఠయందు కొంచెము తక్కువయయి యుండును అని తాత్పర్యము.

అవ.—బ్రహ్మవేత్తలు మూఢులవిధమున సంచరించుచుండియును విలక్షణులై యుండువిధమును దృష్టాంతముతోడ చెప్పుచున్నారు.

ఉ. శేముషిశూన్యకర్ములు జీవితులాగతి నాత్మవేత్తలీ
భూమిఁ జరించుచున్ స్థిరతఁ బూని యహమ్మతిఁ బాసి వెన్క నే
నేమమునం జరింప రన నింగి తొలంగినభంగి నన్నిటిన్
భూమిజలాదు లైక్యములఁ బొందినమాడ్కి వసింతు రెందులన్.

టీ. శేముషిశూన్యకర్మఠులు-శేముషిశూన్య=తెలివిలేని, కర్మఠులు=శ్రౌతస్మార్తాది నిత్యనైమిత్తిక కర్మములయం దాసక్తిగలవారు, జీవితులాగతిన్ = బ్రతికెడు విధమునను, ఆత్మవేత్తలు = బ్రహ్మవిదాదులు, స్థిరతన్=చిత్తవిశ్రాంతిని, పూని = వహించి, అహంమతిన్=అజ్ఞానమును, పాసి=విడిచి, భూమిన్=పుడమియందు, సంచరించుచున్=తిరుగుచును, వెన్కన్=పిమ్మట, ఏనేమమునన్=ఏనియమముచేతను, చరింపరు=ఇతరవ్యవహారములయందు సంచరింపరు, అనన్=అని పలుకఁగాను, నింగి = ఆకాశము, అన్నిటిన్=భూమిమొదలగు సకలద్రవ్యములనుండి, తొలంగినభంగిన్ = కూడని విధమునను, భూమి = పృథివియు, జల=ఉదకమును, ఆదులు = మొదలగునవి, ఐక్యములన్=ఐకమత్యములను, పొందినమాడ్కిన్=చెందిన విధమునను, ఎందున్=ఎచ్చటను, చరింతురు=సంచరింతురు.

తా. ఓస్వామీ! బ్రహ్మజ్ఞానము లేక శ్రౌతస్మార్త నిత్యనైమిత్తిక కర్మములను ఆసక్తితో చేయుచు వర్తకము జ్యోతిషము వ్యవసాయము వైద్యము ఉద్యోగము మొదలయిన వృత్తులచేత జీవించు మూఢులవలెనే బ్రహ్మజ్ఞానమందు పూర్ణులయి చిత్తవిశ్రాంతి గలిగి యుండు బ్రహ్మవేత్తలును సంచరించుచుందురు. అట్లు సంచరించు బ్రహ్మవేత్తలు ఏమహత్త్వముచేత వెనుక అన్నిపనుల విడిచి మూఢులవలె సంచరింపక యుందురు? అని శిష్యుఁ డడుగఁగా భూమిజలాదులు ఒకటితో ఒకటి కలసి యున్న విధమున మూఢులతో కూడి తిరుగుచు ఆకాశము భూజలాదులతో కలసియుండియును కలియక యున్న విధమున మూఢులచేరికను విడిచి వసింతు రని తాత్పర్యము.

అవ.—బ్రహ్మవిద్వరాదులను సందర్శించువారలకుఁ గలుగుఫలమును వారు పొందు ముక్తిసుఖమును చెప్పుచున్నారు.

శా. జీవన్ముక్తులఁ గాంచువారలు విరించిశ్రీశపుష్పప్రభి
ద్దేవానీకము మోదమంద బహుసత్కృత్యంబులం దీర్చు స
ద్భావశ్రీలఁ జెలంగి యుందు రని వేదంబు ల్మొఱ లెత్తు నా
జీవన్ముక్తులు పొందుముక్తిసుఖ సంశ్రీఁ దెల్ప నేరికిన్. ౧౩౩

టీ. జీవన్ముక్తులన్=బ్రహ్మవిద్ బ్రహ్మవిద్వర బ్రహ్మవిద్వరీయ బ్రహ్మవిద్వరిష్ఠులను, కాంచువారలు=సందర్శించువారు, విరించి...కము-విరించి = బ్రహ్మయును, శ్రీశ=విష్ణువును, పుష్పప్రభిత్=రుద్రుఁడును, దేవానీకము=దేవతలసముదాయమును, మోదమందన్=ఆనందించునటులు, బహుసత్కృత్యంబులన్-బహు=అనేకవిధములైన, సత్కృత్యంబులన్=విధినిషేధకామ్యప్రాయశ్చిత్తాది పుణ్యకార్యములను, తీర్చుసద్భావశ్రీలన్-తీర్చు = నెఱవేర్చినట్టి, సద్భావ=మంచిమనస్సుగలవారియొక్క, శ్రీలన్=సంపదల చేత, చెలంగి=అతిశయించి, ఉందు రని=వసింతు రని, వేదంబులు=శ్రుతులు, మొఱలెత్తున్=ఘోషించును, ఆజీవన్ముక్తులు=ప్రసిద్ధులయిన బ్రహ్మవిదుఁడు బ్రహ్మవిద్వరుఁడు, బ్రహ్మవిద్వరీయుఁడు, బ్రహ్మవిద్వరిష్ఠుఁడు అనువారు, పొందుముక్తి సుఖసంశ్రీన్-పొందు=పొందుచుండెడి, ముక్తి=విదేహకైవల్యపదప్రాప్తియందలి, సుఖసంశ్రీన్=ఆనందసంపదను, తెల్పన్ = తెలియఁజేయుటకు, ఏరికిన్=ఎవరికి, శక్యముగాదనుట.

తా. ఓయి శిష్యుఁడా! జీవన్ముక్తులైన బ్రహ్మవిద్ బ్రహ్మవిద్వర బ్రహ్మవిద్వరీయబ్రహ్మవిద్వరిష్ఠులను ఎల్లప్పుడును అక్కఱ అగలిగి మక్కువతో దర్శనముచేయు పుణ్యపురుషులు బ్రహ్మ విష్ణురుద్రులును దేవేంద్రుఁడు మొదలగు ముప్పదిమూడుకోట్ల దేవతలును మహా

నందమును చెందునట్లుగ గోదాన భూదానాన్నదానాదిసమస్తదానములను గంగ కావేరి గోదావరి మొదలగు పుణ్యనదీ తీర్థస్నాన తర్పణాదులను అయోధ్యమథుర ద్వారవతి కాశి కాంచి శ్రీకాళహస్తి హాలాస్య చిదంబర శ్రీశైలాది పుణ్యక్షేత్రనివాసములను అగ్నిష్టోమాతిరాత్ర పౌండరీకాదియజ్ఞములను అగ్రహార తటాక దేవాలయ వనాది ప్రతిష్ఠలను నిత్య నైమిత్తిక కర్మములను ఎండ వాన మంచులకు సంచలింపక పంచాగ్నిమధ్యమున నిలిచి తపస్సులు చేయుటయును సప్తకోటిమహామంత్రజపానుష్ఠానములను బ్రహ్మచర్యాద్యాశ్రమనియమములను అష్టాంగసహిత మంత్రలయ హఠ రాజయోగములను శైవ శాక్త గాణాపత్య సౌర కాపాలిక వైష్ణవాదిమతాంతరాగమ దీక్షాచరణములను తర్క వ్యాకరణ ధర్మశాస్త్ర మీమాంసా వేదాధ్యయనములను చేసిన మహానుభావులవలె మహానందమును పొందుచుందు రని వేదములు మొఱపెట్టుచుండును. ఇఁక ఆ బ్రహ్మవిద్వరాదులు పొందెడు విదేహ కైవల్య పదప్రాప్తి సుఖసంపద వాఙ్మనోతీతముగుటచేత ఇట్టిదని తెలుప నెవ్వరికిని తరము గాదని తాత్పర్యము.

అవ.—ఆగామిసంచితప్రారబ్ధకర్మవిమోచనమును చెప్పుచున్నారు.

శా. భూతానేకభవార్జితక్రియలు నిర్మూలంబు లౌఁ దూలసం
ఘాతం బౌర్వముఁ జేరి కాలుగతిఁ జిద్దావాగ్ని నాగామిసం
జాతం బందక దానఁ దోఁడె మయి నాశం బౌను ప్రారబ్ధ మా
పూతప్రాజ్ఞులయందనిచ్ఛలఁ జెడుఁ గా భోగింప భోగ్యంబునై. ౧౩౪

టీ. ఔర్వముఁ గాన్ = బడబాగ్నిని, తూలసంఘాతంబు = దూదిరాశి, చేరి=అంటి, కాలుగతిఁ గా=మండినవిధమున, చిద్దావాగ్నిఁ గా=విజ్ఞానమనెడుకార్చిచ్చునందు, భూతానేకభవార్జితక్రియలు-భూత=గతించినకాలమందలి, అనేక=లెక్కలేని, భవ=జన్మముల యందు, అర్జిత=సంపాదింపఁబడిన, క్రియలు=పుణ్యపాపమిశ్రకర్మములు, నిర్మూలంబులౌఁ గా=మొదలంట చెడును, దానఁ గా=అట్లుచెడుటచేత, ఆగామి=భవిష్యజ్జన్మహేతువగుకర్మము, సంజాతం బందక=పుట్టక, అనఁగా తలయెత్తక, తోఁడెమయి=స్వల్పమయి, నాశంబౌఁ గా=చెడును, ప్రారబ్ధము=అప్పుడనుభవించు కర్మము, ఆపూత ప్రాజ్ఞులయందుఁ గా=ప్రసిద్ధులును పవిత్రులును నిత్యానిత్యవస్తు వివేకముగల పండితులును అయిన ఆ బ్రహ్మవిదాదుల యందు, అనిచ్ఛలఁ గా=నిరభిలాషలచేత, భోగింపఁ గా = అనుభవించుటచే, భోగ్యంబునై=అనుభవనీయమైన వస్తువై, చెడుఁ గా=నశించును.

తా. ఓయి శిష్యుఁడా! బడబానలముచేత దూదికుప్ప బూదియైన మాదిరిగ విజ్ఞానమనెడుగాఢాగ్నిచేత కడచినకాలమందలి బహుజన్మములలో సంపాదింపఁబడిన పుణ్యపాప మిశ్ర రూపమైన సంచితకర్మము మొదలంట చెడును. వేఁగినవిత్తనము మొలక

డు క్తనట్టుగ రాఁబోవుజన్మములకు కారణమయిన ఆగామికర్మము అజ్ఞానాగ్నిసెగచేత పగచెడి సగమై తెగటాఱును. అనుభవించుచున్న ప్రారబ్ధకర్మము త్రిలోకప్రసిద్ధులును నిత్యపవిత్రులును నిత్యానిత్యవస్తువివేకముగల వారును అయిన ఆ బ్రహ్మవిదుఁడు మొదలగు వారిచేత నిరభిలాషముగ అనుభవింపఁబడి చెడిపోవు నని తాత్పర్యము.

అవ.—పుణ్య కర్మములు ఉత్తమజన్మములకును పాప కర్మములు అధమజన్మములకును మిశ్ర కర్మములు మధ్యమజన్మములకును కారణము లగుటవలన జన్మరహితులయిన విదేహముక్తులయందు ఆకర్మములు తొలఁగుటకు కారణమును చెప్పుచున్నారు.

శా. ఆయారబ్ధముఁ జెందువేళల భవిష్యజ్జన్మహేతుక్రియల్
చేయం జొత్తురు శాంతులైన నవి సంక్షీణంబు లెల్లా నన
శ్రేయస్కాములు సంస్తుతిం గుజను లాక్షేపంబునం దత్క్రియా
శ్రేయఃపంకము లంద వారియెడ నిస్తేజంబులై వీడవే. ౧౩౪

టీ. శాంతులైనన్=శుద్ధసాత్త్వికవృత్తిగలవారైనను, ఆయారబ్ధమున్=ఆప్రారబ్ధకర్మమును, చెందువేళలన్=అనుభవించుసమయములయందు, భవిష్యజ్జన్మహేతుక్రియల్-భవిష్యత్=రాఁబోయెడు, జన్మ=పుట్టుకలకు, హేతు=కారణములయిన, క్రియలు=పుణ్యపాపకర్మములను, చేయన్=ఒనర్చుటకు, చొత్తురు=ప్రవేశింతురు, అవి=ఆపుణ్యపాపకర్మములు, సంక్షీణంబులు=నశించునని, ఎల్లా ననన్=ఎవ్విధముగ నగు ననఁగా, శ్రేయస్కాములు=మేలు గోరువారు, సంస్తుతిన్=స్తోత్రముచేతను, కుజనులు=కుచ్ఛితులు, ఆక్షేపంబునన్=దూషణముచేతను, తత్క్రియాశ్రేయఃపంకములు-తత్=ఆ బ్రహ్మవేత్తలు చేసెడు, క్రియా=ఆగామి క్రియలయొక్క, శ్రేయః=పుణ్యములును, పంకములు=పాపములును, అందన్=చెందఁగాను, వారియెడన్=ఆబ్రహ్మజ్ఞానులయందు, నిస్తేజంబులై=నాశములై, వీడవే=పుణ్యపాపములను తొలఁగిపోవా?

తా. ఓగురుస్వామీ! బ్రహ్మవిదుఁడు మొదలయినవారు శాంతవృత్తిగలిగి అనిచ్ఛచేత ప్రారబ్ధకర్మములను అనుభవించుసమయమందు చేయఁబడు పుణ్యపాపకర్మములు మఱుజన్మములకు కారణములు గాక యేతీరున నశించు నని శిష్యుఁ డనఁగా మూఢులు ఆ బ్రహ్మవిదుఁడు లోనగువారిని నిందించి వారిపాపములను సజ్జనులు వారిమహిమలను తెలిసి పూజించి పొగడి వారిపుణ్యములను పొందుదురు గనుక వారు పుణ్యములును పాపములును లేక సుఖదుఃఖములు పుణ్యపాపములు మానావమానములు మొదలయినవానికి విలక్షణ మయినపరబ్రహ్మస్వరూపులయి యుందు రని తాత్పర్యము.

అవ.—శరీరత్రయవిమోచనమును జెప్పుచున్నారు.

మ. అరయన్ దుర్లభ మైనచిచ్ఛిఖిని హేతత్వాంగంబు స్థూలంబు దు
స్తరఘోరాగ్నిని బ్రేతమై భసిత మౌ స్వప్నాంగ మంతం జెడుం
బరితప్తాయసపిండ మంబుకణ మేపారం దెగం బీల్చిన
ట్లురుధైర్యస్థితి నుండ వేత్తలు మనీషోన్మన్యవస్థన్ సుతా. ౧౩౮

టీ. సుతా=కుమారా, ఉరుధైర్యస్థితిన్ - ఉరు=అతిశయమయిన, ధైర్య=రాగద్వేషాదులచేత చలింపఁబడని మనస్సుయొక్క, స్థితిన్=నిలుకడచేత, వేత్తలు= బ్రహ్మవిద్ బ్రహ్మవిద్వర బ్రహ్మవిద్వరీయ బ్రహ్మవిద్వరిష్ఠులు, మనీషోన్మన్యవస్థన్-మనీషా=విజ్ఞానస్వరూపమయిన, ఉన్మన్యవస్థన్ = అమనస్కనిష్ఠయందు, ఉండన్= ఉండఁగా, అరయన్=విమర్శించుటకు, దుర్లభము = శక్యముగానిది, ఐనచిచ్ఛిఖిన్= అయినట్టిజ్ఞానాగ్నిచేత, హేత్వంగంబు=అవిద్యామయమైనకారణశరీరమును, ప్రేతమై= పీనుఁగై, స్థూలాంగంబు=స్థూలశరీరము, దుస్తరఘోరాగ్నిన్-దుస్తర=దాఁటఁగూడని, ఘోర=భయంకరమయిన, అగ్నిన్=శ్మశానాగ్నిచేత, భసితమౌన్ = భస్మమైనదగును, అంతన్=పిమ్మట, స్వప్నాంగము = సూక్ష్మశరీరము, పరితప్తాయసపిండము-పరితప్త= లెస్సగాకాలిన, ఆయసపిండము = ఇనుపముద్ద, అంబుకణము=నీటిబొట్టును, ఏపారన్= లెస్సగా, తెగన్=నశించులాగున, అనఁగా ఇంకునట్లు, పీల్చినట్లు=ఆకర్షించువిధమున, చెడున్ = నశించును.

తా. ఓయి శిష్యుఁడా! బ్రహ్మవిద్ బ్రహ్మవిద్వర బ్రహ్మవిద్వరీయ బ్రహ్మవిద్వరిష్ఠులు అంతశ్శత్రువులయిన రాగద్వేషాదులచేత చలింపఁబడని మనస్సుయొక్క నిలుకడచేత విజ్ఞానస్వరూపమయిన అమనస్కనిష్ఠయందు ఉండఁగా విమర్శించి తెలియుటకు శక్యముగాని జ్ఞానాగ్నిచేత కారణశరీరమును పీనుఁగై భయంకరమయిన శ్మశానాగ్నిచేత స్థూలశరీరమును భస్మమగును. కాలిన యినుపముద్ద నీటిబొట్టును పీల్చినట్లు జ్ఞానాగ్నికిని శ్మశానాగ్నికిని నడుమనున్న సూక్ష్మశరీరము ఉండ నెడము లేనందున తనంతటనే నశించు నని తాత్పర్యము.

అవ.—విదేహముక్తిలక్షణమును జెప్పుచున్నారు.

మ. కలశోపాధులు డిందఁ నందుఁ గలయాకాశంబు లైక్యంబులై
వెలయుం దద్వదుపాధు లెల్లఁ జెడ నవ్వేళన్ వివేకుల్ సదం
బలరన్ లో వెలి నేకమై పరమమై యాద్యంతశూన్యంబునై
కలయన్ వెల్గువిదేహముక్తిఁ గని సత్కళ్యాణులై యుండ రే. ౧౩౯

టీ. కలశోపాధులు-కలశ = ఘటముయొక్క, ఉపాధులు = నాలుగువిధములైన భేదోపాధులు, అనఁగా ఘటమును ఘటమండలిఘటజాతియగు ఘటత్వమును ఘటరూపో

మును ఘటరూపమందలి రూపజాతియగు రూపత్వమును లేక మృద్వికారమైన ఘటమను పేరుగల కడప బాన చట్టి బుంగ దుత్త ముంత మూఁకుడు మొదలయిన ఉపాధిభేదములును, డిందన్=నశింపఁగానే, అందున్=ఆకుండ మొదలగువానియందు, కలయాకాశంబులు = ఉన్నమిన్నులు, ఐక్యంబులయి = మహాకాశమందుఁగలసినవై, వెలయున్=ప్రకాశించును, తద్వత్ = అతీరునసే, ఉపాధులెల్లన్=జీవేశ్వర స్థూలసూక్ష్మ కారణ మహాకారణములనెడి చతుర్విధోపాధులన్నియును, చెడన్=క్షీణింపఁగానే, అవ్వేళన్=అనశించినసమయమందు, వివేకులు=బ్రహ్మజ్ఞానులు, ముదంబు = ఆనందము, అలరన్=ప్రకాశింపఁగాను, లోన్=అంతరంగమందును, వెలిన్=బహిరంగమందును, ఏకమై=సజాతీయ విజాతీయ స్వగతభేదములు లేనిదై, పరమమై=అన్నిటికంటె నెక్కుడయి, ఆద్యంతశూన్యంబునై = ఉత్పత్తిస్థితి నాశములు లేనిదై, కలచున్=అంతటను, వెల్గు విదేహముక్తిన్-వెల్గు=ప్రకాశించుచున్న, విదేహముక్తిన్=విదేహకైవల్యమును, కని=పొంది, సత్కళ్యాణులై=నిత్యమంగళమగు పరబ్రహ్మస్వరూపులై, ఉండరే=ఉండరా-ఉందురనుట.

తా. ఓయి శిష్యుఁడా! కుండ ముంత దుత్త చట్టి బుంగ మొదలయినవి పగులఁగానే వానియందలి ఆకాశము మహాకాశమునఁ గలిసినవిధమున స్థూల సూక్ష్మ కారణ మహాకారణ శరీరములు నశింపఁగానే బ్రహ్మజ్ఞానులు నిత్యానందస్వరూపమును అన్నిటికంటె నెక్కువ దైనదియును పుట్టుట పెరుఁగుట గిట్టుటలు లేనిదియును అంతటను నిండి వెలుఁగుచున్నదియును అయిన విదేహముక్తిని పొంది నిత్యమంగళమయిన పరబ్రహ్మస్వరూపులై యుందురని తాత్పర్యము.

అవ.—ఈయనుభవ మెల్లప్పుడును ఒక్కతీరున ఉండునా యని శిష్యుఁ డడుగఁగా ఆచార్యులు దృష్టాంతముతోడఁ దెలుపుచున్నారు.

శా. ఉక్తస్వానుభవాత్మసంభవ నభంబుత్కృష్టమై నిండినన్
రక్తిం గూపముఁ ద్రవ్వ నందు దివి వేరాజిల్లున ట్లాత్మశా
స్త్రోక్తజ్ఞానను వేద్యమై మఱియు నింపొందన్ సదా వెల్గు స
ద్వ్యక్తిం జూడఁ దదర్థ మీవగుము సద్యోముక్తి శోభిల్లఁగన్. ౧౩౮

టీ. ఉక్తస్వానుభవాత్మ సంభవ-ఉక్త = శాస్త్రములయందు చెప్పఁబడిన, స్వ=ప్రత్యగాత్మ యొక్క, అనుభవ=అనుభూతిగల, ఆత్మసంభవ=పుత్రా, నభంబు=ఆకసము, ఉత్కృష్టమై=పృథివి మొదలగు నాలుగుభూతములకంటె శ్రేష్ఠమై, నిండినన్=ఆనాలుగుభూతములయందు వ్యాపించియున్నదైనను, రక్తిన్ = ఆసక్తితోడ, కూపమున్ = బావిని, త్రవ్వన్=త్రవ్వఁగా, అందున్=ఆబావియందు, దివి=ఆకాశము, వే=వేగముగ,

రాజిల్లున్ = ప్రకాశించును, అనఁగా వెంటనే కనఁబడు ననుట అట్లు=ఆప్రకారము, ఆత్మ=బ్రహ్మాభిన్నకూటస్థస్వరూపము, మఱియున్ = తిరుగా, ఇంపొందన్=ఆనందమతిశయింపఁగాను, శాస్త్రోక్తజ్ఞాన సువేద్యమై-శాస్త్ర=వేదాంతశాస్త్రమందు, ఉక్త=చెప్పఁబడిన, జ్ఞాన=బ్రహ్మజ్ఞానముచేత, సువేద్యమై=లెస్సగా తెలియఁదగినదై, సద్యుక్తిన్-సత్=ప్రశస్తమయిన, యుక్తిన్=ఊహచేత, చూడన్=కనుటకు, సదా=ఎల్లప్పుడును, సద్యోముక్తి=జీవన్ముక్తి, శోభిల్లఁగన్ = తేజరిల్లునట్లు, వెల్గున్=ఒప్పును, తదర్థము=ఆపరబ్రహ్మము, ఈవు=నీవు, అగుము=కమ్ము.

తా. ఓయి కుమారా! ఆకాశము అంతట నిండి యున్నదైనను బావిని త్రవ్వితేని దానియందు ఆకాశము కనఁబడును అటువలనే పరబ్రహ్మము అంతట నిండి యున్నను వేదాంతశాస్త్రవిచారణచేతఁ గలిగిన దివ్యజ్ఞానమువలన ఆ పరబ్రహ్మమే కనఁబడును గనుక నీచేత తెలియఁబడిన పరబ్రహ్మము నీవు కమ్మని తాత్పర్యము.

అవ.—మఱియు సదసత్తులను తెలుపుచున్నారు.

మ. తగుఁ ద్రైగుణ్యజగంబు స్వప్నపురవంధ్యాపుత్రగంధర్వరా
ణ్ణగరస్థాణునరాభ్రపుష్పమృగతృష్ణావారిపాశాహిస
ద్గగనశ్యామలశుక్తిరౌప్యశశశృంగభ్రాంతులం బోలి యీ
వగుమా సర్వము వీడి బ్రహ్మము మదీయాజ్ఞన్ నిజప్రజ్ఞచేన్.

టీ. త్రైగుణ్యజగంబు-త్రైగుణ్య=సత్త్వరజస్తమోగుణ వికారమైన, జగంబు=లోకము, స్వప్న...రులన్-స్వప్నపుర = కలలో చూచినపట్టణము, వంధ్యాపుత్ర=గొడ్రాలికొడుకు, గంధర్వరాణ్ణగర=గంధర్వరాజుపురము, స్థాణునర=దారుపురుషుఁడు, అభ్రపుష్ప=ఆకాశపుష్పము, మృగతృష్ణావారి=ఎండమావులజలము, పాశాహి = త్రాటిపాము, సద్గగనశ్యామల=నిర్మలమగు ఆకాశమందలినలుపు, శుక్తిరౌప్య=ముత్తెపుచిప్పవెండి, శశశృంగ=కుందేటికొమ్ము, (వీనియందుతోఁచెడు) భ్రాంతులన్ = భ్రమలతోడ, పోలి=సమానమై, తగున్=ఒప్పును. ఈవు = నీవు, మదీయాజ్ఞన్-మదీయ=నాయొక్క, ఆజ్ఞన్=శాసనముచేతను, నిజప్రజ్ఞచేన్=స్వకీయమైన వివేకమువలనను, ఆ సర్వమున్=భ్రమరూపమయిన అసత్యముతోఁగూడిన జగమును, వీడి=వదలి, బ్రహ్మము=సర్వవిలక్షణమయిన కూటస్థబ్రహ్మము, అగుము=కమ్ము.

తా. ఓయి శిష్యుఁడా! సత్త్వరజస్తమోగుణములుగల ప్రకృతివికారమైన యీ లోకము కలలోఁ జూచిన పట్టణమువలెను గొడ్రాలి బిడ్డవలెను గంధర్వరాజులనగరము వలెను దారుపురుషునివలెను ఆకాశపుష్పమువలెను ఎండమావుల జలమువలెను త్రాటియందు తోఁచిన సర్పమువలెను స్వచ్ఛమైన ఆకాశమందలి నలుపువలెను ముత్తెపుఁ జిప్ప

యందలి వెండివలెను కుండేటికొమ్మువలెను అసత్యమగును గనుక నీవు నాయుత్తరవుచేత నీవిజ్ఞానమువలన అసత్యమయిన యీలోకమందుఁగల భ్రమను వదలి లోకాతీతమై వెలుఁగు సచ్చిదానందకూటస్థస్వబ్రహ్మము నీ వగు మని తాత్పర్యము.

అవ.—ప్రకరణాంతమున కృతినాయికయయిన శివకామసుందరి స్తోత్రము చేయఁబడుచున్నది.

పంచచామరవృత్తము.

పరాపరప్రధానసత్త్రిపాదభాగహేతుకృ
చ్చరాచరాంచితప్రపంచసాక్షిచిత్స్వరూపిణీ
నరాసురామరార్చితాంఘ్రినీరజన్మయుగ్మినీ
పురారినాట్యరంగసీమపోషిణీ మనోన్మనీ. ౧౮౦

టీ. పరాప...రూపిణీ, పరాపరప్రధాన=పరాపర యనుపేరుగల పరబ్రహ్మశక్తి యొక్క లీలలలో నొక్కటియైన మూలప్రకృతియగు గాయత్రియందలి, సత్=శ్రేష్ఠము లయిన, త్రిపాద=త్రిగుణస్వరూపము లయిన అవిద్యాపాద విద్యాపాద ఆనందపాద ములయందలి, భాగ=ఇరువదియేడుభాగములనెడు, హేతు=కారణములచేత, కృత్= నిర్మింపఁబడిన, చర=తిరిగెడు దేవతలు నరులు పక్షులు పశువులు క్రిములు జలచరములు మొదలగు జంతువులచేతను, అచర=తిరుగని కొండలు ఱాళ్లు చెట్లు పొదలు మొదలగు వానిచేతను, అంచిత=ఒప్పిదమయిన, ప్రపంచ=పంచభూతములచేరికవలన నేర్పడినజగత్తునకు, సాక్షి=విలక్షణుఁడైన పరమాత్మయందలి, చిత్=సత్తు చిత్తు ఆనందము నిత్యమునిర్మలత్వములనెడు పంచలక్షణములలో చిల్లక్షణమే, స్వరూపిణీ=స్వరూపముగఁగలదానా, నరా...గ్మినీ, నర=మానవులచేతను, అసుర = దైత్యులచేతను, అమర = దేవతలచేతను, అర్చిత = పూజింపఁబడిన, అంఘ్రి = పాదములనెడు, నీరజన్మ = పద్మములయొక్క, యుగ్మినీ = జంటగలదానా, పురారి...పోషిణీ, పురారి=త్రిపురసంహారుఁడైన సాంబమూర్తియొక్క, నాట్యరంగ=నాట్యశాలయందలి, సీమ=చిదంబరస్థలమును, పోషిణీ= రక్షించుదానా, మనోన్మనీ=మనోన్మని యనెడు విశేషనామము గలదానా, అనఁగా బ్రహ్మ విష్ణు రుద్ర మహేశ్వర సదాశివులకు పత్నులగు సరస్వతీ లక్ష్మి పార్వతీ ఉన్మనీ మనోన్మని యనుపేళ్లుగల ఐదుగురిలో తురీయ తురీయావస్థాధి దేవతయగు సదాశివ పరబ్రహ్మశక్తి యనుట.

తా. పరాపర యనుపేరుగల పరబ్రహ్మశక్తి స్వరూపమైన గాయత్రియొక్క అవిద్యాపాద విద్యాపాద ఆనందపాదములయందలి యిరువదియేడు భాగములనెడు కారణములచేత నిర్మింపఁబడిన స్థావరజంగమ రూపమయిన లోకమునకు విలక్షణమయిన పర

మాత్మజ్ఞానమే రూపముగాఁ గలదానవును నరులచేతను అసురులచేతను దేవతలచేతను పూజింపఁబడెడు పాదపద్మములుగలదానవును త్రిపురసంహారుఁడయిన సాంబమూర్తి యొక్క నాట్యస్థానమయిన చిదంబర స్థలమును రక్షించుదానవును మనోన్మని యనెడు విశేషనామము గలదానవును అయిన ఓశివకామసుందరీ యని తాత్పర్యము.

ఇరువదియేను భాగములవివరము ఈప్రకరణమందలి రెండవపద్యమునఁ జూడఁదగును.

## మాలినీవృత్తము.

తుహినగిరితనూజా । తోషితామర్త్యరాజా
మహితగిరిశజాయా । మాననిష్ఠాసహాయా
మిహిరశతసుధామా । మేరుశృంగాగ్రధామా
సహజనిగమవేద్యా । సత్యసౌభాగ్యవిద్యా. ౧౪౧

టీ. తుహినగిరితనూజా=మంచుకొండకు కూఁతురవైనదానా, లేక మంచుకొండ యనఁగా మంచుకుప్ప అది ౹౹శ్లో. ధ్యేయస్సదా సవితృమండలమధ్యవర్తీ నారాయణస్సరసిజాసనసన్నివిష్టః, కేయూరవాన్ మకరకుండలవాన్ కిరీటీ హారీ హిరణ్మయవపుర్ధృతశంఖచక్రః౹౹ అను ప్రమాణమువలన పరమశివాష్టమూర్తులలో మొదటివాఁడును పరమాత్మకు శరీరమైనవాఁడును సృష్టిస్థితిసంహారములకు కారణములైన వర్షకిరణ హిమకిరణ ఉష్ణకిరణములు గలవాఁడును నైనసూర్యునివలన పుట్టినది. ఆసూర్యుని ఉష్ణకిరణమే అగ్ని. వర్షకిరణమే మేఘము. హిమకిరణమే చంద్రుఁడు. ఆచంద్రునివలన పుట్టినది మంచు. ఆమంచురాశియే హిమవంతము. ఆహిమవంతమువలన పుట్టినదై బ్రహ్మక్షత్రియవైశ్యులచేత ఆరాధింపఁదగినదై స్థితికారణమై వెలుఁగుసావిత్రీస్వరూపిణి యయినదానా, అనఁగా పరబ్రహ్మమువలనఁ బుట్టిన అవ్యక్తతత్త్వస్వరూపయనుట. ౹౹శ్రు. బ్రహ్మణోఽవ్యక్తః అవ్యక్తాన్మహతః మహతోఽహంకారః అహంకారాత్పంచ తన్మాత్రాణి పంచతన్మాత్రేభ్యః పంచమహాభూతాని పంచమహాభూతేభ్యోఽఖిలంజగత్౹౹ అనిశ్రుతి తోషితామర్త్యరాజా-తోషిత=భండ చండ ముండ శుంభ నిశుంభ మహిష మధుకైటభ రక్తబీజాది దుష్టదైత్యులను సంహరించి సంతోషపెట్టఁబడిన, అమర్త్య = దేవతలకు, రాజా=ప్రభువులయిన హరి బ్రహ్మేంద్రాదులుఁగలదానా, మహితగిరిశజాయా-మహిత=త్రిలోకపూజ్యుఁడైన, గిరిశ = పరమశివునకు, జాయా=పత్ని యగుదానా, మాననిష్ఠాసహాయా-మాన = ఇంద్రియ నిగ్రహమనెడి అభిమానముతోఁగూడిన బ్రహ్మవేత్తల యొక్క, నిష్ఠా=నిర్వికల్పసమాధికి, సహాయా=తోడుపడుదానా, అనఁగా తాను జ్ఞానస్వరూపిణి యగుటచేత బ్రహ్మవేత్తల విజ్ఞానమును వృద్ధిఁబొందించి ౹౹బ్రహ్మైవాహ౹౹

మానసము స్థితిని కలుగఁజేయునది యనుట. మిహిరశత సుధామా—అనేకసూర్యుల ప్రకాశమువంటి ప్రకాశము గలదానా, మేరుశృంగాగ్రధామా—మేరుగిరిశిఖరపుకొనయందు నివసించుదానా, దీనివివరము ఈప్రకరణమందలి యిరువదియొనిమిదవ పద్యమున వ్రాయఁబడియున్నది. సహజనిగమవేద్యా-సహజ=స్వభావసిద్ధములయిన, నిగమ=వేదములచేత, వేద్యా=తెలియఁబడుదానా, సత్యసౌభాగ్యవిద్యా-సత్య ॥శ్రు. సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ॥ అనుశ్రుతిప్రమాణముచేత సత్యస్వరూపుఁడైన పరబ్రహ్మమును ప్రతిపాదించెడు, సౌభాగ్య=షడ్గుణైశ్వర్యములతోఁగూడిన, విద్యా=సప్తకోటి మహామంత్రములలో మేలైన పంచదశకలాత్మకపంచదశాక్షరీమంత్రస్వరూపము గలదానా.

తా. మంచుకొండకు కూఁతురైనదానవును, ధండ చండ ముండ శుంభ నిశుంభ మహిష మధుకైటభ రక్తబీజాది దుష్టదైత్యులను సంహరించి బ్రహ్మాది దేవతలను సంతోషపెట్టినదానవును, త్రిలోకపూజ్యుఁడైన శివునకు పత్నియైనదానవును, ఇంద్రియనిగ్రహముగల బ్రహ్మవేత్తల నిర్వికల్పసమాధికి తోడుపడుదానవును, అనేకసూర్యుల ప్రకాశమువంటి ప్రకాశము గలదానవును, మేరుగిరిశిఖరపుకొనయందు నివసించుదానవును, సహజములయిన వేదములచేతను ఆగమములచేతను తెలియఁబడుదానవును పరబ్రహ్మమును ప్రతిపాదించెడి గాయత్రిపంచదశాక్షరీమంత్రస్వరూపము గలదానవును అయిన శ్రీశివకామసుందరీ అని తాత్పర్యము.

## మౌనత్రయ వివరణము.

వాఙ్మౌనము అక్షమౌనము కాష్ఠమౌనము అని మౌనము త్రివిధము. అందుపరమాత్మ పరాపశ్యంతీ మధ్యమా వైఖరీ వాక్కులకు అందనిదని తెలిసి ఆపరమాత్మయందే జ్ఞప్తి గలిగి లోకవ్యవహారవిషయక మయినమాటలాడక యుండుట వాఙ్మౌనము.

ఇంద్రియములను స్వేచ్ఛగా పోనియ్యక అఁగఁబట్టుట అక్షమౌనము.

ఇంద్రియచేష్టలు లేక యుండుట కాష్ఠమౌనము.

గద్యము. ఇది శ్రీపంచదశాక్షరీవిద్యానవద్యస్వరూప శ్రీశివకామసుందరీకృపాకటాక్ష వీక్షాసమాసాదితకవితాకలిత కాశ్యపసగోత్రపవిత్ర వేంకయమంత్రిపుత్ర నిఖిల నిగమాగమాంతప్రబోధ కనుపర్తి వేంకటరామవిద్యానందనాథ విరచితంబయిన టీకాతాత్పర్యసహిత కైవల్యనవనీతం బను మోక్షశాస్త్రంబునందుఁ దత్త్వబోధం బను ప్రథమప్రకరణము

సంపూర్ణము.

చంద్రికా ముద్రణాలయమున ముద్రితము, చాకలపేట, చెన్నపురి.—1923.

శ్రీ.

శ్రీసద్గురుపరబ్రహ్మణే నమః.

# కైవల్యనవనీతము

## సందేహనివారణప్రకరణము.

అను

## రెండవభాగము.

**కనుపర్తి - వేంకటరామ శ్రీ విద్యానందనాథ విరచితము.**

**స్వకృత టీకాతాత్పర్య విశేషార్థసహితము.**

బ్రహ్మశ్రీ,

**పండిత, పురాణం - సూర్యనారాయణతీర్థులవారిచేఁ**

పరిశోధితము.

నాల్గవకూర్పు.

ఏతద్గ్రంథకర్తపుత్త్రుఁడగు

**శ్రీ కనుపర్తి. మార్కండేయశర్మచేతఁ**

ప్రకటింపఁబడినది.

౧౯-౨౮.

శ్రీ సద్గురు పరబ్రహ్మణేనమః.

# కైవల్యనవనీతము ఉత్తరభాగము.

## విషయసూచిక.

పద్యసంఖ్య.

౧౨౧ గౌణమిథ్యాముఖ్యాత్మల వివరణము
౧౨౨ గౌణాది ఆత్మలను విడిచిన ఆనందమే ఆత్మస్వరూపమని చెప్పుట
౧౨౩ నిరతిశయానంద స్వరూపాత్మ అనుభవమగుటకు ముఖ్యమైన త్రివిధానందములు
౧౨౪ త్రివిధానందములలో అంతర్భూతములైన అష్టవిధానంద భేదముల వివరము
౧౨౫ విషయానందలక్షణమును, అష్టవిధానందముల వివరణము విమర్శించుట
౧౨౬, ౧౨౭ బ్రహ్మానందమును, త్రిపుటులవివరణమును బోధపఱచుట
౧౨౮ నిద్రయందుప్రాప్తించిన బ్రహ్మానందము నాకెట్లు నిదర్శనమగునని యడుగుట
౧౨౯ సుషుప్తియందుఁగలిగిన బ్రహ్మానందమును దృష్టాంతముతో బోధపఱచుట
౧౩౦,౧౩౧,౧౩౨ వాసనానంద, నిజానంద, ముఖ్యానందలక్షణములను విశదీకరించుట
౧౩౩ ఆనందముయొక్క మాహాత్మ్యమును శ్రుతిసమ్మతముగాఁజెప్పుట
౧౩౪ శ్రుతిసమ్మతముగాఁజెప్పిన బ్రహ్మానందమును అతీతముగాఁ గొనియాడుటయు సప్తభూమికావివరణమును సంగ్రహముగాఁదెల్పుట
౧౩౫ బ్రహ్మలక్షణత్రయమును సలక్షణముగాఁదెలిపినపిదప శిష్యునకుసందేహమేమైన కలదాయని ఆచార్యులడుగుట
౧౩౬ సత్, చిత్, ఆనందశబ్దములు ఐక్యమయ్యెడిరీతిని శిష్యుఁడడుగుట
౧౩౭ సచ్చిదానందపదార్థముల ప్రారంభకారణాదికమును దెల్పుట
౧౩౮,౧౩౯,౧౪౦,౧౪౧ సచ్చిదానందైక్యము స్థిరపడుటనుగుఱించి వేదమొకటిగాఁ జెప్పిన ప్రియములైననామములలో విధినామములను నిషేధనామములను జెప్పుట
౧౪౨ విధినిషేధనామములయొక్క తాత్పర్యైకమత్యమును దెల్పుట
౧౪౩ నిర్గుణుఁడైనపరబ్రహ్మమునకు ప్రకృతిజన్యములైన గుణములతోఁగూడిననామములను జెప్పవచ్చునా యనెడుప్రశ్నకు సమాధానము జెప్పుట
౧౪౪ సచ్చిదానందతాత్పర్యము లొకటేయని శ్రుతిచూపించునట్లు బుద్ధియందు కనఁబఱుపవలయునని శిష్యుఁడడుగుట
౧౪౫,౧౪౬ సచ్చిదానందతాత్పర్యము లొక్కటియేయని రూఢిపఱచుట
౧౪౭ సచ్చిదానందములన్నిటికిని అర్థమొక్కటేయని అనుభవమును దెల్పుట
౧౪౮ శ్రుతియుక్త్యనుభవప్రకారము శిష్యుఁడు సహజనిష్ఠను పొందుటను జెప్పుట
౧౪౯—౧౫౨ జ్ఞాన, అజ్ఞాన, సప్తవిధ భూమికలను దెల్పుమని శిష్యుఁడడుగుట
౧౫౩,౧౫౪,౧౫౫ జ్ఞానభూముల నేడింటిని తల్లక్షణములను జెప్పుట
౧౫౬ సప్తభూమికలను ఐదవస్థలుగా భాగించుటను తుర్యాతీతలక్షణమును జెప్పుట
౧౫౭ తుర్యాతీతమునుదానికి అనుభవమును జెప్పుట
౧౫౮ జ్ఞానభూములనుపొందిన జీవన్ముక్తులు; అహంకారత్రయము
౧౫౯ జ్ఞానభూము లేడింటిలో మొదటి మూఁడుభూములను అభ్యసించుటచేఁ గలిగెడి ప్రయోజనమును మొదటిభూమికలభించుటవలనఁగలిగెడి అతిశయమును చెప్పుట
౧౬౦ మొదటి మూఁడుభూములలో దేనిఁబొందినను ముక్తిగలదు

## కైవల్యనవనీతోత్తరభాగ (సందేహనివారణప్రకరణ) విషయసూచి

సంపూర్ణము.

శ్రీసద్గురుపరబ్రహ్మణేనమః.

# కైవల్యనవనీతము-టీకాతాత్పర్యసహితము.

## సందేహనివారణప్రకరణము.

అవతారిక. కృతినాయికయగు శ్రీ శివకామసుందరీదేవి, సందేహనివారణమనెడి ఈ ప్రకరణము నిర్విఘ్నముగ నెఱవేఱుటకొఱకు ((ఆశీర్నమస్క్రియా వస్తునిర్దేశరూప ములను త్రివిధమంగళములయందు వస్తునిర్దేశరూప మంగళముచేతఁ గొనియాడఁబడు చున్నది.

ఉ. శ్రీమదశేషచేతనవిశేషసమంచితలోకకార్యకృ
చ్ఛేముషిహేతుభూతపరచిన్మయదివ్యశరీరిణీ సువా
ణీముఖయోగినీనివహనిత్యసుమంగళకారిణీ లస
త్సోమకళావిభూషిణి కృశోదరి శ్రీ శివకామసుందరీ. ౧

టీక. శ్రీమద...రీరిణీ=శ్రీమత్=శోభాయుక్తములైన, అశేష=సమస్తమైన, చేతన=(స్థావర క్రిమి జలచర పక్షి పశు నర సుర లనెడు) ప్రాణులయొక్క, విశేష=(గుణములు రూపములు నామములు ఆహారములు) మొదలగు భేదములచేత, సమంచిత=అందగించుచున్న, లోక=చతుర్దశేంద్రియరూపములైన చతుర్దశలోకములయొక్క, కార్య=(సృష్టిస్థితి సంహారతిరోధానానుగ్రహములనెడు) పంచకృత్యములను, కృత్=చేయుచుండెడి బ్రహ్మ విష్ణు రుద్ర మహేశ్వర సదాశివులనెడి పంచకర్తలయొక్క, శేముషి=ప్రజ్ఞలకు, హేతుభూత=కారణస్వరూపురాలైన, పర=పరబ్రహ్మమునందలి, చిన్మయ=చిత్స్వరూపమైన, దివ్య=అప్రాకృతమైన, శరీరిణీ=దేహముగలదానా! సువాణీ...కారిణీ-సు=శ్రేష్ఠములగు పర పశ్యంతి మధ్యమ వైఖరీరూపములుగలదైన, వాణీ = సరస్వతీదేవియే, ముఖ=మొదలగు, యోగినీ=మహాచతుష్షష్టికోటి యోగినులయొక్క, నివహ=సమూహమునకు, నిత్య=శాశ్వతములయిన, మంగళ=శుభములను, కారిణీ=కలుగఁజేయుదానా! లస...షిణి-లసత్=ప్రకాశరూపమైన, సోమ=ఉమ అనెడు పేళ్లుగల అశ్వినిమొదలైన యిరువదియేడునక్షత్రములతోఁగూడిన చంద్రునియొక్క, కళ=కామేశ్వరి, భగమాలిని, నిత్య

క్లిన్న, భేరుండ, వహ్నివాసిని, మహావజ్రేశ్వరి, శివదూతి, త్వరిత, కులసుందరి, నిత్య, నీలపతాక, విజయ, సర్వమంగళ, జ్వాలామాలిని, చిత్ర, మహానిత్య అనెడు పది యాఱుకళలను, విభూషిణీ=శిరోభూషణముగాఁగలదానా! కృశోదరి=సలుచనికడుపుగల దానా! బ్రహ్మ విష్ణు రుద్ర మహేశ్వర సదాశివ విరాట్పురుషాండములుగలదైనను, కడుపు పలుచనగానే యున్నదనుట. శ్రీ శివకామసుందరీ=త్రిలోకములయందును ప్రకాశించు చున్న శివకామసుందరియను పేరుగలదానా!.

తా. స్థావరములు క్రిములు జలచరములు పక్షులు పశువులు మనుష్యులు దేవతలు అనెడు ప్రాణులయొక్క, గుణములు రూపములు నామములు క్రియలు ఆహారములు మొదలగువాని భేదములుగల పదునాలుగులోకములయొక్క, సృష్టి స్థితి సంహారతిరోధానానుగ్రహము లనెడు పంచకృత్యములనుచేయుచున్న, బ్రహ్మ విష్ణు రుద్ర మహేశ్వర సదాశివులనెడు పంచకర్తలయొక్క ప్రజ్ఞలకు, కారణస్వరూపమై, సచ్చిదానంద నిత్యనిర్మలములనెడు పంచలక్షణములుగల పరబ్రహ్మమునందలి, చిల్లక్షణస్వరూపమై వెలుఁగుచున్న శరీరముగల దానవును, పరా పశ్యంతీ మధ్యమా వైఖరీరూపములు గలదైన సరస్వతీదేవి మొదలగు మహాచతుష్షష్టికోటి యోగినులనెడు పరిచారికా సమూహమునకు నెల్లప్పుడు శుభములనిచ్చుదానవును, పూర్ణచంద్రుఁడే కిరీటముగాఁగలదానవును, సన్నని నడుముగలదానవునైన ఓ శివకామసుందరీదేవీ! అని తాత్పర్యము.

ఈ పద్యమునందలి నాలుగు విశేషణములలో మొదటివిశేషణమైన «శ్రీమదశేష చేతన విశేషసమంచితలోకకార్యకృ, చ్ఛేముషీహేతుభూతపర చిన్మయదివ్యశరీరిణీ» అను దానియందు కృతినాయికయైన శివకామసుందరీదేవి బ్రహ్మ విష్ణు రుద్రాది సర్వదేవతల కంటె శ్రేష్ఠురాలగుట యెట్లనఁగా, «సదేవసోమ్యేదమగ్ర ఆసీత్» అను శ్రుతిచేత ప్రపంచసృష్టికి ముందు సన్మాత్రమై నామరూపములులేనిదైయుండుపరబ్రహ్మము «ఏకమేవాద్వితీయం బ్రహ్మ» అనుశ్రుతిచేత సజాతీయవిజాతీయస్వగతభేద శూన్యముగ నుండుటవలనను, నిరవయవుఁడును, నిష్క్రియుఁడును, నిర్గుణుఁడును, నిరుపమానుఁడును అగుటవలనను, ధ్యానించుటకు, స్తుతించుటకు, అనువుపడఁడు. బ్రహ్మ విష్ణు రుద్ర మహేశ్వర సదాశివాది సకలదేవతలన్ననో «అర్వాగ్దేవాః» అను శ్రుతిచేత పరబ్రహ్మమందు అవినాభావముగనున్న చిచ్ఛక్తిచేత ఈవల కల్పింపఁబడినవారుగనుక, అపరోక్ష సాక్షాత్కారబ్రహ్మవేత్తలచేత ధ్యానింప స్తుతింప నర్హులుగారు. కాఁబట్టి బ్రహ్మ విష్ణురుద్ర మహేశ్వర సదాశివాండములను వానికి కర్తలను పుట్టింప పెంప త్రుంప నాయికయు చంద్రునియందలి చంద్రికవిధమున, పరబ్రహ్మమునందే యుండునదియు, పరబ్రహ్మము నెడఁబాయనిదియు, సచ్చిదానందపరబ్రహ్మస్వరూపముగాను ప్రకాశించి సకలదేవాసుర

పేరులచేత నుపాసింపఁదగినదియు నగుటచేత సచ్చిదానంద పరబ్రహ్మశక్తియునగు శ్రీ శివకామసుందరియను పేరుచేత సర్వోత్కృష్టురాలయ్యెను.

మఱియు పూర్వము భండాసురుని వధించుటకై బ్రహ్మాదిదేవతలు తటస్థలక్షణము గల పరమేశ్వరునిస్తుతించి ఆయనచెప్పిన సర్వసంహారయాగమునకు లోఁబడిరి. అప్పుడా పరమేశ్వరుఁడు బ్రహ్మాదిపిపీలికాంతమైన సర్వబాహ్యదృశ్యములను సమిత్తులుగాను, తన దేహమందుఁగల రక్తమాంస నరకల్యాదులనెడు మధ్యదృశ్యములను, చరుపురోడాశములుగాను, అంతఃకరణవృత్తులైన కామక్రోధాదులనెడి అంతరదృశ్యములను ఆజ్యముగాను చేసి మహాశ్మశానమను పేరుగల, ‘‘కాశ్యాంహి కాశతే కాశీ కాశీసర్వం ప్రకాశతే, సా కాశీవిదితాయేన తేనప్రాప్తాహి కాశికా’’ అను స్మృతిప్రమాణముచొప్పున పరబ్రహ్మస్వరూపమైన కాశియనెడు హోమకుండమందు జాజ్వల్యమానముగ నుండుచున్న చిదగ్నియందు హోమముచేసి ఆ యగ్నికెదుట సర్వస్వరూపుఁడైన తానొక్కఁడే నిలిచి ఆనందతాండవముసేసెను. అప్పుడు పునస్సృష్టికొఱకు బ్రహ్మ విష్ణు రుద్రాండములను మూఁటిని వడియందుంచుకొని ‘‘శ్లో. చిదగ్నికుండసంభూతా దేవకార్యసముద్యతా’’ అని లలితోపాఖ్యానమున చెప్పినచొప్పున, హోమకుండమునఁబుట్టిన చిచ్ఛక్తి ఆయండముల మూఁటిని బయటఁదీసి అవియింపఁగా ఒకదానియందు బ్రహ్మయు లక్ష్మీదేవియును; రెండవయండమందు విష్ణువును గౌరీదేవియును; మూఁడవయండమందు రుద్రుఁడును సరస్వతీదేవియును ఉండిరి. వెనుక చిచ్ఛక్తి బ్రహ్మతోఁడఁబుట్టిన లక్ష్మీదేవిని విష్ణువునకును; విష్ణువుతోఁబుట్టువైన గౌరీదేవిని రుద్రునకును; రుద్రునితోఁబుట్టువైన సరస్వతీదేవిని బ్రహ్మకును యిచ్చి వివాహములుచేసి సృష్టికృత్యము బ్రహ్మకును, స్థితికృత్యము విష్ణువునకును, సంహారకృత్యము రుద్రునకును నియమించి, మీరు నన్నుద్దేశించి తపస్సులను, యాగయోగములను, జపతపములును, ధ్యానజ్ఞాననిష్ఠలును, పూజలును చేయుచుండవలయును. ఇఁకమీఁదు మీకు నాదర్శనము లభింపదు. నాకళలను ఈ గౌరీదేవియందుంచుచున్నాను. నన్నుఁగూర్చి ఈ విదను ఆరాధించితిరేని ఈ విదరూపముగా ఇష్టసిద్ధులనుకలుగఁజేసెదను అని తటస్థేశ్వరుఁడగు పరమేశ్వరునియందు ఐక్యమయ్యెను. అనంతరము రుద్రుఁడు వైరాగ్యము, బోధము, ఉపరతి, సమాధి మొదలగునవిగలిగి పరబ్రహ్మిణియొక్క ఆరాధనములచేతను, విష్ణువు యోగనిద్రాతపోనిష్ఠలచేతను, బ్రహ్మ నిత్యనైమిత్తిక ఇష్టాపూర్త యాగాదికర్మములచేతను ఉపాసించుచుండురు.

మఱియు చిచ్ఛక్తి, తొలుత శుద్ధసత్త్వప్రధానయు, త్రిగుణసామ్యయు, సమష్టిరూపిణియునై, పరశివబ్రహ్మమందు చిల్లక్షణముచేత అభిన్నయై, పిమ్మట మలినసత్త్వప్రధానయై, త్రివర్ణ, త్రిగుణ, త్రిపద, త్రికూట, త్రిపుర, త్రిలోకాత్మికయై, త్రిమూర్తులకును త్రిశక్తులకును, కారణమైయుండును. ఇదియే మాయాఽవిద్యావరణాత్మకశక్తి. ‘‘త్రు

అజామేకాంలోహితశుక్లకృష్ణాం, బహ్వీం ప్రజాం జనయంతీం సరూపామ్, అజోహ్యేకో జుషమాణో౽నుశేతే, జహాత్యేనాం భుక్తభోగామజో౽న్యః" అని తైత్తిరీయము. "శ్లో. దైవీహ్యేషా గుణమయీ మమమాయా దురత్యయా" అని భగవద్గీత. కనుక బ్రహ్మ విష్ణు రుద్రాదిసురలకును, అసురేంద్ర బలి దానవాదిరాక్షసులకును, వసిష్ఠ శక్తి పరాశర వ్యాస శుక వామదేవాది ఋషులకును, శుద్ధా శుద్ధ సత్త్వప్రధానమైన యీ చిచ్ఛక్తియే ఉపాసింపఁదగినదగును. మఱియు, ఏకాక్షరములమంత్రము బాలయనియు, పండ్రెండక్షరములమంత్రము కౌమారియనియు, పదిహైదు పదియాఱక్షరములమంత్రములు యువతియనియు, ఇరువదినాలుగక్షరములమంత్రము వృద్ధయనియు, మితిలేనిఅక్షరములు మాలామంత్రమనియు, మంత్రశాస్త్రమందుఁ జెప్పఁబడును. కౌమారి, యువతి, అను దేవతలు చిత్తచలనమునకు కారణలు అగుటచేత వృద్ధయగు గాయత్రి మూఁడు పాదములు గలదియు, త్రిపురసుందరీ దేవి లీలలలో నొకలీలయు అగుటచేత ప్రథమోపాస్యగా ఉపనయనకాలమందు దేవాసురలకును బ్రహ్మక్షత్రియవైశ్యులకును ఉపదేశింపఁబడెను. ఈ గాయత్రీమంత్రోపాసనముచేతనే బ్రాహ్మణులకు బ్రాహ్మణత్వమును, శాపానుగ్రహసామర్థ్యమును, అణిమాద్యష్టసిద్ధులును, సకలవర్ణములలో అగ్రగణ్యత్వమును గలుగుటయు, క్షత్రియత్వము, దుష్టనిగ్రహ శిష్టపరిపాలనత్వమును, అస్త్రశస్త్రాది విద్యానిపుణత్వమును, భూపతిత్వమును గలుగుటయు, వైశ్యులకు వైశ్యత్వము మొదలైనవియును గలుగుచున్నవిగాని, శైవ, వైష్ణవ, సౌర, గాణాపత్య, కాపాలికాది, మతాంతర దేవతాంతర మంత్రానుష్ఠానాదులచేత పైనచెప్పిన బ్రాహ్మణత్వము మొదలయినవి లభింపవు. ముక్తి విషయమైతే పరబ్రహ్మ సాక్షాత్కారజ్ఞానము లేక కలుగదు. పైనఁ జెప్పిన దేవతాంతరనామము లన్నియు పరబ్రహ్మమునే ప్రతిపాదించును. వారిని దేవతాంతరముల మీఁద తీసికొనిన సరిపడవు. ఆ యర్థములు పరబ్రహ్మమందు పొల్చికొనిన అయా మతచిహ్నములు నిలువలేవు. అప్పు డద్వితీయమే యగును. కావున "శ్లో. న గాయత్ర్యాః పరం మంత్రం న మాతుః పరదేవతా, నాన్నోదక సమం దానం న తిథిర్ద్వాదశీ వ్రతమ్" అనియున్నది గావున గాయత్రీమంత్రముకంటె మించినమంచిమంత్రములేదనిభావము. మఱి బ్రహ్మ విష్ణు రుద్రాదులును, చక్రవర్తులును లోనగువారు సహితము సర్వవ్యాపక శక్తి గలిగినప్పుడే పుట్టించుట పెంచుట త్రుంచుట మొదలయిన సర్వకార్యములునుచేయ శక్తిగలవారగుదురు. శక్తిలేనప్పుడు ఏపనులుఁ చేయక యూరకుందురు. ఇది పురాణములవలన తెలియఁబడుచున్నది. మఱియు శ్రీరామచంద్రునకు విశ్వామిత్రుఁడు త్రిపురసుందరీ మంత్రములైన బల, అతిబల అనెడు పంచదశాక్షరి, షోడశాక్షరియను రెండువిద్యల నుపదేశించెను. వాని యుపాసనాబలముచేత లోకకంటకులయిన తాటకా, మారీచ, సుబాహు మొదలయిన అసురులను సంహరించెను. ఇది

యమునగాక పూర్వము బ్రహ్మజగత్సృష్టిచేయఁదలఁచి, ॥శ్లో.॥ యితి బ్రహ్మణో నామ తేన తత్రాంచితో హరిః, తస్మాత్కాంచీతివిఖ్యాతా పురీ పుణ్యవివర్ధనీ॥ అను కాంచీ క్షేత్రమందు వేయిమహాయుగములకాలము నొక యశ్వమేధయాగముచేయుచుండఁగా ఆయజ్ఞమును రక్కసులుచెఱుపకుండుటకై విష్ణుదేవుఁడు బ్రహ్మచేత నర్చితుఁడై విల్లెక్కు పెట్టుకొని ఆహారనిద్రలుమాని ఆ యజ్ఞమును రక్షించుచుండి, అది నెఱవేరినవెనుక పట్టఁజాలని అధికనిద్రచేత విల్లెక్కుడింపకయ అట్టె తలక్రిందంబెట్టుకొని నిలిచినచో టనే నిద్రపోవుచు వేనూఱు మహాయుగములుదాఁక లేవకయుండెను. అప్పుడు బ్రహ్మా దులు ఇతఁడు మనయజ్ఞమునకు సాహాయ్యముచేసి ఆహారములేక నిద్రపోవుచు ఇంత మట్టుకు లేవలేకపోయెనే, నిద్రాభంగముచేయుట మేలుకాదే, నిద్రలేపుట యెట్లని యోజనచేసి చెదలు పుట్టించిపంపఁగా ఆ చెదలు విష్ణువును కొఱకక వింటినారిని కొఱి కినందున అదితెగి దానివడిచేత విష్ణుదేవుని శిరముతెగి యెగిరి ఆహవనీయాగ్నిలోఁ బడి మాఁడిపోయెను. దానినిమాచి బ్రహ్మ హాహారవముచేయుచు దుఃఖించి పరాపరబ్రహ్మ శక్తిని వేఁడఁగా ఆమె అశరీరవాక్కుచేత యజ్ఞార్థమై హింసించిన అశ్వశిరస్సును విష్ణు దేవుని మొండెమునకు నతుకఁబెట్టితిరేని ఇతఁడుజీవించిహయగ్రీవుఁడన ప్రసిద్ధికెక్కునని పలుకఁగా బ్రహ్మ ఆప్రకారముచేసెను. అంతట విష్ణుదేవుఁడు పునర్జీవితుఁడై తన సౌంద ర్యమును నిలువుటద్దమున చూచుకొని తనతల పోవుటకు దుఃఖించుచుండఁగా ఈరూప ముతో తక్కిన యేనూఱుమహాయుగము లీకామకోటినిలయయైన కామాక్షీదేవిని ఆరా ధించుము విద్యార్థులకు సకలవిద్యల నిచ్చుచునుంటివేని యుత్తమమైన శిరస్సు నీకు కలు గునని త్రిపురసుందరీదేవి అశరీరవాక్కుతోఁ బలికెను. అంతట విష్ణుదేవుఁడు పరాశక్తి చెప్పిన వామాచారముతో కామాక్షీదేవిని అర్చించుచుండెను. ఆయర్చనయందు సువా సినీపూజకు అగస్త్యునిభార్యయైన లోపాముద్ర వచ్చుచుండెను.

ఈమె పూర్వమందు బ్రాహ్మణుఁడుగా నుండి త్రిపురసుందరీదేవియొక్క రూప మువంటిరూపము గలిగినందున పురుషముద్ర లోపించి శివాంశసంభూతుఁడైన అగ స్త్యుని వివాహముచేసికొని పునస్సంధానమునాఁడు ఆయన తన్నంటరాఁగా నీవు నన్నం టకుము. అంటితివేని భస్మమౌదువు. నాశరీరము పరబ్రహ్మిణీమంత్రానుష్ఠానముచేతఁగలిగి నది గనుక నీవునన్నంటి మృతినొందితివేని నేను విధవనగుదును కాఁబట్టి ఈ ముత్తైదు వతనము నిలిచినఁ జాలుననెను. అందుకు అగస్త్యుఁడు కటకటంబడి నిన్ను పెండ్లాడిన దానికి ప్రయోజన మేమనిన నీవును త్రిపురసుందరీదేవిని ఉపాసించి మంత్రశరీరముచేసి కొంటివేని మనము సుఖింపవచ్చుననిన అగస్త్యుఁడు మంచిదని పంచదశాక్షరీమంత్ర మును ఉపదేశింపుమనెను. ఆమెనాకర్హత చాలదు. కాంచీపురంబున హయగ్రీవస్వామి యున్నవాఁడు. ఆతనిసన్నిధానమునకు పొమ్మనఁగా అగస్త్యుఁడు కాంచీపురికిఁబోయి

మూఁడవవిశేషణము: ‘‘లసత్సోమకళావిభూషిణి’’ యనుటచేత సోమయనఁగా చంద్రుఁడు, చంద్రుఁడు పదియాఱుకళలుగలవాఁడు. అండమునకు, చంద్రుఁడైనట్లు పిండమునకు అచంద్రుఁడే యీమనస్సు. ‘‘శ్రు. చంద్రమా మనసోజాతః’’ అని యున్నది. ఈకళావిషయము* పూర్వప్రకరణమందు విశదముగాచెప్పఁబడియున్నది. ఆకళలే మనఃకల్పితములైన జాగ్రదాది షోడశావస్థలు. అట్టి అవస్థలను కామేశ్వర్యాది చిత్రాంతములుగా, అను లోమవిలోమములుగా చెప్పఁబడును. ఆకళలను వ్యావహారిక పారమార్థికములయందు పరమాత్మధరించుటవలన అట్టి పరమాత్మయం దవినాభావసంబంధమై యుండుటచేత తాను సోమకళావిభూషిణియును ఆసోమకళాభూషణుఁడు కలిగినది యును అని చెప్పఁబడినది.

నాలుగవవిశేషణము: ‘‘కృశోదరి’’ యనుటచేత అధోఉదరము, పొత్తికడుపు, ఊర్ధ్వోదరము మీఁదికడుపు గావున, ‘‘అనేకకోటిబ్రహ్మాండ జననీదివ్యవిగ్రహా’’ యని యుండుటవలన బ్రహ్మాండ విష్ణ్వండ రుద్రాండములు అధోఉదరమందును, ఈశ్వరాండ సదాశివాండ విరాట్పురుషాండములు ఊర్ధ్వోదరమందును కలిగియుండుటవలనను, ఈయుభయోదరములకు మధ్యభాగము అంటియు అంటకయును కలిగిన నడుముగలదానయని చెప్పఁబడినది.

వ. అవధరింపు మనంతరంబ సదాచార్యుండు వినయభయభక్తియుక్తుండును, ఫాలతలన్యస్తహస్తకమలకీలితుండును, సకలనిగమాగమాంత శాస్త్రపురాణేతిహాస పరిజ్ఞాన విచక్షణుండును నై, తనమ్రోల నిలిచియున్న సచ్ఛిష్యుని గనుంగొని. ౨

టీ. అవధరింపుము=వినుము. (మొదటిదైనతత్త్వబోధప్రకరణముపదేశించిన)అనంతరంబ=పిమ్మట,సదాచార్యుఁడు=(అష్టవిధగురువులలో మేలైన)కారణాచార్యుండు, వినయభయభక్తియుక్తుండును=వినయ-చలిగాఁచుకొనువాఁడు, అగ్నిసన్నిధానమందువలెవినయమును,అనఁగాఅగ్నిదగ్గఱకుచేరినశరీరముకాలును. దూరముగానుండినచలితీరదు అటువలె మనయాచార్యుఁడేయని నిందాచనమునకుఁబోక ముడిఁచిపెట్టుకొనియుండక రాజభృత్యన్యాయమువలె వినయమును, భయ=సర్పమునఁజూచినప్పుడు కలిగెడు న్యాయమువలెను వెఱపును, భక్తి=తనకపరూపపదార్థము దొరకినప్పుడు తాను భుజింపవలయునను కోటికలేక కుమారునకియ్యవలె ననెడివాత్సల్యమువలె విశ్వాసమును, యుక్తుండును=ఇవి మూఁడునుకలవాఁడును, ఫాలతల...కీలితుండును-ఫాలతల=నిటలప్రదేశమందు,న్యస్త=ఉంపఁబడిన,హస్తకమల=కరకమలములరెంటిని,కీలితుండును=చేర్చికొనియుండువాడును,

*ఇదియే తత్త్వబోధ ప్రకరణము. ఈగ్రంథము ముద్రితమై యున్నది.

సకల...ణుండును-సకల=సమస్తములైన, నిగమ=వేదములయొక్కయు, ఆగమ=శైవ, శాక్త, గాణాపత్య, సౌర, వైష్ణవ, కాపాలికాది మతాచారములను, బోధించెడు ఆయా నిబంధనలయొక్క, అంత=శిరః ప్రాయములైన శాస్త్రములను, పురాణ=మాత్స్యాది పదునెనిమిదిపురాణములను, ఇతిహాస=భారతరామాయణాది పురాతన పుణ్యచరిత్రములను, పరిజ్ఞాన=తెలిసికొనుటయందు, విచక్షణుండును=నేర్పరితనము తెలిసికొనినవాఁడును, పరమ—సన్నుండును-పరమ=మిక్కిలి శ్రేష్ఠమైన, వివేక=జ్ఞానము, వైరాగ్య = ఇహలోక పరలోకప్రాప్తసుఖముల నిరసించుటయు, అనఁగా తృణీకృత బ్రహ్మ విష్ణు రుద్రాదిలోక సుఖములుగలవాఁడనుట, ఉపశాంతి=ఋజుభావమునుపొందిన సకలేంద్రియవ్యాపారములుగల మెత్తనిభావమనెడి ఈగుణములే, సంపన్నుండును=సంపదగాఁగలవాఁడును, అయిన=ఈవిధముగాఁ గలవాఁడై, తనమ్రోలన్=ఆచార్యుఁడైన తనచెంగట, నిలిచియున్న=నిలుచుకొనియున్న సచ్ఛిష్యుని, కనుంగొని=చూచి.

తా. మొదటిదైన తత్త్వబోధప్రకరణము నుపదేశించినవెనుక చలికాఁచుకొను వాఁడు అగ్నిసన్నిధానమందుండురీతిని, అనఁగా నిప్పుదగ్గరకుచేరిన శరీరముకాఁగును, దూరముగనుండిన చలితీరదు గనుక మన ఆచార్యుండే యని మిక్కిలి చనవునకుఁబోక, భయముతో దూరమున నోరుమూసికొనియుండక రాజసన్నిధిన్యాయమువలె వినయమును, పామునుగన్నపుడు పొందెడి న్యాయమువలె వెఱపును, పుత్రవాత్సల్యమువలె విశ్వాసమును కలవాఁడై నిటలప్రదేశమున కరకమలముల రంజిల్లనిచేర్చియుంచుకొని సమస్తమైన వేదములయొక్కయు, శైవాదిమతాచారములయొక్కయు, సిద్ధాంతములను, పదునెనిమిదిపురాణములను, రామాయణాది పురాతన చరిత్రములను చక్కఁగా తెలిసికొనినవాఁడును, మిక్కిలిశ్రేష్ఠమైన జ్ఞానమును, ఇహలోక పరలోకసుఖముల నిరసించుటయును, నిర్వ్యాపారమును అనెడి సంపదగలవాఁడునై తన చెంగట నిలిచియున్న సాధుగుణములు గల శిష్యునిచూచి అని తాత్పర్యము. ॥శ్లో. ఆచినోతి హి శాస్త్రార్థ మాచారే స్థాపయత్యపి, ఆచరే త్స్వయ మప్యేషాం తస్మా దాచార్య ఉచ్యతే॥ అనఁగా తాను సద్ధర్మముల ఆచరించి ఇతరులచే ఆచరింపచేయునట్టివాఁడు ఆచార్యుఁడు గావున అట్టి ఆచార్యుల సన్నిధానమందు చేరి యనిభావము.

అవ:—ముందటిప్రకరణమందు తత్త్వస్వరూపమైన యానందాతిశయమును నిష్ఠానుభవముచేతఁ బ్రకాశింపఁజేసి ఇఁక స్వస్వరూపప్రజ్ఞచేఁ ద్రివిధకల్పనలుగాఁదోఁచెడి జీవేశ్వరజగములఁ జిత్సుఖాకారముగా దెలుపుటకొఱకు సందేహనివారణప్రకరణము వ్రాయఁబడుచున్నది.

మ. పురుషు ల్గంబము నాటి నిల్వఁ గడుఁదోద్భాగర్తముం గూరురీ
తి రహిఁ ఛాత్రునిచిత్తమం దమలమై దీపించు చిన్నిష్ఠను

స్థిరతం జెందిన జాటుఁ గల్గ నెట సంశోదేహంబు దా దానిచే
నురుసందేహనివారణ ప్రకరణం శ్రీ బూహించి వే యిట్లనెన్. 3

టీ. పురుషులు=మనుజులు, కంబముఁ=(యజ్ఞదేవాలయగృహతటాకవన ప్రతిష్ఠలయందు మంత్రపూతముగా నాటెడు) స్తంభమును, నాటి=ప్రతిష్ఠించి, నిల్వఁ=అది అటునిటుకదలకుండునటులు నిల్పుటకై, కడుఁ=మిక్కిలి, తద్భాగ ర్తముఁ=ఆనేలపల్లమును, కూరురీతిఁ=ఘట్టనచేయునటులు, రహిఁ=అతిశయముతో, ఛాత్రునిచిత్తమందుఁ-ఛాత్రుని=శిష్యునియొక్క, చిత్తమందుఁ=నిర్మలాంతఃకరణమందు, అమలమై=పంచమలరహితమై, దీపించుచిన్నిష్ఠ-దీపించు=తేజరిల్లెడు, చిన్నిష్ఠ=బ్రహ్మనిష్ఠ, సుస్థిరతంజెందినఁ=చక్కఁగా స్థిరపఱచఁబడినను, ఎదఁ=హృదయమందు, సందేహంబు=అనుమానము, కల్గఁ=కలిగనేని, జాటుఁ=ఆబ్రహ్మనిష్ఠ చెడిపోవును, దానిచేఁ=బ్రహ్మనిష్ఠ చెడిపోవునేమో యనుసంశయముచేత, తాఁ=తానైన గురుమూర్తి, ఉరు...ణంబు-ఉరు=గొప్పదియైన, సందేహనివారణప్రకరణంబు=సందేహనివారణమను ప్రకరణమును, ఊహించి=రూాజించి, వే=శీఘ్రముగాను, ఇట్లనెఁ=ముందుచెప్పఁబోయెడి విధముగాఁ బలికెను.

తా. మనుష్యులు లోకమందు గృహదేవాలయాది ప్రతిష్ఠలయందు మంత్రపూతముగా నాటెడిస్తంభము కదలకుండుటకు కూరికూరి ఘట్టనచేయునటులు శిష్యుని నిర్మలాంతఃకరణమందు ముందు తా నుపదేశించిన బ్రహ్మనిష్ఠ స్థిరపడినను, డెందమందు సందేహము చెందిన ఆ బ్రహ్మనిష్ఠచెడునని గురుస్వామి సందేహనివారణప్రకరణమును ఆలోచించి వెంబడిగానె చెప్ప నారంభించెనని తాత్పర్యము. అనఁగా శైవ, వైష్ణవ, సౌర, శాక్తేయ, గాణాపత్యాదిమతావలంబకు లందఱును సాధారణముగ ద్వైతభావముగ నుండుటవలనను, కొందఱు నాస్తికులై మోహనాది కల్పితశాస్త్రముల నవలంబించి శూన్యవాదులుగా నుండుటవలనను, తనశిష్యుఁడు ముందు తా నుపదేశించిన నిర్మలమైన అద్వైతజ్ఞానమునకు భంగము కలుగఁజేసికొనునేమో యనెడిసందియము డెందమందు కలుగఁగా నాయథార్థవస్తుజ్ఞానము చలింపక స్థిరపడియుండుటకై దేవాలయములలోని ధ్వజస్తంభములు, యజ్ఞశాలలయొక్క యూపస్తంభములు మొదలగువానిని వానగాలులచేతను, ఏటివఱదలచేతను కదలిపడకుండునటులు త్రాళ్లు మొదలగువానిచేత పదిలపఱచుటకుఁగాను ఘట్టనచేయువిధమున పరమదయాళుండైన గురుమూర్తి వెంటనే సందేహనివారణప్రకరణమును తేటమాటలతో నూటిపడునటులు ఈదిగువ వివరింపఁబడురీతిని చెప్పఁ దొడంగెనని భావము.

అవ:—గురుసన్నిధానమందు అధికారియగు సచ్ఛిష్యుఁడు ప్రవర్తించువిధము చెప్పఁబడుచున్నది.

ఉ. పూతమనంబునం బరమబోధము వెల్గఁ గ్రమోక్తసేవల
న్భూతవికారవిశ్వముఖభూమవితర్క్యముకృతాంతశాస్త్రసం
ఘాతములోని సర్వము సుఖంబుగఁ దెల్పిన దేశికేంద్రుఁ డా
నేతటిఁ బాయకుండెను మహేచ్ఛ వనౌకసడింభకాకృతిన్. ౪

టీ. పూతమనంబునన్ = (బహుజన్మకృత పుణ్యపుంజముచేత) పవిత్రమైన యంతఃకరణమందు, పరమ=నిరతిశయమైన, బోధము=అపరోక్షసాక్షాత్కారబ్రహ్మజ్ఞానము, వెల్గన్=ప్రకాశింపఁగా, క్రమోక్తసేవలన్-క్రమ=వరుసగా, ఉక్త=(శాస్త్రములయందుఁ) జెప్పఁబడిన, సేవలన్= (చతుర్విధ) శుశ్రూషలచేత, భూత...సర్వమున్-భూత=ఆకాశాది పంచభూతములయొక్క, వికార=స్వరూపమైన, విశ్వ=ప్రపంచమే, ముఖ=మొదలుగాఁగల, శాస్త్ర=వేదాంతశాస్త్రములయొక్క, సంఘాతములోని = సముదాయమందలి, సర్వమున్=సమస్తమును, సుఖంబుగన్ = అనాయాసముగా, తెల్పిన=తెలియఁజేసిన, దేశికేంద్రున్=కారణాచార్యుని, ఏతటిన్=ఏసమయమందును, వనౌకసడింభకాకృతిన్-వనౌకస=వానరముయొక్క, డింభకాకృతిన్=పిల్లవలె, తాన్=తానైన సచ్ఛిష్యుఁడు, మహేచ్ఛన్ = (ఆచార్యసేవతప్ప మఱియొకదానియందు కోరికలేని) మిక్కుటమైన యభిలాషచేత, పాయకుండెన్=వదలకుండెను.

తా. పవిత్రాంతఃకరణమందు నిరతిశయమైన బ్రహ్మజ్ఞానము ఒప్పఁగా, చతుర్విధశుశ్రూషలచేత పంచభూతవికార పంచీకరణమైన దేహేంద్రియాది ప్రపంచము మొదలు విదేహకైవల్యపర్యంతము అంతముగాఁగల సకలవేదాంతశాస్త్రములయందలి సర్వమును, సులభోపాయముగ ఉపదేశించెడి కారణాచార్యుని కోఁతిపిల్ల తన తల్లికడుపును కఱచుకొని తల్లి యెచ్చటెచ్చటదుమికినను ఆపట్టినపట్టును విడువకుండునటులఁ ఆచార్యునిసన్నిధానమును ఆశిష్యుఁడు విడువకుండెనని తాత్పర్యము.

"గురుర్బ్రహ్మా గురుర్విష్ణు ర్గురుర్దేవో మహేశ్వరః, గురుస్సాక్షాత్పరబ్రహ్మ తస్మై శ్రీగురవే నమః. గురుశ్శివో గురుర్దేవో గురుర్బంధు శ్శరీరిణామ్, గురు రాత్మా గురుర్జీవో గురో రన్య న్న విద్యతే. న సుఖం వేదశాస్త్రేషు నసుఖం మంత్రయంత్రకే, గురోః ప్రసాదా దన్యత్ర సుఖం నాస్తి మహీతలే. గురుర్విష్ణు స్సత్త్వమయో రాజస శ్చతురాననః, తామసో రుద్రరూపేణ సృజత్యవతి హంతి చ. స్వయం బ్రహ్మమయో భూత్వా తత్పరం చావలోకయేత్, పరాత్పరతరం నాన్య త్సర్వగం తన్నిరామయమ్. కామ్యానాం కామధేను స్త్వ్యా కల్పితః కల్పపాదపః, చింతామణి శ్చింతితస్య సర్వమంగళకారకమ్. భవమూలవినాశాయ చాష్టపాశనివృత్తయే, గురుపాదాంభసి స్నానం తత్త్వజ్ఞః కురుతే సదా. నగురోరధికం నగురోరధికం నగురోరధికం నగురోరధికః, శివశాసనతశ్శివశాసనతశ్శివశాస

నతశ్శివశాసనతః. ఇదమేవశివం ఇదమేవశివం ఇదమేవశివం ఇదమేవశివమ్, మమశాసనతో మమశాసనతో మమశాసనతో మమశాసనతః. విదితంవిదితంవిదితంవిదితం విజనంవిజనంవిజనం విజనమ్, హరశాసనతో హరశాసనతో హరశాసనతో హరశాసనతః. ఏవంవిధంగురుధ్యాత్వా జ్ఞానముత్పద్యతే స్వయమ్, తథాగురూపదేశేన ముక్తోఽహమితిభావయేత్" అను మొదలుగాఁగల ప్రమాణములరీతిని గురుఁడే బ్రహ్మయు, విష్ణువు, దేవుఁడు, మహేశ్వరుడు, పరబ్రహ్మము, తల్లియు, తండ్రియు మొదలుగాఁగలవారలందఱని మనస్సున తలఁపోసి ఆ గురుఁడే ప్రమేయమని, ఆప్రమేయమే తానని నిర్మలమైన హృదయముతో భేదబుద్ధిలేక గురునకు కైంకర్యముచేయుచు ఆత్మ, అంగ, స్థాన, భావ, శుశ్రూషలచేత తనువును, మనమును, ధనమును గురువునకర్పించి "గురుపాదోదకం పీత్వా గురోరుచ్ఛిష్టభోజనమ్, గురుమూర్తేస్సదా ధ్యానం గురుమంత్రం సదా జపేత్" అనుశ్లోకప్రమాణముచొప్పున గురుధ్యానము చేయుచు పరమానందంబు చెందుచుండుట మహాప్రయనంబడును. చతుర్విధశుశ్రూషలు పరబ్రహ్మస్వరూపమందు ప్రణవమందలి, అ-ఉ-మ-లకు లక్ష్యార్థమగు ద్రష్ట్రుస్థానమును ఎఱుకమఱపులులేనియునికితో విచారణచేయుట స్థానశుశ్రూష; సూర్య, చంద్ర, బ్రహ్మ, విష్ణు రుద్రాదులే కన్నులుమొదలగు అవయవములని విమర్శించియుండుఁగుట యంగశుశ్రూష; పరబ్రహ్మము తానని భావించుట భావశుశ్రూష; "విత్తాత్పుత్రః ప్రియః పుత్రాత్ స్వశరీరం తథాప్రియమ్, ఇంద్రియాణి ప్రియాః ప్రాణాః ప్రాణాదాత్మా పరప్రియః" అను ప్రమాణము చొప్పున ఆత్మకాత్మయే ప్రియమైనట్లు కూటస్థాభిన్న పరబ్రహ్మమైన తనయందు తానుతప్పకయుండుట యాత్మశుశ్రూష యని భావము. ఈ చతుర్విధశుశ్రూషలవివరము తత్త్వబోధమును పేరుగల మొదటిప్రకరణమునందు విశదీకరింపఁబడియున్నది

అవ:—ఆచార్యుఁడు శిష్యుని అనుభవ మడుగుచున్నాఁడు.

ఉ. సంతత మాత్మఛాయగతి శాంతమునం దను నమ్మియున్న సు
స్వాంతుని శిష్యుఁ గాంచి సుత ! సాక్షిగ నిన్నని చింతలెల్ల వి
శ్రాంతి వెలుంగ నొప్పితివె సంశయ మున్నదె తెల్పి నింక నీ
కెంతయుఁ దెల్పు మాత్మసుఖ మిట్లని కల్గిన మంజులోక్తులన్. ౫

టీ. సంతతము=ఎల్లప్పుడును, ఆత్మఛాయగతిన్=తనమేనినీడవలె, శాంతమునన్=శుద్ధసత్త్వప్రవృత్తిచేత, తనున్=ఆచార్యుఁడైనతన్ను, నమ్మియున్న=విశ్వసించియున్న, సుస్వాంతుని=కామక్రోధలోభములులేనిమనస్సుగల, శిష్యున్=శిష్యుని, కాంచి=చూచి, సుత=కుమారా, నినున్=నిన్ను, సాక్షిగన్=(అవస్థాత్రయమునకు) సాక్షిగాను, కని=చూచి, చింతలెల్లన్=(నేను జననజరామరణాదులుగల జీవుఁడను, పాపిని, పాపకర్తుఁడను,

ఎట్లు ముక్తిపొందఁగలను అనునవి మొదలైన) విచారములన్నియును, విశ్రాంతివెలుంగన్=నశింపఁగాను, ఒప్పితివే=(బ్రహ్మైకాహమనెడు స్థిరత్వముచేత) ప్రకాశించితివా, నీకున్=అవస్థాత్రయసాక్షివైన నీకు, ఇంకన్=ఇఁక మీఁద, ఎంతయున్=ఎంతమాత్రమైనను, తెల్విన్=బుద్ధియందు, సంశయము=స్వేతరముగ జీవేశ్వరజగద్భేదములు గలవనెడిసందేహము, ఉన్నదే=కలదా, మంజులోక్తులన్-మంజుల=మనోజ్ఞములైన, ఉక్తులన్=మాటలచేత, ఆత్మసుఖము=నీకు స్వానుభవానందము, కల్గినన్=ఉండెనేని, ఇట్లని=ఈప్రకారమని, తగన్=బాగుగా, తెల్పుము=తెలియఁజేయుము.

తా. ఎల్లప్పుడును తన మేని నీడవలె శుద్ధసత్త్వవృత్తిచేత తన్నునమ్మికొనియున్న సచ్ఛిష్యుని కనుఁగొని, కుమారా! సకలవిలక్షణుఁడైన పరబ్రహ్మము «దేహబుద్ధ్యాఽఽత్మదాసోఽహం జీవబుద్ధ్యాత్వదంశకః, ఆత్మబుద్ధ్యాత్వమేవాహ మితి మేనిశ్చితామతిః» అను స్మృత్యర్థముచొప్పున నీవని తెలిసికొంటివా? సందేహము లెవ్వియైన నీతెల్వియందు తోఁచుచున్నవా ? మంచిమాటలచేత నీ అనుభవము ఇట్టిదియని లెస్సగా తెలియఁజేయుమని తాత్పర్యము.

అ:—ఆచార్యుఁ డడిగిన మూఁడుప్రశ్నలకు శిష్యుఁడు తన యనుభవముఁ జెప్పుచున్నాఁడు.

చ. పలుకఁ దొడంగె మ్రొక్కి గురుపాదయుగంబున కర్థి జన్మరా
జ్యలఘుతరాటవి న్భ్రమమహాంధము దాన విభేదభూతము
ల్గలుగ భవత్కృపాచలముఁ గాంచితి నందుపదేశభానుమం
డలము వెలింగెఁ దద్ఘృణులధాకకు లోఁగనుదమ్మి భాసిలెన్. ౬

టీ. గురుపాదయుగంబునకున్= (అజ్ఞాననివారకుఁడైన), కారణాచార్యుని అడుగుల జంటకు, అర్థిన్=ఆసక్తితో, మ్రొక్కి=నమస్కరించి, పలుకఁదొడంగెన్= (తనయనుభవమును) చెప్పఁబూనెను, జన్మరా...టవిన్-జన్మ=పుట్టుకలయొక్క, రాజి = వరుసయనెడి, అలఘుతర=మిక్కిలిగొప్పదియైన, అటవిన్=అడవియందు, భ్రమమహాంధము=మోహమనెడి కటికచీఁకటియును, దానన్=ఆచీఁకటియందు-విభేద, (తనకునన్యముగా తోఁచెడు) జీవేశ్వరజగద్భేదములనెడి, భూతములు=పిశాచములు, కలుగన్=ప్రవర్తింపఁగా, భవత్కృపాచలము-భవత్=నీయొక్క, కృపా = నిర్వ్యాజకృపయనెడు, అచలమున్=పర్వతమును, కాంచితిన్=చూచితిని, అందున్=ఆనీకృపయనెడి ఉదయాచలమునందు, ఉపదేశభానుమండలము=నీవే ఆపరబ్రహ్మమని బోధించుటవలనఁగలిగిన అపరోక్షసాక్షాత్కారమనెడు సూర్యబింబము, వెలింగెన్=ప్రకాశించెను, తద్ఘృణులధాకకున్-తత్=ఆజ్ఞానసూర్యునియొక్క, ఘృణుల= (స్వానుభవానందవృత్తులనెడి) కిరణముల

రయొక్క, ధాకరుక్=అతిశయమునకు, లోఁగనుదమ్మి=అంతరనేత్రమనెడిపద్మము, భాసి లెన్=ప్రకాశించెను.

తా. శిష్యుఁడు ఆచార్యుని పాదద్వంద్వమునకు సాష్టాంగ నమస్కారములుచేసి ,,పుట్టుకలనెడి గొప్పఅడవియందు, మోహమనెడి గాఢాంధకారమందు, తనకన్యములైన జీవేశ్వరజగద్భేదములనెడి పిశాచములు సంచరించుచుండఁగా మీయొక్క దయయనెడు పర్వతమును, దానియందు మీయుపదేశమనెడి జ్ఞానసూర్యబింబమును, ఆబింబమువలనకలిగిన స్వానుభవానందవృత్తులనెడికిరణములచేత నాయొక్క మూఁడవదియైన అంతర్నేత్రమనెడు కమలము వికసించెనని తన యభిప్రాయమును చెప్పెనని తాత్పర్యము.

అవ:—సమాధియందు సలయవిక్షేపకషాయ రసాస్వాద సంశయాసంభావన విపరీతభావన లనెడు విఘ్నములు లేకున్నను ఆవిఘ్నములు తిరువాత వచ్చునా? యని శిష్యుఁ డాచార్యునిఁ బ్రశ్న చేయుచున్నాఁడు.

ఉ. మంత్రజపంబునం దొలఁగి మార్కొనుఁ దొల్లిటి సోఁకు డంచు వే
యంత్రము గట్టుమాంత్రికునియట్లవివేకము వాసిన స్భవ
న్మంత్రమహోపదేశమున మర్మముగా మఱి వచ్చునంచు దు
స్తంత్రపుసందియం బెడదఁ దారసిలె న్దగఁ దీర్పవేఁడెదన్. ౭

టీ. మంత్రజపంబునన్=(దుష్టగ్రహోచ్చాటన) మంత్రజపానుష్ఠానముచేత, తొలఁగి=ఎడఁబాసి, తొల్లిటిసోఁకుడు=మొదటసోఁకినపిశాచము, మార్కొనున్=ఎదిరించును, అంచున్=(మఱలసోఁకును)అని, వే=శీఘ్రము, యంత్రమున్=రక్షను, కట్టుమాంత్రికునియట్లు=వ్రాసికట్టెడు మంత్రగానివలెనే, భవన్మంత్రమహోపదేశమునన్-భవత్=మీయొక్క,మంత్ర=రహస్యములైన తత్త్వమస్యాదిమహావాక్యములయొక్క, ఉపదేశమునన్=బోధచేతను,అవివేకము=(దేహేంద్రియమనఃప్రాణములునేననెడి) అజ్ఞానము, వాసినన్=తొలఁగినను,మఱి=మరల, మర్మముగాన్= అసంభావనాది వృత్తిరూపముగా, వచ్చునంచున్=వచ్చెందునేమోయని, ఎడదన్=మనస్సునందు, దుస్తంత్రపుసందియంబు=తెలియనలవిగాని మాయాసంశయము, తారసిలెన్=కలిగెను, తగన్=అసందేహము నిర్మూలమగునట్లు, తీర్పన్=తీర్చుటకు, వేఁడెదన్=ప్రార్థించుచున్నాఁడను.

తా. పిశాచము సోఁకిన ఒకానొక మనుష్యునికి లోకమందు మాంత్రికుఁడు మంత్రానుష్ఠానముచేయ ఆపిశాచ మతనివిడిచిపోయి ఆ మాంత్రికుఁడు వెళ్లిపోయినపిమ్మట తిరుగా ఆపిశాచము ఆతనియందు ప్రవేశించునవెడి యనుమానముచేత యంత్రమువ్రాసి కట్టునట్లుగాను, మీయొక్క ,,నేతినేతి" యనెడు మహావాక్యోపదేశముచేత నాయంతనాదిగా విడువక వచ్చిన జీవేశ్వర జగద్భ్రాంతులనెడి అజ్ఞానము తొలఁగి పోయినను

కపటముగా ద్వైతభ్రమ మఱలవచ్చునేమోయని తెలియ నశక్యమైన మాయావిద్యా వరణాత్మకమగు సందేహము నాయుల్లమందు ప్రాప్తించెను కావున అది నివారణమగునట్లు అనుగ్రహించవలయునని తాత్పర్యము.

అవ:—శిష్యుఁడు తన కనుభవమైన బ్రహ్మస్వరూపము మనోవాక్కులకు గోచరమని అగోచరమని పలుకుచున్న శ్రుతివాక్యములు రెంటియందలి తాత్పర్యము సిద్ధపడుటకు తన మనస్సునందు తోఁచిన సందేహములను చూపి అడుగుచున్నాఁడు.

ఉ. ఆగమవేదమస్తకమహావచనామలమానసాళికి
న్స్వాగతమౌను గాదమలసచ్చిదఖండసుఖస్వరూప మీ
లాగని వేదముల్పలుక లక్ష్యము గామి జనించె శంక మ
చ్ఛ్రీగురుమూర్తియిమ్మడిగఁ జెప్పుముదాని హరించుమార్గముఁన్. ౮

టీ. మచ్ఛ్రీగురుమూర్తి-మత్=నాయొక్క, శ్రీగురుమూర్తి-శ్రీ=బ్రహ్మవిద్యతోఁగూడిన, గురు=సర్వోత్కృష్టమైన, మూర్తి=ఆకృతిగాఁగలస్వామీ,అమలసచ్చిదఖండసుఖస్వరూపము-అమల=నిర్మలమైన, సచ్చిదఖండసుఖస్వరూపము=సచ్చిదానందరూపము, ఆగమ...పాళికిన్-ఆగమ=కామికము మొదలు వాతూలాంతముగాఁగల యిరువదియెనిమిది శైవాగమములయొక్కయు, వేద = ఋగాది చతుర్వేదములయొక్కయు, మస్తక=శిరస్సులైన చర్య, క్రియ, యోగ, జ్ఞాన, పాదములయందలియు ఈశావాస్యము మొదలైన యుపనిషత్తులయందలియు, మహావచన=జీవేశ్వరైక్యజ్ఞానమును బోధించెడి పంచపద మహావాక్యములయొక్కయు,తత్త్వమస్యాదిమహావాక్యములయొక్కయు, అమల=పంచమలరహితులైన పెద్దలయొక్క,మానస=మనస్సులయొక్క,ఆళికిన్=సమూహమునకు, (ఆ సచ్చిదానందపరబ్రహ్మస్వరూపము) స్వాగతమౌను=గోచరించును, కాదు=స్వాగతముకాదు, ఈలాగని=ఈప్రకారమని, రెండువిధములుగా, వేదముల్=శ్రుతులు, పలుకన్=పలుకుచున్నందున (ప్రతిపాదించు చున్నందున), లక్ష్యముగామిన్=నూటిగానుండమిచే, నామదికిన్=నామనస్సునకు, ఇమ్మడిగన్=రెండింతలుగా, శంక=అనుమానము, జనించెన్=పుట్టెను, దానిహరించుమార్గమున్=ఆశంకను పోఁగొట్టువిధమును, చెప్పుము=వచింపుము.

తా. ఓగురుస్వామీ ! నిర్మలమై పరిపూర్ణమై వెలింగెడి పరబ్రహ్మము శైవాగమములందు చెప్పఁబడిన సిద్ధాంత వచనములకును సకలోపనిషద్వాక్యములకును పెద్దలయొక్క నిర్మలాంతఃకరణములకును, అందునదియు అప్రకారముఅందదనియు రెండువిధములుగా వేదములు పలుకుచున్నందున నామనస్సునకు రెండింతలు సందేహము కలిగినది గావున అసందియము తీరునటులు తెలియఁజెప్పవలయునని తాత్పర్యము.

అవ:—గురుస్వామి శిష్యునకు పరబ్రహ్మము వాగగోచర మనునది గోచరమగు ననునది ప్రమాణములచేత స్థిరపఱచుచున్నాఁడు.

శా. ప్రత్యక్షోభయసంశయంబులుఁ బదార్థజ్ఞానమానంబులై
ప్రత్యగ్వస్తువుఁ దెల్పలేవు విషయప్రత్యక్షసాదృశ్యసాం
గత్యప్రక్రియ లౌటఁ బుత్రక సుముఖ్యంబౌ పరావాణికి
న్వ్యత్యస్తంబుగఁ దేజరిల్లు నని నిర్వాణేశుఁ బల్కున్ శ్రుతుల్.

టీ. పుత్రిక=కుమార, ప్రత్యక్షోభయసంశయంబులు-ప్రత్యక్ష= ప్రత్యక్షము, ఉభయ=ఉపమానము, సంశయంబులు= అనుమానము అనెడు అష్టప్రమాణములలోఁ జేరిన మూఁడు ప్రమాణములు, పదార్థజ్ఞానమానంబులై-పద=శబ్దములయొక్కయు, అర్థ=అర్థములయొక్కయు, జ్ఞాన=తెలివికి, మానంబులై=ప్రమాణములై, విషయ...ములౌటన్-విషయ= పదార్థములయొక్క, ప్రత్యక్ష= ఇంద్రియములకు తెలియఁబడునదియు, సాదృశ్య=ఉపమానోపమేయాత్మకమును, సాంగత్యప్రక్రియలు=ప్రతిజ్ఞ, పక్షము, సాధ్యము, హేతువు, దృష్టాంతములనెడు పంచావయవవాక్యములతోడి కూటమియు, అగుటన్=అగుటచేత, ప్రత్యగ్వస్తువున్=నామరూపవిలక్షణమైన పరబ్రహ్మమును, తెల్పలేవు=తెలియఁజేయనేరవు, శ్రుతులు=వేదములు, నిర్వాణేశున్=మోక్షస్వరూపుఁడైనపరబ్రహ్మమును, ముఖ్యంబౌపరావాణికిన్=ముఖ్యంబౌ= (పర, పశ్యంతి, మధ్యమ, వైఖరి, అను నాల్గువిధములుగల వాక్కులందు) మొదటిదగు, పరా=పరయనెడు, వాణికిన్=వాక్కునకు, వ్యత్యస్తంబుగన్=అతీతమై, తేజరిల్లునని=ప్రకాశించుననని, పల్కున్=చెప్పును, కనుక (నీవు దీనిని) తెలిసికొనుము.

తా. కుమారా! ప్రత్యక్షము, ఉపమానము, అనుమానములనెడు అష్టప్రమాణములలోఁజేరిన మూఁడుప్రమాణములయందు విషయములను జూపునది ప్రత్యక్షప్రమాణము. ఒకవస్తువువంటిది మఱియొకవస్తువనునట్లు దెల్పునది ఉపమానము. ఐదువాక్యములతోఁ గూడినది అనుమానము అగుటవలన ఈమూఁడు ప్రమాణములును దేశకాలవస్తు పరిచ్ఛేదశూన్యమగు పరబ్రహ్మమునుదెల్పలేవు. పర, పశ్యంతి, మధ్యమ, వైఖరిఅనెడు నాలుగు వాక్కులలో మొదటిదైన పరావాక్కునకు విలక్షణుఁడైన మోక్షకర్తను వేదములు చెప్పునని ఆచార్యుఁడు శిష్యునకు వాక్రుచ్చుచున్నాఁడని తాత్పర్యము.

## అష్టప్రమాణముల వివరణము,

"ప్రత్యక్షోభయసంశయంబులు పదార్థజ్ఞానమానంబులై ప్రత్యగ్వస్తువుఁదెల్పలేవు" అనుటచేత ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, ఆగమము, అర్థాపత్తి, అనుపలబ్ధి, సంభవము, ఐతిహ్యము అనునవి అష్టప్రమాణములు ; సచ్చిదానంద నిత్య నిర్మలములనెడి పంచలక్షణములే స్వరూపముగఁగలిగి అనృతజడదుఃఖానిత్యమలినముల

నెడి పంచలక్షణ స్వరూపముగా తోఁచఁబడెడు ప్రకృతిని మీఱివెలుఁగునది పరబ్రహ్మము. ఆ పరబ్రహ్మమునందు కాలత్రయమునునది లేకపోయినను ఉన్నట్టుగా అజ్ఞానులకు తోఁచఁబడెడి ప్రకృతివలనఁ గలిగినది ప్రపంచము. ఆప్రపంచము రూపనామములుంగలది. అందు దశవిధరూపములను గ్రహించునది నేత్రము. అక్షరగుణకము, ధ్వనిగుణకము, స్వరగుణకము,మిశ్రగుణకము అనెడు నాల్గువిధములైన శబ్దములను గ్రహించునది శ్రోత్రము.కాఁబట్టి యీరూపనామములను తెలియఁజేయునవి ప్రత్యక్షము, ఉపమానము, అనుమానము అనెడి ప్రమాణములు. అందు ఇంద్రియములకును ఇంద్రియవిషయములైన శబ్దస్పర్శాదులకును చేరికగలుగుట ప్రత్యక్షప్రమాణము. అది ఘటప్రత్యక్షము, ఘటత్వప్రత్యక్షము,ఘటరూప ప్రత్యక్షము, ఘటరూపత్వ ప్రత్యక్షము అని నాలుగువిధములు. అందు ఘటమునకును నేత్రమునకును చేరికగలుగుట ఘటప్రత్యక్షము. ఇది సంయోగమనఁబడును. పూర్వము ఘటజాతిని మాచియుండుటచేత ఇది ఘటమని యెఱుఁగుట ఘటత్వప్రత్యక్షము. ఇది సమవేత మనఁబడును. కంబుగ్రీవాదిమత్త్వము ఘటరూప ప్రత్యక్షము. అనఁగా ఘటము శంఖము మొదలగువానివంటి మెడగలిగియుండుట ఘటరూపప్రత్యక్షమని భావము. ఇదియును సంయోగమనఁబడును. పూర్వము ఘటరూప జాతిని మాచియున్నందున ఇదియును ఘటరూపముగా నెఱుఁగుట ఘటరూపప్రత్యక్షము. ఇది సమవేతము. ఈప్రమాణము ఇంద్రియజన్య మగుటచేత అతీంద్రియమైన పరబ్రహ్మమును చూపనేరదు. ఇది దేహాఽఽత్మవాదులయిన జైన, బౌద్ధ, చార్వాక, క్షపణక, సౌగత, అద్వైత, మాయావాది, ద్వైత, మూర్త్యంతర, మతాంతర, దేవతాంతర, నైయాయిక, వైశేషిక మతస్థులకు ముఖ్యము. అనుమానప్రమాణమనఁగా యుక్తిచేత సాధింపఁబడునది. ఆయుక్తి, ప్రతిజ్ఞ, పక్షము, సాధ్యము, హేతువు, దృష్టాంతము అనెడు పంచావయవ వాక్యములతోఁగూడినది. అందు ‘‘పర్వతో వహ్నిమాన్’’ అనఁగా పర్వతము నిప్పుగలది అనునది ప్రతిజ్ఞ. ఆ యగ్నియుండుటకు స్థానమైనందున పర్వతము పక్షము. దానియందు సాధింపఁబడునట్టి అగ్నిసాధ్యము. ఆసాధ్యమునకు పర్వతము మీఁదనుండెడి పొగ కారణమగుటచేత పొగ హేతువు. వంటయింటిమీఁది పొగనుజూచి అక్కడినుండి నిప్పుతెచ్చుటవలన వంటయిల్లు దృష్టాంతము.

ఈప్రకారము దార్ష్టాంతమైన పరబ్రహ్మమును తెలిసికొనుటకు పంచావయవవాక్యములును, వానియర్థములును, పరబ్రహ్మమునకు ముందేయుండవలసివచ్చును. ఈపరమాత్మ నిరాధారుఁడును, నిరవయవుఁడును, నిష్క్రియుఁడును, నిరంజనుఁడును, జగత్కారణుఁడును, అనాదియును అగుటవలన ఈప్రమాణముచేత పరబ్రహ్మము సాధింప శక్యముగాదు. ఉపమానప్రమాణము ఇంద్రియములకును, ఇంద్రియ విషయములైన శబ్దస్పర్శాదులకును చేరికగల ప్రత్యక్ష ప్రమాణముతోడను,యుక్తిసాధ్యమైన అనుమానప్రమాణముతో

దను కూడినదిగనుక ఉభయాత్మక మనఁబడును. లేక ‘‘గోసదృశోగవయమృగః’’ ఆవువలె నుండునది గవయమృగము అనఁగా నొకఁ డిది విని, వాఁడడవికిఁబోయి దానినిఁజూచి యిది గోవువలెనున్నది గనుక గవయ మృగమని యెఱిఁగినట్లు ఉపమానోపమేయాత్మక మగుటచేత ఈప్రమాణము ఉభయాత్మక మనఁబడును. మఱియును ఇదిగుణోపమ,కర్మోపమ, ప్రయోజనోపమ అని తొలుత మూఁడు విధములు. మఱియు ఇవియే హీనోపమ, సమానోపమ, గుప్తోపమ, ప్రకటోపమ, విరోధోపమ, నిజోపమ, సంశయోపమ అని బహుభేదములచేత అలంకారశాస్త్రమందు చెప్పఁబడియున్నది. పగడమువంటిది పెదవి యనుట గుణోపమ, మీనమువంటిది నేత్రము అనుట కర్మోపమ, మేఘమువంటిది హస్తము అనుట ప్రయోజనోపమ, యిట్లన్నియు నూహ్యములు. మఱియు, ‘‘శ్రు. ఏకమేవాద్వితీయం బ్రహ్మ నేహ నానాస్తి కించన, సాక్షీ చేతా కేవలో నిర్గుణస్స్యాత్’’ అను శ్రుతులనుబట్టి సర్వము పరమాత్మ యగుటవలన ఈ పరమాత్మకు త్రికాలములయందును బోల్పఁదగినవస్తువు వేఱొక్కటి లేకపోవుటచేతను, నిరుపముఁ డగుటచేతను, ఈప్రమాణము ఆయనను జెప్పఁ జొప్పడదు. మఱి యీమూఁడు ప్రమాణములును వేదాంతములయందు ముఖ్యములుగావు. శబ్ద (ఆగమ) ప్రత్యక్షోపమానానుమాన ప్రమాణములు నాలుగు నైయాయికవైశేషికుల మతమందుఁగలవు.

శబ్దప్రమాణమునకే ఆగమప్రమాణ మని పేరు. ఆగమములనఁగా వేదశిరస్సులైన యుపనిషత్తులు. అవి వేయినూటయెనుబది. వానిలో నిప్పుడు నిల్చియున్నవి నూటయెనిమిది. వానిలో ముఖ్యములు పది. అవియే దశోపనిషత్తు లనఁబడును. అన్ని యుపనిషత్తుల యభిప్రాయము ఈదశోపనిషత్తులందుఁ జెప్పఁబడినది.కాఁబట్టి దీనికే శ్రీశంకర భగవత్పాదులవారు భాష్యముచేసిరి. అట్టి యుపనిషద్వాక్యములు అవాంతరవాక్యములని మహావాక్యములని ద్వివిధములు. అందు గుణవాక్యములు, క్రియావాక్యములు, జాతివాక్యములు, విధివాక్యములు, నిషేధవాక్యములు అని అవాంతరవాక్యములు అయిదువిధములు. మహావాక్యము లనఁగా జీవేశ్వరులయందు వాచ్యార్థములను వదలి లక్ష్యార్థమును చూపి ఐకమత్యమును నిర్ధారణచేయుతత్త్వమస్యాది మహావాక్యములు. వీనిని మహావాక్యరత్నావళియందు తెలియనగును. ఈ వాక్యాదులచేత పరబ్రహ్మము ప్రతిపాదింపఁబడును. కాఁబట్టి యీ ఆగమప్రమాణము బ్రహ్మవేత్తలకు ముఖ్యమగును. ఇదియును శాఖాచంద్రన్యాయముగాను, ‘‘కాకవత్ గృహం’’ అనునట్లుగాను బ్రహ్మమునుజూపి దిగువఁబడును గనుక ‘‘పరావాణికిఁ వ్యత్యస్తం బగు’’నని చెప్పఁబడినది.

అర్థాపత్తియనునది శ్రుతార్థాపత్తి దృష్టార్థాపత్తియని ద్వివిధము. వీనిలో శ్రుతార్థాపత్తి యనఁగా దేవదత్తుఁడనువాఁడు గృహములోనున్నాఁడని యొకఁడుచెప్పఁగావిని అచ్చటికిఁబోయి విచారించినంతట వాఁడచ్చటలేఁడని ఆయింటిలోనివారు చెప్పినందువ

ఇప్పుడక్కడ లేకుండినను మరియొకసమయములో చూడవచ్చునని నిశ్చయించుకొనుట. ఇందువలన దార్ష్టాంతమందు బ్రహ్మజ్ఞానము ఇప్పుడు ప్రాప్తించకపోయినను సత్కార్యానుష్ఠానమువలన క్రమక్రమముగఁ బొందనగునని తెలిసికొనుట. దృష్టార్థాపత్తియనఁగా ఒకఁడు పగలు భోజనముచేయక సదోపాసినని చెప్పుకొనినను వానినిచూచినప్పుడు వాని శరీరపీనత్వమును చూచి రాత్రికాలములయందు ఎవ్వరెఱుఁగకుండ భుజించువాఁడని తెలిసికొనుట దార్ష్టాంతమందు వ్యోమాది ప్రపంచమును చూచి దీనిని నిర్మించినవాఁడు ఒకఁడుండునని గ్రహించి ఆయనను ఉపాసించి సత్కార్యములచేయుట.

అనుపలబ్ధియనఁగా అభావము. అది ప్రాగభావము, ప్రధ్వంసాభావము, అన్యోన్యాభావము, అత్యంతాభావమని నాలుగువిధములు. ఘటోత్పత్తికి ముందు ఉండిన ఘటాభావము ప్రాగభావము. దీనికిలక్షణము ఉత్పత్తిలేకయే నాశముకలది. ఎట్లనఁగా, ఘటోత్పత్తికి పూర్వము ఎంతకాలమునుండి యీఘటాభావముకలిగియున్నదో దానికి ప్రతియోగియైన ఘటముపుట్టినపుడు ఆ యభావము నాశమగుట. దీనికి దార్ష్టాంతమందు జ్ఞానోత్పత్తికి ముందుండిన జ్ఞానాభావమని ఎఱుంగునది. ప్రధ్వంసాభావమనఁగా ఘటముపుట్టి యాఘటముపగిలినప్పుడు కలిగిన అభావము దీనికిలక్షణము. ఉత్పత్తికలిగి నాశములేనిది. ఇది దార్ష్టాంతమందు బ్రహ్మజ్ఞానము చెడినప్పుడు పుట్టి నాశములేనిది. అన్యోన్యాభావమనఁగా చీఁకటియందు ప్రకాశము. ప్రకాశమందు చీఁకటిలేనట్లు దీనికిలక్షణము అప్పుడప్పుడే ఉత్పత్తినాశములు కలుగుటలు. ఇది దార్ష్టాంతమందు జ్ఞానాజ్ఞానములవలె ఒకటి కలిగినప్పుడు మఱియొకటి నశించువిధముగఁ జొప్పడును. అత్యంతాభావమనఁగా ఎప్పుడును ఘటోత్పత్తిలేకుండుట. దీనికిలక్షణము ఉత్పత్తినాశములు రెండును లేకపోవుట. దీనిచే దార్ష్టాంతమున పరబ్రహ్మమందు అజ్ఞానము ఎప్పుడును లేనందున ఉత్పత్తినాశములు లేవనిఎఱుఁగుట. సంభవమనఁగా నూఱులలో పదులున్నట్లు, వేలలోనూఱున్నట్లు, లక్షలో వేలున్నట్లుగా తెలిసికొనవలయును. దార్ష్టాంతమున పరబ్రహ్మమందు జగత్తుకలదిగాఁ దోఁచుట.

ఐతిహ్యమనఁగా, ఒకచెట్టునందు బ్రహ్మరక్షస్సున్నదని యొకఁడు ఎప్పుడో చెప్పఁగా ఆమాట నానాఁట నందఱువిని అచ్చోటికి విచ్చేయునప్పుడు ఆమాటను జ్ఞప్తికి దెచ్చుకొని భీతిఁజెందుట. మఱియు నొకమనుజుఁడు ఒకవృక్షముమీఁద గుడ్డపేలికల చించి పాఱవేసిపోయిన దానినిచూచిన వారందఱు కారణము విచారించక ఆప్రకారమే జరుపుట. దీనివల్ల దార్ష్టాంతమందువస్తుయాథార్థ్యమును తెలుపుట కనేకశాస్త్రములుండఁగా వానిని పరిశీలింపక గ్రుడ్డెద్దు చేనిలోఁబడినట్లును, ఒకగొఱ్ఱె పల్లములోదుమికిన దానిని వెంబడించిన తక్కిన గొఱ్ఱెలన్నియును పడురీతిని భ్రమచేత తిరుగుచుండుటయని తెలిసి

కొనతగ్గది. పైఁజెప్పిన అష్టప్రమాణములలో అర్థాపత్తి మొదలుకొని ఐతిహ్యమువఱకుఁ గల నాలుగుప్రమాణములు వేదాంతమునకు సామీప్యముగా నున్నను అనుమానములో అంతర్భూతములు. ఈ ఎనిమిది ప్రమాణములు పౌరాణికులకును, మొదటి ఆఱు ప్రమాణములు పూర్వమీమాంసకులకును, ప్రత్యక్షప్రమాణము నాస్తికులకును, ఆగమప్రమాణము ఆస్తికులైన బ్రహ్మవేత్తలకును ముఖ్యము లనిభావము.

## పరా పశ్యంతీ మధ్యమా వైఖరీ వాక్కుల వివరణము.

‹‹పరా వృక్షేషు సంజాతా పశ్యంతీ భుజగేషుచ, మధ్యమావై పశుష్వేవ వైఖరీ షణ్ణరూపిణీ›› అను శ్లోకప్రమాణముచొప్పున పరావాక్కనఁగా: చిగుళ్లు, ఆకులు, పూవులు, పిందెలు, కాయలు, పండ్లు మొదలగువానిని పుట్టించుటకు తాను కారణమైయుండియు, దానినిచెట్టు ఎఱుఁగనిరీతిని బ్రహ్మకారితవృత్తిరూపిణియై సర్వజగత్కారణమై యుండియు, అట్లగుట తెలియనట్టి బ్రహ్మప్రణవమందలి అర్ధమాత్ర తురీయపాదాత్మక ప్రకృతియనఁబడును.

పశ్యంతీవాక్కనఁగా: పాములవినికికి చూపునకు కన్నే హేతువైనవిధమున సమస్తవస్తుగ్రాహకయోగ్యమై మహత్తత్త్వసంజగల ఆబ్రహ్మప్రణవమందలి మకార మానందపాదాత్మక ప్రథమస్ఫురణ యనఁబడును.

మధ్యమవాక్కనఁగా: అకార మకారములతోఁగూడిన పురుష ప్రకృత్యాత్మకమగు అమ్మ యను శబ్దమునుపలికెడి పశువులు దానిఅర్థమును తెలిసికొననివిధమున బ్రహ్మప్రణవమందలి ఉకారవిద్యాపాదాత్మక మహదహంకార రూపవృత్తియనఁబడును. అనఁగా మాటలు వినఁబడినను వానియర్థము తెలియనిదశ.

వైఖరీ వాక్కనఁగా: బ్రహ్మప్రణవమందలి అకార విద్యాపాదరూపమై ఏఁబది అక్షరములచేత తానుపలికెడు సమస్తశబ్దములును వానియొక్క అర్థములును చక్కఁగఁదెలియునట్లు బహిర్ముఖమగు వృత్తియనఁబడును. ఇందులకు దార్ష్టాంతము. ఒకఁడొకకార్యమును చేయుటకై సంకల్పించుటకు పూర్వమందుఁగల వాక్కు పరావాక్కనియు, సంకల్పము పశ్యంతీవాక్కనియు, ఆ సంకల్పించినకార్యము వెలుపలవచ్చుట వైఖరీవాక్కనియు, ఆకార్యము వెలుపలవచ్చుటకు ముందున్నఊహ మధ్యమ వాక్కనియు చెప్పఁబడును. ఎట్లనఁగా: తనయొక్క ప్రారబ్ధము ఈశ్వరాధిష్ఠితమై అదృష్టమను పేరుచేనుండి అంతఃకరణమందుపడి బృహద్బుద్ధ్యాకారమగునది పరావాక్కనఁబడును. అనఁగా విత్తనముభూమిలోఁబడి నాని మునుపటిరూపుమాపుకొని మొలక వెలుపలికిరాక ఉబికివుండునట్టిస్థితి. అవిత్తునుండి మొలక వెలుపలవచ్చినవిధమున ఆ పరావాక్కునుండి ఒక తలంపు పుట్టుటపశ్యంతి. అవెలుపలకనఁబడిన మొలక పెరుఁగుటవలె ఆ తలంపును ఆలోచనకు

తెచ్చుకొనుట మధ్యమ యనఁబడును. ఆ పెరిఁగినచెట్టు ఆకులు కొమ్మలు రెమ్మలు ఊడలు మొదలగువానితోఁ బరిపూర్ణమైనట్లు ఆ తలంపులు బహిర్వ్యాపారమందువ్యాపించి ప్రవర్తించుట వైఖరి యనఁబడును.

అ:—బ్రహ్మము వాక్కునకు అందునని అందదని ద్వివిధముగా శ్రుతి పలుకుచున్నది గాన వానిలో నేదినిక్కమని శిష్యుఁడడుగఁగా ఒకటిమాత్రము సత్యమనిన వేదమునకు బాధకముగలుగునని ఆరెండువాక్కులు సత్యమేయని రూఢిపఱుచుచున్నాఁడు.

చ. ఒకతఱి వాగతీత మని యొండొకవేళఁ బరాపరంబు ద
ద్వికటముగాఁగఁ బల్కు శ్రుతి వీని ప్రమాణము లెట్లుటుంగనౌ
నుకరముగా వచింపుఁ డన నూనృతవాక్యములౌఁ దదుక్తులూ
రక శ్రుతిమిథ్యఁ బల్కునె కరంబు నెఱుంగదె తారతమ్యమున్.

టీ. శ్రుతి=వేదము, పరాపరంబు=పరా ప్రకృతికిపరమైనపరబ్రహ్మము, ఒకతఱిన్=ఒకసమయమందు, వాగతీతమని-వాక్=వాక్కునకు, అతీతమని=అందనిదని, ఒండొకవేళన్=మఱియొకసమయమందు, తద్వికటముగాఁగన్=దానికివ్యత్యస్తముగాను, (అనఁగావాక్కునకు అందునదియని) పల్కున్ = చెప్పును, వీనిప్రమాణములు=బ్రహ్మము వాక్కునకుఅందును అందదుఅని పలికెడు వేదప్రమాణములు, సుకరముగాఁగన్=సులభముగా, ఎట్లు=ఏప్రకారము, ఎఱుంగనౌన్=తెలిసికొననౌను, వచింపుఁడు=చెప్పుఁడు, అనన్=అనిశిష్యుఁడు ఆచార్యునిఅడుగఁగా, తదుక్తులు=వాక్కునకు అందునని అందదని చెప్పిన ఆవేదవాక్యములు రెండును, సూనృతవాక్యములౌన్ = సత్యవచనములేయగును, శ్రుతి=వేదము, ఊరక=మిన్నక, మిథ్యన్=అసత్యమును, పల్కునె=చెప్పునా, కరంబు=మిక్కిలి, తారతమ్యమున్=సత్యాసత్యముల హెచ్చుతక్కువలను, ఎఱుంగదే=తెలికొనదా.

తా. ఓగురుస్వామీ! పరాపరమునకు పరమైనపరబ్రహ్మమును వేదము ఒకసమయమునందు వాక్కునకు అందునని మఱియొకసమయమునందు అందదనిపలుకుచున్నది. ఇట్లు రెండువిధములుగఁబలుకవచ్చునా? ఆతీరున ద్వివిధముగాపలికెడు వేదప్రమాణములలో నేదినిజమని అనాయాసముగ తెలిసికొనుటకు నెట్లు సాధ్యమగునని శిష్యుఁడడుగఁగా నందులకు గురుస్వామి ఓశిష్యుఁడా! పరబ్రహ్మము వాక్కునకుఅందునని అందదనిచెప్పిన వేదవాక్యములు రెండును సత్యములేయగును. వేదము అసత్యము నెన్నఁడును పలుకదు. సత్యాసత్యముల తారతమ్యములను వేదమెఱుఁగదాయని శిష్యునితో పలికెనని తాత్పర్యము.

అవ:—బ్రహ్మము వాక్కునకు అందును అందదను పలుకులను దృష్టాంతపూర్వకముగా గురుండు శిష్యునకు వివరింపుచున్నాఁడు.

చ. తనపతి గానిపూరుషునిఁ దాల్మిఁ గడు న్దల యూఁచి తాల్మికిన్
వనిత నిజేశుఁ జూపుతఱి ద్రాల్చి శిరం బతిలజ్జ నున్న పో
ల్కిని నిది కాదు కాదనుచుఁ గేవలమై తగు నిర్విశేషమున్
గని శ్రుతి పల్కుఁ బల్కక వికాసముగాఁ గనువారి కింపుగన్.

టీ. వనిత=స్త్రీ, తనపతిగానిపూరుషునిన్=తనమగఁడుగానిమనుజుని, తాల్మిన్=ఓర్పుచేత, కడున్=మిక్కిలి, తలయూఁచియూఁచి=కాఁడుకాఁడనితలయాడించియాడించి, తాన్=తాను, నిజేశుఁజూపుతఱిన్=తనపెనిమిటినిఁజూపునప్పుడు, శిరంబు=తలను, ద్రాల్చి=వంచి, అతిలజ్జనున్నపోల్కిన్=మిక్కిలిసిగ్గుపడియుండునట్లు, శ్రుతి=వేదము, ఇది కాదుకాదనుచున్=«నేతి నేతి» యనెడి అతద్వ్యావృత్తిలక్షణముచేత పరబ్రహ్మముగాని నామరూపాత్మకమగు దేవ, నర, తిర్యగ్వస్తువులను కాదుకాదనిచెప్పుచు, కేవలమై=ముఖ్యమై, తగు=ఒప్పుచుండెడు, నిర్విశేషమున్=ఇదిగా దిదిగాదని సర్వమునుద్రోయఁగా మిగిలినపరబ్రహ్మమును, కని=తెలిసి, కనువారికిన్=తామేయని చూచుకొను బ్రహ్మవేత్తలకు, ఇంపుగన్=ఆనందముకలుగునట్లు, వికాసముగాన్=స్పష్టముగా, పల్కక=చెప్పక, పల్కున్=చెప్పును.

తా. ఒకానొక స్త్రీ తన మగఁడుగాని మనుష్యుని తనపతికాఁడుకాఁడని మిక్కిలి తలయాడించియాడించి తనపెనిమిటినిఁ జూపునపుడు శిరమువంచుకొని మిక్కిలి సిగ్గుపడియుండునట్లు వేదము «నేతి నేతి» యనెడు అతద్వ్యావృత్తిలక్షణముచేత సురాసుర, నర, జల, చర, క్రిమి, పశు పక్షులను తరుగిరి పాషాణములను ఇదికా దిదికాదనిచెప్పుచు సర్వోత్కృష్టమైయొప్పుచుండెడి పరబ్రహ్మాభిన్న కూటస్థచైతన్యము తామేయని తెలిసికొను బ్రహ్మవేత్తలకు ఆనందము గలుగునట్లుగాను చెప్పక చెప్పునని తాత్పర్యము.

ఇందులకు దృష్టాంతముగ నొకవిచిత్రకథ వక్కాణింపఁబడుచున్నది. దక్షిణదేశమునందు భూ పురంధ్రీమణికి మణినూపురంబైన రామనాథపురంబునందు కాపురంబుచేయునట్టి లక్ష్మీనారాయణులనెడు దంపతులు అఖండైశ్వర్యమును పొందఁగోరి అఖండగోదావరిగట్టున మాపట్టు నిర్మలయను పట్టణముచేరి అచ్చటవర్తకముచేత జీవించుచుండఁగా వారికి చందమామయందమును క్రిందుపఱుపఁజాలిన మీనాక్షియనుపేరుగల ఒక్కసుందరిపుట్టి తల్లిదండ్రుల డెందములకు అమందానందమును పొందఁజేయుచు నానాఁటపెరిఁగి యెల్లజనులయుల్లములకు నుల్లాసమునుగలిగించుచుండెను. అంత కొంతకాలమునకు తల్లిదండ్రులు ఆచిన్నదానికి పెండ్లిచేయఁదలఁచి తమకు చుట్టములుగలరేమోయని ఆపట్టణమందెల్లవెదకి అక్కడ నెక్కడను ఒక్కఁడైన చక్కనివరుఁడు తమకులమునందు లేకుండుటను తెలిసికొని తమదేశమందలి బంధువులకు జాబులువ్రాసిరి. వారు ఆజాబులను చూచుకొని కులమును, శీలమును, రూపమును, ప్రాయమును, కలిమియును శుభలక్షణమునుగలిగిన

సుందరేశుఁడను చిన్నవానినిఁ బంపిరి. వాఁడు ఆచిన్నదియున్న నిర్మలాపట్టణముచేరి లక్ష్మీనారాయణులనెడి ఆవృద్ధదంపతులనుజూచి తాను వచ్చినవర్తమానమును తెలుపఁగా ఆ దంపతులు మహోల్లాసముతో సల్లాపములుసలిపి భోజనాదులుచేయించి తమ పురోహితుని రప్పించి ముహూర్తపత్రికయిప్పించి తమ కులోచితక్రమముగఁ బెండ్లిచేయించి అల్లునికిని కూఁతురుకును అరణమిచ్చి వారి కిరవైన రామనాథపురమునకుఁబంపిరి ఆసుందరేశుఁడు మీనాక్షియనెడు తనభార్యతోఁగూడి తనపట్టణపుదారిపట్టి పోవుచు ఒకగ్రామమందు బాటసారులకు వాటముగ కట్టియుండెడు సత్రమునందు దిగెను. వెనుక నాసుందరి జలము తేఁగోరి చంకయందు బిందియుంబొందుపఱచి అంచలసంచులకు సంచలనంబు కలిగింపఁజాలిన నడలతో కొలనికిఁబోయి నీళ్లుముంచుకొనుచుండఁగా అంతకుముందు జలముకొఱకు అచ్చటికివచ్చియున్నకొందఱుస్త్రీలు క్రొత్తపెండ్లికూఁతురయిన మీనాక్షినిజూచి దాని అందమునకు ఆనందముజెంది కొంతసేపు మాటలాడి ఆమె మగనిని జూడవలయునను ఆత్రము మనస్సున పెనఁగొనఁగా వారు దిగియుండెడు సత్రమునకుఁబోయి అక్కడికి నానాదేశముల నుండి వచ్చినపురుషులనుజూచి ఓపడుచా! వీరిలోన నీపురుషుఁడు ఇతఁడా ఇతఁడా ఇతఁడాయని యందఱను వ్రేలితోఁజూపి అడుగఁగా కాఁడుకాఁడని తల ఆడించుచు వచ్చి తనపురుషుని జూపించినప్పుడు లజ్జచేత ఔను కాదనక ఊరకుండెను. అదిచూచి దీని మగఁడు వీఁడే యని తెలిసికొనిరి. ఆవిధముగ జగత్కారణమైన పరబ్రహ్మమును తెలిసికొన నపేక్షించిన ముముక్షువులకు వేదము, బ్రహ్మ విష్ణు రుద్ర మహేశ్వర సదాశివాది పర్యంతమైన దేవతలనందఱను పృథివ్యాదిపంచమహాభూతములను "నేతి నేతి" యను వాక్యముచేత ఇదికాదిదికాదని నిరసించి మిగిలిన సచ్చిదానందవస్తువును జూపునపుడు అగుఁగాదనక యూరకుండును. అనఁగా అంతరదృశ్యములైన సకలేంద్రియములను నిరసింపఁగా నిలిచినది ప్రత్యగాత్మ. బహిర్దృశ్యములైన సర్వమును నిరసింపఁగా నిలిచినది పరమాత్మ. ఆపరమాత్మయే ప్రత్యగాత్మయని అతద్వ్యావృత్తి లక్షణముచేత యథార్థవస్తువును వేదము మాపక చూపునని భావము.

అవతారిక.—బ్రహ్మతత్త్వము మనస్సునకు అందును అందదు అను రెండవప్రశ్నమున కుత్తరము చెప్పఁబూని తొలుత మనస్సుయొక్కపుట్టుకను కారణమును జెప్పుచున్నాఁడు.

ఉ. తొల్లిటిశంకలం దొకటి దూలఁగఁ జేసితి వేఱొకందు నీ
యుల్లముఁ బాయఁ దెల్పెద సముజ్జ్వలబోధ ముకుందు రాజమై
యెల్లహృషీకపంక్తికి నిజేచ్ఛగ లో వెలి సంచరించునా
నల్లలితప్రచారములు సజ్జన బుద్ధిమనంబులై తగున్. ౧౨

టీ. సజ్జన—బ్రహ్మతత్త్వముసెఱిఁగిన ఓయిశిష్యుఁడా, తొల్లిటిశంకలందున్—వాక్కునకు అందును అందదు, మనస్సునకు అందును అందదు అనెడి మునుపటిరెండు సందే

హములలో, ఒకటిఁ=వాక్కునకు అందును అందదు అనెడి ఒక్కసందేహమును, తూలఁగఁజేసితిఁ=వదలిపోవునట్లుచేసితిని, నివారించితిననుట. వేఱొకండు = మనస్సునకు అందును అందదు అనెడి మఱియొకసందేహము, నీయుల్లముఁ = నీయంతఃకరణమును, పాయఁ=విడిచిపోవునట్లు, తెల్పెదఁ=తెలియఁజెప్పెదను, ఎల్లవ్యాప్తికపంక్తికిఁ=జ్ఞానేంద్రియ కర్మేంద్రియాంతరింద్రియముల కన్నిఁటికిని, సముజ్జ్వలబోధము-సముజ్జ్వల=సాధనాంతరాపేక్షలేక మిగుల వెలుఁగుచున్న, బోధము=వస్తుతత్త్వజ్ఞానము, అంతర్హృదయమనుట రాజమై=శ్రేష్ఠమై, నిజేచ్ఛఁ=స్వేచ్ఛగాను, లోవెలిఁ=లోపలనుపైన, సంచరించుఁ=తిరుగుచుండుట, ఆస్ఖలితప్రచారములు=అమనోజ్ఞములైన సంచారములే, బుద్ధిమనంబులై=బుద్ధి యని మనస్సని, తగుఁ=ఒప్పును.

తా. ఓయిశిష్యుఁడా! వాక్కునకు అందును అందదు అనియు, మనస్సునకు అందును అందదు అనెడి సందేహముల రెంటిలో వాక్కునకు అందును అందదు అను సంశయమును తీర్చితిని. అనఁగా నిదిగా దిదిగాదని అందనిదానికి తలయూఁచుటయును అందినదానికి ఊరకయుండుటయు ననుట. మనస్సునకు అందును అందదు అను రెండవ సందేహము నీయంతఃకరణమందు తోఁచుగులాగున తెలియఁజేయఁదలఁచి ముందుగా మనస్సుయొక్క స్వరూపోత్పత్తినిదెలియుటకుఁగాను జ్ఞానకర్మేంద్రియముల కన్నిఁటికిని మిక్కుటముగా ప్రకాశించుచున్న తత్త్వజ్ఞానమనునది శ్రేష్ఠమై అంతరబాహ్యములయందు దీనిప్రకాశము దీపమందును దీపమునకు వెలుపలను నిండియుండునటులు అంతర్హృదయ మను పేరుచేత ఒప్పియుండును. ఆ ఉభయసంచారములే బుద్ధియనియు, మనస్సనియు చెప్పఁబడునని తాత్పర్యము. ఉభయసంచారములనఁగా, ఒకమనుష్యుఁడు ఒక కార్యము నుతలఁచి అక్కార్యార్థమై ఇంటినుండి బయలువెడలుట మనస్సుగాను, ఆ కార్యముతీరఁగనే ఇంటికట్టు తిరిగిపోవుట బుద్ధిగాను సామ్యములుగాఁగైకొని బ్రహ్మములోనుండి బహిర్గతమైన జగద్వ్యాపారము మనస్సనియు, తిరుగా బ్రహ్మజ్ఞానముఁజెంది బ్రహ్మములో నైక్యమగుట బుద్ధియనియు గ్రహింపనగును. అనఁగా జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు, అంతరింద్రియములు అనెడు పదునాలుగు ఇంద్రియములకంటె బ్రహ్మజ్ఞానము శ్రేష్ఠమై స్వేచ్ఛగా ఆత్మాకారాకారిత వృత్తిరూపముగాను, ప్రపంచాకార వృత్తిరూపముగాను సంచరించును. ఆ బ్రహ్మజ్ఞానము ఆత్మాకారాకారితరూపమైనపుడు బుద్ధియని ప్రపంచాకార వృత్తిరూపమైనపుడు మనస్సనిపేరు గలదియు నగునని భావము.

అవతారిక.—ఆచార్యుఁడు శిష్యునికి వివేకస్వరూప మిట్టిదియని తెలియఁజేయుచున్నాఁడు.

చ. ముకురమునందు వెల్గుదన మోముగతిన్మదియందుఁ జిన్మయా
త్మకమగు ఛాయదోఁచుఁదగఁ తత్స్ఫూర్తియొప్పు ప్రసన్నవృత్తిదా

నికి సువివేక మంచు మహామనీయులు శాస్త్రచయంబునందు నా
మకరణ మాచరించిరి కుమారక దాని గ్రహింపు మాత్మలోన్. ౧౩

టీ. కుమారక=కుత్సితములైన కామక్రోధలోభాద్యంతశ్శత్రువులను నశింపఁజేసిన ఓశిష్యుఁడా, ముకురమునందున్=అద్దమునందు, వెల్గు=ప్రకాశించునట్టి, తనమోముగతిన్=తనముఖప్రతిబింబమువలెనే, మదియందున్=అంతఃకరణమందు, చిన్మయాత్మకమగుఛాయ=చిద్రూపమైన పరబ్రహ్మముయొక్క ఛాయ, తోఁచున్=ప్రతిఫలించును, తత్స్థితిన్=ఆ పరబ్రహ్మఛాయపడినమార్గమందు, ప్రసన్నవృత్తి=నిర్మలమైనవృత్తి, ఒప్పున్=(ఆయంతఃకరణమందు) ప్రకాశించును, దానికిన్=ఆనిర్మలవృత్తికి, సువివేకమంచున్=విజ్ఞానమని అపరోక్షజ్ఞానమని, మహామనీయులు=బ్రహ్మవేత్తలు, శాస్త్రచయంబునందున్=వేదాంతశాస్త్రసమూహమునందు, నామకరణము=పేరుపెట్టుటను, ఆచరించిరి=చేసిరి, ఆత్మలోన్=నీహృదయమందు, దానిన్=ఆ యభిప్రాయమును, గ్రహింపుము=తెలిసికొనుము.

తా. ఓ శిష్యుఁడా! అద్దమునందుతోఁచునట్టి ముఖప్రతిబింబమువలెనే అంతఃకరణమందు చిద్రూపమైన పరబ్రహ్మముయొక్క ఛాయ ప్రతిబింబించును. ఆమార్గమందే నిర్మలవృత్తి అంతఃకరణమందు తోఁచును. దానికి పండితులు వేదాంతశాస్త్రములయందు అపరోక్షజ్ఞానమని పేరుపెట్టిరి. కావున దీనిని నీ అంతఃకరణమందు గ్రహించుకొను మని తాత్పర్యము.

ప్రసన్నవృత్తియనఁగా అపరోక్షజ్ఞానము. ‘‘ప్రజ్ఞానంబ్రహ్మ’’ ‘‘బ్రహ్మమాత్రమస్స్మహి’’ అను శ్రుత్యర్థములచొప్పున బ్రహ్మ మొక్కటితప్ప వేఱొండులేదని స్ఫురించుచున్నది గాన అంతఃకరణము వేఱుగను, బ్రహ్మమువేఱుగను సందేహములఁ జెందక యుండునటులు సూర్యునియందుఁగల ఉష్ణ,వర్ష,హిమకిరణముల మూఁటిలో వర్షకిరణము బహిర్గతమైనప్పుడు గుంటలు, బావులు, నదులు, సరస్సులు మొదలైనవిగా నేర్పడి ఆ సూర్యకాంతిచేత వానినిమాపి మరల వానిలో నాసూర్యబింబము ప్రతిఫలించి ఉష్ణకిరణములచేత నీరు ఇంకఁగనే ఆబింబము సూర్యునియందులీనమైనట్లు పరబ్రహ్మమందలిచిచ్ఛాయ బహిర్గతమై బహుప్రకారములుకాఁగా ఆవృత్తియందుతోఁచిన నిర్మలమైన బ్రహ్మచ్ఛాయ సాత్త్వక, రాజస, తామసాది గుణభేదములవలన సంశయభావన, అసంభావన, విపరీతభావనలనెడి త్రివిధభావనలతోఁగూడి లోకవ్యవహారాదులనడపుచు త్రిగుణశూన్యంబై కేవలసత్త్వమైన అపరోక్షజ్ఞానములో సముద్రములో లేచిన అలలు సముద్రములోనే అణఁగిపోయినట్లు లీనమగుచున్నదని భావము. అట్టిజ్ఞానమునకు సువివేకమని పేరు.

అవతారిక.—అంతఃకరణవృత్తియే లోకమందలి సకలవస్తుస్వరూపము లని ఆచార్యుఁడు శిష్యునికి తేటమాటలతో బోధపఱుచుచున్నాఁడు.

చ. కరఁగినపంచలోహమయకంబఖిలాకృతులైనమాట్కిఁ, గో
చరమగువృత్తి దా వెలయు సర్వములై చిదభాసభానుచే
నరయ వచింపఁ జూప నగు నాయఖిలంబిల నేత్రదీపము
లొనరిదిగ లేకయున్నఁ గనఁ జొప్పడవంధతమోగతార్థముల్. ౧౪

టీ. ఇలన్=భూమియందు, కర...కంబు-కరఁగిన=నీరుగాఁగాఁచిన, పంచలోహమయ=బంగారు, వెండి, రాగి, ఇనుము, తగరము అనెడి పంచలోహములయొక్క, కంబు=జలము, అఖిలాకృతులైనమాట్కిన్-అఖిల=సమస్తమైన, ఆకృతులు=విగ్రహములు మొదలైనరూపములు, ఐనమాట్కిన్=అయినవిధమున, తాన్=తానైన, గోచరమగు వృత్తి=పుట్టినశుద్ధవృత్తి, (సంకల్పము అనుట) సర్వములై=దేవ తిర్యఙ్మనుష్యాదిప్రాణి సంఘములతోఁగూడిన ప్రపంచమై, వెలయున్=ప్రకాశించును, చిదభాసభానుచేన్=చిదాభాసునిచేతను, అనఁగా జీవునిచేత, ఆ యఖిలంబు=(ఆణవ, మాయిక, కార్మిక,) ప్రపంచమంతయు, అరయన్=విచారింపఁగా, వచింపన్=చెప్పుటకును, చూపన్=చూపుటకును, నేత్రదీపములు=కన్ను, దీపము-అగున్=అగును, ఒనరిదిగన్=చక్కఁగా, లేకయున్నన్=ఆ నేత్రము దీపము లేనియెడల, అంధతమోగతార్థముల్-అంధతమః=కటికచీఁకటియందు, గత=పడిన, అర్థముల్=పదార్థములు, కనన్=తెలిసికొనుటకు, చొప్పడవు=అనుకూలింపవు.

తా. బంగారు, వెండి, రాగి, ఇనుము, తగరము అనెడు పంచలోహములు కరఁగిన నీరు అచ్చులయందుఁ బోయఁబడి విగ్రహములు, పూజాపాత్రములు మొదలైనవి ఏర్పడినవిధముగనే పరబ్రహ్మచ్ఛాయవలన కలిగిన వృత్తి మలినసత్త్వప్రధానముయొక్క త్రిగుణవికారములతోఁ జేరుకొని స్థావరములు, క్రిములు, జలచరములు, పక్షులు, పశువులు, నరులు సురలు మొదలైన ప్రాణులతోఁగూడిన ప్రపంచరూపముగఁ బరిణమించెను. కటికచీఁకటిలోని వస్తువులను దీపసాహాయ్యమువలన నేత్రము తెలిసికొన్నట్టుగానే శుద్ధసత్త్వవృత్తి సహాయముగలజీవుఁడు పంచమహాభూతములను వానివలనఁబుట్టిన ఘటపటాది సకలపదార్థములను దెలిసికొనుచున్నాఁడని తాత్పర్యము. అనఁగా శిల్పి పంచలోహములనుఁ గూర్చి కరఁగిపోసిననీరుచేఁ గావింపఁబడినపీఠము, దానిపైని వాహనము, ఆవాహనముపైని విగ్రహముచందమున స్థావర, జలచర, క్రిమి, పశు, పక్షి జన్మములే పీఠముగాను, మానుషశరీరములే దానిపై వాహనముగాను, దేవశరీరములే దానిపై విగ్రహముగాను, అశుద్ధసత్త్వప్రధానవృత్తియే సకలపదార్థములైనవియనియు, అశుద్ధసత్త్వాధిష్ఠాన పరబ్రహ్మమే శిల్పియనియు గ్రహింపవలయును.

అవ:—ఫలరూపముగాను వృత్తిరూపముగాను పరిణమించెడి మనస్సుయొక్క స్వరూపలక్షణము ఇచ్చట వివరింపఁబడుచున్నది.

ఉ. చేకొన రెండు గావలయుఁ జీఁకటి ద్రవ్యము నేత్రదీపము
ల్లోకము వెల్గఁజేయు రవి లోచన మొక్కటె కానఁ జాలు సు
శ్లోక జగంబుఁ జూడ ఫలశుద్ధమనోగతవృత్తు లీగతి
న్ప్రాకటవృత్తి యొండెదగు బ్రహ్మపదంబు నెఱుంగ నెంతయున్.

టీ. సుశ్లోక = కీర్తిమంతుఁడవైనకుమారా, చీఁకటిన్ = కటికచీఁకటియందు, ద్రవ్యమున్ = పదార్థమును, చేకొనన్ = గ్రహించుటకు, నేత్రదీపములు = లోచనము దివ్వె, రెండున్ = రెండువస్తువులును, కావలయున్ = కలిగియుండవలయును, లోకము వెల్గఁజేయురవిన్ = జగత్తును బ్రకాశింపఁజేసెడి సూర్యుని, కానన్ = కనుటకు, లోచనము = కన్ను, ఒక్కటె = ఒక్కటియే, చాలున్ = చాలును, ఈగతిన్ = ఈప్రకారము, జగంబున్ = లోకవ్యవహారమును, చూడన్ = చూచుటకు, ఫలశుద్ధమనోగతవృత్తులు - ఫల = చిదాభాసుఁడును, శుద్ధమనోగతవృత్తులు = పరిశుద్ధమైన అంతఃకరణమందలివృత్తియును, (కావలయును) బ్రహ్మపదంబున్ = బ్రహ్మస్థానమును, ఎఱుంగన్ = తెలిసికొనుటకు, ఎంతయున్ = మిక్కిలి, ప్రాకట = ప్రసిద్ధమైన, వృత్తి = అంతఃకరణవృత్తి, ఒండె = ఒక్కటె, తగున్ = చాలియుండును.

తా. యశోవంతుఁడవైన కుమారా! కటికచీఁకటియందున్న పదార్థమును గ్రహించుటకు కన్ను, దీపము అను రెండువస్తువులు కావలయును. లోకమునంతయు ప్రకాశింపఁజేయునట్టి సూర్యుని చూచుటకు కన్ను ఒక్కటేచాలియుండును గాని దీపముతో నక్కఱలేదు. ఆప్రకారమే లోకమందు పటాటోపముగా సంచరించవలయునను తలంపు గలవానికి ఫలమను పేరుగల చిదాభాసుఁడును, అంతఃకరణమందలి అపరోక్షమునువిడిచిన బహిర్వ్యాపారవృత్తియును కావలయును. వస్తుయాథార్థ్యమును దెలిసికొనుటకు తలంపు ఒక్కటియే చాలునని తాత్పర్యము. ఇందుకు దృష్టాంతము. ఒక మనుజుం డేదైన నొక కార్యంబుఁ జేయవలెననెడి కోరకను జెందె నేని వానికోరిక కొనసాగించుటకు మనోవృత్తియు ఫలమును కావలయును. ఇచ్చట ఫలమనఁగా ద్రవ్యసాహాయ్యము మనుష్యసాహాయ్యము దేహబలిమియని యర్థము. దీనికే చిదాభాసుఁడనిపేరు. పరబ్రహ్మమును దెలిసికొనుటకు మనోవృత్తి యొక్కటియే చాలియుండునని భావము.

అవ:___మనస్సుయొక్క వృత్తిస్వరూపమునకె పరబ్రహ్మంబు గోచరంబనిగురుం డురూఢిపఱచుచున్నాఁడు.

మ. ఫలవృత్తిద్వయరూప మంచు మది సంభాషింతు రాత్మజ్ఞు లా
ఫలమజ్ఞానమయంబు తన్మనముచే బ్రహ్మంబు రా దండఁ గే

వలవిజ్ఞానమయంబు వృత్తి సుత తత్స్వాంతంబుచే నందు నేఁ
దెలియం జెప్పితి నిట్టు లాయుభయసందేహంబులుం దీఱఁగన్.

టీ. సుత=కుమార, ఆత్మజ్ఞులు=ఆత్మజ్ఞానులు, మదిన్=మనస్సును, ఫలవృత్తిద్వయరూపమంచున్- ఫల=చిదాభాసుఁడును, వృత్తి=అంతఃకరణవృత్తియును, ద్వయ=ఈరెండువిధములుగల, రూపమంచున్=రూపముకలదియని, సంభాషింతురు=చెప్పుదురు, ఆఫలము=చిదాభాసస్వరూపమైనమనస్సు, అజ్ఞానమయంబు=అజ్ఞానస్వరూపము, తన్మనముచేన్=ఆచిదాభాసరూపమైనమనస్సుచేత, బ్రహ్మంబు=పరబ్రహ్మము, అందన్=పొందుటకు, రాదు=కూడదు, వృత్తి=వృత్తిరూపమైనమనస్సు, కేవలవిజ్ఞానమయంబు- కేవల=ముఖ్యమైన, విజ్ఞానమయంబు=విశేషజ్ఞానస్వరూపము, తత్స్వాంతంబుచేన్=అట్టివృత్తిరూపమైనమనస్సుచేత, అందున్=(పరబ్రహ్మతత్త్వము)అందును, ఏన్=నేను, ఇట్టులు=ఈప్రకారము, ఉభయసందేహంబులున్=మనస్సున కందును అందదు అను రెండువిధములైనశంకలు, తీఱఁగన్=తీఱునట్లు, తెలియన్=తెలిసికొనునటులు, చెప్పితిన్=బోధపఱిచితిని.

తా. కుమారా! నిత్యానిత్యవస్తువును తెలిసికొనినపండితులు మనస్సుఫలమనియు, వృత్తియనియు, రెండువిధములుగ నుండుననియు, వానిలో ఫలరూపమైనమనస్సు అజ్ఞానస్వరూపముగుటవలన అట్టిమనస్సునకు యథార్థవస్తువు కనఁబడదు. వృత్తిరూపమైన మనస్సు పరోక్షమునువిడిచిన అపరోక్షజ్ఞానస్వరూపము గనుక అట్టివృత్తిరూపమైన మనస్సునకు బ్రహ్మస్వరూపము అందుననియు వచింతురు. వేదము ఒకస్థలమందు బ్రహ్మస్వరూపము మనస్సునకు అందుననియు, మఱియొకస్థలమందు అందదనియు చెప్పిన రెండు సందేహముల నేను నీకుఁ దెలియఁజేసితినని తాత్పర్యము.

అవ:—ముందుచెప్పిన ప్రశ్నోత్తరములకు గోచరాగోచరములు లేకయుండుశుద్ధబ్రహ్మమైన స్వానుభూతి తానని తెలిసి యందుదయించిన మనస్సు దానియందుఁ గలియుటకొఱకు శిష్యుండు ప్రశ్నచేయుచున్నాఁడు.

చ. అఱమఱ లేనివేడ్కఁ బరమార్థముఁ దెల్పితి వేను గంటి నా
తెఱఁగు నజస్రమానసము దేశిక యుయ్యెలఁ బోలు నింక నా
మొఱయొక టాలకింపు మది మోహముఁ బాసి నివాతదీపమ
ట్లెఱుక నఖండమై కలియు నెన్నఁడొ యప్పుడె నిష్ఠయౌఁ గదా.

టీ. దేశిక=గురుస్వామీ, అఱమఱలేనివేడ్కన్= భేదములేనియానందముతో, పరమార్థమున్= పరబ్రహ్మస్వరూపమును, తెలిపితివి=ఉపదేశించితివి, ఆ తెఱఁగున్=

అమార్గమును, ఏను=నేను, కంటిన్ = తెలిసికొంటిని, అజస్రము=ఎల్లప్పుడు, అమన ము=అమనస్సు, ఉయ్యెలంబోలెన్=ఉయ్యెలవలె ముందు వెనుకకు నూగునటుపోలియుండును, ఇంకన్=ఇంకను, నావిజ్ఞప్తి=నావిన్నపము, ఒకటి=ఒండు, ఆలకింపుము=వినుము, అది=అమనము, నిర్వాతదీపమట్లు=గాలిలేమిచే నాడకుండు దీపకళికవలె, మోహాముంబాసి=జీవేశ్వరజగద్భ్రమనువిడిచి, అఖండమై=పరిపూర్ణమై, ఎఱుకన్= తెలివియందు, కలియుట=ఐక్యమగుట, ఎన్నఁడో=ఎప్పుడో, అప్పుడెగదా=అకాలమందేకదా, నిష్ఠ= సమాధియందలియునికి, ఔన్=అగును.

తా. గురుస్వామీ! పలుమాఱు ప్రశ్నఁజేయుచున్నాఁడనెడు అయాసములేక అభేదమైనసంతోషముతో ఐక్యయాథార్థ్యమును తెలియఁజెప్పితివి. నేను మీరుపదేశించిన మార్గమునుదెలిసికొంటిని. ఐనను మనస్సు ఉయ్యెలవలె ముందునకు వెనకకు ఊఁగుచుండునదిగనుక నా విజ్ఞాపనమొకటి ఆలకింపవలయును. గాలిలేని దీపకళికవలె జీవేశ్వర జగద్భ్రమలవిడిచి పరిపూర్ణమైనఁగదా సమాధి. అట్టిమనస్సుగదా తెలివియందు ఐకమత్యమునుపొందును. అది ఎవ్విధముగా నెఱుఁగఁదగునో అనుగ్రహింపుమని తాత్పర్యము.

అ:—ఆచార్యుఁడు మనస్సునందలి త్రిగుణములను వానిచేతఁగలిగెడిప్రయోజనమును జెప్పుచున్నాఁడు.

చ. త్రిగుణము లుల్లమం దెపుడుఁ దేజరిలుఁ దగ నొండు వానిలో
మిగిలిన రెండడంగు ననిమేషవిభూతులఁ గల్గఁ జేయు స
త్త్వగుణముఁ జెందఁ జేరినఁ ద్రివాసన లొప్పు రజోగుణంబు వే
దగులఁ దమంబు గల్గు సుత దైత్యవిభూతులు మాను మామసన్.

టీ. సుత=కుమారా, త్రిగుణములు=సత్త్వరజస్తమోగుణములుమూఁడును, ఎపుడున్=ఎల్లప్పుడును, ఉల్లమందున్=మనస్సునందు, తగన్=తగినట్లు, తేజరిలున్=ప్రకాశించుచుండును, వానిలోన్=ఆ మూఁటిలో, ఒండు=ఒక్కటి, మిగిలినన్=ముందుమించిన, రెండు=తక్కినరెండు,అడంగున్=దిగువనణఁగియుండును, సత్త్వగుణముఁజెందన్=అమనస్సునందు సత్త్వగుణముచెందెనేని, అనిమేషవిభూతులఁగల్గఁజేయున్=దైవసంపదలుగలిగించును, రజోగుణంబు=రజోగుణము, చేరినన్=(ఆ మనస్సునందు) కూడెనేని, త్రివాసనలు=(శాస్త్రవాసన, లోకవాసన, దేహవాసనలనెడి)మూఁడువాసనలు, ఒప్పును=అమరియుండును, వే=వేగముగా, తమంబు=తమోగుణము, తగులన్ = సోఁకెనేని, దైత్యవిభూతులు=అసురసంపదలు, కల్గున్=కలిగియుండును, ఆ మసన్=ఆ మోహమును, మాను=విడువుము.

తా. కుమారా! సత్త్వరజస్తమోగుణములు మూఁడును మనస్సునందు ఎప్పుడును విడువక ఒకదానివెంబడి యొకటిగా ఎక్కుచు దిగుచునుండును. ఆమూఁటిలో నొకటి ముందుమించి చేరినిలిచిన కడమ రెండును దిగువ నణఁగియుండును. కనుక మనస్సు సత్త్వగుణము చేరినప్పుడు శాంతవృత్తిగలదియై దైవసంపదలు కలిగియుండును. రజోగుణము చేరినయెడల ఘోరవృత్తిగలదియై మానుషసంపదలైన శాస్త్రవాసన, లోకవాసన, దేహవాసనలనెడు త్రివాసనలు గలిగియుండును. తమోగుణముచేరినయెడల మూఢవృత్తియై ఆసురసంపదలైన రాగద్వేషాదులు నిద్రామాంద్యాదులు గలిగియుండును. కాఁబట్టి మనస్సు శుద్ధసత్త్వస్వరూపమే కాని చపలమైనది కాదని తాత్పర్యము.

విభూతులు అనఁగా సంపదలు. అవి దైవసంపద, మానుషసంపద, ఆసురసంపద అని త్రివిధములు. సత్త్వగుణముతోఁగూడిన శాంతము, మర్యాద, ధర్మగుణము, తత్త్వవిచారము, పెద్దలసేవఁజేయుట మొదలగునవి దైవసంపద మానుషసంపద యనఁగా రజోగుణముతోఁగూడిన పటాటోపము దేహమే తాననుకొని స్నానసంధ్యా జపాద్యనుష్ఠానముల యథాకాలమున తప్పక చేయుటచే గొప్పతనముపొందుటయు, వేదశాస్త్రపురాణాదులనుచదివి నలుగురిలో పెద్దతికమును సంపాదించుకొనుటయు, లోకము తన్ను పొగడుకొనవలయుననుకోరికతో డంబమునకై చేయు యజ్ఞాదికర్మములవలనఁగలిగెడి సోమయాజులు మొదలయిన నామములు పెట్టుకొనుటయు లౌకికబిరుదులఁ బొందుటయు మొదలగునవి. ఆసురసంపదయనఁగా ఒకరిని హింసించుట, దూషించుట, ముచ్చుతనము, వ్యభిచారము, ఓర్వలేనితనము, నిద్ర మాంద్యములోనగు తమోగుణసంబంధముగల కార్యములు, వీనితోఁగూడిన వాసన అసురవాసన యనఁబడును. అసురవాసనయనఁగా తాము గొప్పవారుగాను, జ్ఞానులుగాను, తపస్వులుగాను, మంత్రవేత్తలుగాను, సర్వకార్యములయందును నిపుణులుగాను ప్రకటనఁజేయుచు ఇతరులను నిర్లక్ష్యముగ మాటలాడుచు ఎవ్వరిని సడ్డచేయక తమకుఁగల మహిమలు పూర్వకాలమందును ఎవ్వరికిని లేవనియు తమకెవరు శుశ్రూషఁజేయుదురో వారే కృతార్థులనియు, సమస్తమును తమకెవరు సమర్పింతురో వారికి జన్మములులేవనియు, అట్టివారికి సర్వపాపములు తొలఁగిపోవుననియు, త్రికరణశుద్ధిగాఁ దమ్మును ఆరాధించువారికి సకలసంపదలు కలుగుననియు, మొదలగు అనర్థహేతువులతోఁ గూడికొనిన చిత్తవృత్తి. ఇది ఆత్మజ్ఞానమునకు ప్రతిబంధముగనుక ముక్తియందు శక్తిగలవారు ఈ అవ్యక్తచిత్తవృత్తిని విడువవలయును. దీనిని విడిచిననేకాని శ్రవణమనననిదిధ్యాసములకు ప్రయోజనములు కలుగదు.

వాసనాత్రయవివరణము:—వాసన లోకవాసనయని, శాస్త్రవాసనయని, దేహవాసనయని మూఁడువిధములు.

లోకవాసనయనఁగా: లోకులందఱిచేత తాను సదా కొనియాడఁబడవలయును. తా నెవరిచేతను నిందింపఁబడక ఉండవలయును అనెడి చిత్తవృత్తికలిగి దాని కనుగుణములగు కార్యములు చేయుచుండుట.

దేహవాసనయనఁగా: శరీరమే తాననుకొని ఆ శరీరమునశింపక చిరకాలము నిల్వవలయునను అపేక్షకలిగి పుణ్యతీర్థములలో స్నానముచేయుటయందును, ఉపవాసములు చేయుటయందును, యోగాభ్యాసము మొదలగువానిని చేయుటయందును అక్కఱకలిగియుండుట.

శాస్త్రవాసనయనఁగా: శాస్త్రములనుచదువుట, దానియర్థమును విచారణచేయుట, శాస్త్రసిద్ధాంతమందు సాకల్యముగ ప్రజ్ఞసంపాదించి ప్రవీణుఁడుగ నుండఁగోరుట, ఈ త్రివిధవాసనలయందలి అపేక్షలు. ముముక్షువులు ఉపేక్షింపవలయును. ఎందుకనఁగా రావణాదిరాక్షసులు చిరకాలము బ్రతుకవలయుననియును, లోకులందఱు తమ్మును పూజించి కొనియాడవలయుననియును, తామే అధికులుగ నుండవలయుననియును, ఎన్నరాని కోరికలఁగోరి వానికై వలయుప్రయత్నములఁజేసి చిట్టచివరకు మడిసిరి గనుకను నారద భారద్వాజాదిమహర్షులు వేదశాస్త్రములు సమగ్రముగఁ జదువవలయునని తలఁచి ఉపక్రమించి బహుశ్రమలఁబడి తుదకు సాధ్యముకాదని విడిచిరి గనుకను వేదాంతశాస్త్రేతర శాస్త్రాభ్యాసము ఆత్మవిచారణకు అనుకూలముగానందువలనను అవి మోక్షమునకు ప్రతిబంధకములగుటవలనను అనర్థహేతువులని తలఁచి వానిని వదలవలయునని భావము.

అవ:—చిదంశమైన సత్త్వగుణము శేషించినను మనస్సు చిత్తునందుకదలక నిల్చునని ఆచార్యుఁడు చెప్పుచున్నాఁడు.

ఉ. స్వాంతము సత్త్వరూపము రజంబుఁ దమంబును దానియందు సం
క్రాంతము లైనఁ బాయు నొకకాలమున న్వెడలింపఁ గాన నా
శాంతమనంబున న్దొలఁగు చంచలదృశ్యము లంత నాత్మ వి
శ్రాంతిని బొందుఁ దన్మనము సజ్జన నిర్మలఖంబుపోలికన్. ౧౯

టీ. సజ్జన=సాధువృత్తిగలశిష్యుఁడా! స్వాంతము=మనస్సు, సత్త్వరూపము=శుద్ధసత్త్వగుణరూపము (అగును) రజంబున్=రజోగుణమును, తమంబున్=తమోగుణమును, దానియందున్=ఆమనస్సునందు, సంక్రాంతములైనన్=కూడిన, వెడలింపన్ (భక్తివైరాగ్యనిష్ఠలచేత) వెడలఁగొట్టిన, ఒకకాలమునన్=ఒకసమయమందు, పాయున్=విడుచును, కానన్=కాఁబట్టి, అశాంతమనంబునన్=అప్రసిద్ధమైన శాంతవృత్తితోఁగూడిన మనస్సునందు, చంచలదృశ్యములు=చలనరూపములైన జీవేశ్వరజగద్రూపదృశ్యములు,

తొలఁగున్ = పాయును, అంతన్ = అపిమ్మట, ఆత్మన్ = ప్రత్యగాత్మయందు, తన్మనము = ఆమనస్సు, నిర్మలఖంబుపోలికన్ = (మేఘములువిడిచి) స్వచ్ఛముగానుండెడు ఆకాశము వలె, విశ్రాంతినిబొందున్ = విరామమునుబొందును.

తా. సాధువృత్తిగల శిష్యుఁడా! మనస్సు శుద్ధసత్త్వరూపముగలది. అది సత్త్వగుణము, రజోగుణము, తమోగుణము అనెడి ప్రకృతియొక్క త్రిగుణములఁగూడిన శాంత, ఘోర, మూఢవృత్తులు గలదియగును. ఆమనస్సు శాంతవృత్తి యగు భక్తి, వైరాగ్యము, ఉపశాంతి మొదలైనవానితోఁ గూడినప్పుడు చలనరూపములైన జీవేశ్వర జగద్రూప దృశ్యములు తొలఁగి పిమ్మట ప్రత్యగాత్మయందు మేఘములు విడిచిన నిర్మలాకాశము వలె నైక్యమును పొందునని తాత్పర్యము.

స్వాంతము అనఁగా శుద్ధసత్త్వస్వరూపమైనమనస్సు అది సత్త్వరజస్తమోగుణములయొక్క వికారములనుండి విడుదలఁజెందినది. సత్త్వగుణమనునది = తెలుపు, రజోగుణమనునది = ఎఱుపు, తమోగుణమనునది = నలుపు, వీనిమూఁటికిని దేహముయొక్క క్రిందినడిమి పైభాగములరీతిని ఒకదానికొకటి సంబంధము కలిగియుండును. ఈమూఁడును ఒకదానివెంబడినొకటి మనస్సుపైన తిరుగుచుండును. ఆ మనస్సు శుద్ధస్ఫటికమువంటిది. దానిపైన ఎఱ్ఱడాలుకొట్టినపుడు ఎఱ్ఱరంగుకలదిగాఁ గనఁబడును. నల్లడాలుతగిలినపుడు నలుపువర్ణముకలదిగాఁదోఁచును. తెల్లనికాంతిగల తుల్యపదార్థమును నిలువఁబెట్టినపుడు ఆకాంతి తన స్వభావకాంతియే గనుక దానియందు లీనమగుచున్నది. తెల్లనిరంగువంటి సత్త్వగుణమును తెల్లని మనస్సుపైన స్ఫటికముపైన తెల్లని పుష్పమును ఉంచినచొప్పున దైవసంపదలచే నిలిపినప్పుడు వరుసగా నొకదానివెంబడినొకటి తిరుగుచునుండెడి రజస్తమోగుణములు నిలువనీయలేక నశించును ఆరెండుగుణములు నశింపఁగానే వానిలో చేరిన సత్త్వమును నశించును. అప్పుడు శుద్ధసత్త్వమైనమనస్సునిలుచును. ఆమనస్సు పరబ్రహ్మముతో నైక్యమగునని భావము.

అవ:— త్రిగుణరహితమైన శుద్ధసత్త్వస్వరూపమగు మనస్సునకు నామరూపములతోఁగూడిన ప్రపంచవికారములు తోఁచవని శిష్యునకుఁ దెలియఁజేయుచున్నాఁడు.

ఉ. నిద్దపునిల్వుటద్దములనీడలు రెండొకఁడై తనర్చున
ట్లొద్దిక శుద్ధసత్త్వమగునుల్లము బ్రహ్మముతోడఁ గూడి యే
ప్రొద్దెడఁబాయకుండి పరిపూర్ణము ఖాఖలచిహ్నాయుక్తమై
తద్దయు నొప్పు దృశ్యసముదాయము లెచ్చటఁ దోఁచుచుండెడిన్.

టీ. నిద్ద...నీడలు - నిద్దపు = నిర్మలములైన, నిల్వుటద్దముల = ఉన్నతములగు గొప్ప అద్దములయొక్క, నీడలు = ఛాయలు, అనఁగా (అన్యోన్యప్రతిచ్ఛాయలు) రెండును = రెండును,

ఒక్కఁడై = ఒక్కటియై, తనర్చున్ = ప్రకాశించును, అట్లు = ఆప్రకారము, ఒద్దికన్ = ఐకమత్యముతోడ, శుద్ధసత్త్వమగు నుల్లము = త్రిగుణరహితమైనపరిశుద్ధస్వరూపమగు మనస్సు, బ్రహ్మముతోడన్ = పరబ్రహ్మముతో, కూడి = చేరి, ఏప్రొద్దున్ = ఏకాలమందును, ఎడఁబాయకుండి = విడువకయుండి, పరి...యుక్తమై - పరిపూర్ణ = పరిపూర్ణమే, ముఖ = మొదలుగాఁగల, అఖిల = సమస్తములైన, చిహ్న = సద్రూపత్వ చిద్రూపత్వ ఆనందరూపత్వనిత్యత్వ నిర్మలత్వములనెడి పంచలక్షణములతోడ, యుక్తమై = కూడినదై, తద్దయున్ = మిక్కిలి, ఒప్పన్ = ప్రకాశింపఁగా, ఎచ్చటన్ = ఏచోటను?, దృశ్యసముదాయములు = అనృతజడదుఃఖాత్మకమైన ప్రపంచముయొక్క వికారములు, తోఁచుచుండెడిన్ = స్ఫురించెడిని?, అనఁగా తోఁచవనుట.

తా. కళంకరహితములయిన నిలువుటద్దములను ఒకదానికొకటి మాపించునపుడు ఆరెండద్దముల ఛాయలును ఒక్కటియై ప్రకాశించెడురీతిగా ఐకమత్యముతోఁ ద్రిగుణరహితమైన శుద్ధసత్త్వస్వరూపమగు మనస్సు పరబ్రహ్మముతోఁజేరి ఏకాలమందును ఎడఁబాయకుండి బ్రహ్మపంచలక్షణములతో కలసినదైయుండఁగా నామరూపములతోఁగూడిన ప్రపంచవికారములు ఎచ్చటఁదోఁచునని తాత్పర్యము. అనఁగా — ప్రకాశస్వరూపమైన దీపమునుండి బైలువెడలినకాంతి ఘటపటాదివస్తువులను గనంబఱచి పిదప తన్నుఁజూపి ఆకాంతి తనయందే లీనమైనట్లు సత్తునందున్నచిత్తు మఱల తననిజస్వరూపమును ఎఱిఁగి సచ్చిదానంద పరబ్రహ్మమునందు లీనమగుచున్నది. కాన నట్టి శుద్ధసత్త్వమైనమనస్సునకు నీటిలో నీరును, పాలలో పాలును, నేతిలో నేయినిఁ గలిపినను, లేక ఎఱ్ఱని, తెల్లని, నల్లని ఆవులపాలనునొక్కటిగా కలిపినను, ప్రత్యేకించి ఇవి ఎఱ్ఱఆవుపాలు, ఇవి తెల్లఆవుపాలు, ఇవి నల్లఆవుపాలు అనికాని, ఇవి ఈగుంటనీళ్లు, అవి ఆచెఱువునీళ్లు అనికాని ప్రత్యేకించి నిరూపింప శక్యముకానివిధమున నామరూపాదులతోఁగూడిన అనృతజడదుఃఖాత్మకమైన ప్రపంచముయొక్క వికారములు తోఁచవని భావము.

అవతారిక: — ముందు చెప్పినప్రశ్నవలన చిదంశమైనమనస్సు చిద్రూపమే అయినదని తెలిసి జడాంశమైనమనస్సును దానికృత్యమును ఏవిధముగనుండునని తెలిసికొనుటకొఱకు మనస్సుచిత్తునందునశించిన జీవన్ముక్తు లెటులసంచరింతురని అడుగుచున్నాఁడు.

ఉ. డెందము బ్రహ్మమందుఁ దగ డిందిన మే నిల నుండుదన్కఁ బెం
పొంద భుజింతు రైన నవు దుఃఖము గ్రుంకక యుండుఁ గ్రుంకిన
న్మందటి వెల్లఁ గావు మఱి పుట్టిన ముక్తులు గారు వార లీ
సందియ మెల్లఁ దీర్పుమన సద్గురుమూర్తి దొడంగెఁ బల్కఁగాన్. ౨౧

టీ. ఇలన్ = భూమియందు, డెందము = శుద్ధసత్త్వమైనమనస్సు, బ్రహ్మమందున్ = పరబ్రహ్మస్వరూపమందు, తగన్ = లెస్సగాను, డిందినన్ = లీనమైనను, మేను = శరీరము, ఉండువన్నకున్ = ఉండెడుదాఁక, పెంపొందన్ = వృద్ధిపొందుటకుఁగాను, భుజింతురు = బ్రహ్మవేత్తలు అన్నపానాదులను పుచ్చుకొందురు, ఐనన్ = అట్లైన, అపుడు = ఆసమయమందు, ఉల్లము = మనస్సు, క్రుంకకయుండున్ = ఆబ్రహ్మమందు లీనముగాక భిన్నమైయుండును. క్రుంకినన్ = లీనమైనయెడల, ముందటివెల్లన్ కావు = ముందుచెప్పిన క్రియలుకావు, మఱిపుట్టినన్ = ఒకసమయమందణఁగియుండి వెండియు పుట్టినయెడల, వారలు = ఆబ్రహ్మవేత్తలు, ముక్తులుగారు = జీవన్ముక్తులుగారు, ఈసందియమెల్లన్ = ఈసందేహమంతయు, తీర్పవనన్ = తీర్పవలయునని శిష్యుఁడడుగఁగా, సద్గురుమూర్తి = సద్గురుస్వామి, పల్కఁగాన్ = పలుకుటకు, తొడంగెన్ = ఆరంభించెను.

తా. పుడమియందు శుద్ధసత్త్వముగల మనస్సు పరబ్రహ్మస్వరూపమందు నిశ్శేషముగా లీనమైనను శరీరముండునంతదనుక వృద్ధిపొందుటకుఁగాను బ్రహ్మవేత్తలు అన్నపానాదులను పుచ్చుకొందురు గాన నాసమయమున మనస్సు ఆ బ్రహ్మమందు లీనముగాక భిన్నమైయుండును. అట్లు భిన్నముగ నుండనియెడల ముందటిపనులు జరుగవు. లేక ఒక సమయమందు లీనమై మఱియొక సమయమున భిన్నమైన పక్షమందు ఆబ్రహ్మవేత్తలు జీవన్ముక్తులుగారు. కనుక ఈసందేహమంతయు నివృత్తిచేయవలయునని శిష్యుఁడడుగఁగా సద్గురుస్వామి చెప్పనారంభించెనని తాత్పర్యము.

అవతారిక:—ఆ సంశయమునకు ఉత్తరముచెప్పఁబూని యామనోనాశము ఇరుదెఱఁగులుగా నుండునని చెప్పుచున్నాఁడు.

శా. రూపారూపముల న్మనోలయము చారుప్రజ్ఞ ద్వైవిధ్య మౌ
రూపం బందు విముక్తులం దిల మహారూపంబు ముక్తాంగులం
దాపాదింతురు శుద్ధసత్త్వమె తదీయం బైన రూపంబు త
ద్రూపంబుం జెడ లింగభంగమునఁ దాఁ దోఁచుం మహారూపమై.

టీ. చారుప్రజ్ఞ = మనోహరమైనబుద్ధిగలశిష్యుఁడా!, ఇలన్ = భూమియందు, మనోలయము = మనోనాశము, ద్వైవిధ్యమౌన్ = రెండువిధములగును, అందున్ = అందు, రూపంబు = రూపమనుపేరుగలమనోలయమును, విముక్తులందున్ = జీవన్ముక్తులయందును, మహత్ = అతిశయమగు, అరూపంబు = అరూపమనుపేరుగలమనోలయమును, ముక్తాంగులందున్ = విదేహముక్తులయందును, ఆపాదింతురు = పెద్దలుచెప్పుదురు, శుద్ధసత్త్వమే = త్రిగుణరహితమైన సామ్యావస్థయే, తదీయంబైన = ఆ జీవన్ముక్తులయందలి మనోలయమైన, రూపము = స్వరూపమనుపేరుగలది, లింగభంగమునన్ = సూక్ష్మశరీరనాశమందు, తద్రూపంబున్ చెడన్ = ఆ

శుద్ధసత్త్వమునశింపఁగా, మహారూపమై-మహత్=గొప్పయగు, అరూపమై=రూపములే నిదై, తాన్=తాను, తోఁచున్=ఒప్పును.

తా. మంచిబుద్ధిగలశిష్యుఁడా! భూమియందు మనోనాశముస్వరూపమని అరూపమని రెండువిధములు. అందు స్వరూపమనోనాశము జీవన్ముక్తులయందును, అరూపమనోనాశము విదేహముక్తులయందును ఒప్పునని పెద్దలుచెప్పుదురు. ఆత్రిగుణరహితమైన సామ్యావస్థయే ఆ జీవన్ముక్తులయందలి మనోలయమయిన స్వరూపమనుపేరుగలది. సూక్ష్మశరీరనాశమందు అశుద్ధసత్త్వమునశించి రూపములేనిదై కనఁబడునని తాత్పర్యము.

స్వరూపమనోనాశమనఁగా:—రూపముచెడక నాశముఁజెందుట. అగ్నిదగ్ధమైన బట్టమడత చూపునకు రూపము చెడనదిగా కనఁబడుచుండినను ఉపయోగమునకురాదు. కనుక ఆతీరుననే త్రిగుణరహితమైన మనస్సుతోఁగూడిన బ్రహ్మవేత్తలు లోకవ్యవహారములోనున్నను స్వరూపమనోనాశమును పొందుదురు. అరూప మనోనాశము అనఁగా చూపునకు రూపముకలదిగా తోఁచినను స్వరూపము కనఁబడకపోవుట. ముందుచెప్పిన తీరున కాలిన బట్టమడత రూపముకలదిగా కనఁబడినను, గాలికొట్టినపుడు ఎగిరిపోయి ఆరూపము కూడ కనఁబడక పోయినవిధమున బ్రహ్మవేత్తలు ప్రారబ్ధకర్మజమైన స్థూలశరీరములోఁ గూడియుండినపుడు భ్రాంతిజమైన కారణశరీరమును జ్ఞానాగ్నిచేత దగ్ధముచేసినందున ప్రారబ్ధక్షయకాలమందు స్థూలశరీరము శ్మశానాగ్నిచే కాల్చఁబడఁగా సూక్ష్మశరీరమునకు ప్రవేశింప చోటులేక కట్టెలేని నిప్పు క్షీణించిక్షీణించి భస్మమైనలాగున పరబ్రహ్మమందు అరూపలయమై లీనమగుచున్నారు. దీనికే లింగభంగమనిపేరు. ఈలింగశరీరము అను సూక్ష్మశరీరము. స్థూలకారణశరీరములకు నడుమసంచరించునది. ఎట్లనఁగా—స్థూలదేహము నాశనముకాఁగానే అందుండి కారణదేహములో దాఁగుచున్నది. మరల ప్రారబ్ధమును అనుభవించుకాలము సంప్రాప్తమయ్యేనని ఈశ్వరుని నియమముచొప్పున స్థూలశరీరములో ప్రవేశింపఁజేయఁబడి కర్మానుసారిగా సుఖదుఃఖముల ననుభవించుచుండును. కాఁబట్టి యా లింగశరీరమునకు దాఁగ చోటులేకుండునట్టులు బ్రహ్మవిచారముచేసి కారణశరీరమును నశింపఁజేసికొనినవాఁడు స్థూలశరీరముచెడఁగానే ‹‹భిద్యతే హృదయగ్రంథిశ్ఛిద్యంతే సర్వసంశయాః, క్షీయంతే చాస్యకర్మాణి తస్మిన్ దృష్టే పరావరే›› అను శ్రుతిప్రమాణము ననుసరించి హృదయగ్రంథియైన లింగశరీరమునశింపఁగానే సకలసంశయములు నివారణమై బ్రహ్మసందర్శనమై ‹‹బ్రహ్మవిద్ బ్రహ్మైవభవతి›› బ్రహ్మమును దెలిసినవాఁడు బ్రహ్మమే అగునను శ్రుతిప్రమాణముచొప్పున బ్రహ్మములో ఐక్యమగుచున్నాఁడు. ఇట్లని విచారించి శరీరత్రయవిలక్షణుఁడైన ప్రత్యగాత్మ తానని తెలిసికొనినవాఁడు ముక్తుఁడని వేదాంతసిద్ధాంతము.

అవ:—రూపమువీడి అరూపమైన తెలివియందు రూపమైన మనస్సువలన సర్వము ననుభవింపవచ్చునని చెప్పుచున్నాఁడు.

మ. ఋతమౌ నిర్మలసత్త్వమైనమన మాహ్వానామముం బాయు లో
హితకృష్ణద్విగుణంబు లూనమయినన్ హేలాగతిం జెందఁ డా
తతభూతప్రభవిష్యదర్థములకై తాత్కాలికం బందుచున్
హతయుగ్ముం డయి ముక్తుఁడై వెలయు నేయాతంకము న్నైకిలన్.

టీ. నిర్మలసత్త్వమైనమనము-నిర్మల=అత్రిగుణరహితమైన, సత్త్వము=అశుద్ధసత్త్వము, ఐన మనము=ఐన అంతఃకరణము, ఋతమౌన్= (శ్రుతి. ఋతగ్ంసత్యంపరంబ్రహ్మ) సత్యమగును, లోహితకృష్ణద్విగుణంబులు-లోహిత=రక్తవర్ణముగల, కృష్ణ=నీలవర్ణముగల, ద్విగుణంబులు-ద్వి=రెండైన,గుణంబులు=రజస్తమోగుణంబులు,ఊనమైనన్=లోపింపఁగా, ఆహ్వానామమున్=ఆయంతఃకరణమను పేరును, పాయున్=పోవును, అనఁగా, (అమనస్కమనుట) ఆత...లకై-ఆతత=విశేషములైన, భూత=కడచినకాలమందలి,ప్రభవిష్యత్=రాఁగలకాలమందలి, అర్థములకై=ప్రాప్తాప్రాప్తప్రయోజనములనుగూర్చి, హేలాగతింజెందఁడు=అవమానవిలాసములపొందఁడు, తాత్కాలికంబందుచున్-తాత్కాలికంబు=తత్కాలప్రయోజనమును, అందుచున్=పొందుచు, హతయుగ్మండయి=కొట్టఁబడినద్వంద్వములు గలవాఁడై, ముక్తుఁడై=జీవన్ముక్తుఁడై, ఏ యాతంకము న్నైకిలన్-ఇలన్=భూమియందు, ఏయాతంకమున్=ఏయడ్డియు,లేక=లేక, వెలయున్=అబ్రహ్మవేత్త ప్రకాశించును.

తా. అత్రిగుణరహితమైన శుద్ధసత్త్వమను పేరుగల అంతఃకరణము సత్యమగును. ఎఱుపు, నలుపు రంగులుగల రజస్తమోగుణంబులు చెడినను ఆ యంతఃకరణమను పేరును పోవును. కడచిన కాలమందలి రాఁగలకాలమందలి ప్రాప్తాప్రాప్తప్రయోజనములనుగూర్చి ఖేదమోదములఁ జెందక తత్కాలప్రయోజనములఁ బొందుచు ఏయడ్డియులేక ద్వంద్వరహితుఁడై జీవన్ముక్తుఁడుగా ఆ బ్రహ్మవేత్త ప్రకాశించునని తాత్పర్యము.

అవ:—మనస్సు శుద్ధసత్త్వస్వరూపముగా వ్యవహరించినయెడల సమాధి యెట్లొనగూడుననెడు సంశయమునకు గురుండు సమాధానముఁ జెప్పుచున్నాఁడు.

మ. వ్యవహారాన్వితకాల మెల్ల స్వసమాధ్యావాస మానన్నఁ ద
ద్వ్యవసాయంబులు వేఱుగావె మది తత్త్వం బమ్మెయి న్నిల్పునే
వివరింపుం డన నారి నూత్నవిటుతో వేడ్కం బ్రవర్తించి తా
భవనోద్యోగినియై తదుత్సవము సంభాషించు నట్లా సెదన్. ౨౮

టీ. వ్యవ... మెల్లన్-వ్యవహార= లోకవ్యవహారముతో, అన్విత=కూడుకొనిన, కాలమెల్లన్=కాలమంతయు, స్వస...నన్నన్-స్వ=ప్రత్యగాత్మసంబంధమగు, సమాధి=నిర్వికల్పసమాధియొక్క, ఆవాసము=ఉనికి, ఔనన్నన్=ఔననిన, తద్వ్యవసాయంబులు= ఆ వ్యవహారప్రయత్నములు, వేఱుగావె=భిన్నములుగావా, మదిన్=అంతఃకరణమందు, తత్త్వంబు=యథార్థము, అమ్మెయిన్=అదేప్రకారము, నిలుచునే?=నిలుచునా?, వివరింపుండనన్=ఈ సందేహములు దెలియఁజేయుఁడనఁగా, నారి = ఒకానొక కామిని, నూత్నవిటులతోన్ = నవీనపురుషునితో, వేడ్కన్ = సంతోషముగా, ప్రవర్తించి=కలసి, తాన్=తాను, భవనోద్యోగినియై=ఇంటిపనులతోఁగూడినదైనను, ఎదన్=మనస్సునందు, తదుత్సవమున్=ఆ యనుభవించిన సుఖమును, సంభావించునట్లు=చింతించునట్లు, ఔన్=అగును.

తా. లోకవ్యవహారముతోఁ గూడికొనిన కాల మంతయు బ్రహ్మాభిన్న కూటస్థ చైతన్యసంబంధ మగు నిర్వికల్పసమాధియొక్క స్థానము ఔనవఁగా, ఆవ్యవహారప్రయత్నములు భిన్నములుగావా? అట్లుకాఁగా మనస్సునందు యథార్థము అదేప్రకారము నిలుచునా? ఈసందేహము తెలియఁజేయవలయునని శిష్యుఁ డడుగఁగా ఒకస్త్రీ పర పురుషునితో అజ్ఞానముచేత సంతోషముగా ప్రవర్తించి అనుభవించిన సుఖమును, వెనుక తెలివి గలిగినందున ఇంటిపనులతోఁగూడినదై క్రమముగానున్నను మనస్సునందు మును పు తా ననుభవించినసుఖమును చింతించినట్లు అగునని ఆచార్యుఁడు చెప్పెనని తాత్పర్యము. ఇట్లనుటచే బ్రహ్మనిష్ఠయం దున్నవారికి లోకవ్యవహారములు జ్ఞప్తికివచ్చిన ట్లగు నని భావము. అనఁగా లోకమందుఁగల చీఁకటిని సూర్యునివలనను సగముతీసివేయఁగా తక్కినసగములో సగము చంద్రుఁడు దొలఁగఁజేయఁగా మిగిలినభాగము అగ్నిచేఁబోఁ గొట్టఁబడినను, కొలఁదిభాగము దీపముయొక్క అడుగున నణఁగియున్నరీతిని, బ్రహ్మవేత్తలయందుఁగల అజ్ఞానమనెడి చీఁకటిని కర్మకాండముచేత సగముభాగమును, భక్తిచేత తక్కినసగములో సగమును, జ్ఞానముచేత మిగిలినభాగమును హరింపఁజేసినను, దీపముక్రింద అణఁగియుండు కొలఁదిభాగమువలె జగద్భ్రాంతిరూపమైన అజ్ఞానము అణఁగియుండునని గ్రహింపవలయును.

అవతారిక.—వ్యవహారమందు అహంభావము తొలఁగుటకు చిత్సుఖస్వరూపుఁడైన జీవన్ముక్తునియొక్క శుద్ధసత్త్వస్వరూపమైన మనస్సునందు అహంభావము కూడునా యను శిష్యునిశంకకు ప్రత్యుత్తరముగా ప్రతత్రయలక్షణమును ఆచార్యుఁడు చెప్పుచున్నాఁడు.

ఉ. ఆర్తశరణ్య విన్నపము ! వ్యష్టిసమష్ట్యభిమాని గాక తాఁ
గర్తయుఁగాక బ్రహ్మమయి ! క్రాలువిముక్తుఁడుభోక్తయౌనసం

గర్త యగుం జుమీ యన వికాసముతో భువి నాతఁడే మహా
కర్త సుభోగి హంసుఁడనఁగా వెలయున్విను తన్మహత్త్వముల్. ౨౫

టీ. ఆర్తశరణ్య-ఆర్త=జననమరణరూపదుఃఖపీడితులైనవారికి, శరణ్య=రక్షకుఁడవైన మద్గురుస్వామీ, విన్నపము= విజ్ఞాపనము, పుడమిన్=భూమియందు, తాన్=(ప్రత్యగభిన్న పరమాత్ముఁడైన) తాను, వ్యష్టిసమష్ట్యభిమానిగాక-వ్యష్టి=జీవస్థూలసూక్ష్మకారణశరీరములయందును, సమష్టి= ఈశ్వర స్థూలసూక్ష్మకారణశరీరములయందును, అభిమానిగాక=విశ్వతైజసప్రాజ్ఞాద్యభిమానములును, విరాడ్ఢిరణ్య గర్భావ్యాకృతాద్యభిమానములును, లేనివాఁడై, కర్తయుఁగాక, (కుటుంబభరణమునకును, వ్యోమాదిప్రపంచసృష్టికిని) కర్తగాక, బ్రహ్మమయి=పరిపూర్ణుఁడై, క్రాలుం=ప్రకాశించుచుండెడి, విముక్తుఁడు=జీవన్ముక్తుఁడు, భోక్తయౌనన్ = భుజించువాఁడౌనని, కర్తయగుంజుమీ=కర్తయగుఁగదా, అనన్=అని శిష్యుఁడడుగఁగా, భువిన్ = పుడమియందు, అతఁడే=ఆజీవన్ముక్తుఁడే, మహాకర్త=మహాకర్త, సుభోగి=మహాభోగి, హంసుఁడు = మహాత్యాగి, అనఁగాన్=అనునట్లుగాను, వెలయున్=ప్రకాశించును, వికాసముతోన్=విశదముగా, తన్మహత్త్వముల్-తత్=ఆత్రివిధనామముల, మహత్త్వముల్=మహిమలు, విను=ఆలకింపుము.

తా. జననమరణదుఃఖపీడితులైనవారికి రక్షకుఁడవైన గురుస్వామీ! విజ్ఞాపన మొకటి వినుఁడు. భూమియందు ప్రత్యగభిన్న పరబ్రహ్మమైన తాను, జీవస్థూలసూక్ష్మకారణశరీరములయందును, ఈశ్వర స్థూలసూక్ష్మ కారణశరీరములయందును, విశ్వతైజస ప్రాజ్ఞాద్యభిమానములును విరాడ్ఢిరణ్యగర్భ అవ్యాకృతాద్యభిమానములును లేనివాఁడై కుటుంబభరణమందును, గగనాది ప్రపంచసృష్టియందును, నేను కర్త ననెడి తలంపులేక అంతట నిండియుండెడువాఁడై ప్రకాశించుచుండెడు జీవన్ముక్తుఁడు సమస్తభోగములను అనుభవించుచుండెడి వాఁడౌనని కర్తయగుఁగదా అని శిష్యుఁడడుగఁగా నిరభిమానియైన ఆజీవన్ముక్తుఁడే మహాకర్త యనియు, మహాభోగియనియు, మహాత్యాగియనియు ఈసంజ్ఞచేత ఒప్పఁదగిన వాఁడౌనని ఆచార్యుఁడు ఆనతిచ్చి ఆ జీవన్ముక్తునికిఁ దగిన పైఁజెప్పిన త్రివిధనామములచేత ఒప్పఁదగిన మాహాత్మ్యములను తెలియఁబఱచెదను వినుమని తాత్పర్యము. అనఁగా ఈశ్వరస్థూలసూక్ష్మకారణ మహాకారణ దేహాద్యభిమానులగు విరాట్టు, హిరణ్యగర్భ, అవ్యాకృత, పరమాత్ములనెడి నామచతుష్టయమునందును, జీవస్థూలసూక్ష్మకారణ మహాకారణ దేహాద్యభిమానులగు విశ్వ, తైజస, ప్రాజ్ఞ, ప్రత్యగాత్మలనెడి నామచతుష్టయమునందునుఁ గల సర్వజ్ఞత్వ కించిత్ జ్ఞత్వాద్యభిమానరహితుఁడైన నిరభిమానియగు బ్రహ్మవేత్త స్థూల సూక్ష్మ కారణ మహాకారణ దేహాద్యభిమానములయందు ఓత, అనుజ్ఞాత, అనుజ్ఞైకరస, అవికల్పుఁడను నామచతుష్టయము

కలిగి ప్రవర్తించెడి ఈమహాపురుషుఁడు మహాకర్త యనియు, మహాభోగియనియు, మహాత్యాగి యనియు చెప్పఁబడును.

అవతారిక.—మహాకర్తలక్షణము ఈ దిగువ వచ్చెడి రెండుపద్యములచేతఁ జెప్పఁబడుచున్నది.

మ. కదలింపన్ గదలంగ నోపనియయస్కాంతాచలాగ్రస్థలిన్
సదయఃపిండనిషండము ల్గదలు నాచందంబున న్జైవుల
న్హృదయప్రేరకప్రేర్యమాణముల నూహింప న్సదా లేనిచి
త్పదమందెల్ల జగచ్చయంబు భ్రమచేత న్సంచలించున్ రహిన్.

టీ. కద...పని-కదలింపన్=కదలింపఁజేయుటకును, కదలంగన్=తాఁ గదలుటకును, ఓపని=కూడని, అయస్కాంతాచలాగ్రస్థలిన్-అయస్కాంతాచల=సూదంటురాతికొండయొక్క, అగ్రస్థలిన్ = ముందటిభూమియందు, సదయఃపిండనిషండముల్-సత్=శ్రేష్ఠములైన, అయఃపిండ=ఇనుపముద్దలయొక్క, నిషండముల్=సమూహములు, కదలున్=కదలును, ఆచందంబునన్=ఆతీరున, జైవులన్ = చేష్టలను, హృదయప్రేరకప్రేర్యమాణములన్-హృదయ=మనస్సునందలి, ప్రేరక = ప్రేరేపువాఁడును, ప్రేర్యమాణములన్=ప్రేరేపింపఁబడినకార్యములను, ఊహింపన్=ఆలోచింపఁగా, సదా=ఎప్పుడును, లేని=లేనట్టి, చిత్పదమందున్ = చిల్లక్షణముగల పరబ్రహ్మమందు, ఎల్లజగచ్చయంబు=సమస్తలోకసమూహము, భ్రమచేతన్=భ్రాంతిచేత, రహిన్=మిక్కిలి, సంచలించున్=చలించును.

తా. కదలఁజేయుటకును, తాను కదలుటకును, కూడని సూదంటురాతికొండయొక్క ముందటిభూమియందు శ్రేష్ఠములైన ఇనుపముద్దలయొక్క సమూహములు కదలెడి తీరున చేష్టలను, మనస్సునందలి ప్రేరేపువాఁడును, ప్రేరేపింపఁబడినకార్యములను ఆలోచింపఁగా నెప్పుడునులేనట్టి పరబ్రహ్మమందు సమస్తలోకసమూహము భ్రాంతిచేత మిక్కిలి చలించునని తాత్పర్యము. ఇచ్చట సూదంటురాతికొండ పరబ్రహ్మమునకును, అయఃపిండములు లోకవ్యాపారములకును ఉపమానములుగాఁ జెప్పఁబడినవి. ఎట్లనఁగా: సూదంటు రాతికొండయును, ఇనుపముద్దలును అచేతనములు. అట్టి అచేతనపదార్థమైన కొండయొక్క శక్తిచేత దాని సాన్నిధ్యమందుండెడి ఇనుపముద్దలు కదలఁగా నిరాకారుఁడును, నిరవయవుఁడును, నిర్గుణుఁడును అయియుండియు ఆపరబ్రహ్మము చేతనుఁడుగా నుండుటవలన ఆయనసాన్నిధ్యమందుండెడి సకలేంద్రియములు చలించుట ఆశ్చర్యము కాదని భావము.

చ. తనుకరణప్రభిన్నమయి తత్తదశేషవివర్తనాళికి
న్ననుమత ప్రేరకాద్యఖిలవృత్తులకు న్ఘనవృత్తి తాన యై

యినకిరణంబుమాడ్కిc భుజియించినc దా విభుఁడై యకర్తయై
యనయము భోగముల్దగ మహామహిమన్భువనైకకర్తయౌన్.

టీ. సుత=కుమార, విను=ఆకర్ణింపుము, తనుక...నికిన్-తను = దేహత్రయము యొక్కయు, కరణ=జ్ఞానేంద్రియకర్మేంద్రియ అంతఃకరణములయొక్కయు, ప్రభిన్నమయ=భిన్నస్వరూపమయమైన, తత్తత్ =ఆయా, అశేష=సమస్తములైన, వివర్తనాళికిన్=వ్యాపార సముదాయములకును, ప్రేరకాద్యఖిలవృత్తులకున్-ప్రేరక = ప్రేరకత్వము మొదలుగాఁగల, అఖిల=సమస్తములైన,వృత్తులకున్=పనులకును,ఘనవృత్తితానయై =తానే ఘనమైనవృత్తియై, ఇనకిరణంబుమాడ్కిన్ = సూర్యకిరణమువలె, అనయము= ఎల్లప్పుడు, భుజియించినన్ = భోగములను అనుభవించినను, తాన్=తాను, విభుఁడై = సర్వవ్యాపకుఁడై, అకర్తయై=అట్టికర్తృత్వములేనివాఁడై, తగన్=లెస్సగా, మహామహిమన్=అతిశయమయినప్రభావముచేత, భువనైకకర్తయౌన్-భువన=చతుర్దశభువనములకును, ఏక=ముఖ్యమయిన, కర్త=మహాకర్త, ఔన్=అగును.

తా. కుమారా! స్థూలసూక్ష్మకారణదేహములయొక్కయును, జ్ఞానేంద్రియ కర్మేంద్రియ అంతఃకరణములయొక్కయును, భిన్నస్వరూపములైన ఆయాసమస్తములగు వ్యాపారసముదాయములకును, ప్రేరకత్వము మొదలగునన్నిపనులకును తానే ఘనమయినవృత్తియై, సూర్యకిరణములు (శుద్ధాశుద్ధము లనెడి తారతమ్యములేక) అంతటను ప్రకాశించువిధమున ఎల్లప్పుడు భోగములను అనుభవించినను తాను సర్వవ్యాపకుఁడై అట్టి కర్తృత్వములేనివాఁడై మిక్కిలి శ్రేష్ఠమయినప్రభావముచేతపదునాలుగుభువనములకును ముఖ్యమయిన మహాకర్తయగును వినుమని తాత్పర్యము. క॥ ‘‘పరుల పనుల విద్వేషం, బరయక గతమత్సరుఁ డయి యచలుండై తన్నొనరసిన క్రియలం జేసి య,లరును మహాకర్త ప్రవిమలం బగుతెలివిన్॥’’

అవ.—మహాభోగి మహాత్యాగి యనెడివారియొక్కలక్షణములఁ జెప్పుచున్నాఁడు.

మ. రససంమిశ్రపదార్థదోషగుణముల్ గ్రాణింపనీ కాత్మలో
వెన దావాగ్నిగతి న్భుజింప నతఁ డెవ్వేళ న్మహాభోగి యా
వనులోష్టాదిసమస్తయుగ్మతతులన్ వర్జించి స్వప్రజ్ఞ సం
తసమందన్స్ఫటికాకృతిన్ వెలయు నాతండే మహాత్యాగియౌన్.

టీ. అతఁడు=జీవన్ముక్తుఁడైన ఆపురుషుఁడు, ఎవ్వేళన్=ఏకాలమందైనను, ఆత్మలోన్=అంతఃకరణమందు, రస...నీక-రస = షడ్రసములచేత, సంమిశ్ర=కూడిన, పదార్థ=భోజనవస్తువులయందలి, దోష=శైత్యాదిదోషములను లేక ఆచారానాచారదోషములను, గుణముల్ = దేహమునకు ఇది చెఱుపుచేయును ఇది మేలుచేయు ననెడి గుణ

ములును, లేక ఉప్పనగా చప్పనగా నున్నదనుగుణములును, రాజింపనీక = రానియ్యక, వెసన్ = శీఘ్రముగా, (అది నిమ్మచెట్టు ఇది మామిడిచెట్టు ఇది రావిచెట్టు అను గుణగణముల యోజింపక అన్నిటిని) దావాగ్నిగతిన్ = దహించెడికార్చిచ్చువలె, భుజింపన్ = భుజింపఁగా, మహాభోగియౌన్ = మహాభోగి అను మాహాత్మ్యము గలవాఁడగును, అతండే = ఆజీవన్ముక్తుఁడే, స్వప్రజ్ఞన్ = ప్రత్యగాత్మస్వరూపమైన తనయొక్క అపరోక్షసాక్షాత్కారజ్ఞానముచేత, సంతసమందన్ = కలిగిన ఆనందమునుచెందఁగా, వసు... తుఁన్ = వసు = బంగారు, లోష్ట = మట్టిపెళ్ళ, ఆది = మొదలగు, సమస్త = సకలమయిన, యుగ్మ = ద్వంద్వములయొక్క, తతుల్ = సమూహములను, వర్జించి = విడిచి, స్ఫటికాకృతిన్ = ఇతరవర్ణములు తనయందు ఆరోపింపఁబడినను అవి తనవిగాక వేఱుగానుండు స్ఫటికపుఱాయివలె, మహాత్యాగి = అన్నిటిని విడిచినవాఁడు, ఔన్ = అవును.

తా. జీవన్ముక్తుఁడైన పురుషుఁడు ఏసమయములయందును మనస్సునందు అభిరుచులచేతఁ గూడిన భోజనద్రవ్యములయందలి వాతపిత్తశ్లేష్మాదిదోషములును లేక మధురములగు మయిల అను దోషములును, దేహమునకు ఇది జబ్బుచేయును ఇది మేలుచేయును అనెడు రెండుగుణములును రానియ్యక వేగముగా నిది నిమ్మచెట్టు, ఇది తుమ్మచెట్టు, ఇది మామిడిచెట్టు, ఇవి రావిచెట్టు అనెడి గుణగణములయోజింపక అన్నిఁటిని కాల్చెడి కార్చిచ్చువలె భక్షింప మహాభోగి అనుమాహాత్మ్యముగలవాఁడగును. ‘‘శ్లో॥ సమభావన నెంగు విత్, థము వడయక లోకుల్లెల్లఁ దా వీడ్కొని ప్రాప్తము ననుభవించు నెవ్వం, డమ్మతి యతఁడపో మహాభోక్త యగున్’’ ఆబ్రహ్మవేత్తయే బ్రహ్మాభిన్న కూటస్థచైతన్యస్వరూపమయిన తనయొక్క దివ్యజ్ఞానముచేత కలిగెడి ఆనందముతో ఇది బంగారము, ఇది మట్టిపెళ్ళ మొదలగు సకలమైనద్వివిధముల సమూహములను వదలి ఇతరవర్ణములు తనయందు ఆరోపింపఁబడినను అవి తనవిగాక వేఱుగానుండెడి స్ఫటికపుఱాతివలె అన్నిఁటినివిడిచి మహాత్యాగియై ప్రకాశించునని తాత్పర్యము. ‘‘శ్లో॥ సకలేచ్ఛావిషయంబుల, సకలశుభాశుభఫలముల సంశయతతులన్, సకలనియమనిశ్చయముల, సకలంకుఁ డనిచ్చుఁడే మహాత్యాగి యగున్’’

అవతారిక.—జీవన్ముక్తుఁడు వ్యవహరింపఁబడియు, అసంగుఁడనుట యేలాగని యడుగుచున్నాఁడు.

శా. ఆరబ్ధప్రద మూర్వి దైవగతి యాయారబ్ధభోగార్హమా
కారం బందు వసించి యిష్టుఁడయి తత్కార్యాళి కాధారుఁడై
సారాసారవివేకము న్దెలియ సచ్ఛాస్త్రంబు లాలించువాఁ
డారూఢుం డని పల్కునెట్లుగు మదీయాచార్య తెల్పన్దగున్. ౫౯

టీ. మదీయాచార్య=నా గురుమూర్తీ, ఉర్వీన్=పుడమియందు, ధైవగతి=జన్మపరంపరగా వచ్చుచుండెడి విధిమార్గము, ఆరబ్ధప్రదమౌ=ప్రారబ్ధమునిచ్చునది, ఆయారబ్ధభోగార్హమౌకారంబు-ఆయారబ్ధ=అప్రారబ్ధమును, భోగ=అనుభవించుటకు, అర్హమౌ=తగినది, ఆకారంబు=శరీరము, అందున్=అట్టిదేహమందు, వసించి=ఉండుకొని, తత్కార్యాళికిన్=అకార్యముల సమూహమునకు, ఇష్టుఁడై=ప్రియుఁడై, ఆధారుండై=దానికి కారణభూతుఁడై యుండి, సారాసారవివేకమున్దెలియన్-సారాసార = ఆత్మానాత్మలను రెండువస్తువులయొక్క, వివేకమున్=పరిశోధించెడి జ్ఞానమును, తెలియన్ = తెలియుటకుఁగాను, సచ్ఛాస్త్రంబులు=వేదాంతశాస్త్రములను,ఆలించున్=(పిమ్మట ఆచార్యముఖముగా) వినును, వాఁడు=అట్టిపురుషుఁడు, ఆరూఢుండని=కృతకృత్యుఁడని, ఎట్లు=ఏప్రకారము, పలుకన్=చెప్పుటకు, అగున్=అవును, తెల్పన్దగున్=ఈయర్థమును స్పష్టముగా అనుగ్రహింపఁదగును.

తా. నాగురుమూర్తీ! పుడమియందు జన్మపరంపరగా వచ్చుచుండెడి విధిమార్గము ప్రారబ్ధము నిచ్చునది, అప్రారబ్ధమును అనుభవించుటకుతగినది శరీరము, అట్టిదేహమందు అకార్యముల సమూహమునకు ప్రియుఁడై వానికి కారణభూతుఁడై ఆత్మానాత్మలను రెండువస్తువులను పరిశోధించెడి జ్ఞానమును తెలియుటకుఁగాను వేదాంతశాస్త్రములను ఆచార్యముఖముగా వినును. అట్టిపురుషుఁడు కృతకృత్యుఁడని యేప్రకారము చెప్పనగును. ఈయర్థము స్పష్టముగా ననుగ్రహింపవలయు నని తాత్పర్యము.

అవః—ఆచార్యుఁడు శిష్యుఁ డడిగినప్రశ్నకు ఉత్తరము చెప్పుచున్నాఁడు.

చ. మమత యహంత యీషణసమాజము మానుషజాతిలీల లౌఁ
క్రమముగఁ దత్త్రయం బిహపరంబుల కాశ్రయ మౌనరాళికిన్
శమదమశాస్త్రచింతనలు సాధనము ల్సుముముక్షుపంక్తికిన్
సమరసభావపూర్ణులకు సాధనసాధ్యము లున్నవే కనన్. ౩౦

టీ. మమత=ఇదినాది వీరు నావారనుటయు, అహంత=నేనిత(ఁ)డనుటయు, ఈషణసమాజము=దారేషణ పుత్రేషణ ధనేషణములయొక్క సమూహము, మానుషజాతిలీలలు-మానుషజాతి=మనుష్యస్వభావముగల, లీలలు=కార్యములు,ఔన్=అగును, అనరాళికిన్=అట్టిమనుష్యసమూహమునకు, క్రమముగన్=వరుసగా, తత్త్రయంబు-తత్=అమమత, అ యహంత అ యీషణసమాజము అనెడి, త్రయంబు=మూఁడును, ఇహపరంబులకున్=ఇహపరలోకములకు, ఆశ్రయము = ఆధారము అగును, సుముముక్షుపంక్తికిన్-సు=సుస్థైన, ముముక్షు=మోక్షేచ్ఛగల, పంక్తికిన్ = జనసమూహమునకు, శమదమశాస్త్రి

చింతనలు, శమ=అంతరింద్రియనిగ్రహము, దమ=బాహ్యేంద్రియనిగ్రహము, శాస్త్ర=వేదాంతశాస్త్రమండలి, చింతనలు=మననములు, సాధనములు=ఉపకరణములు, కనన్=చూడఁగా, సమతసభావపూర్ణులకున్ = సర్వపరిపూర్ణ మయినయానందభావము లన్నియుఁగలవారలకు, సాధనసాధ్యములు = కరణకార్యములు, ఉన్నవే=ఆ యారూఢులకు నున్నవా, అనఁగా లేవనుట.

తా. ఇది నాది, వీరు నావారు, నే నితఁడను అనుటయు దారేషణధసేవనముల యొక్క సమూహము మనుష్యస్వభావముగల కార్యములు అగును. అట్టి మనుష్యసమూహమునకు వరుసగా ఆ మమత, యహంత, యీషణసమాజము లనెడిమూఁడును ఇహపరలోకములకు ఆధారము అగును. మోక్షేచ్ఛగల జనసమూహమునకు అంతరింద్రియనిగ్రహము, బాహ్యేంద్రియనిగ్రహము, వేదాంతశాస్త్రమండలి మననము ఉపకరణములుగా నున్నవి. అయితే సర్వపరిపూర్ణమయిన యానందభావము గలవారలకు కరణకార్యములు లేవని తాత్పర్యము.

అవ.__జీవన్ముక్తులకు లోకవ్యవహారము లేకుండినను శ్రవణాదివ్యవహారములు కావలయునా? అక్కఱలేదా? యని శిష్యుఁడడుగుచున్నాఁడు.

మ. గురుచూడామణి యొప్పిదంబులు త్వదుక్తు లసత్పరేహేచ్ఛలం
దరయ న్గూడని మోక్షకాంక్షులు సమాధ్యభ్యాసులై యుందు రి
ద్ధరఁ దద్యత్నము వీడిన న్మరలఁ దత్కాంక్షల్ వెస న్గోరరో
స్థిర మొంద న్పని లేదొ శాస్త్రమువిన న్జింతింప డెందంబొగిన్. ౩౧

టీ గురుచూడామణి=గురుశిరోరత్నమా, ధరన్=భూమియందు, త్వదుక్తులు=దేవరవా రానతిచ్చినవాక్కులు, ఒప్పిదంబులు=సరియైనవే, సత్ = విద్యమానములైన, పర=పరలోకముయొక్కయు, ఇహ=ఇహలోకముయొక్కయు, ఇచ్ఛలందున్ = కోరికలయందు, అరయన్=విచారింపఁగా, కూడనిమోక్షకాంక్షులు=చేరనిముముక్షువులు, సమాధ్యభ్యాసులై యుందురు = సత్యజ్ఞానానందస్వరూపనిష్ఠ చేయుచుందురు, ఇద్ధరన్=ఈ భూమియందు, తద్యత్నము = ఆ యభ్యాసప్రయత్నము, వీడినన్ = వదలినను, మరలన్ = తిరుగా, తత్కాంక్షలు=ఆ యిహపరేచ్ఛలు, వెసన్=వెంబడిగా, కోరరో=అపేక్షించరో, అనఁగా కోరుదురనుట. డెందంబు = మనస్సు, ఒగిన్ = క్రమముగా, స్థిరమొందన్ = నిలుకడపొందుటకు, శాస్త్రము = వేదాంతశాస్త్రము, వినన్ = శ్రవణముచేయుటకును, చింతింపన్ = మననముచేయుటకును, పనిలేదో = అక్కఱలేదా.

తా. గురుశిరోరత్నమా ! భూమియందు దేవరవారానతిచ్చినవాక్యము సరియైనదే, విద్యమానములైన పరలోకముయొక్కయు, ఇహలోకముయొక్కయు, కోరికలయందు చేరని ముముక్షువులు సత్యజ్ఞానానందస్వరూప నిష్ఠచేయుచుందురు. అతుభ్యాసప్రయత్నమును వదలినట్లైన తిరుగా ఆయిహపరేచ్ఛలు కొంబడిగా కోరుదురు. అప్పుడు మనస్సు క్రమముగా నిలుకడపొందుటకు వేదాంతశాస్త్రశ్రవణమననములు అక్కఱలేదా యని శిష్యుఁడడిగెనని తాత్పర్యము.

అవ — ఆప్రశ్నకు ఆచార్యుఁడు ఉత్తరము చెప్పుచున్నాఁడు.

మ. శ్రవణం బజ్ఞతఁ బాయఁ జేయఁ దగు నిస్సందేహమౌ దాఁకఁ దా
నవలంబింపఁ దగు న్సదా మనన మాయజ్ఞానసందేహసం
భవనానావిపరీతము ల్జెఱుప సద్భావ్యంబు చిన్నిష్ఠ యీ
భువిఁ దత్సామ్యము లేవియైనఁ గలవో పూర్ణాత్ములౌ వారికిన్. ౩౨

టీ. శ్రవణంబు = వేదాంతశ్రవణము, అజ్ఞతన్ = అవివేకమును, పాయన్ = పీడుటకుఁగాను, చేయఁదగున్ = చేయవలయును, తాన్ = తాను, నిస్సందేహమౌదాఁకన్ = సందియముతీఱెడువఱకు, సదా = ఎల్లప్పుడు, మననము = విన్నయర్థమును స్మరించుట, అవలంబింపఁదగున్ = పూనఁదగును, ఆ యజ్ఞానసందేహసంభవ నానా విపరీతముల్ - ఆ = ఆయొక్క, అజ్ఞాన = అవివేకమువలన, సంభవ = పుట్టినటువంటి, నానా = బహువిధమయిన, విపరీతముల్ = విపరీతభావనను, అనఁగా అస్థిరములైన దేహమే నేను జగమే సత్యము అనుట. చెఱుపన్ = పోఁగొట్టుటకు, చిన్నిష్ఠ = నిదిధ్యాసము, సద్భావ్యంబు = భావింపఁదగినది యగును, ఈభువిన్ = ఈలోకమందు, పూర్ణాత్ములౌవారికిన్ = సర్వపరిపూర్ణమే స్వరూపముగాఁగల బ్రహ్మవేత్తలకు, తత్సామ్యములు = ఆ చిన్నిష్ఠతో సమమయినవి, ఏవియైనఁగలవో = ఏవియైననున్నవా, అనఁగా ఏవియులేవనుట.

తా. వేదాంతశ్రవణము అవివేకమును పీడుటకుఁగాను చేయవలయును. సందియముతీఱెడువఱకు నెల్లప్పుడు విన్నయర్థమును స్మరించుచుండవలయును. ఆయొక్క అవివేకమువలనను, సంశయమువలనను పుట్టినటువంటి బహువిధమయిన విపరీతభావనను అనఁగా అస్థిరమయిన దేహమే నేను జగమే సత్యము అనుటను పోఁగొట్టుటకు నిదిధ్యాసము భావింపఁదగినది యగును. ఈలోకమందు సర్వపరిపూర్ణమే స్వరూపముగాఁ గల బ్రహ్మవేత్తలకు ఈచిన్నిష్ఠతో సమమయినది యేదియులేదని తాత్పర్యము. విపరీతభావననివర్తనము: ఒకపదార్థమునందుఁగల నైజమును వేఱొకవిధముగాఁ దలఁచుట విప

రీతభావన. ఇది ప్రమాణగత విపరీతభావన, ప్రమేయగత విపరీతభావన అని ఇరుతెఱంగులు. బ్రహ్మము శుద్ధవస్తువు గనుక శ్రుతులకు శుద్ధబ్రహ్మమును ప్రతిపాదించుటయందు తాత్పర్యము కలిగియుండదు గనుక శ్రుతులు పరబ్రహ్మమునే ప్రతిపాదించె నేని పురుషునకు ప్రవృత్తినివృత్తులులేవు గాన వ్యర్థమగును అనితలంచుట ప్రమాణగత విపరీతభావన. లోకమందు ప్రవృత్తిపూర్వకముగానే పురుషార్థమును చూచితిమి. అపరిశుద్ధము, వికారము పొందలగువానితోఁ గూడియుండు జగత్తునకుఁ గారణమైన బ్రహ్మము, అపరిశుద్ధాదులతోఁ గూడియుండక ప్రధానాదులే జగత్తునకు కారణమని బుద్ధియందు తోఁచుట ప్రమేయగత వి.రీతభావన. ఇట్లు తానే కర్తయయ్యెనేని ఈకార్యమును చేయుము చేయకుము, దీనిని వదలుము వదలకుము, దీనిని తెలిసికొనుము తెలిసికొనకుము, దీనిని తినుము తినకుము, లోనగు ధర్మములను శ్రుతులు తన్నుఁగూర్చి ఏప్రకారము దెలుపును గనుక నేనే కర్తను. ఇందుకు సందేహము లేదనెడి కర్తృత్వాదులకు ఉపయోగ్యమయిన అభిమానాదులకు సర్వ్వగర్మప్రతీతిలక్షణమైనది విపరీతభావన. ఇట్లు న్యాయమందు సంశయములను విచారించి త్యజించి అస్థిరమగు జగత్తు మిథ్యయని దేహము నేను గాదని నిస్సందేహముగఁ దెలిసికొని జాగ్రదాది అవస్థలకు సాక్షియైన ఆత్మ నేనని ఎఱిఁగి విజ్ఞానము నార్జించిన బ్రహ్మవేత్తలకు నిదిధ్యాసాదులతో నావశ్యకము లేదని భావము.

అవతారిక.—బ్రహ్మవేత్త దేహముండువఱకు దేహేంద్రియవ్యాపారములతోఁ గూడియుండునని ఆచార్యుఁడు చెప్పుచున్నాఁడు.

మ. కలలోఁ దోఁచిన దెల్లఁ దెల్పుగతి జాగ్రంబందు విజ్ఞానియై
పలుకన్జీవుఁడు గాఁడు లౌకికము సంభాషింతు రంగంబు ప్ర
జ్వలవహ్నిన్మృతినొంది కాలుదనుకన్ వత్సా నరుండంచు లో
కులు వాని న్విహరించుచుందు రటు లీగోత్ర న్వివేకు ల్గదా. 33

టీ. వత్సా=కుమారా, కలలోఁదోఁచినదెల్లన్-కలలోన్=(సకలేంద్రియవ్యాపారములు క్షీణించినను) స్వప్నమందు, తోఁచినదెల్లన్ = కల్పితముగా కనుపడినదంతయును, జాగ్రంబందున్ = జాగ్రదవస్థయందు, తెల్పుగతిన్ = తెలియఁజెప్పునట్లు, విజ్ఞానియై = (ఒకఁడు) బ్రహ్మవేత్తయై, లౌకికము = లోకవ్యవహారమును, పలుకన్ =వాక్రుచ్చినను, జీవుఁడుగాఁడు = చిదాభాసుఁడుగాఁడు, మృతినొంది = ఒకఁడు చచ్చి, ప్రజ్వలవహ్నిన్ = మండుచుండెడి శ్మశానాగ్నియందు, అంగంబు=శరీరము, కాలుదనుకన్ = దహించెడిపర్యంతము, వానిన్ = ఆచచ్చినవానిని, నరుండంచున్= మనుష్యుఁడని, లోకులు=ప్రజలు, సంభాషింతురు = చెప్పుదురు, అటులు=అరీతిని, ఈ

గోత్రన్=ఈభూమియందు, వివేకులు=జీవన్ముక్తులైన బ్రహ్మవేత్తలు, విహరించుచుందురుగదా=(ప్రారబ్ధక్షయమునకు పూర్వము విదేహకైవల్యమును పొందెడివఱకు దేహేంద్రియవ్యాపారములతోఁ గూడి) సంచరించుచుందురు సుమీ.

తా. కుమారా! స్వప్నమందుఁ దోఁచిన కథయంతయును జాగ్రదవస్థయందు లోకులు చెప్పుకొనునట్లు బ్రహ్మవేత్తయు లోకవ్యవహారములను పలికినను చిదాభాసుఁడు గాఁడు. ఒకఁడుచచ్చి వానిశరీరము శ్మశానాగ్నియందు కాలెడివఱకు వాఁడు వెళ్లిపోయినను వాని నామరూపములు చెప్పఁబడునట్లు బ్రహ్మవేత్త విదేహముక్తిని పొందెడివఱకు దేహముండుటవలన నతఁడును దేహేంద్రియవ్యాపారములతో సంచరించునని తాత్పర్యము.

అవతారిక.—నిర్వికల్పసమాధియందుండు బ్రహ్మవేత్త యెవ్విధముగా నిర్వ్యాపారి యగునని శిష్యుఁ డడుగుచున్నాఁడు.

మ. అటు లావశ్యకమైన దృశ్యచయ మధ్యాసంబ యౌ ధాత్రి సం
కటదంబై యది గల్గనీయదు లసత్కౌతూహలం బాత్మకె
ప్పటి కద్దానిఁ దొలంగ మేలు చుమి తద్భంగంబు చిన్నిష్ఠయౌఁ
బటుతన్నిష్ఠ రొనర్చు వాఁ డెటులు నిర్వ్యాపారియై రంజిలున్. ౩౪

టీ. ధాత్రిన్=పుడమియందు, అటులు=పైనఁజెప్పినప్రకారము, దృశ్యచయము = నామరూపములతోఁగూడిన సకలవిషయములయొక్క సముదాయము, ఆవశ్యకమయినన్ = బ్రహ్మవేత్తకు తగినదైనను, అధ్యాసంబయౌన్=కల్పితమేయగును, అది=ఆకల్పితమయినది, సంకటదంబై-సంకట=కష్టములను, దంబై=ఇచ్చునదియై, లసత్కౌతూహలంబున్-లసత్=ఒప్పిదమైన, కౌతూహలంబున్ = బ్రహ్మానందమును, కల్గనీయదు=ప్రాప్తముగానీయదు, ఆత్మకున్=ప్రత్యగాత్మస్వరూపుఁడైన తనకు, అద్దానిన్=ఆదృశ్యచయమును, తొలంగన్=విడుచుటకు, ఎప్పటికిన్=ఎన్నటికిని, మేలుచుమి=మంచిదిగదా, తద్భంగంబు-తత్=ఆకల్పనముయొక్క, భంగంబు = నాశమే, చిన్నిష్ఠయౌన్ = నిర్వికల్పసమాధి యగును, పటుతన్నిష్ఠ-పటు = సమర్థమయిన, తన్నిష్ఠ = ఆ బ్రహ్మనిష్ఠ, ఒనర్చువాఁడు=చేయువాఁడు, ఎటులు = ఏప్రకారముగాను, నిర్వ్యాపారియై=ఏకార్యములులేనివాఁడై, రంజిలున్=ఒప్పును.

తా. పుడమియందు పైనఁజెప్పినప్రకారము నామరూపములతోఁ గూడిన సకలవిషయములయొక్క సముదాయము ఆబ్రహ్మవేత్తకు తగినదే యనిన నది అధ్యాసమగును. ఆయధ్యాసము దుఃఖములను ఇచ్చునదియై బ్రహ్మానందమును గలుగనీయదు. ప్రత్య

గాత్మ స్వరూపుఁడైన తనకు అదృశ్యచయమును వికుమట యున్నటికిని మంచిదేగదా, ఆకల్పనముయొక్క నాశమే నిర్వికల్పసమాధి యగును. సర్వశక్తివంతమైన బ్రహ్మనిష్ఠచే యువాఁడు ఏప్రకారముగాను, ఏకార్యములేనివాఁడై ఒప్పునని తాత్పర్యము. అధ్యాసమనఁగా ఒకవస్తువును జూచి వేఱొకవస్తువు అనుట. ఆయధ్యాసము దేహేంద్రియాదులయందు భ్రాంతివలనఁ గలుగుచున్నది గనుక ఆత్మ కర్తవలెఁ దోఁచినను విచారించినంతట అపరిచ్ఛిన్నుఁడై యుండుటవలన ఆయాత్మ కర్తగాదని గ్రహించునది ॥అతస్మిన్ తద్బుద్ధిః అధ్యాసః" అనఁగా అనికానిదానియందు అదే యనెడి బుద్ధికలుగుట అధ్యాసమని భావము.

అవతారిక.—పైనఁ జెప్పినప్రశ్నకుఁ బ్రత్యుత్తరము ఇచ్చుచున్నాఁడు.

మ. వ్యవహారక్రియ లాత్మనిష్ఠయు మనోవ్యాపారము ల్పుత్ర స
చ్ఛ్రవణారంభముఁ జేయఁ దీఱు నవి తర్వాతన్ బరాత్మాపరో
క్షవిభూతిన్ పరిపూర్ణవస్తువయి తా సాధింప సాధ్యంబు లు
న్నవె యారూఢుఁ డనంగ వచ్చునొకో విన్నాణంబుగా నుండినన్. ౩౫

టీ. పుత్ర=కుమారా, వ్యవహారక్రియలు=లోకవ్యవహారకార్యములును, ఆత్మనిష్ఠయున్=నిర్వికల్పసమాధియును, మనోవ్యాపారములు=మనస్సుచేత చేయఁబడెడు కార్యములె యగును, అవి=ఆయుభయ వ్యాపారములు, సచ్ఛ్రవణారంభముఁజేయన్-సత్=శ్రేష్ఠమైన, శ్రవణ=వేదాంతశాస్త్రములనువినుటకు, ఆరంభమున్=ప్రయత్నమును, చేయన్=ఒనర్పఁగా, తీరున్=విడుచును, తర్వాతన్=(శ్రవణముచేసిన) పిమ్మట, పరాత్మాపరోక్షవిభూతిన్-పరాత్మ=అవినినయర్థమును మననముచేసి అటుపిమ్మట తత్త్వమస్యాదిమహావాక్యార్థములైన జీవేశ్వరైక్యభావమును తెలిసి అపరోక్షవిభూతిన్=తనకంటె అన్యములేక తానే తానైన పరబ్రహ్మైశ్వర్యముచేతను, పరిపూర్ణవస్తువయి=అంతటనిండిన అఖండచైతన్యమైన, తాన్=తాను, సాధింపన్=సాధించుటకు, సాధ్యంబులు=కార్యంబులు, ఉన్నవే=కలవా, విన్నాణంబుగాన్=ముందటి మనోవ్యాపారమందు ఒప్పునట్లుగాను, ఉండినన్=కూడియుండెనేని, ఆరూఢుఁడనంగవచ్చునొకో=అట్టిపురుషుని బ్రహ్మవేత్తయని చెప్పవచ్చునా (అనఁగాఁ జెప్పఁగూడదనుట)

తా. కుమారా! లోకవ్యవహారములును నిర్వికల్పసమాధియును మనస్సుచేత చేయఁబడెడుకార్యము లగును. ఆయుభయవ్యాపారములు శ్రేష్ఠమయిన వేదాంతశాస్త్రములను వినుటవలన విడుచును. ఆ వినిన అర్థమును మననముచేసి పిమ్మట తత్త్వమస్యాది మహావాక్యములయిన జీవేశ్వరైక్యభావమును తెలిసి తాన తానైన పరబ్రహ్మైశ్వర్యము

చేతను అంతటనిండిన అఖండచైతన్యమై తాను సాధించుటకు కార్యములు కలవా? ముందటి మనోవ్యాపారములయందు కూడియుండడేని అట్టిపురుషుని బ్రహ్మవేత్తయని చెప్పవచ్చునా యని తాత్పర్యము.

అవతారిక.—ఆరూఢులయందు కొందఱు సమాధి మొదలైనవిచేయుట యెందు కని శిష్యుఁడడుగ నాప్రశ్నకు ఆచార్యుఁ డుత్తరమిచ్చుచున్నాఁడు

శా. ఆరూఢు ల్గురుమూర్తి యేలయన హృద్ధ్యానాదుల జ్జేయుట
ల్ప్రారబ్ధం బెటులుండునో యటులు పుత్రా కొందఱుందురుసుమీ
యారబ్ధంబులరీతిఁ దెల్పితిని యాయారూఢుల న్నెంతయు
న్ధీరోదాత్త యెఱుంగవా మఱియు సందేహంబు లింకేటికిన్. ౩౬

టీ. గురుమూర్తి=ఆచార్యుఁడా, ఆరూఢుల్=బ్రహ్మవేత్తలు, హృద్ధ్యానాదుల జ్జేయుటల్-హృత్=మనస్సునందు, ధ్యానాదుల్=ధ్యానము మొదలైనకార్యములను, చేయుటలు=సల్పుటలు, ఏల=ఎందుకు, అనన్=ఈప్రకారము శిష్యుఁడడుగఁగా, పుత్రా=కుమారా, కొందఱు=(ఆయారూఢులలో) కొందఱు, ప్రారబ్ధంబు = జన్మాంతర కర్మసంచితము, ఎటులు=ఏప్రకారము, ఉండునో=ఉంటున్నదో, అటులు=ఆప్రకారము, ఉందురు సుమీ=ఉంటున్నారుగదా, ఆయారూఢులందున్=ఆబ్రహ్మవేత్తలయందు, ఆరబ్ధంబులరీతిన్-ఆరబ్ధంబుల=వారువారు జన్మాంతరములందు చేసిన కర్మసంచితముల యొక్క, రీతిన్=క్రమమును, ఎంతయున్=అంతయును, తెలిపితిన్=తెలియఁజేసితిని, ధీరోదాత్త = గంభీరమైన ధైర్యముగల కుమార, ఎఱుంగవా = తెలిసికొనవా, మఱియున్=తిరుగాను, సందేహంబుల్=సంశయములు, ఇంకన్=ఇఁకమీఁదు, ఏటికిన్=? ఎందుకు? ప్రయోజనములేదనుట.

తా. ఆచార్యుఁడా! బ్రహ్మవేత్తలు మనస్సునందు ధ్యానాదులను చేయుట యెందు కని శిష్యుఁడడుగఁగా కుమారా! వారివారిప్రారబ్ధంబు లెలాగున్నవో అలాగే యుందురు. ముందే యీ ప్రారబ్ధభేదములను తెలియఁజేసియుంటినిగదా తిరుగా ఎందుకు ఈసందేహములఁ బొందుచున్నావని ఆచార్యుఁడు పలికెనని తాత్పర్యము.

అవ.—జన్మాదిప్రతిబంధములు తత్త్వజ్ఞానులను చేరవని తెలుపుచున్నాఁడు.

చ. జగదుపకారమై వెలయు సాధుజనవ్యవహార ముర్విలోఁ
దగులము లంటఁబోవు పరతత్త్వము తామయి యుంట లోకుల
న్నిగులఁగఁ బుణ్యపాపముల మేలు కనుంగొని ప్రోచు నీశునిం
దగులున యొవ్వఁడైన నుత తత్త్వవిచక్షణు లుండు రట్టులన్. ౩౭

టీ. ఉర్విలోన్ = భూమియందు, సాధుజనవ్యవహారము - సాధు = సత్పురుషులైన, జన = బ్రహ్మజ్ఞానులయొక్క, వ్యవహారము = (శరీరేంద్రియ) వ్యాపారము, జగదుపకారమై - జగత్ = సకలలోకములకు, ఉపకారమై = సాహాయ్యభూతమై, వెలయున్ = ఒప్పును, పరతత్త్వము = పరబ్రహ్మస్వరూపము, తామయి = తామేఅయి, ఉంటన్ = ఉండుటచేతను, తగులములు = జన్మాదిప్రతిబంధములు, అంటఁబోవు = చేరనేరవు, లోకులన్ = జనులను, పుణ్యపాపములమేలుగనుంగొని - పుణ్య = ధర్మములయొక్కయు, పాప = అధర్మములయొక్కయు, మేలు = ఘనమును, కనుంగొని = చూచి, మిగులఁగన్ = మిక్కుటముగాను, ప్రోచు = రక్షించుచున్న, ఈశునిన్ = సదాశివమూర్తిని, ఎవ్విధమైనన్ = ఎవ్విధములైన చేలుములును, తగులునె = అంటునా, అటులన్ = ఆ ఈశ్వరునివలెనే, తత్త్వవిచక్షణులు = తత్త్వజ్ఞానమును పరిశోధించి తెలిసికొనిన మహాత్ములు, ఉందురు = ప్రవర్తించుచుందురు.

తా. భూమియందు బ్రహ్మజ్ఞానులయొక్క వ్యవహారములు సకలలోకములకు సాహాయ్యభూతమై ఒప్పారు. పరబ్రహ్మస్వరూపము తామై ఉండుటచేత నొకవేళ లోకవ్యవహారములలో ప్రవేశించినను జన్మాది ప్రతిబంధములు ఆ బ్రహ్మవేత్తలను చేరనేరవు. జనులయొక్క పుణ్యపాపముల యందలి అతిశయములను మిక్కుటముగ తెలిసి రక్షించుచున్న ఈశ్వరుని మేలుకీడులు అంటనిరీతిని ఆ ఈశ్వరునివలెనె తత్త్వజ్ఞానులు ప్రవర్తించుచుందురని తాత్పర్యము.

అవతారిక: — ౧౫ వ పద్యము మొదలుకొని ఇదివఱకు చిత్తునందుదయమైన మనస్సు చిత్తుగానే నెలఁగునని తెలిపించి ఇఁక చిద్వ్యాపకవిదేహముక్తిపర్యంతము నిశ్రవణమననములు కావలయునని ఆచార్యుఁడు చెప్పుచున్నాఁడు.

ఉ. మూర్తులు ముగ్గు రాదిశివసమూర్తులు నొండుగఁ గూడి యస్మదీ
యార్తి హరింప దేశికుఁడవై భువిఁ దోఁచితి వీ వివేకి కా
మూర్తుల శుద్ధి యెట్టులన మోహ మహంకృతి యీషణాదిదు
ర్వర్తన లేవి లేమి నగు వారలె కా దఖిలాత్ముఁ డీశుఁడౌన్. ౩౮

టీ. మూర్తులు = బ్రహ్మవిష్ణురుద్రులు, ముగ్గురు = ముగ్గురును, ఆదిశివమూర్తులు - ఆదిశివ = తటస్థేశ్వరునియొక్క, మూర్తులు = అష్టమూర్తులును, ఒండుగన్ = ఒక్కటిగాను, కూడి = చేరి, అస్మదీయ = నాయొక్క, ఆర్తి = జన్మపరంపరాదిదుఃఖమును, హరింపన్ = పోఁగొట్టుటకు, దేశికుఁడవై = గురుస్వామివై, భువిన్ = భూమియందు, తోఁచితివి = అవతరించితివి, ఈ వివేకికిన్ = ఈ జ్ఞానికిని, ఆమూర్తులకున్ = ఆ బ్రహ్మవిష్ణురుద్రాదులకును, శుద్ధి = జత, ఎట్టులనన్ = ఏలాగన, మోహము = మమకారము,

అహంకృతి=అహంకారము, ఈషణాదిదుర్వర్తనలు=ధనేషణ దారేషణ పుత్రేషణములు మొదలుగాఁగల చెడునడవడికలు, ఏవి=ఏవి, లేమిన్=లేకుండుటచేత, అగున్ = జతయగును, వారలెకాదు=ఆమూర్తులెకాదు, అఖిలాత్ముఁడు=సమస్తచరాచరప్రాణిస్వరూపుఁడును, ఈతఁడు=ఈజ్ఞానియె, ఔన్=అవును.

తా. బ్రహ్మవిష్ణురుద్రులు ముగ్గురును తటస్థేశ్వరాఖ్యమూర్తులును, ఒక్కటిగాఁ గూడి నాయొక్క జననమరణాది దుఃఖమును బోఁగొట్టుటకు అవతరించిన నాగురుస్వామీ! యీజ్ఞానికిని ఆ బ్రహ్మవిష్ణురుద్రాదులకును సమమేలాగని శిష్యుఁడడుగఁగా మమకారము అహంకారము ఈషణాది దుర్వర్తనలు లేనప్పుడు సమానమగును. ఈమూర్తులు మాత్రమేకాకుండ సమస్తచరాచరప్రాణికోట్లును ఈజ్ఞానియే అవునని తాత్పర్యము. "శ్రు. ఏకో దేవో బహుధాసం నివిష్టః, ఏకం సంతం బహుధా కల్పయంతి" "ఏకవిజ్ఞానేనసర్వం విజ్ఞాతంభవతి, వాచారంభణం వికారో నామధేయం, మృత్తికేత్యేవ సత్యం" "శ్లో. చతుర్ముఖేంద్రదేవేషు మనుష్యాశ్వగవాదిషు, చైతన్యమేకం బ్రహ్మాతః ప్రజ్ఞానం బ్రహ్మమయ్యపి" "యేనేక్షతే శృణోతీదం జిఘ్రతి వ్యాకరోతిచ, స్వాద్వస్వాదూ విజానాతి తత్ప్రజ్ఞాన ముదీరితం" అను శ్రుతిస్మృతిప్రమాణముల ననుసరించి ఈజ్ఞానికిని ఆమూర్తులకును భేదములేదని యెఱుఁగునది.

అవతారిక.—పైఁజెప్పినచొప్పున అజ్ఞాని ప్రాణిసమూహములో నొకఁడగును గనుక జగమంతియు అజ్ఞానియేయని యెట్లుచెప్పనగునని శిష్యుఁడు ఆచార్యులను అడుగుచున్నాఁడు.

మ. సకలప్రాణిసమాజ మీతఁ డన నీ సాక్షాన్ముక్తుఁ డీజ్ఞాని యౌ
నకలంకస్థితి నాసమస్త మిల నన్యప్రాకృతప్రజ్ఞల
న్వికలత్వంబులఁ బొందుచుండు వెలయన్ వేర్వేఱుగా నాతఁ డ
న్దొకఁడౌ సర్వముఁ గాఁడు తెల్పు మెనయం దుల్లాస మింపొందఁగన్.

టీ. ఇలన్=భూమియందు, సకలప్రాణిసమాజము-సకల=సమస్తమైన, ప్రాణి=జీవులయొక్క, సమాజము=సమూహము, ఈతఁడనన్=ఈతఁడగునవిన, ఈజ్ఞాని=ఈబ్రహ్మవేత్త, అకలంకస్థితిన్=నిష్కళంకమయిన బ్రహ్మస్థితిచేత, సాక్షాన్ముక్తుఁడు=అపరోక్షప్రత్యగభిన్న పరబ్రహ్మరూపుఁడు, ఔన్=అగును, ఆసమస్తము=ఆయీజగము, అన్యప్రాకృతప్రజ్ఞలన్-అన్య=తనకంటె భిన్నమై మిథ్యాభూతమయిన, ప్రాకృత=ప్రకృతిసంబంధమయిన, ప్రజ్ఞలన్ = అంతఃకరణములచేత, వికలత్వంబులన్=వ్యత్యాసములను, వేర్వేఱుగాన్-వెలయన్ = ప్రకాశించులాగున, పొందుచుండున్=పొందుచుండును, ఆతఁడు=అజ్ఞాని, అందున్ = అవేర్వేరుగాఁదోఁచెడి ప్రాణిసమూ

హమందు, ఒకఁడౌన్ = ఒక్కఁడగును, సర్వముఁగాఁడు = ఇతఁడు జగత్తంతయుఁగాఁడు, ఎదయందున్ = మనస్సునందు, ఉల్లాసము = సంతోషము, ఇంపొందఁగన్ = పెంపొంద గాను, తెలుపుము = ఈసందేహము తెలియఁజెప్పుము.

తా. భూమియందు సమస్తమైన జీవులయొక్క సమూహము ఈతనికి ఈడగునని న నీబ్రహ్మవేత్త నిష్కళంకమైన పరబ్రహ్మస్థితిచేత అపరోక్ష ప్రత్యగభిన్న పరబ్రహ్మ స్వరూపుఁడు అగును. ఆ యీజగము తనకంటె భిన్నమై ప్రకృతిసంబంధమైన అంతః కరణములచేత వ్యత్యాసములను వెవ్వేఱుగా ప్రకాశించులాగున చేయుచుండును. అజ్ఞాని ఆ వేర్వేఱుగాఁదోఁచెడి ప్రాణిసమూహమందు ఒక్కఁడగును. అందువలన ఇతఁడు జగమంతయుకాఁడు గనుక మనస్సునందు సంతోషము వృద్ధిపొందులాగున ఈసందేహము ను దెలియఁజెప్పుమని తాత్పర్యము.

అవ. — శిష్యుఁడడిగిన పైప్రశ్నకు ఉత్తరము చెప్పుచున్నాఁడు.

మ. పరిపూర్ణుం డగుఁ దా నొకండు కరణోపాధు ల్పయోరాశిశీ
కరములో్పలు నిశాకరుం డొకఁడు లోకంబంతట న్వెల్గుపు
ష్కరకూపాదులసంఖ్యలట్టులగుతత్కాండంబుల న్దోఁచుచం
దురుల ట్లీశుఁ డుపాధులందు వెలయ న్దోఁచున్ జిదాభాసులై. ౪౦

టీ. పరిపూర్ణుండు = అంతటనిండినవాఁడు, తాన్ = (బ్రహ్మాభిన్నప్రత్యగాత్మస్వరూపుఁడైన) తాను, ఒకండు = ఒక్కఁడు, అగున్ = అగును, కరణోపాధుల్ - కరణ = ప్రకృతిసంబంధములైన అంతఃకరణమందలి, ఉపాధులు = మాయోపాధులు, పయోరాశి శీకరములో్పలున్ - పయోరాశి = సముద్రమందలి, శీకరములో్పలున్ = తుంపురులవలె నగును, నిశాకరుండు = చంద్రుండు, ఒక్కఁడు = ఒకఁడే, లోకంబంతటన్ = జగమంతటను, వెల్గున్ = ప్రకాశించును, పుష్కరకూపాదులు - పుష్కర = తటాకము, కూప = బావి, ఆదులు = ఇవి మొదలుగాఁగలవి, అసంఖ్యలు = లెక్కలేనివి, అట్టులు = ఆప్రకారమే, అగున్ = అగును, తత్కాండంబులన్ = అచెఱువుబావి మొదలైనవానియందుండెడి నీళ్ల యందు, తోఁచు = ప్రతిబింబించుచుండెడి, చందురులట్లు = చంద్రులవలెనే, ఈశుఁడు = పరబ్రహ్మము, ఉపాధులందున్ = అంతఃకరణోపాధులందు, చిదాభాసులై = వ్యావహారిక జీవులై, తోఁచున్ = అనేకములుగాతోఁచును.

తా. ప్రత్యగాత్మయైన తాను ఒక్కఁడే అంతట వ్యాపించినవాఁడైయుండును. సముద్రమందలి నీటిచినుకులవలె అంతఃకరణోపాధులు అనేకములగును. ఆకాశమందుండు చంద్రుఁడు ఒక్కఁడైనను తటాకములు బావులు మొదలైన అనేకపాత్రభేదములయందు నిండియుండెడి నీళ్ళలో ప్రతిబింబించి అనేకచంద్రులైనట్లు ఆపరబ్రహ్మము అనేకాం

తఃకరణోపాధులయందు ప్రతిబింబాది వ్యావహారిక జీవులైరని తాత్పర్యము. ॥శ్లో. ఏక ఏవ పరోహ్యాత్మా భూతే భూతే వ్యవస్థితః, ఏకధా బహుధాచైవ దృశ్యతే జలచంద్రవత్॥ అనఁగా ఒక్కఁడైన చంద్రుఁడు గుంట, బావి, మడుగు, సముద్రము మొదలగువానియందు ప్రతిబింబించి వాని అన్నిటియందున వేర్వేఱుగా కనుపడినలాగున ఒక్కఁడైన ఈశ్వరుఁడు పదార్థంబులఁ గూడి రాముఁడని, సాంబుఁడని, లక్ష్మియని, సావిత్రియని, చిలుకయని, హంసయని, ఎద్దని, గుఱ్ఱమని అనేకనామరూపాదులను బొందుచున్నాఁడని భావము.

అవతారిక.—పరబ్రహ్మమందు ఐక్యభావమును పొందునట్టివా రిట్టివారని శిష్యునికిఁ దెలియఁజేయుచున్నాఁడు.

మ. కలశతటాకకూపముఖకల్పితమృణ్మయకాండమం దిల
న్విలయమునొంద నొండుప్రతిబింబము తచ్ఛశియందు డిందు వే
వెలసిన వెల్లఁ జేరునె వివేకముచేత నుపాధిఁ బాసి కే
వలుఁడొకఁడౌఁగుమార పెఱవారలు బ్రహ్మము నందనేర్తురే. ౪౧

టీ. కుమార=పుత్త్రుఁడా, ఇలన్ = పుడమియందు, కలశ...దమందు-కలశ=భాండము, తటాక=చెఱువు, కూప=బావి, ముఖ=మొదలుగాఁగల, కల్పిత=కల్పింపఁబడిన, మృణ్మయ= మంటివికారములైనవానియొక్క, కాండమందున్= జలములయందు, ఒండు=ఏదియైననొక్కటి, విలయమునొందన్=నశించినను, ప్రతిబింబము=తజ్జలమున ప్రతిబింబించిన చంద్రప్రతిబింబము, తచ్ఛశియందున్=బింబభూతుఁడైన యధిష్ఠానచంద్రునియందు, డిందున్=కలియును, వే=శీఘ్రముగా; వెలసినవెల్లన్ = ప్రకాశించెడి మిగిలినవానియందలి ప్రతిబింబచంద్రులు, చేరునే=అధిష్ఠానచంద్రునియందుకలియునా, చేరవనుట; ఒకఁడు=ఒకపురుషుఁడు, వివేకముచేతన్=బ్రహ్మసాక్షాత్కారజ్ఞానముచేత, ఉపాధిఁబాసి= త్రివిధ ప్రతిబంధములుమాని, కేవలుఁడు= బ్రహ్మస్వరూపుఁడు, ఔన్=అగును, పెఱవారలు= తక్కినవారు, బ్రహ్మమున్=త్రివిధపరిచ్ఛేదశూన్యమైన పరబ్రహ్మమును, అందనేర్తురే=అందుదురా.

తా. పుత్త్రుఁడా పుడమియందు కడవ ముంత చెఱువు బావి మొదలయినమన్నుచేతనేర్పడిన పాత్రభేదములయందు నిండింపఁబడిన జలములయందలి ప్రతిబింబించిన చంద్రులనేకులలో ఏదైననొకటి నశించినను ఆప్రతిబింబచంద్రుఁడు అధిష్ఠానచంద్రునితో కలియును. భిన్నములుగాక నిలిచియుండిన తటాకకూపఘటాదులయందలి ప్రతిబింబచంద్రులు అధిష్ఠానచంద్రునిలోఁజేరుదురా? అటువలెనే ॥శ్లో. ఆత్మానాత్మవివేకేన పుంసస్సంసారనివృత్తిః, తద్వినా జన్మకోట్యాపి బంధచ్ఛేదో న సిద్ధ్యతి॥ అను ప్రమా

ఈరీతిని, ఆత్మానాత్మవిచారణచేత ప్రతిబంధత్రయమునువీడి బ్రహ్మస్వరూపుఁడుఅగును. తక్కిన బ్రహ్మజ్ఞానములేని మూఢులు అందఱును దేశకాలవస్తుపరిచ్ఛేదశూన్యమగు పర బ్రహ్మమందు ఐక్యభావమును పొందలేరని తాత్పర్యము.

ప్రతిబంధత్రయవివరణము.— ప్రతిబంధము వర్తమానమని, భూతమని భవిష్యత్తని మూఁడు తెఱఁగులు: అందు వర్తమానప్రతిబంధము-విషయాసక్తిలక్షణమని, ప్రజ్ఞామాంద్యమని కుతర్కమని, విపర్యయదురాగ్రహమని నాల్గువిధములు. విషయములయందు మిక్కిలి మక్కువకలిగియుండుట విషయాసక్తిలక్షణము. ఆచార్యుఁడు బోధించిన పరమార్థము బుద్ధియందు బోధకముకాకపోవుట ప్రజ్ఞామాంద్య మనఁబడును. దేశికుఁడుపదేశించిన పరమార్థమునకు విపరీతార్థముల కలుగఁజేసికొనుట కుతర్క మనఁబడును. నేను శ్రోత్రియుఁడను, విద్వాంసుఁడను, నిరాశకుఁడను అనిచెప్పుచు శరీరేంద్రియాదులందు ఆత్మత్వబుద్ధి కలిగియుండుట విపర్యయదురాగ్రహమనఁబడును. దీనికి వినాశము, శమ, దమ, ఉపరతి, తితీక్ష, శ్రవణ, మనన, నిదిధ్యాసలవలన కలుగుచున్నది (ఈశమదమాదుల వివరము, ప్రథమభాగమైన తత్త్వబోధప్రకరణమున చక్కఁగ వ్రాయఁబడియున్నది.) భూతప్రతిబంధమునకు దృష్టాంతము. గొప్పకుటుంబము గల విప్రుఁ డొకఁడు ఉదరపోషణార్థము ఒక బఱ్ఱెను సంపాదించి దాని పాలు పెరుగు మొదలయినవానిని అమ్ముకొని ఆద్రవ్యముచేతఁ దనదారపుత్రాదులను పోషించుచు ఆయెనుమును గడ్డి మొదలయినవానిచే సంతుష్టిగా మేపుచు దానియందే జ్ఞాపకముగానుండెను. ఇట్లు జరుగుచుండఁగా కొంతకాలమునకుఁ బ్రారబ్ధవశమున నతని దారపుత్రాదులు గతించిరి. ఆ బఱ్ఱెయును జచ్చెను. అంతట ఆబ్రాహ్మణుఁడు ఒంటరిగా నిలిచినందున మిక్కిలి దుఃఖపడి అయ్యో యీసంసారము శాశ్వతమని నమ్మి పడరాని పాట్లుపడితిని. ఇప్పు డిది అంతయు స్వప్నమువంటిది ఆయెను. సంసారమం దపేక్షకలిగిన మనుష్యునికంటె తెలివి హీనుఁడు ఎవ్వఁడునులేఁడని మనస్సున విచారమునొంది "శ్లో. ఆదిమధ్యావసానేషు దుఃఖం సర్వ మిదంయతః, స్త్రీయంత్యక్త్వా జగత్త్యక్తం జగత్త్యక్త్వా సుఖీభవేత్" అను శ్రుత్యర్థముచొప్పున సంసారమునందు విరక్తికలిగి సద్గురుని సన్నిధానమందు ప్రవేశించి శ్రవణమననాదులను చేయుచుండెను. అంత నొకనాఁడు ఆగురువు అతనితో అప్పా నీవు అనేకదినములనుండి శ్రవణాదులను చేయుచున్నావే నీకు కృతకృత్యత కనఁబడినదాయని యడుగఁగా అయ్యా పూర్వమం దొకయెనుమును పెంచితిని. ఆయెనుము కొన్నిదినముల క్రిందట చచ్చెను. ఐనను నాయొక్క శ్రవణమనన నిదిధ్యాసకాలములయందు ఆయెనుమే తోఁచుచున్నది గాని మఱిమియుఁగానననని వాస్తవమును విన్నవించెను. ఈ ప్రతిబంధమునకు భూతప్రతిబంధమనిపేరు. అప్పుడా యాచార్యుఁడు ఇది భూతప్రతిబంధమని తెలిసికొని దానిని తొఁగొట్టుటకై ఆపశువందలి ప్రేమను అనుభ

రించి తత్త్వోపదేశము చేయఁగోరి శిష్యునిఁజూచి నీకు సాక్షాత్కారమైన వస్తువు అస్తి భాతి ప్రియ నామరూపములనెడి ఐదుఅవయవములతోఁ గూడుకొనియున్నది గనుక నామము రూపము అనెడి రెండవయవములనువదలి మిగిలిన అస్తిభాతిప్రియములను నేను అని చింతింపుమని యుపదేశించెను ఆప్రకారము వాఁడు చింతనచేయుచు రాఁగా ఆనామ రూపములు తోఁచక అద్వితీయుఁడై పరిపూర్ణుఁడైనఆత్మ నేనను నిశ్చయముకలిగి కృత కృత్యుఁడాయెను. భవిష్యత్ప్రతిబంధ మనఁగా: ఉపస్థితమైన పాపకర్మము ముముక్షువునకు ఒకవిధమునందు రూఢముగాఁదోఁచి దయారూపమయిన ఆసక్తిని బుట్టించునది. ముముక్షువైనవాఁడు ఆయాసక్తిని భవిష్యత్ప్రతిబంధమని తెలిసికొనక అసంగుఁడును అకర్తయును అయిన నన్ను నేమిసేయఁగలదని దానిని లక్ష్యముసేయకుండినయెడల వానికి అది కొన్నిజన్మములను కలిగింపకమానదు. ఇందుకు దృష్టాంతముగా శ్రుతిస్మృతి పురాణములందు వామదేవునికి ఒక్కజన్మము కలిగెననియు, భరతునకు మూఁడుజన్మములు కలిగెననియు, మఱికొందఱు పెక్కుజన్మము లెత్తిరనియుఁ జెప్పఁబడియున్నది. కనుక నీ త్రివిధప్రతిబంధముల నెవ్వఁడు నశింపఁజేసికొనుచున్నాఁడో వానికి ముక్తి సిద్ధమని వేదాంతసిద్ధాంతము.

అవతారిక.—ముందుచెప్పిన జ్ఞాని ఆత్రిమూర్తులకు సముఁడనిన ఆమహిమలు అజ్ఞానియందు ఏలలేవని శిష్యుఁ డడుగుచున్నాఁడు.

ఉ. ఈతని కాత్రిమూర్తులకు నెవ్విధ మీడగు వారు లోకమం
డాతతసర్వశక్తియుతు లాగమవేద్యు లభిజ్ఞు లంచుఁ బ్ర
ఖ్యాతిగ నెందు వింద మితఁ డాజగదాదిసమస్తకృత్యసం
ఘాతమునందు నొక్కటియుఁ గల్గినవాఁ డని చెప్పవింటిమే. ౮౨

టీ. ఈతనికిన్=ఈబ్రహ్మవేత్తకు, ఆత్రిమూర్తులకున్=ఆ బ్రహ్మ విష్ణు రుద్రులకును, ఎవ్విధము=ఏలాగు, ఈడు=సమానము, అగును. వారు=ఆత్రిమూర్తులు, లోకమందున్=జగత్తునందు, ఆతత=అతిశయమైన, సర్వశక్తియుతులు=సృష్టిస్థితిసంహారశక్తులతోఁగూడినవారు, లేక సర్వజ్ఞ నిత్యతృప్తి అనాదిబోధ సర్వస్వతంత్ర నిత్యమలుప్త అనంతము లనెడి షడ్విధసామర్థ్యములతోఁగూడినవారు, ఆగమవేద్యులు = వేదాగమశాస్త్రపురాణాదులచేతఁ దెలియఁబడువారు, అభిజ్ఞులు=పండితులు, అంచున్=అనుచు, ఎందున్=ఎచ్చటను, ప్రఖ్యాతిగన్=ప్రసిద్ధిగ, విందుము. ఇతఁడు=ఈజ్ఞాని, ఆజగ... మునందు-ఆ=వారిసంబంధమైన, జగత్=ప్రపంచముయొక్క, ఆది=మొదలగు, సమస్త=సమస్తములైన, కృత్య=సృష్టిస్థితిసంహారాదికార్యములయొక్క, సంఘాతమునందున్=

సమూహమందు, ఒక్కటిసేయఁగన్=ఒక్కటిగాఁజేయునను, కల్గినవాఁడని=కలవాఁడని, చెప్పన్=ఎవరైనఁజెప్పఁగా, వింటిమే=వింటిమా, అనఁగా విన లేదనుట.

తా. ఈబ్రహ్మవేత్తకును, ఆ బ్రహ్మవిష్ణురుద్రాదులకును ఇవ్విధముగ సమానమౌను. ఆత్రిమూర్తులు జగత్సృష్టిస్థితిసంహారములఁ జేయుచుందురు ఇవిగాక సర్వజ్ఞత్వము నిత్యతృప్తత్వము అనాదిబోధత్వము స్వతంత్రత్వము నిత్యమలుప్తత్వము అనంతసామర్థ్యత్వము అనెడి ఆఱుసామర్థ్యములు గలవారనియును, వేదాగమపురాణాదులచేతఁ దెలియఁబడువారనియును, మహాప్రవీణులనియును ఎచ్చోటను వినుచున్నాము. వారిచేత నిర్మింపఁబడినవస్తువులలో నితఁడు ఒకఁడైయుండియు, వారుచేయుచుండెడికార్యములలో నొక్కటియైనఁ జేయఁగలవాఁడని యెవరైనఁజెప్పఁగా వింటిమాయని శిష్యుఁడడిగెనని తాత్పర్యము.

అవతారిక.—శిష్యుఁడడిగిన ఆప్రశ్నకు ఉత్తరముఁ జెప్పుచున్నారు.

చ. ఘటజలదీపము ల్గృహముఁ గాచుఁ దటాకజలప్రదీపము
ల్పటుపుటభేదనం బటులు బ్రహ్మవిదుండు శివుండు విద్య నొ
క్కటి యగుఁగాన బ్రహ్మహవికారపుమాయ నవిద్య వారు సం
కటములఁ దారతమ్యములుగా వెలుఁగొందుదు రెంచిచూడఁగన్.

టీ. ఘటజలదీపములు=కుండనీరును దీపమును, గృహమున్=ఒకయింటిని, తటాకజలప్రదీపముల్-తటాకజల=చెఱువునీరును, ప్రదీపముల్=దివిటియును, పటు=పెద్దదైన, పుటభేదనంబున్=పట్టణమును, కాచున్=కాపాడును, అటులు=ఆప్రకారము, బ్రహ్మవిదుండు=బ్రహ్మవేత్త శివుండు=శివుఁడు, విద్యన్=జ్ఞానముచేత, ఒక్కటియగున్=ఒక్కటేయగును, కానన్=కాఁబట్టి, బ్రహ్మహవికారపుమాయన్-బ్రహ్మహ=బ్రహ్మహత్యాస్వరూపమైన, వికారపుమాయన్=వికారమాయచేతను, అవిద్యన్=అజ్ఞానముచేతను, వారు=ఆశివబ్రహ్మవిదులు, సంకటములన్=కష్టములయందు, తారతమ్యములుగాన్=హెచ్చుతక్కువలుగాను, ఎంచిచూడఁగన్=యోజింపఁగా, వెలుఁగొందుదురు=ప్రకాశించుచుందురు.

తా. ఒకకడవజలమును దీపమును ఇంటినిఁగాపాడును. చెఱువునీరును పెద్దదివిటియును ఒకపట్టణమునుగాపాడును. ఆప్రకారమే బ్రహ్మవేత్తయును శివుఁడును వివేకముచేత ఒక్కటేయగును. బ్రహ్మహత్యాస్వరూపమైన వికారపుమాయచేతను, అజ్ఞానముచేతను ఆశివబ్రహ్మవిదులు కష్టసుఖములయందు తారతమ్యము గలవారైయుందురని తాత్పర్యము.

అవ.—దేవతలకును నరులకును వ్యక్తులచేత తారతమ్యములు వేర్వేఱుగానుండినను అందఱకు ఆధారభూతమైన బ్రహ్మజ్ఞానము ఒక్కటియేయని శిష్యునకుఁ జెప్పుచున్నారు.

మ. నరవారంబున భూపసిద్ధులక్రియ న్నారాయణాజేశు లా
సురలం దష్టవిభూతిశక్తియుతులై శోభింతు రాలీల లీ

నరులం దొక్కటియైన లేక సుత హీనప్రాణులై యున్న ను
ర్వర విజ్ఞానముచేత నొండె యగు సర్వప్రాణుల ట్లర్భకా. ౭౭

టీ. అర్భకా=పుత్రుఁడా, ఉర్వరన్=భూమియందు, నర...క్రియన్-నరవారంబునన్=మనుష్యసమూహమునందు, భూపసిద్ధక్రియన్-భూప = రాజు, సిద్ధుల=సిద్ధపురుషులు, క్రియన్=వలెను, ఆ=ప్రసిద్ధులయిన, సురలందున్=దేవతలయందును, నారాయణాజేశులు-నారాయణ=విష్ణువు, అజ=బ్రహ్మ, ఈశులు=రుద్రుఁడు, అష్టవిభూతిశక్తియుతులై = అణిమాద్యష్టవిధసామర్థ్యములతోఁ గూడినవారై, శోభింతురు=ప్రకాశింపుదురు, అలీలలు=ఆక్రియలు, ఈనరులందున్=ఈమనుష్యులయందు, ఒక్కటియైనన్=ఒక్కటియైనను, లేక=లేక, హీనప్రాణులై = నశించెడు జీవులై, ఉన్నన్=ఉండినను, సర్వప్రాణులు=సమస్తజీవులు, విజ్ఞానముచేతన్ = వివేకముచేత, ఒండె యగున్=ఒక్కఁడే యగును.

తా. సర్వమును గ్రహింపవలయునను ఆసక్తిగల కుమారా! భూమియందుండెడి మనుష్యసమూహములో రాజువలెను, తపస్సులచేత మణిమంత్రౌషధములను సంపాదించుకొని మాయాజాలములఁజూపెడి సిద్ధపురుషులవలెను, దేవలోకమందుండెడి అనేకభేదములుగల దేవతలలో నారాయణుఁడు, బ్రహ్మదేవుఁడు, రుద్రుఁడు మొదలైనవారు గొప్పవారగుదురు. ఆరాజసిద్ధపురుషులకార్యములును, ఈమనుష్యులందఱియందును, బ్రహ్మవిష్ణురుద్రాదులకార్యములు ఆదేవతలందఱియందును లేనిరీతిని ఈమనుష్యులు నశించువారైనను, ఆదేవతలు కొంతకాలము జీవించువారైనను, వారికిని వీరికిని అధారభూతమైన పరబ్రహ్మతత్వజ్ఞానము ఒక్కటేయగునుగాని వేఱొకవిధముగాలేదని తాత్పర్యము.

"శ్రు. ఆత్మావా ఇదమేకఏవాగ్ర ఆసీత్, సదేవసోమ్యేదమగ్రఆసీత్, అజామేకాంలోహితశుక్లకృష్ణామ్" అనెడి మొదలైనశ్రుతిప్రమాణములచొప్పున నామరూపాదివికారములులేక దేశకాలవస్తుపరిచ్ఛేదరహితమై ప్రకాశించెడిపరబ్రహ్మమునందు ప్రకృతియొక్క కూడికచేత అవ్యక్తాదినామములుగలిగి "తదైక్షతబహుస్యాంప్రజాయేయ" యనుశ్రుత్యర్థముచొప్పున అనేకవిధములగు నామరూపములఁదోఁచెను. "ద్వయాహప్రాజాపత్యా దేవాశ్చాసురాశ్చతతః, కానీయసా ఏవదేవాజ్యాయసా అసురాఃత్రయేషులోకేష్వస్పర్ధన్తతే హదేవాఊచుర్హన్తాసురాన్యజ్ఞ ఉద్గీథేనాత్యయామేతి" అను బృహదారణ్యకశ్రుత్యర్థమురీతిని ఆపరబ్రహ్మముయొక్క వాగాదింద్రియములే శమాదిదైవసంపదతోఁగూడి దేవతలుగాను, కామక్రోధాద్యాసురసంపదతోఁగూడి రాక్షసులుగాను, ఆదైవాసురసంపదలు సమానమగునపుడు మనుష్యులుగాను అగుననియు. "సత్త్వం రజస్తమ ఇతి నిర్గుణస్యగుణాస్త్రయః, స్థితిసర్గనిరోధేషు గృహీతామాయయావిభోః" అనుశ్లోకప్రమాణముచేత నిర్గుణస్వరూపమైన పరబ్రహ్మమునకు సృష్టిస్థితి సంహారములకో

లకు బ్రహ్మ విష్ణు మహేశ్వరరూపములు కలుగుటయేగాక అందఱయందును అన్నిటియందును వ్యాపించియుండెడి ఆత్మయొక్క చేయునియు బ్రహ్మజ్ఞానము అందఱకు సమానమనియు భావము.

అవతారిక:—అణిమాదులీశ్వరునివైనను జ్ఞానులకెలాగునఁగల్గునన ఆ ఈశ్వరునిఁ గూర్చి యుపాసించినఁగల్గునని ఆచార్యులు చెప్పుచున్నారు.

మ. అణిమాద్యష్ట విభూతులందు మహనీయప్రాజ్ఞులై యుండ ధా
రుణియం దెందఱొ తన్మహత్త్వములు శ్రీరుద్రస్వరూపంబులై
గణుతింపంబడు నంటి రెట్లనఁగ నాకామారి నర్చించి త
త్ప్రణతిస్తోత్రముఖాఖిలక్రియలచేఁ దత్సిద్ధులై రెంతయున్. ౪౫

టీ. ధారుణియందున్=పుడమియందు, ఎందఱో=ఎందఱో, అణిమాద్యష్టవిభూతులందున్=అణిమాది అష్టవిధసిద్ధులయందు, మహనీయప్రాజ్ఞులై=ఒప్పిదముగల ప్రజ్ఞగలవారై, ఉండన్=ఉండఁగా, తన్మహత్త్వములు=ఆప్రభావములు, శ్రీరుద్రస్వభావంబులై-శ్రీ=శోభాయుక్తమైన, రుద్ర=ఈశ్వరునియొక్క, స్వభావంబులై=నైజములై, గణుతింపంబడునంటిరి=లోకమందెన్నఁబడునంటిరి, ఎట్లు=అదెట్లు, అనఁగన్=అనియడుగఁగా, ఆకామారిన్=ఆ ఈశ్వరుని, తత్ప్రణు...లచేన్-తత్=ఆసంబంధమైన, ప్రణతి=నమస్కారములు, స్తోత్ర=స్తుతులు, ముఖ=మొదలగు, అఖిల=సమస్తములైన, క్రియలచేన్=పనులచేత, అర్చించి=పూజించి, ఎంతయున్=తద్దయును, తత్సిద్ధులైరి=అట్టిసిద్ధులుపొందినవారైరి.

తా. పుడమియందెందఱో అణిమాద్యష్టమహైశ్వర్యములను పొందినవారైయుండఁగా ఆసామర్థ్యములు సర్వప్రకాశముగల తటస్థేశ్వరునియొక్క ధర్మములై జగత్తునందులెక్కింపఁబడుచున్నవని యానతిచ్చితిరి. అవి వీరికెట్లుప్రాప్తించినవని యడుగఁగా ఆ తటస్థేశ్వరుని అర్చించుట మొదలైనకార్యములచేత మెప్పించి ఆయనవలన పొందినవారైరని తాత్పర్యము.

అవతారిక:—ముందుండిన జ్ఞానులవలె ఇప్పుడుండెడి జ్ఞానులకు అణిమాదులు ఏల లేవని శిష్యుఁడడుగుచున్నాఁడు.

చ. శివగురుమూర్తి ముక్తిఘనసిద్ధులు తాపసపంక్తికన్న వా
రివలె సమస్తతాపసులు రీతిగఁ బొందుదురొక్కొ యట్టివా
రవని వెలుంగఁ దన్మహిమలాదిని విందుము వీరి కేల లే
వవి యిపు డావివేక మిది యందు నచించితి రేల యిట్లనన్. ౪౬

టీ. శివగురుమూర్తి=శివస్వరూపుఁడైన గురుస్వామి, అవనిన్=భూమియందు, ముక్తిఘనసిద్ధులు-ముక్తి=జీవన్ముక్తియు, ఘనసిద్ధులు=అతిశయములైన అష్టసిద్ధులును,

తాపసపుంక్తికిన్=తపోనిష్ఠగలవారికిని, అన్నన్=అనినను, వారివలెన్=ఆతపస్వులవలెనే, రీతిగన్=క్రమముగా, సమస్తతాపసులు=జీవన్ముక్తులందఱు, పొందుదురోకొ=పొందుదురాయేమి, అట్టివారు=అణిమాదిసిద్ధులనుపొందినవారు, ఆదిన్=ముందు, వెలుఁగన్=ప్రకాశింపఁగా, తన్మహిమలు=ఆ మాటినవారి ప్రభావములు, విందుము=ఆలకింపుదుము, ఇపుడు=ఇప్పుడు, అవి=ఆమహిమలు, వీరికిన్=ఈకాలమందలి బ్రహ్మజ్ఞానులకు, ఏలలేవు=ఎందుకులేవు, అవివేకము=ఆపెద్దలుపొందినజ్ఞానమే, ఇదియుంచుకన్= ఇపుడుండువారు పొందినదని, ఏల=ఎందుకు, వచించితిరి= వక్కాణించితిరి, ఇట్లనన్= ఇట్లనిచెప్పఁగా, ముందరికన్వయము.

తా. గురుస్వామీ! భూమియందు జీవన్ముక్తియు అణిమాద్యష్టసిద్ధులును తపోమహిమగలవారలకు లభించునని చెప్పినపక్షమున వారివలెనే యీజీవన్ముక్తులు పొందుదురాయేమి? ఆయణిమాదిసిద్ధులను పొందినవారిని వినియున్నాముగాని యిపుడుండెడి యీ బ్రహ్మజ్ఞానులయందు ఆసిద్ధులు కనఁబడవే; ఏల అట్టిజ్ఞానమే ఇప్పుడుండెడివారు పొందినదని వక్కాణించితిరని తాత్పర్యము.

అవతారిక:—శిష్యుఁడడిగిన ఆప్రశ్నకు ఉత్తరము చెప్పుచున్నారు.

శా. కామ్యాకామ్యములందపం బుభయమై కన్పట్టు నందొండు ప్రా
కామ్యాద్యష్టక మిచ్చు వేఱొకటి సత్కైవల్య మొందించు ము
న్నామ్యగ్రామణి రెండు నొండు మది కిష్టంబైన సాధించి త
ద్భ్రామ్యాభ్రామ్యఫలంబు లొందుదురు మద్భావంబిదే పుత్రకా.

టీ. పుత్రకా=కుమారా! తపంబు=తపస్సు, కామ్యాకామ్యములన్=కామనాతపమనినిష్కామనాతపమని, ఉభయమై=రెండువిధములుగలదై, కన్పట్టున్=మాపట్టును, అందున్=ఆరెంటిలోపల, ఒండు=ఒకతపస్సు, ప్రాకామ్యాద్యష్టకము=ప్రాకామ్యముమొదలగుయెనిమిదిసిద్ధులను, ఇచ్చున్=ఒసఁగును, వేఱొకటి=మఱియొకటియైననిష్కామనాతపము, సత్=శ్రేష్ఠమైన, కైవల్యము=మోక్షమును, పొందించున్=పొందులాగునఁజేయును, మదికిష్టంబైన=మనస్సునకిష్టమైన, రెండున్=రెంటిని, ఒండున్=ఒకటిని, సాధించి=(తపస్సులచే)సాధించి, తద్భ...దురు-తత్=అట్టి, భ్రామ్య=భ్రమతోఁగూడినసిద్ధియొక్కగాని, అభ్రామ్య=భ్రమరహితమైనమోక్షముయొక్కగాని, ఫలంబులు=ఫలములు, ఒందుదురు=చెందుదురు, మద్భావంబు=నాయభిప్రాయము, ఇదే=ఇదియని తెలిసికొనుము.

తా. కుమారా! శీతవాతోష్ణములకు సహించుకొనిచేయునట్టితపము తనయిష్టములనుఁగూర్చిచేయునదియును, ఈశ్వరార్పణబుద్ధిచేతఁజేయునదియును అనిరెండువిధములగును. అందొకటి ఈశ్వరునిసగుణోపాస్తిచేతనారాధించుటవలన అణిమాద్యష్టైశ్వర్యములనిచ్చును. వేఱొకటి ఒకకోరికయులేక ఆఈశ్వరుని అపరోక్షజ్ఞానముచేత నిర్గుణునిగా ఉపా

సించినవారికి మోక్షము గలుగఁజేయును. మంచివివేకముకలిగినవారిలో శ్రేష్ఠుఁడవైన శిష్యుఁడా? ముందుండినబుధులలో కొందఱు కామనాతపస్సు నిష్కామనాతపస్సుఅను రెంటిని మఱికొందఱు కేవల కామనాతపస్సుమాత్రమును, మఱికొందఱు నిష్కామనా తపస్సుమాత్రమును, వారివారిమనస్సుల కిష్టమైనటులు చేసి భ్రమతోఁగూడిన అల్పవైశ్వ ర్యములను భ్రమరహితమైన పునరావృత్తిలేని కేవల మోక్షఫలమును పొందిరి నాయభి ప్రాయంబిదియని తెలిసికొనుమని తాత్పర్యము. ౨ందుగురు అను తద్ధర్మార్థకాల క్రియాప దప్రయోగముచేత ఈకాలమందును ఇఁకమీఁద రాఁబోయెడికాలమందును ఈప్రకా రమేపొందుచుందురు అని భావము.

౹౹శ్రు. యథామృతేనతృప్తస్యపయసా కిం ప్రయోజనమ్, ఏవంస్వాత్మానంజ్ఞాత్వా వేదైః కిం ప్రయోజనంభవతి, వేదశాస్త్రపురాణాని పదపాంసుమివ త్యజేత్ ౹౹ అనఁగా అమృతపానముచేసి తనివిఁజెందినవానికి నీళ్లతో నక్కఱలేనివిధమున బ్రహ్మజ్ఞానమును జెందినవానికి వేదములతో నక్కఱలేనిచందమున భ్రమతోఁగూడిన అష్టమహాసిద్ధులు మొ దలయిన అల్పవైశ్వర్యములు బ్రహ్మవేత్తలకు ఎందుకనిభావము. ౹౹త్రైగుణ్యవిషయా వేదానిస్త్రైగుణ్యోభవార్జున౹౹ అని భగవద్గీత. అనఁగా త్రిగుణములతోఁగూడినవి విష యాదులు త్రిగుణరహితమైనవి వేదములు గనుక నిర్విషయాసక్తిగల బ్రహ్మవేత్తలకు త్రిగుణసంబంధములగు కోరికలు ఉండవని భావము.

అవతారిక:—అణిమాదిసిద్ధులు ప్రత్యగభిన్నబ్రహ్మైక్యమునకు అనావశ్యకములని నిరూపించుచున్నారు.

మ. బలివైదేహభగీరథాదులు చిదభ్యాసంబున న్ముక్తిను
 జ్జ్వలకామ్యక్రియలం గృశించి మహిమల్సర్వజ్ఞులై మౌను ల
 న్యులు తన్నిష్ఠల రెంటినిం గనిరి చిద్యోగాప్తి కాసిద్ధు లె
 ట్టులనీశానువినోదమాత్రములె యాటోపంబె తామొందినన్. ౪౮

టీ. బలి...దులు-బలి=బలిచక్రవర్తియు, వైదేహ=జనకమహారాజు, భగీరథ=భగీ రథమహారాజు, ఆదులు=వీరు మొదలగురాజర్షులు, చిదభ్యాసంబునన్-చిత్=అపరోక్ష సాక్షాత్కారబ్రహ్మజ్ఞానముయొక్క, అభ్యాసంబునన్=ఎడతెగనియలవాటుచేత, ము క్తిన్=జీవన్ముక్తిని, మౌనులు=మునులు, కామ్యక్రియలన్=కామనాతపస్సులచేత, కృ శించి=కృఛ్రచాంద్రాయణ నిత్యనైమిత్తికవ్రతోపవాసాదులచేత బడలికనొంది, సర్వ జ్ఞులై=విశేషజ్ఞులై, మహిమలు=అణిమాద్యష్టైశ్వర్యప్రభావములను, అన్యులు=మఱికొం దఱు, తన్నిష్ఠలన్=ఆకామ్యాకామ్యతపములచేత, రెంటినిన్=ఆరెంటిని,కనిరి=కాంచిరి, చిద్యోగాప్తికిన్-చిత్=జ్ఞానముచేత, యోగ=ప్రత్యగభిన్నబ్రహ్మైక్యముయొక్క,

ఆప్తికిన్=ప్రాప్తికి, అసిద్ధులు=అణిమాదిసిద్ధులు, ఎట్టులన్=ఏప్రకారముగాను, ఈడౌను=జతయగును, వినోదమాత్రములై=వేడుకలకొఱకే (అగును) తాము=అకామ్యపరులు, పొందినన్=అసిద్ధులనుపొందినను, ఆటోపంబె=ఆడంబరమే (అగును.)

తా. బలిచక్రవర్తి, జనకమహారాజు, భగీరథమహారాజు మొదలగు రాజర్షులు బ్రహ్మజ్ఞానమందు ఎడతెగనియలవాటుచేత జీవవిదేహముక్తులఁబొందిరి. కొందఱుమునులు శరీరేంద్రియాదులను వ్రతోపవాసాదులచేత కృశింపఁజేసి విశేషజ్ఞులై అణిమాద్యష్టైశ్వర్యములఁబొందిరి. మఱికొందఱు కామ్యాకామ్యతపస్సులచేత గంటిసిఁబొందిరి. కాఁబట్టి జ్ఞానముచేత ప్రత్యగభిన్న బ్రహ్మైక్యమునకు అసిద్ధులు సమానములు కావనియు వారు పొందినసిద్ధులు వేడుకలు ఆడంబరములుకాని ప్రయోజనములుకావనియు తాత్పర్యము.

॥శ్లో. అస్తిభాతిప్రియంనామరూపంచేత్యంశపంచకమ్, ఆద్యత్రయంబ్రహ్మరూపం మాయారూపంతతోద్వయమ్॥ ॥ఆత్మానాత్మవివేకంతు కృత్వాతిష్ఠతియఃపుమాన్, జటిముండీశిఖీవాపి ముచ్యతేనాత్రసంశయః॥ అనఁగా ఎవఁడైతే ఆత్మానాత్మజ్ఞానముచేత ప్రత్యగాత్మతానని ఎఱుఁగుచున్నాఁడో వాఁడు యోగిగానుండినను, సన్న్యాసిగా నుండినను, గృహస్థుఁడుగానుండినను, నిస్సందేహముగా ముక్తినిఁ జెందుచున్నాఁడని భావము. అస్తిఅనఁగా సత్తు, భాతిఅనఁగా చిత్తు, ప్రియమనఁగా ఆనందము, నామరూపములు అనాత్మ కాఁబట్టి ఆత్మస్వరూపమైన అస్తిభాతిప్రియములనుగ్రహించి మాయారూపమగు నామరూపములను విడువవలయునని భావము.

అవతారిక:—అణిమాదిసిద్ధులచేతఁ బ్రయోజనములులేవని తెలిసిన కొందఱు జ్ఞానులు ఏల వానిఁగోరుచున్నారని శిష్యుఁడడుగఁగా దానికి ఉత్తరముచెప్పుచున్నారు.

శా. యోగజ్ఞానము ముక్తినీయఁ గని తద్యోగంబు చాలించి ము
న్రాగాసక్తమనస్కులై మహిమలన్ సాధింప శారీరస
ద్భోగంబుల్ దొలఁగంగ నేల యనఁ దా భోగించిన స్సంచిత
త్యాగంబౌ సుతకానఁబూనుదురు తత్కామ్యక్రియ లల్పఁగాన్.

టీ. మున్=ముందు, యోగ=జీవేశ్వరైక్యరూపమైన, జ్ఞానము=బ్రహ్మజ్ఞానము, ముక్తిన్=జీవన్ముక్తిని, ఈయన్= ఇచ్చుచుండఁగా, కని=చూచి, తద్యోగంబు=అట్టియోగము, చాలించి=విడిచి, రాగాసక్తమనస్కులై, రాగ=కోరికలయందు, ఆసక్త=కూడిన, మనస్కులై = అంతఃకరణములుగలవారై, మహిమలన్= మాహాత్మ్యములను, సాధింపన్=సాధించుటకుగాను, శారీరసద్భోగంబులు-శారీర=శరీరసంబంధములైన, సత్=శ్రేష్ఠములైన, భోగంబులు=ఆహారనిద్రాదులు, తొలఁగంగ నేలయనన్=విడుచుటేలయనిశిష్యుఁడడుగఁగా, సుత=కుమారా, తాభోగించినన్- తాన్=తానైనపురుషుఁడు, భోగించినన్= అనుభవించినను, సంచితత్యాగంబు = ప్రారబ్ధరూపమైనజన్మార్జితము, త్యా

గంటాన్=విడుచుచు, కావున్=కాఁబట్టి, తత్కామ్యక్రియలు=అకామనాకర్మములు, సల్పఁగాన్=చేయుటచేఁగాను, పూనుదురు=కోరఁదలుయత్నింతురు.

తా. ముందు జీవేశ్వరైక్యరూపమైన బ్రహ్మజ్ఞానము మోక్షము నిచ్చుచుండఁగా అట్టియోగమను తెలిసికొనియుండియు వ్యర్థమైనరాగాదులతోఁగూడిన అంతఃకరణములు గలవారై దానినివిడిచి శరీరేంద్రియప్రయాసములతోఁగూడి అహోనిద్రలుమాని యుండుట యేలయని శిష్యుఁడడుగఁగా ఆచార్యులు ఓశిష్యుఁడా! జన్మాంతర సంచితకర్మాను భవము అనుభవించినఁగాని తీరదు. కాఁబట్టి అకామనాక్రియలనుగుఱించి కొందఱు ప్రయత్నపడుదురని తాత్పర్యము.

అవతారిక:—సందేహమునఁబోఁగొట్టిన యాచార్యులను శిష్యుఁడు భక్తివలన విశేషము స్తుతించుచున్నాఁడు.

మ. సకలోపాయసమస్తవేదవిధులన్ స్వాంతస్థిరప్రాప్తికై
యకలంకార్థ మనుగ్రహించినమదీయాచార్య భ్రాంతుల్ తొలఁగ
న్ప్రకటజ్ఞానము గంటి దుమ్ము తుడువన్ బల్మాఱు భాసిల్లుస
న్ముకురంబట్లుభవన్మహోక్త్యమృతమామోదంబగున్గ్రోలినన్. ౫౦

టీ. సకలో...విధులన్-సకల=సమస్తములైన, ఉపాయ=తర్కములచేత, సమస్తవేదవిధులన్, సమస్త=అనేకములైన, వేద=ఋగ్యజుస్సామాథర్వణములయందలి, విధులన్=విధానములచే, స్వాంత=నామనస్సుయొక్క, స్థిర=స్థైర్యముయొక్క, ప్రాప్తికై=పొందుటకై, అకలంకార్థము=నిష్కళంకమైనపరబ్రహ్మజ్ఞానమును, అనుగ్రహించిన=కటాక్షించిన, మదీయాచార్య=మద్గురుస్వామి, భ్రాంతుల్=జీవేశ్వరజగద్భ్రమలు, తొలఁగన్=వీడునటులు, ప్రకటజ్ఞానము-ప్రకట=ప్రసిద్ధమైన, జ్ఞానమున్=నిర్మలజ్ఞానమును, కంటిన్=పొందితిని, పల్మాఱు=మాటిమాటికిని, దుమ్ముతుడువన్-దుమ్ము=ధూళి, తుడువన్=తుడువఁగా, భాసిల్లు=ప్రకాశించు, సన్ముకురంబట్లు=శుద్ధమైనయద్దమువలె, భవన్మహోక్త్యమృతము, భవత్=నీయొక్క, మహోక్తి=జీవబ్రహ్మైక్యరూపమైనమహావాక్యార్థములనెడి, అమృతము=అమృతమును, గ్రోలినన్=పానముచేయుచుండిన, ఆమోదంబగున్=ఆనందము కలుగును.

తా. సమస్తములైనతర్కయుక్తులచేతను వేదవిధులచేతను నాయొక్క చిత్తస్థైర్యము కొఱకు నిష్కళంకమైన పరబ్రహ్మజ్ఞానమును ఉపదేశించితిరి. గురుస్వామీ! నాయందు బహుకాలముగానుండిన జీవేశ్వరజగద్భ్రమలు మూఁడునువీడెను. నిర్మలమైనవిజ్ఞానమును పొందితిని. నిర్మలమగు అద్దమైనను అప్పుడప్పుడుదానియందు తగిలినదుమ్మును తుడిచినను గదా ప్రకాశించును. అటువలెనే మీయొక్క ఉపదేశమహావాక్యార్థ మనెడియమృతమును పానముచేయుచేయ ఆనందముకలుగుచుండునని తాత్పర్యము.

అవతారిక:— ప్రథమసృష్టియైనజీవేశ్వర జగద్వ్యవహారములు ప్రారబ్ధమని తెలిసికొని నశిష్యుఁడు దానికికారణమైన జగత్సృష్టికిఁగుండఁ గొంచిదియున్న ప్రారబ్ధసంచితము అనుభవింపనిలేననియు జ్ఞానాగ్నిచే నశించుననియు అను రెండువిధముల వేదముపల్కుచున్నందున వానిలో యథార్థమేదియని శిష్యుఁడడుగుచున్నాఁడు.

మ. కపటోక్తుల్ శ్రుతి పల్కునే యెవరికిన్ గర్మానుబంధంబు లీ
విపుల న్భుక్తములైనఁగాక చెడునా విజ్ఞానదావాగ్ని శు
ష్కపలాశంబులమాడ్కి నేర్చునని పల్కన్ రెంట మచ్చిత్తము
చ్చపలంబందె నిజంబు దెల్పు మెద నిస్సందేహము న్జెందఁగన్.

టీ. శ్రుతి=వేదము, కపటోక్తులు=వంచకములైనపలుకులు, పల్కునే=పచించునా, ఎవరికిన్=ఎంతవారికిని, కర్మానుబంధంబులు=కర్మప్రతిబంధములు, ఈవిపులన్=భూమియందు, భుక్తములైనఁగాక=అనుభవింపకగాని, చెడవు=నశింపవు, ఆవిజ్ఞానదావాగ్నిన్=జ్ఞానమనెడికార్చిచ్చునందు, శుష్కపలాశంబులమాడ్కిన్= ఎండుటాకులరీతిని, ఏర్చున్=కాల్చును, అనిపల్కన్=అనిపల్కఁగాను, రెంటన్=ఈరెండువిధములైనవాక్యములచేతను, మచ్చిత్తము=నామనస్సు, ఉచ్చపలంబు=అతిచపలభావమును, అందెన్=పొందెను, ఎదన్=మనస్సునందు, నిస్సందేహమున్= అనుమానములేకుండుటను, చెందన్=పొందుటకుఁగాను, తెల్పుము=అనతిమ్ము.

తా. వేదము వంచకములైనమాటలు పచించునా? యెంతవారికిని జన్మాంతరమందార్జింపఁబడిన కర్మప్రతిబంధములు ఈభూమియందుపుట్టి అనుభవింపకగాని తీరవనియొకచోటను, ఆచార్యసన్నిధానమందు వేదాంతశ్రవణముచేయఁగాఁ గలిగినబ్రహ్మజ్ఞానమందు కార్చిచ్చునందు ఎండుటాకులుకాలునటులు ఆప్రతిబంధములునుకాలునని మఱియొకచోటను ఈప్రకారము రెండువిధములుగా వేదము వాక్రుచ్చుటవలన నాయుల్లముతల్లడిల్లుచున్నది గాన యీసందేహము తీరునటులు దెలియఁజేయవలయునని తాత్పర్యము.

అవతారిక:— వేదము త్రివిధకాండములచే పూర్వపక్షసిద్ధాంతములఁదెల్పునని ఆచార్యులు శిష్యునకు దృష్టాంతపూర్వకముగాఁ జెప్పుచున్నారు.

మ. అరయ న్జీవులు తద్గుణక్రియ లసంఖ్యాతంబు లౌ వారిప్రా
త్పరిపాకంబు లెఱింగి ప్రోవ మముఁ బుహ్వంబై ఫలం బిచ్చునా
సరణి న్వేదము కర్మభక్తివిలసత్సంవిత్త్రికాండంబుల
న్ధరణి న్వెల్గుచుఁ బూర్వపక్షముల సిద్ధాంతంబులం దెల్పెడిన్. ౫౨

టీ. ధరణిన్=భూమియందు, అరయన్ = విచారింపఁగా, జీవులు=ప్రాణులు, తద్గుణక్రియలు.తత్ =ఆజీవులయొక్క, గుణ = గుణములును, క్రియలు = పనులును, అసంఖ్యాతంబులు=లెక్కలేనివి, కౌన్ = అవును, వారిప్రాత్పరిపాకంబులు - వారి =

జీవులయొక్క, హృత్ = హృదయములయొక్క, పరిపాకంబులు = పరిపక్వములను, ఎఱింగి = తెలిసికొని, ముముక్షు = ముముక్షు, ప్రోవన్ = రక్షించుటకుగాను, మున్నంబె = (తొలుత) పుర్వుపూచి, ఫలంబు = ప్రయోజనము, ఇమ్మన్ = ఒసఁగువట్టి, ఆసరణిన్ = ఆరీతిని, వేదము = ఆమ్నాయము, కర్మ...డంబులన్ - కర్మ = కర్మకాండము, భక్తి = భక్తికాండము, విలసత్ = ఒప్పుచుండెడి, సంవిత్ప్రికాండంబులన్ = జ్ఞానకాండమును, (అను త్రివిధకాండములచేత) వెల్గుచున్ = ప్రకాశింపుచును, పూర్వపక్షములన్ = పూర్వపక్షములను సిద్ధాంతంబులన్ = సిద్ధాంతములను, తెల్పెడిన్ = తెలియఁజేసెడిని.

తా. భూమియందు విచారింపఁగా జీవుల గుణములును పనులును లెక్కలేనివగును. ఆ జీవుల హృదయములయొక్క పరిపక్వముల నెఱిఁగి ఆస్తికులైన ముముక్షు రక్షించుటకుఁగాను ముందుగాఁ బువ్వుపూచి పిదప కాయయై ఆవెనుక ఫలమునిచ్చునటులు వేదము కర్మకాండము, భక్తికాండము, జ్ఞానకాండము అనెడి త్రివిధకాండములచేత ప్రకాశించుచు పూర్వపక్ష సిద్ధాంతములచేతఁ దెలియఁజేయునని తాత్పర్యము. అనఁగా వేదము చెప్పెడిచోప్పున కర్మకాండమును అనుష్ఠించి క్రమముగ శ్రద్ధ జరుపుచురాఁగా సత్త్వ గుణము ప్రబలి తమోరజస్సులు క్షీణింప మొదలుపెట్టును. ఆవెనుక తనకిష్టమైన యొక స్వరూపమునందు భక్తికుదురుచున్నది. ఆభక్తి శ్రద్ధలచేత తన ఇష్టదేవతను నానాఁట నెడతెగనిధ్యానముచేయఁగాఁ జేయఁగా మనస్సు నెక్కడనిలిపితే అక్కడనిలుచును. అప్పుడు కర్మంబులనెల్ల నిష్కామనాపరముగ (అనఁగా ఈశ్వరార్పణముగాఁ) జేయుచు రాఁగా చిత్తము పరిపక్వమగును. ఆచిత్తము పరిపక్వముకాఁగానే ॥యద్బ్రహ్మణిపరేసాక్షా త్సర్వకర్మసమర్పణమ్, మనోవాక్తనుభిఃపార్థ క్రియాద్వైతం తదుచ్యతే॥అను శ్లోక ప్రమాణముచొప్పున సుషుప్తిగుతాయను స్థ్యూలతము లినయా వదింద్రియ క్రియలును బ్రహ్మార్పణముగా భావించును అట్టివారికి ॥శ్లో. కర్మణాంపరిణామత్వా దావిరించ్యాదమంగళమ్, అవశ్యమనుభోక్తవ్యం కృతంకర్మశుభాశుభమ్॥అనురీతిని బ్రహ్మలోకతృణీకారంబు పుట్టుచున్నది. దీనినే వైరాగ్యమందురు. ఆవైరాగ్యముకలవానిమనస్సును దేనియందు నిలిపినను ॥చంచలంహిమనఃకృష్ణ ప్రమాథిబలవద్దృఢమ్, తస్యాహంనిగ్రహంమన్యే వాయోరివసుదుష్కరమ్, అబ్ధిపానాదవిహతః సుమేరోన్మూలనాదపి, అపివహ్న్యశనాత్సాధో విదుషశ్చిత్తనిగ్రహః॥ అను ప్రమాణశ్లోకంబులరీతిని చలనములేక నిలుచును. అందులకు దృష్టాంతము. మనస్సు పాఱుగొడ్డువంటిది. అట్టిపశు వెల్లప్పుడు చేలలోఁబడి మేయుచుండును. దానినిపట్టుట కడుప్రయాసము కాఁబట్టి దానినిఁ దిన్నగఁబట్టుకొని వచ్చి ఇంటిలోఁ గట్టిపెట్టి కసవువేసినను ఆకసవును ఆఘ్రాణించి చేనిమీఁదనే చింతగా నుండును. ఈప్రకారము కట్టిపెట్టినతర్వాత దానినివదలిరేని మఱల నాపైరునుఁ గూర్చి పోవును. తిరుగా మునుపటివలెనే పట్టుకొనివచ్చి తవుడు, కసవు మొదలగువానిని వేసిరేని కొంతసేపు వానినితిని మఱల నాచేనినే ధ్యానముచేయుచుండును. కొంతకాల మీ

తీసిన కనుపెట్టియుండి పట్టుకొనివచ్చి కట్టివేయుచు రానురాను ఇంటిలినమలిగి వెలుపలి కిఁబోలినప్పటికిని మరల నింటికే వచ్చును. చెలమిఁ (దిభి) మువదలి తనఇరవునందే స్థిరముగ నుండును. ఈవిధముననే మనస్సును, కర్మ, భక్తి, జ్ఞాన వైరాగ్యములచేత పరిపక్వపఱచవలయునని వేదాంతసారాంశము.

అవ:——ఆచార్యులు శిష్యునకు నిత్యనైమిత్తికాదిక్రియలకును ఆత్మజ్ఞానమునకును వేదములోఁజెప్పిన ఇరుతెఱఁగులగుఱించి కలిగెడిసందేహము నివృత్తిచేయుచున్నారు.

మ. నిజమై దుర్గతి చెందఁ బాపులు కిలన్ నిత్యవ్రతేష్ట్యన్నదా
నజపాదిక్రియలన్ బోలంగు నను నామ్నాయం బసత్యంబకో
సుజనస్తుత్య నిజాత్మచిచ్ఛిఖి దహింపంచున్ బూర్వహీనార్జిత
వృజినారబ్ధమహావనం బనెడు తద్వేదంబు నిక్కంబె యా. ౪౩

టీ. సుజనస్తుత్య=సత్పురుషులచేత స్తోత్రముచేయఁదగినశిష్యుఁడా, ఇలన్=భూమియందు, పాపులకున్=(దుర్గుణస్వభావముగలవారైన) పాపాత్ములకు దుర్గతి=నరకము, నిజమై=యథార్థమై, చెందన్=చెందఁగా, నిత్య...యలన్-నిత్య=(నిరంతరముచేయఁదగిన స్నాన సంధ్యాది) నిత్యకర్మములును, వ్రత=(నైమిత్తికములైన ఏకాదశ్యాది) మహావ్రతములును, ఇష్టి=దర్శపౌర్ణమాసప్రతిపదస్థాలీపాకేష్టులును, అన్నదాన=అన్నదానములును, జప=గాయత్ర్యాదిజపములును, ఆది=మొదలగు, క్రియలన్=సత్క్రియలచేతను, తొలంగునను=పోవునని చెప్పు, ఆమ్నాయంబు=వేదము, అసత్యంబకో=అబద్ధమా (నిజమే యగుననుట.) నిజ=స్వకీయమైన, ఆత్మచిచ్ఛిఖి=ఆత్మజ్ఞానమనెడు అగ్ని, పూర్వహీనార్జిత వృజినారబ్ధ మహావనంబు-పూర్వ=ముందటి, హీన=హీనములైనజన్మములచేత ఆర్జిత=సంపాదింపఁబడిన, వృజిన=పాపములతోఁగూడిన, ఆరబ్ధ=ప్రారబ్ధమనెడి, మహత్=అధికమైన, వనంబున్=అడవిని, దహింపున్=కాల్చును, అనెడు=అనిచెప్పెడి, తద్వేదంబు=ఆవేదము, నిక్కంబెయౌన్=(ఆప్రకారమె) యథార్థమగును.

తా. మంచివివేకముగలిగిన శిష్యుఁడా? అవనియందు పాపాత్ములగువారికి రౌరవాదినరకవాసము నిత్యనైమిత్తిక వ్రతోపవాసాదిక్రియలచేతఁ బోవునని చెప్పిన వేదవాక్యము అసత్యముకాదు. ఆత్మజ్ఞానమనెడి అగ్ని ముందు హీనజన్మములెత్తి సంపాదింపఁబడి పాపముతోఁగూడిన ప్రారబ్ధమనెడి గొప్పఅడవినికాల్చునని చెప్పిన ఆ వేదవాక్యము సత్యమేయగునని తాత్పర్యము.

అవతారిక:—సంచితమును చెఱిపెడి జ్ఞానముండఁగా కర్మమార్గము నపేక్షించుటేలయని శిష్యుఁడడుగుచున్నాఁడు

ఉ. మన్మన మాత్మగేహమున మానక నిల్చు గురూగ్రమూర్తియా
జన్మకుజాంఘ్రిఁ దుంపఁ బటుశక్తుఁడ వీవు భవన్మహోక్తిచే

నున్మనిఁ గంటి నేల కడు నూర్జితులైన నరాసురామరు
ల్సన్మయనిష్ఠ మాని పడి చత్తురు కర్మపుపాడునూతిలోన్. ౫౪

టీ. మన్మనము=నామనస్సు, ఆత్మగేహమునన్-ఆత్మ=స్వకీయమైన, గేహమునన్=ఇంటియందు, (అనఁగా దేవాలయమనుట.) మానక=విడువక, నిల్చు=వసించెడి, గురూగ్రమూర్తి=గురుశివమూర్తి, ఈజన్మకుజాంఘ్రిన్-ఈజన్మ=ఈజన్మమనెడు, కుజ=వృక్షముయొక్క, అంఘ్రిన్=(కుంకటి) వేరును, త్రుంపన్=ఖండించుటకు, పటుశక్తుఁడవు=మంచిసామర్థ్యముగలవాఁడవు, ఈవే=నీవే, భవన్మహోక్తిచేన్-భవత్=నీయొక్క, మహత్=గొప్పదగు, ఉక్తిచేన్=వాక్కుచేత, ఉన్మనిఁగంటిన్-ఉన్మనిన్=తుర్యాతీతావస్థయందు తోఁచెడిపరబ్రహ్మవస్తువును, కంటిన్=పొందితిని, కడున్=మిక్కిలి, ఊర్జితులైన=సమస్తవిషయములయందు సామర్థ్యముగలవారైన, నర=మనుష్యులు, అసుర=దైత్యులు, అమరులు=దేవతలు, సన్మయనిష్ఠమాని=పరబ్రహ్మనిష్ఠనువిడిచి, కర్మపుపాడునూతిలోన్=కర్మమయమైన పాడుబావిలో, ఏల=ఎందుకు, పడిచత్తురు=కూలి నశించెదరు.

తా. నాహృల్లమనెడి దేవాలయమందు నివసించిన గురులింగమూర్తీ! సృష్టి మొదలుకొని వచ్చిన ఈ నాపుట్టుకయనెడి చెట్టుయొక్క వడిమి వేరును త్రుంచుటయందు గొప్ప సామర్థ్యముగలవాఁడవు నీవే కాఁబట్టి మీరుపదేశించిన జీవబ్రహ్మైక్యవస్తురూపమును కనుఁగొంటిని. ఇట్లుండఁగా తెలిసికొనఁగ సామర్థ్యముగలవారైన దేవతలు, అసురులు, మనుష్యులు మొదలగువారు అజ్ఞానమునకు వేఱుగాని కర్మమనెడి పాడుబావిలో వ్యర్థముగాపడి కూలుచున్నారే యేలయని శిష్యుఁడడిగెనని తాత్పర్యము.

అవతారిక.—ఆప్రశ్నకు ఉత్తరము చెప్పుచున్నారు.

మ. వితతాంతర్ముఖు లొందఁజాలుదురు సంవిత్పూర్ణతోషంబు వి
స్తృతనేత్రంబులు గల్గి పాంథు లవటశ్రేణి న్పరాగ్దృష్టిచేఁ
బతితుల్గారె కుమార యాపగిదిఁ బాపం బిచ్చుజన్మాబ్ధిలో
హితకామ్యక్రియుల న్మెలంగుదురు ధీహీను ల్బహిర్వక్త్రులై. ౫౫

టీ కుమార=పుత్రా, వితతాంతర్ముఖులు-వితత=అతిశయమైన, అంతర్ముఖులు=అంతర్దృష్టిగల బ్రహ్మజ్ఞానులు, సంవిత్పూర్ణతోషంబున్-సంవిత్=జ్ఞానముచేత, పూర్ణ=పరిపూర్ణమైన, తోషంబున్=ఆనందమును, ఒందఁజాలుదురు=పొందుదురు, పాంథులు=దారినడచువారు, విస్తృతనేత్రంబులు=విశాలమైనకన్నులుగల్గి, పరాగ్దృష్టిచేన్=ఇంకొకదానిమీఁదపోయిన దృష్టిచేత, అవటశ్రేణిన్=పల్లములయందు, పతితుల్గారె=పడరా, ఆపగిదిన్=ఆరీతిగా, ధీహీనులు=జ్ఞానహీనులు, బహిర్వక్త్రులై = జగద్వ్యాపారదృష్టి

కలవారై, పాపంబిచ్చుజన్మాబ్ధిలోన్=పాపములనిచ్చెడి జన్మసముద్రములయందు, హిత=తమకిష్టములైన, కామ్యక్రియలన్=కామనాకర్మములచే, మెలంగుదురు=సంచరింతురు.

తా. ఓ ప్రియమైనశిష్యుఁడా? అతిశయమైన యంతర్దృష్టిగల బ్రహ్మజ్ఞానులు అపరోక్షజ్ఞానముచేత అఖండాకారమైన పరబ్రహ్మానందమునుపొందుదురు. దారినడచువారు విశాలములైన కన్నులుగలవారైనను దృష్టిపరాఙ్ముఖమైనయెడల పల్లములలోపడుదురు. అటువలెనే జ్ఞానశూన్యులైనవారు జగద్వ్యాపారదృష్టిగలవారైనను కర్మాసక్తులై పాపములను గలుగఁజేసెడు జన్మసముద్రములోపడుదురని తాత్పర్యము. „శ్లో. కురుతేగంగాసాగరగమనం వ్రతపరిపాలన మథవాదానమ్, జ్ఞానవిహీనస్సర్వమతేన ముక్తిర్నభవతిజన్మశతేన” అను ప్రమాణముచొప్పున తీర్థాటనము, వ్రతములు, దానము, యజ్ఞము తపస్సులోనుగాఁగల కర్మములెల్లఁ సలిపినను జ్ఞానములేకుండినయెడల నూఱుజన్మములకైన ముక్తిలేదు గనుక జన్మములకు కలిగించెడి కామనాకర్మములను అపేక్షింపక „శ్లో. నివృత్తింకర్మసేవేత ప్రవృత్తింమత్పరస్త్యజేత్, జిజ్ఞాసాయాం సంప్రవృత్తో నాద్రియేత్కర్మచోదనామ్” అనెడి శాస్త్రమునుఁబట్టి ప్రవృత్తిమార్గమునువదలి నివృత్తిమార్గమును అవలంబించి బ్రహ్మవిచారముచేయుచు „వ్యవహారేయే వికల్పఇషితః” అను రీతిని వ్యవహారమునకుఁగూడ బ్రహ్మవిచారమని అర్థమగుచున్నది గనుక „బ్రహ్మణోన్యన్నకించన” అను వేదప్రమాణముగైకొని సర్వేంద్రియవ్యవహారములు బ్రహ్మవిచారమే యని తెలిసికొని „తత్కృతేనగుణేనదోషేణవా అణుమాత్రేణాపినసంబధ్యతే” అనునట్లు ఆరూఢజ్ఞానముకలవాఁడే ముక్తుఁడని భావము.

అవ:—జీవకృత్యమిది ఈశ్వరకృత్యమిదియని తెలిపెడిఁగాకను జీవుఁడుబహిర్ముఖముగుట ఈశ్వరుఁడుచేయుకార్యమేకాని జీవుఁడుచేసేది ఏమియున్నది అనుటకు త్తరము.

మ. శివకృత్యంబొగిఁ గాదె ద్వంద్వచయ మీజీవాళి కాదోకఁ జ
ల్ప వశంబే యతిచంద్ర దాని వనినన్ పాపంబు గాదే తగ
న్నెవరం బెమ్మెయిఁ దెల్పు మివ్విధమునన్ వేదప్రమాణార్థమా
ర్గవిధి న్వ్రాసిన జాల్ములందురు భ్రమన్ గర్వాహిచే దష్టులై. ౫౬

టీ. యతిచంద్ర=మునినాథా, ద్వంద్వచయము=మంచిచెడుగులు మొదలయిన సకలద్వంద్వసముదాయము, ఒగిన్=క్రమముగా, శివకృత్యంబుగాదె=ఈశ్వరకార్యము గాదా, ఈజీవాళికిన్=ఈజీవసమూహమునకు, అదోకన్=అవిఘ్నముగా, చల్పన్=చేయుటకు, వశంబే=శక్యమా, దానివనినన్=ఆజీవాళివనిన, పాపంబుగాదే=పాపంబుగాదా, తగన్=లెస్సగా, ఎమ్మెయిన్=ఎట్లైనను, తెల్పుము=తెలియఁజేయుము, ఇవ్విధమున=ఈప్రకారము, అనన్=అనఁగా, వేదప్రమాణార్థమార్గవిధిన్- వేద=వేదముల

నెడి, ప్రమాణ=ప్రమాణములయొక్క, అర్థ=తాత్పర్యముల, మార్గ=పద్ధతులయొక్క, విధిన్=నిర్ణయమును, పాసిన=విడిచిన, జాల్మలు=అల్పులు, కర్మాహిచేన్=కర్మమనెడిపాముచే, దష్టులై=కఱవఁబడినవారై, భ్రిమన్=భ్రిమచేత, అందురు=ఆలాగనిచెప్పుదురు.

తా. మునినాథా! మంచిచెడుగులు మొదలయిన సకలద్వంద్వములును పరమేశ్వరనిర్మితములుగావా? ఆఈశ్వరుఁడు చేయుపనులు ఈజీవులుచేయసమర్థులా? ఈద్వంద్వసమూహము జీవులదనినఁబాపముగాదా? దీనిని విశదముగాఁ దెలియఁజేయుమని శిష్యుఁడడుగఁగా ఆచార్యుఁడు ఉపనిషత్ప్రమాణనిర్ణయమునువిడిచిన అల్పులు కర్మమనెడి పాముచేక ఱవఁబడిన మయికములగలవారై ఇవ్విధముగాఁబల్కుదురని తాత్పర్యము.

విశే — ఇచ్చట పాముఅనఁగాకర్మము. ఆకర్మము ప్రథమసృష్టిమొదలుకొని ప్రతి కల్పములయందు ఈశ్వరునియందు కోడి తనపిల్లలను తనరెక్కలక్రింద ప్రొద్దుగ్రుంకఁగానే చేర్చుకొనియుండుచందమున అణఁగియుండి మఱల సృష్టిసమయమున బహిర్గతమగుచున్నది. ఈకర్మము కామక్రోధాదులు ఆధివ్యాధులు మొదలగు దుర్గుణములతోఁగూడి హెచ్చినప్పుడు ఇంద్రియములు, ఇంద్రియాధిష్ఠానదేవతలు, ఇంద్రియవృత్తులు లోనుగాఁగలవన్నియు ప్రబలి అహంకారముతోఁగూడి మత్తునుకలుగఁజేయును. అట్టిఅహంకారముగలవారికి జీవేశ్వరతారతమ్యము కనఁబడదు. కాఁబట్టి అహంకారమును అణఁగఁద్రొక్కకగాని సుజ్ఞానముపుట్టదు. సుజ్ఞానము కలిగిననేగాని శరీరేంద్రియాదులు నేననెడి అహంకారమువీడి ఆనందానుభవము కలుగదు.

అవతారిక:— శిష్యుఁడడిగిన ఈశ్వర జీవవ్యవహారములయొక్క తారతమ్యములను ఆచార్యులు తెలియఁజేయుచున్నారు.

మ. శివజీవవ్యవహారములు ద్వివిధమై చెన్నొందనందాశివ
వ్యవహారం బగు భూతభౌతికజగద్వ్యాపార మాజీవకృ
ద్వ్యవహారం బభిమాన మోహముఖ సర్వప్రాకృతం బంచు ము
న్వివరింపంబడెఁ గావు శైవములు భావింప న్బ్రిజైవంబులా. ౫౭

టీ. శివజీవవ్యవహారములు- శివ=శివునియొక్క జీవ=జీవునియొక్క, వ్యవహారములు=కార్యములు, ద్వివిధమై=రెండై, చెన్నొందున్=ఒప్పును, అందున్=అవ్యవహారద్వయమందు, భూత...పారము-భూత=పంచభూతములు, భౌతిక=భూతవికారములైనజీవులును, జగత్=లోకములయొక్క, వ్యాపారము=వ్యవహారము, ఆశివవ్యవహారంబగున్=ఆశివునిపని యగును, అభిమా...తంబు-అభిమాన=అహంకారము, మోహ=మమకారము, ముఖ=మొదలగు, సర్వ=సమస్తమైన, ప్రాకృతంబు=ప్రకృతిసంబంధమైనది, జీవకృద్వ్యవహారంబు=జీవునిచేఁజేయఁబడినకార్యము, అంచున్=అని, మున్=ముందు, వివరిం

పంబడెన్=చెప్పఁబడెను, శైవములు=శివునిచేఁజేయఁబడినవి, కావు=అవికానేరవు, భావింపన్=ఆలోచింపఁగా, ప్రజైవంబులౌన్=జీవునిచేఁజేయఁబడినవేయగును.

తా. శివజీవవ్యవహారములు రెండయియుండును. ఆరెంటిలో శివవ్యవహారములు ఆకాశాది పంచభూతములు భౌతికములైన బ్రహ్మాదిపిపీలికమువఱకును తృణము మొదలు మహామేరుపర్యంతమును ఈశ్వరకార్యమగును. జీవవ్యవహారమనఁగా అహంకారము మొదలగు సర్వద్వంద్వములు జీవకార్యములని మున్ పేచెప్పఁబడెను. కాఁబట్టి శివకార్యములు జీవకార్యములుకావు. జీవకార్యములు శివకార్యములుగావని తాత్పర్యము. ఇందులకు దృష్టాంతములు. ఘటోత్పత్తికి ఉపాదానకారణము మృత్తిక నిమిత్తకారణము కులాలవ్యాపారము మృత్తికకు కులాలవ్యాపారమువలన కార్యమందువిచిత్రముకలుగురీతిని దార్ష్టాంతికమున శరీరమునిమిత్తకారణమైనకర్మతోఁగూడికొనిన పంచీకృతపంచమహాభూతంబులవలనఁబుట్టుచున్నది గనుక ‘‘నభూతపంచకాన్నాపి కర్మణఃకేవలాదపి, ఉభాభ్యాం మిళితాభ్యాం తచ్ఛరీరముపజాయతే, తచ్ఛరీరానవాప్తిశ్చ జ్ఞానాదేవచనాన్యతః, అత స్సర్వప్రయత్నేన జ్ఞానాభ్యాసరతోభవేత్’’ అను స్మృత్యర్థములచొప్పున సెండు ఈశ్వరసృష్టంబగు పంచమహాభూతంబులును కార్యంబగు భౌతికప్రపంచంబును సాయిగానుండినను ‘‘సమష్టివ్యష్టిరూపాయ స్మృతజాడ్యాదిలక్షణామ్, జీవేశయోరుపాధిశ్చ నాత్మసమ్యగ్వివేచితః, మయిజీవత్వమీశత్వం కల్పితంవస్తుతోనహి, ఇతియస్తువజానాతి సముక్తోనాత్రసంశయః’’ అనురీతిని ఈశ్వరునికిని జీవునికిని విరుద్ధాంశములయిన సర్వజ్ఞత్వ కించిద్జ్ఞత్వాదులను విడలి ఆత్మనేనను నిశ్చయజ్ఞానముకలవానికి ముక్తిసాధ్యమని భావము.

అవ:—ఈశ్వరకార్యములు ఇవియనియు అవి నశించుటవలన కలిగెడిఫలాఫలములివియనియు తెలియఁజేయుచున్నారు.

చ. కమలభవాద్యశేషలయకాలముల న్శివజీవకృత్యముల్
సమముగ డిందిన న్పిదప జన్మము లొందవె తల్లయావధిన్
బ్రమథపతిక్రియల్ చెడక భాసిలు వేళల జీవకృత్యముల్
క్రమముగఁ దెల్పి చేఁజెడినఁ గా రవిముక్తు లెఱుంగు మీస్మృతుల్.

టీ. కమల...ములన్-కమలభవ=బ్రహ్మదేవుఁడే, ఆది=మొదలుగాఁగల, అశేష=సమస్తమైనవారియొక్క, లయకాలములన్=నిర్యాణకాలములయందు, శివజీవకృత్యములు-శివ=తటస్థేశ్వరునియొక్క, జీవ=జీవులయొక్క, కృత్యములు=కార్యములు, సమముగన్=సమానముగ, డిందినన్=నశించినను, పిదపన్=పిమ్మట, జన్మములు=పుట్టుకలు, ఒందవె=పొందవా, (అనఁగా పొందుననుట) తల్లయావధిన్=ఆప్రళయకాలముయొక్క నాశములయందును, (అనఁగాజగత్తునందు) ప్రమథపతిక్రియలు= తటస్థేశ్వరునియొక్క పను

లు, చెడక=నశింపక, భాసిలు వేళలన్= ప్రకాశించుకాలములయందు, జీవకృత్యములు= జీవకార్యములు, క్రమముగన్=గురుకులవాసము, తత్త్వమస్యాదిమహావాక్యవిచారణము పొందఁగునవి వరుసగాఁ కల్గిన, తెల్విచేన్=అపరోక్షసాక్షాత్కారజ్ఞానముచే, చెడినన్= నశించిన, విముక్తులుగారె= జీవన్ముక్తులుగారా, ఈసృతులు= ఈమార్గములు, ఎఱుంగుము=తెలిసికొనుము.

తా. బ్రహ్మదేవుఁడు మొదలుగాఁగల సమస్తమైనవారియొక్క నాశములయందును(అనఁగా దశవిధప్రళయములయందు) మాయాప్రతిబింబితుఁడైన పరబ్రహ్మముయొక్క కార్యములునశించినను తిరుగా సృష్టికాలములయందు ఎవరు పుట్టుకలు లేకయున్నారు. అతటస్థేశ్వరుని పనులుచెడక ప్రకాశించుకాలములయందు జీవకార్యములైన అహంకారమమకారాది సకలద్వంద్వములు గురుకులవాసమందు నీతినీతియనెడు మహావాక్యోపదేశముచేతనశించిన జీవన్ముక్తులు అగుదురని తాత్పర్యము.

అవతారిక:—ఈశ్వరకృత్యము లుండఁగా జీవకృత్యములైన కామాదిదుర్వృత్తులు నశించిన ముక్తినొందుదురని తెలియఁజేయుచున్నారు.

మ. శివకృత్యంబులు కల్పవేళలఁ జెడన్ క్షీణించిరే జీవులు
ద్భవము లొందక దేశకాలతనువుల్ భాసిల్లు శ్రీరుద్రస
ద్వ్యవహారంబులుగాన నుండ నవి జైవంబుల్ సుమోహాదులౌ
నవి క్షీణించిన ముక్తినొందరె యవిద్యం బాసి చిన్నిష్ఠచేన్. ౫౯

టీ. శివకృత్యంబులు = తటస్థేశ్వరునికార్యములు, కల్పవేళలన్ = ప్రళయకాలములయందు, చెడన్ = నశించినను, జీవులు=ప్రాణులు, ఉద్భవములు = పుట్టుకలు, పొందక=పొందక, క్షీణించిరే=నశించిరా, (అనఁగా నశించలేదనుట.) దేశకాలతనువులు=దేశము, కాలము, తనువులు, శ్రీరుద్రసద్వ్యవహారంబులుగానన్-శ్రీ=శోభాయుక్తమైన, రుద్ర=తటస్థేశ్వరునియొక్క, సత్=శ్రేష్ఠములయిన, వ్యవహారాదులు=కృత్యములు, కానన్=కాఁబట్టి, భాసిల్లున్=ప్రకాశించును, అవి = అశివకృత్యములు, ఉండన్=ఉండఁగా, సుమోహాదులు=లెస్సయిన మోహము పొందఁయినవి, జైవంబులు= జీవకృత్యములు, ఔన్=అగును, అవి=అజీవకృత్యములు, క్షీణించినన్=నశించినను, అవిద్యంబాసి=అజ్ఞానమును విడిచి, చిన్నిష్ఠచేన్=అజ్ఞాననిష్ఠచేత, ముక్తినొందరె=ముక్తినిపొందరా, (అనఁగా పొందుదురనుట.)

తా. తటస్థేశ్వరునికార్యములు ప్రళయకాలములయందు నశించినను జీవులు పుట్టుకలుపొందక కల్పాంతరములయందు పుట్టుచునేయుందురు. దేశములు, కాలములు, దేహములు మొదలగునవియన్నియు శివకృత్యములు. అవియుండఁగా జీవకృత్యములైన కామము, క్రోధము, లోభము, మోహము, రాగము, ద్వేషము, ఈర్ష్య, అసూయ, డంభము,

మదము, మాత్సర్యము, దర్పము, అహంకారము మొదలయినవన్నియు నశించినయెడల అజ్ఞానముతొలఁగి ముక్తినొందుదురని తాత్పర్యము.

అవతారిక:— జీవేశ్వరవృత్తమును ఉపమానపూర్వకముగాఁ దెలియఁజేయుచున్నారు.

శా. అశ్వత్థం బనుభూరుహంబు గలదం దండోద్భవద్వంద్వ మా
 శశ్వచ్ఛాఖి ఫలాళి మంచి దని యాసక్తి న్మెక్కు వేఱొండు ని
 ర్విశ్వాసంబున మాని యుండు నని యీరీతిన్ శ్రుతు ల్వేఱ్వే పల్కు స
 ద్విశ్వస్తుత్య యెఱుంగు మీపదముల న్సర్వేశ జీవేశులన్. ౬౦

టీ. సద్విశ్వస్తుత్య-సత్=ఒప్పుచుండెడి, విశ్వ=ప్రపంచముచేత, స్తుత్య=కొనియాడఁదగిన శిష్యుఁడా, అశ్వత్థంబనుభూరుహంబు=రావిచెట్టుఅను నొకచెట్టు, కలదు=(లోకమందు) కలదు, అందున్=ఆచెట్టునందు, అండోద్భవద్వంద్వము=పక్షులజంట, (కలదు=కలిగియుండును.) ఆశశ్వచ్ఛాఖిన్=ప్రకాశమయిన ఆచెట్టునందలి, ఫలాళి=పండ్లయొక్క సమూహము, మంచిదని=బాగుబాగని, (ఒండు=ఒకపక్షి)ఆశన్=మిక్కిలి ఆసక్తితో, మెక్కున్=తినును, వేఱొండు=మఱియొక్కటి, నిర్విశ్వాసంబునన్=దానియందలి ప్రేమవిడిచి, మానియుండున్ = తినకయుండును, అని=అని, ఈరీతిన్=ఈప్రకారముగా, శ్రుతుల్=వేదములు, జీవేశులన్=జీవశివులను, వేఱ్వేఱన్=వేఱువేఱుగాను, పల్కున్=చెప్పును, ఈపదములన్=ఈద్వివిధస్థానములను, ఎఱుంగుము=తెలిసికొనుము.

తా. లోకమందుఁ గొనియాడఁదగిన శిష్యుఁడా! లోకమందు శరీరమనెడి యొక రావిచెట్టుగలదు, ఆచెట్టునందు రెండుపక్షులు వాసముచేయుచుండును. అందులో నొక పక్షి ఆచెట్టుపండ్లను మంచివి మంచివని తినుచుండును. మఱియొకపక్షి ఆపండ్లయందు విశ్వాసములేనిదై తినకయుండును. అని యీప్రకారముగా వేదము తినెడిపక్షిని జీవునిగాను, తిననిపక్షిని ఈశ్వరునిగాను వాక్రుచ్చునని తాత్పర్యము. శరీరము రావిచెట్టు అనుటకు ప్రమాణము. ‘‘శ్రు. ద్వాసుపర్ణా సయుజా సఖాయా సమానంవృక్షంపరిషస్వజాతే, తయోరన్యః పిప్పలంస్వాద్వత్త్యనశ్నన్నన్యోఅభిచాకశీతి’’ ‘‘శ్లో. ఊర్ధ్వమూలమధశ్శాఖమశ్వత్థం ప్రాహురవ్యయమ్, ఛందాంసియస్యపర్ణాని యస్తంవేదసవేదవిత్, అధశ్చోర్ధ్వంచప్రసృతాస్తస్యశాఖా గుణప్రవృద్ధావిషయప్రవాళాః, అధశ్చమూలాన్యనుసంతతాని కర్మానుబంధీనిమనుష్యలోకే’’ అని భగవద్గీత. ఈచెట్టుయొక్క వేళ్లు ఊర్ధ్వముఖముగాను కొమ్మలు అధోముఖముగాను వ్యాపింపఁబడియున్నవి. వేళ్లుఅనఁగా వెంట్రుకలు, కొమ్మలనఁగా చేతులు కాళ్లు మొదలగునవి. దీనియందలి రెండుపక్షులు ఎవరనఁగా

జీవుఁడు ఈశ్వరుఁడు. ఫలములనఁగా సుఖదుఃఖములు. జీవకార్యములయిన కామాదిజగద్వ్యాపారములయందు బుద్ధిపోనియ్యక ఈశ్వరకార్యములయిన శమాదిసంపత్తులతోఁ గూడికొని యథార్థవస్తుజ్ఞానము పొందవలయునని భావము.

అవతారిక:—ఈశ్వరజీవకార్యములఁ దెలిపికొని జీవకార్యములవదలి ఈశ్వరనిష్ఠయందుండువారు చెందెడిఫలమును జెప్పుచున్నారు.

శా. కామక్రోధముఖారిషట్కము నహంకారంబు జీవక్రియా
గ్రామంబై తగు మూఢు లాక్రియల నాకామారి వంచుర్ వృథా
తామిస్రం బగుదుర్గతిం బడుదు రీతాత్పర్యభావేతరు
ల్భూమానందవిముక్తి నొందెదరు సంపూర్ణాత్మచిన్నిష్ఠచేన్. ౬౧

టీ కామ...ట్కమునన్-కామ=కామము, క్రోధ=క్రోధము, ముఖ=మొదలుగాఁగల, అరిషట్కము=అరిషడ్వర్గమును, అహంకారంబు=అహంకారము, జీవక్రియాగ్రామంబై-జీవ=జీవులయొక్క, క్రియా=పనులయొక్క, గ్రామంబై=సమూహమై, తగున్=ఒప్పును, మూఢులు=అజ్ఞానులు, ఆక్రియలన్=ఆజీవకార్యములను, ఆకామారి వంచున్=ఆశివస్థేశ్వరునివని, వృథా=వ్యర్థమైన, తామిస్రంబు=అంధకారబంధురము, అగుదుర్గతిన్=అగువట్టి నరకమందు, పడుదురు=కూలుదురు, ఈతాత్పర్యభావేతరుల్=ఈతాత్పర్యమునకు వేరైనబ్రహ్మజ్ఞానులు, సంపూర్ణాత్మచిన్నిష్ఠచేన్=సమస్తమునందు బ్రహ్మభావముగల జ్ఞాననిష్ఠచే, భూమానందవిముక్తి నొందెదరు-భూమ=నిరతిశయమయిన, ఆనంద=సంతోషముతోఁగూడిన, విముక్తిన్=మోక్షమును, ఒందెదరు=పొందెదరు.

తా. కామక్రోధాది అరిషడ్వర్గమును నేనను అభిమానమును జీవకార్యసముదాయమైయొప్పును. ఈజీవకార్యములను ఈశ్వరకార్యములని చెప్పుచుండువారు వ్యర్థమైన అంధకారముగు నరకములోఁబడుదురు. ఈకార్యములు జీవకార్యములేకాని ఈశ్వరకార్యములుగావని వానినివిడిచి ఈశ్వరనిష్ఠఁదేయుచుండెడి పెద్దలు నిరతిశయానందమైన మోక్షమును బొందుదురని తాత్పర్యము. అదియెట్లనఁగా ఒకప్రభువు తనవద్ద ఒకపురుషుని కొలువునకుంచుకొని వానితో నీవు ప్రతిదినము చేయవలసినపనులు ఇవియని స్పష్టముగాఁ దెలియఁజేసి అతనినడువడిని కనిపెట్టియుండెను. అంత కొంతకాలమునకు ఆపనివాఁడు తనకునియమించినపనిని జాగ్రత్తగాచేయక ఇతరులతోఁగూడికొని జూదమాడుట, మ్రుచ్చిలించుట, వ్యభిచరించుట మొదలగుదుష్కార్యములయందు ప్రవేశించెను. ఆప్రభువు వానినడువడిని విచారించి దానికిఁ దగినదండనకు పాత్రునిగాఁజేయునుగదా ? ఆయజమానుఁడు తననౌకరుచేసిన దుష్కార్యములకు దండనవిధించి తాను అపనులను

చేయునా? అటువలెనే ఈశ్వరుఁడు కలుగఁజేసిన వేదము చెప్పుడిచొప్పున నడచుట ఈశ్వర కార్యమనియు, వేదవిరుద్ధముగ నడచుట జీవకార్యమనియు ఎఱుఁగఁదగ్గది. కనుక ఈశ్వరాజ్ఞలగు వేదములు పలికెడిరీతిని నడుచుకొనెడివారు నిరతిశయానందమైన మోక్షపదవిని జెందుదురనియు వేదవిరోధముగ ప్రవర్తించువారు దుర్గతిఁబొందుదురనియు భావము.

అవతారిక:—ఈశ్వరుఁడు సకలజీవులయందు సమానభావముగనుండక పక్షపాతముగ నుండఁదగునాయని శిష్యుఁడడిగెడి ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నారు.

మ. సముఁడై యీశ్వరుఁడుండ నందఱ కొగిన్ సత్యాత్మ ఖేదంబు మో
దము వేర్వేఱుగఁ జేయ నేల యది భేదంబే కదా యిట్లనన్
న్ధాత్రి నొప్పన్ విను పుత్ర తండ్రి సుతులన్ గాపాడు బాధించు వా
రిమనంబుల్గని కాదె యీశుఁడటులన్ బ్రీతిన్ వ్యథల్ సేయుటల్. ౭౨

టీ. సత్యాత్మ=కాలత్రయాబాధ్యమయిన బ్రహ్మస్వరూపుఁడగు పుత్రా, ధాత్రిన్=పుడమియందు, ఈశ్వరుఁడు=సర్వనియామకుఁడైన భగవంతుఁడు, అందఱకున్=ఎల్లప్రాణులకు, ఒగిన్=క్రమముగా, సముఁడై=సమభావముగలవాఁడై, ఉండన్=ఉండఁగా, ఖేదంబు=దుఃఖము, మోదము=సుఖము, వేర్వేఱుగన్=వారివారికి భిన్నభిన్నములుగా, చేయనేల=ఒనర్పనేల, అది=అట్లుచేయుట, భేదంబేకదా=పక్షపాతబుద్ధియేకదా, ఇట్లనన్=ఈప్రకారము శిష్యుఁడడుగఁగా, విను=వినుము, తండ్రి=తండ్రియైనవాఁడు, సుతులన్=బిడ్డలను, వారిమనంబులు=వారియంతఃకరణములను, కని కాదె=తెలిసికొనికదా, (మంచిగుణములుగల కొందఱిని) కాపాడున్=రక్షించును, బాధించున్=(చెడుగుణములుగల కొందఱిని) శిక్షించును, అటులన్=పగలేని ఆతండ్రివలెనె, ఈశుఁడు=భగవంతుఁడు, ప్రీతిన్=ప్రేమచేత, వ్యథలు=బాధలు, చేయుటలు=ఒనర్చుటలు అగును.

తా. త్రికాలజ్ఞానముగల శిష్యుఁడా! లోకమందు సమస్తమయిన మంచికార్యముల నియమించునట్టి భగవంతుఁడు సకలజీవులకు సమభావముగలవాఁడై యుండఁగా దుఃఖమును, సుఖమును భిన్నభిన్నములుగాఁ జేయనేల? ఆప్రకారముచేయుట పక్షపాతమౌను గదాయని శిష్యుఁడడుగఁగా బిడ్డలను వారివారియుల్లములను తెలిసి కాపాడుటకును కష్టపెట్టుటకును కొడుకులయందు ఆ యీశ్వరుఁడు పగలేనితండ్రివలె నగునని తాత్పర్యము.

విశే.—అనఁగా తండ్రియైనవాఁడు తనబిడ్డలను వృద్ధికిఁదెచ్చుటకై పలుయాప్రయత్నములుచేయఁగా వారు తండ్రి చిత్తానుసారముగ నడచుకొనినయెడల కొందఱకు సులభమైనపనులను కొందఱకు కష్టములగుపనులను వారివారికిఁదగినట్లు నియమించి అరీతిగా

నైన ప్రత్యక్షముని నిష్పక్షపాతముగఁ దలఁచుమనటుల ఆ ఈశ్వరుఁడును జీవులయందు సమభావనకలవాఁడేయని భావము.

అవతారిక:— ఈశ్వరుఁడు ఎల్లవారిని రక్షింపలేదనెడి శంకకు ఉత్తరము చెప్పఁబడుచున్నది.

మ. త్రుటితారబ్ధవిశృంఖలా యుడుపునే ၊ తృష్ణాపిపాసాదిదు
ర్ఘటశైత్యంబులఁ జేరకున్న దరికి ၊ కల్పాపగావహ్ను లెం
తటివైన న్మద మీశ్వరుం దలఁచి యత్నం బెట్టయి న్జేయమి
న్ఘటనంబౌనె ప్రమాద మెవ్వరిది లోకంబందు వీక్షింపఁగన్. ౬౩

టీ. త్రుటితారబ్ధవిశృంఖలా-త్రుటిత=తెంపఁబడిన, ఆరబ్ధ=ప్రారబ్ధమనెడి, విశృంఖలా=సంకిళ్లుగలపుత్రుఁడా, కల్పాపగావహ్నులు-కల్ప=కల్పవృక్షము, ఆపగా=నది, వహ్నులు=అగ్ని, ఎంతటివైనన్=ఎంతసామర్థ్యముకలవియైనను, దరికిన్=వానిసమీపమునకు, చేరకున్నన్, తృష్ణాపిపాసాతిదుర్ఘటశైత్యంబులన్-తృష్ణా=ఆశ, పిపాసా=దాహము, అతిదుర్ఘటశైత్యంబులన్-అతిదుర్ఘట=మిక్కిలిపొందశక్యముగాని, శైత్యంబులన్=చలిని, ఉడుపునే=పోఁగొట్టునా, ఈశ్వరున్=స్వరూపతటస్థ లక్షణలక్షితుఁడైన భగవంతుని, తలఁచి=(పరోక్షాపరోక్షజ్ఞానముచేత) స్మరించి, (యత్నంబు) కర్మభక్తిజ్ఞానములచేత ప్రయత్నము, ఎట్టయిన్=ఏవిధముగానైనను, చేయమిన్=చేయకుండెనేని, ముదము=ఆనందము, ఘటనంబౌనె=కల్గునా, లోకంబందున్=జగత్తునందు, వీక్షింపఁగన్=చూడఁగా, ప్రమాదము=బుద్ధిమాంద్యము, ఎవ్వరిది=ఏవారిదియగును.

తా. ప్రారబ్ధకర్మమును విడిచినశిష్యుఁడా! కల్పవృక్షము, నీరుగలఏఱు, అగ్ని, ఎంతసామర్థ్యముగలవియైనను వానిదగ్గఱకు చేరకుండిన వారియొక్క ఆశాపూర్తియు దాహము సహింపఁగూడని చలియు తీరునా? (తీరవు) అటువలెనే భగవంతుని యుద్దేశించి సుఖమును పొందవలెననువారు ఏప్రయత్నముఁ జేయకుండిరేని ఈశ్వరుఁడు కల్గఁజేయునా? ఆతప్పితము చేరకుండినవారిదా? లేక ఈశ్వరునిదా? అనఁగా ఈశ్వరునిదికాదని తాత్పర్యము.

అవతారిక:— జ్ఞానముకలుగుటకు చేయవలసినప్రయత్నమును మఱచుటనుగుఱించి ఆచార్యులు చెప్పుచున్నారు.

చ. విను మొకమాట యత్నమున ၊ విశ్వజనీనుఁడు మేలు సేయుఁ జె
ప్పినశ్రుతిమార్గ మేమఱక ၊ ప్రేమప్రియోక్తుల నమ్మి దుష్టవా
సనలఁ దొఱంగి వేత్త యయి ၊ సంసృతిఁ బాసి వెలింగిన న్గదా
జననము వీడి ముక్తుఁ డగు ၊ సజ్జనసంస్తుత విస్ఫుట న్గగన్. ౬౪

టీ. సజ్జనసంస్తుత-సజ్జన=సత్పురుషులచేత, సంస్తుత=కొనియాడఁదగినవాఁడా! ఒకమాట=ఒకవచనము, (నీవు ఆలకింపుము.) యత్నమునన్=ప్రయత్నపూర్వకముగా, విశ్వజనీనుఁడు=ప్రణవార్థప్రతిపాదకుఁడైన పరబ్రహ్మము, మేలుసేయన్=(తనయందు కల్పితులయిన చిదాభాసులకు) మంచిచేయను, చెప్పిన=వాక్రుచ్చిన, శ్రుతిమార్గము=ఉపనిషదర్థవిధిని, ఏమఱిక=ఏమఱపాటు, ప్రేమ=కరుణతోఁగూడిన, ప్రియ=ప్రియుఁడైన ఆచార్యులయొక్క, ఉక్తులన్=వాక్యములను, నమ్మి=విశ్వసించి, దుష్టవాసనలన్=మనోమలినసంకల్పములను, తొలంగి=విడిచి, సంసృతిన్=అహంకారాది దేహాంతసంసారమును, పాసి=(దానియందలి ఆశను) వదలి, వేత్తయయి=బ్రహ్మవిదుఁడయి, వెలింగినన్గదా=ప్రకాశించినను గదా, జననమువీడి=(సృష్టిమొదలు ఏతత్క్షణపర్యంతమువచ్చిన) పుట్టుకవదలి, తగన్=ఒప్పునట్లు, పిమ్మటన్=పిదప, ముక్తుఁడగున్=జీవన్ముక్తుఁడగును.

తా. మంచిపుత్రుఁడా! నేను చెప్పెడి యొకమాటవినుము. ప్రయత్నపూర్వకముగా ప్రణవార్థప్రతిపాదకుఁడైన పరబ్రహ్మము ఎల్లవారికి మంచిఁజేయను వాక్రుచ్చిన భగవదాజ్ఞాపూర్వకమైన ఉపనిషదర్థవిధిని ఏమఱపాటు కరుణతోఁగూడిన ఆచార్యుని యొక్క మాటలనునమ్మి మనోవృత్తులను వదలి అహంకారాదులను బాసి బ్రహ్మవేత్తయయి ప్రకాశించినను గదా పుట్టుకవదలి పిమ్మట జీవన్ముక్తుఁడగును.

అవతారిక:—దేనిచేత ఈజ్ఞానోత్పత్తి కలుగుననుప్రశ్నకు ఉత్తరము.

ఉ. ఏగతి నీవివేక ముదయించు ననన్ సువిచారదృష్టి నా
జాగొనరింపకున్న నది యేసల్పుట యెట్లన నే నెవండ నీ
భోగమయాంగమం దెది సుబుద్ధి జడం బెది రెండుగూడి యే
లాగిలఁ జల్పుబంధము చలంబున ముక్తి వెలుంగు టెట్టులొ న్. ౨౫

టీ. ఇలన్=భూమియందు, ఏగతిన్=ఏప్రకారముగా, ఈవివేకము=ఈయపరోక్షసాక్షాత్కారము, ఉదయించున్=లభించును, అనన్=ఆచార్యునిఁగూర్చి శిష్యుఁడడుగఁగా, సువిచారదృష్టిన్-సు=లెస్సయగు, విచార=(జన్మాంతరసుకృతదుష్కృతరూప ప్రారబ్ధమువలన దుఃఖముప్రాప్తించి అందువలన వైరాగ్యము జనించుటచే కలిగిన) చర్చయొక్క, దృష్టిన్=వీక్షణమునందు, జాగొనరింపకున్నన్=(పరిపక్వాంతఃకరణముగల యొకానొకపురుషుఁడు) ఆలస్యముచేయకుండినను, ఓన్=(అజ్ఞానము) ఉదయించును, అది=అవిచారదృష్టి, చల్పుట=ఒనర్చుట, ఎట్లనన్=ఎవ్విధముగా ననఁగా, ఈభోగమయాంగమందున్-ఈ=ఈపరిదృశ్యమానమై ప్రాప్తించిన, భోగమయాంగమందున్=(ప్రారబ్ధరూపమై పాంచభౌతికవికారమయిన) స్థూలదేహమందు, నేను=(బ్రహ్మాభిన్నప్రత్యగాత్మస్వరూపుఁడనైన) నేను, ఎవండను=ఎవ్వఁడను, సు

బుద్ధి=మంచిజ్ఞానము, ఎది=ఎద్ది, జడంబు = (వస్తుయాథార్థ్యమును విడిచి జగద్భ్రాంతితోఁగూడిన) అజ్ఞానము. ఎది=ఎద్ది, రెండున్=ఈచిజ్జడములు రెండును, కూడి=ఒక్కటియై, చలంబునన్=మోక్షవినాశకరమయిన యాగ్రహముచేత, బంధము=సంసృతిని, ఏలాగు=ఎట్లు, చల్పున్=చేయును, ముక్తి=జీవన్ముక్తి, వెలుంగుట = ప్రకాశించుట, ఎట్టులొకొ=ఏలాగుకూడును.

తా. భూమియందు ఎవ్విధముగా ఈ యపరోక్షజ్ఞానము కలుగునని ఆచార్యులను శిష్యుఁడడుగఁగా ఆలస్యముచేయక మంచివిచారముచేయుటచేత అజ్ఞాన ముదయించును (అనిన సువిచారముచేత కలుగును) ఆవిచారము ఏవిధమున కలుగునని యడుగఁగా ఈ అగపడకుండనుండిన నేనెవఁడను? అట్టి నన్నుఁదెలిసికొను జ్ఞానమెద్ది? ఈ చిజ్జడములు రెండును ఒకటియైకలసి మోక్షమునకు వ్యతిరిక్తమైన సంసారబంధమును ఏప్రకారముచేయును. ఇదితొలఁగి జీవన్ముక్తి యెట్లుగలుగునని యోజించుటవలన నని తాత్పర్యము. భాష, తచ్ఛబ్దము, యచ్ఛబ్దము, ఏతచ్ఛబ్దము, యుష్మచ్ఛబ్దము అనెడి నాలుగు శబ్దములలో వణఁగియున్నది. తచ్ఛబ్దమనఁగా అది. యచ్ఛబ్దమనఁగా ఎది. ఏతచ్ఛబ్దమనఁగా ఇది. యుష్మచ్ఛబ్దమనఁగా నీవు. అస్మచ్ఛబ్దవాచ్యుఁడైన తానే యీశబ్దములయందు ప్రవర్తించుచున్నాఁడని ఎఱుఁగవలయును.

అవతారిక:—జ్ఞానముకలుగుటకు సత్కర్మములుండఁగా విచారమెందుకని శిష్యుఁడడిగెడిప్రశ్నకు ఆచార్యులు ఉత్తరము చెప్పుచున్నారు.

మ. గతజన్మార్జితపుణ్యకృత్యములచేఁ గల్గు న్వివేకం బనన్
వితతం బైనవిచార మేల యన శ్రీవిశ్వేశ్వరప్రీతిఁ ద
త్కృతము ల్సల్ప మనంబు శుద్ధమగుఁ దద్వృత్తి న్విచారంబుసో
ద్ధతమౌ దాన వివేక మబ్బు నదె విద్యాకారణంబౌఁ గనన్. ౬౬

టీ. గతజన్మార్జితపుణ్యకృత్యములచేన్-గత= (సృష్టిమొదలుకొని) కడచిన, జన్మ= (పుణ్యపాపమిశ్రములగు పుట్టువులలో మేలైన) మానుషజన్మములచేత, ఆర్జిత= (కాయిక, వాచిక, మానసిక, సాధనములచే) సంపాదింపఁబడిన, పుణ్యకృత్యములచేన్=యాగయోగతపఃక్రియాద్యనుష్ఠానములచేత, వివేకంబు = బ్రహ్మజ్ఞానము, కల్గున్=కలుగును, అనన్=అనఁగా, వితతంబైనవిచారము-వితతంబైన=కొలవడని, విచారము=చర్చ, ఏలయనన్=ఎందుకని శిష్యుఁడడుగఁగా, శ్రీవిశ్వేశ్వరప్రీతిన్-శ్రీ=శోభాయుక్తమైన, విశ్వ=నామరూపాత్మకమయిన జగత్తునకు, ఈశ్వర=నియామకుఁడైన భగవంతునికి, ప్రీతిన్=ప్రియమగునట్లు, తత్కృతములు=ఆయాగయోగానుష్ఠానాదులు, చల్పన్=(ఫలాపేక్షలేక) చేయఁగా, మనంబు=అంతఃకరణము, శుద్ధమగున్=(ఘోర,

మూఢ, వృత్తులవిడిచి) పరిశుద్ధమగునా, తద్వృత్తిఁ=ఆ నిర్మలాంతఃకరణవృత్తియందు, విచారంబు=ఆలోచన, సోద్గతమాఁ=అస్సాగాఁబుట్టును, దానఁ=అవిచారమువలన, వివేకము=జ్ఞానము, అబ్బుఁ=కలుగును, అదే=అవిచారమే, కనఁ=చూడఁగా, విద్యాకారణంబౌఁ-విద్యా=బ్రహ్మవిద్యకు, కారణంబు=మొట్టమొదటిది, ఔఁ=అగును.

తా. గతించిపోయిన జన్మములచే సంపాదింపఁబడిన యాగయోగ తపఃక్రియాద్యనుష్ఠానములచేత బ్రహ్మజ్ఞానము కలుగుచుండఁగా విచార మెందుకని శిష్యుఁ డడుగఁగా ఆ యాగయోగతపోనిష్ఠలచేత అంతఃకరణము శుద్ధమగునేగాని జ్ఞానముపుట్టదు. ఆ యంతఃకరణవృత్తియందు విచార ముదయించిన, ఆచారమువలన జ్ఞానము కలుగును. ఆ జ్ఞానమే మోక్షమునకు కారణమగునని ఆచార్యులు చెప్పిరని తాత్పర్యము.

అవతారిక:—సమస్తమును ఇయ్యఁదగిన శక్తిగల సత్కర్మము జ్ఞానమును ఇయ్యదా? విచార మెందులకని శిష్యుఁ డడుగుచున్నాఁడు.

శా. వైరాగ్యంబు తపంబు భక్తిమతి నిర్వాణంబు యోగాంగముల్
సారూప్యాదిచతుష్టయంబు సకలైశ్వర్యంబు నాకంబు ధ
ర్మారూఢాత్మ యొసంగ సత్క్రియలు సామర్థ్యంబులై యుండు ని
స్సారం బైన విచారమేల తెలివిన్ సాధింపలేవా క్రియల్. ౬౭

టీ. ధర్మారూఢాత్మ=పుణ్యస్వరూపుఁడవయిన యాచార్యుఁడా, సత్క్రియలు=పుణ్యకర్మములు, వైరాగ్యంబున్=సకలభోగపరిత్యాగమును, తపంబున్ = శరీరేంద్రియాదుల తపింపఁజేయుటయును, భక్తిన్=ఏకాంతానన్యబాహ్యయాపభక్తిని, మతిన్=మంచిబుద్ధిని, నిర్వాణంబున్=మోక్షమును, యోగ=మంత్ర లయ హఠ రాజము లనెడి చతుర్విధయోగములను, అంగములు=వానికి పూర్వోత్తరాంగములయిన యమాద్యష్టాంగములను, సారూప్యాది చతుష్టయంబున్= (వారివారి యుపాసనామూర్తుల సంబంధములయిన, సాలోక్య సామీప్య సారూప్య సాయుజ్యము లనెడు) చతుష్పదవులను, సకలైశ్వర్యంబున్=అణిమాద్యష్టైశ్వర్యమును, నాకంబున్=స్వర్గమును, ఒసంగన్=ఇచ్చుటకును, సామర్థ్యంబులైయుండన్=శక్తములైయుండఁగా, నిస్సారంబైనవిచారము=సారములేనివిచారము, ఏల=యేమిప్రయోజనము, క్రియలు = ఆపుణ్యకర్మములు, తెలివిన్=బ్రహ్మజ్ఞానమును, సాధింపలేవా=సాధింపఁజాలవా.

తా. పుణ్యస్వరూపుఁడవైన నా యాచార్యుఁడా! పుణ్యకర్మములును, సకలభోగపరిత్యాగమును శరీరేంద్రియాదులు తపింపఁజేయుటయును, ఏకాంతానన్యబాహ్యములనెడి భక్తిత్రయమును, మంచిబుద్ధిని, ముక్తిని, మంత్రలయ హఠరాజయోగములను పూర్వోత్తర యోగాంగములైన యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార,

ధ్యాన, ధారణ, సమాధులను, శైవ, శాక్త, గాణపత్య, సౌర, కాపాలిక, వైష్ణవముల యొక్క సమయవాదుల దేవతలయొక్క చతుష్పదవులను, అణిమాద్యష్టైశ్వర్యములను, స్వర్గమును ఇచ్చుటకు శక్తిగల్గియుండఁగా హీనమైనవిచారము ఏమిప్రయోజనము. ఆసత్కర్మములు బ్రహ్మజ్ఞానమును తెలియఁజేయనేరవాయని శిష్యుఁడడిగెనని తాత్పర్యము.

అవతారిక:—ఆప్రశ్నకు దృష్టాంతపూర్వకముగా నుత్తరము చెప్పుచున్నారు.

మ. మదగినవానిరూపమును మర్మము నున్కి గుణంబు వేషముఁ
మొదలగు చిన్నము లెఱిఁగి మోహము నొందక చూడఁ జిక్కు వాఁ
డద నెఱిఁగిట్లు గానక ప్రయాసముతోఁ గడ నెక్కి యాడినన్
బదయుగ మెత్తిన న్బయలు ప్రాఁకినఁ జిక్కునె సాముఁ జేసినన్.

టీ. మదగినవానిరూపమున్=మాఱువేషము వేసికొని దాఁగియుండు పురుషునియొక్క యాకారమును, మర్మమున్=గుట్టును, ఉన్కి=వాసస్థలమును, గుణంబున్=గుణమును, వేషమున్=వాఁడు ధరించియుండు వేషమును, మొదలగు=మొదలుగాఁగల, చిన్నములు=గురుతులను, అదను=సమయమును, ఎఱిఁగి=తెలిసి, మోహమునొందక=విభ్రాంతిచెందక, చూడన్=చూడఁగా, వాఁడు=ఆపురుషుఁడు, చిక్కున్=చిక్కును, ఇట్లు=ఈప్రకారము, కానక=చూడక, ప్రయాసముతోన్=కష్టముతో, గడనెక్కియాడినన్=గడమీఁద నెక్కియాడినను, పదయుగమెత్తినన్=తలక్రిందుగానుండి రెండుపాదములు పైకెత్తినను, బయలుప్రాఁకినన్=ఆకాశమునందు బొమ్మతో జాతినను, సాముజేసినన్=గరడిసాధనముఁజేసినను, చిక్కునే=ఆపురుషుఁడుదొరకునా.

తా. మాఱువేషము వేసికొని దాఁగియుండు ఒకానొకపురుషుని వెదకిపట్టవలెనను వారు ఆపురుషుని యాకారమును గుట్టును వాఁడుండుస్థలమును గుణమును వానివేషమును ఇవి మొదలగు గుఱుతులను సమయమును నెఱిఁగి తాము భ్రమపడక చూడఁగా ఆపురుషుఁడు చిక్కును. ఈప్రకారము చూడక కష్టముతో గడమీఁద నెక్కియాడినను, కాళ్లుపైకెత్తి తలక్రిందుగా తపస్సుచేసినను, ఆకాశగమనముచేసినను, గరడిఁజేసినను ఆచోరపురుషునివలె దాఁగియున్న పరబ్రహ్మము దొరకునా యని తాత్పర్యము.

శ్రు. ‘‘యోవేదనిహితంగుహాయాం పరమేవ్యోమన్’’ ‘‘పరేణనాకంనిహితం గుహాయాం విభ్రాజదేతద్యతయోవిశంతి’’ ‘‘అంతస్థమాత్మానమజంనదృష్ట్వా భ్రమంతిమూఢా గిరిగహ్వరేషు’’ ‘‘శ్లో. తీర్థేదానేజపేయజ్ఞే కాష్ఠేపాషాణకేసదా, శివంపశ్యతిమూఢాత్మా శివోదేహేప్రతిష్ఠితః, సర్వత్రావస్థితంశాంతం నపశ్యంతిచశంకరమ్, జ్ఞానచక్షుర్విహీనత్వా దహోమాయాబలంమునే, శివమాత్మని పశ్యంతి ప్రతిమాసు నయోగినః, అజ్ఞానాం భావనార్థాయ ప్రతిమాఃపరికల్పితాః’’ అని సూతసంహిత. ఈ మొదలైన శ్రుతిస్మృతి

వాక్యములచే నొప్పెడు ఆపరబ్రహ్మము తనయందే యున్నదని తెలిసికొనవలయుననిభావము.

అవతారిక:—పైనిజెప్పిన దృష్టాంతమును దార్ష్టాంతికపూర్వకముగా విశదీకరించుచున్నారు.

శా. ఈరీతి న్బరమాత్మచిహ్నముల నూహింపఁ బ్రమాణోక్తులన్
సారాసారమతి న్గుహ న్వలయుసత్సంవిత్సుఖం బబ్బు నా
తీరుంగాక శ్రుతిస్మృతు ల్చదివిన న్దేవార్చన ల్సల్పినన్
భూరిక్షోణిముఖాన్నదానములచేఁ బొల్పొందినం జిక్కునే. ౬౯

టీ. ఈరీతిగన్=ఈపైనఁజెప్పినవిధముగా, పరమాత్మచిహ్నములన్=పరమాత్మను దెలియఁజేసెడిస్వరూప తటస్థ అతిద్వ్యాప్త్యాదిలక్షణములచే లేక సల్లక్షణము, చిల్లక్షణము, ఆనందలక్షణము, నిత్యలక్షణము, నిర్మలలక్షణము లనువానిచేతను, ప్రమాణోక్తులన్-ప్రమాణ= ప్రత్యక్షాది అష్టప్రమాణములలోపల బ్రహ్మప్రతిపాదకమైన ఉపనిషత్ప్రమాణమందలి, ఉక్తులన్=అవాంతరవాక్యములు మహావాక్యములు అనెడివచనములచేత, సారాసారమతిన్=సదసద్వివేకయుక్తమగుబుద్ధిచేత, ఊహింపన్= ఆలోచింపఁగా, గుహన్=అంతఃకరణమనెడిగవియందు, వలయు=ప్రకాశించెడు, సత్సంవిత్సుఖంబు=సచ్చిదానందస్వరూపము, అబ్బున్=లభించును, ఆతీరుగాక=ఆవిధముగాక, శ్రుతిస్మృతుల్చదివినన్-శ్రుతి= ఋగాది వేదములు, స్మృతులు= మానవాదిధర్మశాస్త్రములు, చదివినన్=(క్రమముగా పదక్రమజటాఘనములచేతను, ధర్మవిధానములచేతను) పఠించినను, దేవార్చనల్సల్పినన్-దేవ=ఆదిత్యాంబికాగణనాథ విష్ణు మహేశ్వరుల, అర్చనలు=(తత్తన్మతాంతరవిధములుగా) జపతపఃపూజావిధానములు, సల్పినన్=చేసినను, భూరిక్షోణి ముఖాన్నదానములచేన్-భూరి=స్వర్ణము, క్షోణి=భూమి,ముఖ= మొదలుగాఁగల,అన్న=అన్నముయొక్కయు, దానములచేన్=షోడశమహాదానములచేతను, పొల్పొందినన్=ప్రకాశించినను, చిక్కునే=సచ్చిదానందములభించునా (లభించదనుట.)

తా. పైనఁజెప్పినవిధముగా పరబ్రహ్మమును తెలియఁజేసెడి స్వరూప, తటస్థ, అతిద్వ్యాప్త్యాదులనెడి త్రివిధలక్షణములచేతను లేక సద్రూప, చిద్రూప, ఆనందరూప, నిత్యస్వరూప నిర్మలరూపములనెడి పంచలక్షణములచేతను అష్టప్రమాణములలో మేలైన ఉపనిషత్ప్రమాణమందలి దేవతాంతర జీవబ్రహ్మముల ప్రతిపాదించెడి అవాంతరవాక్యములచేతను జీవేశ్వరైక్యమును ప్రతిపాదించెడి మహావాక్యములచేతను అనఁగా విధినిషేధజాతగుణ క్రియావాక్యములచేతను, దేశకాలవస్తు పరిచ్ఛేదశూన్యమగు సద్వివేకముచేతను ఆలోచింపఁగా మనస్సనెడి గుహలో దాఁగియుండెడి పరబ్రహ్మస్వరూపము ప్రాప్తించును. అటులుగాక అన్యతజడదుఃఖాత్మకమగు అసద్వివేకములోఁగూడ వేదములు

శాస్త్రములు పురాణములు ఇతిహాసములు మొదలయినవి క్రమముగా నేర్చినను పరబ్రహ్మ స్వరూపము చిక్కదని తాత్పర్యము. షోడశదానములు చేసినను పరబ్రహ్మస్వరూపము చిక్కదని తాత్పర్యము.

అవతారిక:—సత్కర్మములు అజ్ఞానమును పోఁగొట్టఁజాలవా? తెలివియే అజ్ఞానమును పోఁగొట్టునని చెప్పెదరే ఆసంశయమును నివర్తింపఁజేయుమని శిష్యుఁ డడుగుచున్నాఁడు.

శా. తామ్రాదగ్ధకళంక మెల్లఁ జెడుఁ జేతన్ దోఁచు సత్సాధ్య చి
త్సామ్రాజ్యేశిక యెవ్వరైన మతిచేతన్ దోఁమిరే యజ్ఞత
న్నమ్రత్వంబునఁ జేయుసత్క్రియలు నిర్ణాశంబు నొందింపవో
కమ్రజ్ఞాన మవిద్యఁ బాపు నన నిక్కం బెట్టులోఁ దెల్పుమా. ౭౦

టీ. చిత్సామ్రాజ్యేశిక=జ్ఞానరాజ్యపరిపాలనఁ జేసెడు ఆచార్యుఁడా! తామ్రాదగ్ధకళంక మెల్లన్=రాగియద్దమందలి చిలుమంతయును, చేతన్ దోఁమన్=సాధనముల గ్రహించి చేతితోఁ దోమినఁగదా, చెడున్=నశించును, అట్లు=ఆప్రకారము, ఆత్మన్=అంతఃకరణమును, మతిచేతన్=తెలివిచేతను, ఎవ్వరైనన్=ఏవారైనను, తోఁమిరే=రుద్దిరా, నమ్రత్వంబునన్=అణఁకువచేతను, చేయు=చేసెడి, సత్క్రియలు=శ్రౌతస్మార్తాది పుణ్యకర్మములు, అజ్ఞతన్=అజ్ఞానమును, నిర్ణాశంబున్=మిక్కుటమైన నాశమును, ఒందింపవో=చేయవా, కమ్రజ్ఞానము-కమ్ర=మనోహరమైన, జ్ఞానము=తెలివి, అవిద్యన్=అజ్ఞానమును, పాపునన్=పోఁగొట్టుననఁగా, నిక్కంబు=యథార్థము, ఎట్టులోన్=ఏ ప్రకారమగును, తెల్పుమా=తెలియఁజేయుమా.

తా. జ్ఞానభూముల నేడింటిని పరిపాలించెడి యాచార్యుఁడా! రాగియద్దమునందుండెడి చిలుమంతయు చింతపండు బూడిద మొదలయినసాధనములచేత తోమినను దాని చిలుముపోవును. ఆప్రకారము అంతఃకరణమందుండెడి అజ్ఞానమును మంచి తెలివిచేత నెవరైనను తోమినారా? అణఁకువచేత చేయునట్టి పుణ్యకర్మములు అజ్ఞానమును పోఁగొట్టఁజాలవా? తెలివియైనది అజ్ఞానమును పోఁగొట్టునని చెప్పఁగా ఆయథార్థము నాకు తెలిగింపుమని శిష్యుఁడడిగెనని తాత్పర్యము.

అవతారిక:—పైప్రశ్నకు సమాధానము చెప్పుచున్నారు.

చ. మలినము రాగియద్దమునకే మానక దోఁచ హరింప హేతువుల్
గల వొగిఁ గొన్నిధాత్రిఁ బటికేకం బతినిర్మల మాట దానికిన్
వలయు నె యట్టిహేతువు లకేవశ్యము నొక్కతెతెతి న్వెలుఁగఁ ద
త్కలుషము నెల్ల మాన్పు నది కేకల్పితమాట మనంబు చాలదే. ౭౧

టీ. ధాత్రిఁ=భూమియందు, రాగియద్దమునఁ=తామ్రపుటద్దమునందు, మలినము=చిలుము, మానక=విడువక, తోఁచఁ=తోఁచినను, హరింపఁ=దానిని పోఁగొట్టుటకు, హేతువులు=ఉపకరణములు, ఒగిఁ=వరుసగా, కొన్ని=కొన్ని, కలవు=ఉన్నవి, పటికంబు=పటికపుబిళ్ళ, అతినిర్మలమౌటఁ=మిక్కిలి స్వచ్ఛమగుటచేత, దానికిఁ=అస్ఫటికమునకు, అట్టిహేతువులు=పయిఁజెప్పిన యుపకరణములు, అవశ్యము=ముఖ్యముగా, వలయునే=కావలయునా, ఒక్కతఱిఁ = ఒకకాలమందు, వెలుఁగఁ=కలిగెనేని, తత్కలుషమునెల్లఁ=ఆకల్మషమంతయు, మాన్పఁ=పోఁగొట్టుటకు, అది=అది, కల్పితమౌటఁ=కల్పింపఁబడిన దగుటచేత, మనంబు=మనస్సు, చాలదా=చాలదా, (చాలుననుట)

తా. పుడమిలో తామ్రపుటద్దమునందు చిలుము ఎప్పుడును దోఁచుచుండును. దానిమాన్పుటకు కొన్నియుపకరణములు కలిగియున్నవి స్ఫటికపుబిళ్ళ యతినిర్మలమగుటచేత దానియందు కలిగిన కళంకమును పోఁగొట్టుటకు పయినఁజెప్పిన యుపకరణములు అవశ్యముగా కావలయునే (అక్కఱలేదనుట) ఒకానొకసమయమందు కలుగునేని ఆ కల్మషము పోఁగొట్టుటకు మనస్సేచాలునని తాత్పర్యము. అనఁగా రాగి మొదలగువానికి చిలుముపట్టినపుడు ఆచిలుమును పోఁగొట్టుటకు చింతపండు, ఇటికరాయిపొడి, బూడిద మొదలగువస్తువులతోఁ దోమి శుభ్రముచేసిననేగాని ప్రకాశము కలుగదు. ఆచిలుము దానియందుకలుగుట నైజము. స్ఫటిక పాత్రతుల్యపదార్థము. దానియందు అగపడెడి నానావిధములైన వర్ణములు మొదలగునవి విచారింపఁగా దానివి కావు గనుక దానినిఁదోమి శుభ్రముచేయ నక్కఱలేదు. అటువలెనే అంతఃకరణము స్ఫటికపాత్రవంటిది. దానియందుఁదోఁచిన అజ్ఞానమనెడి కళంకమును బ్రహ్మవిచారముచేతఁ దొలఁగునని భావము.

అవతారిక:—అజ్ఞానోన్మూలనమునకు సుజ్ఞానమే ముఖ్యముగాని కర్మమువల్లఁ గాదని ఆచార్యులు శిష్యునకు రూఢిపఱచుచున్నారు.

మ. ఘనసచ్చిత్సుఖమం దసత్యజడదుఃఖంబు లెన్నడా దోఁచుఁ జె
ప్పినసామ్యక్రియఁ గర్మసంచయ మసంవిత్తెన్నహా మాఁగాన నా
శన మొందించునె దాని జ్ఞానశుచి లేశం బంటిన న్నీఱుగా
నొనరింపందగుఁ గాని యొంటనగునే యూహింపు మాశ్వద్గన్.

టీ. చెప్పినసామ్యక్రియన్=మునుచెప్పిన దృష్టాంతమువలె, ఘనసచ్చిత్సుఖమందున్=దేశకాలవస్తు పరిచ్ఛేదశూన్యమును, ప్రకాశాశ్రయమును నిరతిశయానందమును ఐన పరబ్రహ్మమందు, అసత్యజడదుఃఖంబులు—అసత్య=దేశకాలవస్తువికారమును, జడ=అధ్యాసమగు అవివేకమును, దుఃఖంబులు=బ్రహ్మసుఖాభావమును, (ఇవిమూఁడును)

సదా=ఎల్లప్పుడు, తోఁచుఁ=(వివృత్త్యోపాదానకారణముగా) కానఁబడును, కర్మసం
చయము=సత్క్రియలయొక్క సమూహము, అసంవిత్ = అజ్ఞానమునకు, స్నేహము=
మైత్రి, ఔ=అగును, కానఁ=కనుక, దానిఁ = ఆయజ్ఞానమును, నాశనమొందిం
చునే=పోఁగొట్టునా, జ్ఞానశుచి=జ్ఞానాగ్ని, లేశంబు=కొంచెము, అంటినఁ = తగిలిన,
నీఱుగాఁ=భస్మముగా, ఒనరింపందగుఁగాని=చేయుటకు తగినదౌనుగాని, ఒంటఁ=
వేఱొకసాధనముచేతను, అగునే=ఔనా, (కాదనుట.) తగఁ=ఒప్పునట్లు, ఆత్మఁ=
బుద్ధియందున, ఊహింపుము=తెలిసికొనుము.

తా. ముందుచెప్పిన దృష్టాంతమువలె సచ్చిదానందస్వరూపమయిన పరమాత్మ
యందు అనృతజడదుఃఖములు ఎల్లప్పుడు వివృత్త్యోపాదానకారణముగాఁ గనఁబడుచుం
డును. శ్రౌతస్మార్తాది సత్క్రియాసమూహము ఆయజ్ఞానమునకు స్నేహముగనుక దానిని
నాశనమొందించునా? జ్ఞానాగ్ని కొంచెముసోఁకినయెడల ఆ యజ్ఞానమును భస్మము
చేయునుగాని కర్మములు మొదలయినసాధనములచేత ఆ యజ్ఞానము తొలఁగునా? నీ
బుద్ధియందు దీనిని చక్కఁగాఁదెలిసికొనుమని తాత్పర్యము. ॥యథాపంకేన పంకాంభః
సురయావాసురావృతః, భూతహత్యాం తథైవైకాం నయజ్ఞైర్మార్ష్టుమర్హతి॥ అను భాగ
వతశ్లోకార్థముచొప్పున అడుసుచేత అడుసును కడిగిన నామురికి పోనిచందమున కల్లు
కుండను కల్లుతోఁ దోమికడిగిన దానికంపు వదలనివిధమున కర్మముచేత నజ్ఞానము నశించ
దని భావము. ॥శ్లో. జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్ కురుతేతథా, యథైధాంసిసమి
ద్ధోగ్ని ర్భస్మసాత్కురుతేర్జున॥ అను భగవద్గీతావాక్యము చొప్పున అగ్నిచేత కట్టెలు
భస్మమైనలాగున జ్ఞానాగ్నిసోఁకినయెడల సర్వకర్మములును భస్మమౌనని తెలియునది.
ఉపాదానము పరిణామోపాదానమని వివృత్త్యోపాదానమని ద్వివిధము. పరిణామోపా
దానము పాలు పెరుగైనట్లు గనుక వానిని ఈశ్వరునికిఁ జెప్పరాదు. అట్లు చెప్పినపక్ష
మున పాలుచెడి పెరుగైనటుల ఈశ్వరుఁడును చెడును. కొందఱు ప్రకృతిని ఉపాదా
నమందురు. ప్రకృతి ఉపాదానమయినయెడల కుమ్మరవానికి ముందే మన్నుకలిగి యుం
డినట్లు ఈశ్వరునికిముందే ప్రకృతియుండవలెను. అట్లు చెప్పినయెడల ఈశ్వరుఁడు మొం
దటివాఁడు కాకపోవును. లేక రెండును వేఱైన ద్వైతమౌను. ॥ఏకమేవాద్వితీయం॥
॥శ్లో. బ్రహ్మైవాహ మిదంజగచ్చసకలం, బహూని మేవ్యతీతాని జన్మానితవచార్జున,
తాన్యహంవేద్మసర్వాణి నత్వంవేత్థపరంతపః॥ అనఁగా సమస్తజాతులయందుపుట్టుచు అ
నేక నామరూపములఁ జెందియుండునది సత్‌బ్రహ్మమేయనియు సర్వము బ్రహ్మమేయనియు
రెండవదిలేదనియు నిర్ధారణమగుచున్నది కాఁబట్టి యీప్రమాణములకువిరోధమౌ కలుగును.
అందుచేత అట్లుచెప్ప చొప్పడదు. వివృత్త్యోపాదానమనఁగా రజ్జువందు సర్పముగాఁ దోఁచి
నటులు కారణమందుఁ గార్యమౌకనఁబడి విచారించినపిమ్మట సర్పములేక రజ్జువేయైనట్లు

విష్ణ్వాదిదేవలోకవాసులైన ముప్పదిమూడుకోటిదేవతలును, సుమిశ్రములన్-సు=లెస్సలైన, మిశ్రములన్=పుణ్యపాపసంకలితకర్మములచేత, నరులు=నాలుగులక్షల భేదములుగల మనుష్యులును, ఔదురంచున్=ఔదురని, చాటి=ప్రసిద్ధపఱచి, కులాశ్రమధర్మమార్గమే-కుల=బ్రాహ్మణాది చాతుర్వర్ణ్యమునకును, ఆశ్రమ = బ్రహ్మచర్యాది చతురాశ్రమములకును, ధర్మ=తగిన నడవడికయొక్క, మార్గమే = అనుసరణయే, క్రమముగన్=వరుసగా, మోదము=ఆనందమును, ఇచ్చునని=ఒసంగునని, కర్మవిధిన్=కర్మవిధాయకమును, వచియింపనేలకో=పలుకనేల.

తా. వేదము బ్రహ్మజ్ఞానమైన నిరతిశయానందమును నిచ్చునని చెప్పియు దానివిడిచి పాపకర్మములచేత తరు, పాషాణ, జలచర, క్రిమి, పశు, పక్షులును, పుణ్యకర్మములచేత బ్రహ్మ విష్ణు రుద్రాదిదేవతలును, మిశ్రకర్మములచేత మనుష్యులును ఐనారనియు చెప్పి బ్రాహ్మణ క్షత్ర వైశ్య శూద్రాదులకును, బ్రహ్మచారి, గృహస్థ, వానప్రస్థ, సన్న్యాసులకును నిర్ణయింపఁబడిన కర్మముల చేయుటవలన ఆనందము కలుగునని ఆవేదమే యేలచెప్పెనని తాత్పర్యము. పశుపక్షివృక్షాదుల సంఖ్యలకు ప్రమాణము. ౹౹ప. వృక్షము లిఱువదిలక్షలు, పక్షులు పదిలక్ష లుదకభవనవలక్షల్, లక్షత్రిదశము పశుక్రిమి, లక్షలపదిరెండు నాల్గు లక్షలు మనుజాల్.౹౹

అవ:—శిష్యుఁడడిగిన పైప్రశ్నకు ఆచార్యులు సమాధానము చెప్పుచున్నారు.

శా. మన్నెపు డజ్ఞతన్ దినుకుమారునిమాంద్యము మాన్పఁ దల్లి వి
ద్వన్నుత దాఁచి యౌషధము వత్సలతన్ మధురోపహారమున్
మన్ననఁ జూపి పిల్చుగతి మర్మముతో శ్రుతికర్మకాండమున్
బన్నుగఁ జూపుఁ దత్క్రియలఁ బాయక చేతురు స్వర్గకాములై.

టీ. విద్వన్నుత=విద్వాంసులచేత స్తోత్రములుచేయఁబడిన శిష్యుఁడా! ఎపుడు=ఎప్పుడు, అజ్ఞతన్=తెలివిలేమిచేత, మన్ను=మన్ను, తిను = భక్షించెడు, కుమారుని=బిడ్డయొక్క, మాంద్యము=అజీర్ణరోగమును, వత్సలతన్=ప్రేమాతిశయత్వముచేత, మాన్పన్=నివారించుటకు, తల్లి=జనని, ఔషధము=నూటినమందును, దాఁచి = మఱుఁగుపెట్టి, మన్ననన్=లాలనచేత, మధురోపహారమున్=మాధుర్యయుక్తమైన భక్ష్యమును, చూపి=కనుపఱచి, పిల్చుగతిన్=పిలుచువిధముగానే, శ్రుతి=వేదము, మర్మముతోన్=బాగుచేయవలెనను స్వాభిప్రాయమును మఱుఁగుపెట్టినతలంపుతో, కర్మకాండమున్=యాగాదికర్మములను దెలిపెడిభాగమును, చూపున్=కనుపఱచును, తత్క్రియలన్=ఆకర్మకాండమందుఁజెప్పిన తపోయాగయోగకృచ్ఛ్రచాంద్రాయణాదిపుణ్యకర్మములను,

స్వర్గకాములై = దేవలోకభోగాభిలాషగలవారై, పాయక=విడువక, చేతురు=(పామర కర్మఠులు) ఒనరింతురు.

తా. ఆత్మానాత్మవివేకముకల పండితులవల్ల స్తోత్రముచేయఁబడిన శిష్యుఁడా! ఎల్లప్పుడును వివేకములేనందున మన్నుతినెడు బిడ్డయొక్క మాంద్యవ్యాధిని పోఁగొట్టుటకు దయగల తల్లి కారముగా నుండెడి మందునూరి ఆమందును వానికిఁ దెలియకుండు నటులు దాఁచిపెట్టి తీపుగల అతిరసమునుజూపి దగ్గఱకు తీసికొని యేమఱపాటుచేసి ఆ యతిరసమును పాఱవేసి మందును పోసినటులు వేదము స్వర్గఫలము మీకుఁ గలుగును. సత్కర్మములు చేయుఁడనిచూపి బ్రహ్మకాండమును మఱుఁగుచేయ అది తెలియని కర్మఠులు బ్రహ్మకాండమును విడిచి "జ్యోతిష్టోమేన స్వర్గకామోయజేత" అనురీతిని స్వర్గ ఫలాపేక్షలుగలవారై విధి నిషేధప్రాయశ్చిత్తకామ్యములైన శ్రౌతస్మార్త నిత్యనైమిత్తిక కర్మములు చేయుచుందురని తాత్పర్యము.

అవతారిక:— భోగేచ్ఛగలవారలకు స్వేచ్ఛావిహారములు స్వాభావికములని ఆచార్యులు చెప్పుచున్నారు.

శా. భోగాసక్తుల కెద్ది యైన దిన సంభోగింప స్వాభావ్య మా
రాగం బొప్పు విధించు నా శ్రుతి కుమారా వారి కాకృత్యము
ల్వేగ న్మారుత వీచు మేర్చుము శిఖీ వేమా విసం బందుమా
బాగా కాకమ నల్పు గమ్మనిరె యోవ్వారైన నూహింపుమా. ౭౬

టీ. కుమారా=పుత్రా, భోగాసక్తులకున్=భోగమునం దిచ్ఛగలవారలకు, ఎద్దియైనన్=దేనినైనను, తినన్=భుజించుటకును, సంభోగింపన్ = ఏస్త్రీనైన అనుభవించుటకును, స్వాభావ్యమాన్= నైసర్గికమౌను, శ్రుతి= వేదము, వారికిన్=ఆ భోగాసక్తులకు, రాగంబొప్పన్= అనురాగమొప్పునటులు, ఆకృత్యములు= అపనులు, విధించునా= నిర్ణయించునా, ఎవ్వారైనన్=ఎవ్వరైనను, వేగన్=శీఘ్రముగా, మారుత = వాయువా, వీచుము=విసరుము, శిఖీ=అగ్నీ, ఏర్చుము=దహింపుము, వేమా=వేఁపచెట్టా,విసంబు=చేఁదును, అందుమా=పొందుమా, బాగా కాకమ = మంచిదైన వాయసమా, నల్పు గమ్ము=నల్లరంగు గలదిగానుండుము, అనిరె=అని విధించిరా, ఊహింపుము=నీవు దెలిసికొనుము.

తా. పుత్రా! భోగమునం దిచ్ఛగలవారలకు విధినిషేధములను యోజింపక యేవస్తువులనైన భుజించుటయును, ఏజాతిస్త్రీలనైనను పొందుటకును వారికి స్వభావములే కాను. వేదము అభోగాసక్తులకు ఇష్టము వచ్చినటులు అపనులను జేయుమని విధియించునా? ఎవ్వరైనను, వేగముగా గాలినివిసరుమని అగ్నినిదహింపుమని వేఁపచెట్టును విషము

కర్మనికాకమును నల్లతంగుగలదిగానుండుమని విధియించిరా? గనుక స్వాభావికగుణములైనట్లు భోగాసక్తులకు ‘‘కామాతురాణాం నభయన్నలజ్జా’’ అవి వానివానికి అనట్లు స్వేచ్ఛగాతినుటయు అనుభవించుటయు స్వభావములని నీవు తెలిసికొనుమని తాత్పర్యము. విధి యనఁగా వేదముచెప్పెడి చొప్పున నడుచుట నిషేధమనగా వేదవిరోధముగఁ బ్రవర్తించుట.

అవతారిక:—సర్వసంగపరిత్యాగమే వేదము యొక్క ముఖ్యాభిప్రాయమని ఆచార్యులు దెల్పుచున్నారు.

మ. మధుమాంసేచ్ఛలు యాగకార్యములఁ గామక్రీడ లుద్వాహస
ద్వధువందు న్దగఁ దీర్చుకొ మ్మనుచు వేదంబుల్ తదన్యక్రియ
ల్విధియించు న్దొలఁగ న్జగద్ధితముకై వేడ్క న్దదీయేచ్ఛల
బుధసంస్తుత్య సమస్తము న్విడుచుటే ముఖ్యంబె యా వానికిన్.

టీ బుధసంస్తుత్య-బుధ=పండితులచేత, సంస్తుత్య=కొనియాడఁదగిన శిష్యుఁడా, మధుమాంసేచ్ఛలు-మధు=సురాపానమందును, మాంస=పలలమందును, ఇచ్ఛలు=అభిలాషలు, యాగకార్యములన్=యజ్ఞకార్యములయందును, కామక్రీడలు=మన్మథకేళులయందభిలాషలు, ఉద్వాహసద్వధువందున్-ఉద్వాహ=పెండ్లిచేసికొన్న, సత్=శ్రేష్ఠమైన, వధువందున్=కులస్త్రీయందును, తగన్=ఒప్పునటులు, తీర్చుకొమ్ము=నెఱవేర్చుకొమ్ము, అనుచున్=అనుచు, తదన్యక్రియ-ల=యజ్ఞశిష్టములుగాక స్వేచ్ఛగాతినుట అన్యస్త్రీల యందు భోగించుట మొదలగుపనులను, తొలఁగన్ = విడుచుటకుఁగాను, వేదంబులు=శ్రుతులు, వేడ్కన్=సంతోషముతో, జగద్ధితముకై = జగత్తులోని వారిఇష్టమునకై, విధియించున్=నిర్ణయముచేయును. వానికిన్=ఆవేదములకు, సమస్తమున్=సర్వాభిలాషలను, విడుచుటే=పరిత్యాగముసేయుటే, ముఖ్యంబెయాన్=శ్రేష్ఠమగును.

తా. విద్వాంసులవల్లఁ గొనియాడఁదగినశిష్యుఁడా? మధుమాంసములయం దిచ్ఛగలిగియుండిన యజ్ఞములుచేసి భుజించుము. భోగములయం దిచ్ఛగలిగియుండిన విధ్యుక్తముగా వివాహముచేసికొని ఆస్త్రీయందు భోగించుమనిచెప్పుచు యజ్ఞశిష్టములుగానికార్యములనువిడుచుటకై జనులహితమునకుగుఱించి వేదములుచెప్పునుగాని ఇష్టమువచ్చినటుల తినుమని అనుభవింపుమని చెప్పలేదు. ఆవేదమునకు సర్వమును పరిత్యాగముచేయుటే ముఖ్యాభిప్రాయమని తాత్పర్యము. ‘‘నిస్సంగత్వేనిర్మోహత్వం, నిర్మోహత్వేనిశ్చలతత్త్వం నిశ్చలతత్త్వేజీవన్ముక్తిః’’ అను ఆచార్యోక్తిచొప్పున దారపుత్రాదులయం దభిలాషవదలగానె భోగేచ్ఛలయందుఁగల మోహమువీడుచున్నది. ఆమోహమువదలగానె విషయరహితుఁడగుటవలన నిర్మలజ్ఞానము కలుగుచున్నది. అట్టిజ్ఞానముకలవాఁడు జీవన్ముక్తుఁడనిభావము.

అవతారిక:—విధి నిషేధములనుగుఱించి వివరించుచున్నారు.

మ. క్రతుశేషామిషమద్యసంగ్రహణ మాఘ్రాణింపఁ బుత్త్రార్థమై
ఋతువేళన్ సతిఁ జేరఁజాలు నివి సత్కృత్యంబు లంచు న్క్రియా
హితమై వేదము పల్కుఁ జూడు మిలయందే యిచ్ఛ లెవ్వ వ్రతోగ్రిది స
ద్వ్రతికర్మందివటుల్ చరింతు రటులే నవ్వర్తిల్లు మామోదివై. ౭౮

టీ. ఇలయందున్ = భూమియందు, క్రతుశేషామిషమద్యసంగ్రహము - క్రతుశేష = యజ్ఞశిష్టములైన, ఆమిష = మాంసము, మద్య = కల్లుకుప్రతినిధియైన సోమలతరసమును, సంగ్రహణము = పరిగ్రహణము, ఆఘ్రాణింపన్ = వాసనచూచుటయును, పుత్త్రార్థమై = సుతోత్పత్తికై, ఋతువేళన్ = ఋతుకాలములయందు, సతిన్ = భార్యను, చేరన్ = కలియుటయును, చాలున్ = చాలును, ఇవి = ఈకార్యములు, సత్కృత్యములందున్ = మంచికార్యములని, క్రియాహితమై = కర్మకాండమున జొప్పిదముగా, వేదము = శ్రుతి, పల్కున్ = వచించును. సద్వ్రతికర్మందివటులు - సత్ = శ్రేష్ఠములైన, వ్రతి = కృచ్ఛ్రచాంద్రాయణాదివ్రతములు సలిపెడువారును, కర్మంది = కుటీచక బహూదకాది సన్న్యాసులును, వటులు = బ్రహ్మచారులును, ఇచ్ఛలు = (ముందుచెప్పఁబడిన మధుమాంస భక్షణ భోగములయందలి) కోరికలు, వెసన్ = శీఘ్రముగా, త్రోచి = విడిచి, చరింతురు = ప్రవర్తింతురు, మాడుము = (నాయ గృహస్థులచేత పూజ్యాలై యుండుటను) నీవుకనుము, అటులు = ఆప్రకారము ఆమోదివై = బ్రహ్మానందముగలవాఁడవై, వర్తిల్లుము = ప్రవర్తించుము.

తా. వేదము భూమియందు కల్లుకు ప్రతినిధియైన సోమపానమును పశుపురోడాశమును ఆఘ్రాణింపుమనియు, ధర్మప్రజార్థమై ఋతువైన పిదపదినమందు తనసతిని కూడుమనియు, ఈకార్యములు కర్మకాండమునకు ఒప్పిదముగాఁ జెప్పెనుగాని సర్వము త్యజించిన వ్రతనిష్ఠులును సన్న్యాసులను బ్రహ్మచారులనుచూచి ముందుచెప్పిన మధుమాంసభక్షణ భోగములయందలి కోరికలను పరిత్యజించి బ్రహ్మానందము గలవాఁడవై యుండుమని తాత్పర్యము.

అవతారిక:—పరస్పరవిరోధముగల జ్ఞానాజ్ఞానములు రెండును ఏకమై జగత్సృష్టియెట్లొనరించునని శిష్యుఁ డడుగుచున్నాఁడు.

మ. జగదాకారజడంబు కర్మతతికిన్ సఖ్యం బగు న్దానికిన్
బగయౌ నొండగుజ్ఞాన మిందుకళతోఁ బ్రచ్ఛన్నమై కందుసో
యగమై కూడినజోకఁ జేరి యవి వ్యోమాదిప్రపంచం బహో
తగుగాఁ జేయగురూత్తమా తెలుపుమీ తాత్పర్యమింపొందఁగాన్.

టీ. గురూత్తమా = గురుశ్రేష్ఠుఁడైన నాయాచార్యుఁడా, జగదాకారజడంబు- జగత్ = (పుట్టుచు గిట్టుచునుండు నామరూపాత్మకమయిన) లోకముయొక్క, ఆకార= స్వరూపముగల, జడంబు=అజ్ఞానము, కర్మతతికిన్ = విధినిషేధకామ్యప్రాయశ్చిత్తముల తోఁగూడిన సత్క్రియాసమూహమునకు, సఖ్యంబు=మైత్రి, అగున్ = అగును, దానికిన్=ఆయజ్ఞానమునకు, ఒండగు=ఏకస్వరూపమైన, జ్ఞానము=యథార్థవస్తుపరిజ్ఞానము, పగయౌన్=విరోధమగును, అవి=ఆజ్ఞానాజ్ఞానములు రెండును, ఇందుకళతోన్-ఇందు =చంద్రునియందలి, కళతోన్=కలతో, కందు=నల్పు, ప్రచ్ఛన్నమై = మాటుపడి, సోయగమై=సొగసుగలదై, కూడినజోకన్=చేరినరీతిగానే, చేరి=కలసి, వ్యోమాదిప్రపంచంబు=ఆకాశము మొదలైనజగమును, చేయన్ = చేయుటకు, తగునా = చెల్లునా, అహో=ఆశ్చర్యము, ఇంపొందఁగాన్=ఆనందముపొందులాగున,ఈతాత్పర్యమున్=ఈ తాత్పర్యమందలి యర్థమును, తెలియఁజేయుము.

తా. గురుశ్రేష్ఠుఁడవైన యాచార్యుఁడా! పుట్టుట గిట్టుటలు గలజగము అజ్ఞానస్వరూపము. కర్మమునకును అజ్ఞానమునకును స్నేహముకలిగియున్నది. జ్ఞానమునకును అజ్ఞానమునకును విరోధమగును గాన చంద్రునియందలి చంద్రికతో కళంకముచేరియుండునటుల జ్ఞానాజ్ఞానములు రెండునుజతగాఁగూడి ఆకాశము మొదలైన జగమునుచేయుటకుఁ దగునా? ఇది ఆశ్చర్యముగదా? యీయర్థమును స్పష్టముగాఁ దెలియఁజేయుమని తాత్పర్యము. అనఁగా అస్థిరమైనప్రపంచము అజ్ఞానస్వరూపము. ఆ యజ్ఞానమునకును కర్మమునకును చుట్టరికము కలిగియుండుటవలన జ్ఞానమునకును అజ్ఞానమునకును మైత్రి పొసగదు. కావున కర్మమజ్ఞానమును పోఁగొట్టఁజాలదు. ఆరెండును ఒక్కటిగాఁగూడి జగత్సృష్టిచేయుట ఆశ్చర్యముగనుక నీసందేహము నివర్తిచేయుమని శిష్యుఁడడుగుచున్నాఁడు.

అవతారిక:—శిష్యుఁడడిగిన పైప్రశ్నకు నుత్తరము చెప్పుచున్నారు.

మ. పరఁగున్ స్వప్రభఁ జేతనం బదె స్వరూపప్రజ్ఞనా వృత్తినా
స్థిరతత్ప్రజ్ఞయె వృత్తియౌ నితరమై చెన్నొందలే దెందులన్
వరతత్ప్రజ్ఞ యవిద్యకుం బగ యగున్ వత్సా తగన్ నుత్తియం
దరయ న్జాడమె వృత్తియై యది యవిద్యం బాపు నిష్ఠ న్జుమీ. ౮౦

టీ. వత్సా=కుమారా, చేతనంబదె=ఆ బ్రహ్మజ్ఞానమే, స్వప్రభన్ = తనప్రకాశముచేత, స్వరూపప్రజ్ఞనాన్=స్వరూపజ్ఞానమనియు, వృత్తినాన్=వృత్తిజ్ఞానమనియు, పరఁగున్=ఒప్పును, తత్ప్రజ్ఞయే=ఆస్వరూపజ్ఞానమే=వృత్తియౌను = వృత్తిజ్ఞానమను నదియౌను, ఎందులన్=ఏశాస్త్రములయందును, ఇతరమై=ఇంకొకటియై, చెన్నొందలేదు =ప్రకాశింపలేదు, వరతత్ప్రజ్ఞ-వర=శ్రేష్ఠమైన, తత్ప్రజ్ఞ= ఆస్వరూపజ్ఞానమే, అవి

త్యకుఁ—అజ్ఞానమునకు, పగయగుఁ—వైరముకలదియగును, అరయఁ—ఆలోచింపఁగా, సుషుప్తియందుఁ—కారణశరీరకార్యమైన సుషుప్త్యవస్థయందు, తగఁ—ఒప్పునట్లుగా, చూడమే—కనమా, అది—అస్వరూపజ్ఞానము, వృత్తియై—వృత్తిజ్ఞానమై, నిష్ఠఁ—నిర్వికల్ప సమాధిచేత, అవిద్యఁ—అజ్ఞానమును, పాపుఁ—పోఁగొట్టును.

తా. కుమారా! భూమియందు బ్రహ్మజ్ఞానమే తనప్రకాశముచేత వృత్తిజ్ఞానమనియు స్వరూపజ్ఞానమనియు రెండువిధములుగా నుండును. అస్వరూపజ్ఞానమే వృత్తిజ్ఞానమౌను. ఏశాస్త్రములయందును ఒకటిగాఁజెప్పినుగాని భిన్నములుగాఁ జెప్పలేదు. ఆ స్వరూపజ్ఞానమే అజ్ఞానమునకుఁ బగయగును. యోజింపఁగా కారణశరీర కార్యమైన సుషుప్తియందు ఒప్పియున్నటులు తెలిసికొనుము. ఆ స్వరూపజ్ఞానమే వృత్తిజ్ఞానమై నిర్వికల్ప సమాధిచేత అజ్ఞానమును పోఁగొట్టునని తాత్పర్యము. ‹‹అవిరోధితయాకర్మ నావిద్యాం వినివర్తయేత్, విద్యాఽవిద్యాం నిహంత్యేవ తేజస్తిమిర సంఘవత్›› అను శ్లోకార్థము చొప్పున కర్మకును అజ్ఞానమునకును విరోధము లేనందున కర్మ అజ్ఞానమును పోఁగొట్టఁజాలదు. జ్ఞానము అజ్ఞానమును గొట్టివేయుచున్నది. ఇందులకు దృష్టాంతము. పటము పటాంతరంబునకు విరోధిగాదు గాన దాని నెటులవెలెవేరక బలపఱచుచున్నదో అటువలె కర్మ అజ్ఞానమునకు విరోధికాదు గనుక దానింబోఁగొట్టక వృద్ధిపఱచుచున్నది. మఱియు అమావాస్యనాఁటిరాత్రియందు కలిగిన మేఘావరణము ఆ యమావాస్యచీఁకటిని పోఁగొట్టక వృద్ధిచేసినతెఱఁగున కర్మం బజ్ఞానమును ప్రబలించుచున్నది. ఎట్లనఁగా ఆ చీఁకటియందు దారిఁబట్టిపోయెడి మనుజునకు పశువు లెదురుగావచ్చిన వానిలో ఎద్దని, ఆవని తెలియక సాధారణముగ మృగములనియు, మనుష్యు లెదురైన బ్రాహ్మణుఁడని శూద్రుఁడని తెలియక సాధారణముగ మనుష్యులనియుఁ దోఁచును. ఆ చీఁకటిలో మబ్బుకూడా చేరిన సామాన్యముగాఁ దోఁచిన పశ్వాదులుసహా తెలియకపోవును. అదేతీరున కర్మ అజ్ఞానమును వృద్ధిచేయును. ఆత్మయందు అవిద్యయును అజ్ఞానంబును కూడియుండుట వలన ముందు చెప్పినచొప్పున దానిచే అపంచీకృత పంచమహాభూతములవలనఁ గల్పింపఁబడిన సూక్ష్మశరీరము స్థూలశరీరంబుతోఁగూడి సర్వకర్మములను జేయుచున్నది. ఇట్లు శరీరత్రయంబు కార్యమై పృథివ్యప్తేజోవాయ్వాకాశములు కారణములై ప్రత్యక్షముగఁ గనుపడుచుండ వేదాదులయందు వక్కాణింపఁబడిన అద్వితీయపరబ్రహ్మము తానని యెట్లు చెప్పఁదగుననఁగా వ్యష్టిసమష్ట్యాత్మకమగు శరీరత్రయమనెడి ప్రపంచము ఆ యాత్మయం దారోపింపఁబడియున్నందున రజ్జుస్వరూపం బెటులనిలిచెనో అవిధమున ఆత్మయం దారోపింపఁబడిన జగత్తునకు ఆత్మతప్ప వేఱొకవస్తువులేదు గాన ఆయాత్మ యద్వితీయుఁ డగుచున్నాఁడు. కాఁబట్టి అద్వితీయపరిపూర్ణ సచ్చిదానందస్వరూపుఁడైన ఆత్మ

కాఁననియు తనకంటె భిన్నముగ భ్రాంతిచేఁదోఁచెడిజగత్తు మిథ్యయనియు నెవ్వఁడెఱుఁగుచున్నాఁడో వాఁడే జీవన్ముక్తుఁడని వేదాంతసిద్ధాంతము.

మిథ్యయనఁగా రజ్జువందలి సర్పమువలెను, సుషుప్తియందలి స్వప్నమువలెను, ఎండమావులయందలి నీళ్ళవలెను, కాలిన వస్త్రమువలెను తోఁచెడి భ్రమ. ఇది పంచవిధంబులు. బింబప్రతిబింబదృష్టాంతముచేత నొక్కటియని తెలిసికొనక తటస్థేశ్వరునికిని ప్రత్యగాత్మకును భేదబుద్ధిగలుగుట మొదటిభ్రమ. స్ఫటికలోహితోపమానముచేత ఆత్మయందుఁదోఁచెడి కర్తృత్వాద్యభిమానములు అబద్ధమని యెఱుఁగక యథార్థమునినమ్ముట రెండవభ్రమ. ఘటమఠాకాశముల దృష్టాంతమువలన శరీరత్రయమున భిన్నభావము వదలకయుండుట మూఁడవభ్రమ. రజ్జుసర్పోదాహరణముచే జగత్కర్తయగు పరబ్రహ్మము కాదని యెఱుఁగక వికారత్వముఁజెందుట నాల్గవభ్రమ. స్వర్ణలోకదృష్టాంతముచేత కారణాదభిన్నప్రపంచము భిన్నముగా నున్నదనియెంచుట ఐదవభ్రమ. ఈభ్రమలు అజ్ఞానంబువలనఁ గలుగునవిగనుక వానిని నిర్వికల్పసమాధిచే నశింపఁజేయువలయునని భావము. శ్లో. అంతఃపూర్ణోబహిఃపూర్ణః పూర్ణకుంభ ఇవాంబరే, అంతశ్శూన్యో బహిఃశూన్యః శూన్యకుంభ ఇవాంబరే॥ అను స్మృత్యర్థమునందలి భావన కలిగియుండుట నిర్వికల్పసమాధియనఁబడును.

అవతారిక:—వృత్తిరూపజ్ఞానము జగద్రూపమగు అజ్ఞానమును నశింపఁజేయు విధమును దృష్టాంతపూర్వకముగఁ దెలియఁజేయుచున్నారు.

మ. పగయై సుప్తి దహింప కజ్ఞత స్వరూపప్రజ్ఞ తా వృత్తియై
మిగుల న్దాని దహించు టెట్టు లన సన్మిత్రస్థితోష్ణద్యుతుల్
జగతి న్గాల్పక తచ్ఛిలం దగిలి భాస్వద్వహ్నియై కాల్చు నా
పగిది న్వృత్తి దహించు దృశ్యమయమై భాసిల్లు నజ్ఞానమున్. ౮౧

టీ. స్వరూపప్రజ్ఞ=స్వరూపజ్ఞానము, పగయై=విరోధముకలదై, సుప్తిన్=సుషుప్త్యవస్థయందు, అజ్ఞతన్=అజ్ఞానమును, దహింపక=కాల్పక, తాన్=తాను, వృత్తియై=వృత్తిజ్ఞానరూపమై, దానిన్=ఆజగద్రూపమైన అజ్ఞానమును, మిగులన్=మిక్కిలి, దహించుట=కాల్చుట, ఎట్టులనన్=ఏలాగనఁగా, సన్మిత్ర...స్థితుల్-సత్=శ్రేష్ఠమైన, మిత్ర=సూర్యునియందు, స్థిత=ఉన్నట్టి, ఉష్ణద్యుతులు=తీక్ష్ణకిరణములు, జగతిన్=లోకమును, కాల్పక=దహింపక, తచ్ఛిలన్= ఆ సూర్యకాంతపు ఱాతియందు, తగిలి=పడి, భాస్వద్వహ్నియై-భాస్వత్=ప్రకాశించుచుండెడి, వహ్నియై=అగ్నియై, కాల్చున్=ఏర్చును, ఆపగిదిన్ = ఆలాగున, వృత్తి=వృత్తిరూపజ్ఞానము, దృశ్యమయమై=నామరూపాత్మకజగద్రూపమై, భాసిల్లు=వెలిఁగెడి, అజ్ఞానమున్=అవివేకమును, దహించున్=నశింపఁజేయును.

తా. స్వరూపజ్ఞానము విరోధముగలదై యుండియు సుషుప్త్యవస్థయందు అజ్ఞానమును గాల్చక తానువృత్తిజ్ఞానరూపమై ఆ జగద్రూపమైన యజ్ఞానమును దహించుట యెట్లనఁగా సూర్యునియందుండు ఉష్ణకిరణములు లోకమును గాల్పక సూర్యకాంతపు రాతియందుఁదగిలి అగ్నియై జగత్తును గాల్చును. ఆప్రకారమే వృత్తిరూపజ్ఞానము జగద్రూపమైన అజ్ఞానమును నశింపఁజేయునని తాత్పర్యము.

అవతారిక:—అంతఃకరణమందుఁబుట్టిన సత్కర్మములు వృత్తిజ్ఞానము అనువానిలో వృత్తిజ్ఞానమునకు శ్రేష్ఠమైన పూర్ణజ్ఞానమని యేల పేరుపెట్టఁబడెనని శిష్యుఁడడుగుచున్నాఁడు.

మ. కరణప్రత్రయ జన్యకార్యములు సత్కర్మంబులౌ వృత్తియున్
స్థిర నంతఃకరణోద్భవంబె కద సాచివ్యంబె యౌ వానికిన్
హరియింప న్దగవో యవిద్య నవి సత్యాచార్య యావృత్తికిన్
వరవిజ్ఞాన మటంచుఁ బేరిడినభావం బేమి తెల్ప న్దగున్. ౮౨

టీ. సత్యాచార్య=త్రిపరిచ్ఛేదమైన పరబ్రహ్మవస్తువును దెలిసి శిష్యప్రశిష్యులకు బోధించెడి శక్తిగల గురుమూర్తీ, స్థిరన్=భూమియందు, కరణప్రత్రయ=(కాయిక వాచిక మానసికములనెడి) త్రివిధసాధనములవలన, జన్య=పుట్టిన, కార్యములు= (వేదవిహితములైన) పనులు, సత్కర్మంబులౌన్-సత్=శ్రేష్ఠములగు, కర్మంబులు=క్రియలు, ఔన్=అగును, వృత్తియున్=వృత్తిజ్ఞానమును, అంతఃకరణోద్భవంబెగద-అంతఃకరణ=మనమునందు, ఉద్భవంబెగద=పుట్టినదేకదా, వానికిన్=అసత్కర్మములకు, సాచివ్యంబెయౌన్=మిత్రత్వంబుగలదియేయగును, అవి=అసత్కర్మములు, అవిద్యన్=అజ్ఞానమును, హరియింపన్ = పోఁగొట్టుటకు, తగవో=చాలినవికావా, ఆవృత్తికిన్=ఆ అంతఃకరణోద్భవమైనవృత్తికి, వరవిజ్ఞానమటంచున్-వర=శ్రేష్ఠమైన, విజ్ఞానమటంచున్=పూర్ణజ్ఞానమని, పేరు=నామము, ఇడిన=ఉంచినట్టి, భావంబు=అభిప్రాయము, ఏమి=ఏమి, తెల్పన్దగున్=తెలియఁబఱచవలసినది.

తా. సద్గురుమూర్తీ! భూమియందు కాయిక, వాచిక, మానసికములనెడి సాధనముల మూటివలనఁబుట్టిన సత్క్రియలును వృత్తిజ్ఞానమును అంతఃకరణమునందుఫుట్టినవియేగనుక అసత్కర్మములకును వృత్తిజ్ఞానమునకును మిత్రత్వముకలదియగును. అసత్కర్మములు అజ్ఞానమును నశింపఁజేయుటకు చాలినవిగావా? అట్టి యంతఃకరణమునకు శ్రేష్ఠమైనజ్ఞానమని పేరిడిన అభిప్రాయమును దెలియఁజేయవలయునని తాత్పర్యము.

అవతారిక:—ముందడిగిన ప్రశ్నకు ఉత్తరముఁ జెప్పుచున్నారు.

మ. వితతాంతఃకరణంబున న్జడము సంవిద్రూపము న్గల్గె సం
తత మూరెంటికి వైరమెల యునఁ బుత్త్రా చూడమే సోదరు

హాతులై యుండఁగ నొక్కరుం డొకనిచే నట్లా జడోద్భూతక
ర్మతతుల్మానుషతంత్రములుసుమతి యాత్మప్రక్రియారూపమై. ౨౩

టీ. పుత్త్రా=కుమారా, వితతాంతఃకరణంబునన్-వితత = అతిశయమైన, అంతఃకరణంబునన్=మనస్సునందు, జడము=(కర్మరూపమైన) యజ్ఞానమును, సంవిద్రూపమున్=బ్రహ్మజ్ఞానమును, కల్గెన్=పుట్టెను, సంతతము=ఎల్లప్పుడు, ఆ రెంటికిన్=ఆయజ్ఞానజ్ఞానములకు, వైరము=పగ, ఏలయనన్=ఎందుకనఁగా, సోదరులు=ఏకగర్భసంభూతులైనయన్నదమ్ములు, ఒకనిచేన్=వారిలో నొకనిచేత, ఒక్కరుండు=మఱియొక్కఁడు, హాతులైయుండఁగన్ = చంపఁబడినవారైయుండఁగాను, మూడమే=మనము చూడమా, అట్లు = అప్రకారము, అజడోద్భూత కర్మతతులు-అ=అయొక్క, జడ=అజ్ఞానముచేత, ఉద్భూత=పుట్టిన, కర్మతతులు=క్రియాసమూహములు, మానుషతంత్రములు=మనుష్యులచేతఁజేయఁబడిననిర్ణయములు, సు=లెస్సయగు, మతి=జ్ఞానము, ఆత్మక్రియారూపము=ఆత్మతంత్రము, ఔన్=ఔను.

తా. కుమారా! అతిశయమయిన మనస్సునందు అజ్ఞానము జ్ఞానముపుట్టెను. ఎల్లప్పుడు ఆ రెంటికిఁబగయెందుకుఁ గలిగెననఁగా, ఒక గర్భమందుఁబుట్టిన అన్నదమ్ములు ఒకనిచే నొకఁడు చంపఁబడియుండుటను మనము చూడలేదా ? అప్రకారమే అజ్ఞానముచేత నేర్పడుకర్మతతులు, మానుషతంత్రములు, జ్ఞానము, ఆత్మవస్తుతంత్రము ఈ రెండును ఎటులనౌనని తాత్పర్యము.

అవతారిక:—యోగజ్ఞానముల తారతమ్యములను దిగువవచ్చెడు రెండుపద్యములచేత శిష్యునకుఁ దెలియఁజేయుచున్నారు.

మ. తగుఁ గర్మంబులు సేయఁ బాయ మఱివ్యస్తాస్యసంబుగాఁ జల్పన
ట్లగునో జ్ఞానము పూర్ణమై నెగడు సత్యంబౌటఁ దద్జ్ఞాన మి
జ్జగతిన్ యోగము లాఁతియానొకటి వ్యాసంబొప్ప వేఱొండుగా
నొగి భావించుట ధ్యాన మందు రదియే యోగం బగున్ జ్ఞాన మా
త్మగుహాన్తోఁచి వెలుంగుఁ గాన బుతమధ్యాసంబు గా దెంతయున్.

టీ. ఇజ్జగతిన్=ఈ భూమియందు, కర్మంబులు = (వేదోక్తకులాచార) సత్కర్మములు, చేయన్=ఒనర్చుటకును, పాయన్=విడుచుటకును, మఱి=వెండియు, వ్యస్తాస్యసంబుగాన్=వ్యత్యస్తముగా, చల్పన్=చేయుటకును, తగున్=ఒప్పును, జ్ఞానము=బ్రహ్మస్వరూపమైనజ్ఞానము, అట్లగునో=అప్రకారముచేయుటకును తారుమాఱుగాచేయుటకును విడుచుటకును తగునా, సత్యంబౌటన్=దేశకాలవస్తుపరిచ్ఛేదశూన్య మగుటచేత, పూర్ణమై=అంతటనిండినదై, నెగడున్=తేజరిల్లును, తద్జ్ఞానము = అబ్రహ్మజ్ఞానమును

నది, యోగము=కర్మయోగమనునది, లాఁతియౌళ్=వేఱ్వేఱగును, ఒకటిక్=ఒకపదార్థమును, వేఱొండుగాళ్=మఱియొకటిగాను, ఒగిళ్=క్రమముగా, భావించుట=భావనచేయుట, ధ్యానమందురు=ధ్యానమని చెప్పుదురు, అదియే=అధ్యానమే, యోగంబగుళ్=యోగమను పేరుగలదియగును, జ్ఞానము=జ్ఞానమనునది, ఆత్మగుహాళ్=అంతఃకరణమను గవియందు, తోఁచి=పుట్టి, వెలుంగుళ్=ప్రకాశించును, కానళ్=కాఁబట్టి, ఎంతయుళ్=శద్ధయు, అధ్యాసముగాదు=కల్పితముగాదు, ఋతము=యథార్థమగును.

తా. లోకమందు పుణ్యకార్యములు చేయుటకును, చేయకుండుటకును, మఱియొకవిధముగాఁజేయుటకును తగినవగును. జ్ఞానము అప్రకారమే చేయుటకును, విడుచుటకును, తాఱుమాఱుగాఁజేయుటకునుతగదు. దేశకాలవస్తు పరిచ్ఛేదశూన్యమయిన పరబ్రహ్మజ్ఞానము అంతటనిండి ప్రకాశించుచుండును. యోగమనునది వేఱైనదగును. అదియెట్లనఁగా ఒకనివలన వినినపదార్థమును మనమున ఊహించుట ధ్యానము. అధ్యానమే యోగమనునది యగును. కాఁబట్టి ఆయోగము కల్పింపఁబడునది. జ్ఞానమనునది "అంతశ్చరతి భూతేషు గుహాయాం విశ్వమూర్తిషు" అనునట్లు విశ్వస్వరూపులయిన బ్రహ్మవిష్ణ్వాది చేతనాచేతనప్రాణులయొక్క అంతఃకరణమనెడు గుహయందుండునదిగాన అదివిచారణచేత ఉదయించి ప్రకాశించునది యగును. కనుక జ్ఞానము మాచి పొందినదగుటవలన యథార్థమైనదని తాత్పర్యము. "కర్మ, కర్తుం, అకర్తుం, అన్యథాకర్తుం, శక్తం, జ్ఞానం తథైవన, కర్మఫలముత్పన్నం, నోత్పన్నం, జ్ఞానఫలం" అని మహాభాష్యము అనఁగా, కర్మము చేయవచ్చును, చేయక యుండవచ్చును, మఱియొకవిధముగాఁ జేయవచ్చును. జ్ఞానమనునది అట్లుగాదు. కర్మఫలము పుట్టునది, జ్ఞానఫలము పుట్టునదిగాదు అని భావము.

చ. అనుభవవేద్యపూర్ణ పరమార్థము చేతన మాలకించి భా
 వన మొనరింప యోగ మగు వాస్తవ మెమ్మెయి విన్నమాటయౌఁ
 గనుమఱుఁ గానుగాక నుత కన్పడఁ జూచిన దట్లుగాదు గా
 వున నవివేకము న్జెఱుప నోపు వివేకము కర్మ మోపునే. ౮౫

టీక. అనుభవవేద్యపూర్ణ పరమార్థము-అనుభవ=స్వానుభావముచేత, వేద్య=తెలిసికొనఁదగిన, పూర్ణ=పరిపూర్ణమైన, పరమార్థము=అద్వితీయము, చేతనము=జ్ఞానము, (అగును) ఆలకించి=ఒకరుచెప్పఁగా విని, భావనమొనరింపళ్ = భావింపఁగా, యోగమగుళ్=యోగమనునదియౌను, విన్నమాట = వినినపలుకులు, కనుమఱుఁగౌనుగాక=మఱఁగిపోనేగాని, ఎమ్మెయిళ్=ఏప్రకారము, వాస్తవము=యథార్థము, ఔళ్=అగును, కన్పడళ్=అగుపడ, చూచినది=విమర్శించినది, అట్లుకాదు = అప్రకారము కనుమఱుఁగుకాదు, కావునళ్=కాఁబట్టి, వివేకము=జ్ఞానము, అవివేకముళ్=అజ్ఞానమును,

చెఱుపనోపుక్—చెఱుపఁజాలును, కర్మము—ఆసత్కార్మానుష్ఠానము, చెఱుపనోపునే—ఆయజ్ఞానమును పోఁగొట్టుటకుఁదగునా.

తా. స్వానుభవముచేత పూర్ణమైన అద్వితీయము జ్ఞానమగును. ఒకరు చెప్పఁగా విని యోజింపఁగాఁ దోఁచినది యోగమగును. వినినమాట కనుమఱుఁగౌనుగాని కనినది కనుమఱుఁగుకాదు కాఁబట్టి జ్ఞానము అజ్ఞానమును చెఱుపఁజాలును. సత్కార్మము అజ్ఞానమును పోఁగొట్టఁజాలదని తాత్పర్యము. ‹‹కర్మచితోలోకః క్షీయత ఏవ, అముత్ర పుణ్యచితోలోకః క్షీయత ఏవ కర్మణా కృష్యాదినా, చితః సంపాదితః, పదార్థః యథా క్షీయత ఏవ తథైవ అముత్ర పుణ్యచితో లోకః క్షీయత ఏవ›› అని మహాభాష్యమందుఁ జెప్పినట్లు కర్మచేత సంపాదింపఁబడిన పదార్థము నశించునది. ఆ ప్రకారమే వ్యవసాయముచేత సంపాదింపఁబడిన పదార్థము మఱుసటిసంవత్సరమునకు నిలవయినటుల నశించునని భావము.

అవతారిక:—అపరోక్షసాక్షాత్కార జ్ఞానమునకును శ్రవణమువలనఁ గలుగునట్టి ధ్యానమునకును గల తారతమ్యములఁ దెలియఁజేయుచున్నారు.

మ. సకలం బాత్మమయుంబనక్ సుమతి మోక్షంబబ్బుఁదద్ధ్యానముక్
వికలం బౌనన దానిస్వానుభవ ముర్విన్మిథ్యగాఁ జూడఁబో
కు కుమారా విని చేయుచింతమ్మృష తద్గోప్యస్థితార్థం బమో
ఘకలాంచత్పరిపూర్ణమై వెలయుఁదాఁ గల్పాంతమునన్సత్యమై. ౮౭

టీక. కుమారా—పుత్రా, ఉర్విక్—భూమియందు, సుమతిక్—అపరోక్షసాక్షాత్కార జ్ఞానముచేత, సకలంబుక్—సమస్తమును, ఆత్మమయుంబనక్—పరబ్రహ్మస్వరూపమేయనిన, మోక్షంబు—కైవల్యము, అబ్బుక్—దొరకును, తద్ధ్యానముక్-తత్—ఆ ప్రాప్తించిన వస్తువుయొక్క, ధ్యానముక్—నిదిధ్యాసమును, వికలంబౌనవక్—చెడునవిన, దాని స్వానుభవము—(ఆచెడిన ధ్యానమువలనకలిగిన) స్వానుభూతి, మిథ్యగాక్—అబద్ధముగా, చూడఁబోకు—ఎంచకుము, విని—శ్రవణముచేసి, చేయుచింత—ఒనర్చునట్టి ధ్యానము, మృష—అబద్ధము, (అగును) తత్—ఆధ్యానమువలనఁదోఁచిన, గోప్య—అవాఙ్మానసగోచరమై, స్థిర—ఉన్నట్టి, అర్థంబు—పరబ్రహ్మము, కల్పాంతముక్—వృత్తిప్రళయము మొదలు తటస్థేశ్వరప్రళయమువఱకు, అమోఘ—వ్యర్థముకాని, కలా—తుర్యతుర్యమను పేరుగల అవికల్పావికల్పకలచేత, అంచత్—ఒప్పునట్లుగా, పరిపూర్ణమై—అంతట నిండినదై, సత్యమై—త్రిపరిచ్ఛేదశూన్యమై, వెలయుక్—ప్రకాశించును.

తా. కుమారా! పుడమియందు అపరోక్షజ్ఞానముచేత సమస్తమును ‹‹శ్రు. వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవసత్యం›› అను ప్రమాణము ననుసరించి సర్వము బ్రహ్మస్వరూపమేయనిన కైవల్యము దొరకును. ఆధ్యానమువలన లభించినవస్తువు

నిష్ఠచేత చెడునని అధ్యానముచెడుటేకాని అప్రాప్తించిన యథార్థవస్తువు చెడదు. శ్రవణముచేసి ఒనర్చనట్టి ధ్యానము అసత్యమగును. దానివలన కలిగిన పరబ్రహ్మవస్తువు వ్యాప్తి ప్రళయము మొదలు తటస్థేశ్వర ప్రళయమూలకు వ్యర్థముగానట్టి తుర్య తుర్యమగు అవికల్పావికల్పముగా నొప్పి అంతట వ్యాపించునదియై త్రిపరిచ్ఛేదశూన్యమై ప్రకాశించునని తాత్పర్యము. ‘‘ఏకోదేవ స్సర్వభూతేషుగూఢ స్సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా, కర్మాధ్యక్షస్సర్వభూతాధివాస స్సాక్షీచేతాకేవలో నిర్గుణశ్చ, యోవేద నిహితం గుహాయాం పరమేవ్యోమన్, సయోహవై తత్పరమం, బ్రహ్మవేదబ్రహ్మైవభవతి, బ్రహ్మవిదాప్నోతిపరం, నజాయతే మ్రియతే వావిపశ్చిత్, నిత్యంవిభుం సర్వగతంసుసూక్ష్మమ్. ఆకాశవత్సర్వ గతశ్చనిత్యం, నిత్యో నిత్యానాంచేతనశ్చేతనానాం, ఇదం సర్వం యదయమాత్మా సర్వం హ్యేతద్బ్రహ్మవేద సర్వమ్’’ అనెడి శ్రుతి ప్రమాణంబుల ప్రకారము ఆత్మ యొక్కటియేయనియు, ఆ పరమాత్మకంటె నన్యముగ కర్తయు భోక్తయు లేదనియు, ఆత్మకు సంసారంబు భ్రాంతిమాత్రమే యనియు,పంచకోశాత్మకమైన గుహాయందుండు ఆత్మయే పరబ్రహ్మంబనియు, అట్టిబ్రహ్మమును ఏపురుషుఁడు తనకంటె వేఱుగాదని తలంచుకొనుచున్నాఁడో వాఁడే బ్రహ్మంబగుననియు, అట్టి బ్రహ్మవేత్తకు జననమరణాదిదుఃఖంబులు కలుగక పరమానందభరితుఁ డగుచున్నాఁడనియు, మఱియు ఆపరబ్రహ్మంబు సర్వవ్యాపకమైన దగుటంజేసి దేశముచేతను, నిత్యం బగుటంజేసి కాలంబుచేతను, సర్వస్వరూపుఁ డగుటనుబట్టి వస్తువుచేతను, పరిచ్ఛేదంబుఁ జెందకుండుటవలన వ్యాపకత్వ, నిత్యత్వ, సర్వాత్మకత్వంబులు ఆయాత్మకు ప్రతిపాదించుచున్నందున మోక్షాపేక్షగల వాఁడు ఆత్మయైన తనకును ఆబ్రహ్మమునకును శబ్దమాత్రమే భేదంబుకాని వస్తుస్వరూపభేదంబు కొంచెమైనను ఎప్పటికైనను కలుగదని దృఢచిత్తుఁడై యుండవలయును. మఱియు ఉప్పు నీటియందుఁగలసి నీరైనటుల మనస్సు బ్రహ్మమందుఁ గలసినంతట బ్రహ్మమయంబగును. ఆమనస్సు బ్రహ్మమయముకాఁగానే మనోమయమైన ప్రపంచమంతయును బ్రహ్మస్వరూపమేయగును. కాఁబట్టి సకలమును బ్రహ్మమని ధ్యానించిన కైవల్యప్రాప్తియగునని భావము.

అవతారిక:—వారివారితలంపులే వారివారిపుట్టువులకు కారణము లని ఆచార్యులు చెప్పుచున్నారు.

శా. మిథ్యాధ్యాన మొసంగు పెట్టులగు నాకమ్మైలె ననిర్వాణసా
న్నిధ్యం బన్న నెసంద్రెవంద్ర తలపుకోత్నే ఔఁ దదుత్పత్తికి
దథ్యంబౌఁ దనుధారు లౌట తనువాకోత్మప్రజ్ఞ భావింపఁ ద
త్పథ్యాటంక మొనర్పఁ గ్రాలుదురు ప్రత్యక్చింతఁదాదాత్మ్యులై. ౮౭

టీ. మిథ్యాధ్యానము-మిథ్యా=అబద్ధమయ్యెడి, ధ్యానము=చింతనము, ఆ మేలైన నిర్వాణసాన్నిధ్యంబుల్-ఆ=అట్టి, మేలైన=శ్రేష్ఠమగు, నిర్వాణ=మోక్షముయొక్క, సాన్నిధ్యంబుల్=సన్నిధానమును, ఒసంగుట=కలుగఁజేయుట, ఎటులగుల్=ఏప్రకారమగును, అనల్=అనఁగా, ఎసంద్రైవంద్రతిలంపులు=ఎవ్వరెవ్వరి చింతనములు, (అనఁగా వారివారిసంకల్పములు) తదుత్పత్తికిన్=వారివారిపుట్టుకలకు, నేటౌన్=ఒప్పిదములగును, తనువు=శరీరమందు, ఆత్మప్రజ్ఞన్=ఆత్మబుద్ధిగా, భావింపన్=ధ్యానింపఁగా, తనుధారులౌట=దేహధారణముకలవారుగా నగుట, తథ్యంబౌన్=యథార్థమగును, ప్రత్యక్చింతన్=నిర్విషయవస్తుధ్యానముచేత, తత్పథ్యాటంకమొనర్చన్-తత్=ఆ వెంబడించిన జన్మపరంపరలయొక్క, పథ్యా=మార్గమును, ఆటంకమొనర్చన్=అడ్డగించిన, తాదాత్మ్యులై=బ్రహ్మస్వరూపులై, క్రాలుదురు=ప్రకాశింతురు.

తా. అసత్యమగునట్టిధ్యానము మేలయినవస్తువుయొక్క సన్నిధానమును ఏప్రకారము కలుగఁజేయునని శిష్యుఁడడుగఁగా వారివారి ధ్యానములు వారివారి యుత్పత్తులకు కారణములగును. దేహమే ఆత్మగాభావించఁగా అట్టి దేహధారులే యగుదురు. నిర్విషయవస్తు ధ్యానముచేత ఆ జన్మపరంపరలను కలుగఁజేయు మార్గమును నిరాకరించినవారు బ్రహ్మస్వరూపులై ప్రకాశింతురని తాత్పర్యము. (బ్రహ్మవేద బ్రహ్మైవభవతి) అను శ్రుత్యర్థముచొప్పున బ్రహ్మమును తెలిసికొనినవాఁడు బ్రహ్మమే యగుచున్నాఁడని భావము. తాదాత్మ్యమనఁగా తత్స్వరూపము. ఈతాదాత్మ్యము త్రివిధమనుటకు ప్రమాణము. „అహంకారస్యతాదాత్మ్యం చిచ్ఛాయాదేహసాక్షిభిః, సహజంకర్మజం భ్రాంతిజన్యంచ త్రివిధంక్రమాత్” అనఁగా తాదాత్మ్యము సహజన్యమని కర్మజన్యమని భ్రాంతిజన్యమని త్రివిధము. అందు సహజన్యతాదాత్మ్య మనఁగా అహంకారమందు చిత్తు ప్రతిబింబించి ఆప్రతిబింబముతో నహంకారముగూడి కాల్చఁబడిన యినుపముద్దవలె నేకమై చిత్తువలెఁ గనఁబడిన చిత్ప్రతిబింబమునఁగూడిన యహంకారమునకు ఆ ప్రతిబింబముతోడి తాదాత్మ్యము. కర్మజన్య తాదాత్మ్యమనగా ఆ చిత్ప్రతిబింబముతోఁగూడి చిత్తువలెఁదోఁచిన యహంకారము. స్థూలదేహముతోఁ జేరినప్పుడు దానికి స్థూలదేహముతోడి తాదాత్మ్యము. భ్రాంతిజన్య తాదాత్మ్యమనఁగా నేను ద్విజుఁడను, క్షత్రియుఁడను, వైశ్యుఁడను, శూద్రుఁడను, బ్రహ్మచారిని, సన్న్యాసిని లోనుగాఁగల చిత్తవృత్తులతోఁ జేరియుండెడి అహంశబ్దార్థమైన సాక్షితోఁగల్గెడి తాదాత్మ్యము. మఱియు చిత్ప్రతిబింబమును నహంకారమును ఒక్కచోటనే పుట్టినవిగాన సహజన్యమనఁబడును. జాగ్రదవస్థయందు భోగ్యమైన కర్మముపుట్టినపుడు పుట్టి ఆకర్మము నశించఁజేసి తానును నశించును గాన కర్మజన్యమనఁబడును. అనఁగా కర్మముగలిగిన తాదాత్మ్యము గలుగుననియు కర్మము లేకుండిన తాదాత్మ్యములేదనియు భావము. ఇందుకు

దృష్టాంతము జాగ్రత్స్వప్నములు. సర్వాధిష్ఠానమైన ఆత్మస్వరూపము తానని యెఱుంగకుండుటవలనఁ గలిగినది గాన భ్రాంతిజన్యమనఁబడును. ఈ తాదాత్మ్యత్రయమునకు నివృత్తి యెట్లు గలుగుననఁగా పైఁజెప్పినవానిని విచారణచేసి అహంకారమును నశింపఁజేసికొని స్వానుభవసిద్ధమైన సుషుప్తివలె కర్మప్రదమైన కర్మమువలన జనించిన కర్మమునకు నాశనము నిశ్చయమని యెఱిఁగి (అహం బ్రహ్మాస్మి) అను విజ్ఞానముఁ బొందుటవలన నని వేదాంతనిరూపణము. ‘‘శ్లో. అహమాదిశ్చమధ్యంచ భూతానామంతఏవ చ’’ అనఁగా సమస్తప్రాణులయందును ఆ పరబ్రహ్మమేయున్నదని భావము. ‘‘చైతన్యంయదధిష్ఠానం లింగదేహంచ యః పునః, చిచ్ఛాయాలింగదేహస్థా తత్సంఘో జీవఉచ్యతే. చిదానందమయీబ్రహ్మ ప్రతిబింబ సమన్వితా, తమోరజస్సత్త్వగుణా ప్రకృతిర్ద్వివిధాచసా. శుద్ధసత్త్వవిశుద్ధాభ్యాం మాయావిద్యాచతేమతే, మాయాబింబం వశీకృత్య తాంస్యాత్సర్వజ్ఞ ఈశ్వరః’’ అని విద్యారణ్యస్వాములవారు చెప్పిన శ్లోకార్థముల చొప్పున ఆ జీవేశ్వరులు మాయాకల్పితులని నిశ్చయించి ఆ జీవేశ్వరులకు అధిష్ఠానభూతుఁడై నిర్వికారుఁడును సర్వసాక్షియునైన ప్రత్యగాత్మ తానని యెఱుంగవలయునని భావము. ‘‘శ్రు. సఏవ మాయాపరిమోహితాత్మా శరీరమాస్థాయ కరోతి సర్వమ్, స్త్ర్యన్నపానాదివిచిత్రభోగైః సఏవజాగ్రత్పరితృప్తిమేతి. స్వప్నేపిజీవస్సుఖదుఃఖభోక్తా స్వమాయయాకల్పితవిశ్వలోకే, సుషుప్తికాలే సకలేవిలీనే తమోభిభూత స్సుఖరూపమేతి. పునశ్చజన్మాంతరకర్మయోగాత్ సఏవజీవస్స్వపితిప్రబుద్ధః, పురత్రయే క్రీడతియశ్చజీవః తతస్తుజాతం సకలంవిచిత్రమ్’’అను ప్రమాణము చొప్పున జీవునకు సంసారమందు అభిమానము గలిగియుండుటచేత పూర్వజన్మకర్మమునకుఁదగిన జన్మము మరల సంప్రాప్తమగుచున్నదని ముఖ్యతాత్పర్యము. ‘‘ఏవంద్రైవంద్రతలపుల్ కేక్షౌఁదదుత్పకీజ’’ అనుటచే వారివారితలంపులే వారివారిజన్మములకుఁ గారణములగునని యర్థము. ఈవిషయము పురాణప్రసిద్ధము. ఇందులకు దృష్టాంతము. పూర్వకాలమందు వృషభరాజను వానికి నూర్గురు పుత్రులుండిరి. వారిలో నెనుబదియొకండ్రుగురు బ్రహ్మకర్మ ననుసరించుటచేత బ్రాహ్మణులైరనియు, తొమ్మండుగురు నవఖండాధిపతులైరనియు, మరితొమ్మండుగురు యోగసిద్ధులచేత సిద్ధపురుషులైరనియు, అందొక్కఁడు పూర్వజన్మపుణ్యముచేత భరతచక్రవర్తియయ్యెననియు, భాగవతమందు ఏకాదశస్కంధమున ‘‘విదేహార్షభ సంవాదమని’’ ప్రసిద్ధము. ఆ భరతచక్రవర్తి కొంతకాలము రాజ్యపరిపాలనముఁజేసి అటుపిమ్మట వైరాగ్యోపశాంతి వివేకవృత్తులుకలిగి అరణ్యావాసముచేయుచుఁ దపము సల్పుతటి యొకనాఁడు స్నానార్థము నదికిఁబోయి యా నదీతీరంబున నిలిచియుండఁగ నచ్చేరువనుండు పర్వతాగ్రమం దొకజింక గర్భవేదనఁబడుచు నక్కడకుఁ గొంతదూరమున నొకసింహ గర్జనమునువిని దిగులుచెంది తటాలున నెగిరి

యానదీతీరమునఁబడి గర్భము భిన్నమై పిల్ల తల్లడించుచు బయటరాఁగానే తల్లి విలవిలఁ దన్నుకొని ప్రాణములు విడుచుటనుఁజూచి యా భరతచక్రవర్తి వ్యాకులపడి జింక పిల్ల నెత్తికొని తన యాశ్రమముచేరి దానిని మిక్కిలి గారాబముతోఁ బెంచుచుండెను. ఇట్లుండఁ గొంతకాలమునకు దానికి యుక్తవయస్సురాఁగానే దానిజాతి జింకలనుజూచి వానితోఁగూడి పరుగెత్తిపోయెను. పిమ్మట ఆ హరిణము గనఁబడకపోయినందున దాని యందుఁగల ప్రేమచేత దానినే స్మరణముఁజేయుచు ఆతలంపుతోనే యా భరతుఁడు మరణముఁజెంది జింకయైపుట్టి ఆజింక జన్మముతోఁ గొంతకాలముండి ఆజన్మమును బోఁగొట్టుకొని పూర్వజన్మసుకృతముచేత నొకవిప్రునియింట జడభరతుఁడను పేరఁబుట్టి తపంబుగావింపుచుండ నొక కిరాతకపురాజు పుత్రార్థియై దుర్గనుగూర్చి ఆరాధనఁజేయఁగా నరబలికిఁగాను బంటులవలనఁ బంపినధనముచే నొకవిప్రపుత్రుఁడు విక్రయింపఁబడి తేఁబడుచుండఁగ వారిలో నా బ్రాహ్మణకుమారుఁడు ఏమఱుపాటుఁజేసి పాఱిపోయెను. అపల నాకిరాతకపురాజుయొక్క దూతలు నావిప్రకుమారునికానకపోవుటవలన వెదకివెదకి చిట్టచివరకు ఆజడభరతుని పట్టుకొనివచ్చి రాజునకు నొప్పగించిరి. అప్పుడారాజు ఆజడభరతుని బలియిచ్చెడితరుణమందు అచ్చటనుండు దుర్గాదేవి బయలువెడలి యా కిరాతకపురాజును సపరివారముగా భక్షించి జడభరతుని స్తుతించెను. తరువాత నా జడభరతుఁడు అచ్చోటువదలి యొక కాంతారమార్గమునఁ బోవుచుండఁగా నక్కడకు జనకమహారాజు వేదాంతశ్రవణార్థమై వచ్చుచుండఁగా నాతనిపరివారములో కొందఱు ఏదో యొక యుపద్రవముచేత మరణముఁజెందినందున నతనిపల్లకి నిలుపఁబడెను. అట్టిసమయమున తటస్థించిన జడభరతుఁడు ఆజనకునితో కొంతతడవు సంవాదముచేసి పిదప నాతనికి తత్త్వోపదేశముఁజేసి విదేహముక్తిని జెందెను. కాఁబట్టి వారివారితలఁపులే వారివారిజన్మములకుఁ గారణములు. "అంతకాలేచమామేవ స్మరన్ముక్త్వాకళేబరమ్, యః ప్రయాతి స మద్భావం యాతినాస్త్యత్రసంశయః" అనుభగవద్గీతావచనముచొప్పున మరణమునందు సర్వవ్యాపకుఁడగు నేనను పరబ్రహ్మవస్తువును స్మరించెడివారలకు ముక్తికలుగుట సిద్ధమని భావము.

అవతారిక:—బ్రహ్మధ్యానముఁ జేయువారికి ఆధ్యానము పరోక్షమైనను పిమ్మట అపరోక్షజ్ఞానము లభించుటకు సంశయములేదని యాచార్యులు తెలియఁబఱచుచున్నారు.

ఉ. ధ్యానము సల్పువారు పరతత్త్వముఁ దన్మయు లౌదు రిట్లన
న్యాసి విచారశేముషులఁ గొ బొల్పొనరింపఁగ నేల దెల్పు మో
మానుష వేష యంచనకు గొ భావన సేయఁ బరోక్షమాఁ దుదిఁ
దా నపరోక్షమా నిదియొ గొ తన్మయమై వెలుఁ గొందు నాత్మజా. ౮౮

టీక. ఆత్మజా=కుమారా! పరతత్త్వముఁ=పరబ్రహ్మస్వరూపమును, ధ్యానము సల్పువారు = మననముసేయువారు, తన్మయులు=ఆ బ్రహ్మస్వరూపులే, ఔదురు=అగుదురు, ఇట్లు=ఈప్రకారము, అనఁ=అనఁగా, పూని=అవలంబించి, విచారకేము షులఁ=విచారజ్ఞానములను, పొల్పారినంపఁగనేల=వృద్ధిపొందింపనేల, ఓమానుషవేష=మనుష్యరూపమును ధరించియుండు నాచార్యుఁడా, తెల్పుము=తెలియఁజెప్పుము, అంచుఁ=అనుచు, అనకుము=చెప్పకుము, భావనసేయఁ = బ్రహ్మధ్యానముసేయఁగా, పరోక్షమౌఁ=పరోక్షజ్ఞానమగును, తాఁ=అపరోక్షజ్ఞానము, కుదిఁ=పిమ్మట,అపరోక్షమౌఁ=అపరోక్షజ్ఞానమగును, ఇదియే=ఈయపరోక్షజ్ఞానమే, తన్మయమై=ఆబ్రహ్మస్వరూపమై, వెలుఁగొందుఁ=ప్రకాశించును.

తా. కుమారా! బ్రహ్మస్వరూపమును ధ్యానించువారు బ్రహ్మస్వరూపులే యగుదురనిచెప్పఁగా ఆప్రకారముచేయక విచారమనియు, విచారమువల్ల జ్ఞానము కలుగుననియు, వీనిని వృద్ధిఁజేయనేల? మానుషశరీరమును ధరించిన ఆచార్యుఁడా! యీమర్మమును తెలియఁజెప్పుమని యడుగకుము. తొలుత నీ బ్రహ్మధ్యానము చేయచేయ అది పరోక్షజ్ఞానమై పిమ్మట బ్రహ్మైకావాహమను అపరోక్షజ్ఞానమై ప్రకాశించునని తాత్పర్యము. ‘‘శ్రు. నాన్యదతోస్తిద్రష్ట్రు, నాన్యదతోస్తిశ్రోతృ, నాన్యదతోస్తిమంతృ, నాన్యదతోస్తి విజ్ఞాతృ. ఇంద్రియేభ్యః పరాహ్యర్థా అర్థేభ్యశ్చపరంమనః, మనసస్తుపరాబుద్ధిః బుద్ధేరాత్మామహాన్పరః, మహతఃపరమవ్యక్తం అవ్యక్తాత్పురుషఃపరః, పురుషాన్నపరంకించిత్ సాకాష్ఠాసాపరాగతిః’’ ఇత్యాది శ్రుత్యర్థములచొప్పున బ్రహ్మమునకంటె నన్యంబుగాఁ జూచునదియు, వినునదియు, యోజించునదియు, నెఱుంగునదియు, లేదనియు, ఆ పరబ్రహ్మస్వరూపునికంటె పరంబగువస్తువు కొంచెమైనను లేదనియు భావమగుచున్నది. మరియు శ్రీయజ్ఞవరాహ భగవద్గీతయందు, ‘‘శ్లో. స్వాత్మనోన్యతయా భాతం చరాచరమిదంజగత్, స్వాత్మమాత్రతయా బుధ్వా తదస్మీతి విభావయః’’ అనఁగా ఆత్మయగు నీకంటెవేఱుగాని జంగమస్థావరస్వరూపంబగు నీప్రపంచమంతయు ఆత్మయగు నీస్వరూపమాత్రమని తెలిసి ఆజగమంతయు నీవేయైతివని భావింపుమని తా. ‘‘యస్సర్వేషు భూతేషుతిష్ఠఁ యస్యసర్వాణి భూతానిశరీరం యస్సర్వాణి భూతాన్యంతరోయమితి’’అను శ్రుతులచేత సర్వరూపములయందును ఈశ్వరుఁడొకఁడున్నాఁడని నిర్ణయించుకొని ఆ యంతర్యామికి సర్వము శరీరమేయని యెఱిఁగి పృథివ్యాదులకు ఉపాదానకారణమగు ఆ యంతర్యామి అప్పుడప్పుడు ఘటపటాదులవలె వికారమును బొందుచున్నాఁడని భావించుకొని, ‘‘జానామిధర్మం నచమేప్రవృత్తిః జానామ్యధర్మం నచమేనివృత్తిః, కేనాపిదేవేన హృదిస్థితేన యథా నియుక్తోస్మి తథాకరోమి’’ యను శ్లోకార్థముచొప్పున నేను ధర్మాధర్మంబుల గుర్తెఱిఁగినవాఁడనైనను ప్రవృత్తినివృత్త

ఱు నాకులేవనియు నాహ్యాదఅస్థితుం డగునట్టి యొకానొకదేవుఁడు నా కాజ్ఞాపించు నటులనే చేసెదననియు భావించుకొనుటవలన సర్వము ఈశ్వరాధీన మగుచున్నది ఆ యీశ్వరబోధవలన ఆత్మ అసంగుఁడనెడి అపరోక్షజ్ఞానముకలిగి దానివలన ముక్తికలుగు నని సిద్ధాంతము.

అవతారిక:—వృత్తిజ్ఞానము అజ్ఞానమును ఎవ్విధముగా నశింపఁజేయునని శిష్యుఁ డడుగఁగా దానిని దృష్టాంతపూర్వకముగఁ దెలియఁజేయుచున్నారు.

మ. పరిపూర్ణం బగుచిత్స్వరూపమున సంబంధించి వృత్త్యాత్మ వి
 స్తరమై పర్వన నద్వితీయసుఖలబ్ధస్ఫూర్తి యె ట్లౌనన
 స్థిరభాండోదకపంకిలం బణఁచి తా జీర్ణం బగు న్జిల్లగిం
 జరజం బట్లు జడంబుఁ బాపిమఱి నాశంబందుఁదద్వృత్తియున్. ౮౯

టీక. వృత్త్యాత్మ=వృత్తిజ్ఞానము, పరిపూర్ణంబగు చిత్స్వరూపమునన్ - పరిపూర్ణంబగు=అఖండాకారమయిన, చిత్స్వరూపమునన్ = పరబ్రహ్మస్వరూపజ్ఞానమందు, సంబంధించి=కలసి, విస్తరమై=విశేషమై, పర్వనన్=వ్యాపించినను, అద్వితీయసుఖలబ్ధస్ఫూర్తి=స్వేతరవస్తురహితమగు మోక్షప్రాప్తియొక్క వికసనము, ఎట్లు=ఏప్రకారము, ఔననన్=కలుగుననఁగా, స్థిర...లంబున్-స్థిరన్=భూమియందు, భాండోదకపంకిలంబున్=కుండనీటియందలి అడుసును, అణఁచి=క్రిందికి అణఁగఁద్రొక్కి, చిల్లగింజరజంబు=కతకరేణువు, తాన్=తాను, జీర్ణంబగున్=నశించును, అట్లు=ఆప్రకారము,తద్వృత్తియున్=అవృత్తిజ్ఞానమును, జడంబున్=అజ్ఞానమును, పాపి=పోఁగొట్టి, మఱియున్= పెండియు, నాశంబందున్=తానుచెడును. (వృత్త్యాత్మ యను పదమునకు) వృత్తిజ్ఞానమనుటయందు, ౹౹ని. ఆత్మాయత్నోధృతిర్బుద్ధిః౹౹ అను ప్రమాణమునుఁబట్టి ఆత్మశబ్దమునకు నిచ్చట జ్ఞానమని యర్థము.

తా. వృత్తిజ్ఞానము అఖండాకారమై పరబ్రహ్మస్వరూపజ్ఞానమందు విశేషముగ వ్యాపించినను తనకంటె అన్యములేని మోక్షప్రాప్తి యెవ్విధముగఁ గలుగుననఁగా, ౹౹శ్లో. అజ్ఞానకలుషంజీవం జ్ఞానాభ్యాసాద్వినిర్మలం, కృత్వాజ్ఞానంస్వయంనశ్యేత్ జలం కతకరేణువత్ ౹౹ అనునట్లు ఘటజలమందలి బురదను చిల్లగింజగంధము క్రిందికి అణఁగఁ ద్రొక్కి నిర్మలోదకమును పైకియిచ్చి తానును అడుసుతోఁగూడ చెడినరీతిఁగను ఆ వృత్తిజ్ఞానము స్వరూపజ్ఞానమునుకలుఁగఁజేసి అజ్ఞానమును నశింపఁజేసి తానును దానితోఁ గూడ నాశమౌనని తాత్పర్యము.

అనఁగా శరీరము పెండలుకొని సచరాచరరూపముగ నగపడెడి బ్రహ్మాండమంతయు పంచభూతములనియు వానిలో పృథివ్యప్తేజో వాయువులు ఆకాశమేయనియు నిశ్చ

యము నకుఁ దెచ్చుకొని చూచి ఆ చూచినది చక్షువుగా నిలిచి బైలువలెనుండి చక్షువుల గుండా పంచీకృత అపంచీకృతములయిన భూతాదులవల్ల చతుర్దశకరణముల కధిదేవతలును ఆయధిదేవతలనుండి మనోవృత్తులును ఇవిఅన్నియుఁగూడి వృత్తిజ్ఞానమై ఆవృత్తి జ్ఞానమే అఖండాకార బ్రహ్మస్వరూపమందు శుద్ధసత్త్వమై పరిణమించునని అనుభవమునకుఁ దెచ్చుకొనఁగా బాహ్యప్రపంచమంతయు బయలౌను. అట్లుబయలౌట దేహభావానుభవము. ఆబయలులో అధిదేవతాస్వరూపమయిన చతుర్దశకరణము లనెడివృత్తులన్నియు అఖండాకారవృత్తియౌను. ఇదియే మనోభావానుభవము. ఆవృత్తియులేక ఏకమాత్రమైయుండుట ఆత్మభావానుభవము. ఈభావత్రయ నివృత్తిరూపమును దెలిసికొనినవానికి ,,ఏకమేవాద్వితీయం బ్రహ్మ బ్రహ్మైవాహ మిదంజగచ్చసకలమ్" అనెడి వాక్యములగుట్టు గురితప్పక పట్టుపడునని భావము. మఱియును మనస్సంకల్పమాత్రముచేతనే యీజగంబంతయును దానివిలాసమును చూడఁబడుచున్నందున సంకల్పమాత్రము ఘనమనస్సును (రజకుఁడు మురికిగుడ్డలను మురికిగానుండు చవిటిమట్టితో నుడికించి వానిమురికిఁ బోఁగొట్టి తుల్యమగునటులఁ జేసినరీతిని) మనస్సుచేతనే వదలి అమనస్కయోగము నవలంబించినవానికి నామరూపాదులు కనఁబడక తత్కారణంబగు బ్రహ్మానుభవము కలుగుచున్నది. అట్టివానికి సాధారణమైనచీఁకటిలోఁ ద్రాడునుచూచి పామని భ్రాంతిఁజెంది దీపమును వెలిగించి పరిశోధించగా పాముగాక త్రాడేయని నిశ్చయముగాఁ దెలిసినపిదప సర్పమనెడుభ్రాంతి తొలఁగువిధమున భ్రాంతియనెడు అజ్ఞానాంధకారంబువలన జనించినయే కర్తృకరణక్రియాకారకములుగలవో వానివలన నుత్పన్నమైన క్రియారూపకర్మముచేత వేదాంతప్రమాణమువలనఁ గల్గిన బ్రహ్మజ్ఞానమనెడి దీపముచేత అఖండపరిపూర్ణసచ్చిదానంద పరబ్రహ్మసందర్శనము దొరకకపోని కల్పితమగు మనస్సుతోఁచక లయించిన పరబ్రహ్మమే కనఁబడును. ఇదియునుఁగాక చెట్టునందుఁ బుట్టిన అగ్నిచెట్టును తెగఁగాల్చి తానును చల్లారినట్లు స్వరూపజ్ఞానమే వృత్తిజ్ఞానమై అజ్ఞానరూపంబగు ప్రపంచమునుఁగాల్చి స్వరూపజ్ఞానమందుఁ గలియును.

అవతారిక:—బ్రహ్మవేత్తలు నిర్వికల్పసమాధియందు సుఖానుభవులై యెట్లుందురని శిష్యుఁడడుగఁగా ఆచార్యులు సమాధానముచెప్పుచున్నారు.

మ. ఇల నీనిల్కడచే సుఖానుభవులై యెట్లుందు రాచార్య ము
క్తులన న్మాత్రవచింత లేనియభిషిక్తు న్బాలుర న్బోలి ని
ర్మలులై యుందురు పాయుబంధ మగునిర్వాణం బన న్నవ్వరే
కలయ న్దోమ మొసంగి క్రక్కనిదె యాకాశంబన న్మాత్రకా. ౯౦

టీ. ఆచార్య=గురుమూర్తి, ఇలన్=భూమియందు, ముక్తులు=బ్రహ్మవేత్తలు, ఈనిల్కడచేన్=పైని చెప్పిన నిర్వికల్పనిష్ఠచేత, సుఖానుభవులై = నిరతిశయానందాను

ట్టుచున్నారనుకథను ఎవరు విని సత్యముగా నెంచుదురని తాత్పర్యము. అనఁగా కల్పితములగుట్టును పట్టువదలక తెలిసికొనినవాఁడు దానియందు భ్రమపడక నిశ్చలచిత్తుఁడై యుండునని భావము.

అవతారిక:—కార్యోపాధి యగు అవిద్యవలననైన భ్రమనుతొలఁగించి పైనఁజెప్పినకారణోపాధియైన మాయవలనఁగలిగిన ప్రయోజనములన్నియు మిథ్యయని త్రోసి నీవుస్వానుభూతిలోనుండి ప్రకాశింపుమని ఆచార్యులు చెప్పుచున్నారు.

ఉ. మాయ యసత్యమైన మఱి మాయ జనించిన వెల్ల మిథ్యలాఁ
గాయముఁ బ్రాయము న్గులము గల్గున తల్లివినా సుతాళికి
న్శ్రేయము స్వర్గదుర్గతులఁ జింత లొనర్పక మేలు గీళ్లెడ
న్జేయక యుందు మేమఱక చిత్సుఖసంపదఁ జెంది నిత్యమున్. ౯౩

టీ మాయ=మాయాశక్తి, అసత్యమైనన్=అబద్ధమగుటచేత, మఱిన్ = వెండియు, మాయన్=(మిథ్యాభూతమైన) ఆమాయవలన, జనించినవెల్లన్=పుట్టినవన్నియు, మిథ్యలౌన్=అబద్ధములగును, సుతాళికిన్=బిడ్డలకు, తల్లివినా=తల్లిలేకుండిన, కాయమున్=శరీరమును, ప్రాయమున్=వయస్సును, కులమున్=వంశమును, కల్గునే=కల్గునా, (అనఁగా కలుగవనుట.) శ్రేయమున్=మోక్షమును, స్వర్గదుర్గతులన్-స్వర్గ=దేవలోకమును, దుర్గతులన్=నరకవాసమును, చింతలొనర్పక=ఆలోచింపక, చిత్సుఖసంపదన్=బ్రహ్మానందసుఖమును, చెంది=పొంది. నిత్యమున్ = ఎల్లప్పుడు, ఎదన్=మనస్సునందు, మేలుఁగీళ్లు=మంచిచెడుగులను, చేయకయుందుము=ఒనర్పకయుందుము.

తా. బిడ్డలకు తల్లిలేనియెడల శరీరమున్ను, వయస్సున్ను, కులమున్ను లేనిరీతిని మాయాశక్తి అబద్ధమయ్యేనేని మిథ్యాభూతములైన ఆమాయవలనఁబుట్టినవన్నియు అబద్ధములేయగును. మోక్షమును, దేవలోకసుఖమును, నరకవాసమును ఆలోచింపక ఎల్లప్పుడును బ్రహ్మానందమునుజెంది మనస్సునందు మేలుఁగీళ్లను ఒనర్పకయుండుమని తా.

«యామాసామాయా» ఏదిలేనిదో అదిమాయ అనఁగా ఇంద్రజాలముమొదలైన విద్యలయందు నిర్ధారణచేయుటకు సాధ్యముగానిదై ఏది స్పష్టముగాఁ దోఁచుచున్నదో అదియే మాయయని భావము. ఇందుచేత శరీరేంద్రియాది జగంబంతయు మాయయని స్పష్టమగుచున్నది.

అవతారిక:—సర్వము మాయాకార్యమైనయెడల బ్రహ్మము మొదలయినవన్నియు మిథ్యలగునే అప్రకారము చెప్పినటులయిన తప్పిదము లేదాయని శిష్యుఁడు ప్రశ్నచేయుచున్నాఁడు.

మ. పరమేష్ఠిప్రముఖాఖిలామరుల సద్భాగీరథీముఖ్యపు
ష్కరిణీతీర్థములన్ శ్రుతిస్మృతుల నోంకారాదిమంత్రంబులన్

వరవర్ణాశ్రమదేశకాలదిశలన్ వ్యాసాదిపుణ్యర్షులన్
ధర నీసర్వమసత్యమన్న నపరాధం బొందదే యెమ్మెయిన్. ౯౩

టీ. పరమేష్ఠి ప్రముఖాఖిలామరులన్-పరమేష్ఠి=బ్రహ్మయే, ప్రముఖ=మొదలుగాఁగల, అఖిల=సమస్తమైన, అమరులన్=దేవతలను, సద్భాగీ...ర్థములన్ - సత్=శ్రేష్ఠములైన, భాగీరథీ=గంగానదియే, ముఖ్య=మొదలుగాఁగల, పుష్కరిణీ=చంద్రపుష్కరిణి, పంపాసరోవరము యివి మొదలైనవానియందలి, తీర్థములన్ = జలములను, శ్రుతిస్మృతులన్-శ్రుతి=ఋగాదివేదములను, స్మృతులన్=మానవాది ధర్మశాస్త్రములను, ఓంకారాది మంత్రంబులన్=ప్రణవాది సప్తకోటి మహామంత్రములను, వర...దిశలన్-వర=శ్రేష్ఠములైన, వర్ణ=బ్రాహ్మణాదివర్ణములను, ఆశ్రమ = బ్రహ్మచర్యాది ఆశ్రమములను, దేశ=కాశి, కాంచ్యాది పుణ్యదేశములను, కాల=గ్రహణసంక్రాంత్యాది పుణ్యకాలములను, దిశలన్ = తూర్పు మొదలగు దశదిశలను, వ్యాసాదిపుణ్యర్షులన్-వ్యాస=వ్యాసుఁడు, ఆది=మొదలుగాఁగల, పుణ్యర్షులన్=పుణ్యాత్ములైన పెద్దలను, ఈసర్వమున్=ఈ చెప్పఁబడినవన్నియు, అసత్యమన్నన్=అబద్ధమనినను, ఎమ్మెయిన్=ఏలాగైనను, అపరాధంబు=తప్పిదము, పొందదే=పొందదా.

తా. బ్రహ్మ మొదలగు సకలదేవతలను, శ్రేష్ఠములైన గంగాది పుణ్యనదులను, పుణ్య పుష్కరతీర్థములను, పుణ్యక్షేత్రములను, వేదములను, శాస్త్రములను, ప్రణవాది మంత్రములను, బ్రాహ్మణాది వర్ణములను, బ్రహ్మచర్యాది ఆశ్రమములను, గ్రహణ సంక్రాంత్యాది పుణ్యకాలములను, దశదిశలను, వ్యాసాది మహర్షులను, ఈ సర్వమును అసత్యమనినను తప్పిదముగాదా యని తాత్పర్యము.

అవతారిక:—పైనఁజెప్పిన ప్రశ్నకు ఉత్తరము.

మ. కలలోఁ దోఁచిన వెల్ల మిథ్యలన నాగంబైన నాలీల దు
ర్బలమాయాజగ మెల్లమిథ్యయని సంభావింపఁ దప్పౌఁజుమీ
కలలోఁ దోఁచినవెల్ల మిథ్యలని నిష్కర్షించితే నీవు దు
ర్బలమాయాకలిత ప్రపంచ మటులన్ భావింపఁ దప్పేలయాన్. ౯౪

టీ. కలలోఁదోఁచినవెల్లన్-కలలోన్=స్వప్నమందు, తోఁచినవెల్లన్=కనఁబడినవన్నియు, మిథ్యలనన్ = (జాగ్రదవస్థయందు వచ్చినప్పుడు) అబద్ధము లనినచో, ‹‹ఆగోపరాధోమంతుశ్చ›› ఆగంబైనన్=అపరాధమయ్యేనేని, ఆలీలన్ = ఆప్రకారముగా, దుర్బలమాయాజగమెల్లన్-దుర్బల=బలహీనమైన, మాయాజగమెల్లన్=మాయయందుఁదోఁచిన లోకమంతయు, మిథ్యయని=అసత్యమని, సంభావింపన్=ఊహించినను, తప్పౌఁజుమీ=అపరాధమగునుసుమా, ఈవు = నీవు, కలలోన్ = స్వప్నావస్థయందు,

తోఁచినవెల్లన్ = కనఁబడినవన్నియు, మిథ్యలని = అసత్యములని, నిష్కర్షించితేన్ = నిర్ధారణచేసినవాఁడవైతివేని, అట్లులన్ = ఆ ప్రకారము, దుర్బలమాయాకలితప్రపంచమున్ - దుర్బల = బలహీనమైన, మాయా = మాయయందు, కలిత = కూడిన, ప్రపంచమున్ = వ్యోమాది సమస్తలోకమును, భావింపన్ = యోజింపఁగాను, తప్పేలయౌన్ = అపరాధమేలయగును.

తా. స్వప్నమందుఁ దోఁచినవన్నియు అబద్ధములనిన అపరాధము కలిగినయెడల దుర్బలమైన మాయలోఁ గలిగిన జగత్తు అబద్ధమని చెప్పుటవలన యేమితప్పిదము. నీవు స్వప్నావస్థయందు కనఁబడినవన్నియు అసత్యములని నిష్కర్షించితివేని మాయలో కల్గిన వన్నియు అసత్యమని చెప్పుటకు సందేహమేలయని తాత్పర్యము.

అనఁగా స్వప్నమందుఁ గనఁబడిన సకలమువలె జాగ్రత్తునందుఁదోఁచిన బలహీనమైన మాయాకార్యములగు జీవేశ్వర జగములను వానిమహిమలను అసత్యమనినను దప్పిదములేదని ముఖ్యాభిప్రాయము.

"శ్లో. సంసారః స్వప్నతుల్యోహి రాగద్వేషాది సంకులః, స్వకాలే సత్యవద్భాతి ప్రబోధేఽసత్యవద్భవేత్." సంసారరూపమైన యీలోకము స్వప్నమునకు సమము. అది అప్పుడు సత్యముగఁదోఁచుచున్నది. వెనుక నీ జాగ్రద్రూపమైన సంసారము స్వప్నములోలేదు. కాఁబట్టి యీరెండును సుషుప్తిలో లేకపోవుచున్నవి. ఈయర్థమును ఆచార్యులు ఆత్మబోధప్రకాశికయందు విశదముగఁ జెప్పియున్నారు.

అవతారిక:— సదసత్తులయొక్క నిజము తెలియుమని చెప్పుచున్నారు.

ఉ. మిథ్యను సత్పదార్థమని మెప్పుగనాడెడి మూఢులన్మహా
రాధ్యులుపుణ్యులంచొగిఁబురాణముపే మొఱవెట్టిన న్సుతా
తథ్యముఁదథ్యమంచనెడు తత్త్వవిధిజ్ఞుల దూఱునే శ్రుతు
ల్మిథ్య జగంబెయౌ నిజము మేదినిఁ బ్రత్యగభిన్నవస్తువౌ. ౯౫

టీక. సుతా = కుమారా, మేదినిన్ = భూమియందు, పురాణముల్ = పురాణాది పురాతనచరిత్రములు, మిథ్యను = అసత్తును, సత్పదార్థమని = నిత్యవస్తువని, మెప్పుగన్ = ప్రతిష్ఠగాను, ఒగిన్ = వరుసగా, ఆడెడి = చెప్పెడి, మూఢులన్ = పామరజనులను, మహారాధ్యులంచున్ - మహారాధ్యులు = గొప్పవారైన పూజనీయులని, పుణ్యులు = సత్కర్మానుష్ఠానపరులని, అంచున్ = అనుచు, పే = పెద్దగా, మొఱవెట్టినన్ = కూఁతపెట్టినను, శ్రుతులు = వేదములు, తథ్యమున్ = నిత్యవస్తువును, తథ్యమంచున్ = సత్యమని, అనెడు = సంభాషించెడు, తత్త్వవిధిజ్ఞులన్ = బ్రహ్మవేత్తలను, దూఱునే = నిందించునా, మిథ్య = అబద్ధము, జగంబే = (నామరూపములతోఁగూడిన) ప్రపంచమే, ఔన్ = అగును, నిజము = యథార్థ

ము, ప్రత్యగభిన్నవస్తువు- ప్రత్యక్=దేహేంద్రియవిలక్షణమైన కూటస్థునికంటె, అభిన్న=వేఱుగాని, వస్తువు=పరబ్రహ్మము, స్యాత్=అగును.

తా. భూమియందు పురాతినచరిత్రములు అసత్తును సత్తనిచెప్పెడి పామరజనులను గొప్పగా పూజనీయులని పెంపఁజేసినను వేదము నిత్యవస్తువును సత్యమని భాషించెడు బ్రహ్మవేత్తలను పాపులనిదూఱునా నామరూపప్రపంచమే అబద్ధమగును. యథార్థము కూటస్థునికంటె వేఱుగాని పరబ్రహ్మమే అగునని తాత్పర్యము.

విశే.—అనఁగా సమష్టివ్యష్టి శరీరత్రయావస్థాత్రయ పంచకోశవిలక్షణుఁడు ఆత్మ తద్వ్యతిరిక్తమైన శరీరత్రయావస్థాత్రయ పంచకోశములులేని వాఁడాత్మ శరీరత్రయమన స్థూలసూక్ష్మకారణదేహములు. "శీర్యత ఇతిశరీరమ్" శరీరము అనఁగా అన్నములేకున్నను, రోగములుకలిగినను, ముదిమిచేతను జీర్ణించునుగాన దానికి శరీరమనుపేరు కల్గెను. "దహ్యతఇతిదేహః" ఇది దహింపఁబడుటచే దేహమనునామాంతరమునుబొందెను.

"శ్లో. అనేకావయవస్థూలశ్శుక్లశోణితసంభవః, దేహస్సూక్ష్మస్తథాకస్తదశావయవలక్షణః, కారణంచాజ్ఞానసంజ్ఞం వృతిదుఃఖాత్మకా అమీ, తేభ్యోవిలక్షణశ్చాత్మా సత్యజ్ఞానాదిలక్షణః" అనఁగా పైఁజెప్పిన త్రివిధశరీరములలో కాళ్లు, చేతులు, పొందలయిన అవయవాకారమై స్తంభమువలెఁ దోఁచునది స్థూలమనియు, పదియేడుఅవయవములతోఁ గూడికొనియుండునది సూక్ష్మశరీరమనియు, అజ్ఞానముతోఁగూడినది కారణమనియు భావము. సమష్టియనఁగా ఈశ్వరుఁడు. వ్యష్టియనఁగా జీవుఁడు. అవస్థాత్రయమనఁగా జాగ్రత్స్వప్నసుషుప్తులు. పంచకోశములనఁగా అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయకోశములు. వీనివివరణములు ప్రథమభాగంబునఁ జక్కఁగ వక్కాణింపంబడియున్నవి. మఱియును బంగారమువలన శిల్పింపఁబడిన కంకణాది అభరణములను విచారణచేయఁగా అవియన్నియు నామరూపంబు లగుటంజేసి మిథ్యయగును. కాఁబట్టి మిథ్యయగు కంకణాది నామరూపంబులనువిడిచిన యథార్థవస్తువగు బంగారము ఎటులునిలుచునో అటువలెనే ఆత్మానాత్మవిచారముచేత యథార్థవస్తువగు పరబ్రహ్మమును దెలియవలయునని ఎఱుఁగునది.

అవ:—శిష్యుఁడు ఆచార్యులతో మాయయొక్కస్వభావము ఇట్టిదియని తనకుఁ దోఁచినవిధమునుజెప్పి తనకుఁగలిగిన సందేహమును బోఁగొట్టుమని యడుగుచున్నాఁడు.

శా. మాయామేఘసమీర యెద్దియగునీ మాయాఖ్యయేకార్యము
ల్చేయ స్వచ్ఛఁబనేమి రా నెవఁడు యోజింప స్థర స్తీనికి
న్నాయంకుండగునాత్మకంటె నిది భిన్నంబన్న ద్వైతంబగుఁ
శ్రేయోహాని యభిన్నమన్న నెనగుఁ సిద్ధాంత మెద్దానఁనో.౯౬.

టీక. మాయామేఘసమీర-మాయా=మాయయనెడి, మేఘ=మబ్బునకు, సమీర=వాయువగు గురుమూర్తీ, ఇలన్=భూమియందు, ఈమాయాఖ్య=ఈమాయ యనుపేరు గలది, ఎద్దియగున్ = ఏదియగును, ఏకార్యములు = ఏపనులు, చేయన్=ఒనర్చుటకు, వచ్చెన్=అదివచ్చెను, రాన్=వచ్చుటకు, పనేమి=కారణమేమి, యోజింపన్ = ఆలోచింపఁగా, దీనికిన్=ఈమాయకు, ఎవండు=ఏపురుషుఁడు, నాయకుండు=కర్త, అగున్=అగును, ఇది=ఈమాయ, ఆత్మకంటెన్=కూటస్థబ్రహ్మముకంటె, భిన్నంబు=అన్యము, అన్నన్=అనినను, ద్వైతంబు=పదార్థద్వయము, అగున్=అగును, అభిన్నము=అన్యము కానిది, అన్నన్=అనినను, శ్రేయోహాని=మోక్షమునకు మోసము, ఎసఁగున్=కలుగును, ఎద్దానన్=ఏదానిచేత, సిద్ధాంతము=తేరుగడ, ఔన్=అగును.

తా. మాయయనెడు మేఘమునకు వాయువువంటి గురుస్వామీ! ఈమాయయను పేరుగలది యెద్ది? ఏకార్యములు చేయవచ్చెను? అదివచ్చుటకు కారణమేమి? దానికి కర్త యెవ్వరు? ఈమాయపరబ్రహ్మముకంటె అన్యముఅనిన రెండువస్తువు లగును. అపుడు అద్వైతమునకు విరుద్ధముకలుగును. అన్యముకానిది యనిన మోక్షమునకు మోసముకల్గునే, దీనికి సిద్ధాంత మెట్లుగలుగునని శిష్యుఁడడిగెనని తాత్పర్యము.

అనఁగా మాయయొక్క స్వరూపమును దానిపుట్టుకయును అది పుట్టినదానికి కారణమును ఎఱిఁగింపుఁడు. అది బ్రహ్మమునకు వేఱైనను రెండువస్తువులౌను. బ్రహ్మకు అభిన్నమనిన బ్రహ్మ మసత్యమౌను. కాఁబట్టి దానినిజమును దెలియుటకు అడుగుచున్నాఁడు అనుట.

అవతారిక:—మాయయొక్క మొందటి నాలుగుప్రశ్నలకు ప్రత్యుత్తరము చెప్పుచున్నారు.

శా. అట్టిట్టంచనఁగూడకుండుట నవాచ్యంబందు రీమాయ నే
పట్ల న్లోకము సత్య మేను దను వీభాగ్యంబు నాదన్నవాఁ
డెట్లైనన్బ్రభుఁడౌను దాని కిల నిర్వాతుత్వమిథ్యాత్వము
ల్కల్గా దీనినెఱుంగ రేరుఁగనఁ బ్రేతూహీనతన్దోఁచెడిన్. ౯౨

టీ. ఇలన్=భూమియందు, మాయను, అట్టిట్టంచనన్ = ఆప్రకారమీప్రకారమని, అనఁగూడకుండుటన్=అనుటకు వీలుగానిదగుటచేత, అవాచ్యంబందురు=అనిర్వాచ్యమని (పెద్దలు) చెప్పుదురు, దానికిన్=ఆ మిథ్యారూపమైనమాయకు, ఏపట్లన్=ఏవిధమునసైనను, లోకము=జగము, సత్యము=నిజము, ఏను=నేను, ఈతనువు = (ఈ పంచభూతవికారమైన) శరీరము, ఈభాగ్యంబు = ఈసంపద, నాది=నాయది, అన్నవాఁడు=అనినమనుజుఁడు, ఎట్లైనన్=ఎవ్విధముగానైనను, ప్రభుఁడు=నాయకుఁడు,

అవును=అగును, నిర్హేతుత్వమిథ్యాత్వములు-నిర్హేతుత్వ=కారణములేని భావమును, మిథ్యాత్వములు=అనృతభావములు, కల్గాక=బంధములగును, దీనిక=ఈమాయను, కనక=మాయుటకు, ఏరుక=ఎవ్వరును, ఎఱుంగరు=తెలియరు, ప్రేక్షాహీనతక=బ్రహ్మజ్ఞానములేమిచే, తోఁచెడిక=స్ఫురించెడిని.

తా. భూమియందు మాయను అనిర్వాచ్యమని పెద్దలుచెప్పుదురు. ఆయసత్యమయినమాయకు యేవిధముననైన జగము సత్యమనియు, ఈశరీరము నేను, ఈ సంపతనాది అనువాఁడు నాయకుఁడౌను. కారణములేనిమాయకు అనృతభావములు బంధములౌను. ఈమాయను మాయుటకు నెవ్వరునెఱిఁగినవారులేరు. బ్రహ్మజ్ఞానములేమిచే నిటులఁదోఁచుచున్నదని తాత్పర్యము.

"నేహనానాస్తికించన, నాసదాసీత్, అయుక్తం, తుచ్ఛమిదంరూపస్య" అనెడి శ్రుత్యర్థప్రమాణములచొప్పున మాయ నిషేధింపఁబడినదైనందున దానిని సత్తని చెప్పఁగూడదనియు, కాలత్రయంబునందును తుల్యముగాఁ గనఁబడుచున్నందున అసత్తనరాదనియు, అట్లు రెండునుగాని దానిని నోటఁజెప్పఁ దరముగానందున అనిర్వాచ్యమనియు, తుచ్ఛమనియు భావము.

సప్తావరణములలో కడపటిఆవరణము మాయ, ఆమాయ భ్రమరూపముగనుక దానివలన తక్కిన ఆవరణములన్నియుఁ గలిగినవి. ఎట్లనఁగా లోకమందు సుఖదుఃఖములు రెండును ప్రసిద్ధముగదా, వానిలో సుఖమనఁగా మోక్షము. దుఃఖమనఁగా మరణదుఃఖము. ఈ రెంటికిమించిన సుఖదుఃఖములులేవని అందఱకును తెలిసినవిషయమేగదా. దుఃఖము లేకుంటే సుఖమేగనుక దుఃఖము మొందటిఆవరణము. జన్మమువలన దుఃఖము సంప్రాప్తమగుచున్నదిగాన జన్మము రెండవఆవరణము. జన్మమునకు కర్మము కారణమగుటంజేసి యీకర్మము మూఁడవఆవరణము. అభిమానమువలన కర్మముకలిగినది కాఁబట్టి అభిమానము నాల్గవ ఆవరణము. ఆయభిమానము విక్షేపమైన అవిద్యవలన పుట్టినదిగాన ఆయవిద్య ఐదవ ఆవరణమయ్యెను. ఆ యవిద్యచే అజ్ఞానమువచ్చెనుగనుక ఆయజ్ఞానము ఆఱవ ఆవరణము. ఆయజ్ఞానము మాయవల్లకలిగినదియైనందున మాయ ఏడవ ఆవరణము. మొందటి ఆఱు ఆవరణములు మాయనుండియే పుట్టవచ్చినవిగనుక ఆయావరణములకు మాయయే మూలకారణము అని తెలియవలయును. మఱియు, "శ్లో. ఏతస్మాత్కిమి వేంద్రజాలమపరం యద్గర్భవాసస్థితం, రేతశ్చేతతి హస్తమస్తకపద ప్రోద్భూత నానాంకురమ్, పర్యాయేణ శిశుత్వయావనజరా వేషైరనేకైర్వృతం, పశ్యత్యత్తి శృణోతిజిఘ్రతియథా గచ్ఛత్యథాగచ్ఛతి" అనఁగా నఖశిఖమువఱకు గల సర్వావయవములయందు వ్యాపించియుండెడి రేతస్సు సంయోగఘర్షణమువలన బయలువెడలి పాదములు, హస్తములు, శిరము లోనుగాఁగల అనేకావయవములుఁగా నేర్పడి పిమ్మట బాల్యము, యౌవనము, కౌమా

రము, వార్ధక్యములను వేషములతోఁగూడి శబ్దస్పర్శరూపరసగంధములు కల్గి మఱల మఱిగిపోవుచున్నది గనుక దీనికిమించిన ఇంద్రజాలవిద్య వేఱొండులేదని భావము. దీనివలన దేహేంద్రియాదిప్రపంచము అనిర్వాచ్యమగుచున్నది. అట్టి ప్రపంచమును వటబీజన్యాయమువలన అనఁగా మిక్కిలి సూక్ష్మమైన మఱ్ఱివిత్తనమును నాటిన అది కొమ్మలు, రెమ్మలు, ఊడలు, కాఁడలు, ఆకులు, పిందెలు మొదలగువానితోఁగలసి గొప్ప వృక్షమైనచొప్పున విచారణచేత మాయయని నిశ్చయించుకొని బుద్ధిమంతుఁడగువాఁడు ఈ సప్తావరణములను జ్ఞానముచేత దాఁటి కాలవంచకుఁడై యుండవలయును. కాలవంచనయనఁగా కేవలబ్రహ్మము అవాఙ్మానసగోచరంబై, అశ్రుతార్థమై, అమనస్కమై యున్నదో ఆబ్రహ్మసాక్షాత్కారనిష్ఠచేత దేహాదిప్రపంచంబంతయు మఱచియుండుట. ఈ కాలవంచనయే మాయనుదాఁటుట. ఇది యెట్లనఁగా వడ్లనుదంచి దానిలోని పొట్టుఁ బాఱఁబోసి మిగిలినబియ్యమును దాఁచిపెట్టి దానితోఁ గలసినవడ్లను మాటను మఱచినవారిని మీవద్ద వడ్లున్నవాయని యడిగిన బియ్యమున్నవన్నట్లు «వపుస్తుషాదిభిఃకోశై ర్యుక్తంయుక్త్యవఘాతతః» అనురీతిని కోశములనుమఱచి స్వరూపముగానుండుట. దీనికే స్వాభావిక సచ్చిదానందాద్వయ బ్రహ్మసాక్షాత్కారనిష్ఠాజ్ఞానమని పరమసిద్ధాంతము. «శ్లో. స్థూలసూక్ష్మాదిదేహానా మాత్మన్యారోప ఏవచ, అపవాదస్తతోప్యేషాం సమ్యగత్ర ప్రదర్శితః» అనురీతిని కారణములేక కార్యముండగుగాన మృత్తికచేఁగలిగిన కుండచట్లు మృద్వ్యతిరిక్తముగానట్లు ఆత్మయందు కలిగిన స్థూలసూక్ష్మాది సర్వప్రపంచమును ఆత్మవ్యతిరిక్తముగాదని భావింపవలయును.

అవతారిక:—ఐదవప్రశ్నకు ఉత్తరము.

చ. విపుల మహేంద్రజాలముఖ ॥ విద్యలఁజూపకమున్న వానిత
న్నిపుణము లెట్లఱుంగ నగు ॥ నేర్పరియౌ నవిచూపమిథ్యలౌ
విపుల ననంతశక్తిగల ॥ విశ్వజనీనునివిద్య లట్టు లౌ
కపట మశక్యమౌటఁగనఁ ॥ గాంచుయెున ర్తురుశంకసజ్జనుల్. ౯౮

టీ. విపులన్=భూమియందు, విపుల...విద్యలన్-విపుల=విస్తారములయిన, మహేంద్రజాలముఖ=మహేంద్రజాలమే మొదలుగాఁగల, విద్యలన్=(టక్కు, రమార, గజకర్ణ, గోకర్ణ, అశ్వకర్ణ, అగ్నిస్తంభన, వాయుస్తంభన, హస్తలాఘవ, అదృశ్యకరణి అనెడు) విద్యలను, చూపకమున్న = చూపుటకుమునుపే, వానిన్=ఆ యింద్రజాలకుని, తన్నిపుణములు=వానిసామర్థ్యములను, ఎట్లఱుంగనగున్ = ఎవ్విధముగాఁ దెలియనగును, అవి చూపన్=ఆవిద్యలను జూపినను, నేర్పరియౌన్=సమర్థుఁడగును, మిథ్యలౌన్=ఆకార్యములు అబద్ధములగును, అట్టులు=ఆప్రకారము, అనంతశక్తిగల విశ్వజనీనునివిద్యలు, అనంతశక్తిగల=అపారసామర్థ్యముగల, విశ్వజనీనుని = లిటస్థేశ్వరునియొు...

క్క, విద్యలు=సృష్టిస్థితి సంహారతిరోధానానుగ్రహము లనువిద్యలు, అట్టులు=అతిరుచ అగును, అకపటము=అజగన్మిథ్యాత్వతంత్రము. అశక్యమాటన్ = అసాధ్యమగుటచేత, సజ్జనులు = సత్పురుషులు, శంక=అనుమానప్రమాణముచేత, కనన్=చూచుటకు, కాంక్షన్=కోరికను, ఒనర్తుర=చేయుదురు.

తా. పుడమియందు ఇంద్రజాలకుఁడు జాలవిద్యలు ఆడకముందు వాఁడు వాని విద్యలు నెవ్విధముగా తెలియనగును. వాఁడు చూపినకార్యములు అబద్ధములగును. ఆ ప్రకారమే అనంతశక్తిగల పరబ్రహ్మముయొక్క సృష్టిస్థితి సంహార తిరోధానానుగ్రహములను విద్యలను అగును. అజగన్మిథ్యాత్వతంత్రములు అసాధ్యము లగుటచేత సత్పురుషులు అనుమానప్రమాణమువలన ఆతటస్థేశ్వరుని చూచుటకు కోరికనుచేయుదురని తాత్పర్యము.

ఇట్లనుటచేత అసత్యమైన జగము అలాగుదోఁచుటయందు మాయాశక్తి యిటువంటిదని తెలిసికోఁదగినది. ఆపరమాత్మునియొక్క శక్తి అపారమనుట యందెవ్వరు నెఱుఁగరు. వేదములకును తెలియదు. విష్ణ్వాదిదేవతలు ఈవంకలిగినవారగుటవలన వారికిని దెలియదు. అయితే ఆయనకు తనమహిమలు తెలియనోయనిన ఆయన పరిచ్ఛిన్నుఁడే కాఁబట్టి యెఱుఁగడని భావము. ఎఱుఁగకపోయినను సర్వజ్ఞత్వమునకు లోపముకలుగు ననిన దానికి బాధకములేదు. అదెట్లనఁగా వంధ్యాపుత్రుని కులగోత్రవ్యవహారములు తెలియకపోయినయెడల బాధకములేనిరీతిని మాయాకార్యము తెలియకపోయినను దోషములేదని అభిప్రాయము.

అవతారిక:—పరబ్రహ్మముయొక్క శక్తి తటస్థేశ్వరునకును మిథ్యాభూతములైన జగజ్జీవులకును నడుమ అగోచరముగ నుండునని తెలుపుచున్నారు.

ఉ. శక్తి యథార్థవస్తువు నసత్యజగన్నిచయేశజీవుల
న్రక్తిగఁ జూపి కన్పడఁగు రంజిలుఁ దత్కృతమెల్లమాయయా
సక్తులచే నెఱుంగఁబడు జాలకుఁ డాతనిజాల మట్లయి
న్నక్తిపరేశమాయులకు సందుననుండు నదృశ్యమై సుతా. ౯౯

టీ. సుతా=కుమారా, శక్తి = పరబ్రహ్మసామర్థ్యమనునది, యథార్థవస్తువున్= నిజమయిన పరబ్రహ్మమును, (తానతనిచేత కల్పింపఁబడిన) అసత్యజగన్నిచయేశజీవులన్-అసత్య=అబద్ధములగు, జగన్నిచయ=లోకసమూహములను, ఈశ=సమష్టిస్వరూపుఁడై, మాయాకల్పితుఁడైన తటస్థేశ్వరుని, జీవుల్=(అవిద్యాకల్పితులైన)జీవులను, రక్తిగన్=ఆసక్తితో కనువారలకు ప్రేమ అతిశయించునటుల, చూపి=కనుపఱచి, కన్పడఁగున్=కనఁగూడనిదగును, రంజిలు తత్కృతమెల్లన్-రంజిలు=వెలుపల ప్రకాశించుచుండెడి, తత్=ఆశక్తిచేతను, కృతమెల్లన్=చేయఁబడిన కార్యములన్నియు, మాయయాన్=అబద్ధమగును, సక్తులచేన్ = చూడవలయుననెడి ఆసక్తిగలవారిచేతను, జాల

కుఁడు—ఆయింద్రజాలమును చూపించువాఁడును, ఆతనిజాలము—వాఁడాడిన జాలవిద్యయును, నెఱుంగఁబడును—తెలియఁబడును. అప్పోయిన్—అవిఘ్నముగాను, పరేశ—(జగన్నిర్మాణమునకుగాను తోఁచిన) తటస్థేశ్వరునకును, మాయలకున్—మిథ్యాభూతములైన జగజ్జీవులకును, నడుమన్—నడుమను, శక్తి—పరబ్రహ్మముయొక్క సామర్థ్యము, అదృశ్యమై—తెలియఁగూడనిదై, ఉండున్—ఉండును.

తా. కుమారా! పరబ్రహ్మముయొక్క సామర్థ్యము నిజమైన పరబ్రహ్మమును అబద్ధములగు లోకసమూహమును తటస్థేశ్వరుని అవిద్యాకల్పితులయిన జీవులను ఆపక్షులతోఁ కనువారలకుఁ జూపి అది అతనియందు మఱుఁగైయుండును. వెలుపల ప్రకాశించుచుండెడి ఆశక్తిచేతఁ జేయఁబడిన కార్యములన్నియు అబద్ధములగును. చూడవలయుననెడి తలంపులు గలవారలకు ఆయింద్రజాలమును జూపించువాఁడును, వాఁడాడిన జాలవిద్యలును తెలియఁబడును. ఆప్రకారమే పరబ్రహ్మముయొక్క సామర్థ్యము తటస్థేశ్వరునకును మిథ్యాభూతములైన జగజ్జీవులకును నడుమనుండునని తాత్పర్యము.

అనఁగా ఆపరబ్రహ్మమందుండు శక్తి సూర్యునకును ఎండమావులకును మధ్యను ప్రసరించిన కిరణములవంటిది. అదెట్లనిన సూర్యునియందుఁగల ఉష్ణప్రకాశశక్తివలన నెండమావులు కలుగుచున్నవి. విచారింపఁగా నీటివలెఁదోఁచిన యెండమావులు అబద్ధములై మధ్యను ప్రకాశించిన ఉష్ణకిరణములు అనెడిశక్తి సూర్యునియందు లీనమయిన చందమున తటస్థేశ్వరునకును జగజ్జీవులకును నడుమనుండెడిశక్తి లీనమగుచున్నదని భావము. ''అస్తి భాతి ప్రియం రూపం నామచేత్యంశపంచకమ్, ఆద్యత్రయం బ్రహ్మరూపం మాయారూపం తతోద్వయమ్'' అను శ్లోకార్థముచొప్పున నామరూపాత్మక ప్రకృతిజన్యములయిన ప్రపంచమునందు బ్రహ్మస్వరూపమైన అస్తిభాతిప్రియములు గూడియుండును. అది సమస్తమందును గలిసియుండినను వానివికారములతోఁ గలయక మిన్నువలె నిర్వికారమై, అసంగమై, విలక్షణమై ప్రకాశించుచున్నదని భావము.

అవతారిక:—ఆఱవప్రశ్నకు నుత్తరము చెప్పఁబడుచున్నది.

మ. సుమతీ శక్తివినా సమర్థుఁ డెటులన్సొంపొందుఁ దచ్ఛక్తిను
ర్విమహత్త్వంబులుగానుపించి పిదపన్విద్వాంసుఁడౌ నట్లుపూ
ర్ణమనీషాత్మకశక్తి దా వెలయు నిర్వాణేశునం దాస్వరూ
పమునీసామ్యముచే నెఱుంగుము భవద్భావంబునన్బుత్త్రకా.

టీ. సుమతీ—మంచివివేకముగల, పుత్త్రకా—కుమారా, ఉర్విన్—భూమియందు, శక్తివినా—సామర్థ్యముతప్ప, సమర్థుఁడు—కార్యములనుచేయఁ బూనుకొనినవాఁడు, ఎటులన్ సొంపొందున్-ఎటులన్—ఏప్రకారము, సొంపొందున్—ప్రకాశించును, తచ్ఛక్తిన్—ఆసామర్థ్యముచేత, మహత్త్వంబులు—తనయందుఁగల జాలవిద్యలను, కాను

పెంచి=చూపి, పిదపన=పిమ్మట, విద్వాంసుఁడౌన=విద్యలుగలవాఁడగును, అట్లు=అ ప్రకారము, పూర్ణమనీషాత్మకశక్తి-పూర్ణ=అంతటనిండినదగు, మనీషాత్మకశక్తి=వివేకమే స్వరూపముగాఁగల సామర్థ్యము, తాన=తాను, నిర్వాణేశునందున=మోక్షనాయకుఁడయిన భగవంతునియందు, వెలయున=ప్రకాశించును. ఈసామ్యముచేత=ఈ సాదృశ్యముచేతను, భవద్భావంబునన-భవత్=నీయొక్క, భావంబునన = అంతఃకరణమందు, ఎఱుంగుము=తెలిసికొనుము.

తా. మంచివివేకముగల పుత్రుఁడా! పుడమియందు సామర్థ్యముతప్ప కార్యములనుచేయఁ బూనుకొనినవాఁడు ఏప్రకారము ప్రకాశించును. ఆసామర్థ్యముచేత తనయందుఁగల జాలవిద్యలను చూపి పిమ్మట ఆయావిద్యలలో నేర్పరియగును. ఆ ప్రకారము అంతటనిండినదగు వివేకస్వరూపమయినశక్తి మోక్షనాయకుఁడైన భగవంతునియందు ప్రకాశించును. ఈ సాదృశ్యముచేత నీయొక్క అంతఃకరణమందు తెలిసికొనుమని తాత్పర్యము.

అనఁగా లోకమందు శక్తికిమించిన సామర్థ్యముగలది వేఱొండుగానము. ఎందుకనఁగా విద్వాంసుఁడని తెలియక ముందుండిన యొకానొకమనుజునివలె స్వరూపలక్షణముతోనున్న పరబ్రహ్మము తనశక్తివలననైన మూలాస్వరూపమగు మాయలో ప్రవేశించి తటస్థేశ్వరుఁడై ఇంద్రజాలకునిపగిది కనఁబడి తూలారూప మాయాస్వరూపులైన వ్యష్టిజీవులచేత నుపాస్యుఁడై పిమ్మట మూలాతూలలు ఇంద్రజాలకునివిద్యలు మఱుఁగైన తెఱఁగున మిథ్యలై యావిద్యలశక్తి ఇంద్రజాలకునియం దున్నట్లు దానికి కారణమయిన చిచ్ఛక్తి పరబ్రహ్మమందు ప్రకాశించునని భావము. ‘‘శ్రు. మాయాంతు ప్రకృతిం విద్యాన్మాయినంతు మహేశ్వరమ్. తదాత్మానగ్ం స్వయమకురుత, సచ్చత్యచ్చాభవత్, తత్సృష్ట్వాతదేవానుప్రావిశత్, అనేనజీవేనాత్మనానుప్రవిశ్య’’ అనెడి శ్రుత్యర్థములరీతిని ఆపరబ్రహ్మము తనయందుండెడిశక్తిచేత తానే ప్రపంచాకారమునుఁబొంది ఆపల జీవరూపముగా ప్రవేశించినాఁడని యర్థము ‘‘శ్రు. సభూమింవిశ్వతోవృత్వా హ్యత్యతిష్ఠద్దశాంగులం’’ సూ. వికారావర్తిచ తథాహిస్థితిమాహ—అనఁగా బ్రహ్మమందుండు మాయాశక్తి బొత్తిగా నాశనమై చిరకాలమునకు తిరుగా నెప్పటియట్లనే యైనదగుచు అయ్యైజీవులను ప్రపంచమును వారివారికర్మములకు తగినసాధనములను కలుగునని భావము. మఱియు అగ్నియందు ఉష్ణశక్తియు, ఇంద్రజాలకునియందు మాయాశక్తియు, ఱాళ్ళయందు కఠినశక్తియు, నీటియందు ద్రవశక్తియు, గాలియందు చలించునట్టిశక్తియు, విత్తునందు గొప్పవృక్షమును గలిగించుశక్తియు, రేతస్సునందు శరీరకల్పనాశక్తియును, శరీరములయందు కదలమెదలఁజేయు శక్తియును వానివానియందు ఆధార

ముగనుండి వానికంటె వేఱుగానియట్లు ఆపరబ్రహ్మమందుండుశక్తి ఆపరబ్రహ్మమునకంటె భిన్నముగఁదోఁచక వేఱుగాఁగనఁబడుచు ప్రపంచోత్పాదనాదికార్యములకుఁ గారణమై యుండునని యెఱుఁగవలయును.

అవతారిక:—మిథ్యారూపమయిన మాయాశక్తిని దెలియుట ఎట్లని శిష్యుఁడడిగిన ప్రశ్నకు దృష్టాంతపూర్వకముగ సమాధానముఁ జెప్పుచున్నారు.

మ. అసదాకారము మాయ దాని సదుపాయం బెట్లన న్గాన నీ
వసుధ న్జూడఁ దృణాద్యచేతనతతుల్ వర్ణోపయుక్తంబులౌ
ప్రసవస్వాదుఫలాదులిచ్చు నటుల న్భాసిల్లుఁ దచ్ఛక్తి దా
వెస జీవాళినిఁ జేరకున్నఁ జరితల్ భేదంబులై యుండవే. ౧౦౧

టీక. మాయ=మిథ్యారూపమైనమాయ, అసదాకారము = అసద్రూపము, దానిన్=ఆమాయను, కానన్=తెలిసికొనుటకు, సదుపాయంబు=మంచియుపాయము, ఎట్లు=ఏప్రకారము, అనన్=ఇట్లని శిష్యుఁడడుగఁగా, ఈవసుధన్=భూమియందు, తృణాద్యచేతనతతుల్-తృణ=గరికపోచ మొదలుగాఁగల, అచేతన=తెలివిలేని పనస మామిడి మొదలగుచెట్లయొక్క, తతులు=సముదాయములు, వర్ణోపయుక్తంబులౌ=నీల పీత శ్వేత రక్తవర్ణములతోడఁ గూడుకొనియుండునటువంటి, ప్రసవస్వాదుఫలాదులు-ప్రసవ=పుష్పములను, స్వాదు = మధురములైన, ఫలాదులు=పండ్లు మొదలైనవానిని, ఇచ్చున్=ఇచ్చును, అటులన్=ఆప్రకారము, చూడన్=ఆలోచింపఁగాను, తచ్ఛక్తి=ఆపరబ్రహ్మశక్తి, భాసిల్లున్=ప్రకాశించును, తాన్=తానైన ఆశక్తి, వెసన్=మిక్కిలి, జీవాళిన్=జీవసముదాయమందు, చేరకున్నన్ = చేరికయుండినను, చరితల్=వారివారినడవళ్లు, భేదంబులై యుండవే=భిన్నములై యుండవా.

తా. మిథ్యారూపమయినమాయ అసద్రూపముగనుక ఆమాయనుతెలిసికొనుట యేప్రకారమని శిష్యుఁడడుగఁగా భూమియందు గఱికపోచ మొదలుగాఁగల నానావిధ వృక్షములు చిత్రవిచిత్రములైన పుష్పములను మంచిమధురములైనపండ్లను ఇచ్చుచుండఁగా మనము చూచుచున్నారముగదా. ఆప్రకారము ఆఱుభేదములుగా నొప్పుచుండెడి ఆపరబ్రహ్మశక్తి ప్రకాశించును. తానైన ఆశక్తి మిక్కిలి జీవసముదాయమందు చేరికయుండిన యెడల వారివారినడవళ్ళు భిన్నములుగాఁదోఁచవా యని తాత్పర్యము.

లోకమందు చెట్టుచేమలు నానావిధములగు రంగులుగల పుష్పములను మాధుర్యములగు ఫలములను పలుతెఱఁగులపనుల కుపయోగమగువస్తువులను కలుగఁజేయునట్టి శక్తి గలిగియున్నదని యందఱును దెలియును. ఆశక్తి ఆఱువిధములుగ నుండును. ఆషట్ఛక్తుల

తోఁగూడిన పరబ్రహ్మము అపరిచ్ఛిన్నుఁడు. అపరిచ్ఛిన్నత్వమనఁగా త్రివిధపరిచ్ఛేద శూన్యమగు పరిపూర్ణత్వము. త్రిపరిచ్ఛేదమనఁగా దేశకాల వస్తువులచేత అఖండత్వము నకు లోపము కలుగుట. అసదాకారమైనది మాయ. సదాకారమైనది ఆత్మ. ఆయాత్మకు సజాతీయ, విజాతీయ స్వగతభేదములు లేవు గాన అద్వితీయము శ్రుతియందు ప్రతిపా దించుచున్నది. మఱియు సమస్తవస్తువులు సత్తునందే ఆరోపింపఁబడి యున్నందువలన అసత్తును చిత్తనఁబడును. ఆ చిద్రూపమగు సత్తును ఆవరించుకొని యుండునది అసత్తు. దానియందు రెండువస్తువులు లేనందున అసత్తేచిత్తయి ఆనందస్వరూపమయ్యెను. ఇం దుకు దృష్టాంతము. నిద్రలో తనకంటె నన్యమగు రెండవదిలేదు గాన నది యానందమగు గును. మెలకువయందును స్వప్నమందును రెండవవస్తువు కలిగియుండుటచే దుఃఖము సంప్రాప్తమగును కాఁబట్టి ఆత్మకు అపరిచ్ఛిన్నత్వము చెప్పఁబడెను.

॥శ్లో. భూతభౌతికభాగేషు స్వకార్యేషు సదాత్మనా, వ్యాపిత్వాత్తతోఽప్యా త్మా దేశాన్నాస్య పరిచ్ఛిదిః॥ అనఁగా పంచభూతములను వానికార్యములతోఁ గూడిన సమస్త జగంబునందును సద్రూపుఁడగు ఆత్మకు అనువ్యాప్తికలిగి యున్నందునను, వ్యాప కత్వము కలిగియున్నందునను, దేశముచేత పరిచ్ఛిన్నత్వములేదు. ॥శ్లో. అదేహిత్వాద నాదిత్వా దకార్యత్వాన్నవిద్యతే, వర్తమానాగతాగామి కాలేభ్యోన పరిచ్ఛిదిః॥ ఆత్మ అనాది గనుక భూతకాలముచేతను, నిత్యుఁడు గాన భవిష్యత్కాలముచేతను, దేహవ్య తిరిక్తుఁడుగా నుండుటవలన వర్తమానకాలముచేతను, ఆత్మకు పరిచ్ఛిన్నత్వములేదు. ॥శ్లో. సర్వభిన్న స్వరూపేణ సర్వాత్మత్వా త్సదాత్మనః, సర్వేభ్యో వస్తుజాతేభ్యః పరిచ్ఛిత్తిర్నవిద్యతే॥ ఆత్మ సర్వాత్మకుఁడైయుండుట వలనను, అసద్రూపుఁడైన ఆత్మ ఆకాశాదులు కానివానివలె కనఁబడినను, ఆ యాకాశాదులు ఆత్మస్వరూపమైన సత్తును, ఉపజీవించుకొని యున్నవిగాన మృత్తికయందుఁ దోఁచుఘటము మొదలయినవి యా మృత్తికకంటెఁ బరిచ్ఛిన్నముగా నేప్రకారముగావో ఆరీతిని ఆ యాత్మస్వరూపమైన సత్తుకంటె అన్యముగా మఱియొకటిలేదు గావున ఆత్మకు వస్తువువలనను బరిచ్ఛిన్నత్వము లేదు. ॥శ్లో. నవ్యాపిత్వా ద్దేశతోంతో నిత్యత్వాన్నాపికాలతః, నవస్తుతోయం సర్వా త్మా ధావత్యం బ్రహ్మణిత్రిధా, అఖండాత్మానమేవాయ మిత్యేవం యోవిజజ్ఞివాన్, ససర్వసంస్పృ తేర్ముక్తో బ్రహ్మానందం సమశ్నుతే॥ అనెడి స్మృత్యర్థములచొప్పున ఆత్మ సర్వాత్మకుఁడై యుండుటవలన సజాతీయ విజాతీయ స్వగతరూపమగు వస్తువులచేతను, విభుఁడైయుండుటవలన దేశముచేతను నిత్యుఁడైయున్నందువలన కాలముచేతను పరిచ్ఛే దశూన్యుఁడైయున్నాఁడు. ఈవిషయములను ముక్తియందు శక్తిగలవారు చక్కఁగఁదెలి సికొని అఖండస్వరూపమైన ఆత్మయే తామని దృఢనిశ్చయమునుఁజెందిన బ్రహ్మానంద మున్ను లగుదురని భావము.

అవతారిక:—పరబ్రహ్మమందుండెడి చిచ్ఛక్తియే వ్యోమాదిసర్వప్రపంచమని నిరూపించుచున్నారు.

శా. అండాంతర్గలశక్తిఁ గానమె విహంగానంతవర్ణంబులై
యుండున్జిన్మయశక్తి యట్లఖిల మౌనుర్వీశహీనాచలా
ఖండంబట్లది లేకయున్న జలమౌ గాఢాగ్ని వారాశి మృ
త్ఖండంబౌ శ్రుతినీచునొందు సుధలోకంబందుఁ జేఁదౌఁ జుమీ.

టీ. అండాంతర్గలశక్తిన్-అండ=(మయూరము మొదలయినపక్షులయొక్క) గ్రుడ్లయందలి, జల=కరువునీటియందలి, శక్తిన్ = సామర్థ్యమును, కానమె=చూడమా, విహంగ=నెమిలి మొదలయినపక్షులయందలి, అనంతవర్ణంబులు=అపరిమితములైనరంగులు, ఐవుండున్=కలిగివుండునుగదా, చిన్మయశక్తి=పరబ్రహ్మమందుండెడి చిల్లక్షణము నెడిసామర్థ్యము, అట్లు=ఆప్రకారము, అఖిలము=వ్యోమాదిసర్వప్రపంచము, ఔన్=అవును, అట్లు=ఆప్రకారము, అదిలేకయున్నన్=ఆపరబ్రహ్మమందు చిద్రూపశక్తి లేకయుండినను, ఉర్వీశహీనాచలాఖండంబౌన్-ఉర్వీశహీన=రాజులేని, అచలాఖండము=భూమిఖండము, ఔన్=అగును, జలమౌ గాఢాగ్ని=గొప్పనిప్పునీరౌను, వారాశిమృత్ఖండంబౌన్-వారాశి=సముద్రము, మృత్ఖండంబౌన్ = మంటిగడ్డయవును, శ్రుతినీచునొందున్-శ్రుతి=వేదము, నీచున్=చండాలుని, ఒందున్ = పొందును, లోకంబందున్ = జగత్తునందు, సుధ=అమృతము, చేఁదౌఁజుమీ=విషమౌనుగదా.

తా. మయూరము మొదలైన పక్షులయొక్క వానివానిరంగులు ఆయాగ్రుడ్డులలోనుండెడి నీరేకదా. ఆప్రకారమే పరబ్రహ్మమందలి చిచ్ఛక్తి వ్యోమాది సర్వప్రపంచము అవును. ఆ చిచ్ఛక్తి పరబ్రహ్మమందు లేకయుండెనేని నిప్పు నీరగును. సముద్రము మంటిపెల్లయవును. రాజులేని రాజ్యమువలెనవును. వేదము చండాలునియందుఁజేరును. అమృతము చేఁదౌనుగదాయని తాత్పర్యము. లోకమందు పక్షులలో అనేకజాతులుగలవు. వానిలో ఒక్కొకజాతియందు పోలికలయందును, రంగులయందును, అనేకభేదములుగలవు. అట్టి చిత్రములగు రంగులకును భేదములకును కారణము, వానివానిగ్రుడ్లలోని నీరునందే మిళితములైయున్నట్లు జగత్సృష్టి పరబ్రహ్మమందలి చిచ్ఛక్తియందుఁ గలిగియున్నదని భావము. నిప్పు రగులుటకును, గాలి విసరుటకును, మనుష్యులు రాజ్యమేలుటకును, యుక్తులు పన్నుటకును, కుయుక్తులు చేయుటకును, చెఱుపుచేయుటకును, బాగుచేయుటకును, ఇంద్రజాలాదివిద్యలు చూపుటకును, శక్తియే ప్రధానమని గ్రాహ్యంబు. శక్తిలేకున్న గడ్డిపోచైనను కదలదు. కాఁబట్టి బ్రహ్మవిష్ణ్వాదిదేవతలకును, మనుష్యులకును, ఆ పరబ్రహ్మమందలి అనంతశక్తియే ముఖ్యమని తెలిసికొనవలయును.

అవతారిక:—మిథ్యారూపమగు చిచ్ఛక్తికార్యములు పరబ్రహ్మమునకు వేఱైన ద్వైతమగుఁగాన అఖండాకారమైన పరబ్రహ్మజ్ఞాన మెట్లుసిద్ధించునని శిష్యుఁడాచార్యులతో ప్రశ్నచేయుచున్నాఁడు.

మ. కన నూహింప నశక్తమై కడు నిరుక్తంబై జగద్బీజమై
తనరు న్జిన్మయ శక్తి కార్య మదసత్యంబై సదా దాని నె
ట్లనఘా దాఁటుట లన్యమన్న ద్వివిధంబౌఁ గాన నద్వైత మె
ట్లౌనగూడు న్జెడు నేకమన్నమహనీయుల్గాన రారెందులన్. ౧౦౩

టీ. చిన్మయశక్తి-చిన్మయ=జ్ఞానవికారమైన, శక్తి=జడశక్తియొక్క, కార్యము=(నామరూపాత్మకప్రపంచ) వ్యాపారము, అది=అది, కనన్=చూచుటకును, ఊహింపన్=(తెలిసి) ఆలోచించుటకును, అశక్తమై = ఏవారికిని సమర్థముగానిదై, కడున్=మిక్కిలి, నిరుక్తంబై=(వచించుటకు అయోగ్యమవుటవలన) అవాచ్యవస్తువై, జగద్బీజమై=(చచ్చుచు పుట్టుచునుండెడి నామరూప) ప్రపంచమనెడి సస్యములకు విత్తనమై, సదా=ఎల్లప్పుడును, తనరున్=ఒప్పును, దానిన్=ఆమిథ్యారూపమైన చిచ్ఛక్తికార్యమును, దాఁటుటలు=అతిక్రమించుటలు, ఎట్లు = ఏప్రకారము, (అగును) అనఘా=నిష్కల్మషుఁడవైన నాయాచార్యుఁడా, అన్యమన్నన్=ఈబ్రహ్మమునకు వేఱైనను, ద్వివిధంబౌన్=రెండువస్తువులౌను, కానన్=కాఁబట్టి, అద్వైతము=అఖండాకారమైన బ్రహ్మజ్ఞానము, ఎట్లౌనగూడున్=ఏప్రకారముప్రాప్తించును, ఏకమన్నన్=(ఆబ్రహ్మమును, మాయయును) ఒకటేఅనినను, చెడున్=ఆబ్రహ్మముచెడునే, ఎందున్ = ఎచ్చటను, మహనీయులు=బ్రహ్మవేత్తలు, కానరారు=కనఁబడరుగదా.

తా. నిష్కల్మషుఁడవైన నాయాచార్యుఁడా! జ్ఞానవికారమైన జడశక్తియొక్క వ్యాపారములు క్రమముగా కనుటకును కని ఆలోచించుటకును ఎవ్వరికిని సమర్థముగానిదై వచించుటను మిక్కిలి అయోగ్యమాటవలన అవాచ్యవస్తువై గిట్టుచు పుట్టుచునుండెడి నామరూపప్రపంచమనెడి సస్యములకుబీజమై అసత్యంబై సర్వదాఒప్పును. ఇట్టి మిథ్యారూపమైన చిచ్ఛక్తికార్యమును దాఁటుట యెట్లగును. ఆకార్యము యీబ్రహ్మమునకు వేఱైన రెండువస్తువులౌను. కాఁబట్టి అఖండాకారమైన పరబ్రహ్మజ్ఞానము ఏప్రకారముగల్గును? ఆబ్రహ్మమును మాయయును ఒకటేయనిన ఆబ్రహ్మము చెడునే? అట్లయిన ఏవిధమునను బ్రహ్మవేత్తలు కనఁబడరుగదా యని శిష్యుఁడడిగెనని తాత్పర్యము.

"శ్రు. ఏకమేవాద్వితీయంబ్రహ్మ" అనుటచేత అద్వైతము సిద్ధమగును. రెండు వస్తువులైతే అద్వైతముకానేరదు. కాఁబట్టి శ్రుతికి బాధకమువచ్చును. ఆబ్రహ్మము మాయయును ఏకమనిన సూర్యుఁడు చీఁకటిఅనినట్లుగా బ్రహ్మముచెడును. "శ్రు. బ్రహ్మ

మాత్రమునన్నహి" అను శ్రుతివలన అపరబ్రహ్మముతప్ప వేఱొకవస్తువు లేనేలేదు. సూర్యకిరణములందుఁదోఁచిన యెండమావులకు వస్తుత్వములేదు గనుక భ్రమమాత్రములని ముఖ్యాభిప్రాయము.

అవతారిక:— మొదటి రెండుప్రశ్నలకు ఉత్తరము చెప్పఁబడుచున్నది.

శా. పానీయాశుగ వహ్ని శక్తు లెచటన్ భాసిల్లు మంత్రౌషధ
జ్ఞానుల్ స్తంభన కృత్యముల్ సలుపసద్ జ్ఞానప్రమోదుండవై
నూనానూనము లెన్నకున్నఁ గడుఁ జిన్మూలప్రధానంబు నీ
లోనం జెంది యడంగు వేఱొకటి యాలోచింప లేదెందులన్.

టీ. మంత్రౌషధజ్ఞానుల్ = మణిమంత్రౌషధములను తెలిసినవారు, స్తంభనకృత్యముల్ = జలస్తంభన వాయుస్తంభన అగ్నిస్తంభనలను, సలుపన్ = చేసినను, పానీయ = జలముయొక్కయు, ఆశుగ = వాయువుయొక్కయు, వహ్ని = అగ్నియొక్కయు, శక్తులు = సామర్థ్యములు, అనఁగా జలమునందుజొఱుటయు, పిండినిముద్దచేయుటయు, చల్లఁదనము గలిగియుండుటయు, వాయువునందు విసురుటయు, అగ్నియందుకాల్చుటయు ఇవి మొదలైనవనుట. ఎచటన్ = ఏస్థలమందు, భాసిల్లున్ = ప్రకాశించును, (అనఁగా ప్రకాశించవనుట) సద్ జ్ఞానప్రమోదుండవై - సత్ = త్రిపరిచ్ఛేదశూన్యమును, జ్ఞాన = జడరహితమును, ప్రమోదుండవు = దుఃఖరహితుఁడవును, ఐ = అయినవాఁడవై, అనఁగా సచ్చిదానందస్వరూపుఁడవై, నూనానూనములు = తక్కువఎక్కువలను, ఎన్నకున్నన్ = ఎంచకుండినవాఁడవైతివేని, కడున్ = మిక్కిలి, చిత్ = జ్ఞానమునెడి, మూలప్రధానంబు = మూలప్రకృతి, నీలోనన్ = నీయందే, చెంది = ప్రవేశించి, అడంగున్ = అణఁగియుండును, వేఱొకటి = వేఱొకవిధము, ఆలోచింపన్ = ఆలోచించుటకు, ఎందున్ = ఎచ్చటను, లేదు = కలుగదు.

భా. మణిమంత్రౌషధములను తెలిసిన యోగసిద్ధులు జలమును వాయువును అగ్నిని స్తంభనములను చేసినను, వానివాని సామర్థ్యములు ఎక్కడ అణగిపోయెను. నీవు సచ్చిదానందస్వరూపుఁడవై తక్కువయెక్కువలను ఎంచకయుంటివేని మూలప్రకృతి నీలోనే అణఁగియుండును. ఆలోచింపఁగా వేఱొకవిధములేదని తాత్పర్యము. అనఁగా సద్గురువాక్యముచే నొప్పిన యథార్థమైన సచ్చిదానందస్వరూపమే తానైయుండునట్టి తన్మయస్వరూపముచేత నుండినవాఁడవైతివేని మాయాశక్తి లేనందున దానిని విడువవలయునని భావము. తన్మయమనఁగా చక్రాకారమగు ఇనుమును కాల్చినఅగ్నివలె కొంతసేపు కనఁబడినను దానిరూపము చెడక చక్రాకారముగానే యుండును. ఆప్రకారమే మాయాశక్తివలన కలిగినవ్యోమాదిప్రపంచం బంతయును "నేతి నేతి" యను మహావాక్యముచే నిరసిం

పఁగా మిగిలినది యథార్థవస్తువుగాన నదియే తన్మయమని యెఱుఁగనది. మఱియు నొక పురుషుఁడు చీఁకటియందు కొమ్మలు ఆకులులేని యొకచెట్టును చూచి మనుష్యుఁడని భ్రమసి పిమ్మట పరిశీలనఁజేయఁగా మనుజుఁడుగాక చెట్టేయైనట్టు తన్మయస్వరూపము. మూలప్రధానంబున్ అనఁగా మూలప్రకృతి ఆమూలప్రకృతి మాయయని, అవిద్యయని ద్వివిధము. అందు మాయ సత్త్వగుణమే స్వరూపముగాఁ గలదియగును. అవిద్య రజోగుణమే స్వరూపముగలది యగును ఆమాయయందు ప్రతిఫలించిన బ్రహ్మచ్ఛాయయు, మాయాధిష్ఠానమైన పరబ్రహ్మమును మాయనుగూడి ఈశ్వరకార్యములు చేయును. ఆ యీశ్వరుఁడు పరబ్రహ్మస్వరూపుఁ డయినందున మాయారహితుఁడై తన్మయుఁడుగానేయుండును. మఱియు ఆబ్రహ్మచ్ఛాయ రజోగుణప్రధానమయిన అవిద్యతోఁగూడి జీవకార్యములుచేయును. ఈ జీవేశ్వరకార్యములకు కారణము మూలప్రకృతి యేగనుక ఆ మూలప్రకృతి నీయందే అణఁగియున్నదని గ్రహింపవలయునని భావము. ॥ప్రారంభః క్రియతే అనయేతి ప్రకృతిః॥ అని వ్యుత్పత్తి. ప్రకృతివలన జగత్తు ఆరంభింపఁబడుచున్నదని సూచింపఁబడుచున్నది.

అవతారిక:—మూఁడవప్రశ్నకు ఉత్తరమునుఁ జెప్పుచున్నారు.

చ. కనుమఱుఁగై వెలుంగు నొకకాలమున న్ఘటశక్తి మృత్తికన్
గనఁబడ దాని మృత్తనక కల్పితనామముఁ బల్కు జిహ్వ తాఁ
గని చెడ దాని మన్ననిన క్కైవడిఁ గల్పన లైనదృశ్యము
ల్మనమున నెంచమిం జెడు సమస్తము నీవుగ వెల్గు మంతటన్. ౧౦౫

టీ. మృత్తికన్=మంటియందు, ఘటశక్తి=కుండఅయ్యెడు సామర్థ్యము, ఒకకాలమునన్=ఒకసమయమందు, కనుమఱుఁగై=కంటికిఁగనఁబడనిదై, వెలుఁగున్=ప్రకాశించును, కనఁబడన్=అది కనఁబడదేని, దానిన్=అఘటమును, మృత్తనక=మన్నని చెప్పక, కల్పితనామమున్=మృత్తికయందు కల్పితమైనపేరును, జిహ్వ=నాలుక, పలుకున్=చెప్పును, చెడన్=అఘటము చెడినను, తాన్=అజిహ్వయైనది, కని=చూచి, మన్ననినక్కైవడిన్=మన్నని పల్కినటులు, కల్పనలైనదృశ్యములు=నీయందు నామరూపములుగా కల్పితములైనదృశ్యములను, మనమునన్=మనస్సునందు, ఎంచమిన్=ఎంచకుండినను, సమస్తము=సర్వప్రపంచము, చెడున్=చెడును, అంతటన్=అటుపిమ్మట, నీవుగన్=నీవుగానే, వెల్గుము=ప్రకాశింపుము.

తా. మంటియందు కుండఅయ్యెడుసామర్థ్యము ఒకసమయమందు కనుమఱుఁగై అణఁగియుండును. అది కనఁబడదేని అఘటమును మన్నని చెప్పక యిది కావ అని చట్టియని కల్పితనామములను ఈనాలుక చెప్పును. అజిహ్వయైనది అఘటము చెడినయెడల

మున్నని చెప్పుచుండెడి విధమున నీయందు కల్పితములైన దృశ్యములను మనస్సునం దెంచకుండితి వేని సర్వప్రపంచము చెడి అంతట నీవుగానే ప్రకాశింపుదువని తాత్పర్యము.

ఇట్లనుటచేత మన్ను సత్తు. ఆమంటియందు చట్లుబానలు అయ్యెడిశక్తి అచిత్తు బహిర్గతమై సత్తైనమంటిని ఘటము మొదలగు నామరూపములుగాఁ దోఁపింపఁజేసినది చిత్తు చేసినమాయ. కొంతకాలమునకు ఆమాయవలనఁదోఁచెడి రూపనామములుచెడిన అది చిత్తై ఆచిత్తు సద్రూపమగుమంటిలో అణఁగియుండును. ఆప్రకారమే సత్తునుండి బహిర్గతమైనచిత్తు ప్రకాశమై దేవమనుష్యతిర్యగాదినామరూపాత్మక ప్రపంచముగాఁ దోఁపింపఁజేసినది మాయ. ఆమాయను గురుశ్రుతియుక్త్యనుభవములచేతఁ జక్కఁగాఁ దెలిసికొనినబ్రహ్మవేత్తకు దృశ్యమగు నామరూపాత్మకప్రపంచము శూన్యమై చిన్మాత్రముగా సద్రూపమందు నిలుచుచున్నది. అనఁగా ప్రపంచోత్పత్తికి పూర్వము అద్వితీయుఁడై ప్రకాశించుచుండిన సద్రూపుఁడైన పరమాత్మయొక్క చిచ్ఛక్తియే, "శ్లో. జాగ్రత్స్వప్నసుషుప్తిషుస్ఫుటతరా యా సంవిదుజ్జృంభతే, యా బ్రహ్మాది పిపీలికాంతతనుషు ప్రోతా జగత్సాక్షిణీ, సైవాహంనచదృశ్యవస్త్వితి దృఢప్రజ్ఞాపియస్యాస్తిచేచ్చండాలోస్తు సతుద్విజోస్తుగురు రిత్యేషామనీషామమ" అను శ్రీశంకరాచార్యవాక్యము చొప్పున మెలకువయందును, స్వప్నమందును, నిద్రయందును జక్కఁగఁ బ్రకాశించుచున్నదియు, బ్రహ్మమొదలుకొని పిపీలికవఱకు అంతముగాఁగల సకలశరీరములయందును, సమస్తమైనవానియందును ప్రకాశించుచున్నది గావున ఆయాప్రాణిచేయు ఇంద్రియవ్యాపారములన్నియు అపరబ్రహ్మముయొక్క శక్తియేయని తెలిసికొని వాచ్యార్థములగు శరీరాదులు మాయాకార్యములని త్రోసిన లక్ష్యార్థమగు స్వప్రకాశమైన చైతన్యమే నీవగుచున్నావని భావము.

అవతారిక:—ఆశక్తి అణఁగినను దానికార్యములైన దృశ్యసముదాయము అణఁగకతోఁచుచున్నది గాన అది నివర్తించెడియుపాయమును అనుగ్రహింపుఁడని శిష్యుఁడడుగఁగా ఆచార్యులు దృష్టాంతపూర్వకముగ సమాధానము చెప్పుచున్నారు.

మ. ఘనసచ్చిత్సుఖ మందసత్యజడదుఃఖంబుల్గన న్లేక తోఁ
చిననానా విపరీత మెట్లసఁగుఁ దశ్శేషంబు సిద్ధించు నె
ట్లన నీరంబునఁ దోఁచునీడ తలక్రిందై నం జలింపంగఁ దాఁ
గన నూహింపక తన్నుఁ గాన నిజమై కన్పట్టు నల్లాఁజుమీ. ౧౦౬

టీ. ఘనసచ్చిత్సుఖమందుఁ - ఘన=అతిశయమైన, సచ్చిత్సుఖమందుఁ=సచ్చిదానందపరబ్రహ్మమందు, అసత్యజడదుఃఖంబుల్ - అసత్య=అనృతమును, జడ=అజ్ఞానమును, దుఃఖంబుల్ = సుఖాభావమును, కనఁ=చూచుటకు, లేక=లేకయే, తోఁచిన

నానావిపరీతము—ఈ కనఁబడుచుండెడి అనేకవిధములుగాఁ దోఁచెడి ప్రపంచము, ఎట్లడఁగున్—ఎట్లు అణఁగిపోవును, తత్త్వమంబు—ఆ బ్రహ్మానందము, సిద్ధించుటెట్లు—కలుగునది యేప్రకారము, అనన్—ఇట్లని శిష్యుఁడడుగఁగాను, నీరంబునన్—జలమందు, తోఁచునీడ—కనఁబడెడి తనయొక్క నీడ, తలక్రిందైనన్—తలక్రిందుగానుండినదైనను, చలింపంగన్—కదలునదియైనను, తాన్—తాను, కనన్—దానిమాచుటకు, ఊహింపక—తలంచక, తన్నున్—గట్టుననుండినతన్ను, కానన్—చూచికొనఁగా, నిజమైకనప్పట్టున్—తాను నిజమై కనఁబడును, అట్లాఁజూమీ—ఆప్రకారమ మాయగదా.

తా. అతిశయమైన సచ్చిదానంద పరబ్రహ్మమునందు అనృతమును, దుఃఖమును మాచుటకులేకయే ఈ కనఁబడుచుండెడి అనేకవిధములుగాఁ దోఁచెడి ప్రపంచము ఎట్లు అణఁగిపోవును. ఆ బ్రహ్మానందము సిద్ధించుటెట్లని శిష్యుఁడడుగఁగా జలమందుఁ గనఁబడెడి తనఛాయ తలక్రిందైనను, కదలునదియైనను, తాను దానినూహింపక గట్టుననుండిన తన్నుచూచుకోఁగా తాను నిజమై కనఁబడునట్లు ఔనుగదా యని తాత్పర్యము.

అనఁగా త ఎనఁగలిగిననీడను తనకంటె నన్యమనియెంచక తానుగా భావించుకొనవలయును సచ్చిత్సుఖముఁ దసత్యజడదుఃఖంబులు అనఁగా త్రివిధపరిచ్ఛేదశూన్యుఁడగు పరబ్రహ్మంబునందు అనృతము, అజ్ఞానము, దుఃఖము వీనితోఁగూడిన బుద్ధిని ప్రయోగించుట. ఇందుకు దృష్టాంతము ఒకమనుష్యుఁడు గోదావరిగట్టున నొకకునకము నీళ్ళను ముట్టెనని దుఃఖించి ప్రయాగకువెళ్ళి అందుండి గంగాజలమునుకొనివచ్చి గోదావరినీళ్ళను కడుగఁదలఁచినట్లును, మఱియొకఁడు గాలివీచుటచే నగ్నిజ్వాల కదలఁగాఁ జూచి అయ్యయ్యో అగ్నిహోత్రునికి చలియెక్కువాయెనే జన్నిముంచుకొనెనే నేనేమిసేయుదునని పరితపించి తనపైనున్న శాలువను గప్పి ఔషధప్రయోగమునకై యత్నించినటులును, ఇంకొకఁడు దారినడుచుచుండఁగా తననీడ తానెటులుదిరిగిన నటుల దిరుగుటనుజూచి మిగుల కోపగించుకొని ఇఁక నిన్నటికిని తన వెంటనంటి రాకుండునట్లు చేయుటకై ఒక పెద్దగోయిత్రవ్వి దానియందు పాతిపెట్టఁబోవునటులును, వీనినన్నిటిని విచారణచేయఁగా నివియన్నియు అజ్ఞానముచేత కలుగుటంజేసి మిథ్యయని యెఱింగి నీటియందు తలక్రిందుగాను, చలనముగాను దోఁచెడి తననీడనుజూచి వికారపడక ఒడ్డున నిలుచుకొనిన తనుఁ జూచుకొనఁగా నది యబద్ధమై తానెట్లు నిజమగుచున్నాఁడో ఆతీరుననే అఖండసచ్చిదానంద స్వరూపుఁడగు ఆత్మ తానని యెఱుంగుటయే ప్రయోజనమని భావము.

అవ:—జగత్పరిశీలన నిష్ప్రయోజకమని ఆచార్యులు బోధించుచున్నారు.

ఉ. కారణ మైనబోధ గనఁ గారణ మా నది నామరూప వి
స్తారజగంబు కార్య మగు దానివిచారము నిష్ఫలం బగున్

సారవివేక స్వప్నజనజన్మవినాశము లాత్మఁ గానఁ దాఁ
గోరినమాట్కి నెద్దియిలఁ గోరక యుండుము పూర్ణబోధచేన్. ౧౦౭

టీ సారవివేక-సార=యథార్థవస్తువందు, వివేక=తెలివిగల కుమారా, కారణమై నబోధ-కారణము=సకలవ్యవహారకారణమును, వినబోధ=వినట్టితెలివి, కనక్ = విచారింపఁగా, కారణమాక్=జగత్తునకు హేతువగును,అది=ఆబోధ, నామరూపవిస్తారజగంబు-నామ=నానావిధమైన పేళ్ళచేతను,రూప=రూపములచేతను, విస్తార=అతిశయమైన, జగంబు=లోకము, కార్యమగుక్=క్రియయగును. దానివిచారము=ఈ కారణకార్యవిచారము, నిష్ఫలంబు = ప్రయోజనములేనిది, అగుక్ = అగును, స్వప్నజనజన్మవినాశములు-స్వప్న=కలయందలి, జన=కనఁబడిన జనులయొక్క, జన్మ=పుట్టుకయు, వినాశములు=చావును, ఆత్మక్=అంతఃకరణమందు, తాక్=తాను, కానక్=తెలిసికొనుటకు, కోరినమాట్కిక్ = ఇచ్ఛయించినటువలెను, అగుక్=అగును, ఇలక్ = భూమియందు, ఎద్ది=ఎద్దానిని, కోరక=ఇచ్ఛయించక, పూర్ణబోధచేక్=సంపూర్ణమైన వివేకముచేతను, ఉండుము=నివసించుము.

తా. యథార్థవస్తువందు తెలివిగఁ కుమారా! సకల వ్యవహారములకును కారణమైనది బుద్ధి. ఆబుద్ధివలన కలిగిన నామరూపములుగాఁదోఁచెడి సమస్తజగము కార్యమగును. ఆ జగత్తుయొక్క పరిశీలన స్వప్నమందుఁదోఁచిన జనులయొక్క చావుపుట్టుకలు పొందలగునవి తెలిసికొనఁ గోరినటులు నిష్ప్రయోజనమగును. కాఁబట్టి యేదియునుగోరక సంపూర్ణజ్ఞానముచేత ప్రకాశింపుచుండుమని తాత్పర్యము.

అనఁగా రూపనామములుగాఁదోఁచెడి సర్వప్రపంచము మాయాకార్యంబగుటవలన స్వప్నతుల్యమగుచున్నది. ఎందుకనఁగా: స్వప్నమందు ఒకదేశమునకు పోయినటులును,ఒక కన్యాలలామను వివాహముచేసికొనినటులును, ఆ చిన్నదానితోఁగలసి యనేకపుత్రులను పుత్రికలను బడసినటులును,వారిలోఁగొందఱకు వ్యాధులుగలిగినటులును, ఔషధములు ఇచ్చినటులును,గొందఱు చచ్చినటులును,కాటకము సంభవించినటులును, రాజ్యాధిపతులయినటులును, సంభవించుటలు విని కనియున్నారము. జాగ్రత్తునందు వీనిలో నెద్దియైనను యథార్థముగనుండుటఁ గానము. కనుక అట్టి మిథ్యాస్వరూపమగు వానినిగుఱించి క్షేమలాభములు విచారించుటవలన నిష్ప్రయోజనము కాఁబట్టి జగద్భ్రాంతినివదలి ఆత్మస్వరూపుఁడవైన నీయందే పరమప్రీతి నునిచి కారణమైన చిత్స్వరూపమే తానుగా ప్రకాశించెడి కార్యమైన సర్వమును పరబ్రహ్మస్వరూపముయొక్క ప్రకాశమే యనితెలిసి నిరంతరము ఆత్మనిష్ఠయందుండుమని భావము.

అవతారిక:—చింతనచేయుటవలన అద్వైతానందము కలుగునని ఆచార్యులు చెప్పుచున్నారు.

మ. అసదావాసమున స్పరాఙ్ముఖత నీకెక బ్బె న్గదా యింక నీ
యసమానాంతరవక్త్రదృష్టి నిరతం బభ్యాసముం జేయ దు
ర్వ్యసనాయత్తముగాక మానసము దా స్వాయత్తముం జెంది నీ
కు సహాయం బగు నోలలాడుము సుఖాకూపారమం దెల్లెడన్.

టీ అసదావాసమునన్ - అసత్ = నశించుటకు యోగ్యమైన నామరూపాత్మక జగత్తునందు, ఆవాసమునన్ = నివసించియున్నవాఁడ వగుటచేతి, నీకున్ = నీకు, పరాఙ్ముఖత = (నిన్ను నీవు తెలిసికొనుట యనుదాని విడిచిపెట్టి) వెలుపలమాచెడిదృష్టి, అబ్బెన్ గదా = కలిగెనుగదా, ఇంకన్ = ఇంకను, ఈ యసమానాంతరవక్త్రదృష్టిన్ - ఈ = ఇప్పుడు నాచే ఉపదేశింపఁబడిన, అసమాన = సమానరహితమైన, అంతరవక్త్ర = నిన్ను నీవు తెలిసికొనుటకుఁ దిరిగిన, దృష్టి = మాపు, నిరంతరంబు = ఎల్లప్పుడును, అభ్యాసముంజేయన్ = అలవాటుచేయఁగా, మానసము = మనస్సైనది, దుర్వ్యసనాయత్తముగాక = కామాది దుష్టవృత్తులతోఁగూడినదిగాక, తాన్ = తాను, స్వాయత్తముంజెంది = తనయందే తాను పొంది, నీకున్ = నీకు, సహాయంబగున్ = తోడగును, ఎల్లెడన్ = అంతటను, సుఖాకూపారమందున్ - సుఖ = బ్రహ్మానందమనెడి, అకూపారమందున్ = సముద్రమందు, ఓలలాడుము = ఈఁదులాడుము.

తా. చెడుటకు కారణమైన జగమందు నివసించియుండెడి నీకు బహిర్ముఖదృష్టి కలిగెనుగదా! ఇఁకమీఁద నాచే నుపదేశింపఁబడిన నిరుపమానమగు అంతర్ముఖమైన దృష్టిని ఎడతెగక వాడుకచేసెదవేని మనస్సైనది కామాది దుర్వ్యాపారములయందుఁ జేరక నీకు తోడయియుండుఁ గావున బ్రహ్మానంద సముద్రమందు నోలలాడుమని తాత్పర్యము.

పరాఙ్ముఖత అనఁగా చక్షుర్దేంద్రియవ్యాపారములు బ్రహ్మేతరములు గావని తెలిసికొనక వెలుపలఁజూచెడిదృష్టి అంతరవక్త్రదృష్టియనఁగా ధారణాయోగముచేత ॥శ్లో. యద్యత్పశ్యతిచక్షుర్భ్యాం తత్తదాత్మేతిభావయేత్, యద్యచ్ఛృణోతికర్ణాభ్యాం తత్తదాత్మేతిభావయేత్.॥ అను ఉపనిషద్వాక్యార్థముచొప్పున చక్షుర్దేంద్రియ వ్యవహారములు బ్రహ్మేతరములుగావని యాథార్థిగాఁదెలిసికొని నిశ్చలచిత్తుఁడై పరబ్రహ్మమును చింతనఁజేయుచుండుట. అనఁగా జాగ్రదాది సర్వావస్థలయందుఁదోఁచెడి సకలంబును పరమాత్మయేయని యెల్లప్పుడు దర్శించుట. ఇట్లు దర్శించువాఁడు పాము తనచే విడువఁబడిన కుబుసముపై ప్రీతియుంచక యుండినట్లు నాది నేను అను మమతాహంకారములులేక చిత్తవిశ్రాంతికలిగి నిద్రించువానిచందమున మైమఱచి బ్రహ్మానందమనెడు సాగరంబున నోలలాడుచుండును. స్వాయత్తముంజెంది అనఁగా మనస్సును అంటియుండెడి అన్నికోరికలను పరుసగావదలి పరమాత్మయుందే మనస్సంతుష్టిగలవాఁడై యుండుటకు మనస్సే కారణము గనుక ఆమనస్సును అంతర్ముఖదృష్టివలన నిశ్చలమ్ము

సమాధినిష్ఠయందు నిలిపియుంచుట. అంతఃకరణము పరాఙ్ముఖమైనపుడు మనస్సని అంతర్ముఖమైనపుడు బుద్ధియనిపేరు. రెంటికిని ఆ పరమాత్మయేసాక్షి గనుక, ‹‹తత్త్వమసి›› యను మహావాక్యార్థము చొప్పున మాయయందు ప్రతిబింబించి మాయోపాధికమై జగత్కారణమైన సచ్చిదానంద పరబ్రహ్మము నీవైతివని తెలియుట. కాబట్టి అంతర్ముఖదృష్టిచేత బ్రహ్మమునకును, కూటస్థునకును, ఉపాధులగు మాయను, అవిద్యను, వాని సంబంధములగు సకలవ్యాపారములను విడిచి కేవల చైతన్యస్వరూపమాత్రమునకు ఐక్యంబు దలిసికొని యెడతెగక మననముచేయఁగా తన్మయుఁడగును అతన్మయమైన ఆనంద స్వరూపమే తానానని భావము.

అవతారిక:—త్రివిధములగు సచ్చిదానంద స్వరూపలక్షణములు అన్నిటియందును నిండియున్నవని తెలియఁబఱచినను వెలుపలఁదోఁచలేదు గాన వానిని నిస్సందేహముగఁ దెలుపవలయునని శిష్యుఁ డాచార్యులను అడుగుచున్నాఁడు.

మ. స్వగతాదిభ్రమ శూన్యపూర్ణఘనసత్సంవిత్సుఖం బెల్ల దే
హగతప్రాణుల కేక మౌనన యథార్థాప త్తియౌఁ గాన స
త్తగు నేనే యన జీవులెల్ల నికఁ జిత్తైఁ దత్ప్రకాశంబు చ
క్కఁగ నానందము గల్గదేల వెలిఁ దత్కార్యంబు దెల్పన్దగున్. ౧౦౯

టీ. స్వగతా...త్సుఖంబు - స్వగత=తనయందుఁగలిగెడి దేహేంద్రియ వికారభేదమే, ఆది=మొదలుగాఁగల; భ్రమ=త్రివిధమోహములు, (అనఁగా సజాతీయ విజాతీయ స్వగతములనెడి త్రివిధభేదములనుట) శూన్య=లేక, పూర్ణ=అంతట నిండియుండెడి, ఘన=అతిశయమైన, సత్సంవిత్సుఖంబు = సచ్చిదానంద స్వరూపమగు పరబ్రహ్మము, ఎల్లదేహగతప్రాణులకున్-ఎల్ల=సమస్తములైన, దేహ=నర, సుర, దైత్య, తరు, పాషాణ, జలచర, క్రిమి, పశు, పక్షి మొదలగు శరీరములయందు, గత=పొందియుండెడి, ప్రాణులకున్=జీవులకు, ఏకము=ఒక్కటిగానే, ఔన్=అగును, అనన్=ఈప్రకారమనినను, యథార్థాపత్తి=నిశ్చయమునకు దోషము, ఔన్=అగును, కానన్=కనుక, జీవులెల్లన్=ప్రాణులందఱును, నేనేయనన్ = నేనేయనెడి యేకవాక్యముచేత, సత్తగున్=సద్రూపమగును, ఇంకన్=ఇఁకమీఁదు, తత్ప్రకాశంబు-తత్=నేనను జీవులయొక్క, ప్రకాశంబు=వ్యాపకమంతయు, చిత్తౌన్ = చిద్రూపమగును, చక్కఁగన్=లెస్సగాను, వెలిన్=వెలుపల, ఆనందము=సుఖము, కల్గదేల = ఎందుకు కనఁబడలేదు, తత్కార్యంబు=ఆయానంద స్వరూపమైనపని, తెల్పన్దగున్ = తెలియఁజెప్పవలయును.

తా. తనయందుఁదోఁచెడి సజాతీయ, విజాతీయ, స్వగతములనెడి మూఁడువిధములైన భేదములులేక అంతట నిండియుండెడి సచ్చిదానంద పరబ్రహ్మము, యెల్లప్రా

ణులయందు ఒకటిగానుండుననిన యథార్థమునకు లోపమువచ్చును. కాబట్టి ప్రాణులన్నిటియందు నేను నేననుటయే సద్రూపమగును. ఆ నేననెడి వస్తువుయొక్క వ్యాపకము చిద్రూపమగును. అట్లైనయెడల చక్కగా ఆ యానందము వెలుపలదోచలేదే ఆయానంద స్వరూపమును దెలియజెప్పవలయునని తాత్పర్యము.

స్వగతాదిభేదశూన్య పూర్ణఘన సచ్చిత్సుఖంబు అనుటయందు స్వగతము, సజాతీయము, విజాతీయము అను మూడుభేదములు శూన్యమైన పరిపూర్ణసచ్చిదానంద స్వరూప పరబ్రహ్మమని తాత్పర్యము. స్వగతమనగా నఖశిఖపర్యంతములైన సకలావయవములు స్వగతములు. ఇవి శూన్యమనుటవలన ఈ పరబ్రహ్మమునకు మాతృపితలు లేదనుభావము స్ఫురించుచున్నది. ఈయనకు మాతృపిత లున్నట్లైతే జగమంతయు నీయనకుముందే యుండవలయును. అప్పుడు ఈయన ఆదిపురుషుడు గాకపోవుచున్నాడు. గనుక, ‹‹నస్తోప్యర్థకస్తాత్వవిష్ణుమనాదిం జగదాదిమ్››అని హరిమీడేస్తవమందు చెప్పబడియున్నట్లు జగమునకుముందు ఈయన పెండ్లివాడును, ఈయానకుముందు ఎవరునులేరనియు స్ఫురించుచున్నది. సజాతీయ, విజాతీయ, భేదశూన్యమనుటయందు సర్వకార్య నిర్వాహకుడుగా నీపరబ్రహ్మమే యున్నాడని ముఖ్యాభిప్రాయము. ఎల్లదేహగతప్రాణులకు నేకమాననుటచేత భాండములకు భేదములుగలిగి తండోపతండములైనను మృత్తిక యేకమైనట్లు ఆ పరబ్రహ్మమే సమస్తప్రాణులయందును ఏకముగా నిండియున్నాడని భావము.

అవతారిక:—పైప్రశ్నకు సమాధానమును ఈదిగువవచ్చెడి మూడుపద్యములచే జెప్పుచున్నారు.

చ. ఒకసుమమందు నొక్కటిగ నుండు రసాదులు వానిలోనఁ దా
నొకఁడొకఁడే గ్రహింపఁబడి యొక్కటి కొక్కటి కింద్రియాళిలోఁ
బ్రకటము లైనభాతిఁ బరభావము లై తగు సచ్చిదాదు లా
త్మకునవి వేఱు వేఱుగఁ బ్రమాదముచేఁ గనఁదోఁచు నెంతయున్.

టీ. ఒకసుమమునందుఁ=ఒకపుష్పమందు, రసాదులు - రస=(మధురాది) రసమే, ఆదులు=మొదలగునవి, అనఁగా, (వాసనయు, రూపము, రుచియు, మార్దవముఅనుట) ఒక్కటిగనుండుఁ=అయిదుగుణములును ఒకటిగానే కూడియుండును, వానిలోనఁ= ఆ విదుగుణములలోపలను, ఇంద్రియాళిలోఁ=జ్ఞానకర్మేంద్రియ సముదాయములోపలను, తాఁ=తానైన, ఒకఁడొకఁడే=ఒకొక్కయింద్రియమే, ఒక్కటికిఁ= ఒకదానికి, ఒక్కటి=ఒకటే, గ్రహింపఁబడి=తెలిసికొనఁబడి, ప్రకటములైనభాతిఁ= ఏవిధముగ ప్రసిద్ధములైనట్లు, సచ్చిదాదులు=సచ్చిదానందములుమూఁడును, పరభావములై=

పర=పరబ్రహ్మమందలి, భావములై=స్వభావములై, తగన్ = ఒప్పును, ఆత్మకున్= అంతఃకరణమునకు, అవి=ఆ సచ్చిదానందములు, వేఱువేఱుగన్ = భిన్నభిన్నములుగాను, ప్రమాదముచేన్=చిత్తభ్రమచేతను, ఎంతయున్=మిక్కుటముగా, కనన్=తెలిసికొనుటకు, తోఁచున్=కనఁబడును.

తా. ఒకపుష్పమందుండెడి రూపరసగంధాదులు అయిదును పంచేంద్రియములలో ఒక్కొక్కదానినే గ్రహించును. అలాగుననే సచ్చిదానందములు స్వభావములై కూడియుండినను బుద్ధిభ్రమచేత వేఱువేఱుగాఁ దోఁచునని తాత్పర్యము. అనఁగా పువ్వు ఒక్కటియేయైనను దానియొక్క ఆకారమును కన్నుచేతను, రుచిని నాలుకచేతను, వాసనను ముక్కుచేతను, స్పర్శమును హస్తముచేతను, యిది పుష్పమను పేరును వాక్కుచేతను అనఁగా పంచభూత సంబంధములైన జ్ఞానకర్మేంద్రియముల అన్యోన్యమేళనములుగలిగిన అయిదింటిచేతను తెలిసికొనినటులు పరబ్రహ్మమందలి అభిన్నములైన సచ్చిదానందములు మూఁడును అంతఃకరణమందలి త్రిగుణభేదములచే వేవ్వేఱుగాఁ దోఁచఁబడుచున్నవని భావము. మఱియు వాక్కునకు, శ్రోత్రేంద్రియమునకు, త్వగింద్రియమునకు, హస్తమునకు, చక్షురింద్రియమునకు, పాదమునకు, జిహ్వేంద్రియమునకు, గుహ్యమునకు, నాసనకు, ఆసనమునకు సమ్మేళనములని గ్రహించవలయును. బుద్ధిభ్రమలనుటచేత సత్తును అనృతములైన బ్రహ్మాదిపిపీలికాంతము వస్తువులుగాను, చిత్తును ఆయావస్తువుల నామములుగాను, ఆనందము ఆయావస్తువులవలనకలిగెడి సుఖములుగాను, నిత్యమును అనిత్యవస్తువులుగాను, నిర్మలమును అనిర్మలములైన అణవాది పంచమలములుగాను, భిన్నభిన్నములుగా ఆసచ్చిదాదులు బుద్ధిభ్రమచేతఁ దోఁచుననిభావము.

మ. గుణభేదంబుల వృత్తి శాంతము మహాఘోరంబు మూఢం బనన్
గణుతింప న్ద్రివిధంబు లౌఁ దనయ సాక్షాత్కారభావాదు లే
క్షణమం దొక్కటిగా వెలింగినలసత్సచ్చిత్సుఖంబు ల్మది
న్బ్రణుతింప న్నుమదుక్తవృత్తిగతుల న్భాసిల్లు భిన్నంబులై.

టీ. తనయ=కుమారా, వృత్తి=అంతఃకరణవృత్తి, గుణభేదంబులన్-గుణ=సత్త్వరజస్తమోగుణములయొక్క, భేదంబులన్=వేఱుపాటులచేతను, శాంతము=శాంతవృత్తియనియు, మహాఘోరంబు-మహత్=అతిశయమైన, ఘోరంబు=ఘోరవృత్తియనియు, మూఢంబు=మూఢవృత్తియనియు, అనన్=అనునట్లుగాను, గణుతింపన్=ఆలోచింపఁగా, త్రివిధంబులు=మూఁడువిధములు, ఔన్=అగును, సాక్షాత్కారభావాదులు-సాక్షాత్కార = అపరోక్షపరబ్రహ్మమందలి, భావాదులు (సచ్చిదానందములనెడి) స్వభావములు, ఏక్షణమందున్=ఏసమయమందును, ఒకటిగాన్=ఒకటిగా, వెలింగినన్=ప్రకాశించినను, లసత్సచ్చిత్సుఖంబు-లసత్=ఒప్పుచుండెడి, సచ్చిత్సుఖంబులు = అపరబ్రహ్మ

మందలి సచ్చిదానందములు మూఁడును, సుమహక్షృప్తిగతులకాంతులోక్సగా, మత్ = నాచేతను, ఉక్త=చెప్పఁబడిన, వృత్తి = శాంత ఘోర మూఢ వృత్తులయొక్క, గతులక=మార్గములచేతను, మదిక=మనస్సునందు, ప్రణుతింపక = స్తోత్రముచేయునట్లుగాను, భిన్నంబులై = వేఱు వేఱై, భాసిల్లుక=ప్రకాశించును.

తా. కుమారా! ప్రకృతిసంబంధములైన సత్త్వరజస్తమోగుణభేదములచేత అంతఃకరణవృత్తులైన శాంతఘోరమూఢములనియెడి వృత్తులు మూఁడువిధములగును. పరబ్రహ్మమందు సచ్చిదానందములుమూఁడును ఒక్కటేస్వభావముగా ఎల్లప్పుడు ప్రకాశించినను పైన నాచేఁజెప్పఁబడిన వృత్తిభేదములచేత భిన్నములై ప్రకాశించునని తాత్పర్యము. ప్రకృతిఅనఁగా త్రిగుణములకూటమి. అది తెలుపు,ఎఱుపు, నలుపురంగులుగల మూఁడుదారములను కలిపిపేనిన త్రాడువంటిది ఆత్రాడు నిలువెల్ల మూఁడువిధములగు రంగులచే భేదపడి ఏరంగుతట్టుతిరిగినప్పుడు ఆరంగు ప్రకాశించినట్లు ప్రకృతియు సత్త్వరజస్తమోగుణభేదములచే అంతఃకరణమందు పెనవేసికొని శాంత, ఘోర, మూఢవృత్తులతోఁగూడి ఆయావృత్తులతట్టు తిరిగినప్పుడు ఆయాగుణములు ప్రకాశించుచున్నవి. ఆ త్రిగుణభేదములను తీసివేసిన నిర్మలమైన అంతఃకరణము నిలుచుచున్నది. ఆనిలిచిన అంతఃకరణము పరబ్రహ్మమందు లీనమగుచున్నదని భావము. అనఁగా మూలప్రకృతి పరబ్రహ్మమందు చంద్రునియందలి చంద్రికవలె అభిన్నముగనుండి మలినసత్త్వస్వభావముచేత సత్త్వరజస్తమోగుణములే స్వరూపముగఁ గలదై సత్త్వగుణమునందు శాంతవృత్తియు, రజోగుణమునందు ఘోరవృత్తియు, తమోగుణమునందు మూఢవృత్తియుఁగలిగి వ్యాప్తిచేయుచు పుట్టించుచు నశింపఁజేయుచు నుండునని భావము. ఈవృత్తిభేదములు మొదటిప్రకరణమందుఁ జక్కఁగ వ్రాయఁబడినవి.

మ. జడసాలోపలమృత్తుల న్వెలయుఁ దత్సద్రూప మామూఢత
న్గడుఁ గామాదివికారఘోరమున మోదంబొప్ప దల్లాటఁ జొ
ప్పడుసచ్చిత్సుఖము ల్ప్రశాంతమున నీభావంబు వాటిల్ల న
ప్పుడుఘోరంబతిమూఢముందొలఁగఁదాఁబొల్చునుసుఖం బాత్మలోన్.

టీ. ఆమూఢతక = ఆమూఢవృత్తిగల, జడ=అజ్ఞానస్వరూపములయిన, సాల=వృక్షములయందును, ఉపల=రాళ్ళయందును, మృత్తులక=మంటియందును, తత్=ఆపరబ్రహ్మమందలి, సద్రూపము=సల్లక్షణము, వెలయుక=ప్రకాశించును, కడుక=మిక్కిలి, కామ=కామమే, ఆది=మొదలుగాఁగల, ఘోరమునక=ఘోరవృత్తియందు, మోదము=ఆనందస్వరూపము, ఒప్పదు=ప్రకాశింపదు, అల్లాటక=అప్రకారమవుటచేతను, చొప్పడుం=వెలఁగుచుండెడి, సచ్చిత్సుఖములు=సల్లక్షణ చిల్లక్షణ ఆనందలక్షణములు అను మూఁడును, ప్రశాంతమునక=శాంతవృత్తియందు, (అగునని|అధ్యాహారము) ఈ

భావంబు=ఈ సచ్చిదానందస్వరూపస్వభావము, పొటిల్లన్=ప్రకాశించినను, ఎప్పుడు=ఏకాలమందు, ఘోరంబు=ఘోరవృత్తిగాను, అతి=మిక్కుటమయిన, మూఢంబున్=మూఢవృత్తియును, తొలంగున్=విడుచునో, తాన్=(అప్పుడు) తాను, ఆత్మలోన్=అంతఃకరణమందు, సుఖంబు=సచ్చిదానందస్వరూపము, పొల్చున్=ప్రకాశించును.

తా. అజ్ఞానస్వరూపములయిన మూఢవృత్తిగలవృక్షములయందును, రాళ్ళయందును, మంటియందును అపరబ్రహ్మమందలి సద్రూపము ప్రకాశించును. కామాది ఘోరవృత్తియందు ఆయానందస్వరూపము ఒప్పదు. (అనఁగా సత్తుచిత్తులు రెండేయుండును) గనుక వెలుఁగుచుండెడి సచ్చిదానందలక్షణములు మూఁడును శాంతవృత్తియందు ప్రకాశించునని భావము. ఈసచ్చిదానందస్వరూపస్వభావము ప్రకాశించినను ఘోరమూఢవృత్తులు విడిచినప్పుడు ప్రత్యగాత్మస్వరూపుఁడైన తాను అంతఃకరణమందు ఆనందస్వరూపముచే ప్రకాశించునని తాత్పర్యము.

॥శ్లో. వికారాఖ్యాయమానో౽పి ప్రత్యగాత్మాన మంతరా, ననిరూప్యో౽స్త్యణురపి స్యాచ్ఛేచ్చిత్సమ ఆత్మవత్" అను స్మృత్యర్థముచొప్పున ప్రపంచ మెంత వికారముగాఁ గనఁబడినను ఆప్రపంచము నేనే యనెడు ప్రత్యగాత్మకు అణుమాత్రమైనను వేఱుకాదు గనుక అది వేఱు నీవు వేఱు అను భేదబుద్ధిని జెందక సర్వము నీవే యని తెలిసికొనుమని భావము.

అవతారిక:—సచ్చిదానందలక్షణములు ఎట్టివియని శిష్యుఁడడిగెడి ప్రశ్నకు ఉత్తరము చెప్పఁబడుచున్నది.

మ. నరరూపంబునఁ జూడఁగల్గె నిను విన్నాణంబుగా మానముల్
కర మేలాగనఁ దత్సదాదుల కగు న్గాలత్రయాబాధ్యమై
పరఁగు న్సత్తగుఁ జిత్తు చిజ్జడముల న్భావింపఁ ద్వన్మేధచే
ధరఁ గామానుభవప్రమోదముగతి న్దత్త్వజ్ఞ యానందమా. ౧౧౩

టీ. ధరన్=భూమియందు, నినున్=నిన్నును, విన్నాణంబుగాన్=లెస్సగా, నరరూపంబునన్=మనుష్యాకృతిగాను, చూడఁగల్గెన్=మామటకు ప్రాప్తించెను, తత్సదాదులకున్-తత్=అపరబ్రహ్మలక్షణములైన, సత్=సద్రూపమే ఆదులకున్=మొదలుగాగలచిద్రూపఆనందరూపములను మూఁటికిని, కరము=మిక్కిలి, మానములు=ప్రమాణములు, ఏలాగు=ఎవ్విధము, అనన్=ఈప్రకారము శిష్యుఁడడుగఁగా, కాలత్రయాబాధ్యమై-కాలత్రయ=భూతభవిష్యద్వర్తమానములగు మూఁడుకాలములయందును, అబాధ్యమై=బాధలేనిదై, సత్తు=సద్రూపము, పరఁగున్ = ఒప్పును, త్వన్మేధచేన్-త్వత్=నీయొక్క, మేధచేన్=తెలివిచేత, చిజ్జడములు-చిత్=జ్ఞానమును, జడములు = అజ్ఞానమును, భావింపన్=పరిశోధించిచూచిన, చిత్తగున్ = చిద్రూపమగును, తత్త్వమునుదెలిసిన

శిష్యుఁడా, కామానుభవప్రమోదముగలిగె౯ - కామానుభవ=స్త్రీపురుషసంయోగసమయమునకలిగెడి, ప్రమోదముగలిగె౯ = గొప్పసంతోషమువలె, ఆనందము= (సత్పదచిత్పదసముదాయైక్యముగు) బ్రహ్మానందము, అగు౯=అగును.

తా. పరబ్రహ్మస్వరూపముచేత కర్మచక్షుస్సులకు అగోచరమైనవాఁడవై నాయందు ప్రేమచేత కృతార్థునిచేయవలయునని మనుష్యరూపమును ధరించివచ్చిన నిన్ను మాచుటకులభించెను. పరబ్రహ్మమందలి సల్లక్షణ చిల్లక్షణ ఆనందలక్షణములను మూటిని తెలియఁజేసెడి ప్రమాణములేలాగని శిష్యుఁడడుగఁగా, త్రికాలాబాధ్యమైనదే సద్రూపము. బుద్ధిచేత జ్ఞానాజ్ఞానముల పరిశోధించఁగా తెలియఁబడునదే చిద్రూపము. స్త్రీ సంభోగ కాలమునందుఁ దోఁచినసుఖమువలె సచ్చిత్తుల ఐకమత్యమందుఁగలిగిన సంతోషమే బ్రహ్మానందమని తాత్పర్యము.

నరరూపంబున౯ అనుటచేత బ్రహ్మస్వరూపముచేత నని యర్థము. ''రిష్యతే క్షీయత ఇతి రః. రిజ్ క్షయే ధాతుః, సనభవతీతినరః'' అనివ్యుత్పత్తి. ''అవినాశాత్మా'' యని శ్రుతి గనుక నరుఁడనఁగా నాశములేని పరబ్రహ్మమని భావము. కాలత్రయాబాధ్యమైయనుటవలన ఆసప్రాప్తుఁడగు ఆత్మను మొందుచెప్పిన తెలుఁగున అనాదిత్వ,నిత్యత్వ, అదేహిత్వములు కలిగి యుండుటంజేసి భూతభవిష్యద్వర్తమానకాలములచేత బాధలేనిదై యని యర్థము. శోధయనఁగా విన్నవానినన్నిటిని మఱవకయుండుబుద్ధి. ధరఁ గామానుభవప్రమోదముగలిగె౯ అనుటవల్ల లోకమందు పురుషులకు స్త్రీల సంభోగసమయమునఁ గలిగెడి ఆనందముకంటె వేఱొండులేదని అనుభవసిద్ధము. గనుక అట్టి ఆనందమువంటి దని చెప్పఁబడెను. స్త్రీపురుషులు వేర్వేరైనప్పుడు ఆనందముకలుగనిరీతిని సత్తుచిత్తులు వేరైనప్పుడు ఆనందము ఉదయించదనియు, వారు కలసినకాలమందు కలిగిన సుఖమువలె సత్తుచిత్తులుగూడిన ఆనందము కలుగుననియు ఉపమానముగాఁ జెప్పఁబడినది. భూతకాలమనఁగా ''సృష్టేః పూర్వం యః కాలోవర్తతే స భూతకాలః'' అనఁగా సృష్టికిముందే కాలమున్నదో అదేభూతకాలము. సృష్టినిరసనమగు భవిష్యత్కాలము. సృష్టిఉండునప్పుడు వర్తమానకాలము. ఈమూఁడుకాలములచేత బాధ్యబాధకములులేక ప్రవర్తించునది సత్పదార్థమని యెఱుంగునది.

అవ:—ఆత్మ సచ్చిదానందమనుటకు అనుభవమును శిష్యుఁడడుగుచున్నాఁడు.

మ. అసదంగాన్వితుఁడైన దేహి గురువేదాంతైక్యవాక్యార్థము
లెవ్వెస సచ్చిత్సుఖచిహ్నవస్తులుగ నీవే యంచు బోధించిన
న్గనిఁ గోశాంగనికుంజము ల్వెలువునాగంబట్టు లీవైతి వీ
రసఁదచ్చిహ్నములెట్లుఛాత్రుని యెడ ప్రాణించుఁ దెల్పందగు౯.

టీ. అస... దేహి౯-అసత్ = నశించుటకుఁదగిన, అంగ = (స్థూలసూక్ష్మకారణ) శరీరములతో, అన్వితుఁడు=కూడియుండువాఁడు, అయినదేహి౯=అయినట్టి విదాభాసు

ని, గురు...ములు-గురు=ఆచార్యునియొక్క, వేదాంత=ఉపనిషత్తులయొక్క, విశ్వవాక్య=ఉపదేశమహావాక్యములయొక్క, అర్థములు=తాత్పర్యములు, వెసన్ = మిక్కిలి, సచ్చి...స్తువు-సత్ = త్రిపరిచ్ఛేదశూన్యమగు సద్రూపముయొక్కయు, సుఖ=దుఃఖరహితమగు ఆనందముయొక్కయు, చిహ్న=లక్షణములతోఁగూడిన, వస్తువు=పరబ్రహ్మము, ఒగిన్=క్రమముగా, నీవేయంచున్=నీవేయని, బోధించినన్=తెలియఁబఱిచినను, కని...జములు-కనిన్ = కోపముచేతఁ, కోశ = పంచకోశములతోఁగూడిన, అంగ=(స్థూల సూక్ష్మకారణ) శరీరములనెడు, నికుంజములు = పొదరిండ్లను, చెఱుపు=నాశముచేయు, నాగంబట్టులన్=ఏనుఁగువలె, ఈవు = సమానమైననీవు, ఈత...చిహ్నములు-ఈతలన్=ఈభూమియందు, తచ్చిహ్నములు-తత్=ఆపరబ్రహ్మముయొక్క, చిహ్నములు=లక్షణములు, ఛాత్రునియెడన్ = శిష్యునియందు, ఎట్లు=ఏప్రకారము, రాజించున్=ప్రకాశించును, తెల్పందగున్=తెలియఁజేయనగును.

తా. కోపముచే పంచకోశాన్వితమగు స్థూలసూక్ష్మకారణశరీరము లనెడి పొదరిండ్లను నాశముఁజేయునట్టి మదపుటేనుఁగువంటివాఁడవగు గురుస్వామీ? నాశకరఁబగు దేహత్రయముతోఁ గూడియుండునట్టి చిదాభాసుని, ఆచార్యునియొక్కయు, ఉపనిషత్తులయొక్కయు, ఉపదేశ మహావాక్యముల తాత్పర్యములు. త్రిపరిచ్ఛేదశూన్యమగు సద్రూపముయొక్కయు, జడరహితమగు చిద్రూపముయొక్కయు, దుఃఖరహితమగు ఆనందముయొక్కయు, లక్షణములతోఁగూడిన పరబ్రహ్మము నీవేయైతివని బోధించినను ఈ భూమియందు ఆపరబ్రహ్మముయొక్క లక్షణములు శిష్యుఁడవైన నాయందు యేప్రకారము ప్రకాశించునో తెలియఁజేయవలయునని తాత్పర్యము.

అవ:—ఆత్మ స్వరూపమనుటకు అనుభవమును జెప్పుచున్నాఁడు.

చ. గతభవసంచితత్రివిధకర్మములన్ ద్రిపదత్రికాలయో
గ్యతలకునైనకాయముల నందుచుఁ బాయుచునుండుదేహి నం
తతము నతండె సత్తగు సుతా కను మాత్మవిచారదృష్టిసం
గతమతి స్వానుభూతిని బ్రకాశము నొందుచు నిర్వికారతన్.

టీ. సుతా=కుమారా, గతభవసంచితత్రివిధకర్మములన్-గత=జరిగిపోయిన, భవ=పుట్టువులయందు, సంచిత=సంపాదించిచేర్పఁబడిన, త్రివిధ=(పుణ్యమిశ్రపాపములనెడు) మూఁడువిధములైన, కర్మములన్=కర్మములచేతను, త్రిపద = (స్వర్గమర్త్యనరకములనెడు) మూఁడువిధములైన స్థానములయందును, త్రికాల=భూతవర్తమాన భవిష్యత్కాలములయొక్క, యోగ్యతలకున్=తగినవడతలకు, ఐనకాయములన్-ఐన=తగిన, కాయములన్=(దేవమనుష్యయాతనములనెడి త్రివిధ) శరీరములను, అందుచున్=పొందుచును,

పాయుచుఁ=విడుచుచును, సంతతము=ఎల్లప్పుడును, దేహీ = అట్టిదేహములను పొందుచుండెడి చేతనుఁడు, ఉంటుఁ=నివసించియుండును, అతండె = ఆవ్యావహారికజీవుఁడే, సత్తగుఁ=సద్రూపమగును, ఆత్మవిచారదృష్టిసంగతమతిఁ...ఆత్మవిచారదృష్టిఁ-ఆత్మవిచార=బ్రహ్మవిచారమందలి, దృష్టిఁ = ఆలోచనచేతను, సంగత=కూడిన, మతిఁ=తెలివివలనఁగలిగిన, స్వానుభూతిఁ=అనుభవమందు, నిర్వికారతఁ = షడ్వికారశూన్యత్వముచేతను, ప్రకాశమునొందుచుఁ=వికసనము పొందుచును, కనుము=నీవు చూడుము.

తా. పుత్త్రుఁడా? ముందుజన్మములయందు ఆర్జింపఁబడిన పుణ్యపాప మిశ్రములనెడు త్రివిధకర్మములచేతను, స్వర్గమర్త్యనరకములనెడు మూఁడు లోకములయందలి త్రికాలములకు తగినవడపుల్లుగల మూఁడుశరీరములను పొందుచును వీడుచును ఈ దేహి యెల్లప్పుడు నుండును గనుక నితఁడే సద్రూపమగును. బ్రహ్మవిచారమందలి ఆలోచనతోఁగూడిన తెలివివలనఁ గలిగిన నీ అనుభవమందు షడ్వికార శూన్యత్వముచేత వికసన మొందుచునుండెడి సద్రూపమును నీవు కనుమని తాత్పర్యము.

షడ్వికారములనఁగా గర్భములోనుండుట, పుట్టుట, పెరుఁగుట, ముదియుట, చిక్కుట, చచ్చుట, అనెడు ఆఱువికారములు. అట్టివికారములులేక ప్రకాశించెడి సత్తే నీవని తెలియుము. ‌‌॥శ్లో. యతస్సర్వాణి భూతాని ప్రతిభాంతిస్థితానిచ, యత్రైవోపశమంయాంతి తస్మైసత్యాత్మనేనమః॥ అనఁగా ఏసత్తునుండి సమస్తప్రాణులు అయినట్టుగాను, వృద్ధిపొందినట్టుగాను, లయించినట్టుగాను తోఁచుచున్నవో ఆసద్రూపమునకు నమస్కారమని వాల్మీకులవారు బృహద్వాసిష్ఠమందు చెప్పియున్నారు. దేహియనఁగా దేహత్రయవిలక్షణుఁడైన ఆత్మ. అట్టి ఆత్మ అవస్థాత్రయములకుసాక్షియై పుణ్యపాప మిశ్రకర్మంబులచేత స్పృశింపఁబడనివాఁడై కాలత్రయాబాధ్యుఁడైయుండి ప్రకాశించుచున్నాఁడు. గతభవసంచిత అనుటచేత ॥శ్లో. పంచీకృతమహాభూత సంభవం కర్మసంచితమ్, శరీరం సుఖదుఃఖానాం భోగాయతనముచ్యతే॥ అనునట్లు పంచీకృత భూతకార్యమై పూర్వజన్మములయందు ప్రారబ్ధకర్మములచేత సంభవించిన సుఖదుఃఖముల కర్హములైన శరీరములనుపొందును. త్రివిధకర్మములఁ,అనఁగా ॥త్రివిధైరేవకర్మైః పుణ్యం పాపంచమిశ్రకమ్, క్రియతేనయయాకర్మ త్యేవంబుద్ధి ర్వివ్యముచ్యతే॥ యను శ్లోకార్థము చొప్పున మూఁడువిధములయిన కాయిక వాచిక మానసికములనెడి కరణములచేతఁ జేయఁబడిన కార్యములు పుణ్యకర్మములని, పాపకర్మములని, మిశ్రకర్మములని మూఁడు విధములు. ఈమూఁడువిధములగు కర్మములచేత దేవ యాతన మనుష్యశరీరములు సంప్రాప్తమగును. కాఁబట్టి కర్మఫలముల తారతమ్యములను విచారణముచేసినంతట ఈ త్రివిధ కర్మములను తాదాత్మ్యసంబంధముల త్రివిధకరణములే చేయుచున్నవని తెలియును. అప్పుడు ఏనిర్వికారమైన సాక్షిస్వరూపము శేషించుచున్నదో అదియే సద్రూపము. ఆ

సద్రూపమే ప్రత్యగాత్మస్వరూపుఁడవైన నీవని నిశ్చయించుకొనుమనిభావము. కాయికపుణ్యము, కాయికపాపము, కాయికమిశ్రమము, వాచికపుణ్యము, వాచికపాపము, వాచికమిశ్రమము, మానసికపుణ్యము, మానసికపాపము, మానసికమిశ్రమము అని ఆ త్రివిధకరణములయందు తొమ్మిదితెఱంగులుకలవని ఎఱుంగునది.

కాయికపుణ్యమనఁగా: దేవతలను, బ్రాహ్మణులను, గురువులను, పండితులను, పూజించుటయును. మృత్తిక, జలము మొదలగువానిచేత బాహ్యశౌచములఁ జేసికొనుటయును. ఇంద్రియములను స్వేచ్ఛగాపోనియ్యక ఋజుభావముగా నిలుపుకొనుటయును. కృఛ్రచాంద్రాయణాది నిత్యనైమిత్తిక వ్రతోపవాసాదులచేత ఈశ్వరభక్తికలిగియుండుటయును మొదలగునవి. కాయికపాపమనఁగా: ఈడనీశ్వరుఁడొకఁడున్నాఁడని తెలియక పైనిజెప్పిన పుణ్యకార్యములవిడిచి పంచమహాపాతకములను పంచోపపాతకములను పంచసూనలను జేయుటయును ఎల్లప్పుడు జీవహింససలుపుచు పరాన్నముభుజింపుచు పరదారసంగమముచేయుచు చౌర్యము జూదము మొదలైన సకల దుష్కార్యములయందు ప్రవర్తించుటయును. కాయికమిశ్రమమనఁగా: మంచిపనులు గొన్నిటిని జేయువానివలె వెలుపలికిఁ దోఁపింపఁచేయుచు కపటవేషములను ధరించుకొని సంచరించుట వాచికపుణ్యమనఁగా: విధ్యుక్తవేదశాస్త్రాధ్యయనములను గాయత్ర్యాది మంత్రజపములను జేయుచుండుట. వాచికపాపమనఁగా: పైని జెప్పినవానినివదలి శ్రుతిగర్హితములైన నీచభాషల నభ్యసించుట దుర్భాషలాడుట మొదలగునవి. వాచికమిశ్రమమనఁగా: అవిధ్యుక్తములుగాఁజదువుట విధ్యుక్తములవిడుచుట. మానసికపుణ్యమనఁగా: మనస్సునందు సగుణనిర్గుణ చింతనములఁజేయుచుండుట. మానసికపాపమనఁగా: రాగద్వేషాది దుర్వృత్తులను కూరచింతనలను చెడుతలంపులను గలిగియుండుట. మానసికమిశ్రమమనఁగా: పైనిజెప్పిన మానసికపుణ్యపాపముల రెంటిని తెలిసినవానివలె నటించుట.

అవతారిక:—ఆత్మచిద్రూపమనుటకును, ఆనందస్వరూపమనుటకును అనుభవమును జెప్పుచున్నారు.

ఉ. ధ్వాంతసుషుప్తులందు శుచిధామము లేనితఱి న్మహాభ్రమ
స్వాంతుఁడుగాక వస్తువుల సంతమసంబునెఱుంగుచున్నవాఁ
డెంతయుఁ జిత్స్వరూప మగు నిచ్చకుమీఱినతాను దానయై
సంతసమందియేమఱక స్వానుభవంబుననున్నఁదోమహా. ౧౧౮

టీ. ధ్వాంతసుషుప్తులందుఁ-ధ్వాంత = కాఱుచీఁకటితోఁగూడిన, సుషుప్తులందుఁ = నిద్రించుసమయములందును, శుచిధామములేనితఱిఁ = అగ్నివెలుఁగులేనివేళను, మహాభ్రమస్వాంతుఁడుగాక-మహాత్ = గొప్పయగు, భ్రమ = మోహముతోఁగూడిన,స్వాం

తుఁడు = మనస్సుగలవాఁడు, కాక=కానివాఁడై, వస్తువులన్ = ఇంటఁగలిగినవస్తువుల నన్నిటిని, సంతిమసంబున్=కటికచీఁకటిని, ఎఱుంగుచున్నవాఁడు = తెలిసికొనినపురుషుఁడు, ఎంతయున్=మిక్కిలి, చిత్స్వరూపమగున్=చిద్రూపమగును, ఇచ్ఛకుమీఱిన తాను=కోరికకుఅతిశయించినతాను, తానయ్యె=తానేఅయి, సంతసమంది=సంతోషమును పొంది, ఏమఱక=దానినివిడువక, స్వానుభవంబుననున్న న్-స్వానుభవంబునన్ = తన అనుభవమందు, ఉన్కన్=తానుండినను, తోషమాన్=ఆనందమగును.

తా. కటికచీఁకటిలో నిద్రించుకాలమందును దీపములేనికాలమందును గొప్ప భ్రమనుపొందక యింటఁగలిగినవస్తువులను చీఁకటిని ఈరెంటిని తెలిసికొనినపురుషుఁడు చిద్రూపుఁడగును. కోరికకు అతిశయించిన తాను తానై సంతోషమునుపొంది దానినివిడువక తన యనుభవమందు తానుండినసంతోషమే ఆనందమగునని తాత్పర్యము.

చిత్స్వరూపమనఁగా:—చిత్తునకు ఐక్యాంతరములేని చిన్మాత్రస్వరూపము. అనఁగా జ్ఞానస్వరూపము. ఒకమనుష్యుఁడు గాఢాంధకారములో నిద్రించుచుండి మఱి యొకఁడువచ్చి నిదురలేపి వానివద్దనిచ్చియుండిన యొకవస్తువునడిగితే యాచీఁకటిలోని వాఁడు భ్రమఁజెందక యావస్తువును పెట్టినచోటికిపోయి గురుతుగా నావస్తువునుతెలిసి కొని తెచ్చియిచ్చినట్లు చీఁకటిని వస్తువును తెలిసికొనినవాఁడే చిద్రూపుఁడు. అనఁగా జగద్వ్యాపారములయందుఁ బ్రవేశించినపురుషుఁడు వానియందుభ్రమపడక బ్రహ్మజ్ఞాన నిష్ఠయందు బుద్ధిని స్థిరపఱచువాఁడనిభావము. ఆ చిద్రూపుఁడే సద్రూపుఁడనియు, ఆన ద్రూపుఁడే ఆత్మయనియు, ఆ యాత్మయే తానని యెఱుఁగవలయును.

తోషమాన్ అనఁగా ప్రమోదముకలుగుననిభావము. ప్రమోదమనఁగా తనకు లభించిన బ్రహ్మజ్ఞానమును అనుభవమునకుఁ దెచ్చుకొనినపిదప కలిగినసంతోషము ఇది యేఆనందము. ఇట్లనుటచేత ప్రత్యగాత్మస్వరూపుఁడైన తానే ఆపరమాత్మయనిఎఱిఁగి దేశకాలవస్తువులచేతను అపరిచ్ఛిన్నుఁడుగాఁ నిర్వికారుఁడై సత్తునకు ఉపాధితప్ప సదం తరములేదు. గాన రజ్జుసర్పములవలె వివర్తముచేత సర్పభ్రమతొలఁగి రజ్జు నిలిచినట్లు సత్తే చిత్తై ఆసత్తు చిత్తుల ఐకమత్యమే ఆనందమగును. అవి తెలిసినవాఁడే బ్రహ్మానందమును బొందినవాఁడని భావము. ౹౹ఆనందో బ్రహ్మేతి౹౹ అను శ్రుత్యర్థప్రకారము అట్టి ఆనం దమే బ్రహ్మమని తెలియవలయును. ౹౹శ్లో. స్ఫురంతి శీకరాయస్మాదానందస్యాంబరే వనౌ, సర్వేషాంజీవనంతస్మై బ్రహ్మానందాత్మనేనమః, జ్ఞాతౄజ్ఞానంతిథాజ్ఞేయం ద్రష్టా దర్శనదృశ్యభూః, కర్తాహేతుః క్రియా యస్మా త్తస్మై జ్ఞప్త్యాత్మనేనమః౹౹ అనఁగా జ్ఞాతృజ్ఞానజ్ఞేయములు ద్రష్టృదర్శనదృశ్యములు కర్తృహేతుక్రియలు ఇవియన్నియు చిత్తువలన నయినందున కార్యకారణము లభిన్నములగుచున్నవి. గనుక చిద్రూపమేయని భావము. ఏ ఆనందసముద్రమువలన ఉదకకణములుకొన్ని ఊర్ధ్వముఖముగా ఆకాశ

మామీఁదికి కొన్ని అధోముఖముగా భూమిమీఁదికి మఱికొన్ని పార్శ్వములయందును పడుచున్నవో అవే దేవమనుష్యక్రిమికీటకాది సమస్తప్రాణులుగా నగుచున్నవి. గాన నన్నిటికిని ఆ యానందమే ఆధారమని భావము.

అవతారిక:—సుఖసాధనములయందు ప్రియముండినట్లు ఆత్మయందు ప్రియముండినను అది ఆనందమునకు సాధనముకాదా అనినను ఆప్రకారమగుటకు అనుభవము చెప్పుచున్నారు

ఉ. హేతువు లంద నందఱకు నిష్టము లన్నరసాదు లాత్ముఁ డా
రీతిఁ బ్రమోదహేతు వన రిత్త త్వదుక్తి కుమార కాన ని
ర్హేతుక మైనయాత్మ కొకహేతువు గల్గునె త్వత్సుఖంబు నీ
కేతఱి భిన్నమా వెనుక నెవ్వఁడు వేఱొకఁ డుండు దానికిన్. ౧౧౭

టీ. కుమారా=శిష్యుఁడా, అందఱకున్ = ఎల్లవారికిని, అందన్ = పొందుటకు, అన్నరసాదులు-అన్న=అన్నమును, రస=రసమును, ఆదులు = ఇవి మొదలుగాఁగల, ఇష్టములు=ఇష్టములైనభోజనద్రవ్యాదులు, హేతువులు = ఆనందమునకు కారణములు, ఆత్ముఁడు=పరమాత్మ, ఆరీతిన్=ఆప్రకారముగాను, ప్రమోదహేతువు-ప్రమోద=బ్రహ్మానందమునకు, హేతువు=కారణము, అనన్ = ఇట్లని శిష్యుఁడడుగఁగాను, త్వదుక్తి= నీవుచెప్పెడిమాట, రిత్త=వ్యర్థము, కానన్=కాఁబట్టి, నిర్హేతుకమైనయాత్మకున్ = ఒక హేతువులేని పరమాత్మకు, ఒక హేతువుగల్గునె = ఏయొక్క కారణమైననుండునా, (అనఁగా లేదనుట) త్వత్సుఖంబు-త్వత్=నీయొక్క, సుఖంబు = ఆనందము, నీకున్= ప్రత్యగాత్మస్వరూపుఁడవైననీకు, ఏతఱిన్=ఏకాలమందు, భిన్నమా౯ = నిన్నువిడిచి వేఱైనదగును. వెనుకన్=పిమ్మటను, వేఱొకఁడు = ఇతరుఁడైన మఱియొకఁడు, దానికిన్ = ఆ యానందమునకు, ఎవ్వఁడు = ఎవఁడు, ఉండున్ = ఉండును, (అనఁగా లేదనుట ]

తా. శిష్యుఁడా! ఎల్లవారికిని ఇహలోకసుఖమును పొందుటకు అన్నరసాదులు మొదలగునవి కారణములుగదా; ఆరీతినే బ్రహ్మానందమునకు కారణముండునన అది అసత్యము. హేతువులేని ఆనందరూపమైన పరబ్రహ్మవస్తువునకు మఱియొకకారణ ముండునా? (లేదనుట) ప్రత్యగాత్ముఁడవైన నీకు నీసంతోషము వేఱైనదగునా? కాదు. పిమ్మట నీసుఖమునకు నెవఁడున్నాఁడు? నీవేయని తాత్పర్యము. అనఁగా ॥శ్లో॥. ప్రత్యగాత్మస్వరూపేణ దృశ్యరూపే ణచస్వయమ్, వ్యాప్యవ్యాపకనిర్దేశో హ్యనిర్దేశోఽ వికల్పితః॥ అనెడు భాగవతశ్లోకార్థముచొప్పున ప్రత్యగాత్ముఁడవైన నీవును నీచేచూడఁబడుదృశ్యప్రపంచమును రెండును ప్రత్యగాత్ముఁడవైన నీవేగాని వేఱుగాదని దృఢముగా తెలిసికొంటివేని అయానందస్వరూపము నీవేయని భావము.

అవతారిక:—ఆత్మ ఆనందస్వరూపమైనను పరోక్షముగా అనుభవించెడి ఆనందము అది కాదని చెప్పుటకు అనుభవమును చెప్పుచున్నారు.

మ. విషయానందము తోఁచితోఁచి చనును నివ్వేళ్లార స్వల్పంబునై
మిషచే దాని గ్రహింపమానఁదగు నాత్మీయంబుగా దట్టిలీ
సుషమాత్మీయము మానఁబూన నెవరీ క్షోణిన్సమర్థు ల్సుతా
విషయానందము మానికాంచు మది నావిజ్ఞానసమ్మోదమున్.

టీ. సుతా=కుమారా, విషయానందము = ఇంద్రియేచ్ఛలవలనఁగలిగిన సంతోషము, ఉవ్వేళ్లాన్=ఆయాకాలములకు ఒప్పినదొట్టుగాను, మిషచేన్=నెపముచేతను, స్వల్పంబునై=కొంచమై, తోఁచితోఁచి=వచ్చివచ్చి, చనున్ = పోవును, దానిన్=ఆ విషయానందమును, గ్రహింపన్=తీసికొనుటకును, మానన్ = విడుచుటకును, తగున్= ఒప్పును, ఆత్మీయంబు = బ్రహ్మానందమైనది, అట్టులు=అప్రకారము, కాదు=కాదు, ఈ సుషమాత్మీయము-ఈ-ఇట్టి సుషమా=శోభాయుక్తమైన, ఆత్మీయము=ప్రత్యగాత్మాభిన్నబ్రహ్మానందము, మానన్=విడుచుటకును, పూనన్=గ్రహించుటకును, ఈక్షోణిన్ =ఈ భూమియందు, సమర్థులు=శక్తిమంతులు, ఎవరు=ఎవరున్నారు, ఎదన్=మనస్సునందు, విషయానందముమాని-విషయానందము = విషయానందమును, మాని = విడిచి, ఆవిజ్ఞానసమ్మోదమున్- ఆ=అట్టి, విజ్ఞాన=బ్రహ్మజ్ఞానమువలన కలిగిన, సమ్మోదమున్ =ఆనందమును, కాంచుము=చూడుము.

తా. కుమారా! జ్ఞానకర్మేంద్రియములవలన కలిగిన సంతోషము (వ్యాజముగా) ఆయాకాలములయందు వచ్చుచుఁ బోవుచు నుండును. ఆవిషయానందమును గ్రహించుటకును విడుచుటకును తగును. బ్రహ్మానందమైనది అప్రకారముకాదు. ఈ శోభాయుక్తమైన బ్రహ్మానందము లోకమందు విడుచుటకును గ్రహించుటకును ఎవరు సమర్థులున్నారు. మనస్సునందు ఈ విషయానందమును విడిచి బ్రహ్మజ్ఞానస్వరూపమైన ఆనందమును చూడుమని తాత్పర్యము.

“సుఖస్యానంతరం దుఃఖం దుఃఖస్యానంతరం సుఖమ్, చక్రవత్ పరివర్తంతే దుఃఖానిచసుఖానిచ” అనునట్లు సుఖదుఃఖములు ఒకదాని వెంబడి నొకటి చక్రమువలె తిరుగుచుండును. కాఁబట్టి వానియందు బుద్ధిని ఊననియ్యక ప్రపంచవిషయమైన అనాత్మభావమునువదలి లోకవ్యవహారవికారశూన్యుఁడవై సముద్రమందుండు నీటిబుగ్గలను తత్కారణంబగు జలంబునుగాఁ జూచినట్లు కార్యంబులగు ప్రపంచవిషయములను తత్కారణంబగు పరబ్రహ్మమేయని తెలిసి బ్రహ్మానందమును జెందుమని భావము.

అవతారిక:—ఆత్మ ఆనందస్వరూపమే దానియందు అనూయ యున్నదనినను అట్లు లేదనుటకు అనుభవమును చెప్పుచున్నారు.

శా. కోపాగ్నిం దముఁ జంపుకొందు మని లోకుల్ చత్తు రీదేహి త
త్తాపజ్వాల మృతంబు నొందెనఁ దాత్పర్యంబుగా దాత్మ దు
ర్వ్యాపారంబున డిందె బొందిసుత దేహంబా న తద్దేహి యా
కోపంబింతకు దేహమందె సుమి తత్కూటస్థుని న్జెందునే. ౧౧౯

టీ. సుతా=కుమారా, లోకులు=జనులు, కోపాగ్నిన్ = కోపమనెడినిప్పుచేతను, తమున్=తమ్మును, చంపుకొందుమని=నాశనము చేసికొందుమని, చత్తురు=గిట్టుదురు, ఈదేహి=ఈ జీవుఁడు, తత్తాపజ్వాలన్-తత్=ఆ, తాప = కోపమువలనఁగలిగిన సంతాపమనెడి అగ్నియొక్క మంటచేతను, మృతంబు=చావును, ఒందెనన్ = పొందెననఁగాను, తాత్పర్యంబుగాదు=అది అర్థముగాదు, ఆత్మ = అంతఃకరణముయొక్క, దుర్వ్యాపారంబునన్=దుష్టప్రవృత్తిచేత, బొంది=శరీరము, డిందెన్=చచ్చెను, తద్దేహి=ఆదేహమందుండిన జీవుఁడు, దేహంబా నె=శరీరమా నా, ఆకోపంబు=ఆ ప్రసిద్ధమైన, కోపంబు=క్రోధము, ఇంతకున్=ఇంతకును, దేహమందేసుమీ = శరీరమందేగదా, తత్కూటస్థునిన్-తత్=ఆదేహమందువ్యాపించిన, కూటస్థునిన్=బ్రహ్మాభిన్న ప్రత్యగాత్ముని, చెందునే=పొందునా.

తా. కుమారా! కోపమనెడి నిప్పుచేతను తమ్మును తామే చంపుకొందుమని లోకులు చచ్చెదరు. ఆకోపమనెడి అగ్నిజ్వాలచేత జీవుఁడు చచ్చెననునది అర్థముకాదు. మానస దుర్వ్యాపారముచేత శరీరము చచ్చెను గాని ఆదేహమందుండిన ప్రత్యగాత్మ చచ్చెనా? ఆకోపము దేహమందే కలిగెనుగాని దేహియందు కలుగలేదు అని తాత్పర్యము.

“తమేవభాంత మనుభాతిసర్వం, తస్యభాసా సర్వమిదంవిభాతి” అను శ్రుత్యర్థము చొప్పున దేహి తనంతటతానే ప్రకాశింపుచు తనయందు ఆరోపింపఁబడిన సర్వజగత్తును తానే తోఁపింపఁజేయుచున్నాఁడని తాత్పర్యము. గనుక మూఢప్రవృత్తిచే నుత్పన్నమైన కోపగుణము దేహమందే పుట్టినందున “దహ్యత ఇతి దేహః” అనునట్లు దేహము దహింపఁబడునదిగావున నది నశించునేగాని దేహమునకు విలక్షణుఁడైన దేహి యొక్కాలమందును నశింపక “నిత్యంవిభుం సర్వగతంసుసూక్ష్మం ఆకాశవత్సర్వగతశ్చనిత్యః, నిత్యో నిత్యానాం చేతనశ్చేతనానాం” అను మొదలయిన శ్రుత్యర్థముల ప్రకారము సర్వవ్యాపిగాను, నిత్యుఁడుగాను, సర్వస్వరూపుఁడుగాను ప్రకాశించుచున్నాఁడని భావము.

అవతారిక:—ఆత్మ చిత్స్వరూపమనుటకును ఆనందస్వరూపమనుటకును అనుభవమును చెప్పుచున్నారు.

మ. అనుతుల్యార్థము కంటె మేలు సుతుఁడౌ నన్నారీతి నొండొంటికం
టె సుతా కాయము ప్రాణ మక్షచయము న్నందంబు ధీజీవముల్

వెసముఖ్యాత్మ ఘనంబులై వెలయు నుర్విన్ వీనిలో మిథ్య పెం
పెసఁగ న్గౌణము ముఖ్యమెక్కుడులు సర్వేశుండు తన్ముఖ్యమౌన్.

టీ. ఉర్విన్=భూమియందు, సుతా=కుమారా, అసుతుల్యార్థముకంటెన్-అసు=ప్రాణముతోడను, తుల్య=సమానమైన, అర్థముకంటెన్=ధనముకన్న, సుతుఁడు=కుమారుఁడు, మేలు=అతిశయుఁడగును, అరీతిన్=అప్రకారముగానె, ఒండొంటికంటెన్=ఒకదానికంటె నొకటి, కాయము=శరీరము, ప్రాణము=దానికంటె ప్రాణమును, అక్షచయమున్=అప్రాణవాయువుకంటెను, అక్ష=జ్ఞానకర్మేంద్రియములయొక్క, చయము=సముదాయమును (ఆసమూహముకంటెను) డెందంబు=మనస్సు, (ఆమనస్సుకంటెను) ధీ=బుద్ధియు, జీవమున్=(దానికంటెను)జీవమును, వెసన్=మిక్కుటముగా, ముఖ్యాత్మ=(ముఖ్యమైన) ప్రత్యగాత్మయు, ఘనంబులై=అతిశయములై, వెలయున్=ప్రకాశించును, వీనిలోన్=ఈ చెప్పఁబడిన ఒకదానికంటె నొకటొకటిచొప్పున గొప్పలైన వీనియందు, మిథ్య=మిథ్యాత్మయు, పెంపెసఁగన్=అతిశయించునట్లుగాను, గౌణము=గౌణాత్మయు, ముఖ్యము=ముఖ్యాత్మము, ఎక్కుడులు=ఘనములు, సర్వేశుండు=పరబ్రహ్మము, తన్ముఖ్యమౌన్,తత్=ఆముగ్గురికంటె,ముఖ్యమౌన్=అతిశయమగును.

తా. పుడమియందు ప్రాణముతోతుల్యమైనది ద్రవ్యము, ద్రవ్యముకంటె మేలైనవాఁడు కుమారుఁడు, కుమారునికంటె ఘనమైనది దేహము, దానికంటె ప్రియమైనది ప్రాణము, దానికంటె ప్రియమైనది యింద్రియసమూహము, దానికంటెముఖ్యమైనది మనస్సు, దానికంటె ప్రియమైనది బుద్ధి, దానికంటెప్రియమైనది జీవము, దానికంటె ముఖ్యమైనదిప్రత్యగాత్మ, దానికంటె ప్రియమైనది పరబ్రహ్మము, ఇన్నింటిలోమిథ్యాత్మయు గౌణాత్మయు ముఖ్యాత్మయు నతిశయములు. ఈ మూఁటికంటెను పరబ్రహ్మము సర్వోత్కృష్టమని తాత్పర్యము.

॥శ్లో. విత్తాత్పుత్రః ప్రియః పుత్రాత్స్వశరీరంతథాప్రియం, ప్రియాః శరీరాత్ స్వప్రాణాః ప్రాణాదాత్మా పరప్రియః॥ ॥శ్రు. ఇంద్రియేభ్యః పరాహ్యర్థా అర్థేభ్యశ్చ పరంమనః, మనసస్తుపరాబుద్ధి ర్బుద్ధేరాత్మామహాన్పరః. మహతః పరమవ్యక్త మవ్యక్తాత్పురుషః పరః, పురుషాన్నపరంకించి త్సాకాష్ఠాసాపరాగతిః॥ అను స్మృతి శ్రుత్యర్థము రీతిని లోకములో ప్రాణసమానమైనది అర్థము. వానికంటె ప్రియమైనవాఁడు పుత్త్రుఁడు. వానికంటెప్రియమైనది మనస్సు. వానికంటె ప్రియమైనది బుద్ధి. బుద్ధికంటె మేలైనది ఆత్మ. వానికంటె శ్రేష్ఠమైనది అవ్యక్తము. అవ్యక్తముకంటె ఎక్కువైనవాఁడు పురుషుఁడు. ఆపురుషునికంటె గొప్పదైనది కొంచెమైనను ఏదియులేదనిస్ఫురించుచున్నది.

ఆత్మయే అన్నిటికంటె ప్రియమనుటకు దృష్టాంతము. లోకములో కుమారుఁడైనవాఁడు ఏదైన నొకనేరమును చేసినట్లు రాజ్యాంగము వారికి ఋజువైనయెడల ఆనేరస్థుని

ఖైదులోనుంచి తటవతుకుపాత్రునిగాఁజేయ యత్నించిరేని వాని తల్లిదండ్రు లదిమాన్పి సహింపక వారికిఁగల ద్రవ్యమంతయును రాజ్యాంగముతోఁజేరిన వారికి లంచములిచ్చి పడరాని పాట్లుపడి కుమారుని విడిపించుచున్నారు. దీనిచే ధనముకంటె తనయుండు తద్దయు ప్రియుఁడని స్పష్టమగుచున్నది. ఒకవేళ ఆనేరస్థుని లంచములు పుచ్చుకొని విడువక వానికి విధించినదండనకు వానితండ్రి లోఁబడిన వదలుదుమనిరేని అందు కాతఁడు ఒడఁబడక అధికారస్థులతోఁ దనకును ఆచిన్నవానికిని నేవిధమైన సంబంధమును లేదని వాదించి తాను తప్పించుకొనుటకు యత్నించును. గనుక సుతునికంటె నెక్కువైనది దేహమగుచున్నది. ఇదిగాక చెడ్డతప్పితమును గావించిన యొకమనుష్యుని నగరివారు శిక్షించుచునప్పుడు ఆ నేరస్థుని నేత్రములను తీసివేయుమని ఆజ్ఞాపించినయెడల వాఁడు శరీరదండనకు ఒప్పుకొని ఇంద్రియములకు లోపముకల్గునని పరితపించుచున్నాఁడు. గనుక దేహముకంటె ఇంద్రియములు గొప్పవగుచున్నవి. ఒకవేళ అంతటితో వదలక శిరశ్ఛేదముచేయునట్లు విధించిరేని ప్రాణమునుగూర్చి దుఃఖించుచున్నాఁడు. కాఁబట్టి ఇంద్రియములకంటె ప్రాణములు ప్రియమైనవి అగుచున్నవి అట్లు విధిలేక ప్రాణములవిడువవలసినప్పుడు తనకు పరమందు సుఖముగలుగ నపేక్షించును. గాన ప్రాణములకంటె ఆత్మ ప్రియుఁడగుచున్నాఁడు. ఇవ్విధముగ విచారించిన ద్రవ్య పుత్ర శరీరేంద్రియాదులెల్ల దుఃఖహేతువులని స్పష్టమగుచున్నవి. కాఁబట్టి వానియందివ్విధమయిన అభిమానమునుబెట్టక త్రికాలాబాధ్యమైన ఆత్మయే తాననిభావించి తనయందుఁ దానుతప్పక యుండవలయుననిభావము.

అవతారిక:—ఆత్మానందమే ముఖ్యమనినను పుత్రుఁడు మొదలైనవిఆత్మయనియు అవేముఖ్యమనియు చెప్పినదేమనిన దానికి ఉత్తరము చెప్పుచున్నారు.

మ. తనకాలావధి సర్వకర్త సుతుఁ డాతం డుర్వి గౌణాత్ముఁడౌఁ
దనుఁగాలాంతము దాఁకఁ దాల్చుఁ దనువత్యంతంబు మిథ్యాత్మయౌఁ
దనకంతంబున సద్గతుల్గలుగఁదా ధ్యానింపఁ గర్త్రాత్మయౌఁ
ఘనుఁడౌ వీనికిఁ గర్తవీనికగు ముఖ్యంబాత్మ తోషంబగున్.

టీ. ఉర్విన్=పుడమియందు, తన=తనయొక్క, కాల=జీవించుకాలముయొక్క, అవధిన్=అంతమందు, (అనఁగా) మరణకాలమందు, సుతుఁడు=కుమారుఁడు, సర్వకర్త-సర్వ=తనయొక్క సర్వవస్తువులకు, కర్త=అధికారి, అతండు=ఆకొడుకు, గౌణాత్ముఁడౌను=తనగుణమువలనకలిగినవాఁడౌను, తనుఁగాలాంతముదాఁకన్- తనున్=తన్నును, కాలాంతముదాఁకను=ఉజ్జీవించియుండెడి అంత్యమువఱకు, తాల్చున్=మోసికొనియుండునట్టి తనువు=శరీరము, అత్యంతంబు=మిక్కుటముగా, మిథ్యాత్మ=మిథ్యయనుపేరుగలది, ఔన్=అగును, తనకంతంబునన్- తనకున్ = తానైనజీవునకు, అంతంబునన్=

తుదముట్టెడికాలమందు, సద్గతుల్గలుగక = మంచిగతులుఁగలుగుటకు, తాక = తాను, ధ్యానింపక = చింతించుటకు, కర్తాత్మయౌక = చేయఁదగిన స్వరూపుఁడగును, వీనికి = ఈ మూఁటికిని, కర్త = కర్తయైనజీవాత్మ, ఘనుఁడౌక = గొప్పవాఁడగును, వీనికి = ఈ జీవునకు, ఆత్మతోషంబు = బ్రహ్మానందము, ముఖ్యఁబు = శ్రేష్ఠమయినది, అగుక = ఔను.

తా. పుడమియందు తానుజీవించుకాలముయొక్క అంతమందు సర్వమునకు కర్తను తుఁడౌను వాఁడెగొణాత్మ. తాను మృతినొందెడువఱకును తన్నుమోసికొనియుండెడి దేహము మిథ్యాత్మయవును. తనయొక్క చావునందు మంచిగతులుఁగలుగుటకుఁగాను చింతించునట్టి జీవుఁడు కర్తాత్మయౌను. ఈ మూఁడాత్మలకుఁ గర్తాత్మయే ముఖ్యుఁడగును. వీనికి తన్నుఁదానుగాఁ దెలిసికొనిన బ్రహ్మానందము ముఖ్యమని తాత్పర్యము.

పుత్త్రుఁడు మొదలైన మూఁడును ముఖ్యాత్మలు. తక్కినవి ఒక్కొక్క సమయమందు ఒక్కొక్క కారణమునుబట్టి అయినందున పూర్వపక్షములగుచున్నవి. ఆత్మయే ముఖ్యమయినందున పంచకోశములను త్రోసినను త్రోయఁబడకయుండు ఆత్మానందమే శ్రేష్ఠమగునని భావము.

అవతారిక:— పైనఁజెప్పినమూఁటిని విడిచిన ఆనందమే ఆత్మస్వరూపమౌననుట.

సీ. హితమౌ వ్యాఘ్రము మైత్రిసల్పఁగదుఁదా యిష్టుండుగాకున్న స
త్సుతుఁడైన న్పగవాఁడుగాఁడె జగతి న్సొంపొందుఘాసాదులే
హితవైరంబులు లేకయుండునటుల న్హేయంబుల న్బాసి స
మ్మతుఁడై జ్ఞాని వెలుంగు నీవవియు నాత్మన్గనన్ సన్నాని౦పు మాత్మన్దగన్.

టీ. వ్యాఘ్రము = పులి, మైత్రిసల్పక = స్నేహముచేయఁగానే, కదుక = మిక్కిలి, హితమౌక = మంచిదౌను, తాక = తాను, ఇష్టుండుగాకున్నక = ఇష్టముగానివాఁడైయుండెనేని, సత్సుతుఁడైనక = మంచికొడుకైనను, పగవాఁడు = విరోధియైనవాఁడు, కాఁడె = కాఁడా, (అవుననుట) జగతిక = భూమియందు, సొంపొందుఘాసాదులు - సొంపొందు = ఒప్పుచుండెడి, ఘాసాదులు = తృణము మొదలైనవి, ఏహితవైరంబులులేక = ఎవ్విధములైనమిత్రత్వ, శత్రుత్వములులేక, ఉండుక = ఉండును, అటులక = ఆప్రకారముగానే, హేయంబులన్బాసి = హీనవృత్తుల నన్నిటినివిడిచి, సమ్మతుఁడై = అందఱకు సమభావముగలవాఁడై, జ్ఞాని = బ్రహ్మవేత్త, వెలుంగుక = ప్రకాశించును, ఈవు = నీవు, అవియుక = పైనఁజెప్పిన హితవైరములను, ఆత్మక = అంతఃకరణమందు, తగక = లెస్సగాను, సన్నానింపుము = బాగుగారోజించుము.

తా. పులితో మైత్రిచేసినయెడలఁ దనతోడలమీఁదఁ గూర్చుండును. మంచికొడుకైనను వానితోవిరోధించినయెడల చంపును. పగచెలిములులేని తృణము మొదలైన

సస్యవృక్షాదులం ఎవ్విధములైన శత్రుత్వ మిత్రత్వములులేకయుండును. ఆప్రకారమే హీనవృత్తుల నన్నిటినివిడిచి అందఱియందును సమభావముగలవాఁడవై యుండుమనితా.

హీనమంబులన్నాసి అనుటచే కామాదిదుర్వృత్తులనువిడిచి యని యర్థము. సమ్మతుఁడై యనఁగా సమస్తప్రాణులయందును సమభావనగలవాఁడని భావము. అట్టివాఁడు నిత్యానందుఁడై ఐహికాముష్మికసుఖములం దిచ్ఛలేనివాఁడై ధనవంతులను బీదలను సమముగానాలోకించుచు సర్వకాలములయందును తానైన బ్రహ్మాభిన్న ప్రత్యగ్వస్తువును తానే యని మాచుచు ఖేదమోదములులేనివాఁడై ‹‹శ్లో. మనసావచసాదృష్ట్యా గృహ్యతేఽన్యైరపీంద్రియైః, అహమేవనమత్తోన్య దితిబుధ్యధ్వమంజసా›› అను శ్లోకార్థము చెప్పిన మనస్సుచేతను, వాక్కుచేతను, చూపుచేతను, చతుర్దశేంద్రియ వ్యాపారముల చేతను తలఁచినది, పలికినది, చూచినది లోనుగాఁగలవన్నియు పరబ్రహ్మమేయనియు ఆ పరబ్రహ్మము తానేయనియు దర్శించునని స్ఫురించుచున్నది. ‹‹ద్రష్టృదర్శన దృశ్యానాం విరామోయత్రవాభవేత్, దృష్టిస్తత్రైవకర్తవ్యం ననాసాగ్రావలోకనం›› అనఁగా ద్రష్టృ, చూచువాఁడు. దర్శన, చూపు. దృశ్య, చూడఁబడినరూపము. విరామోయత్రవాభవేత్. ఎచటఁ బైని జెప్పఁబడిన చూచువాఁడును చూపును చూడఁబడినస్వరూపములయింపుచున్నదో ఆ పరబ్రహ్మమందే ‹‹దృష్టిస్తత్రైవకర్తవ్యం›› దృష్టిని నిలుపవలయును. (అట్లుగాక) ‹‹ననాసాగ్రావలోకనం›› భ్రూమధ్యమందు దృష్టిని నిలుపరాదనిభావము. ఇట్లనుటచేత సమభావనగలవాఁడు తానైన తనయందే దృష్టిని నిలుపవలెననుట. అట్టి భేదస్థితిలోఁ ప్రకాశించెడి బ్రహ్మవేత్త కామక్రోధాది దుర్వాసనలంవీడి స్నేహవిరోధములులేక అందఱియెడల సమభావనతో ప్రవర్తించునని యెఱుఁగఁదగ్గది. మైత్రియును, పగయును, ఉదాసీనతయును, ఆత్మసుఖమునకు వేఱుపడుటచేత వీటిని విడిచిన ఆనందమే ఆత్మస్వరూపమనుట. అట్టి ఆనందస్వరూపమును తెలిసికొనిన తత్క్షణము సకలపాపములును సందేహములును నశింపఁబడిన తానే బ్రహ్మమగునని భావము. అష్టవిధానందములయందును ఆత్మానందము ఒక్కటియని గ్రహింపవలయును.

అవతారిక:— ఆత్మ నిరతిశయానందమనునది అనుభవమయ్యెడికొఱకు అతిశయమైన ఆనందమును చెప్పఁబూనిన, ఆనందము ఎన్నివిధములని అడిగిన ప్రశ్నకుత్తరమును చెప్పుచున్నారు.

మ. అనఘా యెట్లనఁ ద్రిప్రకారముల బ్రహ్మానందమా దాని ముక్త
    తనయా యష్టవిధాఖ్యలందు రవి తత్త్రైవిధ్యమందైక్యమా
    నవఁగా బ్రహ్మను వాసనావిషయము మోదాభిఖ్య లీముఁడు గా
    వునవాసర్వముదంబులంగనుము నీయుల్లంబునం దెల్పెదర్.

టీ. అనఘా = నిష్కల్మషుఁడవైన నాయాచార్యుఁడా, ఎట్లనఁగా=(ఆనందవిభాగములు)ఏప్రకారములని అడిగితి వేని, బ్రహ్మానందము = బ్రహ్మానందము అనునది, త్రిప్రకారములఁగా = మూఁడువిధములుగాను, ఔఁగా = అగును, తనయా=కుమారా, మున్=పూర్వమందు, దానిఁగా=ఆబ్రహ్మానందమును,అష్టవిధాఖ్యలఁగా=(ఆత్మానందము, అద్వైతానందము, విద్యానందము,యోగానందము, నిజానందము మొందటిమూఁటితోఁ గూడ) ఎనిమిదివిధములైన పేళ్లను, అందురు= (కొందఱు) చెప్పుదురు, అవి=అవియైదును, తత్త్రివిధ్యమందుఁగా=తొలుతఁ జెప్పిన మూఁటియందు, ఐక్యమౌఁగా=కలియును, అనఁగా=ఈప్రకారమనఁగాను, బ్రహ్మసువాసనావిషయమోదాభిఖ్యలు-బ్రహ్మ=బ్రహ్మసంబంధమైనదియు, సువాసనా-సు=సుస్థిరమైన, వాసనా = పూర్వవాసనయొక్కయు, విషయ=(జ్ఞానకర్మేంద్రియవ్యాపారములైన) విషయములయొక్కయు, మోద=ఆనందములయందలి, అభిఖ్యలు=నామధేయములు, ఈమూఁడే=ఈ త్రివిధములే, కావునఁగా=కాఁబట్టి, ఆసర్వముదంబులఁగా-ఆ=అట్టి, సర్వముదంబులఁగా = సమస్తానందములను, తెల్పెదఁగా = తెలియఁజేయుచున్నాను, నీయుల్లంబునఁగా=నీ అంతఃకరణమందు, కనుము=తెలిసికొనుము.

తా. నిష్కల్మషుఁడవైన నాయాచార్యుఁడా? ఆనందవిభాగములు ఏప్రకారమని అడిగితి వేని బ్రహ్మానందమనునది మూఁడువిధములుగాను అగును. కుమారా! పూర్వమందు ఆబ్రహ్మానందమును ఎనిమిదివిధములుగానుండునని కొందఱు చెప్పుదురు. వారు హెచ్చుగాచెప్పిన అయిదును ఈమూఁటిలో కలిసియుండును. అమూఁడు ఏవియనఁగా బ్రహ్మానందమని, వాసనానందమని, విషయానందమని మూఁడువిధములు గనుక అన్ని ఆనందములను వానిలక్షణములను దెలియఁజెప్పుచున్నాను. నీమనస్సునందుఁదెలిసికొనుము. ఆనందముయొక్క భేదములు మూఁడని ముఖ్యపక్షము.

అవ:—అష్టవిధానందముల వేఱుపాటులను చెప్పుచున్నారు.

మ. తనరు న్బ్రహ్మముదంబు సుప్తిగతి బోధ న్వాసనానందమౌ
నసుభోగంబుల గోచరప్రమద మాత్మానంద మెల్లప్రియం
బునవిద్యాసుఖ మౌగమౌక్తగరిమన్ బూర్ణార్థమం దద్వయ
మ్ము నుదాసీనతచే నిజప్రమదమౌ ముఖ్యాఖ్యయానిష్ఠచేన్.

టీ. బ్రహ్మముదంబు=బ్రహ్మానందము, సుప్తిగతిన్ = నిద్రవలెను, తనరున్=ఒప్పును, బోధన్=నిద్రలేనపుడు, వాసనానందము = వాసనానందమునునది, ఔఁగా=అవును, అనుభోగంబులఁగా=అనుభవయోగ్యములైన వస్తువులయందు,గోచరప్రమదము=విషయానందము, ఔఁగా=అగును, ఆత్మానందము = ఆత్మానందమునునది, ఎల్లప్రియంబు

నన్—అన్నివస్తువులు తనకు ప్రియమైయుండిన, (ఆయాత్మానందము) ఆగమోక్తగరిమన్-ఆగమ—ఉపనిషత్తులయందు, ఉక్త—చెప్పఁబడిన తత్త్వమస్యాది మహావాక్యార్థ విచారణమునఁగలిగిన, గరిమన్—మహిమచేతను, విద్యాసుఖము—విద్యానందము, ఔన్—అగును, పూర్ణార్థమందున్—అన్ని పదార్థములు తనకుఁ గలిగియుండినను, అద్వయమ్మున్—అద్వైతానందము, ఉదాసీనతన్—సకలవస్తువులయందు తిరస్కరించెడు బుద్ధికలుగుటచేత, నిజప్రమదము—నిజానందము, ఔన్—అవును, నిష్ఠచేన్ = (పైనిచెప్పిన అవిద్యానందమును నిరంతరము) నిష్ఠచేత, ముఖ్యాఖ్యయౌన్—ముఖ్యానందమౌను.

తా. నిద్రపలెనుండునని బ్రహ్మానందము. నిద్రలోనుండి జగద్వాసనచేత మెలకువగలుగుట వాసనానందము. తాను లేచినపిమ్మట తనకుఁగలిగిన వస్తువులన్నియు తనకంటికిగోచరించిన సుఖము విషయానందము. అన్నివస్తువులు తనయింట కలిగియుండుట ఆత్మానందము. అందఱికంటెఁ దాను అన్నివస్తువులయందు నెక్కుడుగా నుండునట్టి సుఖము అద్వైతానందము. ఇవి యిగును స్వభావసుఖములు. ఇవిగాక గురుముఖముగా నేతి నేతియనెడు మహావాక్యార్థ విచారణవలన కలిగెడి సుఖము విద్యానందము. దానినే ముఖ్యముగా ధ్యానించుట యోగానందము. పిమ్మట చేయవలసినది లేక అది అదిగానే యుండునది సహజానందము. ఇదే నిజానందమని తాత్పర్యము.

సమాధియందు అంతర్ముఖమై తెలిసికొనుటవలన కలిగినది బ్రహ్మానందమయినను బహిర్ముఖముగాఁ దెలిసికొనటవలన మనస్సంతోషము గలిగిన ఆసుఖము విషయానందమగును.

అ:—అష్టవిధానందములలో విషయానందలక్షణమునుగుఱించిచెప్పుచున్నారు.

మ. విను మీమోదనిజస్థితు ల్దెలిపెద న్వీతానుమోదంబుచేఁ
దనయా జాగ్రతనుండువాఁ డఖిలబాధల్వాయ నిద్రింప నా
మన మంతర్ముఖ మందుఁదానగు బ్రహ్మానంద మాజాడ నా
తనిచిత్సౌఖ్యమె ధాత్రిలో విషయమోదంబౌఁజుమీ యారయన్.

టీ. తనయా—కుమారా, ధాత్రిలోన్—పుడమియందు, ఈమోదనిజస్థితులు-ఈ—ఈప్రకారములయిన, మోద—(పైనిచెప్పిన) అష్టవిధానందములయందలి, నిజ—స్వభావముగానుండెడి, స్థితులు—కార్యములు, తెల్పెదన్—తెలియఁజెప్పెదను, వినుము—ఆలకింపుము, వీతానుమోదంబుచేన్- వీత—పోఁగొట్టఁబడిన, అనుమోదంబుచేన్—సంతోషముచేతను, జాగ్రతనుండువాఁడు — జాగ్రదవస్థయందుండెడి పురుషుఁడు, అఖిలబాధల్వాయన్-అఖిలబాధలు— (తనకుఁగలిగిన) సమస్తదుఃఖములు, పాయన్—పోవుటకుఁగాను, నిద్రింపన్— (శయనమందు) నిద్రించఁగాను, ఆమనము — ఆబహిర్ముఖమైనమనస్సు,

అంతర్ముఖము—తనతట్టుతిరిగినముఖమును, అంద్కఁన్—పొల్లదును, దానన్—అపొందినదా నియందు, బ్రహ్మానందము—బ్రహ్మానందసుఖము, అగున్—అగును, అజాదనం—అమూర్ధ మందు, అతని—అపురుషునియొక్క, చిత్స్వాఖ్యమే—చిదానందమే, అరయన్—విచారిం పఁగాను, విషయమోదంబు—విషయానందము, అగుఁజుమీ—అగునుగదా.

తా. కుమారా! పుడమియందు ఈప్రకారముగాఁజెప్పిన అష్టవిధానందములయందలి స్వభావములుగానుండెడి కార్యములను తెలియఁజెప్పెదను ఆకర్ణింపుము. పోఁగొట్టఁబడిన సంతోషముతోఁగూడిన జాగ్రదవస్థయందుండెడి పురుషుఁడు తనకుఁ గలిగిన సమస్తదుఃఖములు నశించుటకుఁగాను శయనమందు నిద్రపోవునప్పుడు ముందుజాగ్రత్తలో బహిర్ముఖమైనమనస్సు తానైన కూటస్థబ్రహ్మమందు తిరిగినముఖమైనదగును. అవిధముగా అంతర్ముఖమైనదానియందు కలిగినపురుషుని మానసోల్లాసమే విషయానందమని తాత్పర్యము.

అష్టవిధానందములనఁగా బ్రహ్మానందము, వాసనానందము, విషయానందము, ఆత్మానందము, అద్వైతానందము, విద్యానందము, యోగానందము, సహజానందము అనునవి. బ్రహ్మానందమనఁగా నిద్రలో నిద్రించునట్లు బ్రహ్మములోఁజేరి తానే బ్రహ్మమైయుండుట. వాసనానందమనఁగా తాను అంతఃకరణములోఁజేరి బహిర్వాసనవలన వెలుపల తిరిగినట్లు బ్రహ్మములోనుండిచీలుట. విషయానందమనఁగా నిద్రలోనుండి జాగ్రదవస్థకు తిరిగినప్పుడు సమస్తవిషయములు తనకు దృశ్యములగుట. ఆత్మానందమనఁగా ఇతరులకంటె నెక్కుడుకలిమిని తానుచెంది తనకంటె నెవ్వరును అధికులుగా నుండక యుండుట. విద్యానందమనఁగా తత్త్వమస్యాది మహావాక్యవిచారణచేసి అందువలన తనకు లభించిన ఆనందముతోఁ గూడియుండుట. యోగానందమనఁగా ఆయానందమును తాను సర్వావస్థలయందును నిష్ఠచేయుచుండుట. సహజానందమనఁగా లోకవ్యవహారాదులయందు ఆయాకాలములయందు ఆయాకార్యములు సహజమైనట్లు బ్రహ్మనిష్ఠయందు సహజముగానుండుట. వీనిలో విషయానందమునుగుఱించి యీపద్యమునఁ జెప్పఁబడుచున్నది. విషయానందమనఁగా వృత్తియందు ప్రతిబింబించిన ఆనందము. అది అంతర్విషయానందమని బహిర్విషయానందమని ఇరుతెఱంగులు. వానిలో అంతఃకరణము ఇంద్రియాదులతోఁజేరి విషయసుఖాపేక్షను జెందినపుడు ఏలయుపదార్థము లభింపఁగాఁ గలిగిన మోదమే బహిర్విషయానందము. ఆయంతఃకరణము ఇంద్రియాదులతోఁగూడక వానినుండి మఱలి బ్రహ్మవిషయకమందు దృష్టినినిలిపి అపరోక్ష సాక్షాత్కారప్రాప్తి లభించెడిపర్యంతము కలిగెడిసంతోషమే అంతర్విషయానందము. అట్టి యపరోక్షజ్ఞానములభించినను బ్రహ్మానందస్వరూపుఁడగుచున్నాఁడని భావము. మఱియు సుషుప్తినుండి జాగ్రదవస్థకు మళ్ళినప్పుడు శరీరజ్ఞప్తికలుగుచున్నది. అందుచేత దుఃఖము సంప్రాప్తమగుచున్నది.

ప్రభువులు మొదలగువారు సౌఖ్యముతో సదా యనుభవించెదరే; శరీరపరిగ్రహము గలవారెల్ల దుఃఖము కలుగునని చెప్పరాదనిన అట్టివారికిఁగూడ జాడ్యము కలిగినను బిడ్డలులేకుండినను, కలిగి గిట్టినను, జీవించియుండియు లోఁబడి నడవకుండినను, నీతితప్పి ప్రవర్తించినను, భార్యలు గుణభూషణలుగాకుండినను, శత్రువులు ప్రబలులై యుండినను దేశమందు అనావృష్టి కలిగినను దుఃఖము సంభవించుచున్నది గావున సౌఖ్యవంతులని చెప్పరాదు. అట్లుపలుకుట మోహముచేతనని యెఱుఁగఁదగ్గది మోహమువలన కష్టములు సుఖములుగాఁదోఁచు నెట్లనఁగా, భారమును మోయువానికి నిర్ణీతమునకంటె కొంచెమధికముగా కూలి దొరికినయెడల ఆబరువును మోసినకష్టమును లక్ష్యముచేయక ఆనందించుచున్నాఁడు. అట్లుగాక సహజముగ దొరకెడి కూలికంటె తక్కువ చిక్కెనని దుఃఖపడుచున్నాఁడు. పనివాండ్రు తమకు పనిలేకపోయిన పరితపించుచున్నారు. కాఁబట్టి ఈ కష్టకార్యములన్నియు వీరలకెట్లు సౌఖ్యహేతువులుగాఁ దోఁచుచున్నవో అట్లే ప్రభువులు మొదలగువారికిని మోహముచేత సుఖములుగాఁ గనఁబడుచున్నవి. జ్ఞానులకుఁగూడ దుఃఖముకలదాయనిన కలదనియే చెప్పవలయును. ఎందుకనఁగా జ్ఞానికిని దేహము కలదు. ఐతే జ్ఞానికిని అజ్ఞానికిని భేదమేమనఁగా: జ్ఞాని సమస్తదుఃఖములును అంతఃకరణము ఇంద్రియాదులతోఁ జేరుటవలన కలిగినవేకాని సర్వసాక్షియైన తనకు లేవని తెలిసికొనును. జ్ఞానవిహీనుఁడు అన్యనిష్ఠమైన ఆదుఃఖములను తనయందే ఆరోపించుకొని పరితపించుచున్నాఁడు. మఱియు దేవతలుకూడ ఒండొరులు యుద్ధముచేయుటచేతను, ఒకరినొకరు శపించుకొనుటచేతను, పుణ్యకర్మము నశించుటచేత నాశము కలుగుటవల్లను, ఇంక ననేక సంకటములు కలుగుటచేతను, దుఃఖపడినట్లు శ్రుతిస్మృతులయందును పురాణములయందును చెప్పఁబడియున్నది గాన, శరీరస్ఫురణ యెచ్చటెచ్చటఁగలదో అచ్చటచ్చట దుఃఖములే కనఁబడుచున్నవి. అయితే దేవతలను ఆనందస్వరూపులని చెప్పుటకు కారణమేమనఁగా బ్రహ్మవేత్త తనకు సంప్రాప్తమయిన దుఃఖములను అంతఃకరణనిష్ఠముగా నెట్లు కనుఁగొనుచున్నాఁడో ఆతీరుననే అమరులును జూచుటవలన వారిని ఆనందస్వరూపులని శాస్త్రములు పల్కుచున్నవి. గనుక ॥శ్లో॥ సశరీరస్యసదుఃఖత్వాద్వ్యాప్తితద్వ్యాహతాయుతః, అతఃశరీరముక్త్యర్థం యత్నంకుర్యాదతంద్రితః॥ అను శ్లోకార్థము చొప్పున హిరణ్యగర్భశరీరపర్యంతమును దుఃఖముతోఁ గూడికొనియున్నందున శరీరముతోఁగూడిన ముక్తివిషయమయి ప్రయత్నపడక అశరీ ముక్త్యర్థము ప్రయత్నపడవలెను. ఎందుకనఁగా? నిద్రయందు శరీరపరిగ్రహంబులేదు గావున దుఃఖంబును లేదు. మెలకువయందును స్వప్నమందునను శరీరపరిగ్రహంబు కలదు గావున దుఃఖంబు కలదు. ఈతీరున ఆత్మకు శరీరపరిగ్రహమునకే దుఃఖము సంప్రాప్తమగుచున్నందున దుఃఖము ఆగంతుకమే గాని స్వాభావికముగాదని స్పష్టమగుచున్నది. ॥శ్లో॥ నభూతపంచకాన్నాపి కర్మణః

కేవలాదపి, ఉభాభ్యాంమిళితాభ్యాం తచ్ఛరీరముపజాయతే॥ అనునట్లు కర్మంబుతోఁ గూడికొనిన పంచీకృత పంచమహాభూతంబులవలననే శరీరంబు కలిగెనని సూచిపడుచున్నది. ఇందుకు దృష్టాంతము ఘటము పుట్టుటకు ఉపాదానకారణమగు మృత్తికచేతనే కార్యముగలుగక నిమిత్తకారణమగు కులాలవ్యాపారము మృత్తికకు ముఖ్యకార్యంబైనటువలె కేవల పంచమహాభూతంబులవలనను గాని కేవల కర్మవలనంగాని శరీరము గలుగక ఆరెంటియొక్క కూటమిచేఁ బుట్టుచున్నదని తెలియుచున్నది. ఘటమునకు నిమిత్తోపాదానకారణములగు కులాలవ్యాపారమును మృత్తికయును లేనియెడల ఘటంబును నామరూపంబులు ఎవ్విధమునకలుగవో అతీరుననే దార్ష్టాంతికమందు ఉపాదానకారణమగు భూతంబులును భౌతికప్రపంచంబును స్థాయిగానుండినను అద్వితీయుండగు పరబ్రహ్మమును బహిర్విషయానందమునందుండిఁబడి అపరోక్షజ్ఞానముచేత తానే యని యెఱింగనేని నిమిత్తకారణంబగు కర్మంబునశించుచున్నది. అట్లు కర్మంబు నశింపఁగానే శరీరము కలుగదు. ఎప్పుడు శరీరములేదో అప్పుడు జన్మములేదని సుప్రసిద్ధము. మెలకువయందును స్వప్నమందును కర్మమున్నందున శరీరంబుకలదనియు నిద్రయందు భోగప్రదంబగు కర్మములేనందున శరీరంబులేదనియు భావము.

అవతారిక:—బ్రహ్మానందలక్షణముగురించి దిగువనచ్చెడి రెండుపద్యములచేఁ దెలియఁబఱుచుచున్నారు.

ఉ. తక్కువ నిచ్చుగోచరముఁదం బిలఁ దత్త్రిపుటివ్యథాళికి
న్బొక్కకు మీవు గృధ్రము నభోగతి నీడముఁ జేరుఁగాన న
ల్దిక్కుల కాత్మ చేరక యుదీర్ణసుషుప్తిని జెంద జీవుఁ డా
మక్కువఁ దన్మయుండగు సమమ్ముగ సత్తతిబ్రహ్మమోదమాన్.

టీ. ఇలన్=భూమియందు, తక్కువనిచ్చుగోచరముదంబున్-తక్కువన్=హీనమును, ఇచ్చు=కలుగఁజేయుచుండెడి, గోచరముదంబున్=విషయసుఖమును, తత్త్రిపుటివ్యథాళికిన్-తత్=ఆవిషయసుఖమునుగూర్చి, త్రిపుటి=(అంతరమధ్యబాహ్య)త్రిపుటులయందలి, వ్యథా=దుఃఖములయొక్క, ఆళికిన్=సమూహమునకు, ఈవు=నీవు, పొక్కకుము=(మనశ్చలనముచేత) వ్యాకులపడకుము, గృధ్రము=గద్ద, నభోగతిన్=ఆకాశసంచారముచేత, నీడమున్=తనగూఁటిని, చేరుఁగానన్=చేరును కాఁబట్టి, నల్దిక్కులకున్=నాలుగుదిక్కులయందుండిన పదార్థములనుగురించి, ఆత్మ=పోవుచుండెడి యింద్రియములతోఁగూడిన అంతఃకరణము, చేరక=ఆదిక్కులకుపోక, ఉదీర్ణ=అతిశయమైన, సుషుప్తిని=నిద్రయందు, చెందన్=చెందఁగాను, జీవుఁడు=చిదాభాసుఁడు, సమమ్ముగన్=సమముగాను, ఆమక్కువన్=అట్టి ప్రేమతోడను, తన్మయుండగున్

=(అంతఃకరణములయొక్క తాదాత్మ్యమును) పొందినవాఁడగును, అస్తతిన్=అసమయమందు, బ్రహ్మామోదము=బ్రహ్మానందము, ఔన్=అవును.

తా. భూమియందు హీనమును కలుగఁజేయుచుండెడి విషయసుఖములైన అంతర మధ్య బాహ్య త్రిపుటులయందలి దుఃఖసమూహములకు న్యాప్యములుకాకయును. గద్ద ఆకాశ సంచారముచేత తనగూఁటిలో చేరునట్లువలె నాలుగుదిక్కుల సంచరించెడి ఇంద్రియములతోఁగూడిన అంతఃకరణము ఆవిషయసుఖములనుపొంద అతిశయమైననిద్రయందుచెందఁగాను చిదాభాసుఁడు సమముగా విశ్వాసముతో అంతఃకరణముయొక్క తాదాత్మ్యమునుపొందినవాఁడగును. ఆసమయమందు బ్రహ్మానందము కలుగునని తాత్పర్యము.

త్రిపుటులనఁగా: జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయములు అంతరత్రిపుటి. ద్రష్టృదర్శనదృశ్యములు మధ్యత్రిపుటి. కర్తృ కారణ కార్యములు బాహ్యత్రిపుటి. ఈ త్రిపుటులు అంతరింద్రియ, జ్ఞానేంద్రియ, కర్మేంద్రియములవలన కలిగెను ఒక్కొక్క ఇంద్రియమునకు మూఁడేసిగా కలుగుచున్నవి పీనివివరము మొదటిప్రకరణమందు వ్రాయఁబడియున్నది. ఈత్రిపుటిలోఁ గలుగు విషయసుఖములు పెక్కుదుఃఖములతోఁ గలిసియున్నందువలన సుఖములేదు, గనుక సుషుప్తియందు సమాధినిష్ఠయందు ఆత్మపరబ్రహ్మము[illegible] తన్మయమై సుఖమును అనుభవించుటయే బ్రహ్మానందమని భావము. గృధ్రము నభోగతిసేడముఁ జేయఁగానన్ అనుటవలన గద్ద ఆకాశమార్గమున సంచరించుచు తనగూఁటికివచ్చినపుడు మిక్కిలివేగముగా నేతెంచుచందమున జీవుఁడును దేనిచేతను అడ్డఁబడక సుషుప్తిసుఖమును అపేక్షించుటచేత నదియు బ్రహ్మానందమగును. కాఁబట్టి విషయాదులయందు బుద్ధిని నాటనియ్యక బ్రహ్మతాదాత్మ్యమును పొందుటే బ్రహ్మానందమని తెలియవలెను.

మ. అరుదై యొప్పు సుషుప్తిశోభ మగు నాత్మానంద మద్దానికై
ధరఁ బుష్పాదులఁ జేర్చి నిద్దురఁ గొనన్ స్థానప్రమోదం బగున్
వరుసన్ స్త్రీపురుషాదిశూన్య మగు నిర్వ్యాపార నిద్రాప్తి యు
ట్లరయన్ స్వానుభవానుమోదమదె బ్రహ్మానందమౌ నర్భకా.

టీ. అర్భకా=పుత్త్రుఁడా, అరుదై=(వేదాంతమహావాక్యార్థమందు) అపురూపమై, ఒప్పు=ఒప్పుచుండెడి, సుషుప్తిశోభము=నిద్రాసుఖము, ఆత్మానందము=బ్రహ్మానందము, అగున్=అగును, అద్దానికై=అసుఖమునకై, ధరన్=భూమియందు, పుష్పాదులన్=పుష్పములు మొదలైనవానిని, చేర్చి=పేర్చి, నిద్దురన్=సుషుప్తిని, కొనన్=గ్రహించె నేని, స్థానప్రమోదంబగున్=స్థానసుఖమగును, వరుసన్=క్రమముగాను, స్త్రీపురుషాదిశూన్యము-స్త్రీ=ఇది ఆఁడుది, పురుష=వీఁడు మగవాఁడు, ఆది=ఇదిమంచిది ఇదిచెడ్డది అను మొదలగునవి, శూన్యమగు=ఏమియులేనిదైన, నిర్వ్యాపార=ఏప్రయత్నము

లేని, నిద్ర=నిద్రయొక్క, ఆప్తి=ప్రాప్తి, అట్లు=అప్రకారము, అరయఁగ = విచారింపఁగా, స్వానుభవానుమోదము=తనయందు తానుగా తెలిసికొనినసంతోషము, అదే=అ స్వానుభవానుమోదమే, బ్రహ్మానందము=బ్రహ్మజ్ఞానమువలన కలిగినసుఖము, కాఁగ= అవును.

తా. పుత్రా! వేదాంతమందు అసుషుప్తమై యప్పుడుండెడి నిద్రాసుఖము ఆత్మానందమగును, ఆసుఖమునకై భూమియందు పువ్వులు హంసతూలికాతల్పములు మొదలైనవానిని జేర్చి అనిద్రాసుఖమునకై నిద్రించెనేని స్వానసుఖమగును, క్రమముగా అఁడుది మగవాఁడను భేదముఁదెలియక ఏప్రయత్నముచేయక నిద్రాప్రాప్తికాలమువలె తన్నుదాఁదెలిసికొనిన సుఖము బ్రహ్మానందమగునని తాత్పర్యము. అనఁగా నొకమనుష్యుఁడు గాఢనిద్రలోనున్నతఱి స్త్రీలని, పురుషులని, తనవారని అన్యులని భేదములేక యెుందురీతిని సుషుప్త్యానందమగు మగ్నుఁడైనవానికి జాగ్రత్స్వప్నప్రపంచములు తెలియవు గావున అప్పుడు గలిగిన స్వానుభవానందమే బ్రహ్మానందమగుచున్నది.

అవతారిక:—నిద్రయందులభించిన ఆనందము నాకెట్లు నిదర్శనమగునని శిష్యుఁడడుగుచున్నాఁడు.

మ. అమరస్తుత్య విముక్తి కీరస సహాయంబు బ్రియంబెల్లెడన్
సమమైయుండదు బోధహీననిజసాక్షాద్యోగసుప్తుండు తో
షముయుండై వెలయుండె వానిమదితోషంబంత ధీరూపమై
యమర న్భాసిల్లునంచుఁ గాంతునది ప్రత్యక్షంబు నాకెట్లగున్.

టీ. అమరస్తుత్య-అమర=దేవతలచేతను, స్తుత్య=కొనియాడఁదగిన యాచార్యుఁడా, విముక్తికిన్=మోక్షమునకు, ఈరసన్=ఈభూమియందు, సహాయంబు=ఉపకారము, బ్రియంబు=అగునట్టిప్రియమైనది, ఎల్లెడన్=ఎల్లప్పుటను, సమమై = సమానమై, ఉండదు=ఉండదు, (అనఁగా నొకరిహృదయమందున్నట్లింకొకరిహృదయమందుండదనుట) బోధహీననిజసాక్షాద్యోగసుప్తుండు-బోధహీన = తెలివిలేని, నిజ=స్వకీయమైన, సాక్షాద్యోగ-సాక్షాత్=అనుభవమైన, యోగ=ప్రాప్తమైన, సుప్తుండు=నిద్రఁబోవువాఁడు, తోషముయుండై=ఆనందస్వరూపుఁడై, వెలయుండె=ప్రకాశింపఁడా, వాని=అట్టిపురుషునియొక్క, మది=మనస్సునందలి, తోషంబు=ఆనందము, ధీరూపమై= విజ్ఞానస్వరూపమై, అమరన్=ఒప్పునట్లుగాను, భాసిల్లునంచున్=ప్రకాశించుననని,కాంతున్=మాచెదను, అంతన్=పిమ్మట, అది=ఆయానందము, ప్రత్యక్షంబు=నిదర్శనము, నాకున్=నాకు, ఎట్లు=ఏప్రకారము, అగున్=అగును.

తా. దేవతలచేత కొనియాడఁబడిన నాయాచార్యుఁడా! ఈభూమియందుమోక్షమునకు సహాయమైనఆనందము ఒకరిహృదయమందున్నట్లు ఇంకొకరిహృదయమందుండదు. తెలివిలేక తనకు అనుభవముగాని ద్రష్టోవువాఁడు ఆనందస్వరూపుఁడై ప్రకాశింపఁడా? అట్టివానియొక్క మనస్సంతోషము విజ్ఞానస్వరూపమై ప్రకాశించునని చూచెదను. ఆయానందము ప్రత్యక్షముగా నాకేప్రకారముగా నగునని తాత్పర్యము.

అవతారిక:—పైప్రశ్నకు ఉత్తరము చెప్పుచున్నారు.

మ. నవనీతాజ్యము లొక్కటయ్యుఁ రుచుల న్నామస్వరూపంబులన్
భువి వేర్వేఱగురీతి జాగ్రమున సంపూర్ణస్థితిస్స్వాంతసం
భవవిజ్ఞాని వెలుంగు దుఃఖగతహృద్భంగంబునం గంకణాం
బువులబ్జాకరసేతువుల్పగిదిఁ దద్బోధాత్ముఁ డొక్కండగున్.

టీ. నవనీతాజ్యములు-నవనీత=వెన్నయు, ఆజ్యములు = నెయ్యియు, ఒక్కటయ్యున్=ఒకటిఐనను, రుచులన్=రుచులచేతను, నామస్వరూపంబులన్ - నామ=పేళ్లచేతను, స్వరూపంబులన్=రూపములచేతను, భువిన్=భూమియందు, వేర్వేఱగురీతిన్=వేర్వేఱుగానయినట్లు, జాగ్రమునన్=జాగ్రదవస్థయందు, సంపూర్ణ=నిండిన, స్థితిన్=నిలుకడచేతను, స్వాంత=మనస్సునందు, సంభవ=పుట్టిన, విజ్ఞాని=బ్రహ్మజ్ఞాని, వెలుంగున్=ప్రకాశించును, దుఃఖగతహృద్భంగంబునన్- దుఃఖ = (ఆధివ్యాధిరూప) దుఃఖములచేతను, గత=పొందఁబడిన, హృత్=మనస్సుయొక్క, భంగంబునన్ = నాశనమునందు, కంకణాంబువులు-కంకణ=నీటిబిందువు, అంబువులు=ఉదకమును, అబ్జాకరసేతువులు-అబ్జాకర=తటాకము, సేతువులు=కట్టయు, పగిదిన్ = వలెను, తద్బోధాత్ముఁడు=ఆవిజ్ఞానస్వరూపుఁడు, ఒక్కండగున్=ఒక్కఁడేయగును.

తా. వెన్నయు నెయ్యియు ఒక్కటియేఅయినను రుచులచేతను నామరూపంబులచేతను వేఱ్వేఱైనట్లు జాగ్రదవస్థయందు సంపూర్ణస్థితితోఁ గూడిన మనస్సువలనఁ బుట్టిన విజ్ఞానముగలయోగి ప్రకాశించును. దుఃఖముతోఁగూడిన మనోనాశనమందు నీటిచినుకు నీరేఅయినటువలెను, చెరువు కట్టఐనటువలెను, ఆ విజ్ఞానస్వరూపుఁడు ఒక్కఁడేయగునని తాత్పర్యము.

అవఁగా: పాలుగాఁచి పేఱఁబెట్టిచిలుఁకఁగా వెన్నవుట్టుచున్నది, ఆవెన్నను గాఁచఁగా నెయ్యిఅగుచున్నది. ఆఒక్క పాలవలనఁగలిగిన వెన్న నెయ్యి అనువానియొక్క రుచులను రూపనామములను ఒక్కటిగానుండక భేదించినట్లు బ్రహ్మజ్ఞానియు మెలకువయందు ప్రకాశించినను విచారణచేత పయినిచెప్పినజన్నియు ఒక్కటియేయైనట్లు సకలమైన బాహ్యపదార్థములను వర్జించినవాఁడగుటవలన ॥సర్వత్రపూర్ణరూపాత్మా సర్వత్రా

త్మావశేషకః, శుద్ధచైతన్యరూపాత్మా సర్వసిద్ధివివర్జితః" అను ఉపనిషద్వాక్యముచొప్పున అంతటను నిండినరూపముగలవాఁడును, అంతటను మిగిలినవాఁడును, శుద్ధచైతన్యస్వరూపుఁడును, తనకంటె భిన్నములగు సకలసిద్ధులను లేనివాఁడును ఆ పరమాత్మయే గనుక ఆపరమాత్మయే తానైయుండునని భావము. "స్వయంబ్రహ్మాస్వయంవిష్ణుః స్వయమింద్రః స్వయంశివః, స్వయంవిశ్వమిదంసర్వం స్వస్మాదన్యన్నకించన" అనిమహావాక్యరత్నావళి. గనుక ఆబ్రహ్మజ్ఞానియే బ్రహ్మయును, విష్ణువును, ఇంద్రుఁడును, శివుఁడును అనఁబడుచుండెడి సర్వప్రపంచమనియు అతనికంటె వేఱొకొంచెమైనను లేదనియు స్ఫురించుచున్నది. కాఁబట్టి గురుముఖముగా విచారణచేసినయెడల జరిగినది జరగఁబోవునది జరుగుచుండునది తెలిసికొనువాఁడు, సమీపమున నుండునది దూరముననుండునది మొదలైన సర్వము చిన్మాత్రస్వరూపమేయగును. "ఆత్మనోన్యన్నాస్తి సర్వమాత్మమయంజగత్" అను ప్రమాణముచొప్పున ఆత్మకంటె వేఱొకఁడు పొట్టు అంతమాత్రమైనను లేదనియు సర్వప్రపంచము ఆత్మమయమేయనియు ఎఱిఁగి "సర్వంనాహంనచాన్యంవా సర్వంబ్రహ్మైవకేవలం" అనురీతిని నీవు, నేను, అన్యము అను భేదబుద్ధిలేక సర్వము బ్రహ్మస్వరూపమేయని భావించువాఁడె విజ్ఞానస్వరూపుఁడు.

అవతారిక:—వాసనానందమును గుఱించి వివరించుచున్నారు.

శా. ఆనందం బెడఁబాసి రా నిలఁ బనేమయ్యా యటం డిట్లన
న్నానాభూతభవార్జితక్రియలు విన్నాణంబుగాఁదెచ్చు స
న్మానింపంబడుచుండుసుప్తిసుఖ మాత్మన్బాసిపీతెంచు నా
యానందంబగు వాసనామయము నీవాలింపు మెంతేనియున్.

టీ. అతండు—(ఏకమైన బ్రహ్మానందసుఖమునుబొందిన) ఆపురుషుఁడు, ఆనందంబున్—తనబ్రహ్మానందమును, ఎడఁబాసి—విడిచిపెట్టి, ఇలన్—భూమినిగూర్చి, రాన్—వచ్చుటను, పనేమి—ఏమిపని, అయ్యా—గురుస్వామి, ఇట్లనన్—ఈప్రకారముశిష్యుఁడడుగఁగాను, నానాభూతభవార్జితక్రియలు-నానా—బహువిధములైన, భూతభవ—పోయినజన్మములయందు, ఆర్జిత—సంపాదింపఁబడిన, క్రియలు—ప్రారబ్ధకర్మములు, విన్నాణంబుగాన్—విశేషముగాను, తెచ్చున్—వెలుపలికితీసికొనివచ్చును, సన్మానింపంబడుచుండుసుప్తిసుఖమున్-సన్మానింపంబడుచుండు—సుఖముగా నిద్రించితినని ఆనిద్రాసుఖమును మఱవక కొనియాడఁబడుచుండునట్టి, సుప్తిసుఖమున్—నిద్రాసుఖమును, ఆత్మన్—అంతఃకరణమందు, పాసి—విడిచి, పీతెంచున్—జగద్వాసనచేత వెలుపలికివచ్చును, ఆయానందము—ఆసుషుప్తిసుఖమునునది, వాసనామయము—వాసనానందము, అగున్—అగును, నీవు—నీవు, ఎంతేనియున్—ఆసుఖమునంతయును, ఆలింపుము—(తెలియ) వినుము.

తా. ఏకమైన బ్రహ్మానందమునుపొందినవాఁడు జగద్విషయములను విడిచినవాఁడైనను భూమినిగూర్చివచ్చుటయే మిగని అయ్యో అని అడిగితికేని అనేక ప్రకారములుగా జ్ఞానోత్పత్తికి పూర్వజన్మములయందు సంపాదింపఁబడిన ప్రారబ్ధకర్మములైనవి బ్రహ్మానందమునువిడిపించి మాటిమాటికి వెలుపలికితీసికొనివచ్చుచుండును. నిద్రనుండిలేచి ఆనిద్రాసుఖమును కొనియాడుచుండువాఁడు దానివిడిచి వెలుపలికి వచ్చుచున్నాఁడు. ఆవెలుపలికివచ్చినవాఁడు బ్రహ్మానందమును వచించుటే వాసనానందమని తాత్పర్యము.

“కర్మణాబద్ధ్యతేజంతు ర్విద్యయాచవిముచ్యతే, స్వరూపావస్థితిర్ముక్తి స్తద్భ్రంశోహంత్యవేదనమ్, చిత్తేచలతిసంసారో నిశ్చలేమోక్షఉచ్యతే” అను వాక్యార్థముల చొప్పున జంతువు కర్మములచేత బద్ధమాచున్నదనియు, జ్ఞానముచేతఁ దెలియఁబడుచున్నదనియు, స్వరూపమందుండుటయే మోక్షమనియు, అట్లుండకుండుటయే దుఃఖమనియు, చిత్తచలనమే సంసారమనియు, నిశ్చలచిత్తమే మోక్షమనియు సూచించుచున్నది. కాఁబట్టి వాసనలచేతఁగట్టఁబడక “మోక్షఃస్యాద్వాసనాక్షయః” అనునట్లు వాసనలనునశింపఁజేయుటే మోక్షమగుచున్నందున విషయచింతనములయందు బుద్ధిని ఊనినిచ్చిన బంధమగును. గాన సకలమైనకోరికలను క్షయింపఁజేసికొని బంధములనువిడనాడి “యోజాగర్తిసుషుప్తిస్థోయస్య జాగ్రన్నవిద్యతే, యస్యనిర్వాసనోబోధఃసజీవన్ముక్తఉచ్యతే” అను ప్రమాణవాక్యములరీతిని ఎవఁడు దృశ్యపదార్థములయందు నిద్రఁజెందినవానివలెనే తెలియకయుండి సుఖస్వరూపమైన నిజరూపమందుజాగ్రతుఁడైయుండి విషయానందములయందు జాగ్రత్తలేక వాసనావిహీనమైన పూర్ణజ్ఞానముగలవాఁడో అట్టి పురుషుఁడే జీవన్ముక్తుఁడు అట్టివాఁడు పూర్వజన్మసంచిత ప్రారబ్ధకర్మములచేత బ్రహ్మానందమునుండి మఱలి ప్రపంచముతట్టుతిరిగినను నిద్రించినవాఁడు నిద్రనువదలి మెలకువకువచ్చినప్పుడు నిద్రయొక్కసుఖమును గొనియాడినట్లు ఆబ్రహ్మానందమును గొనియాడుట వాసనానందమని భావము.

అవతారిక:—నిజానందలక్షణమును జెప్పుచున్నారు.

చ. తలఁపు జనింప దేహమని తా నిజమోదము డాఁగ స్వాత్మదు
ర్మలభవవార్ధిలోఁ బడుఁ బురాకృతకృత్యము చేత వారికిన్
గలుగుట యెల్లఁ దత్కృతమె కావున మధ్యమకాల మిచ్చుని
ర్మలమునివృత్తిఁ దానఁ జెడమానసవృత్తినిజప్రమోదమౌన్.

టీ. తలఁపు=మనస్సంకల్పము, జనింపన్=పుట్టినను, తాన్=తాను, దేహమని=దేహమునేనని, నిజమోదముడాఁగన్-నిజ=తనయొక్క, మోదము = సహజానందము, డాఁగన్=మఱుఁగుకాఁగాను, స్వాత్మదుర్మలభవవార్ధిలోన్-స్వ=తానైన, ఆత్మ=కూటస్థచైతన్యము, దుర్మల=దుష్టమలములతోఁగూడిన, భవవార్ధిలోన్ = జన్మసముద్రము

దు, పడున్=పతనమగును, వానికిన్=అట్లుపడువానికి, పురాకృతకృత్యముచేతన్=పూర్వజన్మకృతకర్మములచేత, కలుగుటయెల్లన్=కలిగెడిసర్వము, తత్కృతమె=ఆజన్మసంచితమె, కావునన్=కనుక, మధ్యమకాలము = (భూతభవిష్యత్కాలముల రెంటినడుమనుండెడి) వర్తమానకాలము, నిర్మలమునివృత్తిన్-నిర్మల=అతిస్వచ్ఛమైన, మునివృత్తిన్=నిస్సంకల్పవృత్తిని, ఇచ్చున్=ఇచ్చును, దానన్=ఆవృత్తిచేతను, మానసవృత్తి=అంతఃకరణవ్యాపారము, చెడన్=నశించినచో, నిజప్రమోదము=నిజానందము, ఔన్=అగును.

తా. మనస్సంకల్పముపుట్టినను తాను దేహమనుతలంపుతోఁచఁగానే తనయొక్క సహజానందము మఱుఁగుపడి తనయొక్క కూటస్థచైతన్యము దుష్టమలములతోఁగూడిన జన్మవార్ధిలోఁబడును. ఆప్రకారముగాఁబడెడువానికిఁగలిగెడి సుఖదుఃఖములన్నియు ఆకర్మమేగనుక వృత్తిశూన్యమైన మౌనముచేత మానసవృత్తిచెడినయెడల నిజానందము కలుగునని తాత్పర్యము.

తలఁపుజనింపఁడా దేహమని అనుటచేత ఏపురుషుఁడు తానే దేహమనుతలంపునుగలిగియున్నాఁడో ఆపురుషుఁడు ప్రకృతివల్లపుట్టిన గుణములను అనుభవించుచున్నాఁడు. అట్టివానికి సుఖదుఃఖరూపములైన గుణములయందాసక్తికలిగియుండుటంజేసి పంచమలములతోఁగూడిన జన్మసాగరమందుఁబడి పుణ్యాపుణ్యరూపములయిన క్షేత్రములయందు పుట్టుచుగిట్టుచునుండును. గనుక అట్టి మిథ్యాస్వరూపంబును దుఃఖహేతువులగుజన్మములకు కారణంబును కర్మస్వరూపంబును నగు శరీరపరిగ్రహణమునువిడిచి దానియందుండెడి దేహి సకలేంద్రియవ్యాపారములచేత ప్రకాశించువానివలెఁ గనఁబడియు ఆవ్యాపారములతో సంబంధములేక మిక్కిలి సూక్ష్మరూపముగలిగి క్షేత్రమనెడిదేహమందు సర్వవ్యాపారములను ఉపద్రష్టయై "ఉపద్రష్టానుమంతాచ భర్తాభోక్తామహేశ్వరః, పరమాత్మేతిచాప్యుక్తో దేహేస్మిన్ పురుషఃపరః" అను భగవద్వాక్యముచొప్పున అనుమోదించువాఁడును, భరించువాఁడును, భుజించువాఁడును, నియామకుఁడును, ఉత్కృష్టుఁడును పరమాత్ముఁడునుగా నున్నాఁడని తెలిసికొనినవాఁడే నిజానందస్వరూపుఁడనిభావము.

మానసవృత్తిచెడన్ అనుటచే బ్రహ్మసాక్షాత్కారమువచ్చినవానికి విషయాపేక్ష తొలఁగుచున్నది. అందుచే దేహమే తాననుఅభిమానమునశించుచున్నది. ఆ యభిమానముపోఁగానే జగము భ్రాంతియను దృఢజ్ఞానముకలుగుచున్నది అట్టివానికి సంకల్పము చేయనేరదు గనుక సుఖదుఃఖములు జగత్తు స్వప్నమువలెను ఇంద్రజాలమువలెను తోఁచి నశించుటవల్ల మాయామయంబని స్ఫురించును. అట్టి స్ఫురణగలవానికి అంతఃకరణవ్యాపారములన్నియు నశించిపోవు. మనస్సు నిలుకడగానుండునని భావము. శబ్దాదులనువిడిచి మనస్సును నియమములో నిలిపినవాఁడు అట్లు "బ్రహ్మభూతః ప్రసన్నాత్మా నశోచతిన

కాంక్షతి, సమస్సర్వేషుభూతేషు మద్భక్తింలభతేపరామ్॥ అను గీతోక్తిచొప్పున నష్టమైనవస్తువులకు దుఃఖపడక రానివస్తువులనుకోరక సమస్తప్రాణులయందు సమభావనగలిగి సర్వోత్కృష్టమైన సచ్చిదానందస్వరూపమందే భక్తిచేయుచుండును కాఁబట్టి॥ అహంకారంబలందర్పం కామక్రోధంపరిగ్రహమ్, విముచ్యనిర్మమశ్శాంతో బ్రహ్మభూయాయ కల్పతే॥ అనునట్లు అహంకారము, సామర్థ్యము, దర్పము, కామము మొదలయినవానిని విడిచినవాఁడు బ్రహ్మభావమును పొందుటకు సమర్థుఁడు.

అవతారిక:—ముఖ్యానందలక్షణమునుగుఱించి చెప్పుచున్నారు.

మ. నిజమోదం బగు ముఖ్య మన్న నుఖలో నీరంబె పైచెమ్మయై
సుజనస్తుత్యా వెలుంగుమాడ్కి నఱుఁగై సొంపొందుగర్వంబె యా
నిజమం దొందినముఖ్యమౌ విషయముల్ నిద్రింప నిర్నిద్రలో
ధ్వజదండాకృతి దేహమై సమత స్వాంతంబొప్పఁ దన్ముఖ్యమౌన్.

టీ. సుజనస్తుత్యా=సత్పురుషులచేఁ గొనియాడఁదగినశిష్యుఁడా, నిజమోదంబు=నిజానందము, ముఖ్యమన్నన్=ముఖ్యమనిచెప్పితివేని, ఉఖలోనీరంబె = కుండలోనిజలమే, పైచెమ్మయై =కుండపైనవచ్చిన ఊటయై, వెలుంగుమాడ్కిన్=ప్రకాశించునటులు, అగున్=ఔను, సొంపొందుగర్వంబె = (వెలుపల) ప్రకాశించెడి అహంకారమే, మఱుఁగై=దాఁగినదై, ఆ నిజమందున్= (లోపలనుండుతానైన) ఆనిజానందస్వరూపమందు, ఒందినన్=పొందినను, ముఖ్యమౌన్=ముఖ్యానందమగును, విషయములు=నలుదిక్కుల సంచరించెడివ్యాపారములు, నిర్నిద్రలోన్=సమాధినిష్ఠయందు, నిద్రింపన్=నశించినను, దేహము=శరీరము, ధ్వజదండాకృతిన్=దేవాలయధ్వజస్తంభమువలె, ఐ=అయియుండి, స్వాంతంబు=అంతఃకరణము, సమతన్=సమభావముచేత, ఒప్పన్ = ఒప్పినను, తన్ముఖ్యమౌన్-తత్ =ఆ, ముఖ్యమౌన్=ముఖ్యానందమగును.

తా. సత్పురుషులచేఁ గొనియాడఁదగిన శిష్యుఁడా? నిజానందము ముఖ్యమని చెప్పితివేని భాండములోనియుదకమే పయిన చెమ్మగిలి ప్రకాశించినటులు వెలుపల ప్రకాశించెడి అహంకారమే దాఁగినదై లోపలనుండెడి నిజానందస్వరూపమందు చేరినయెడల ముఖ్యమగును. నలుదిక్కులయందు వ్యాపించెడి ఇంద్రియవ్యాపారములు సమాధినిష్ఠయందు నశించినను దేహము దేవాలయధ్వజస్తంభమువలె కదలక అంతఃకరణము సమభావముచేతనుండినను ఆ ముఖ్యానందమే యగునని తాత్పర్యము.

ఉఖలో నీరంబె పయిచెమ్మయై వెలుంగుమాడ్కి ననుటచే కుండలో నీళ్లుపోసిపెట్టితే ఆనీళ్లే చెమ్మ అను పేరుతో వెలుపల కనఁబడినట్లు అంతఃకరణము విషయములనుగూడినను దేహమందుండు నిజానందస్వరూపమే అహంకారమను పేరుచే వెలుపలఁదోఁచుచున్నది

అట్లు అశుద్ధములగు విషయములనుగూడక పరబ్రహ్మమందు లీనమయ్యేనేని అహంకారము నశించును. అది నశింపఁగానే ప్రపంచవృత్తియను చమురులేనిదీపమువలె అంతఃకరణము చిన్మాత్రమగును. చిత్తే కర్మమునకు కారణమైనందువలన ఆచిత్తమును శోధింపఁగా సకలకర్మములు వీడిపోవును. చిత్తశోధనయనఁగా: బ్రహ్మనిష్ఠయందు నిలుకడగానుండుట. అట్టివానికి ముక్తిసాధ్యమని భావము. ధ్వజదండాకృతి దేహమైయునుటవలన గుడిలోని ధ్వజస్తంభము చక్కఁగ గట్టనచేయుటచేత గాలివొందలయినవానికి కదలకయు ఇతరులచే కదలింపఁబడకయు నెట్లు స్థిరముగానుంచున్నదో ఆతీరునఁనే నలుదిక్కుల సంచరించెడి ఇంద్రియవ్యాపారములను సమాధినిష్ఠయందు నశింపఁజేసిన దేహమును స్థిరముగానుండునని ఉపమానముగఁ జెప్పఁబడెను. ఇట్లనుటవలన మనస్సును ప్రపంచవిషయములయందుఁ బోనియ్యక దృఢపఱచుకొని బ్రహ్మమందు కదలకయుంచెనేని ఉదకమందు ఉప్పు ఏప్రకారముగ సంయోగమువల్ల సమత్వమునుపొందునో ఆప్రకారమే మనస్సు బ్రహ్మమందు ఐక్యమగుచున్నది. ‘‘ప్రభాశూన్యం మనశ్శూన్యం బుద్ధిశూన్యం నిరామయమ్, సర్వశూన్యం నిరాభాసం సమాధిరభిధీయతే’’ అను మహావాక్యరత్నావళిచొప్పున అహంకారములేక, మనస్సులేక, బుద్ధిలేక, విషయవ్యాపారములులేక, సకలమైన వృత్తులులేక, వాసనలుఁలేక యుండునది సమాధిగావున అట్టి సమాధినిష్ఠయందు పట్టువడలకయుండువాఁడు కర్మబంధములచేత కదలఁడని అభిప్రాయము.

అవ:—ఆనందముయొక్క మాహాత్మ్యమును శ్రుతిసమ్మతముగాఁ జెప్పుచున్నారు.

మ. తనరు న్స్వానములై స్వముల్లయమహత్పాథోధి నొండొంటికిన్
ఘనమై నూఱుమడుంగులన్ మహిపతద్గంధర్వ గంధర్వ పా
వనభాస్వత్పితృయుగ్మకర్మసుర గీర్వాణేంద్ర తన్మంత్రి త
జ్జనలోకేశ విరాజపూరుషుల సత్సన్వర్ణోదరానందముల్. ౧౩౩

టీ. స్వముల్లయమహత్పాథోధిన్-స్వ = (అపరోక్షసాక్షాత్కార బ్రహ్మజ్ఞానముచేత ప్రకాశించుచుండెడి జీవన్ముక్తుఁడైన) తనయొక్క, ముత్ = ఆనందమనెడి, లయ = ప్రళయకాలములయందలి, మహాత్ = గొప్పదియగు, పాథోధిన్ = సముద్రమందు, ఒండొంటికిన్ = ఒకదానికంటె నొకటి, నూఱుమడుంగుల్ = నూఱుపాళ్లధికముగాను, ఘనమై = గొప్పదిగా, మహిప = (ఆయువుచేతను, శరీరదార్ఢ్యముచేతను, సకలభూమితోఁగూడిన భోగభాగ్యములుఁగల) రాజులయొక్కయు, తద్గంధర్వ = మనుష్యగంధర్వులయొక్కయు, గంధర్వ = దేవగంధర్వులయొక్కయు, పావన = పవిత్రులయిన, పితృయుగ్మ = పితృదేవతలయొక్కయు, అజానజాన దేవతలయొక్కయు, కర్మసుర = కర్మదేవతలయొక్కయు, గీర్వాణ = దేవతలయొక్కయు, ఇంద్ర = ఇంద్రునియొక్కయు, తన్మంత్రి - తత్ = ఆయింద్రాదిదేవతలను, మంత్రి = గురుఁడైన బృహస్పతి

యొక్కయు, తజ్జనలోకేశ - తత్ = శ్రేష్ఠమైన, జనలోకేశ = (జనర్లోకమునకు అధిపతి యగు) చతుర్ముఖబ్రహ్మయొక్కయు, విరాజపూరుష = తటస్థేశ్వరుఁడైన వైరాజుఁడను పేరుగల విరాట్పురుషునియొక్కయు, లసత్స్వర్లోదరానందములు - లసత్ = ప్రకాశించుచుండెడి, స్వర్లోదర = హిరణ్యగర్భునియొక్కయు, ఆనందములు = సుఖములు, ఫేనములై = నురుగులై, తనరుఁ = ఒప్పును.

తా. తనయొక్క ఆనందమనెడి ప్రళయకాలసముద్రమందు సార్వభౌముఁడైన చక్రవర్తియొక్కయు, మనుష్యలోకమందు శ్రేష్ఠుఁడైన మనుష్యగంధర్వునియొక్కయు, దేవగంధర్వునియొక్కయు, ద్వివిధములై పితృదేవతలయొక్కయు, అనఁగా ఆజానజాన దేవతలయొక్కయు, అగ్నిష్వాత్తాది దేవతలయొక్కయు, కర్మదేవతలయొక్కయు, దేవతలయొక్కయు, ఇంద్రునియొక్కయు, బృహస్పతియొక్కయు, చతుర్ముఖునియొక్కయు, విరాట్పురుషుఁడైన తటస్థేశ్వరునియొక్కయు, హిరణ్యగర్భునియొక్కయు, పండ్రెండు ఆనందములు, నురుగులు, నీటిచినుకులు, నీటిబుగ్గలు, అలలు మొదలైన భేదములుగాను బుట్టుచు వృద్ధిఁబొందుచు అణఁగుచునుండునని తాత్పర్యము.

శ్రు. ఆశిష్ఠో ద్రఢిష్ఠో బలిష్ఠః, తస్యేయంపృథివీ సర్వావిత్తస్య పూర్ణాస్యాత్. సఏకో మానుష ఆనందః, సఏకో మనుష్యగంధర్వాణామానందః, సఏకో గంధర్వాణామానందః, సఏకో దేవగంధర్వాణామానందః, సఏకః పితౄణాంచిరలోకలోకానామానందః, సఏక ఆజానజానదేవానామానందః, సఏకః కర్మదేవానామానందః, సఏకో దేవానామానందః, సఏక ఇంద్రస్యానందః, సఏకో బృహస్పతేరానందః, సఏకః ప్రజాపతేరానందః, సఏకో బ్రహ్మణ ఆనందః. ఈ పదునొకండు ఆనందములు తైత్తిరీయోపనిషత్తునందుఁ జెప్పఁబడియున్నవి. ఆనందములు పదునొకండు అని వేదమందుఁ జెప్పియుండఁగా పండ్రెండనియేల చెప్పఁబడెననఁగా: తైత్తిరీయోపనిషత్తునందు విరాట్ హిరణ్యగర్భులనిద్దఱి నొక్కనిగా జెప్పఁబడెను. మనుష్యానందము మొదలుకొని హిరణ్యగర్భానందమువఱకుఁ గల ఆనందములన్నియు జ్ఞానియొక్క ఆనందబిందువులే వారిదేహములుగా భావింపవలయును. ఈ పదునొకండు కామ్యానందములు పదునొకండు తెఱంగులుగానున్నవి. వానిలో రూపలావణ్యాదులుంగలిగి యౌవనోజ్జ్వలుఁడై భూలోకమంతయును ఏకచ్ఛత్రాధిపత్యముగా పరిపాలించి భోగించునది మనుష్యానందము. ఈకల్పమందు పుణ్యకర్మఫలమువలన గంధర్వలోకమును పొందిన మనుష్యగంధర్వునియొక్క ఆనందము మనుష్యానందముకంటె నూఱుమడుంగులు అధికము. పూర్వకల్పమునందార్జించిన పుణ్యముచేత గంధర్వపదప్రాప్తిని చెందిన దేవగంధర్వునియొక్క ఆనందము మనుష్యగంధర్వుని ఆనందముకంటె నూఱుపాళ్లు అధికము. పితృలోకమును పొందినవాని ఆనందము దేవగంధర్వుని ఆనందముకంటె నూఱంతలు ఎక్కుడు. కల్పాదియందు పితృదేవతగాఁ బుట్టిన ఆజానజాన దేవానందము

అంతకంటె నూఱుభాగములు అధికము. పౌండరీక గరుడశయన అశ్వమేధాదియాగములచేత ఉన్నతపదవినిపొందినవాఁడు కర్మదేవత. ఇట్టివానిఆనందము అజానజానదేవానందముకంటె నూఱుపాళ్లుఅధికము. కర్మదేవతానందముకంటె దేవతానందము నూఱింతలు ఎక్కుడు. అంతకంటె నూఱింతలు అధికము. దేవేంద్రునిఆనందము ఆ ఇంద్రానందముకంటె నూఱింతలుఅధికము. బృహస్పతియానందము దానికంటెనూఱింతలధికము. ప్రజాపతియొక్క ఆనందము అంతకంటెనూఱింతలు అధికము. విరాట్పురుషుని ఆనందము ఇంతమట్టునకుచెప్పిన పదునొకండుఆనందములు మనోవాక్కులకుఅందినవి అవాఙ్మానసగోచరంబైనది బ్రహ్మానందము. అట్టి యానందసాగరమందు మగ్నుఁడైన బ్రహ్మజ్ఞాని రాగాదివిషయములతో సంబంధించియుండు పైనిజెప్పిన ఏకాదశానందములను ఘనకముక్కిన అశనమువలెభావించి వానియందుఇచ్ఛలేక ఆభోగములన్నిటిని ఇంద్రజాలములుగానెంచుటవలనను వానినన్నింటిని అన్నిభోగస్వరూపులుగానుండి భోగించువాఁడు తానేగదా యను అనుసంధానముచేతను వానినెల్లను అనుభవించువానలవలె సకలభోగములను పొందినవాఁడనిభావము. కాఁబట్టి అపరోక్షజ్ఞానముచేత బ్రహ్మమునుపొంది ప్రపంచజ్ఞప్తిని విడిచినవాఁడు పరబ్రహ్మమేయగును. అట్టివానిని తామరాకుపైనీళ్లవలె ఆగామికర్మము అంటనందుచేత నిప్పుపైనుంచిన తూలమురీతిని సంచితకర్మము దగ్ధమైపోవుచున్నది యని యెఱుఁగవలయును.

అవతారిక:—ముందుచెప్పిన ఆనందమే అతీతమని చెప్పుచున్నారు.

మ. ఎవఁడీసప్తమభూమిఁ గన్గొనిన వాఁ డీశాచ్యుతబ్రహ్మవా
సవదేవర్షిశుకాదులన్మిగిలి సత్సంవిత్సుఖప్రాప్తుఁడై
వ్యవహారంబుల దృశ్యదృష్టి చెడఁగా వర్తించు వాఁ డంచు ము
న్వివరింపంబడె వానిపాదరజమే వేమాఱు దాల్తున్దలన్. ౧౩౪

టీ. ఎవఁడు—ఏపురుషుఁడైనను, ఈ సప్తమభూమిన్—(జ్ఞానభూములేడింటిలో కడపటిదైన తుర్యమనుపేరుగల) ఏడవభూమిని, కన్గొనిన్—తెలిసిపొందనేని, వాఁడు—అపొందినబ్రహ్మవిద్వరిష్ఠుఁడైనవాఁడు, ఈశాచ్యుతబ్రహ్మవాసవదేవర్షిశుకాదులన్- ఈశ—రుద్రుఁడు, అచ్యుత—విష్ణువు, బ్రహ్మ—చతుర్ముఖుఁడు, వాసవ = దేవేంద్రుఁడు, దేవర్షి—నారదసనకాదిదేవఋషులు, శుక—శుకుఁడే, ఆదులన్ — మొదలగు వసిష్ఠపరాశరవ్యాసాదిబ్రహ్మఋషులను, మిగిలి=వీరందఱినిదాఁటి, సత్సంవిత్సుఖప్రాప్తుఁడై—సచ్చిదానందమునుపొందినవాఁడై, వ్యవహారంబులన్—ఆ బ్రహ్మవేత్తవృత్తి సంచరించెడి కాలమందు, దృశ్యదృష్టిచెడఁగాన్—తోఁచెడి బహిర్వ్యాప్తియందలి నామరూపప్రపంచమంతయు వివర్తోపాదనకారణముచేత నశింపఁగాను, వాఁడు—ఆబ్రహ్మవిద్వరిష్ఠుఁడు, వర్తించున్—(వినోదముగా) ప్రవర్తించుచుండును, అంచున్—ఈప్రకారమని, మున్—ముందే,

వివరింపంబడెన్ = చెప్పఁబడెను, ఏన్ = నేను, వేమాఱు = పలుమాఱు, వానిపాదరజము = వానిపాదధూళిని, తలన్ = నాశిరమునందు, తాల్తున్ = ధరించుచున్నాను.

తా. ఏపురుషుఁడైనను తుర్యమనుపేరుగల యేడవభూమినిపొందినవాఁడైనను ఆపురుషుఁడు బ్రహ్మ విష్ణు రుద్రేంద్రాది దేవతలను దేవర్షులను శుకాది బ్రహ్మఋషులను అతిక్రమించినవాఁడై లోకమందు సంచరించును. ఆపురుషునియొక్క పాదధూళి నా శిరస్సునందు ధరించుచున్నానని తాత్పర్యము.

సప్తభూమికలనఁగా: శుభేచ్ఛ, విచారణ, తనుమానసి, సత్వాపత్తి, అసంసక్తి, పదార్థాభావన, తురీయము అనునవి. వీనిలో ఏడవభూమిని బొందినవాఁడు అంబరమున మునిఁగిన భాండమువలె బాహ్యాభ్యంతరదృశ్యరూపములు లేనివాఁడై సముద్రమందుము నిఁగినకుండవలె లోపల వెలుపల పరిపూర్ణుఁడైయుండియు కొంచెమైనను విశేషపాత్రంబు దెలియక విదేహముక్తినిఁ జెందును. కనుక ఈతుర్యభూమియనునది వాక్కునకును మనస్సునకును అందనిదియు సకలభూమికలకును శ్రేష్ఠమైనదియునగును. సప్తభూమికలవివరణము. శుభేచ్ఛయనఁగా: సాగరమువంటి సంసారము నిస్సారమనియెఱిఁగి దాని నేనెటులుదాఁటఁగలనని దుఃఖించి సద్గురుచెంతఁజేరి దురాగ్రహంబులగు తాపంబులఁబోఁగొట్టుకొని మోక్షాపేక్షుఁడైయుండుట. విచారణయనఁగా: శ్రుతి స్మృతి ధ్యానధారణ యోగ తత్త్వగోష్ఠి వ్యాఖ్యానములుసేయు పండితులవలన వలయుశాస్త్రంబులఁదెలిసికొనుచు పాము తనపైనుండు కుబుసమునూడ్చిన తెఱఁగున కామక్రోధాదులను విసర్జించి తత్త్వవిచారమందు బుద్ధిని ఊననిచ్చుట. తనుమానసియనఁగా: మనస్సును విషయేంద్రియ వ్యాపారములయందుఁ దగులనియ్యక అసంగచిత్తుఁడై ఉపనిషదర్థ తత్త్వములయందును తపంబులయందును శిలాతలంబుల విశ్రమించుటలయందును పుష్పవల్లపాన్పులపైఁ బవళించి సుఖంపుమండెడి పురుషునిచందమున మిక్కిలి సంతోషముతోఁ గాలము గడపుట. ఈ తనుమానసి యనుటకు అసంగమనికూడ పేరుగలదు. ఆయసంగమము సామాన్యంబు విశేషంబునన ద్వివిధంబైయుండును. సామాన్యాసంగమనఁగా: శబ్దాదివిషయములందుఁ గర్తయు బాధ్యుండును బాధకుండును నేఁగానని నిశ్చయించుకొని సుఖదుఃఖంబులు దైవాధీనంబులనిభావింపుచు భోగసంయోగములు రోగవియోగంబులనియెంచి సర్వంబును గాలవశంబగుటవలన దేనియందును నాశపడకయుండునట్టిస్థితి. విశేషాసంగమమనఁగా: పైనిజెప్పిన క్రమనియోగంబువలనను, దుర్జనవియోగంబువలనను, ఆత్మజ్ఞానప్రయోగంబువలనను, పురుషప్రయత్నంబువలనను సంతతాభ్యాసముచేయుటచేత పరమవస్తువు కరతలామలకంబై తోఁచుచుండ సంసారపారావారంబునకుఁ బారంబునగు పరతత్త్వస్థితినిజెంది మానియై పరమశాంతినిఁబొందుట. ఇట్టి తృతీయభూమినికన్న మహాపురుషుండు సర్వసంకల్పములుడిగి బ్రహ్మనిష్ఠయందు మనస్సును లయింపఁజేయును. మఱియు నీమూఁడు భూమికలలో

దేనినైననొక్కటినిపొంది ముక్తుండగువాఁడు దేవయానమునందు దేవతాస్త్రీఁ తోఁగూడి అమరలోకంబున అపరిమితభోగంబులందుచు పుణ్యపాపనిచయంబుడిగిపోవఁగా "శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోభిజాయతే, అథవా యోగినామేవకులే భవతి ధీమతామ్" అను గీతావచనమురీతిని భూమియందు శ్రీమంతులును ధీమంతులును ఆచారవంతులును అగు వారి యిండ్లయందుఁబుట్టి ముందు తానువదలినభూమికకుఁజేరి అందుండి క్రమముగా పైభూమికకు నెక్కి స్వాంతముఁజెంది అంతములేని పరమాత్మయే తానగునని భావము. మొదటి మూఁడుభూమికలయందును జన్మముగలదు. తక్కినవానియందు జన్మములేదు. సత్త్వాపత్తియనఁగా: పైమూఁటిని అభ్యసించి యింద్రియార్థములందిచ్ఛమాని ద్వైతభావములేక ప్రపంచమును స్వప్నతుల్యముగా తలఁచుచు నిర్మలుఁడై ఆత్మనిష్ఠగలిగి ప్రకాశించుట. అసంసక్తియనఁగా: పైనాలుఁగు భూమికలయందు అభ్యాసమువలన త్రిగుణముల యొక్కయు విషయములయొక్కయు సంగమంబులేక సత్త్వమాత్రమైనిలచి అనఁగా నిద్రలోవలెనుండి బ్రహ్మనిష్ఠయందు గుఱితప్పకయుండుట. పదార్థాభావన అనఁగా: అభ్యాసముచేత ఐదవభూమికెక్కినవాఁడు వాసనాసంచయశూన్యుఁడై ఘనభావమునొంది సర్వదృశ్యములులేక అద్వైతభావము గలిగియుండుట. అనఁగా బ్రహ్మము తానేయను జ్ఞప్తివిడువకుండుట తురీయమనఁగా: పై ఆఱుభూమికలయందలి భేదాభేదములఁజక్కఁగాఁదెలిసికొని పరబ్రహ్మమాత్రముగానుండుట. దానిని కొందఱు బ్రహ్మయనియు కొందఱు విష్ణువనియు, కొందఱు రుద్రుఁడనియు, కొందఱు జీవుఁడనియు, కొందఱుశూన్యమనియు, కొందఱు కాలమనియు, కొందఱు ప్రధానము మొదలయినవనియు ఇట్లనేకులు అనేకరీతులవక్కాణింతురు కాఁబట్టి దానికి నామరూపంబులులేకుండినను గల్పితనామంబులుఁచెప్పంబడును. ఈ సప్తభూమికలను అభ్యాసముచేయువాఁడు బ్రహ్మవిద్వరిష్ఠుఁడై విదేహముక్తిఁజెందునని భావము. వీనిలో మొదటిభూమికాత్రయము ప్రపంచవ్యవహారముగలది గనుక జాగ్రదవస్థయగును. చతుర్థభూమికయందు రూపనామములతోఁగూడిన ప్రపంచము స్వప్నమురీతిగాఁగనఁబడును గావున స్వప్నావస్థయగును. పంచమషష్ఠభూమికలయందు సకలసంకల్పములు శూన్యమై నిదురవలె ప్రపంచములోఁచుటచేత సకలమైనవాసనలు క్షీణమై పరిపూర్ణమైనప్రపంచము తేజోమయమైన పరమాత్మగాఁ గనఁబడుచున్నందువలన సుషుప్త్యవస్థయనఁబడును. సప్తమభూమిక అవాఙ్మానసగోచరము కాఁబట్టి దానిని తుర్యమని తుర్యాతీతావస్థయనిచెప్పుదురు. వీనిలో తుర్యమును పొందినవాఁడు జీవన్ముక్తుఁడని తుర్యాతీతమునుపొందినవాఁడు విదేహముక్తుఁడని గ్రహింపఁదగును.

అవ:—సచ్చిదానందలక్షణమును గుఱించి సలక్షణముగఁ జెప్పితిఁగావున ఇంకనేదైన సందేహముండినయెడల అడుగుమని ఆచార్యులు చెప్పుచున్నారు.

మ. తగ బోధించితి మోదపంచకము చిత్సంతోష మాలింపు మి
ప్పగ వాక్రుచ్చెద మాయఁ దెల్పుతఱియు న్బోధించితిన్గాదె యి
మ్ముగ సచ్చిత్సుఖశబ్దభావముల నామోదించు మంచు న్గ్రమం
బుగ నాత్మాద్వయ తోషయుగ్మ మఱ నీ బుద్ధిన్దగన్వేఁడుమా. ౧౪౫

టీ. (ద్వంద్వరహితుఁడవైనశిష్యుఁడా) తగన్=లెస్సగాను, మోదపంచకమున్=అయిదువిధములైనఆనందములను, బోధించితిన్=తెలియఁజేసితిని, చిత్సంతోషమున్=జ్ఞానానందమును, ఒప్పగన్=ప్రకాశించునటులు, వాక్రుచ్చెదన్=తెలియఁజెప్పుచున్నాను, ఆలింపుము=వినుము, మాయన్=మాయాస్వరూపమును, తెల్పుతఱిన్=తెలియఁజేయుసమయమందు, ఇమ్ముగన్=బాగుగాను, సచ్చిత్సుఖశబ్దభావములన్-సత్=(పరబ్రహ్మమందలి ఒప్పుచుండెడి) సల్లక్షణము, చిత్=చిల్లక్షణము, సుఖ=ఆనందలక్షణము అనెడి, శబ్ద=శబ్దములమూఁటియొక్క, భావములన్=తాత్పర్యములను, ఆత్మాద్వయతోషయుగ్మము-ఆత్మ=ఆత్మానందము, అద్వయతోష=అద్వితీయానందము, యుగ్మము=అనెడి యీరెంటిని, క్రమంబుగన్=వరుసగాను, ఆమోదించుమంచున్=వినుమనిచెప్పుచు, మున్=ముందు, బోధించితిఁగాదె=తెలియఁజెప్పితినిగదా, అఱ=కొఱఁతను (అనఁగా సందేహమును), నీబుద్ధిన్ తెగన్వేఁడుమా-నీ=నీయొక్క, బుద్ధిన్=అంతఃకరణమందు, (ఉండెడిని) తెగన్=నశించునటులు, వేఁడుమా=అడిగికొనుమా.

తా. ద్వంద్వరహితుఁడవైనశిష్యుఁడా! వరుసగా అయిదువిధములైనఆనందములను తెలియఁజేసితిని. జ్ఞానానందమును ఇఁకఁజెప్పఁబోవుచున్నాను వినుము. ముందుమాయాస్వరూపమును తెలియఁబఱచెడు సమయమందుఁ జక్కఁగా పరబ్రహ్మమందలి సల్లక్షణ చిల్లక్షణ ఆనందలక్షణములను శబ్దములమూఁటియొక్క తాత్పర్యములను ఆత్మానందాద్వైతానందములరెంటిని తెలియఁబఱచితినిగదా? ఇఁక నీఅంతఃకరణమందుఁ గొఱఁతయుండెనేని అదినశించుటకుఁగాను వేఁడుకొనుమని తాత్పర్యము.

అవతారిక:—ఆత్మ సచ్చిదానందమని తెలిసియును దానినిజమైన స్వానుభూతి వెలుపలవచ్చునిమిత్తము శ్రుతియుక్త్యనుభవములనుచేరియుండెడి కూడికను తెలియనడుగుచున్నాఁడు.

మ. శరసంజన్ము జగంబు నన్గనిన యాచార్యేంద్ర వేత్తైన త
ద్వరసచ్చిత్సుఖ శబ్దభావములు మకత్యాన్వంత స్థిరంబెట్లగు
న్దరఁ బర్యాయపదాళి రేఖననుబంధం బొప్పమిం జేసి యే
కరసాఖండము నౌ మధుక్రియ నెఱుంగం బల్కు మాయర్థమున్.

టీ. శరసంజన్ముజగంబునన్గనిన యాచార్యేంద్ర-శర=రెల్లుదుబ్బయందు, సంజన్మున్=ఉద్భవించినకుమారస్వామిని, జగంబున్=నామరూపాత్మకమైనప్రపంచమును, నన్=

నన్నును, కనిన=పుట్టించిన, ఆచార్యేంద్ర=గురుశ్రేష్ఠుఁడవైన సదాశివమూర్తీ, తద్వ్రత సచ్చిత్సుఖశబ్దభావములు-తత్=ముందుచెప్పిన, వర=శ్రేష్ఠమైన, సత్ = (దేశకాలవస్తుపరిచ్ఛేదశూన్యమైన) సత్తనెడి, చిత్ =(జడరహితమైన) చిత్తనెడి, సుఖ=(దుఃఖరహితమైన) సుఖమనెడి, శబ్ద=(మూఁడు) శబ్దములయందలి, భావములు=తాత్పర్యములు, వేరైనన్=వేఱువేఱుగానుండినను, మత్స్వాంతస్థిరంబు-మత్ =నాయొక్క, స్వాంత=(విషయములయందు ప్రవర్తించెడి) మనస్సునకు, స్థిరంబు=నిల్కడ, ఎట్లగున్=ఏప్రకారముకలుగును, ధరన్=భూమియందు, పర్యాయపదాళికేఖన్ = పర్యాయనామములయొక్క సమూహమువలెనే, అనుబంధంబు=సంబంధము, ఒప్పమిన్ = కూడకుండుటవలన, ఏకరసాఖండమున్-ఏక=ఒక్కటిగానైన, రస=మధురాదిరసములతోఁగూడిన, అఖండమున్=పరిపూర్ణమును, ఔ=అగునట్టి, మధుక్రియన్= (తేనెటీఁగలు నానావిధపుష్పములయందలి మకరందముఁదెచ్చి ఒకటిగాఁచేర్చుదు) తేనెవలె, ఆయర్థమున్= (ఆ సచ్చిదానందాది పదత్రయమందలి) భావమును, ఎఱుంగన్=తెలియులాగున, పల్కుము=వచింపుము.

తా. కుమారస్వామిని జగత్తును నన్నునుకనిన గురుస్వామివైన సదాశివమూర్తీ! ముందుచెప్పిన శ్రేష్ఠములైన సచ్ఛబ్ద చిచ్ఛబ్ద ఆనందశబ్దములనెడి మూఁటియొక్క తాత్పర్యములు వేరైనను నాయొక్క విషయములయందు ప్రవర్తించెడిమనస్సునకు నిల్కడయేప్రకారముగాకలుగును. భూమియందుపర్యాయనామములవలెనే సంబంధము కూడకుండుటచేత ఒకటిగానైన మధురాదిరసములతోఁగూడి పరిపూర్ణమగు తేనెటీఁగలచేతఁ జేర్చఁబడిన తేనెవలె ఆసచ్చిదానందాది పదత్రయమందలి భావముతెలియులాగున వచింపుమని తాత్పర్యము.

అవ:—సచ్చిదానందపదార్థములయొక్క ఐక్యమును శ్రుతిప్రమాణములచేత చెప్పఁదొడఁగి ప్రారంభకారణమును ఒద్దికగా శిష్యునకుఁ జెప్పుచున్నారు.

శా. శీతస్యందశుచిత్వము ల్జలము శోచిష్కేశ మూరక్తరు
గ్జాతోష్ణత్వము లంచుఁ బల్కనొకఁ డొచందంబున న్భూతసం
జాతంబం దనృతాదుల న్జడుప నాసచ్చిత్సుఖధ్వాన సం
భూతార్థంబులు బ్రహ్మమందొకటిగాఁ జొ బొల్పొందభేదంబులై.

టీ. శీతస్యందశుచిత్వముల్-శీత=చల్లఁదనము, స్యంద=పల్చనగాజరుగుట, శుచిత్వములు=శుభ్రత, జలము=ఈ (మూఁడును) నీరే, ఆరక్తరుగ్జాతోష్ణత్వములు-ఆరక్త=అంతటను నిండినయెఱుపును, రుగ్జాత=ప్రకాశమును పుట్టించుటయును, ఉష్ణత్వము=వేఁడిమియును, శోచిష్కేశము=ఈ (మూఁడును) అగ్నియే, అంచున్=ఈప్రకారమని, పల్కన్=పలికినను, ఒకఁడౌచందంబునన్=ఒకటియే ఐనట్లు, భూతసంజాతంబందున్-

భూత=ఆకాశాదిపంచభూతములవలన, సంజాతంబందుఁ = పుట్టినటువంటిలోకమందు, అనృతాదులన్-అనృత=అసత్యమే,ఆదులన్=మొదలుగాఁగలవానిని, అనఁగా: సత్తు చిత్తు ఆనందము అనెడి మూఁటియందుగల అనృత జడ దుఃఖములను, చదుపన్=నాశముచేయఁగాను, ఆసచ్చిత్సుఖధ్వానసంభూతార్థంబులు-ఆ=అట్టి, సత్=సద్రూపము యొక్కయు, చిత్=చిద్రూపము యొక్కయు, సుఖ=ఆనందరూపము యొక్కయు, ధ్వాన=శబ్దములచేతను, సంభూత=పుట్టిన, అర్థంబులు=భావములు, బ్రహ్మమందున్ = పరబ్రహ్మమందు, ఒకటిగాన్=ఒకటిగానే, అభేదంబులై = భేదములేనివై, పొల్పొందున్=ప్రకాశించును.

తా. చల్లఁదనమును పల్చనగా జరుగుటయును శుభ్రతయును అనెడు పేళ్లచేత జలము ఒక్కటియైనట్లును, ఎఱుపును ప్రకాశమును ఉష్ణమును అనెడి నామములచేత అగ్ని ఒక్కటియైనట్లును ఆకాశాది పంచభూతవికారమైన ప్రపంచమందు అనృతజడదుఃఖాదులు నిరసించినను సచ్చిదానంద శబ్దార్థములు పరబ్రహ్మమందు ఒకటిగానే భేదములేనివై ప్రకాశించునని తాత్పర్యము.

అనఁగా నిప్పునందును నీటియందును కలిగిన గుణములగు వేఁడిమి, ఎఱుపు, శైత్యము, శుభ్రత మొదలయినవానిని విచారింపఁగా వేఱుగాక వానియొక్క స్వరూపములే యైనట్లు అసత్యరూపమై జడరూపమై దుఃఖరూపమైయుండునట్టి ప్రపంచసమూహముల యొక్క పరిహారమువల్ల సచ్చిదానందస్వరూపమైనది ఒక్కటిగా ప్రకాశించునని తెలియవలెను.

అవ:—సచ్చిదానందైకమత్యము స్థిరపడుటనుగూర్చి వేద మొకటిగాఁజెప్పిన ప్రియమైనపేళ్లలో విధినామములను రెండుపద్యములచేతఁ జెప్పుచున్నారు.

మ. పరమార్థంబు నిదాన మేకము పరబ్రహ్మంబు నిత్యంబు స
త్పరిపూర్ణంబు సనాతనంబు నిజ మాత్మ ప్రత్యగాత్మ బోధంబు ను
స్థిర మాద్యంబు శివంబు శాంతము మహజ్జీవంబు తుర్యంబు పు
ష్కరమాలత్యము దృక్కుటస్థమును ప్రక్ప్రత్యగ్జ్యోతి యనుచున్దగన్.

మ. పరమేకాంతము సర్వశక్తము చతుష్పాదంబు సత్యంబు దు
స్తరమోంకారము జ్యోతిపావనము హృద్యంబుత్తమం బాద్యమం
బర మాధారము సాక్షి కేవలము సంప్రజ్ఞాన భూతం బనా
వరుస న్నద్విధి నామము ల్దెలియు ము న్నావ్రుచ్చె వేదం బిలన్.

టీ. పరమార్థంబు-పరమ = అతిశయమైన, అర్థంబు=వస్తుస్వరూపమైనదియు, నిదానము=జగత్తునకు ఆదికారణమైనదియు, ఏకము=ముఖ్యమైనదియు, పర=అతిశయమైన,

బ్రహ్మంబు=గొప్పదియు, నిత్యంబు=శాశ్వతమైనదియు, సత్పరిపూర్ణము-సత్=శ్రేష్ఠము గా, పరిపూర్ణము=అంతటనిండియుండునదియు, సనాతనంబు=అనాదిఅయినదియు, నిజ ము=యథార్థమైనదియు, ఆప్తంబు=అంతటమైత్రిగలిగియుండునదియు, ఆత్మ=స్వస్వ రూపమైనదియు, బోధంబు=జ్ఞానస్వరూపమైనదియు, సుస్థిరము=కదలనిదియు, అద్వయంబు =రెండవదిలేనిదియు, సమంబు=సమభావమైనదియు, శాంతము=శాంతస్వరూపమైనదియు, మహాజీవంబు=సకలజీవులకు జీవమైనదియు, తుర్యంబు=పదియాఱవభాగమైనదియు, పు ష్కలము=సమృద్ధిగా నుండునదియు, అలక్ష్యము=లక్షణముచేత అంతటచూడఁబడునది యు, దృక్కు=దృగ్రూపమైనదియు, తత్త్వము=తత్త్వస్వరూపమైనదియు, ప్రకృష్ట జ్యోతి-ప్రకృష్ట=అత్యుత్కృష్టమైనదియు, జ్యోతి=ప్రకాశమైనదియు, తగన్=సొస్స గాను, అంచున్=ఈప్రకారమనియు, క్రిందిపద్యముతో నన్వయము.

టీ. ఇలన్=భూమియందు, పరము=అంతటికి పరమైనదియు, ఏకాంతము=ఏకాం తముగానుండునదియు, సర్వశక్తము=సకలసామర్థ్యములుఁగలదియు, చతుష్పాదంబు=నా లుగుపాదములుఁగలదియు, సత్యంబు=సత్యస్వరూపమైనదియు, దుస్తరము=దుర్లభమైనది యు, ఓంకారము=ప్రణవస్వరూపమైనదియు, జ్యోతి=జ్యోతిస్వరూపమయినదియు, పావనము=పవిత్రమైనదియు, హృద్యంబు=మనోజ్ఞమయినదియు, ఉత్తమంబు=శ్రేష్ఠ మయినదియు, అధ్యము=ప్రభునైనదియు, అంబరము=ఆకాశస్వరూపమయినదియు, ఆధారము=అన్నిటికి ఆధారమయినదియు, సాక్షి=మధ్యస్థమైనదియు, కేవలము=ముఖ్య మయినదియు, సంప్రజ్ఞానభూతంబు=జ్ఞానస్వరూపమయినదియు, అనన్=అనునట్లుగా ను, వరుసన్=క్రమముగాను, సద్విధినామములు-సత్=శ్రేష్ఠములైన, విధినామములు= నిర్ణయములైనపేళ్లు, తెలియన్=తెలియునట్లుగాను, మున్=పూర్వమందు, వేదంబు= శ్రుతి, వాక్రుచ్చెన్=వచించెను.

తా. అతిశయమైన వస్తుస్వరూపమయినదియు, జగత్తునకు ఆదికారణమయినదియు, అతిశయమైన గొప్పదియు, శాశ్వతమయినదియు, శ్రేష్ఠముగా అంతటనునిండియుండు నదియు, అనాదిఅయినదియు, యథార్థమయినదియు, అంతటమైత్రిగలిగియుండునదియు, స్వస్వరూపమయినదియు, రెండవదిలేనిదియు, సమభావమయినదియు, శాంతస్వరూపమయి నదియు, సకలజీవులకు జీవనమయినదియు, పదియాఱవభాగమయినదియు, సమృద్ధిగా నుండునదియు, లక్షణముచేత అంతటను చూడఁబడునదియు, దృగ్రూపమయినదియు, తత్త్వస్వరూపమయినదియు, అత్యుత్కృష్టమైనదియు, ప్రకాశమయినదియు, భూమి యందు అన్నిటికిని పరమయినదియు, ఏకాంతముగానుండునదియు, సకలసామర్థ్యములు గలదియు, నాలుగుపాదములుగలదియు, సత్యస్వరూపమయినదియు, దుర్లభమయినది యు, ప్రణవస్వరూపమయినదియు, జ్యోతిఃస్వరూపమయినదియు, పవిత్రమైనదియు,

మనోజ్ఞమయినదియు, శ్రేష్ఠమయినదియు, ప్రభుపైనదియు, ఆకాశస్వరూపమయినదియు, అన్నిటికిని ఆధారమయినదియు, మధ్యస్థమయినదియు, ముఖ్యమయినదియు, జ్ఞానస్వరూపమయినదియు అనునట్లుగా క్రమముగా శ్రేష్ఠములగు నిర్ణయములైనపేళ్లు తెలియునట్లుగాను పూర్వమందు శ్రుతి వచించెనని తాత్పర్యము.

ఈశావాస్యము మొదలయిన ఉపనిషత్తులయందుఁ జెప్పఁబడిన నామములు త్రయోదశవిధములు. వానిలో విధినామములు నిషేధనామములు ముఖ్యములు. వేదమందు బ్రహ్మస్వరూపమునకు నిర్ణయములైనపేళ్లు విధినామములనఁబడును. అనఁగా వానికంటె సత్కృష్టమయినవి లేవని భావము. ॥సర్వంఖల్విదంబ్రహ్మ తజ్జలానీతిశాంతఉపాసీత॥ ॥ఆత్మానమేవవేదాహంబ్రహ్మాస్మీతి॥ ॥ఆత్మావారేద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః॥ అను మొదలైనవాక్యములయందు చెప్పఁబడ్డట్లు సర్వము బ్రహ్మమనియు ఆబ్రహ్మమందుండియే సర్వముకలఁగుచు ఉజ్జీవించుచు లయించుచు ఉన్నదని శాంతచిత్తుఁడై ఉపాసించి తన్నెఱిఁగి తానే బ్రహ్మమనియు ఒకరివలన మాడఁబడెడువాఁడు, వినఁబడెడువాఁడు, మననముఁ జేయఁబడెడువాఁడు, నిదిధ్యాసముఁ జేయఁబడెడువాఁడు ఆత్మస్వరూపుఁడైన తానేగదాయనియు, అనఁగా, ఏవేవి కండ్లకుఁగనఁబడుచు కర్ణములకు వినఁబడుచున్నవో అవియన్నియు ఆత్మస్వరూపమని భావించవలయునని వేదాభిప్రాయము.

అవః—నిషేధనామములను రెండుపద్యములచేతఁ జెప్పుచున్నారు.

మ. అవినాశం బతులం బనామయ మవాచ్యం బద్వితీయం బభా
వవిహీనం బచలం బఖండ మజ మవ్యక్తం బనంతంబు సం
భవదోషాదివివర్జితం బమల మస్పర్శం బచింత్యం బహే
తు వమూర్తంబవికారమవ్యయమునిర్దుష్టంబనాఁ బేర్లగున్. ౧౪౦

చ. నిరవయవంబు నిష్కళము నిర్గుణ మచ్యుత మప్రమేయ మ
క్షరము నిరంజనం బసదృశం బమృతంబు నిరంతరం బగో
చర మశరీర మద్వయ మసాధ్య మతీంద్రియ మప్రతర్క్య మి
ట్లరయ నిషేధనామముల నాదు శ్రుతుల్బహుభంగుల న్సుతా.

టీ. అవినాశంబు=నశించనిదియు, అతులంబు=ఈడులేనిదియు, అనామయము=(దేహేంద్రియవ్యాపారములులేకుండుటంజేసి) వ్యాధులులేనిదియు, అవాచ్యంబు=చెప్పుటకునలవి గానిదియు, అద్వితీయంబు=ఆత్మస్వరూపమునకంటె రెండవదిలేనిదియు, అభావవిహీనంబు=ప్రాగభావ, ప్రధ్వంసాభావ, అన్యోన్యాభావాత్యంతాభావములనెడి నాలుగువిధములైన అభావములులేనిదియు, అచలంబు=చలించనిదియు, అఖండము=ఖండ

ముగానిదియు, అజము=పుట్టుకలేనిదియు, అవ్యక్తంబు=ఇట్టిదట్టిదనిచెప్పుటకు వీలుపడనిదియు, అనంతంబు=అంతములేనిదియు, సంభవదోషాదివివర్జితంబు - సంభవ=పుట్టుకయనెడి, దోష=దోషమే, ఆది=మొదలగునవి, వివర్జితంబు=లేనిదియు, అమలము=నిర్మలమయినదియు, అస్పృశంబు=స్పృశింపఁదగనిదియు, అచింత్యంబు=చింతించుటకుఅశక్యమయినదియు, అహేతువు=కారణములేనిదియు, అమూర్తంబు=మూర్తద్రవ్యముకానిదియు, అనఁగా కంటికికనఁబడనిదియు, అవికారము=షడ్వికారములేనిదియు, అవ్యయము=లింగవిభక్తులులేనిదియు, నిర్దుష్టంబు=దుష్టముగానిదియు, అనాఁ=అనునట్లుగాను, పేళ్లు=నామములు, అగుఁ=అగును.

టీ. నిరవయవంబు=(ఆపరమాత్మ మాతృపితలులేనిదగుటవలన) అవయవశూన్యమయినదియు, నిష్కళము=కళలకుమీఱినదియు, నిర్గుణము=ప్రకృతిగుణములులేనిదియు, అచ్యుతము=(అంతటను ఆబ్రహ్మమేయున్నదిగనుక జరుగుటకు వేఱుజాగాలేనిదగుటవలన) క్రిందికిఁబడనదియు, అప్రమేయము=(ప్రమాత, ప్రమాణము, ప్రమేయము అను త్రిపుటిరహితమయినది గనుక) తెలియనశక్యమయినదియు, అక్షరము=క్షరముగానిదియు, (అనఁగా నశించనిదియు) నిరంజనంబు=సాధనాంతరాపేక్షలేనిదియు, అసదృశంబు=సమానములేనిదియు, అమృతంబు=మృతముగానిదియు, నిరంతరంబు=అంతరరహితమయినదియు, అగోచరము=మనస్సు మొదలయిన ఇంద్రియములకుగోచరించనిదియు, అశరీరము=శరీరములేనిదియు, అద్వయము=ద్వంద్వములేనిదియు, అసాధ్యము=సాధ్యముగానిదియు, అతీంద్రియము=ఇంద్రియముల నతిక్రమించి యుండునదియు, అప్రతర్క్యము=తర్కయుక్తులకు లభ్యముగానిదియు, ఇట్లు=ఈప్రకారము, అరయుఁ=విచారించఁగాను, నిషేధనామములు=త్రోయఁగా నిలువఁబడిన అర్థముయొక్క పేళ్లను, సుతా=కుమారా, బహుభంగులఁ=అనేకవిధములుగాను, శ్రుతులు=వేదములు, అడుఁ=పల్కును.

తా. నశించనిదియు, ఈడులేనిదియు, వ్యాధులులేనిదియు, చెప్పుటకు నలవిగానిదియు, రెండవదిలేనిదియు, ప్రాగభావ, ప్రధ్వంసాభావ, అన్యోన్యాభావ, అత్యంతాభావములనెడి నాలుగువిధములైన అభావములుకానిదియు, చలించనిదియు, ఖండముగానిదియు, పుట్టుకలేనిదియు, ఇట్టిదట్టిదనిచెప్పుటకు వీలుపడనిదియు, అంతములేనిదియు, పుట్టుకయనెడి దోషము మొదలగునవి లేనిదియు, నిర్మలమయినదియు, స్పృశింపఁదగనిదియు, చింతించుటకు అశక్యమయినదియు, కారణములేనిదియు, మూర్తద్రవ్యముకానిదియు, వికారశూన్యమయినదియు, లింగవిభక్తులులేనిదియు, దుష్టముగానిదియు, అవయవశూన్యమైనదియు, కళలుమీఱినదియు, ప్రకృతిగుణములేనిదియు, క్రిందికిఁబడనిదియు, తెలియశక్యముగానిదియు, క్షరముగానిదియు, సాధనాంతరాపేక్షలేనిదియు, సమానములేనిదియు,

వృతముగానిదియు, అంతరహితమయినదియు, మనస్సు మొదలయిన ఇంద్రియములకు గోచరించనిదియు, ద్వంద్వములులేనిదియు, సాధ్యముగానిదియు, ఇంద్రియముల నతిక్రమించియుండునదియు, తర్కయుక్తులకు లభ్యముగానిదియు, ఈప్రకారము విచారించఁగాను శ్రోత్రియఁగా నిలువఁబడిన పేర్లను కుమారా! అనేకవిధములుగాను వేదములు పలుకుచున్నవని తాత్పర్యము.

నిరంజనంబుఅనఁగా: 《నిర్గతమంజనంయస్యతత్ నిరంజనం》 అని వ్యుత్పత్తి. అంజనమనఁగాఁ గాటుక. అది భూతాంజనము, ధనాంజనము, దేవాంజనము, చోరాంజనము మొదలైనసాధనములద్వారా భూతధనాదులను దెలిసికొనినచందమున అపరబ్రహ్మమును దెలిసికొన నలవిగాదుగనుక నిరంజనంబని చెప్పఁబడెను. అద్వయమనఁగా: ద్వంద్వరహితమైనది. ఇచ్ఛాద్వేషములవలనఁ గలిగినటువంటి శీతోష్ణసుఖదుఃఖాదులు ద్వంద్వములు. అపరబ్రహ్మము అట్టివానియందు మోహముచేతఁదగులుకొననిదియని గ్రహింపవలయును.

అ: —ఈవిధముగాఁ జెప్పఁబడిననామములయొక్క ఏకత్వమును జెప్పుచున్నారు.

శా. ఈరీతి న్విధిసన్నిషేధములఁ దా నీక్షించి తత్తద్గుణ
శ్రీ రంజిల్ల సమాఖ్యలం దెలుపు ధాత్రి న్వేద మానామవి
స్తారార్థం బొకఁడై నభాతి నుత సత్సంవిత్సుఖోక్త్యర్థము
ల్సేరుపూర్ణమునందు నీవయదియై చెన్నొందుమెవ్వేళలన్. ౧౪౨

టీ. సుతా—కుమారా, ఈరీతిన్—ఈప్రకారముగాను, విధిసన్నిషేధములన్-విధి—నియతిపూర్వకములను, సత్—లెస్సగాను,నిషేధములన్—త్రోయఁబడఁగా నిలిచినవానిని, తాన్—తానైన, వేదము—వేదమైనది, ఈక్షించి—పరమాత్మను మాచి, తత్తద్గుణశ్రీరంజిల్లన్-తత్తత్—అప్పుడప్పుడు నూతననూతనములుగాజనించెడి, గుణ—పరమాత్మునియందలి ప్రకృతిగుణములచేత, శ్రీ—సంపదైశ్వర్యములచేత, రంజిల్లన్ — ప్రకాశించఁగాను, సమాఖ్యలన్—నామధేయములను, తెల్పన్—తెలియఁజేయును, ధాత్రిన్— పుడమియందు, ఆనామవిస్తారార్థంబు-ఆనామ—ఆపేళ్ళయొక్క, విస్తార—విస్తరించిన, అర్థంబు—తాత్పర్యము, ఒకఁడైనభాతిన్ — ఒక్కటియేయైనట్లు, సత్సంవిత్సుఖోక్త్యర్థముల్-సత్—సత్తనెడి, సంవిత్—చిత్తనెడి, సుఖ—అనందమనెడి, ఉక్తి—శబ్దములయందలి, అర్థములు—తాత్పర్యములు, పూర్ణమునందున్—అఖండాకారపరబ్రహ్మమునందు, చేరున్—ఒకటిగాఁ గూడును, ఎవ్వేళన్ — సర్వకాలసర్వావస్థలయందు, నీవ—నీవే, అదియై—(అపరోక్షజ్ఞానముచేత) అపరబ్రహ్మమై, చెన్నొందుము—ప్రకాశింపుము.

తా. కుమారా! ఇవ్విధముగా తానైనవేదము విధిపూర్వకముగాను నిషేధపూర్వకముగాను పరమాత్మను తానుగాఁ జూచించి అప్పుడప్పుడు క్రొత్తక్రొత్తగాఁ బుట్టెడి పరమా

త్తునియందలి వివర్తోపాదానప్రకృతిగుణములవలనఁగలిగిన సంపదైశ్వర్యములచేతప్రకాశించెడినామధేయములను తెలియఁజేయును. పుడమియందు ఆపేళ్ళయందు విస్తరించిన అర్థంబు ఒక్కటియేయైనట్లు సచ్చిదానందములనెడి మూఁడువాక్యములయందలితాత్పర్యములు అఖండాకార పరబ్రహ్మమందు ఒకటిగానేకూడును. కాఁబట్టి సర్వకాలసర్వావస్థలయందును ఆపరబ్రహ్మము నీవేయైయుండుమని తాత్పర్యము.

అవతారిక:— గుణాతీతమైనవస్తువునకు ప్రకృతిజన్యములైన గుణములను జెప్పవచ్చునా యనుదానికి సమాధానము చెప్పుచున్నారు.

చ. అగుణునకిమ్మెయిం బలుకనాఖ్యలు వంధ్యకుమారసంతతి
జగతి గణించినట్టులని సజ్జన యెంచకు మార్యులౌదురే
తగ నెఱిఁగింపకున్న గురుతత్త్వము దేశికులీశునట్లొగిన్
నిగమము గౌణనామముల నెమ్మి నుతింపఁ దదర్థమేకమౌన్. ౧౪౩

టీ. సజ్జన=మంచిశిష్యుఁడా, అగుణునకున్=నిర్గుణుఁడైనపరబ్రహ్మమునకు, ఇమ్మెయిన్=ఈప్రకారముగాను, ఆఖ్యలు=పేళ్లను, పలుకన్=పచించినను, జగతిన్=పుడమియందు, వంధ్యకుమారసంతతిన్-వంధ్య=గొడ్రాలియొక్క, కుమార=బిడ్డలయొక్క, సంతతిన్=సముదాయమును, గణించినట్టులని=లెక్కపెట్టినట్టులని, ఎంచకుము=ఆలోచించకుము, గురుతత్త్వమున్-గురు=అతిశయమైన, తత్త్వమున్=పరబ్రహ్మరూపమును, తగన్=లెస్సగాను, దేశికులు=ఆచార్యులు, ఎఱిఁగింపకున్నన్=తెలియఁజేయకుండినచో, ఆర్యులౌదురే=పండితులౌదురా, ఈశున్=పరమాత్మని, అట్లు=ఆప్రకారము,ఒగిన్=క్రమముగాను, నిగమము=వేదము, గౌణనామములన్=ప్రకృతిగుణసంబంధములైన పేళ్ళను, నెమ్మిన్=మిక్కుటముగా,నుతింపన్=స్తోత్రముచేయఁగాను, తదర్థము=ఆపేళ్ళయొక్కఅర్థము, ఏకమౌన్=ఒక్కటేయగును.

తా. మంచిశిష్యుఁడా! నిర్గుణుఁడైన బ్రహ్మమునకు ఈప్రకారము పేళ్ళనుబల్కినను పుడమియందు గొడ్రాలికొడుకులను వారిగోత్రనామములను లెక్కచేసినట్టులని ఆలోచించకుము.అతిశయమైన పరబ్రహ్మస్వరూపమును లెస్సగా పెద్దలుశిష్యులకుఁదెలియఁజేయకుండిరేని పండితులౌదురా? అనఁగా పండితులుకారనుట. కాఁబట్టి పరమాత్మని ఆప్రకారము క్రమముగా వేదములు ప్రకృతిగుణసంబంధములైనపేళ్ళను మిక్కిలి స్తోత్రముచేయఁగాను ఆపేళ్ళయొక్కఅర్థము ఒక్కటేయగునని తాత్పర్యము.

అవతారిక:—సచ్చిదానందములతాత్పర్యము ఒక్కటే అనునది శ్రుతిచూపించినట్లు బుద్ధియందును చూపించవలయునని శిష్యుఁడడుగుచున్నాఁడు.

ఉ. మోహతమస్సహస్రరవిమూర్తి మదుక్తుల నాలకింపు మీ
దేహముకంటె నన్య మగు ధీపరిపూర్ణమదీయతత్త్వమే
సాహసవృత్తిఁ గంటి శ్రుతిసమ్మతిఁ దెల్పుము యుక్తియుల్లమా
యూహ నడంగ వృక్షముఁ నొప్పఁగఁ దాఁపినచీలపోలికన్. ౧౪౪

టీ. మోహతమస్సహస్రరవిమూర్తి-మోహ=ఈశ్వరజీవజగద్భ్రమలనెడి, తమః=కటికచీఁకటికి, సహస్రరవి=వెయ్యిసూర్యులు యేకకాలమందు ప్రకాశించిన స్వరూపమువంటి స్వరూపముగల, మూర్తి=నాగురుస్వామీ, మదుక్తులన్=సేవకుఁడనైన నామాటలను, ఆలకింపుము= (ఆదరణపూర్వకముగా) వినుము, ఈదేహముకంటెన్=ఈపంచభూతవికారమైన స్థూలదేహముకంటెను, అన్యము = వేరైనది, అగుధీపరిపూర్ణమదీయతత్త్వమున్-అగు=ఐనట్టి, ధీ=అపరోక్షజ్ఞానముచేత, పరిపూర్ణ=అంతరబాహ్యములయందంతటనునిండిన, మదీయ=నాయొక్క, తత్త్వమున్=యథార్థస్వరూపమును, ఏన్=నేను, సాహసవృత్తిన్= (అంతఃకరణమందుఁదోఁచెడి జగద్వ్యాపారములనునిరసించఁగా మిగిలిన బ్రహ్మవిషయకవృత్తిచేతను, కంటిన్=చూచితిని, శ్రుతిసమ్మతిన్=వేదసమ్మతమును, తెల్పుము=తెలియఁజెప్పుము, యుక్తిన్=యుక్తిచేతను, ఉల్లము=మనస్సనునది, ఆయూహన్=అజ్ఞప్తియందు, వృక్షమునఁదాఁపినచీలపోలికన్-వృక్షమునన్=పచ్చిచెట్టునందు, తాఁపిన=కొట్టిన, చీలపోలికన్=ఇనుపమేకువలె, అడంగన్=పొందునట్లుగాను, తెల్పుము=తెలియఁజెప్పుము.

తా. ఈశ్వరజగద్భ్రమలనెడి కటికచీఁకట్లకి వేయిసూర్యులు ఏకకాలమందుదయించిన తేజస్సువంటి తేజస్సుగల గురుస్వామీ! సేవకుఁడనైన నాయొక్కమాటలను ఆలకింపుము. ఈ స్థూలదేహముకంటె వేరైన అపరోక్షజ్ఞానముచేత అంతరబాహ్యముల యందంతటనిండిన నాయొక్క నిజస్వరూపమును చూచితిని. వేదసమ్మతముగాను యుక్తిచేతను పచ్చిమ్రాఁకునందుఁగొట్టిన చీలవలె నామనస్సనది నేనైన ఆయూహయందుఁబొందులాగునఁ దెలియఁజెప్పుమని తాత్పర్యము.

"వృక్షమునఁదాఁపిన చీలపోలికన్" అనుటచేత ఎండినమ్రానియందుఁ గొట్టఁబడిన ఇనుపమేకుకంటె పచ్చిగానుండు చెట్టునందుఁ గొట్టఁబడినమేకు కదలక బిగువుగాకఱచుకొనియుండుఁగాన అటులనే శిష్యుఁడు తనమనస్సును బ్రహ్మవిషయకజ్ఞానమందు నిలుకడగానుండునటులు శ్రుతిప్రమాణములచేతను యుక్తిమార్గములచేతను బోధింపవలయునని ఆచార్యులను అడుగుచున్నాఁడు.

అవ:—ఆప్రశ్నకు దిగువవచ్చెడి రెండుపద్యములచేత ఉత్తరము చెప్పుచున్నారు.

మ. అవినాభావము లౌను సన్మతులు మిథ్యాభూతముల్గావె వే
ఱవి యైన న్బరుఁ డెందుఁ దోఁచు స్థితియెట్లౌఁ బ్రజ్ఞకు న్దాని హే
తు వనం బ్రీతికి జాడ్య మౌనెటులు తత్తోషాప్తియౌ నన్న నా
కవ యొండైనఁ బ్రమోదమందెయగు దుఃఖంబుల్మదిందీఱఁగన్.

టీ. సన్మతులు-సత్=(దేశకాలవస్తుపరిచ్ఛేదశూన్యమగు) సద్రూపము, మతులు=(త్రికాలములను తెలిసికొనెడి) చిద్రూపము, అవినాభావములౌను-అవినాభావములు=ఒకదానికొకటి వేఱులేనిస్వభావములు, ఔను=అగును. (అనఁగా దీపమునకు దీపప్రకాశమునకు భేదములేనట్లు) అవి=ఆసత్తుచిత్తులురెండును, వేఱు=భిన్నములు, ఐనన్=ఐన పక్షమందు, మిథ్యాభూతముల్గావె=అసత్యములుగావా, పరుఁడు=సర్వప్రపంచమునకు విలక్షణుఁడైనసాక్షి, ఎందున్=ఎచ్చటను, తోఁచున్=ప్రకాశించును, (అనఁగా ప్రకాశించఁడనుట) ప్రజ్ఞకున్=చిత్తునకు, స్థితి=నిల్కడ, ఎట్లౌన్=ఏప్రకారమగును, ప్రీతికిన్=ఆనందమునకు, దానిన్=ఆప్రజ్ఞను, హేతువనన్=బీజమనినను, జాడ్యమౌన్=జడస్వభావము ఐనదగును, తత్తోషాప్తి=ఆయానందప్రాప్తి, ఎటులు=ఏప్రకారము, ఔనన్నన్=కలుగుననఁగా, ఆకవ=ఆసత్తుచిత్తులజంట, ఒండైనన్=ఒక్కటేయైనను, అందే=ఆజంటయందే, ప్రమోదము=నిరతిశయానందము, మదిన్=మనస్సునందు, దుఃఖంబులు=శోకములు, తీఱఁగన్=తీఱులాగున, అగున్=అగును.

తా. త్రిపరిచ్ఛేదశూన్యమైన సద్రూపమును త్రికాలాబాధ్యమైన చిద్రూపమును ఒకటేయగును. ఆ సత్తుచిత్తులు రెండును వేఱైనను అనృతజడములౌను. అప్పుడు సర్వప్రపంచమునకు విలక్షణుఁడైన సాక్షి యెక్కడఁదోఁచును. (అనఁగా సత్తునకు చిత్తు వేఱైనయెడల సాక్షిదోఁచదనియు, చిత్తునకు సత్తు వేఱైనయెడల నిల్కడ ఎవ్విధమునను కలుగదనియు భావము.) ఆచిత్తును ఆనందమునకు హేతువనినను అది జడస్వభావముగలదియగునే అప్పుడు ఆనందానుభవము ఏప్రకారమగును. కాఁబట్టి ఆసత్తుచిత్తులయొక్క జంట ఏకమైనపక్షమందు దానియందే అంతఃకరణమందుఁదోఁచెడి దుఃఖములునశించి నిరతిశయానందమగునని తాత్పర్యము.

ఆత్మసద్రూపమనుటకు "కేనాప్యబాధితత్వేన త్రికాలేఽప్యేకరూపతా, విద్యమానత్వమస్త్యేత త్తద్రూపత్వంసదాత్మనః" అను శ్లోకార్థముచొప్పున ఏవస్తువు దేనిచేతను బాధింపఁబడక మూఁడుకాలములందును ఏకస్వరూపముగ నుంటున్నదో ఆ పదార్థమే సద్రూపమని భావము. త్రికాలములయందు నెవ్విధమునను దేనిచేతను బాధింపఁబడనిది ఆత్మయేగనుక అదియే సద్రూపము. ఇందుకు అనుభవదృష్టాంతము. బీదవాఁడు తాను పూర్వజన్మమం దెవ్వరికిని బెట్టనిహేతువుచేత నీజన్మమందు బీదతికము ననుభవించెదననియు ఇప్పుడెవ్వరికైన నేదైనను ఇచ్చుటకు చాలనివాఁడనైయున్నాను గాన ఇఁకరాఁ

బోవు జన్మమందున దరిద్రుఁడనుగా నే యుందుననియు చెప్పుటచేతను భాగ్యవంతుఁడు తాను మునుపటిజన్మమున దానధర్మములు సలుపుటచే నీజన్మమునఁ గలిమిగలవాఁడనై పుట్టితిని గనుక మఱుజన్మమునందును ఇట్లే యుండుటకు దానాదులు చేసితినే గదా యని తలంచుటచేతను ఈరీతినే వేదవిహితములగు కర్మానుష్ఠానపరులును ఈశ్వరభక్తులును తమ తమ కర్మోపాసనలచేత నీజన్మమున సత్కర్మప్రవర్తనలును దైవభక్తులును గలిగినవనియు వానిచేఁ దమకు పరలోకసౌఖ్యములును భగవత్సాన్నిధ్యపదవులును కలుగునని యెంచుటలచేతను కాలత్రయమందును ఆత్మ యున్నదని అనుభవసిద్ధమే గదా! మఱియు యుక్తిచేత విచారించినయెడల మనమిప్పుడు సశరీరులమే గదా! ఆశరీరములు పూర్వజన్మమందు చేసినకర్మముచేతనే గదా కలిగినవనవలయును. ఎందుకనఁగా: చెట్టువలనఁ గలిగిన విత్తనము ఆచెట్టునకుఁ గారణముగానట్లు ఈశరీరములు ఈజన్మమునఁ జేసిన కర్మకు కారణమనరాదు గనుక పూర్వజన్మఫలమనియే చెప్పవలయును. దేహములేనియెడల కర్మ చేయసరిపడదు గనుక తొల్లిటిజన్మమందును దేహముకలదనియే స్ఫురించుచున్నది. ఆజన్మమున ఆదేహమెట్లు కలిగెనని యోజించిన అంతకు పూర్వము చేసిన కర్మవలననని రూఢిపడుచున్నది. ఇందువలన శరీరపరిగ్రహణము అనేకకల్పములనుండి వచ్చుచున్నట్లు స్పష్టమగుచున్నది. కావున యుక్తిచేతను ఆత్మ త్రికాలాబాధ్యమయిన సద్రూపమనియే సాధింపనైనది. ఆసత్తయిన ఆత్మకు చిద్రూపమెట్లగుననఁగా: ‹‹సర్వాలోపితాశేష పదార్థభాసకత్వాత్మనస్సాధనమంతరేణయత్, వదంతి వేదాంతవిదోహి తాంస్వయం ప్రకాశమానస్యతు చిత్స్వరూపతామ్›› అను శ్లోకార్థమురీతిని ఏపదార్థము సాధనాంతరాపేక్షలేక తానుగాఁ దోఁచుచు తనయందారోపింపఁబడిన సమస్తవస్తువులను తోఁపింపఁజేయుచున్నదో అదియే చిద్రూపముగావున అంతరబాహ్య ప్రపంచంబులు మనచేత నెఱుఁగఁబడుచున్నవే గాని వానిచేత మనమెఱుఁగఁబడలేదు కాఁబట్టి వానిని దెలిసికొనుచుండెడి మనకు సర్వపదార్థావభాసకత్వము సాధనాంతరాపేక్షలేకయే సిద్ధించెను. మనము మనస్సుచేతనే గదా తెలిసికొనఁబడుచున్నాము. అది మనకెట్లు కలుగునన మనస్సు జడమని ముందే తెలియఁబఱిచితిని కాఁబట్టి ఆత్మచేతఁ దోఁపింపఁబడెడి ఆమనస్సు ఆత్మను దోఁపించుట దుర్లభము గనుక ఆత్మచిద్రూపమై ఉపాధియగుమనస్సును సమస్తవస్తువులను ఎఱుఁగఁజేయుచున్నది. ఇందుకు దృష్టాంతము ప్రమిదెలోనిమూనెవలనఁ దడుపఁబడిన నూలువత్తియను ఉపాధితో వహ్నితేజస్సుచేరి ఆవత్తిని చమురును ప్రమిదెను సమీపవస్తువులను చూపించునట్లు ఆత్మ మనస్సుతోఁ గూడి శరీరేంద్రియాదులను బాహ్యాంతరములగు సమస్తవస్తువులను దెలియఁజేయుచున్నది. మఱియు ఆత్మయే ఆనందస్వరూపమనుటకు ‹‹నిరుపాధికనిత్యత్వం సుప్తౌ సర్వసుఖాత్పరమ్, సుఖరూపత్వమిత్యేతదానందత్వం సదాత్మనః›› అను శ్లోకమురీతిని నిరుపాధికమై శాశ్వతమైన నిద్రయందు సమస్తమయినవారిచేత ననుభవింపఁబడిన నిరతి

శయంబగు సుఖస్వరూపము ఆనందరూపము. అనఁగా సర్వదుఃఖనివృత్తికమై గంధర్వ ప్రాదులవలన బుద్ధియందనుత్కృష్టమై నిత్యమగుసుఖము ఆనందము నిద్రయందనుభవింపఁబడిన సుఖము జాగ్రత్స్వప్నములయందువలె పెక్కు రూపములుగా ననుభవింపఁబడక ఏకరూపముగానుండి సమస్తదుఃఖములను బోఁగొట్టుచున్నది గాన దానిని నిరతిశయమగు ఆనందరూప మనందగును. ఈసుఖము నిత్యమైనను ఆత్మకార్యములయిన శరీరేంద్రియాదిసంపర్కమువలన తిరోధానమగుచున్నది. ఇందుకుదృష్టాంతము. స్వతస్సిద్ధమైన అగ్నియొక్క ప్రకాశము దానికార్యమైన పొగయొక్కసంపర్కముచేత ఆయగ్నిప్రకాశమునకు తిరోధానమువచ్చినట్లు స్వతస్సిద్ధమైన ఆనందరూపమగు ఆత్మకును ఆయాత్మకార్యములయిన శరీరేంద్రియాదులకూడికచేత స్వప్నజాగ్రత్తలయందు తిరోధానమువచ్చును. కాఁబట్టి ఈ యానందము నిత్యమని, నిరతిశయమని, నిరుపాధికమని, సుఖస్వరూపమని చెప్పఁబడును. ఈతీరున సచ్చిదానందములు ఆత్మయందే నిరూపింపఁబడినందున ఆసచ్చిదానందస్వరూపుఁడైన ఆత్మ తానేయని ఐక్యపఱచుకొనవలయునని భావము.

ఇట్లనుటచేత సద్వ్యతిరిక్తమగు పదార్థము అసత్తు. ఆయసత్తునకు వస్తుత్వము నిరూపింపఁ బనుమన్నదని చెప్పరాదు. కాఁబట్టి లోకమందు సత్తునుతోఁపింపఁజేసెడి పదార్థము ఒకటైనను లేకుండుటవలనను సర్వమును సత్తునందే ఆరోపింపఁబడుటవలనను సమస్తవస్తువులును సదా దానియందే ఉపజీవించుకొనియుండునట్లు కనఁబడుటవలనను సత్తే స్వప్రకాశమయినదనియు, ఆస్వప్రకాశమయిన సత్తే చిత్తనియు, అచిత్తైనసత్తునకు సమానమగువస్తువు వేఱొకటి లేకపోవుటచేత దానికి వ్యతిరిక్తమగుపదార్థము అసత్తేఅనియు చెప్పవలయును. అట్లు చెప్పుటవలన దానియందు రెండువస్తువులు కలిగియుండవుగాన అసత్తే చిత్తై ఆనందస్వరూపమగును.

మ. తనచే నన్యులచే వెలుంగునొ కనత్సద్వస్తు వాభాషఁ జె
ప్ప ననర్థంబె యవాచ్య మన్న సుత తాత్పర్యంబు లేదన్నఁ జే
యునె వంధ్యాసుతుఁ డెవ్వియైన నవి తాఁ యోజింప లేవన్నఁ దీ
అనినానా దురవస్థలొందవె కుతర్కం బీవు చాలింపుమా. ౧౬౮

టీ. సుత=కుమార, కనత్సద్వస్తువు-కనత్=ప్రకాశమయిన, సద్వస్తువు=(దేశకాలవస్తుపరిచ్ఛేదశూన్యమగు) పరబ్రహ్మము, తనచేఁ=తనచేతనో, అన్యులచేఁ=(లేక) ఇతరులచేతనో, వెలుంగునో=ప్రకాశించునో, ఆభాషఁ=ఆవాక్యమును, చెప్పఁ=చెప్పుటకు, అనర్థంబె=అర్థముకానిదే, అవాచ్యంబన్నఁ=చెప్పుటకుతగనిదనినను, తద్భావంబులేదన్నఁ=ఆతాత్పర్యములేదనినను, వంధ్యాసుతుఁడు=గొడ్రాలికొడుకు, ఎవ్వియైనఁ=ఏకార్యములనైనను, చేయునె=చేయునా, అవి=ఆపనులు, తాఁ=తాను, యోజింపఁ=యోజింపఁగాను, లేవన్నఁ=లేవనినను, తీఅనినానాదురవస్థలు-తీఅని=సెంతే

అని, నానా—బహువిధములైన, దురవస్థలు—దుర్దశలు, ఒందకే—పొందవా, శిశువు—నీవు, కుతర్కం—బు—కుయుక్తిని, చాలింపుము—విడువుము.

తా. కుమారా! ప్రకాశమానమయిన దేశకాలవస్తుపరిచ్ఛేదశూన్యమయిన పరబ్రహ్మము తనచేతప్రకాశించునా లేక అన్యులచేప్రకాశించునా యనెడిమాటలను చెప్పుటకు తగనిది. అట్లు చెప్పఁగూడదనినను అతాత్పర్యములేదనినను గొడ్రాలికొడుకు ఏకార్యములనైనంజేయునే? అపనులఁయోజించి లేవనువానికి సెడఁబాయని బహువిధములైన దుర్దశలఁపొందవా. నీవు కుయుక్తులఁ విడువుమని తాత్పర్యము.

వంధ్యాసుతుఁడెవ్విధముగానైనఁజేయునే అనుటచే వంధ్యయనఁగా బిడ్డలేనిస్త్రీ. అట్టి స్త్రీయొక్క పుత్త్రుఁడు అద్భుతకార్యములనుచేసెననిచెప్పిన నిజమని యెవరునమ్మరుకని తెలియునది. ఆత్మ సద్రూపముగుటవలన ఆయాత్మకు సజాతీయంబును సజాతీయ భేదంబు నులేదు. అయితే అసత్తామాత్రమైనయాత్మకు విజాతీయము అసత్తు. అసత్తుప్రపంచము గనుక సత్తైన ఆత్మకు అమిథ్యయగుప్రపంచము సద్వితీయత్వమును కలిగింపనేరదు. అదెట్లనఁగా: గొడ్రాలికొడుకు తనతల్లిని ఏప్రకారము పుత్త్రవతినిగాఁజేయనోపఁడో అట్లే కల్పిత అసత్తైన జగము సత్తైన ఆత్మకు సద్వితీయత్వమును కలుగఁజేయఁజాలదు. ఐతే ఆ సమాధిపముగు ఆత్మకు సచ్చిదానందములు స్వరూపమయ్యెను గాన శబ్దమాత్రముచేత భేదముకనుపించినను సచ్చిదానందములవలన ప్రత్యక్షముగ భేదము కనఁబడలేదు. ఇందుకు దృష్టాంతము. నిప్పునందుఁ ప్రకాశము, ఉష్ణము, లోహితము అనునవి శబ్దభిన్నములు గానుండినను వానియందు అర్థభేదములుతోఁచినను అవియన్నియు ఆయగ్నియందే కలిగినట్లు సచ్చిదానందములు మూఁడును ఆత్మయందే పొందుపఱుపఁబడియున్నందున వానికి ఎంతమాత్రము భేదముచెప్పఁగూడదు. సత్తే స్వయముగాఁ దోఁచుచున్నది గావఁ జిత్తయ్యెను. అచిత్తైనసత్తునందు రెండువస్తువులు లేనందున నిదియేయానందమయ్యెను. కాఁబట్టి సచ్చిదానందంబులకు భేదములేదు. లేనివస్తువును ఉన్నట్లు స్థాపింపఁగూడదు గనుక సత్తు ఉన్నదనిపల్కుటకు బాధకములేదు. అయితే ఆలోఁచెడిసత్తు తానేతోఁచుచున్నదా లేక మఱియొకదానివలన తోఁపింపఁబడుచున్నదాయనియడిగిన తానేతోఁచుచున్నదనియే సాధింపవలయును గాన అసత్తే చిద్రూపమై ప్రకాశించుచున్నదని భావము.

అవ:—సచ్చిదానందపదములయందు అర్థము ఒక్కటియేఅనుదానికి అనుభవమును జెప్పుచున్నారు.

మ. శ్రుతియుక్తు ల్గనినట్టు లాత్మసుఖముగానొంపొంద నాలింపు మా
తతిను ప్తింగల మోదమానస్ఫురణచేఁ గదద్జ్ఞానమూ మోదమూ
నుత వెవ్వేఱవి గావు కల్పమున నాగను ప్తిన్మహోద్ధ్వాంతము
ల్మతిసద్రూపుఁడ వౌటఁగాంచెదవు బ్రహ్మజ్ఞాని వైయుండుమా.

టీ. సుత=కుమారా, శ్రుతియుక్తుల్-శ్రుతి=వేదము, యుక్తి=తర్కశాస్త్రము, కనినట్టులు=ఒకటిగాపొందినప్రకారము, ఆత్మసుఖము=ఆత్మానుభవము, సొంపొందఁగ=అభివృద్ధిపొందునట్టుగాను, ఆలింపుము=వినుము, ఆతత = అతిశయమయిన, సుప్తిఁ=నిద్రయందు, కల=కలిగిన, మోదము=ఆనందము, అస్ఫురణచేఁ=అజ్ఞప్తిచే, తద్జ్ఞానము=అవివేకము, ఆమోదమౌఁ = ఆసుఖమేయౌను, అవి=ఆయానందజ్ఞానములు, విభేదంబులు=భిన్నంబులు, కావు=కావు, కల్పమునఁ=సకలము లయమయ్యెడి బ్రహ్మత్రయకల్పమందు, సుప్తిఁ=నిద్రయందును, మహాధ్వాంతములు=ఆగొప్పకొద్దిచీఁకటులు, మతిఁ=తెలివిచేతను, సదా=ప్రౌఁడవౌటఁ=సచ్చిదానందస్వరూపమగు ఆత్మనీవేయనెడినిక్కడయందు నీవు చెడకుండనుండినవాఁడవౌటచేతను, కాంచెదవు = చూచుచున్నావుగదా, బ్రహ్మజ్ఞానివైయుండుమా-బ్రహ్మజ్ఞానివై = నీవు అంతయుఁ దెలిసికొన్నవాఁడవై, ఉండుమా=నివసించియుండుమా.

తా. కుమారా! వేదమును తర్కశాస్త్రమును ఒక్కటిగాపొఁదినరీతిని ఆత్మానుభవము పెంపొందునట్టుగాను ఆలింపుము. అతిశయమయిన నిద్రయందుకలిగినఆనందము అజ్ఞప్తిచేతకలిగిన అజ్ఞానము ఆ సుఖమేయగును. కాఁబట్టి ఆనందజ్ఞానములు భిన్నములు కావు. సకలము లయించెడి బ్రహ్మత్రయకల్పమందును నిద్రయందునుగలచీఁకట్లయొక్క భేదములని నీతెలివిచేతను సదాప్రౌఁడవౌటచేతను చూచుచున్నావుగదా; ఇఁకను బ్రహ్మజ్ఞానివైయుండుమని తాత్పర్యము. అనఁగా: సచ్చిదానందముల నెతిఁగెడి జ్ఞానము యొక్క యథార్థము ఒక్కటేయనుటకు అనుభవమును తెలిసికొంటివి గాన శ్రుతియుక్త్యనుభవములతోఁగూడిన సచ్చిదానందముల కూడికయొక్క స్వరూపమును గురుముఖముగాఁ దెలిసికొనునటులు పరమనిష్ఠయందుండుమని భావము.

అవతారిక:—శ్రుతియుక్త్యనుభవప్రకారము శిష్యుఁడు సహజనిష్ఠనుపొందుటను చెప్పఁబడుచున్నది.

మ. సాంగామ్నాయవిదాత్మదేశికకృపన్ సంపూర్ణమై నిష్ఠ త
త్సాంగత్యం బెడలేకయేకముగఁ దత్సంవిత్సుకార్థంబు లు
ప్పొంగ స్సుమ్మరసంబుమాడ్కిని దదుద్బోధ జ్జగచ్చిత్రము
త్తుంగస్వచ్ఛపటంబునన్బలెఁ గనెన్ దోడ్తో నిజాత్మ న్దగన్. ౧౪౮

టీ. సాంగామ్నాయవిదాత్మదేశికకృపన్-సాంగ = (శిక్ష, వ్యాకరణము, ఛందము, నిరుక్తము, జ్యోతిషము, కల్పము, ఇవి యారెడు) షడంగములతోఁగూడిన, ఆమ్నాయ= (ఋగ్యజుస్సామాథర్వణములను) నాలుగు వేదములను, విత్=తెలిసిన, ఆత్మదేశికకృపన్-ఆత్మ=తనయొక్క, దేశిక=గురుస్వామియొక్క, కృపన్=దయచేతను, నిష్ఠ=

నిర్వికల్పసమాధి, సంపూర్ణమై=అంతటను నిండినదై, తత్సాంగత్యంబెడలేక-తత్=ఆ ని
ష్ఠయందుఁదోఁచిన యథార్థవస్తుదర్శనముయొక్క, సాంగత్యంబు=చేరిక, ఎడలేక=ఎడఁ
బాయక, ఏకముగన్=ఒక్కటిగానే, తత్సంవిత్సుఖార్థంబులు-తత్=ఆ పరబ్రహ్మమం
దలి, సంవిత్సుఖార్థంబులు=సచ్చిదానందములు, ఉప్పొంగన్=వెల్లివిరియఁగా, పుష్ప
రసంబుమాడ్కిని = సకలపుష్పములయందలి మకరందము ఒకటిగాఁజేరిన తేనెవలె, తదు
ద్బోధన్-తత్=ఆసచ్చిదానందస్వరూపమైన, ఉద్బోధన్=అతిశయించిన మయిశము
చేతను, ఉత్తుంగస్వచ్ఛపటంబునన్బలెన్- ఉత్తుంగ=ఉన్నతమైన, స్వచ్ఛ=నిర్మలమైన,
పటంబునన్బలెన్=వస్త్రమునందువలెను, నిజాత్మన్-నిజ=తనయొక్క, ఆత్మన్=అంతః
కరణమందు, జగచ్చిత్రము = స్థావరజంగమాత్మక నామరూపప్రపంచమును, తగన్=తె
స్పగాను, తోడ్తోన్=వెంటనే, కనెన్=దర్శించెను.

తా. షడంగములతోఁగూడిన నాలుగువేదములను నెఱిఁగిన గురుస్వామియొక్క
కృపచేతను అంతటనిండిన నిర్వికల్పసమాధికాఁగాను ఆ నిష్ఠయందుఁదోఁచిన యథార్థ
వస్తుదర్శనముయొక్క చేరికను ఎడఁబాయక ఒక్కటిగాను ఆ పరబ్రహ్మమందలి సచ్చి
దానందములు ఉప్పొంగఁగా సకలపుష్పములయందలి మకరందము ఒక్కటిగాఁజేరిన తేనె
వలె ఆసచ్చిదానందస్వరూపము అతిశయించినను ఉన్నతముగా నిర్మలమైన వస్త్రమునం
దువలెను తనయొక్క అంతఃకరణమందు స్థావరజంగమాత్మక నామరూపప్రపంచమును
తెస్పగాను వెంటనే శిష్యుఁడు కనెను అని తాత్పర్యము. జగచ్చిత్ర. ముత్తుంగస్వచ్ఛపటం
బునన్ అనుటవలన తుల్యమగు వస్త్రమందుఁ జిత్రము లారోపింపఁబడినటులఁగునఁ బర
మాత్మగానుండు తనస్వరూపమందుఁ బ్రపంచమనెడి చిత్రమారోపింపఁబడినదని భావ
ము. వస్త్రము రజకునిచే తెల్లగాఁ జలువచేయఁబడినప్పుడు స్వచ్ఛమైనపటమనఁబడును.
దానికి గంజిపెట్టి తుండవేసినయెడల దృఢపడును. కావున అది దృఢపటమనఁబడును.
ఆపటమునకు చిత్రములువ్రాయుటకై అక్కడక్కడ గుఱుతులుఁగీయఁబడినయెడల లాం
ఛనపటమనఁబడును. దానియందు చిత్రములుతీర్చి రంగువేసి ముగిసిన రంజితపటమనఁ
బడును. ఈరీతిగనే పరమాత్మకుఁగూడ నాలుగు అవస్థలున్నవి. అవి యెవ్వియనఁగా:
నిరుపాధికముగనుండునప్పుడు చిత్తనఁబడును. మాయతోఁగలసిన సమయమున అంతర్యా
మియనఁబడును. సమష్టిసూక్ష్మభూత సూక్ష్మదేహములతోఁజేరిన కాలమందు హిరణ్యగ
ర్భుఁడనఁబడును. సమష్టిస్థూలభూత స్థూలదేహములతోఁగూడినయెడల విరాట్పురుషుఁ
డనఁబడును. ఇట్లు పరమాత్మను చిత్రపటముతో సరిపోల్పఁగా దానియందుఁగూడియుం
డు చిత్రభేదములు బ్రహ్మాదిస్తంబపర్యంతము ఉత్తమ మధ్యమాధమములుగాఁ గనుపిం
చుప్రాణులును, పర్వతము గోపురము లోనగాఁగల జడములును, శుద్ధచైతన్యస్వరూపి
యగు పరమాత్మయందు మాయయను రంగువలనఁ దోఁపింపఁబడిన చిత్రములగును. కాఁ

బట్టి ఆభాసపటమునందలి రంగు అధిష్ఠానపటమునందుఁ బోల్పఁబడినట్లు సంసారమును చిదాభాసునియందు మోహమనెడి అజ్ఞానముచేతను తాదాత్మ్య సంబంధముచేతను ఆరోపింపఁబడును. కనుక తన అంతఃకరణమందుఁ గనంబడు నామరూపప్రపంచము అనేక విధములుగాఁ దోఁచినను నీటియందు ప్రతిబింబించిన ప్రతిబింబమును జలగతంబులయిన శైత్యచలనాది వికారంబులు స్పృశింపలేని చందమున అంతఃకరణముయొక్క ధర్మములును వికారములును దానియందు ప్రతిబింబించిన జీవుని స్పృశింపఁజాలవు. మఱియు పృథివియొక్కయు దాని కార్యములయొక్కయు వికారంబులు దాని కాధారభూతమగు ఆకాశమును ఎట్లు స్పృశింపఁజాలవో అటులనే అనాత్మయైన అజ్ఞానంబును దాని కార్యములగు శరీరేంద్రియాది ధర్మములును ఆ యజ్ఞానమునకును దానిపనులకును ఆధారభూతంబగు ప్రత్యగాత్మను నంటఁజాలవని తెలిసికొనవలయును. ఇట్లు జీవునకు ప్రపంచమునకు పరమాత్మకుఁగల తారతమ్యములను గురుసన్నిధియందు అనేక యుక్త్యనుభవములచేత విచారించి వివేకమును జెందినవాఁడు జీవజగత్తులను కల్పనలుగాభావించి శేషించిన పరమాత్మయేతానని చూచునని ఎఱుఁగఁదగ్గది. ఇట్టి చూపునందు నిలుచుటయే నిర్వికల్పసమాధియగును.

అవ:—తురియాతీతమే తుల్యముగా ప్రకాశించెడి యనుభవమందు ముందుచెప్పిన జ్ఞానభూములను దేటగాఁ దెలుపుఁడని శిష్యుఁడడుగుచున్నాఁడు.

మ. మనమాపూర్ణముఁజెందఁ దేశిక క్రియామాత్రంబెయీచింతగా
వున వేఱున్నదె యాత్మతత్త్వ మెదచే నూహించుట ల్వాక్కుచే
విని భాషించుట లింతె కాక మన కావిజ్ఞానవాదంబు చే
యు నశక్యం బికఁ దొల్తఁ జెప్పినమనీషానంతల న్దెల్పుమా. ౧౪౯

టీ. దేశికా—గురుస్వామి, మనము—మనస్సనునది, ఆపూర్ణముఁజెందఁగ-అ—ప్రసిద్ధమైన, పూర్ణముఁ—పరబ్రహ్మమును, చెందఁగ—పొందినను, ఈచింతగ—ఈభావమును, క్రియామాత్రంబె—లీలామాత్రమే, కావునఁ—కనుక, వేఱున్నదే—మఱియొకటున్నదా, ఆత్మతత్త్వముఁ—పరబ్రహ్మస్వరూపమును, ఎదఁ—మనస్సుచేతను, ఊహించుటలు—ఆలోచించుటలు, వాక్కుచేఁ—నోటిచేతను, వినిభాషించుటలు — ఒకరుచెప్పఁగా వినిమాట్లాడుటలు, ఇంతే—ఇంతమాత్రమే, కాక—కాని, మనకుఁ — మనకు, అవిజ్ఞానవాదంబు—అబ్రహ్మజ్ఞానసంభాషణము, చేయుఁ—చేయుటకు, అశక్యంబు — శక్యముగాదు, ఇఁకఁ—ఇఁకమీఁద, తొల్తఁ—ముందు, చెప్పిన—వాక్రుచ్చిన, మనీషానంతలఁ—విజ్ఞానభూములను, తెల్పుమా—తెలియఁజెప్పుమా.

తా. గురుస్వామీ! మనస్సనునది అప్రసిద్ధమైన పరబ్రహ్మమును పొందినను ఈ విచారము లీలామాత్రమే గనుక మఱియొకటున్నదా? పరబ్రహ్మస్వరూపము మనస్సు

చేత ఆలోచించుటయు విని నోటితో మాటలాడుటలు ఇంతమాత్రమేగాక మనకు అపర బ్రహ్మజ్ఞాన సంభాషణముచేయుట శక్యముగాదు కావున ఇఁకమీఁద ముందువారుచ్చి న విజ్ఞానభూములను తెలియఁజెప్పుమా యని తాత్పర్యము.

అవతారిక:—స్వానుభవమందుఁజెప్పినట్టి మనోలయమార్గమైన జ్ఞానభూములను జెప్పుటకు ఆరంభమున ఉత్పత్తికిఁ గారణమయిన అజ్ఞానభూముల నేడింటిని ముందుగాఁ జెప్పుచున్నారు.

మ. విను మజ్ఞానధరిత్రుల న్దొలుత నుర్విన్ బీజజాగ్రంబు స
జ్జన జాగ్రం బతిజాగరంబు దగఁ దత్స్వప్నంబు స్వప్నంబు త
జ్జనిజాగ్రంబు సుషుప్తినాఁ బరఁగు నోజ న్వానిచిహ్నంబులన్
దనర న్దెల్పెద జ్ఞానభూమికలఁ బుత్త్రా తత్స్వభావాఖ్యలన్. ౧౫౦

టీ. సజ్జన=సత్పురుషుఁడవైన శిష్యుఁడా, ఉర్విన్=భూమియందు, తొలుతన్=జ్ఞానభూమికలను జెప్పుటకు ముందుగాను, అజ్ఞానధరిత్రులన్=అజ్ఞానభూముల నేడింటిని, వినుము=ఆలకింపుము, బీజజాగ్రంబు=బీజజాగ్రము, జాగ్రంబు=జాగ్రము, అతిజాగరంబు=మహాజాగ్రము, తగన్=ఒప్పిదమైన, తత్స్వప్నంబు-తత్=ఆమహాజాగ్రమందలి, స్వప్నంబు=స్వప్నము, (అనఁగా జాగ్రత్స్వప్నము) స్వప్నంబు=స్వప్నము, తజ్జనిజాగ్రంబు-తత్=ఆస్వప్నమందు, జని=పుట్టిన, జాగ్రంబు=జాగ్రదవస్థయు, (అనఁగా స్వప్నజాగ్రము) సుషుప్తి=సుషుప్తియు, అనాన్=అనునట్లుగాను, పరఁగున్=ఒప్పును, ఓజన్=క్రమముగాను, వానిచిహ్నంబులన్-వాని=ఆ యజ్ఞానభూములేడింటియొక్క, చిహ్నంబులన్=గుఱుతులను, పుత్త్రా=కుమారా, తనరన్=లెస్సగాను, జ్ఞానభూమికలన్=జ్ఞానభూములను, తత్స్వభావాఖ్యలన్-తత్=ఆజ్ఞానభూమికలయొక్క, స్వభావ=సహజసిద్ధములయిన, ఆఖ్యలన్=పేళ్లను, తెల్పెదన్=తెలియఁజెప్పెదను.

తా. సత్పురుషుఁడవైన శిష్యుఁడా! భూమియందు ముందుగా అజ్ఞానభూముల నేడింటినిచెప్పెదను ఆకర్ణింపుము. బీజజాగ్రము, జాగ్రము, మహాజాగ్రము, జాగ్రత్స్వప్నము, స్వప్నము, స్వప్నజాగ్రము, సుషుప్తి అనునట్లుగాను క్రమముగా అజ్ఞానభూములేడును ఒప్పును. వానిలక్షణములను సహజసిద్ధములైన జ్ఞానభూములయొక్క నామములను తెలియఁజెప్పెదను వినుమనితాత్పర్యము.

అవతారిక:—ఆ యజ్ఞానభూములలో మొదటి నాలుగుభూమికలయొక్క లక్షణములను జెప్పుచున్నారు.

మ. తొలుత న్దోఁచిన బీజజాగ్రమగు నోద్రూపావని న్దెల్వి యా
వల జాగ్రం బగు నొక్కరీతి నది గర్వంబై మహాజాకృతి

న్వెలయ న్నాదిది నే ననం బిదప నుర్విన్ దా మహాజాగ్రమౌ
గలయన్మానసరాజ్యమేల నదిజాగ్రత్స్వప్నమౌ పెంపుతోన్ ౧౫౧

టీ. ఊర్విన్=భూమియందు, సద్రూపావనిన్-సద్రూప=త్రిపరిచ్ఛేదశూన్యమైన పరబ్రహ్మమనెడి, అవనిన్=భూమియందు, తొలుతన్=ముందుగాను, తోఁచినతెల్వి=(బహిర్వ్యాపారరూపముగా) కనఁబడినవివేకము, బీజాగ్రము=బీజాగ్రమను పేరుగల మొదటిభూమి, అగున్=అగును, అవలన్=పిమ్మట, పొల్పారీతిన్=అవిత్తులోనుండి బైటవచ్చిన అంకురమువలె, గర్వంబై=నేనను నభిమానరూపమై, (జాగ్రమను పేరుగల రెండవభూమియగును) పిదపన్=పిమ్మట, మహిజాకృతిన్=వృక్షాకారముగా, వెలయన్=ప్రకాశింపఁగాను, నాదిది=ఇదినాది ఇతఁడు నేనను, తాన్=తాను, మహాజాగ్రము=మహాజాగ్రమను పేరుగల మూఁడవభూమియగును, కలయన్=(అంతట) వ్యాపించిన, మానసరాజ్యమున్=మనోరాజ్యమును, అది=ఆతెల్వి, పెంపుతోన్=అతిశయముతోను, జాగ్రత్స్వప్నమౌన్=జాగ్రత్స్వప్నమను పేరుగల నాల్గవభూమియగును.

తా. భూమియందు త్రిపరిచ్ఛేదశూన్యమైన పరబ్రహ్మమనెడి పుడమియందు ముందుగా బహిర్వ్యాపారవృత్తిరూపముగాఁ గనఁబడిన వివేకము అనఁగా: ప్రపంచోత్పత్తికి హేతువుగఁ గలిగిన తెలివి బీజాగ్రమను పేరుగల మొదటిభూమియగును పిమ్మట ఆవిత్తులోనుండి బైటవచ్చిన అంకురమువలె నేనను అభిమానరూపమై అనఁగా విభక్తము కాఁబట్టి యాతెలివికి పూర్వమందుఁ గలుగనిభేదము సూక్ష్మముగఁ గనిపించి ప్రపంచాభిముఖమగుట జాగ్రమను పేరుగల రెండవభూమియగును. పిమ్మట వృక్షాకారముగా ప్రకాశించఁగా ఇదినాది ఇతఁడు నేనను అహంకార మమకారములతోఁ గూడిన తాను అనఁగా లోకవాసనప్రబలుట మహాజాగ్రమను పేరుగల మూఁడవభూమియగును. అంతట నిండిన మనోరాజ్యమును ఆతెలివి అతిశయముతోఁ బరిపాలించఁగాను అనఁగా మాచినవి మాదనివి సంకల్పించి నిష్ప్రయోజకముగ మనోరాజ్యమేలుట జాగ్రత్స్వప్నమను పేరుగల నాలుగవభూమి అగునని తాత్పర్యము.

అవ:—తక్కిన మూఁడుభూములయొక్క లక్షణములను జెప్పుచున్నారు.

మ. నిద్రాహారరతి న్మనఃప్రభుతఁ దా నెమ్మి న్దగు న్స్వప్న మౌ
క్షుద్రస్వప్నమునందు జాగ్రమగు నానుజ్ఞప్తి గన్మాయ ని
ర్నిద్ర న్పిమ్మట శూన్యమైన నదియా నీరంధ్రగాఢాంధత
న్నిద్రాధాత్రి యచిద్ధరిత్రు లివి చిన్నిష్ఠులు ద్దెల్పెదన్. ౧౫౨

టీ. నిద్రాహారరతిన్-నిద్రా=నిద్రించుటయందును, ఆహార=భుజించుటయందు రతిన్=ఆసక్తిచేతను, మనఃప్రభుతన్=మనోరాజ్యమందు, తాన్=తాను, నెమ్మిన్=

మిక్కుటముగానుండుట, స్వప్నము — స్వప్నమను పేరుగల ఐదవభూమి, తగున్—ఒప్పు ను, ఆ తుచ్ఛస్వప్నమునందున్-ఆ—అట్టి, తుచ్ఛస్వప్నమునందున్ — తుచ్ఛమైన స్వ ప్నావస్థయందు, సుజ్ఞప్తి—మంచిజ్ఞప్తి అనునది, నిర్నిద్రన్—అల్పనిద్రచేతను, కన్మూ యన్—కన్నులుమూసికొని, జాగ్రమగున్-జాగ్రము—స్వప్నజాగ్రమను పేరుగల ఆఱవ భూమి, అగున్—అగును, పిమ్మటన్—వెనుక, నీరంధ్రగాఢాంధతన్—దట్టమైన అంధకార ముచేత, అది—ఆ తెలివియే, శూన్యమైనన్—ఏమియును లేకపోయినచో, నిద్రాధాత్రి—సుషుప్తి అను పేరుగల ఏడవభూమి, ఔన్—అగును, అవిద్ధరిత్రులు—అజ్ఞానభూములు, ఇవె—ఈ చెప్పఁబడినవే, చిన్నిష్ఠేలలన్-చిన్నిష్ఠా—జ్ఞాననిష్ఠయందుఁగల, ఇలలన్—భూ ములనేడింటిని, తెల్పెదన్ — తెలియఁజెప్పుచున్నాను. (ఇఁకమీఁద వినుమని అధ్యా హారము.)

తా. నిద్రించుటయందును, భుజించుటయందును, ఆసక్తిచేత మనోరాజ్యమందు తాను మిక్కుటముగానుండుట, అనఁగా: ఆ జాగ్రత్తయందు కల్పితస్వరూపములఁజూ చుట స్వప్నమను పేరుగల ఐదవభూమిగా నొప్పును. అట్టి తుచ్ఛమైన స్వప్నావస్థయందు మంచిజ్ఞప్తి అనునది అల్పనిద్రచేతను కన్నులుమూసికొని (అనఁగా మఱచినదాని తలఁ చుట) స్వప్నజాగ్రమను పేరుగల ఆఱవభూమి అగును. వెనుక దట్టమయిన అంధకారము చేత ఆ తెలివియే ఏమియును లేకపోయినను (అనఁగా ఆత్మ ప్రతిబింబముగాఁ గనఁబడు చున్న జగద్విషయమునందు శూన్యభావముఁ జెందినచో) సుషుప్తియను పేరుగల ఏడవ భూమి అగును. ఈ చెప్పఁబడినవే అజ్ఞానభూములు. ఇఁక జ్ఞాననిష్ఠయందుఁగల భూముల నేడింటిని తెలియఁజెప్పుచున్నాను వినుమని తాత్పర్యము.

ఈ చెప్పఁబడినవానిలో వెనుకటి ఆఱు అవస్థలయందును గల దుఃఖసమూహమును మనస్సునందుపడలి ఇఁక రాఁబోవుదుఃఖమును మాపఁబడునది సుషుప్తి యనఁబడును. ఇదియే ఏడవ అజ్ఞానభూమి. ఈ అజ్ఞానభూములగు ఏడవస్థలయందును సకలజంతువులు తల్లీనంబై యుండును. అవి నానారూపంబుల యసంఖ్యములై వర్తించుచుండును. కాఁబట్టి ఇఁకమీఁద జ్ఞానభూముల నేడింటిని బోధపడునట్లు చెప్పెద నాకర్ణింపుము. వానిని దెలిసికొనినవాఁడు దుఃఖసాగరమందు మునుఁగక నిత్యసుఖానంద మనుభవించు నని భావము.

అవతారిక:—జ్ఞానభూముల నేడింటిని చెప్పుచున్నారు.

మ. అమలాద్యోర్వి శుభేచ్ఛ నాలవది సత్త్వాపత్తి తుర్యంబు న
స్తమమా సత్తనుమానసి త్రితయ మాశ్వస్తంబౌ నసంసక్తి పం
చమ మాత్మార్థవిచారణ ద్వితయమా సత్పుత్త్రి యిద్ధాత్రిలో
నమితంబై తగుసప్తభూమిక పదార్థాభావనాభిఖ్యచేన్. ౧౫౩

టీ. సత్పుత్ర=శ్రేష్ఠమైనకుమారా, ఇత్థా త్రిలోకే=ఈభూమియందు, శుభేచ్ఛ=శుభేచ్ఛయనునది, అమలాద్యోర్వీ-అమల=నిర్మలమైన, ఆద్య=మొదటిదైన, ఉర్వీ=భూమి, సత్త్వాపత్తి=సత్త్వాపత్తియను పేరుగలది, నాలవది=నాలుగవభూమి, తుర్యంబు=తుర్యమను పేరుగలది, సప్తమమౌ-సప్తమము=ఏడవభూమి, ఔ=అవును, సత్తనుమానసీ-సత్=శ్రేష్ఠమైన, తనుమానసీ=తనుమానసీఅనునది, త్రితయము=మూఁడవభూమి(అగును)అసంసక్తి=అసంసక్తి అనునది, పంచమము=ఐదవభూమి, ఆప్తంబౌ=ఉపకారమైనది యగును, ఆత్మార్థవిచారణ-ఆత్మ=ప్రత్యగాత్మయొక్క, అర్థవిచారణ=తాత్పర్యవిచారణమనునది, ద్వితయమౌ=రెండవభూమియగును, పదార్థాభావనాభిఖ్యచేఁ-పదార్థాభావన=పదార్థాభావనయను, అభిఖ్యచేఁ=పేరుచేతను, షష్ఠభూమిక=ఆఱవభూమి, అమితంబై=మిక్కుటమై, తగుఁ=ఒప్పును.

తా. శ్రేష్ఠమైనకుమారా! ఈ భూమియందు శుభేచ్ఛ, ఆత్మార్థవిచారణ, తనుమానసీ, సత్త్వాపత్తి, అసంసక్తి, పదార్థాభావన, తుర్యము అను నీయేడును జ్ఞానభూములని తాత్పర్యము.

అ:—వానిలో మొదటి నాలుగుభూముల లక్షణములను జెప్పుచున్నారు.

మ. ఖలసంసర్గము మాని పేర్చినవివేకం బాశుభేచ్ఛాభిజ్య యా
వల సత్సంగతి నావిచారణ లసద్వ్యాసంగము జ్జేయునీ
యిలచే నా దనుమానసీప్రథివి పూర్వేచ్ఛ లివ్వర్జింపఁ గే
వలతద్భ్యములవాడుక న్దెలివి సత్త్వాపత్తియౌఁ గల్గినన్. ౧౫౪

టీ. ఖలసంసర్గముఁ-ఖల=దుర్జనులయొక్క, సంసర్గముఁ=సహవాసమును, మాని=విడచి, పేర్చినవివేకంబు-పేర్చిన=అతిశయించిన, వివేకంబు=వివేకమనునది, ఆశుభేచ్ఛాభిజ్య-ఆ=ప్రసిద్ధమైన, శుభేచ్ఛా=శుభేచ్ఛయను పేరుగల, జ్య=మొదటిభూమి అగును, ఆవలఁ=అటుపిమ్మట, సత్సంగతిఁ=సత్పురుషుల సహవాసముచేత, అవ్విచారణ=అవిచారణయను పేరుగల రెండవభూమి,(అగును) లసద్వ్యాసంగము జ్జేయునీయిలచేఁ-లసత్=ప్రకాశించుచుండెడి, వ్యాసంగముఁ=వేదాంతశ్రవణమును, చేయు=చేయుచుండెడి, ఈఇలచేఁ=ఈభూమిచేతను, తనుమానసీప్రథివి=తనుమానసియను మూఁడవభూమి, ఔఁ=అగును, కేవల=ముఖ్యములైన, తద్భ్యములఁ=శుభేచ్ఛ, విచారణ, తనుమానసియను మూఁడు భూములయందలి, వాడుకఁ=అభ్యాసముచేత, పూర్వేచ్ఛలు=ముందటి అజ్ఞానకార్యములయందలి అభిలాషలు, విసర్జింపఁ=విడిచినచో, తెలివి=ఆతెలివిగలైనది, కల్గినఁ=ఒప్పినను, సత్త్వాపత్తియౌఁ-సత్త్వాపత్తి=సత్త్వాపత్తియను నాలవభూమి, ఔఁ=అగును.

తా. దుర్జనులయొక్క సహవాసమునందలి అతిశయించిన విశేషమనునది అప్రసిద్ధమైన శుభేచ్ఛయను పేరుగల మొదటిభూమి యగును. అటుపిమ్మట సత్పురుషుల సహవాసముచేత విచారణయను పేరుగల రెండవభూమియగును ప్రకాశమానముగ వేదాంత శ్రవణముచేయుచుండెడి యీభూమిచేతను తనుమానసి యను మూఁడవభూమిఅగును. ముఖ్యములైన శుభేచ్ఛ విచారణ తనుమానసి యను మూఁడుభూములయందలి అభ్యాసముచేత ముందటి అజ్ఞానకార్యములయందలి అభిలాషలు విడిచిన తెలివియైనది ఒప్పినచో సత్త్వాపత్తియను నాలవభూమి యగునని తాత్పర్యము.

అవ:— కడపటి మూఁడుభూముల లక్షణములను జెప్పుచున్నారు.

మ॥ ఋతమందుండి తొలంగ నెంతయు నసద్వృత్తం బసంసక్తియా
హతమొందన్ ద్రిపుటిత్రయం బగు పదార్థాభావనాభిఖ్య సం
ద్వితతాద్వైతముదంబునం దగు లసద్విద్య న్దురీయంబు సం
తతమౌనంబున నున్నదాని తదతీతంబంచుఁ బల్కున్ శ్రుతుల్.

టీ. ఋతమందున్ — సత్యమందు, (ఋతమనఁగా ఋతగ్ం సత్యం పరంబ్రహ్మ అని శ్రుతి. ఉండి — నివసించి, ఎంతయున్ — మిక్కిలి, అసద్వృత్తంబు — నామరూపాత్మకమైన మాయాకార్యమును, తొలంగన్ — విడిచినను, అసంసక్తియాన్ — అసంసక్తి యను పేరుగల ఐదవభూమియగును, సద్వితతాద్వైతముదంబునన్ - సత్ — ప్రశస్తమైన, వితత — విస్తారమైన, అద్వైతముదంబునన్ - అద్వైత = వస్త్వంతరరహిత బ్రహ్మాభిన్న ప్రత్యగ్వస్తు దర్శనముచేత కలిగిన, ముదంబునన్ — ఆనందమందు, త్రిపుటీత్రయంబు — (అంతరమధ్యబాహ్యములను త్రివిధభేదములచేతఁ దోఁచుచుండెడి జ్ఞాతృజ్ఞానజ్ఞేయాది) సర్వత్రిపుటీవృత్తులు, హతమొందన్ — నశించినచో, పదార్థాభావనాభిఖ్య — పదార్థాభావనయను పేరుగల ఆఱవభూమి, అగున్ — అగును, లసద్విద్యన్ - లసత్ = ప్రకాశమానమైన, విద్యన్ — బ్రహ్మజ్ఞానముచేత, సంతతమౌనంబునన్ - సంతత — ఎడతెగని, మౌనంబునన్ — మౌననిష్ఠయందు, ఉన్నన్ — ఉండెనేని, తురీయంబు — ఏడవభూమియైనతుర్యము, తగున్ — ఒప్పును, దానిన్ — ఆయేడవభూమినే, తదతీతంబు — తుర్యాతీతము, అంచున్ — అని, శ్రుతులు — వేదములు, పల్కున్ — సంభాషించును, (నీవు వినుమని అధ్యాహారము.)

తా. సత్యమందు నివసించి మిక్కిలి నామరూపాత్మకమైన మాయాకార్యమును విడిచినను అసంసక్తియను పేరుగల ఐదవభూమియగును. మిక్కిలిప్రశస్తమైన బ్రహ్మాభిన్న ప్రత్యగ్వస్తుదర్శనముచేతఁగలిగిన ఆనందమందు అంతరమధ్యబాహ్యములను త్రివిధభేదములచేతఁ దోఁచుచుండెడి జ్ఞాతృజ్ఞానజ్ఞేయాది సర్వత్రిపుటీవృత్తులు నశించినను పదార్థాభావనయను పేరుగల ఆఱవభూమియగును. దానినే తుర్యాతీతమని వేదములు

సంభాషించుననని తాత్పర్యము. ఈ సప్తభూమికా వివరణ సంగ్రహము ౧౩౪ వ, పద్యమునొక్క విశేషార్థములో విశదీకరింపఁబడియున్నది.

అవ:— ఈ తుర్యభూమి తుర్యాతీతముగాఁ దోఁచినను సప్తభూమికలను విదు అవస్థలుగా భాగించిన విధమును దాని లక్షణమును జెప్పుచున్నారు.

చ. తొలుతటిచిత్త్రికాళ్యపులఁ దోఁచుట లోకము జాగరంబగుఁ
గలవలె నౌఁ జతుర్థధరఁ గల్పితమాట జగంబు పంచమ
స్థలము సుషుప్తిమాడ్కి నగు షష్ఠసుధారుణి తుర్యమౌఁ దుది
న్వెలసెడు సప్తమావనిని వేదముపల్కు నతీతమంబొగిన్. ౧౫౭

టీ. తొలుతటిచిత్త్రికాళ్యపులన్-తొలుతటి=మొదటిదైన, చిత్=జ్ఞానభూములలో, త్రికాళ్యపులన్=శుభేచ్ఛ, విచారణ, తనుమానసి యను మూఁడు భూములయందును, లోకము=జగము, తోఁచుటన్=కలుగుటచేతను, జాగరంబగున్=జాగ్రదవస్థయగును, చతుర్థధరన్=సత్త్వాపత్తియను నాల్గవభూమిని, జగంబు=నామరూపాత్మకమైన ప్రపంచము, కల్పితమాటన్=తోఁచినమాత్రమైనదౌటచేతను, కలవలెన్=స్వప్నమువలె, ఔన్=అవును, పంచమస్థలము=అసంసక్తియను అయిదవభూమి, సుషుప్తిమాడ్కిన్=(నామరూపాత్మకమైన జగమేమియుఁ దోఁచనందున) నిద్రావస్థవలె, అగున్=అగును, షష్ఠసుధారుణి=పదార్థాభావనయను పేరుగల ఆఱవభూమి, తుర్యమౌన్=జాగ్రత్స్వప్నసుషుప్తులనుదాఁటిన తుర్యావస్థయను పేరుగలదియగును, తుదిన్=కడపటను, వెలసెడు సప్తమావనిని=ప్రకాశించెడు ఏడవభూమిని, వేదము=శ్రుతి, అతీతమంచున్=తుర్యాతీతమని, ఒగిన్=క్రమముగా, పల్కున్=వాక్రుచ్చును.

తా. జ్ఞానభూములలో మొదటిదైన శుభేచ్ఛ, విచారణ, తనుమానసియను మూఁడుభూములయందుండువారికి జగద్వ్యాపారముండుటవలన జాగ్రదవస్థ సామ్యమగును. సత్త్వాపత్తియను నాలవభూమిని పొందినవారికి ప్రపంచముతోఁచినను అది మాయాకల్పితమని తలఁచుటవలన స్వప్నమువలెనుండును. అసంసక్తియను ఐదవభూమియందుండు వారికి జగము ఏమియుఁదోఁచనందున సుషుప్తివలె ఒప్పుననుట పదార్థాభావనయను ఆఱవభూమియందు నివసించువారికి జాగ్రత్స్వప్నసుషుప్తుల మూఁటిని అతిక్రమించిన నాలవదియగు తుర్యమను పేరుగలది యగును. వీనికన్నిటికి పైనవెలుఁగుచుండెడితుర్యమను పేరుగల ఏడవభూమిని తుర్యాతీతమని వేదము వచించునని తాత్పర్యము.

అవతారిక:— ఈ ఏడుభూములకును తుర్యాతీతమును దానికిని అనుభవములను జెప్పుచున్నారు.

ఉ. తుర్యము నాయతీత మనఁ దోఁచుమతిభ్రమ మంచు దాన్ని వి
ద్వర్యులు ముక్తి భిన్నముగఁ బల్కుదు రాత్మవిదేహసంజ్ఞల
న్గార్యము నందునొండెయగుఁ గానఁ బ్రబోధ సుషుప్తిమష్టమం
చార్యజనస్తుతా కడమ యైదిటినే వినిపించెద న్దగన్. ౧౫౭

టీ. ఆర్యజనస్తుతా-ఆర్యజన = పండితజనులచేతను, స్తుతా = కొనియాడఁబడిన శిష్యుఁడా, తుర్యమున్=జ్ఞానభూములలో నేడవభూమియగు తుర్యమును, ఆయతీతము =అతుర్యాతీతము, అనన్=అనినను, విద్వర్యులు = వేదాంతజ్ఞానమందు శ్రేష్ఠులగు బ్రహ్మవేత్తలు, మతిభ్రమము=బుద్ధిభ్రమము, తోఁచున్=కలుగును, అంచున్=అని, దానిన్ =ఆఏడవభూమిని, ఆత్మవిదేహసంజ్ఞలన్-ఆత్మ=జీవన్ముక్తియని, విదేహ = విదేహముక్తియని, సంజ్ఞలన్=గుఱుతులచేతను, ముక్తిన్=మోక్షమును, భిన్నముగన్ = వేర్వేఱుగాను, పలుకుదురు = వచింతురు, కార్యమునందున్ = ఆమోక్షకార్యమందు, ఒండెయగున్=ఒకటియేయగును, కానన్=కాఁబట్టి, అష్టమంచున్=దానికి క్రిందిదైన ఆఱవభూమి, ప్రబోధసుషుప్తి-ప్రబోధ=విజ్ఞానముతోఁ జేరిన, సుషుప్తి=నిద్రావస్థ (అగును) కడమయైదిటిని=తక్కిన అయిదుభూములను, ఏన్=నేను, తగన్ = లెస్సగాను, వినిపించెదన్=తెలియఁజేయుచున్నాను.

తా. పండితులచేత కొనియాడఁబడిన శిష్యుఁడా! ఏడవభూమిని తుర్యమని తుర్యాతీతమని చెప్పినచో గ్రహించువారికి భ్రమదోఁచునని దానిని తుర్యమందు జీవన్ముక్తియని తుర్యాతీతమందు విదేహముక్తియని మోక్షమును రెండువిధములగు సంజ్ఞలచేత చెప్పుదురుగాని కార్యమందు ఒక్కటేయగును. కనుక దానికి క్రిందిదైన ఆఱవభూమి తెలివితోఁగూడిన నిద్రావస్థయగును. తక్కిన అయిదుభూములను క్రమముగా తెలియఁజేయుచున్నాను వినుమని తాత్పర్యము.

అవః—జ్ఞానభూమినిపొందిన జీవన్ముక్తుల నామములను జెప్పుచున్నాను.

చ. మొదటిత్రిచిద్ధరాశ్రితులు ముప్పురు ముక్తులు గారు వాదుకన్
వదలక యుందు రాత్మనరవర్యవరిష్ఠులు ముప్వు రౌదు రా
తుదినుత్రిధాత్రులందును జతుర్థధరిత్రిని దద్విదుం డగున్
స్సదమల సప్తచిద్ధరల సర్వముఁ దెల్పెదఁ దన్మహత్త్వముల్.

టీ. మొదటిత్రిచిద్ధరాశ్రితులు = మొదటి (శుభేచ్ఛ, విచారణ, తనుమానసి, సత్త్వాపత్తి, అసంసక్తి, పదార్థాభావన, తురీయములనెడి భూములేడింటిలో) మొలుతటివైన, త్రి=మూఁడగు, చిత్=జ్ఞానసంబంధములైన, ధరా = భూములను, ఆశ్రితులు=

ఆశ్రయించిన ఆరురుక్షులు, ముప్పురు=ముగ్గురును, ముక్తులుగారు=జీవన్ముక్తులుగారు, వాడుకఁ=అభ్యాసమును, వదలకయుందురు=విడువకయుందురు, ఆత్మపరవర్యవరిష్ఠులు-ఆత్మపర=బ్రహ్మవిద్వరుఁడు, వర్య=బ్రహ్మవిద్వర్యుఁడు, వరిష్ఠులు = బ్రహ్మవిద్వరిష్ఠుఁడను, ముప్పురు=ముగ్గురు, తుదిసుత్రిధాత్రులందుఁ-తుది=కడపటి, సు=శ్లాఘ్యములగు, త్రి=మూఁడైన, ధాత్రులందుఁ=జ్ఞానభూములందు, ఔదురు=ఉన్నవారగుదురు, చతుర్థధరిత్రిఁ=క్రిందటి మూఁడుభూములకును, పై మూఁడుభూములకును, నడుమనుండెడు నాలుగవదియగు సత్త్వాపత్తియను పేరుగల భూమియందు ఉండువాఁడు, తద్విదుండగుఁ=ఆబ్రహ్మవిదుఁడగును, సదమలసప్తచిద్ధరలఁ-సదమల=అతినిర్మలములైన, సప్త=ఏడైన, చిద్ధరలఁ=జ్ఞానభూములను, సర్వముఁ=అన్నిటిని, తన్మహత్త్వములు=వారిని పొందినవారి మహిమలను, తెల్పెదఁ=తెలియఁజెప్పెదను, (వినుమని అధ్యాహారము.)

తా. జ్ఞానభూములేడింటిలో మొదటి మూఁడుభూములను ఆశ్రయించిన ఆరురుక్షులు ముగ్గురును ముముక్షులేగాని జీవన్ముక్తులుగారు. కడపటి శ్లాఘ్యములయిన మూఁడుభూములను పొందినవారు ముక్తులగుదురు. క్రింది మూఁడుభూములకును పై మూఁడుభూములకును నడుమనుండెడు నాల్గవదియగు సత్త్వాపత్తియను పేరుగల భూమియందుండువాఁడు బ్రహ్మవిదుఁడగును. అతినిర్మలములయిన అజ్ఞానభూములన్నిటిని పొందినవారిమహిమలు తెలియఁజెప్పెదను వినుమని తాత్పర్యము. ఆరురుక్షులు ఆరురోహులు ఆరూఢులని జ్ఞానులు మూఁడువిధములుగానుందురు. ఆరురుక్షులనఁగా: జ్ఞానమనుపర్వతమును ఎక్కఁదలఁచినవారు ఆరురోహులనఁగా:అజ్ఞానపర్వతమును ఎక్కుచుండెడివారు. ఆరూఢులనఁగా: దానిని ఎక్కినవారు. ఆత్మపరుఁడనఁగా: బహిర్వ్యాపారములయందు అంతర్ముఖుఁడై నిద్రించువానివలెనుండి ప్రపంచమును మిథ్యగాను సాక్షిగానుభావించి సమస్తకార్యములను అహంకారమే చేసికొనుచున్నదను నిశ్చయముగలవాఁడై ఎల్లప్పుడు ఏకాంతనిష్ఠయందుండువాఁడు. ఇతఁడే ఐదవభూమికకు వచ్చినవాఁడు. వర్యుఁడనఁగా: వెలుపలఁ గనిపించెడు జగమంతయు దుఃఖమనిభావించి సంశయములనువదలి సకలవ్యవహారములయందును సంబంధములేదను నిశ్చయముతో సర్వదా నిదిధ్యాసపరుఁడైయుండువాఁడు. ఇతఁడు ఆఱవభూమిని ఎక్కినవాఁడు. వరిష్ఠుఁడనఁగా: ముందుచెప్పిన భూములను సాధించుటచేత నిర్వికల్పసమాధినిష్ఠయందు నిలుకడకలవాఁడైయుండి అంతర్బహిర్వ్యాపారముల రెంటినిమఱచి స్వరూపమాత్రముగ నిలచిన చిత్తము గలవాఁడైయుండువాఁడు. ఇతఁడే కడపటిభూమిక నెక్కినవాఁడు. విదుఁడనఁగా: మొదటిమూఁడుభూమికల సాధకములవలన నాల్గవభూమిక నెక్కినవాఁడు. ఇతఁడు కాలత్రయబాధ్యబాధకములు తనకులేవనియు, తాను అసంగుఁడననియు, వేదవిహితములగు యాగయోగాది సర్వకర్మములును క్రియలును తానుజేయుచుండినను చేయువాఁడు తానుగాదనియు

అహంకారాదులు వానివాని కార్యములయందవిద్యవి వర్తింపుచున్నవనియు తెలిసికొని తాను స్వసాక్షియని నిశ్చయించుకొని యుండును.

## అహంకారత్రయముయొక్క వివరణము.

అహంకారము మూఁడు తెఱఁగులుగానున్నది. వానిలో రెండు విధములు శ్రేష్ఠాహంకారములనియు మఱియొకటి త్యాజ్యము అనియుఁ జెప్పఁబడును. ఈ మూఁడింటను గోచరంబగు నీజగమంతయును పరమాత్మయును నేనేయనియు నాకంటె వేఱుగానుండునట్టి పదార్థము అణుప్రమాణమైనను లేదనియు తలంచెడి తెలివియేదికలదో అదియే మిక్కిలి ఉత్కృష్టమైన మొదటి అహంకారమని వచింపఁబడును. ఇది కేవలము మోక్షమునకేగాని బంధమునకుఁగాదు గనుక జీవన్ముక్తినిజెందిన వానియందుఁ బొందియుండును. ఈక్షింపఁబడుచుండెడి సర్వప్రపంచమునకు వ్యతిరిక్తుండు నేననియు వాలాగ్రమువందు పొడగన్న అతిసూక్ష్మమైన వస్తువు నేననియు భావించెడి తెలివిగ్రానది రెండవఅహంకారమనఁబడును. ఇది మిక్కిలి మంగళకరమగుటచేతను బంధనివృత్తికరమగుటచేతను జీవన్ముక్తునియందే కలిగియుండును. కరచరణాదులతోఁ గూడిన దేహమే నేనని యెంచెడి తెలివియేదికలదో అదియే మూఁడవయహంకారము. ఇది మిగుల తుచ్ఛమైనదియు లౌకికమైనదియు బంధమగు సంసారవృక్షమునకు మూలమైనది అగుటవలన దానిని విసర్జింపవలయును. ఇట్టి దేహపరిమితిగల తుచ్ఛాహంకారమును వదలిపెట్టినయెడల ముక్తిప్రదమగు. తక్కినరెండు అహంకారములను మనుజుండుపొందును. కాఁబట్టి దుఃఖహేతువగు తృతీయాహంకారమునువిడిచిపెట్టి మోక్షకారణములగు కడమరెండు అహంకారములనుపొందవలయును. మఱియు నీకడపటి రెండుఅహంకారములనుగూడ త్యజించినవాఁ డెవఁడో అతఁడే తుర్యాతీతమనెడి కడపటిభూమికనెక్కితీరిన వాఁడనిభావము. వాలాగ్రమునందు అనఁగా: ‹‹నీవారశూకవత్తన్వీ పీతాభాస్వత్యణూపమా›› అను శ్రుతిప్రమాణము ననుసరించి, వాలాగ్రమనఁగా: నివ్వరిముల్లుయొక్క కొన కాఁబట్టి ఆ నివ్వరిముల్లుయొక్క అగ్రమువలె అతిసూక్ష్మమైన వస్తువు అహంశబ్దవాచ్యుఁడైన పరబ్రహ్మమునకుసాక్ష్యముగఁ జెప్పఁబడినది.

అవతారిక:—జ్ఞానభూము లేడింటిలో మొదటఁజెప్పిన మూఁడుభూములయందు అభ్యాసమువలన కలిగెడి ప్రయోజనమును వానిలో మొదటిభూమికయొక్క అతిశయమును జెప్పుచున్నారు.

ఉ. నాలవభూమి కేఁగుతతి । నాశము నొందిన వాఁడు స్వేచ్ఛగా
మేలగులోకము ల్గడచి । మెప్పులఁ జెంది జనించి మళ్లి శ్రీ
శీలురయిండ్ల ముక్తుఁ డగుఁ । జెందినఁ దొల్తటి భూమి సర్వమున్
జాలుగ నబ్బినట్టు లది । సజ్జన దుర్లభ మంద నారయున్. ౧౯

టీ. సజ్జన—మంచిశిష్యుఁడా, నాలవభూమికేఁగుకతిన్—నాలవభూమికిన్—శుభేచ్ఛ విచారణ తనుమానసియనెడు మూఁడుభూములను అతిక్రమించి (సత్త్వాపత్తియను పేరు గల) నాలుగవభూమినిగుఱించి, ఏఁగుకతిన్ — పోయెడిసమయమందు, నాశమునొందినన్—ఒకఁడు మృతినొందినను, వాఁడు—ఆపురుషుఁడు, స్వేచ్ఛగాన్ — ఒకరిఅధీనము లోఁజిక్కక తనంతట తానుగానే, రేఁగులోకముల్ — ఊర్ధ్వలోకములైన స్వర్గవైకుంఠకైలాసాదులను, కడచి—అతిక్రమించి, మెప్పులన్—అచ్చటచ్చటనుండువారలచేతను అనఁగా (బ్రహ్మవిష్ణురుద్రాదులచేతను) సన్మానములను, చెంది—పొంది, శ్రీకిరయిండ్లన్ — సంపదలతోఁగూడిన ఆచారాది మంచిస్వభావములుగల గృహములయందు, మళ్ళన్—మరల, జనించి—మర్త్యలోకములోపుట్టి, ముక్తుఁడగున్ — (తక్కినభూములను సాధించి) జీవవిదేహముక్తులను పొందినవాఁడగును, తొల్తటిభూమికిన్—మొదటిభూమియైన శుభేచ్ఛను, చెందినన్—పొందినను, సర్వముల్—సకలముఁను, చాలుగనన్—క్రమముగాను, అబ్బినట్లులగున్—పొందినవానివలెనగును, అరయన్—పరిశోధించి చూడఁగా, అది—ఆభూమి, అందన్—పొందుటకు, దుర్లభము—దుస్తరము, (అగుననుట)

తా. మొదటిశుభేచ్ఛ విచారణ, తనుమానసి, యనెడుమూఁడుభూములనుపొందిన ఆరురుక్షులలో నెవఁడైన నాలుగవభూమిని యెక్కుటకులోఁగా మృతిపొందినయెడల ఆపురుషుఁడుఒకరియధీనమునకులోఁబడక తనంతటతానుగానే ఊర్ధ్వలోకములైనస్వర్గవైకుంఠకైలాసాదుల నతిక్రమించి ఆపదవులయందుండెడి బ్రహ్మవిష్ణురుద్రాదులనుదర్శించి వారిచేత సన్మానింపఁబడినవాఁడై తిరుగా మర్త్యలోకమందు భాగ్యము ఆచారము మొదలగు నడవళ్లుగలవారియిండ్లయందుఁ బుట్టి పైభూములను సాధించి ముక్తుఁడగును గాని ఇచ్ఛారూపమైన జన్మవారిధిలోఁ బడఁడనుట. మొదటిభూమియైన శుభేచ్ఛదొరకుటయే యదిదుర్లభము. ఆమొదటిభూమి స్వాధీనమయ్యెనేని కైవల్యము స్వాధీనమగునని తాత్పర్యము. "తొల్తటిభూమిచెందిన సర్వముఁ జాలుగనబ్బినట్లగు" అనుటచే జ్ఞానభూమిక లేడింటిలో మొదటిభూమికయందు చేరినవాఁడు సమాశముగ తక్కినభూమికలను ఎక్కుటకు తగినవాఁడవునని భావము. అనఁగా: పూర్వజన్మసుకృతమువలనఁ గలిగినవాసన యున్ననేగాని బ్రహ్మవిచారమునకు మొదటిమెట్టగు శుభేచ్ఛయను భూమినిఁబొందఁడు. అట్లు పొందినవాఁడు, మేడపై నెక్కుటకుఁగాను మొదటిపడికట్టుపై కాలుపెట్టినవాఁడు క్రమముగా నన్నిటిని దాఁటి పైనఁజేరినట్లు వరుసగా కడమభూముల నన్నిటిని దాఁటి కడపటి భూమినిఁజేరుట సాధ్యమేయని తెలియఁదగ్గది.

అవ:—అభ్యాసభూములగు మొదటి మూఁడు భూములలో దేనినైనను పొందిన వాఁడెట్టివాఁడైనను ముక్తిని జెందునని తెలియఁజెప్పుచున్నారు.

క. సుత చిద్భూముల నొంటి రెంటఁ దగ మ్లేచ్ఛుండైన సాధించి సం
తతమోక్షేచ్ఛ విముక్తిఁ జెందు గురుపాదంబాన యీ యర్థ మూ
ర్జితమౌ దీని నబద్ధమన్నఁ జెడు దుశ్శీలుండు మధ్యస్థమై
శ్రుతి యీరీతి వచించు నిష్ఠఁ గనవే శుద్ధాత్మ శంకల్దెగన్. ౧౬౦

టీ సుత=కుమారా, చిద్భూములఁ=జ్ఞానభూమి లేడింటియందును, ఒంటిన్=ఒకటియైనగాని, రెంటన్=రెండు భూములనుగాని, (అనఁగా శుభేచ్ఛ, విచారణ, యను భూములలో దేనినైనను) మ్లేచ్ఛుఁడైనన్=(నీచప్రవృత్తిగల)తురకవాఁడైనను, తగన్=లెస్సగాను, సాధించి=వశపఱచుకొని, సంతతమోక్షేచ్ఛన్-సంతత=ఎడతెగని, మోక్ష=విదేహకైవల్యమందలి, ఇచ్ఛన్=ఆశచేతను, విముక్తిన్=మోక్షమును, చెందును=పొందును, గురుపాదంబాన=ఇందులకు గురుపాదమే సాక్షి, ఈయర్థము=ఈతాత్పర్యము, ఊర్జితమౌను=నిశ్చయమే అవును, దీనిన్=ఈభావమును, అబద్ధము=అసత్యము, అన్నను=అనినచో, దుశ్శీలుఁడు=(ఇట్లను) దుష్టస్వభావముగలవాఁడు, చెడున్=నశించును, మధ్యస్థమై=సమస్తప్రాణులయందు సమభావముగలదియై, శ్రుతి=వేదము, వచించున్=(ఇట్లని) పల్కును, నిష్ఠన్=సహజసమాధియందు, శుద్ధాత్మన్-శుద్ధ=పరిశుద్ధమైన, ఆత్మన్=ప్రత్యగ్బ్రహ్మస్వరూపమును, శంకల్దెగన్-శంకలు=సందేహములు, తెగన్=తెగునట్లుగాను, కనవే=చూడవా.

తా. కుమారా! జ్ఞానభూమి లేడింటిలోపలను మొకటి శుభేచ్ఛ విచారణ తనుమానసి యనెడు వానిలో ఒకటి రెండు భూములలోనైనను (వేదగర్హిత నీచకార్యములలో ప్రవర్తించెడి) తురకవాఁడుకూడ ఎడతెగని మోక్షేచ్ఛచేతను అభ్యాసముచేసి జీవ విదేహముక్తులను పొందును. ఇందులకు గురుపాదమే సాక్షి. ఈ తాత్పర్యము నిశ్చయమౌను. ఈ భావము అసత్యమని వాదించెడు దురాచారుఁడు జన్మసముద్రమందుఁబడి నశించును. సమస్తప్రాణులయందును సమభావముగలదియై వేదము వక్కాణించుచుండును. సహజ సమాధియందు పరిశుద్ధమైన బ్రహ్మాభిన్న ప్రత్యగ్వస్తువును సందేహము వీడునట్లుగాను చూచితివిగదా యని తాత్పర్యము.

"మ్లేచ్ఛుండైనన్" అనుటచేత తురకలు మొదలగువారు వర్ణాశ్రమధర్మములయందు బ్రాహ్మణాదులకు వ్యతిరిక్తముగ నీచకార్యములయందే ప్రవర్తింపువారగుటవలన వారికి బ్రహ్మవిచారణ కలుగుట కష్టము. అట్టివారుకూడ తత్త్వవిచారాపేక్షచేత ఈ భూముల త్రుటితిరిగి మొకటి మూఁడుభూములలో దేనినైనను పొందిరేని ముక్తిసాధింతురని భావము. ఇట్లనుటచేత కైవల్యమునకు జ్ఞానమే ప్రధానము గాని వర్ణాశ్రమాచారాది ధర్మములు గావని స్ఫురించుచున్నవి. ఇందులకు వసిష్ఠ విశ్వామిత్ర పరాశర వ్యాస దుర్వాసఆదులును

అప్పరు, సుందరుఁడు, మాణిక్యవాసుఁడు, ఆళ్వారాదులు, వేమన, పట్టణత్తుపిళ్ల, అవ యారు మొదలగువారే నిదర్శకులు.

అవ:—ముక్తినిపొందుటకు వర్ణాశ్రమభేదములు అక్కఱలేదనియుండఁగా ఈ భూమికలయొక్క కడపటిదైన తుర్యాతీతము సన్న్యాసులకేగాని ఇతరులకులభింపదని చెప్పుటవలన కలిగెడిసందేహమును బోఁగొట్టవలయునని శిష్యుఁడడుగుచున్నాఁడు.

ఉ. రోచింప న్యవతండులాకృతిగ నాయుల్లంబు గావించి తీ
వాచారవ్రతనిష్ఠల న్వెలయుసన్న్యాసు ల్గదా వారికిన్
నీచుల్ మ్లేచ్ఛులు వీరి కిచ్చు ననఁగా నిర్వాణ మాచిద్ధరల్
నాచిత్తంబు చలించెఁ దెల్పఁదగు విన్నాణంబుగా దేశికా. ౧౬౧

టీ. దేశికా=గురుస్వామీ, రోచింపన్ = ఆలోచించిచూడఁగాను, నాయుల్లంబున్=నామనస్సును, యవతండులాకృతిగన్-యవ=వడ్లగింజను, తండులాకృతిగన్=బియ్యపుగింజవలె, ఈవు=నీవు, కావించితివి=(జన్మములనుకల్పించి నన్ను వానిలో మునుఁగునటులు చేయుచుండెడి నామనస్సును వానినుండితొలఁగునటులు)చేసితివి, ఆచారవ్రతనిష్ఠన్-ఆచార=(విశ్వేశ్వరస్మృతిప్రకారము దండ, కమండలు, కాషాయ,కౌపీన, కటిసూత్రములధరించెడు) ఆచారములచేతను, వ్రత=(చాంద్రాయణాది) వ్రతములచేతను, నిష్ఠన్=(వైరాగ్యాది తపో) నిష్ఠలచేతను, వెలయుసన్న్యాసుల్గదా - వెలయు=ప్రకాశించుచుండెడి, సన్న్యాసులు=యతులుకదా, వారికిన్=అట్టివారికిని, మ్లేచ్ఛులు=(అపసవ్యమార్గముగాప్రవర్తించెడి) తురకలు, నీచులు=నీచకులస్థులు, వీరికిన్=ఇట్టివారికిని, ఆచిద్ధరలు-ఆ=ప్రసిద్ధమైన, చిద్ధరలు=జ్ఞానభూమికలు, నిర్వాణమున్=జీవన్ముక్తిని, ఇచ్చుననఁగాన్=వేదవేత్తలు ఇచ్చునని చెప్పఁగాను, నాచిత్తంబు=నా అంతఃకరణము, చలించెన్= (సందేహమువలన) చలించెను, విన్నాణంబుగాన్ = (ఆసందేహము నివారణమౌనట్లు) చక్కఁగా, తెల్పఁదగున్=తెలియఁజెప్పవలయును.

తా. గురుస్వామీ! ఆలోచించిచూడఁగా నామనస్సును వడ్లగింజనుదంచిన బియ్యపుగింజవలెచేసితిరి. ఆచారవ్రతనిష్ఠలచేత ప్రకాశించుచుండెడి సన్న్యాసులైనవారికిని, హీనకృత్యములుచేయు నీచులైనమ్లేచ్ఛులకును,జ్ఞానభూములే జీవన్ముక్తిని ఇచ్చునని వేదవిదులైన పెద్దలు చెప్పఁగా నామనస్సు సందేహముచేతచలించెను. ఆచాంచల్యము నివారణమౌనట్లుగాను తెలియఁజెప్పవలయునని తాత్పర్యము. ''యవతండులాకృతిగన్'' అనఁగా వడ్లను ఎండఁబెట్టి రోటిలోవేసిదంచి చెరుగఁగా పైపొట్టురాలిపోయి బియ్యము నిలిచినట్లు శిష్యునియొక్క మనస్సు అనెడి వడ్లగింజను మాయావరణమను పొట్టునుండి వేదాంతోపదేశము అనెడి దంచుటవలన విడఁదీసి జ్ఞానమను బియ్యమువలె ప్రకాశింపఁజేసెనని భావము. ఇట్లనుటచే వడ్లనుదంచి పొట్టును రాలఁగొట్టుటవలన వానియందు మొలక

తత్తాదికళ్తే అణఁగిపోయినట్లు మాయాసంబంధమగు పంచకోశాత్మకమైన శరీరత్రయ అవస్థాత్రయములయందు శిష్యుని మనస్సును వాసనలతోఁగూడి చలింపనీయక విజ్ఞాన స్వరూపునిగాఁజేసెనని యభిప్రాయము.

అవతారిక:—చతుర్విధసన్న్యాసులయొక్క నామములను వారి లక్షణములను జెప్పుచున్నారు.

చ. తెలిపెద సందియం బుడుగ ద్విద్వయభేదముల న్విరాగమా
దలఁపఁ గుటీచకం బన వదాన్య బహూదక మందు హంస మ
ట్లలఘుతరార్థ మా పరమహంస మనాఁగ విరాగమే ధర
ఫలమగుఁగాక వేషము శుభప్రదమౌనొ తలంచిచూడఁగన్. ౧౬౨

టీ. వదాన్య=పండితులలోపల శ్రేష్ఠుఁడవైనకుమారా, సందియంబు=నీమనస్సులోజనించిన సందియము, ఉడుగన్=నివారణమానట్లుగాను, తెలిపెదన్=తెలియఁజేయుచున్నాను, విరాగము=(త్రివిధబంధములనువిడిచిన సన్న్యాసమనెడి)వైరాగ్యము, తలఁపన్=యోజించిచూడఁగాను, కుటీచకంబు=కుటీచకమను సన్న్యాసము, బహూదకము=బహూదకమను సన్న్యాసము, హంసము=హంససన్న్యాసము, అట్లు=ఆప్రకారము, అలఘుతరార్థము-అలఘుతర = మిక్కుటమైన, అర్థము=ప్రయోజనము, ఔ=అగునట్టి, పరమహంసము=పరమహంససన్న్యాసము, అనాఁగన్=అనునట్లుగాను, ద్విద్వయభేదములన్=రెండురెండుగానైన, నాలుగువిధములుగాను, ఔన్=అవును, అందున్=ఆనాల్గువిధములగు సన్న్యాసములందు, విరాగమే = వైరాగ్యమే, ఫలము=ప్రయోజనము, అగుఁగాక=అగునుగాక, వేషము=(పైనవేసికొనిన కాషాయదండాది) వేషములచేత, శుభప్రదము=మోక్షశుభమును ఇచ్చునది, తలంచిచూడఁగన్ = యోజించిచూడఁగాను, ఔనో=అగునా (అనఁగా కానేరదనుట.)

తా. పండితులలోపల శ్రేష్ఠుఁడవైన కుమారా! నీమనస్సులోజనించిన సందియము నివారణమానట్లుగాను తెలియఁజేయుచున్నాను. త్రివిధబంధమునువిడిచిన సన్న్యాసమనెడి వైరాగ్యము యోజించిచూడఁగాను కుటీచకమను సన్న్యాసము, బహూదకమను సన్న్యాసము, హంససన్న్యాసము మిక్కిలి శ్రేష్ఠమైనట్టి పరమహంస సన్న్యాసము అనునట్లు నాలుగువిధములుగా నగును. అట్టి సన్న్యాసములందు వైరాగ్యమే ప్రయోజనమవునుగాని పైనధరించిన కాషాయదండాది వేషములచేత మోక్షమును ఇచ్చునది కాదని తాత్పర్యము.

అవతారిక:—సన్న్యాసులకుఁ గారణములైన త్రివిధవైరాగ్యములను వానిలక్షణములను జెప్పుచున్నారు.

ఉ. మందుఁడు తీవ్రుఁ డార్యజనమాన్య సుతీవ్రతరుం డనంగఁ గ
ర్మందులు మువ్వు రం దఖిలమందిరబాధల కోర్వ లేమి నా
మందుఁడు తీవ్రుఁ డీషణసమాజముఁ బాయనగుఁ గ్రియాళి పెం
పొందఁ దొలంగఁ గల్లయని యొప్పు సుతీవ్రతరుండు నెమ్మదిన్. ౧౬౩

టీ. ఆర్యజనమాన్య=పెద్దలచేత పూజింపఁదగినశిష్యుఁడా, మందుఁడు=మందవిరాగముగలవాఁడని, తీవ్రుఁడు=తీవ్రవిరాగముగలవాఁడని, సుతీవ్రతరుండు=మిక్కిలి తీవ్రవిరాగముగలవాఁడని, అనంగన్=అనునట్లుగాను, కర్మందులు=సన్న్యాసులు, మువ్వురు=ముగ్గురు, అందున్=ఆముగ్గురియందును, మందుఁడు = మందసన్న్యాసి, అఖిలమందిరబాధలకున్-అఖిల=సమస్తమైన, మందిర=గృహరూపమైన కుటుంబమండలి, బాధలకున్=ఉపద్రవములకు, ఓర్వలేమిన్=ఓర్వలేకుండుటచేత. ఔన్=(సన్న్యాసి)అవును, ఈషణసమాజము-ఈషణ = దారేషణ పుత్రేషణ ధనేషణములయొక్క, సమాజము=సముదాయము, పాయన్=విడిచినచో, తీవ్రుఁడు = తీవ్రుఁడనుపేరుగల సన్న్యాసి, అగున్=అగును, క్రియాళి-క్రియ = (కర్మకాండమందుఁజెప్పఁబడిన) కార్యములయొక్క, ఆళి=సమూహము, పెంపొందన్=వృద్ధిపొందఁగాను, కల్లయని=అబద్ధమని, తొలంగన్=విడిచినచో, తీవ్రతరుండు = మిక్కిలి తీవ్రతరుఁడనుపేరుగల సన్న్యాసిగా, నెమ్మదిన్=మంచి మనస్సుచేత, ఒప్పున్=ఒప్పినవాఁడగును.

తా. పెద్దలచేతఁ బూజింపఁదగిన శిష్యుఁడా! మందవిరాగముగలవాఁడని తీవ్రవిరాగముగలవాఁడని మిక్కిలి తీవ్రవిరాగముగలవాఁడని అనునట్లుగాను సన్న్యాసులు మూఁడువిధములనుందురు. ఆముగ్గురియందు మందసన్న్యాసి సమస్తగృహరూపమైన కుటుంబమండలి యుపద్రవములకు నోర్వలేకుండుటచేత సన్న్యసించును. దారేషణ పుత్రేషణ ధనేషణములయొక్క సముదాయమువిడిచినచో తీవ్రుఁడనుపేరుగల సన్న్యాసియగును. కర్మకాండమందుఁ జెప్పఁబడిన కార్యములయొక్క సమూహము వృద్ధిపొందఁగాను అబద్ధమని విడిచినచో తీవ్రతరుఁడను పేరుగల సన్న్యాసియగునని తాత్పర్యము.

అవ:—మందవిరాగముగలవానియొక్క ప్రయోజనమును తీవ్రవిరాగ సన్న్యాసమునందలి ద్వివిధభేదములను జెప్పుచున్నారు.

చ. ద్వివిధము లౌఁ గుటీచకము తీవ్రమునందు బహూదకం బనం
గవినుత శక్తిలేమిఁ దిరుగ న్గన నందుఁ గుటీచకం బగున్
భువిఁ జరియింప శక్తుఁడయి పుణ్యనదీపురులం గనుంగొనం
బ్రవిమల నిర్ణయోక్తుల స్వభావము గ్రాల బహూదకం బగున్. ౧౬౪

టీ. తీవ్రమునందుఁ=తీవ్రమను పేరుగల సన్యాసమందు, కుటీచకము = కుటీచకమను పేరుగల సన్యాసమనియు, బహూదకంబు = బహూదక సన్యాసమనియు, అనఁ=అనునట్లుగాను, ద్వివిధము లౌఁ=రెండువిధములగును, అందుఁ = ఆరెంటియందు, కవినుత=విద్వాంసులచేత స్తోత్రముచేయఁబడిన శిష్యుఁడా, తిరుగఁ=(సన్యాసులకు నిర్ణయించిన విశ్వేశ్వరస్మృతియందు చెప్పినచొప్పున) భూసంచారముచేయుటకు, కనఁ=విచారింపఁగా, శక్తిలేమిఁ = (వృద్ధాప్యమందు) సామర్థ్యము లేకుండుటచేతను, కుటీచకంబు=కుటీచకమను పేరుగలసన్యాసము, అగుఁ=అగును, పుణ్య=పుణ్యస్వరూపమైన, నదీ=(గంగ గోదావరి కృష్ణకావేర్యాది) నదులను, పురుల్=(అయోధ్య, కాశి, కాంచి, మొదలయిన) పుణ్యపట్టణములను, కనుంగొనఁ=బాగుగాదర్శించుటకు, భువిఁ=భూమియందు, చరియింప శక్తుఁడయి=సంచరించుటకు బలముగలవాఁడై, ప్రవిమలనిర్ణయోక్తులఁ=ప్రవిమల=నిర్మలులయిన పెద్దలచేత, నిర్ణయ=నిర్ణయింపఁబడిన, ఉక్తులఁ=వాక్కులచేతను, స్వభావము=నైజము, క్రాల్=ప్రకాశింపఁగాను, బహూదకంబు=బహూదకమను సన్యాసము, అగుఁ=అగును.

తా. విద్వాంసులచేత స్తుతింపఁబడిన శిష్యుఁడా! తీవ్రతరమను పేరుగల సన్యాసమందు కుటీచకసన్యాసమని బహూదకసన్యాసమని రెండువిధములగును. ఆరెంటిలో సన్యాసులకునిర్ణయించిన విశ్వేశ్వరస్మృతియందుఁ జెప్పినచొప్పున భూసంచారముచేయుటకు సామర్థ్యములేకుండుటచేతను గ్రామమందుఁగాని నదీతీరమందునుగాని మఠముగట్టుకొని ఉదరపోషణముగా భోజనముచేసికొనుచు కాషాయదండకమండల్వాది వేషములం వేసికొని యుండుటచేత కుటీచకసన్యాసమగును. గంగ, గోదావరి, కృష్ణ, కావేరి మొదలగు పుణ్యతీర్థములయందు స్నానముచేసికొనుచు అయోధ్య, కాశి, కాంచి మొదలగు పుణ్యపట్టణముల దర్శించుటకు భూమియందు నడుచుటకు శక్తుఁడై పెద్దలచేత నిర్ణయింపఁబడిన వాక్కులచొప్పున ప్రకాశింపఁగాను బహూదకసన్యాసమని తా.

అనఁగా: వార్థకమందు తనునందఱును పూజింపవలయుననుతలంపుచేత తన యావదాస్తిని దారపుత్రాదులకు నొప్పగించి విధిప్రకారము సన్న్యసించి నివాసయోగ్యమగు నొకపెద్దఅగ్రహారమందుఁజేరి అందొకమఠమును ఏర్పఱచుకొని దినదిన మొకొక్కయింటిలో భిక్షనుగైకొనుచు సుఖముగానుండుట కుటీచకమనఁబడును. ఇందువలనభుక్తి సుఖమేగాని ముక్తిలేదు. బహూదకమనఁగా: భుజించినచోటనిద్రింపక నిద్రించినచోటభుజింపక గ్రామమున నొకదినమును పట్టణమున మూఁడురాత్రులను పుణ్యనదీక్షేత్రాదులందు ఐదు లేక ఆఱుదినములకు ఎక్కువగాకుండ నివసించుచు అచ్చటచ్చటనుండెడి గృహస్థుల ఇండ్లయందు భుజించుచు సంచారముచేయుట. ఇందువలన తీర్థయాత్రాదుల ఫలమేగాని ముక్తిలేదని భావము.

అవతారిక:—తీవ్రతరవిరాగ సన్న్యాసులభేదములను ప్రయోజనములను జెప్పు చున్నారు.

ఉ. హంసుఁ డనన్ యతు ల్పరమహంసుఁడు తీవ్రతరంబునందు వి
ద్వాంసులు సెప్ప నొప్పుదురు వారిజసంభవుతో విముక్తుఁ డౌ
హంసుఁడు జ్ఞానభూమికలయందుఁ దదన్యుఁడు రెండు మూఁడు స
ర్వంసహల న్మెలంగు విను వాఁడు ద్విధాఖ్యల నొప్పుఁదెల్పెదన్.

టీ. తీవ్రతరంబునందున్ = తీవ్రతరమను పేరుగల వైరాగ్యమందు, యతులు = సన్న్యాసులు, హంసుఁడు = హంసుఁడను పేరుగల సన్న్యాసి, పరమహంసుఁడు = పరమహంససన్న్యాసి, అనన్ = అనునట్లుగాను, విద్వాంసులు = బ్రహ్మవిదులైనపండితులు, చెప్పన్ = పలుకునట్లుగాను, ఒప్పుదురు = ప్రకాశింతురు, అహంసుఁడు = అహంససన్న్యాసి, వారిజసంభవుతోన్ = (అర్చిరాది మార్గముచేత సూర్యలోకమునుబొంది తద్ద్వారా బ్రహ్మలోకముచేరి) బ్రహ్మతోఁగూడ, విముక్తుఁడౌన్ = ముక్తుఁడౌను, తదన్యుఁడు-తత్ = అహంసునికంటె, అన్యుఁడు = వేరైన పరమహంసుఁడు, జ్ఞానభూమికలయందున్ - జ్ఞాన = జ్ఞానసంబంధములైన, భూమికలయందున్ = శుభేచ్ఛ, విచారణ, తనుమానసి, సత్త్వాపత్తి, అసంసక్తి, పదార్థాభావన, తురీయములనెడి భూములలో, రెండు మూఁడు సర్వంసహలన్ = మొదటివైన ఒకటి రెండు మూఁడు భూములయందు, మెలంగున్ = సంచరించెడువాఁడగును, వాఁడు = ఆపరమహంసుఁడు. ద్విధాఖ్యలన్ = రెండువిధములైనపే ళ్లచేత, ఒప్పున్ = ప్రకాశించును, తెల్పెదన్ = వానిని తెలియఁజేసెదను, వినుము = (వాని వృత్తాంతము) ఆలకింపుము.

తా. మందము, తీవ్రము, తీవ్రతరములను, త్రివిధవైరాగ్యములలో తీవ్రతరమను వైరాగ్యమందు సన్న్యాసులు హంసుఁడు పరమహంసుఁడు అనునట్లుగాను బ్రహ్మవేత్త లైన పండితులచేత చెప్పఁబడుదురు. అహంససన్న్యాసి అర్చిరాదిమార్గములచేత సూర్య లోకమునుబొంది తద్ద్వారా బ్రహ్మలోకముఁజేరి అచ్చట బ్రహ్మవిచారణఁజేసి “బ్రహ్మ ణా సహముచ్యంతే” అను ప్రమాణమురీతిని బ్రహ్మతోఁగూడ ముక్తుఁడగును. అహం సునికంటె వేరైన పరమహంససన్న్యాసి జ్ఞానభూములేడింటిలో మొదటి రెండు మూఁ డుభూములలోనే యుండినపక్షమందు ముక్తికి అర్హుఁడగును. అపరమహంససన్న్యాసి ద్వివిధములైన నామములచేత ప్రకాశించును. వానివృత్తాంతము తెలియఁజెప్పెదనువిను మని తాత్పర్యము.

“తదన్యుఁడు రెండుమూఁడు సర్వంసహలన్మెలంగున్” అనఁగా: అహంసయను యతికంటె వేరైన పరమహంసయతికి విశేషప్రవృత్తినిగురించి జ్ఞానభూమికలలో క్రింది

మూఁడుభూములనుగాని లేక రెండుభూములనుగాని ఎక్కటి అట్టివాఁడు పైవిముక్తి భూములను సాధించుటకులోఁగా మృతిచెందినటులయిన స్వర్గలోకాదులనుజేరి అచ్చట చ్చట బ్రహ్మవిష్ణురుద్రాదులచేఁ బూజితుఁడై మరల మర్త్యలోకమున నుత్తమగృహమునఁబుట్టి పైభూములను సాధించి ముక్తిఁజెందును.

అవతారిక:—పరమహంస సన్యాసుల అభ్యాసానుభవములయందుఁగల భేదముల రెంటిని జెప్పుచున్నారు.

మ. ధర జిజ్ఞాసియు జ్ఞాని నా వెలయుఁ బుత్రా ముక్తుఁడై జ్ఞాని త
ద్వరజిజ్ఞాసి ముముక్షువై పఱగుచిద్ధాత్రీత్రయంబందు సు
స్థిరుఁడై యాతఁడు ద్విప్రకారములుగాఁ జెన్నొందుఁ దద్భేదముల్
వరుస న్దెల్పెద జ్ఞానమేవినుము నిర్వాణాప్తికి న్ముఖ్యమా. ౧౬౬

టీ. పుత్రా=కుమారా, ధరన్=పుడమియందు, జిజ్ఞాసియున్=(అపరమహంససన్యాసులలో ఏర్పడిన బ్రహ్మజ్ఞానమును తుదముట్ట తెలియవలయునను) ఇచ్ఛగలవాఁడును, జ్ఞాని=(బ్రహ్మవిద్, బ్రహ్మవిద్వర, బ్రహ్మవిద్వరీయ, బ్రహ్మవిద్వరిష్ఠులను పేళ్లుగల బ్రహ్మజ్ఞాన సంపూర్ణులలో నొకఁడగు) వివేకియు, అనన్=అనునట్లుగాను, వెలయున్=ప్రకాశించును, జ్ఞాని=ఆ బ్రహ్మజ్ఞాని, ముక్తుఁడౌన్=ఇపుడే ముక్తుఁడగును, తద్వరజిజ్ఞాసి-తత్=ముందుచెప్పఁబడిన, వర=శ్రేష్ఠుఁడైన, జిజ్ఞాసి=జ్ఞానప్రయత్నముగలవాఁడు, ముముక్షువై=మోక్షేచ్ఛగలవాఁడై, చిద్ధాత్రీత్రయంబందున్=జ్ఞానభూములలో ఒకటి రెండు మూఁడుభూములయందు, సుస్థిరుఁడై=దృఢబుద్ధిగలవాఁడై, వెలయున్=ప్రకాశించును, అతఁడు=ఆముముక్షువు, ద్విప్రకారములుగాన్=రెండువిధములుగాను, చెన్నొందున్=ఒప్పును, తద్భేదములు=ఆభేదములు, వరుసన్=క్రమముగాను, తెల్పెదన్=తెలియఁజెప్పెదను, వినుము=ఆలకింపుము, నిర్వాణాప్తికిన్=మోక్షప్రాప్తికి, జ్ఞానమే=విశేషవృత్తియే, ముఖ్యమాన్=మేలైనదగును.

తా. కుమారా! పుడమియందు బ్రహ్మజ్ఞానమును తెలియవలయునను ఇచ్ఛగలవాఁడును, తెలిసి పూర్ణుఁడైనవాఁడును అనునట్లుగాను ఆ పరమహంసుఁడు రెండుభేదములుగానుండును. అటులుదెలిసి పూర్ణుఁడైనజ్ఞాని ఈ జన్మమునందేముక్తుఁడై ప్రారబ్ధావసానమందు విదేహముక్తుఁడగును. ముందుచెప్పఁబడిన జిజ్ఞాసి జ్ఞానప్రయత్నమువలన జ్ఞానభూమికలలో మొదటి రెండు మూఁడుభూములలోఁ జేరినవాఁడై ఆజన్మమందుఁగాని ఇతరజన్మమందుఁగాని ఏడుభూములను సాధింపఁగలవాఁడగును. ఆ ముముక్షువు రెండువిధములుగానొప్పును. వానిని నేను వరుసగా తెలిపెదనువినుము. మోక్షమునకు జ్ఞానమేముఖ్యముగాని వర్ణాశ్రమాచారవేషములు ప్రయోజనముగావని తాత్పర్యము.

అవ:—ఆత్మజ్ఞాని యనువాఁడు రెండువిధములుగా నొప్పునని చెప్పుచున్నారు.

మ. సంసారస్థితులై ద్విజాదు లిల సత్సన్న్యాసులై కొందఱీ
హంసజ్ఞానము నొందుచుందు రని ప్రత్యక్షాగమంబు ల్వెస
న్శంసింపం గనియుందు మాత్మజ మనస్సందేహ మింకేల యా
హంసార్థంబు శ్రుతిప్రయుక్త్యనుభవాయత్తుండవై పొందుమా.

టీ. ఇలన్=పుడమియందు, ఆత్మజా = కుమారా, ద్విజాదులు=బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్రులు, సంసారస్థితులై=గృహస్థాశ్రమమందుండినవారై, కొందఱు=తక్కినమతికొందఱు, సన్న్యాసులై=సంసారత్యాగముగలవారై, ఈ హంసజ్ఞానమున్=పరతత్త్వమగు హంసజ్ఞానమును, ఒందుచుందురు=పొందుచుందురు, అని=ఈప్రకారమని, ప్రత్యక్షాగమంబులు-ప్రత్యక్ష=ప్రత్యక్షప్రమాణము, ఆగమంబులు=ఆగమప్రమాణములు, వెసన్=మిక్కిలి, శంసింపన్=చెప్పుచుండఁగా, కనియుందుము=చూచియుందుము, మనస్సందేహము- మనః=మనస్సునందు, సందేహము=సంశయము, ఇంకేల=ఇఁకనెందుకు, ఆహంసార్థంబున్=ఆహంసతత్త్వార్థమును, శ్రుతిప్రయుక్త్యనుభవాయత్తుండవై = శ్రుతి=వేదములయొక్కయు, ప్రయుక్తి=జ్ఞానశాస్త్రములయొక్కయు, అనుభవ=అనుభవముచేతను, ఆయత్తుండవై=కూడినవాఁడవై, పొందుమా=చెందుమా.

తా. కుమారా! పుడమియందు బ్రహ్మక్షత్త్రియ వైశ్య శూద్రులు బంధమైన స్థిరగృహస్థధర్మములలో నుండినవారైనను, కొందఱు అట్టి గృహస్థాశ్రమమును విడిచి సన్న్యాసులై యుండియును, బ్రహ్మజ్ఞానమును పొందుచుందురు. ఈప్రకారము న్యాయశాస్త్రమందును, ఉపనిషత్ప్రమాణమందును, లోకమందును ప్రత్యక్షముగాఁ జూచియుండియు నీమనస్సులో ఇఁక సందేహమేల? ఆహంసతత్త్వార్థమును శ్రుతియుక్త్యనుభవముల చేత తెలిసికొనినవాఁడవై యుండుమని తాత్పర్యము.

అవతారిక:—పైఁజెప్పినవిధముగానే ముందుపలికిన సర్వార్థములు అణఁగియుండిన తత్త్వముయొక్క ఫలితార్థము ప్రజ్ఞానస్వరూపమేయని చెప్పుచున్నారు.

ఉ. పుట్టుట నిక్కమేని మృతిఁ బొందుట పిమ్మట నిక్కమై తగున్
బుట్టువు లేకయున్నఁ బరిపూర్ణమ యేనగుదుం జుమీ ధరన్
బుట్టువు నేనుగాని యెడఁ బొల్పు యథార్థము నేనుగాను సూ
పుట్టుటగిట్టుట ల్గనని బోధమయాత్ముఁడనై వెలుంగుదున్. ౧౬౮

టీ. ధరన్=భూమియందు, పుట్టుటనిక్కమేని-పుట్టుట=జన్మించుట, నిక్కమేని=యథార్థమయ్యెనేని, పిమ్మటన్=పుట్టినతర్వాతను, మృతిఁబొందుట=చచ్చుట, నిక్కమై=యథార్థమై, తగున్=ఒప్పును, పుట్టువులేకయున్నన్=లోకమందు పుట్టుట యను

పది లేకయుండె నేని, పరిపూర్ణము=అంతట నిండియుండెడి పరబ్రహ్మము, ఏన్=నేను, అగుదుంగాదె=అగుదునుగదా, పుట్టువు నేను గాని యెడన్=పుట్టుట నేనుగాకుండినయెడల, పొల్చు యథార్థము = ప్రకాశించుచుండెడి యథార్థవస్తువు, నేనుగానునూ=నేనుగానుగదా, పుట్టుటగిట్టుటలు=జనించుటయు మృతిఁబొందుటయు, కనని=కలుగకుండెడి, బోధమయాత్ముఁడన్=ప్రజ్ఞానఘనస్వరూపుఁడను, అయి వెలుంగుదున్ = కలవాఁడనై ప్రకాశించుదును.

తా. భూమియందు పుట్టుట నిక్కమైనను గిట్టుటనిజమేయవును. లోకమందు పుట్టుటలేకయున్నను పరిపూర్ణమైనవస్తువు నేనేయవుదును. పుట్టుట నేనుగాకుండినయెడల ప్రకాశించెడివస్తువు నేనుగాను గనుక జనించుటయు మరణించుటయు కలుగకుండెడి ప్రజ్ఞానఘనస్వరూపుఁడనై ప్రకాశించుదునని తాత్పర్యము.

అవతారిక:—కూటస్థుఁడే అపరబ్రహ్మమని చెప్పుచున్నారు.

ఉ. ఏ ననుబ్రహ్మ మే ననిన నే నెటు లాసుఖ మందనౌనన
గానఁగదామఱి న్సుమతి కార్యమనన్మృతి నొందు సుప్తిఁ దద్
జ్ఞానము చావకుండినను జానగు నే పరిపూర్ణ వస్తువై
మానుగ వెల్గుచుందు ననుమానము లేక తదీయ శేముషిన్. ౧౬౯

టీ. ఏనను బ్రహ్మమున్-ఏను=నేను, అను=అనునట్టి, బ్రహ్మమున్=బ్రహ్మమును, ఏననినన్=నేనే అనినను, ఆసుఖమున్=ఆబ్రహ్మజ్ఞానసుఖమును, అందన్=పొందుటకు, ఏను=నేను, ఎటులు=ఏప్రకారము, ఔన్=అగుదు, అనన్=(ఈ ప్రకారము శిష్యుఁడు) అనఁగాను, కానఁగదా=చూడలేదుగదా, మఱిన్=వెండియు, అది=అది, సుమతికార్యమనన్-సుమతి=బుద్ధియొక్క, కార్యము=కార్యము, అనన్=అనినను, సుప్తిన్=నిద్రయందె, మృతిపొందున్=చచ్చును, తద్జ్ఞానము=ఆబుద్ధికార్యము, చావకున్నన్=నశింపకుండె నేని, జానగు=ఒప్పినవాఁడనగు, ఏన్=నేను, పరిపూర్ణవస్తువై=అఖండాకారమైన పరబ్రహ్మమై, మానుగన్=లెస్సగాను, అనుమానము లేక=సందేహములేక, తదీయ శేముషిన్=అవిజ్ఞానముచేతను, వెల్గుచుందున్=ప్రకాశించుచుందును.

తా. నేను అనునట్టి బ్రహ్మము నేననినను ఆబ్రహ్మజ్ఞానసుఖమును పొందుటకు నే నెటులు తగినవాఁడనౌదును. ఆసుఖమును నేను చూడలేదుగదా! సుఖము బుద్ధియొక్క కార్యమనినను నిద్రయందు చచ్చును. ఆబుద్ధికార్యము నిద్రయందు చావకుండె నేని నేనే ఆపూర్ణవస్తువై సందేహములేక అవిజ్ఞానముచేత ప్రకాశించుచుందునని తాత్పర్యము.

అవ:—విద్యానందమందు ఐకమత్యమును జెప్పుచున్నారు.

మ. పరిపూర్ణాత్ముఁడ నెట్టులే నగుదుఁ దద్భాగ్యంబు నేఁగాన నీ
వరయ న్దెల్పు మనం బ్రబోధఘన నిద్రావస్థ యందుండు చి

త్పరమానందమెపూర్ణమందొకయెడన్ బ్రాప్తించుమోదవ్యథ
ల్స్థిరముల్గాకచెడన్నిదానమదెయై చెన్నొందెచింతించుమా. ౧౭౦

టీ. పరిపూర్ణాత్ముఁడన్-పరిపూర్ణ=సర్వవ్యాపకమైన, ఆత్ముఁడన్=పరబ్రహ్మ స్వరూపుఁడను, ఏను=నేను, ఎట్టులు=ఏప్రకారము, అగుదున్=అగుదును, తద్భాగ్యంబు-తత్ = ఆపరబ్రహ్మముయొక్క, భాగ్యంబు=షడ్గుణైశ్వర్యసంపదను, ఏన్=నేను, కానన్=(మాచినవాఁడను) కాను, ఈవు=(నాగురుస్వామివైన) నీవు, అరయన్(నేను) తెలిసికొనులాగున, తెల్పుము = తెలియఁజెప్పుము, అనన్=ఈప్రకారము శిష్యుఁడను గఁగా, ప్రబోధఘననిద్రావస్థయందున్=మహాత్తరమైన విజ్ఞానదశతోఁగూడి జగత్తును మఱచిన నిర్వికల్పసమాధియందు, ఉండుచిత్పరమానందమె-ఉండు=నివసించియుండెడి, చిత్=జ్ఞానసంబంధమైన, పరమ=నిరతిశయమైన, ఆనందమే=సంతోషమే, పూర్ణము=అఖండపరిపూర్ణము, (అగును) అందున్=ఆపూర్ణమందు, ఒకయెడన్=ఒకదేశమందు, ప్రాప్తించు=కలుగుచుండెడి, మోదవ్యథల్ = (మనఃకల్పితములయిన స్వప్నజాగరములయందుఁదోఁచుచుండెడి) సుఖదుఃఖములు, స్థిరముల్గాక=(అవాంతరములగుటవలన) నిత్యములుగాక, చెడన్=నశింపఁగాను, అదె=అజ్ఞానానందమె, నిదానమై=ఆదికారణమై, చెన్నొందున్=ప్రకాశించును, చింతించుమా = (ఓశిష్యుఁడా నీవు తెలివియందు) రూజింపుము.

తా. సర్వవ్యాపకమైన అఖండసచ్చిదానంద పరబ్రహ్మస్వరూపుఁడను నేనేప్రకారము అగుదును. ఆపరబ్రహ్మముయొక్క షడ్గుణైశ్వర్యాదిసంపదలను నాయందుండునవిగాఁజూచినవాఁడను కాను. నా గురుస్వామివైన నీవు నేను తెలిసికొనులాగున తెలియఁజెప్పుమని శిష్యుఁడడుగఁగా: మిక్కిలి అతిశయమగు విజ్ఞానదశతోఁగూడి ప్రపంచమునుమఱచిన నిర్వికల్పనిష్ఠయందు నివసించియుండెడి జ్ఞానసంబంధమైన నిరతిశయానందమే అఖండపరిపూర్ణమగును. ఆపరిపూర్ణమందు ఏకదేశమందుఒప్పుచుండెడి ఖేదమోదములు నిత్యములుగాకనశింపఁగాను అజ్ఞానానందమేప్రకాశించును. అదియేఆదికారణము. ఓయిశిష్యుఁడా! నీవు తెలివియందురూజింపుమని ఆచార్యుఁడు వచించెననితాత్పర్యము.

"పరిపూర్ణాత్ముఁడ నెట్టులేనగుదు" అనుటచేత లోకమందు కర్మఠులు, ద్వైతులు, వైష్ణవవిశిష్టాద్వైతులు, శైవవిశిష్టాద్వైతులు మొదలయినవారును, మఱియు మహమ్మదీయ క్రైస్తవాది మతావలంబులును, ద్వైతవాదులైయుండఁగా నేనుమాత్రమెట్లు అద్వైతినని చెప్పుకొనెదను. క్షణభంగుఁడనైన నేను నిత్యత్వమును షడ్గుణైశ్వర్యమాహాత్మ్యమును ఎట్లు పొందుదును. ఇదియునుగాక, "పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణ ముదచ్యతే" అను మొదలైన శ్రుత్యర్థములచొప్పున ఈజగత్తులో బ్రహ్మములేని స్థలములేక అంతట ఆపరబ్రహ్మమే వ్యాపించియున్నదని పలుకుచుండఁగా అంతటను

వ్యాపింపక యొక్కడనో యొక్కమూల నివసించియుండెడివాఁడనగు నేను సర్వవ్యాపకమైన అపరబ్రహ్మవస్తువు నెట్లగుదును అని భావము. (ప్రబోధఘన నిద్రావస్థయందుండు చిత్పరమానందము) అనుటచే ‘‘పాతాళమేతస్యహి పాదమూలం’’ అను శ్లోకము మొదలుగాని ‘‘సర్వంతుశీర్షాణి సహస్రశీర్ష’’ అను వానివఱకుఁగల తాత్పర్యమే శరీరమునకు ప్రపంచమనిసిద్ధాంతము. కనుక ఆచతుర్దశభువనాత్మకమగు ప్రపంచము నీశరీరము మొదలుగాని పాదాంతమువఱకుఁగల అవయవముల సముదాయమంతయు అని తెలియుము. అట్టి నీశరీరములో నెచ్చోటనైనను ఒకమల్లు గుచ్చుకొనినయెడల ఆనొప్పి నీకేకలిగినట్లు సంతోషము కలిగినను దుఃఖముసంభవించినను ‘‘అహమేవసకలోవికలోఽస్మి’’ అను ప్రమాణము రీతిని అణుమాత్రమైనను నీవులేని ప్రపంచము లేనందున పైచెప్పిన ‘‘పూర్ణమదః పూర్ణమిదమ్’’ మొదలగువాని అర్థము నీకే పొందుపడియున్నది. కాఁబట్టి నీవే సకలమును వికలమును సుఖియును దుఃఖియును అగుచున్నావు అట్లు నీవేయని తెలిసితివేని నిర్వికల్పసమాధియందు విజ్ఞానదశతోఁ గూడియుండునప్పుడు కలిగెడి యానందము అదియేయని తెలియునది. మనఃకల్పితములైన జాగ్రత్స్వప్నములయందుఁ దోఁచెడి సుఖదుఃఖములు, సముద్రమందు అలలకు ఆవలనిశ్చలముగా నుండిననీరు ఇవతల తరంగములుగా పైకెగసి అనేకబిందువులుగా నేర్పడి మఱల ఆనీరే అయినచందమున గాఢనిద్రయందు శూన్యమగును. కాన ఆచోట్పునకే అవాంతరములగు ఆసుఖదుఃఖములు నశించిన పిదప నిలిచిన యానందమే జాగ్రత్స్వప్నసుషుప్తులమూఁడింటను ‘‘సుఖమహమస్వాప్సం నకించిదవేదిషమ్’’ ‘‘మత్తోఽపితావద్విభృయా త్స్వదేహమారబ్ధమశ్నన్ అభిమానశూన్యః, యథానుభూతం ప్రతియాతనిద్రః’’ అనునట్లు ప్రారబ్ధమునుఅనుభవింపక తీరదని ముందు చెప్పఁబడినచోట్పున నెట్టివానికిని సుఖదుఃఖములు రాకమానవు. అందువలన పై మూఁడవస్థలయందును అహంశబ్దవాచ్యుఁడవైన నీవేయుందువు గనుక ‘‘శ్లో. కాలఆత్మాగమోలోక స్స్వభావో ధర్మఏవచ, ఇతిమాంబహుధాప్రాహుః గుణవ్యతికరేసతి. సత్త్వంరజస్తమఇతి త్రివృదేకమాదౌ సూత్రంమహానహ మితిప్రవదంతిజీవమ్, జ్ఞానక్రియార్థఫలరూపతయోరుశక్తి బ్రహ్మైవభాతి సదసచ్చతయోః పరంయత్’’ అను ప్రమాణము రీతిని అంతట నిండిన త్రిగుణాతీతుఁడవైన అపరబ్రహ్మస్వరూపుఁడవు నీవేయని తెలియుమని భావము.

అవతారిక:—విద్యానందము ఏకమైన స్వానుభూతి ఏప్రకారమగునను దానికి సమాధానము చెప్పుచున్నారు.

ఉ. మానసకల్పన న్గద సమస్తము దోఁచెఁ దలంచువేళఁ దద్
జ్ఞానమునందె కాదె యది తత్సకలంబు నతిక్రమించి తాఁ

గానఁ దలంపలేక తుదకే ఖండము గాక వెలుంగుచున్న యా
జ్ఞానమెఱుంగఁ బూర్ణమగు నే జ్ఞప్తియె యేనదియై వెలుంగుదున్.

టీ. మానసకల్పనన్ - మానస = మనస్సుయొక్క, కల్పనన్ = సంకల్పముచేతను, సమస్తమున్ = (ఊహింపఁబడెడి నామరూపప్రపంచము) సర్వమును, తోఁచెన్ = తోఁచెను, కద = కదా, తలంచువేళన్ = (ఆప్రకారము) తలఁచెడిసమయమందు, తదజ్ఞానమందె = అజ్ఞానమునందె, అది = అసకలము, కాదె = కాదా, తత్సకలంబున్ = అసర్వమును, అతిక్రమించి = దాఁటి, తాన్ = తాను, కానన్ = కనుటకు, తలంపలేకన్ = తలంచుటకు మఱియొకటిలేక, తుదన్ = పైన, ఖండముగాక = భిన్నముగాక, వెలుఁగుచున్న = ప్రకాశించుచున్న, అజ్ఞానమే = అవివేకమే, ఎఱుంగన్ = (పరిశోధించి) తెలిసికొనఁగాను, పూర్ణము = అఖండము, అగు = అగునట్టి, జ్ఞప్తియే = జ్ఞానమే, ఏన్ = నేను, అదియై = అజ్ఞప్తిస్వరూపమై, వెలుంగుదున్ = ప్రకాశించుదును.

తా. మనస్సంకల్పముచేతను ఊహింపఁబడెడి నామరూపప్రపంచమంతయును దోఁచెనుగదా? ఆప్రకారము తలఁచెడి సమయమందు ఆసకలము అజ్ఞానమునందేకదా? అసర్వమునుదాఁటి తాను కనుటకు తలంచుటకు నొకటియులేక పైన వేఱుపాటులేక ప్రకాశించుచున్న అతెలివియే బాగుగాపరిశీలించి తెలిసికొనఁగాను సంపూర్ణముగా అగునట్టి అజ్ఞానకమే నేనైప్రకాశించుదునని తాత్పర్యము. ‘‘తదంతర ప్రతిపత్త్యారంహతిసంపరిష్వక్తః ప్రశ్నినిరూపణాభ్యామ్’’

అనఁగా: నిద్రలేచినతర్వాత శరీరముమీఁదకలిగెడిజ్ఞప్తికి అహమని పేరు. నిద్రించునప్పటి యుండిన చైతన్యమే అప్రజ్ఞానస్వరూపమైన నేననెడి అహంశబ్దము కాఁబట్టి నిద్రయును, మెలకువయును, స్వప్నములఁ గనుటయును ఆయాత్మకే కలిగియున్నందున మనస్సంకల్పముచేఁ దోఁచెడి సర్వమునుదాఁటిన ప్రజ్ఞానస్వరూపమైన అజ్ఞప్తియే తానై ప్రకాశించునని భావము. ౧౮౫వ పద్యము మొదలుకొని ౧౬౧ వఱకుఁగల పద్యములయొక్క అర్థము ఋగ్యజుస్సామాథర్వణములనెడి నాలుగు వేదములయొక్క నాలుగు మహావాక్యములయిన ప్రజ్ఞానంబ్రహ్మ తత్త్వమసి, అయమాత్మాబ్రహ్మ, అహం బ్రహ్మాస్మి అను వానియొక్క ఫలితార్థములేయని గ్రహించునది.

అవతారిక:—అఖండబ్రహ్మజ్ఞానమెట్లుండిన కలుగునని శిష్యుఁడడిగెడి ప్రశ్నకు ముందుచెప్పిన కల్పితముల నన్నిటిని వృత్తిలోనణఁచి వానినుండితొలఁగుటకు స్వానుభవమును చెప్పుచున్నారు.

ఉ. ఆవిధమైనపూర్ణసుఖమే మబ్బునో నే నెటులున్న నన్నఁ దా
జీవమతిన్ త్రయవస్థల విశేషముగా నటియించుచున్న త

ద్భావముఁ బాసి పూర్ణమయి ♦ భాసిలుచుండిన గల్గుఁ బుత్త్రి స
త్కేవలమైనమోదమదె ♦ కీలుగనుంగొనుమాత్మ నంతయున్. ౧౭౨

టీ. అవిధమైన=ఆప్రకారమైన, పూర్ణసుఖము=అఖండబ్రహ్మజ్ఞానసుఖము, నే నెటులున్న న్=నే నెవ్విధముగానుండిన, అబ్బునో=లభించునో, అన్న న్=ఈప్రకారము శిష్యుఁడడుగఁగా, పుత్త్రి=కుమారా, తాన్=తాను, జీవమతిన్=జీవజ్ఞానముచేత, త్ర్యవస్థల న్-త్రి=మూఁడైన, అవస్థలన్=జాగ్రత్స్వప్నసుషుప్తులయందు, విశేషముగాన్=బహుప్రకారములుగాను, వర్తించుచున్న తద్భావమున్-వర్తించుచున్న=సంచరించుచున్న, తద్భావమున్=అమనోవృత్తివ్యాపారమును, పాసి=విడిచి, పూర్ణమై=అంతటనిండినవాఁడవై, భాసిలుచుండినన్=ప్రకాశించుచుంటివేని, కల్గున్=ప్రాప్తించును, సత్కేవలమోదము-సత్=శ్రేష్ఠమైన, కేవలమోదము=బ్రహ్మసుఖము, అదె=అదే, ఆత్మన్=నీ అంతఃకరణమందు, కీలు=గుట్టును, కనుంగొనుము=నీవు తెలిసికొనుము.

తా. ఆప్రకారమైన అఖండబ్రహ్మజ్ఞానసుఖము నే నెవ్విధముగానుండిన ప్రాప్తమౌనని శిష్యుఁడడుగఁగాను ఆచార్యుఁడు కుమారా! జీవజ్ఞానముచేత మూఁడైన జాగ్రత్స్వప్న సుషుప్తులయందు బహుప్రకారములుగాను సంచరించుచున్నట్టి అమనోవృత్తి వ్యాపారమునువిడిచి అంతట నిండినవాఁడవై ప్రకాశించుచుంటివేని లభించును. శ్రేష్ఠమైన బ్రహ్మసుఖము అదియే. నీ అంతఃకరణమందు ఈగుట్టును నీవు తెలిసికొనుమని చెప్పెనని తాత్పర్యము.

అనఁగా: జాగ్రత్స్వప్న సుషుప్తులయందుఁగలిగెడి మనోవృత్తి వ్యాపారములు ఒకదానియందుండునవి మఱియొకదానియందు కనఁబడక శూన్యములగును. కనుక వానినన్నిటినివదలి వానికి త్రికాలములయందును బాధకత్వములేక సచ్చిదానందమందు అనుసంధానము కలిగియుండునని భావము. ''కేవలమైనమోదమదే'' అని యనుటచేత తన దేహమనెడిప్రపంచముయొక్క లోపలను వెలుపలను పరిపూర్ణముగ నిండియున్న చైతన్యమే ప్రపంచమనెడి శరీరాభిమానియగు అహంప్రత్యయార్థముగనుక వామనపురాణమందు ''అచ్యుతోహమనంతోహం గోవిందోహమహంహరిః, ఆనందోహమశేషోహ మజోహమమృతోస్మ్యహమ్, నిత్యోహం నిర్వికల్పోహం నిరాకారోహమవ్యయః, సచ్చిదానందరూపోహం పరిపూర్ణోస్మ్యహంసదా, బ్రహ్మైవాహం నసంసారీ ముక్తోఽహమితిభావయేత్'' అని చెప్పినట్లు సమస్తమును అహంశబ్దార్థమైన నీవేయని స్ఫురించుటచేతను "సర్వాణ్యేతాని ప్రజ్ఞానస్యనామధేయాని'' ''మత్తః పరతరంనాన్య త్కించిదస్తిధనంజయ'' ''పురుషాన్నపరంకించిత్'' అనెడి ప్రమాణములరీతిని భూతభవిష్యద్వర్తమానములనే జాగ్రత్స్వప్నసుషుప్తులయందు తప్పకయుండు చైతన్యమే ప్రజ్ఞానస్వరూపమైన

బ్రహ్మముకాఁబట్టి అట్టిగుట్టును తెలిసితి వేని అంతయు తత్స్వరూపమై ఆ పరిపూర్ణసుఖ మును పొందియుందువని భావము.

అవతారిక:—మనోస్ఫూర్తిని వదలుటకు త్రివిధోపాయములను జెప్పఁదొడంగి వాని అనుభవములను దెలుపుచున్నారు.

ఉ. వాసన నైనవృత్తుల నివారణ మెట్లొనరింప నౌ నన
ధీసుముఖేంద్రియాదులు విధేయములై తనుఁగాంచికొల్వఁ దా
భాసురసప్తచిద్ధరలఁ బాలనసల్పు విరాట్స్వరూపుఁడై
భాసిలునేను తా యవి విభావసుఁడొప్పఁ దమిస్రమట్లగున్. ౧౭౩

టీ. వాసనన్=(జన్మాంతర సుకృత దుష్కృతిరూప ప్రారబ్ధ కర్మానుగుణ్యముచేఁ దోఁచెడి) సంకల్పముచేతను, ఐనవృత్తులన్-ఐన=ఐనటువంటి, వృత్తులన్=వ్యాపారము లను, నివారణము=విడుచుట, ఎట్లొనరింపన్=ఎవ్విధముగాఁజేయను, ఔన్=అవును, అనన్=ఈప్రకారము శిష్యుఁడడుగఁగాను, ధీసుముఖేంద్రియాదులు-ధీ=బుద్ధియే, సు ముఖ=మొదలుగాఁగల, ఇంద్రియాదులు-ఇంద్రియ=జ్ఞానకర్మేంద్రియములు పదియు ను, మనోబుద్ధిచిత్తాహంకారములును, ఆదులు=ప్రాణాది పంచవాయువులు మొదలయినవి యును, విధేయములై=తనకులోఁబడినవై, తనున్=తన్నును, కాంచి=దర్శించి, కొల్వన్ సేవించఁగాను, తాన్=తాను, భాసుర=ప్రకాశమానములగు, సప్త=ఏడైన, చిద్ధరలన్ =జ్ఞానభూములను, విరాట్స్వరూపుఁడై=రాజరాజై, పాలనసల్పన్=పరిపాలనచేయు చుండఁగాను, అవి=ఆవాసనారూపవృత్తులు, నుతా=సుమారా, భాసిలునే=ప్రకాశించు నా, (అనఁగా ప్రకాశించవనుట.) విభావసుఁడు=సూర్యుఁడు, ఒప్పన్=ఉదయించఁ గాను, తమిస్రమట్లు=చీఁకటివలె, అగున్=అగును.

తా. జన్మాంతర సుకృతదుష్కృత రూపప్రారబ్ధ కర్మానుగుణ్యముచేఁ దోఁచెడి సంకల్పముచేత నైనటువంటి వ్యాపారములను విడుచుట యెవ్విధముగాఁ జేయనౌనని శిష్యుఁడడుగఁగా బుద్ధి మొదలుగాఁగల జ్ఞానకర్మేంద్రియములు పదియును, మనోబుద్ధి చిత్తాహంకారములును, ప్రాణాదిపంచవాయువులు మొదలైనవియును, తనకు లోఁబడిన వై తన్నుదర్శించి కొల్వఁగాను, తాను ప్రకాశమానములగు ఏడు జ్ఞానభూములను రాజ రాజై పాలనముచేయుచుండఁగా ఆవాసనావృత్తులు ప్రకాశించునా? సూర్యుఁ డుద యించఁగా చీఁకటి యేప్రకారముతొలఁగునో ఆప్రకారము నశించునని తాత్పర్యము.

విరాట్స్వరూపుఁడై అనుటచేత, ‘‘విశేషేణరాజత ఇతివిరాట్’’ అనఁగా మి క్కుటముగ ప్రపంచమునందు ప్రకాశించుటయని వ్యుత్పత్త్యర్థము. ఈబ్రహ్మాండమందుం డు స్థావరములు, క్రిములు, జలచరములు, పక్షులు, పశువులు, నరులు అనెడి ఆఱింటి

లో మిక్కుటముగ పదునాలుగు ఇంద్రియములచేత నెమ్మదిగ ఆయాకాలములలో కావలసిన విషయములను అనుభవించుటయు, అనిష్టములైనవానిని వదలుటయు, ‘‘తాపీనమబుద్ధిర్వదాయతనంవః ప్రజానీహితాభోక్ష్యమానయత్, తా అబ్రువన్ వవై నోయమలమితి తాభ్యః పురుషమానయత్, తా అబ్రువన్ సుకృతంబతేతి ఆపఏవతా సాంమే పౌరుషీప్రియేత్’’ అనెడి శ్రుత్యర్థముచొప్పున మనుష్యదేహములకే విరాట్ అని సంజ్ఞ అయినందున ఆ పరబ్రహ్మాత్మకమగు జగత్కారణత్వము ఆ మానుషశరీరమునకే అర్థమగుచున్నది. కనుక బ్రహ్మస్వరూపుఁడై నాఁడని భావము. అట్టివాఁడు చిన్మాత్రమూగానుండు తనయందె మాయవలన కల్పితములైన జగచ్చిత్రమును క్రమముగా జ్ఞానభూమికల నెడింటిని సాధించినవాఁడగుటవలన ఉపేక్షించును గనుక వానియందు వాసనావృత్తులు (సూర్యప్రకాశమందు చీఁకటి నశించినట్లు) నాశనమౌనని తెలియునది.

అవతారిక.—పై త్రివిధోపాయములలో సాధకములైన రెండుమార్గములఁ జెప్పుచున్నారు.

ఉ. వృత్తులు చిత్రయోగములఁ ◦ విస్ఫురదంగమునందు వాయువుల్
తిత్తులఁ బోలి యూఁదు నవి ◦ తిన్నఁగ డింద నడంగ వానికై
చిత్తము పూనకున్న నుత ◦ చెన్నుగ సచ్ఛ్రవణంబుఁ జేయ సం
విత్తు జనించుఁ దచ్ఛిఖ న◦విద్యయడంగ నడంగు నందునన్. ౧౭౪

టీ. వృత్తులు=(అంతఃకరణమందుఁ దోఁచెడి సకలజగద్వ్యాపార) వృత్తులు, చిత్రయోగములన్-చిత్ర=విచిత్రములైన, యోగములన్=మంత్రలయహఠయోగములచేతను, విస్ఫురదంగమునందున్-విస్ఫురత్=ప్రకాశించుచుండెడి, అంగమునందున్=స్థూలశరీరమందు, వాయువులు=(నాసికాద్వారముఁగుండా సంచరించుచుండెడి) ఉచ్ఛ్వాసనిశ్వాసవాయువులు, తిత్తులఁబోలి=కమ్మరివాని కొలిమితిత్తులవలె, ఊఁదున్=ఊఁదుచుండును, అవి=ఆవాయువులు, తిన్నఁగన్=మెల్లఁగాను, డిందినన్=యోగాభ్యాసముచే నశించినను, అడంగున్=(ఆవృత్తులు) అణఁగిపోవును, దానికై=ఆ లయహఠయోగములచేత అణఁచుటకై, చిత్తము=అంతఃకరణము, పూనకున్నన్=ప్రయత్నించకయుండినను, చెన్నుగన్=ఒప్పునట్లుగాను, సచ్ఛ్రవణంబుఁజేయన్=(వేదాంతశాస్త్రములను ఆచార్యసన్నిధియందు దీర్ఘకాలము బాగుగా) వినినను, సంవిత్తు=బ్రహ్మజ్ఞానము, జనించున్=పుట్టును, తచ్ఛిఖన్=అజ్ఞానాగ్నియందు, అవిద్య=అజ్ఞానము, అడంగన్=నశించఁగాను, అందునన్=ఆయవిద్యనశించుటచేత, (ఆవృత్తులు) అడంగున్=నాశమగును.

తా. అంతఃకరణమందుఁ దోఁచెడి సకలజగద్వ్యాపారవృత్తులు విచిత్రములైన మంత్రలయ హఠయోగములచేత ప్రకాశించుచుండెడి స్థూలశరీరమునందు నాసికాద్వార

ములగుండాఉచ్ఛ్వాసనిశ్వాసవాయువులు కమ్మరివానికొలిమితిత్తులవలెనాడుచుండును. ఆవాయువులు మెల్లఁగావశించినచో ఆవృత్తులు అణఁగిపోవును. అ లయహఠయోగముల చేత అణఁచుటకై అంతఃకరణము ప్రయత్నించకుండినను వేదాంతశాస్త్రిములను ఆచార్యసన్నిధియందు దీర్ఘకాలము చక్కఁగా శ్రవణముఁజేయఁగా బ్రహ్మజ్ఞాన ముదయించును. ఆజ్ఞానాగ్నియందు అజ్ఞానమునశించఁగానే ఆవృత్తులును చెడునని తాత్పర్యము.

అనఁగా: ‹‹ఆత్మావారేద్రష్టవ్యః శ్రోతవ్యోమంతవ్యో నిదిధ్యాసితవ్యః›› అనెడి శ్రుతిప్రకారము బోధకుకారణమగు అద్వైతశాస్త్రార్థశ్రవణమనన నిదిధ్యాసములు సద్గురుసన్నిధియందు చక్కఁగాజరిపినయెడల ‹‹తమేవంవిదిత్వాతి మృత్యుమేతి, నాన్యఃపంథావిద్యతేఽయనాయ›› అనెడి శ్రుత్యర్థములచొప్పున అబోధయే బ్రహ్మజ్ఞానమునకు హేతువగుచున్నది. అయితే ఆబోధకు స్వరూపకార్యములగు వైరాగ్యోపరతులు రెండును ‹‹బ్రాహ్మణోనిర్వేదమాయాన్నాస్త్యకృతఃకృతేన, తద్విజ్ఞానార్థంస గురుమేవాభిగచ్ఛేత్›› ‹‹శాంతోదాంతఉపరతస్తితిక్షుస్సమాహితో భూత్వాత్మన్యేవాత్మానంపశ్యేత్›› అనెడి శ్రుతులరీతిని దానికి సహాయకరములైయుండును. ‹‹చిత్రయోగంబుల›› అనఁగా: ఉపరతికి కారణమగు ప్రాణాయామ ప్రత్యాహార ధ్యానధారణసమాధులను దానికి స్వరూపమగు సకలప్రపంచ వ్యవహారవృత్తి నిరోధలక్షణమగు మంత్రలయ హఠయోగములను సాధకములుచేయుట వీనిలక్షణములు ప్రథమభాగమునఁ జక్కఁగ వక్కాణింపఁబడియున్నవి. ‹‹జ్ఞాత్వాదేవంముచ్యతే సర్వపాశైః, జ్ఞాత్వాశివంశాంతి మత్యంతమేతి. యదాచర్మవదాకాశం వేష్టయిష్యంతిమానవాః, తదాదేవమవిజ్ఞాయ దుఃఖస్యాంతోభవిష్యతి›› అనెడు ప్రమాణవాక్యములచేత పరబ్రహ్మజ్ఞానమువలననే సర్వబంధములు బొత్తిగా నాశనమాననియు 'మఱియేవిధముగాఁ గాదనియు భావము అయితే యోగాదులు బోధకు సహాయమగుటవలన ముందుచెప్పిన సప్తభూమికా వివరణముచొప్పున ‹‹ప్రాప్య పుణ్యకృతాంలోకా నుషిత్వాశాశ్వతీస్సమాః, శుచీనాం శ్రీమతాంగేహే యోగభ్రష్టోఽభిజాయతే›› అనెడి కొందలైన గీతావాక్యముప్రకారము స్వర్గలోక ఫలమునుజెంది శ్రేష్ఠమైనజన్మమెత్తి బ్రహ్మజ్ఞానముఁబొంది ముక్తుఁడగునని తెలియునది.

అవతారిక:—అవిద్యను నాశనముచేయు నుపాయమును జెప్పుచున్నారు.

ఉ. కారణకాయ మెప్పగిదిఁ గాల్చువిధం బన నిశ్చయోక్తులన్
సారవిచార వల్కు శ్రుతి స్వాంతమున న్దలఁప న్దదర్థ మిం
పార దృఢంబు గల్గుఁ దనయందలి సర్వ మసత్యమంచు నా
ధీయునియం దవిద్య తనతేజముఁ బాపున నిల్చియెంతయున్. ౧౭౫

టీ. కారణకాయమున్=కారణశరీరమును, ఎప్పగిదిన్=ఎవ్విధముగాను, కాల్చువిధంబు=నశింపఁజేయువిధము, అనన్=ఈప్రకారమని శిష్యుఁడడుగఁగా, సారవిచార-

సార...స్థిరమైన, విచార=ఆలోచనగల శిష్యుఁడా, శ్రుతి=వేదము, నిశ్చయోక్తులన్=నిర్ణయములైనవాక్యములను, పల్కన్=వచించును, స్వాంతమునన్=మనస్సునందు, తదర్థము=ఆయర్థమును, తలఁపన్=తలఁచఁగాను, ఇంపారన్-ఇంపు=సొంపు, ఆరన్=అభివృద్ధికాఁగాను, దృఢంబు=దార్ఢ్యము, కలుగున్=కలుగును, తనయందలి=తనయందుండెడి (ప్రకృతిసంబంధమగు), సర్వము=సమస్తము, అసత్యమఁచున్=అబద్ధమనిచెప్పనట్టి, అధీరునియందున్=అట్టివండితునియందు, అవిద్య=అజ్ఞానమైనది, తనతేజమున్=తనయొక్క అతిశయమును, నిలిచి=నివసించి, ఎంతయున్=ఏమాత్రమైనను, చూపునె=చూపునా.

తా. కారణశరీరమును నాశనముచేయుట యేప్రకారమని శిష్యుఁడడుగఁగా స్థిరమైన విచారముగల శిష్యుఁడా! వేదమైనది నిశ్చయమును జెప్పును ఆప్రకారము చెప్పుటచేతను ఆవేదమందలి మహావాక్యార్థమును మనస్సులోఁ జింతించి పరిపూర్ణుఁడవైన నీయందు ఆరోపింపఁబడిన జగమే తోఁచునని యెడి నిశ్చయముకలిగినయెడల అవిద్య ఎచ్చోటనుండునని తాత్పర్యము. అనఁగా బుద్ధిమొదలయిన ఇంద్రియములకు సర్వసాక్షియగు ప్రజ్ఞానమే బ్రహ్మమనియు, నేనను డిశబ్దార్థమే బ్రహ్మమనియు, ఈ యాత్మయే బ్రహ్మమనియు, ఆబ్రహ్మమే నీవైతివనియు అనెడి మహావాక్యములయొక్క లక్ష్యార్థమును గ్రహించినవాఁడవైతి వేని అవిద్యాకార్యములు నీకుఁదోఁచవనిభావము. ‘‘యస్మిన్ సర్వాణిభూతాని హ్యాత్మైవాభూద్విజానతః, తత్రకో మోహః కశ్శోక ఏకత్వమనుపశ్యతః’’ అను ఈశావాస్యోపనిషదర్థముచొప్పున ఏ యుపదేశకాలమందు వ్యవసాయము స్వరూపముగాఁగల ధీమంతునికి అవ్యక్తము మొదలు స్థావరాంతమువఱకుఁగల చరాచరములగు సకలభూతములయందును ఆపరమాత్మయేయున్నాఁడను అనుసంధానముకలుగునో అట్టిసమయమున (అనఁగా:ఆత్మబ్రహ్మైక్యజ్ఞానముగలవానికి) మోహశోకములు ఎట్లుకలుగునని భావము అట్లనుటచే కారణశరీరమునకు బీజమగు అజ్ఞానమును నశింపఁజేసినయెడల దానివలనఁబుట్టిన మోహము దుఃఖము మొదలైనవి యెంతమాత్రమును కలుగవని తెలియునది.

అవ:—సత్యము బ్రహ్మమనుమను జ్ఞానముదయించుట కనుభవమునుచెప్పుచున్నారు.

మ. వ్యవహారంబుల వెంటనంటి తిరుగఁ గ స్వాంతంబు సత్సంగతి
న్నివసింపన్దగ దంటిగా నిమువినాఁ గ నిక్కంబు వేఱొండులే
దవలోకించిన దృశ్యసంక్తి కలయుట్లారోపితంబంచుఁ బ్రా
భవమొప్ప న్గనుమాత్మఁగన్గొనెడి తాదాత్మ్యంబు దానౌఁ జుమీ.

టీ. స్వాంతంబు=అంతఃకరణము, వ్యవహారంబుల వెంటనంటితిరుగన్ = లోకవ్యవహారంబులయందుఁగూడి సంచరించఁగా, సత్సంగతిన్ = (దేశకాలవస్తుపరిచ్ఛేదశూన్యమయిన) పరబ్రహ్మములో చేరుమార్గమందు, నివసింపన్దగదు = ఉండుటకువీలులేదు,

అంటిగా—అంటివిగదా, వనువినా—(తటస్థలక్షణములోఁజేరిన నీవను స్వరూపలక్షణము తోఁగూడినతానైన) నాకంటె, నిక్కంబు—సత్యమైనది, వేఱొండులేదు — మఱియు క్కటిలేదు, అవలోకించిన—ఈ చూచిన, దృశ్యపంక్తి — ఇంద్రియగోచరప్రపంచము, కలయట్లు—స్వప్నమువలె, ఆరోపితంబంచుఁ—కల్పితమని, ప్రాభవమొప్పఁ—అతిశయ మగు మహిమ ప్రకాశించంగాను, కనుము—తెలిసికొమ్ము, ఆత్మఁ—మనస్సునందు, కనె డి—తెలిసికొనెడి, తద్భావంబు—ఆబ్రహ్మభావము, తానాఁజామీ — నీవనెడి తానుఅగు నుసుమా.

తా. మనస్సైనది జగద్వ్యవహారమందుప్రవేశించి సంచరించుచుండఁగాసద్రూప మైన పరబ్రహ్మమందుఁ గలియుటకు తగదనిచెప్పితి వేని తటస్థరూపలక్షణముతోఁగూడిన నీనైన నన్నుఁదక్క సత్యమైనది వేఱొకటిలేదు. ఈదృశ్యసమూహముకలలోఁదోఁచిన వన్నియు నిజముగానట్లు కల్పితమని తెలిసికొనుము. అవిధముగా వెలిఁగిన చిద్రూపము తానేయని తాత్పర్యము. ఏదేది ప్రపంచమునందుఁ గానఁబడుచున్నదో ఆస్వరూపము న్ను దానిని మాచేస్వరూపమున్ను శశవిషాణములవంటివి. గనుక ‚‚ఇదం ప్రపంచంనా స్త్యేవ నోత్పన్నం నోస్థితంజగత్'' ‚‚మాయాకార్యాదికంనాస్తి మాయానాస్తిభయం నహి'' ‚‚వంధ్యాకుమారవచనే భీతిశ్చేదస్తిదంజగత్'' అను మొదలయిన మహావాక్య రత్నావళియందలి వాక్యార్థములచొప్పున ప్రపంచమేలేదనియు, పుట్టలేదనియు, జగత్తు ఉండలేదనియు, మాయాకార్యము మొదలయినదిలేదనియు, మాయలేదనియు, భయ ములేదనియు, గొడ్రాలిపుత్త్రుని మాటలయందు భయముకలిగనేని ఈ కనఁబడెడి ప్రపంచ ము నిజమనియు అర్థమగుటచేత సర్వమును ఆరోపితమనిభావించి బ్రహ్మతాదాత్మ్యము నుపొందినవాఁడు ద్వైతభావమునువదలి బ్రహ్మత్వమును పొందునని భావము.

అవ:—అఖండమైన పరబ్రహ్మము తానేయనిస్థిరపఱుచుచున్నారు.

ఉ. చేతనపూర్ణమేనను విశేషమతి న్దృఢమొందియున్నఁ ద
ర్వాత నొనర్ప నేక్రియల ఁ బ్రాలిన దోషములేమి స్వప్నసం
జాతజగం బసత్య మగుచందమున న్బరిపూర్ణబోధచే
నేతఱి నేన క్రాలు దిల నెందుల నందక నిత్యతోపినై. ౧౭౭

టీ. ఇలఁ—పుడమియందు, చేతనపూర్ణము—అఖండమైనపరబ్రహ్మము, ఏనను విశే షమతిఁ—నేనను అతిశయజ్ఞానముచేత, దృఢముఁ—దార్ఢ్యమును, ఒందియున్నఁ— పొందియుండినను, తర్వాతఁ—పిమ్మట, ఏక్రియలఁ—ఏపనులను, ఒనర్పఁ—చేయు టకు, ప్రాలినఁ—ప్రవేశించినను, దోషములేమి—అందువలన తప్పిదములేమి, స్వప్నసం జాతజగంబు-స్వప్న—కలయందు, సంజాత—తోఁచుచుండెడి, జగంబు—నామరూపాత్మ కము లోకము, అసత్యమగు చందమునఁ — అబద్ధమగునట్టులు, అగుఁ—అగును, పరి

పూర్ణబోధచేతన్=సర్వపరిపూర్ణజ్ఞానముచేతను, ఏతతిన్=ఏసమయములయందు, నేన=నేనే, ఎందున్=ఏతగులములయందును, అందక=చెందక, నిత్యతోషినై=శాశ్వతమైన ఆనందముగలవాఁడనై, క్రాలుదున్=ప్రకాశించుదును.

తా. పుడమియందు అఖండమైన పరబ్రహ్మము నేనేయనెడు విశేషజ్ఞానమువలన మునుపు దృఢపడినరీతిగల పిమ్మట నేపనులనైనను జేయఁబూనిన సందుపేఁన ఏమిదోషము? కలయందుఁదోఁచిన నామరూపాత్మకమగు ప్రపంచము జాగ్రత్తయందుకల్లయైనట్లు నేనే యేసమయములయందును ఏవిధములగు తగులములయందును చెందక నిత్యానందముగలవాఁడనై ప్రకాశింపుదునని తాత్పర్యము. ఏక్రియలనొనర్ప వ్రాలినదోషములేమిఅనుటచేత ‹‹అహంబ్రహ్మాస్మి›› యను మహావాక్యార్థము మనమునందుఁ జక్కఁగ నాటినవానికి ‹‹సర్వంఖల్విదంబ్రహ్మ›› అనునట్లు బ్రహ్మేతరములగు పదార్థములులేవుగనుక అట్టి బ్రహ్మనిష్ఠయనెడి జాగ్రత్తయందుండువానికి స్వప్నతుల్యమగు నామరూపాత్మక వ్యవహారములు (కలలోఁ దోఁచినకార్యములు మెలకువలోఁ గనఁబడనిచందమున) చెందవని భావము.

అవ:—గురుకటాక్షముచేతఁబొందిన సహజానందమును శిష్యుఁడు దిగువవచ్చెడి రెండుపద్యములచేతఁ గొనియాడుచున్నాఁడు.

మ. బహుకాలంబుగ దేహ మే నను పృథాభావంబుచే నొంద ని
మ్మహి హీనుండ మహాగ్రజుండ ననుజన్మంబుల్ సదాచార్యస
న్మహితప్రేమమరీచికాంబువుల సామ్యంబై పరబ్రహ్మమే
నహహా యైతిఁ గృతార్థుఁడన్నద మదీయానంద మేమందొగిన్.

టీ. ఇమ్మహిన్=ఈపుడమియందు, బహుకాలంబుగన్=(సృష్టిమొదలుకొని యేతత్క్షణపర్యంతమైన) అనేకకాలములుమొదలుకొని, దేహమే నేనను పృథాభావంబుచేన్-దేహము=(దేహవిలక్షణుఁడైన ప్రత్యగభిన్నబ్రహ్మము నేనని ఎఱుంగక అవిద్యచేత) శరీరమును, ఏనను=నేననెడు, పృథాభావంబుచేన్=వ్యర్థమైన అభిప్రాయముచేతను, హీనుండన్=నీచుఁడను, మహాగ్రజుండన్=శ్రేష్ఠుఁడగు బ్రాహ్మణుఁడను, అనుజన్మంబుల్=అనెడితెల్లుగల జన్మంబులు, సదాచార్యసన్మహితప్రేమన్- సదాచార్య=అష్టవిధాచార్యులలో మేలైన కారణాచార్యునియొక్క, సన్మహిత=ఒప్పిదమైన, ప్రేమన్=విశ్వాసముచేతను, మరీచికాంబువులసామ్యంబై=ఎండమావుల జలములకుసామ్యమై, ఒందన్=పొందఁగాను, పరబ్రహ్మమే=సర్వవ్యాపకమగు లక్షణపరబ్రహ్మము, ఐతిని=ఐతిని, అహహా=ఓహోహో, కృతార్థుఁడన్నదా=ధన్యుఁడనుసుమి, ఒగిన్=క్రమముగాను, మదీయానందమేమందున్-మదీయానందమున్=నాయొక్క సహజానందమును, ఏమందున్=ఏమనిచెప్పుదును.

తా. ఈపుడమియందు సృష్టిమొదలు ఏతత్క్షణపర్యంతము వరుసనైన అనేకకాలములుగా అజ్ఞానముచేతనే దేహేంద్రియ విలక్షణుఁడైన పరబ్రహ్మము నేనవక శరీరము నేననెడు వ్యర్థాభిప్రాయముచేత నీచుఁడను బ్రాహ్మణుఁడను అను మొదలైన పేళ్లుగల జన్మములు కారణాచార్యునియొక్క ఒప్పిదమైన విశ్వాసముచేత ఎండమావులజలములవలెసామ్యములై సర్వవ్యాపకమైన పరబ్రహ్మము నేనైతిని ఇదియేమిఆశ్చర్యము! నేనింతధన్యుఁడనైతినిగదా! ఔరౌరా! నాయొక్క సహజానందమును ఏమనిచెప్పుదునని శిష్యుఁడు తనమనమున్నవందించుకొనెనని తాత్పర్యము.

"బహుకాలంబుగన్" అనుటవలన, పూర్వజన్మపుణ్యపాప కర్మసంచితమువలన సురాసుర యక్షకిన్నరోరగాదులుగాను, బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్రాదులుగాను, కందమూలాదులుగాను, చెట్లు చేమలు మొదలయినవిగాను, పశుపక్ష్యాదులుగాను, పర్వతములు నదులు మొదలగునవిగాను సంఖ్యకునెక్కుడైన అనేకజన్మములెత్తుచు పైకిపోవుచు క్రిందికివ్రాలుచు మాయామయంబగు ప్రపంచంబునందు భ్రమపడి శరీరమే నేనని తలంచుకొని దరిగానకయుండిన నేను సద్గురు కరుణాకటాక్షముచేత "బ్రహ్మైవాహమస్మి" యనెడి జ్ఞానమును పొందినందుకు నాస్వభావానందమునుగూర్చి యేమని కొనియాడుదునని శిష్యుఁడు పరిపరివిధముల నాశ్చర్యముఁజెందెనని భావము.

మ. శివసంప్రీతిగ నేమిచేసితినొ యేశ్రీ చెందెనో నన్ను మా
నవరూపంబునఁ జిత్సభాపతి చిదానందాఖ్యుఁడై వచ్చి యీ
యవని న్ముక్తునిఁ జేసెఁ దత్కరుణ విద్యానంద నాథుండనై
భవమున్బాసితి లాస్యమాడెదను నాపై చేలము న్వ్రేచుచున్. ౧౭౯

టీ. శివసంప్రీతిగన్-శివ=(సకలకాంతులకు మీఱినస్వయంప్రకాశముగల)పరబ్రహ్మమునకు, సంప్రీతిగన్=సంతోషము గలుగునట్లుగాను, ఏమిచేసితినో=(పూర్వజన్మములయందు) ఏమినోములు నోఁచినవాఁడనైతినో, ఏశ్రీచెందెనో=ఎట్టిసంపద నాకులభించెనో, నన్నున్=నన్నును, మానవరూపంబునన్ = మానుషాకారమునందు, చిత్సభాపతి-చిత్సభా=దేవ, రాజ, నటన, చిత్, కనక అనెడుపేళ్ళచేనొప్పిన పంచసభలలో మేలైన చిత్సభకు, పతి=నాయకుఁడైన నటేశుఁడు, చిదానందాఖ్యుఁడై=చిదానందుఁడను పేరుగలఆచార్యుఁడై, వచ్చి=ఏతెంచి, ఈయవనిన్=ఈభూమియందే, ముక్తునిఁజేసెన్=జీవన్ముక్తునిగాఁజేసినవాఁడాయెను, తత్కరుణన్=ఆయాచార్యునికృపచేతను, విద్యానందనాథుండనై=విద్యానందనాథుఁడను పేరుగలవాఁడనై, భవమున్బాసితిన్ = ఇఁకమీఁద రాఁబోవుజన్మమును పోఁగొట్టుకొనిన వాఁడనైతిని, నాపైచేలమున్వ్రేచుచున్=నామీఁదనుండెడి ఉత్తరీయమును మీఁదికి నెగురవేయుచు, లాస్యమాడెదను=తాండవమాడెదను.

తా. స్వయంప్రకాశముగల పరబ్రహ్మమునకు సంతోషముగలుగునట్లుగాను పూర్వ

జన్మమందు ఏయే వ్రతములు చేసితినో ! నన్ను మానవరూపమున ఐదుసభలలో మేలైన చిత్సభకు నాయకుఁడైన నటనసభాపతి చిదానందనాథుఁడను పేరుగల ఆచార్యుఁడై ఏతెంచి ఈ భూమియందే జీవన్ముక్తునిగాఁ జేసినవాఁడాయెను. అయాచార్యనికృపచేతను శ్రీబ్రహ్మవిద్యానాథుఁడను పేరుగలవాఁడనై జన్మమూలము పోఁగొట్టుకొంటిని గాన నా మీఁదనుండెడి ఉత్తరీయమును మీఁదికి ఎగురవేయుచు నర్తనమాడెదనని తాత్పర్యము.

అవ:—గ్రంథకర్త తనతల్లిదండ్రులు తనకుఁబెట్టినపేరు సార్థకమైనందుకు వారిని స్తుతించుచున్నాఁడు.

మ. చటులాద్వైతవివేకజాద్భుతమహాసంతోషమం దేను సం
కటములాపి రమింతునంచెఱిఁగి ముకామారిసద్భక్తి "వేం
కటరామా" యనిపిల్వ మత్పితరులాకర్ణించ మదీయాఖ్య యి
ప్పటికిన్ సార్థకమొందె వారిమహిమల్ భావింపశక్తుండనే. ౧౮౦

టీ. చటులాద్వైతవివేకజాద్భుతమహాసంతోషమందున్-చటుల = ఆనందకరమగు, అద్వైత=రెండవపదార్థములేని బ్రహ్మసంబంధమైన, వివేక=జ్ఞానముచేతను, జ=పుట్టినటువంటి, అద్భుత = ఆశ్చర్యకరమగు, మహాత్=గొప్పదైన, సంతోషమందున్= ఆనందమందు, కామారిసద్భక్తిన్-కామారి=పరమశివునియొక్క, సద్భక్తిన్=నవవిధాంగములతోఁగూడిన భక్తిచేతను, ఏను=నేను, సంకటములాపి=కంకటశబ్దముచేత పాపసంబంధములైన కష్టములనుబోఁగొట్టుకొని, రమింతునంచున్=(రామశబ్దముచేత) క్రీడింతునని, ఎఱిఁగి=(భవిష్యత్కాలార్థమును) తెలిసి, మున్=పూర్వమందు, మత్పితరులు= నాతల్లిదండ్రులు, వేంకటరామాయని=వేంకటరామఁడాయని, పిల్వన్=పిల్వఁగాను, ఆకర్ణింపన్=ఆపిలిచిన సంపదచేతను, మదీయాఖ్య=నాపేరు, ఇప్పటికిన్=ఈకాలమునకు, సార్థకము=ధన్యత్వమును, అందెన్=పొందెను, వారిమహిమల్=అట్టి నా తల్లిదండ్రుల యొక్క మహిమలను, భావింపన్ = (ఇటువంటివని) ఊహించుటకు, శక్తుండనే= సమర్థుండనా.

తా. ఆనందకరమగు తనకంటె రెండవపదార్థములేని బ్రహ్మసంబంధమైన జ్ఞానము చేతపుట్టినటువంటి ఆశ్చర్యమగు గొప్పదైన ఆనందమందు పరమశివభక్తిచేతను పాపము వలనకలిగిన దుఃఖములను పోఁగొట్టుకొని క్రీడింతునని రాఁబోయెడికాలమును తెలిసి నా తల్లిదండ్రులు "వేంకటరామా" యని పిల్వఁగాను ఆపిలిచినభాగ్యముచేత నాపేరు ఈ కాలమునకు సార్థకమొందినది. అట్టి నాతల్లిదండ్రులగు కామాంబ వేంకయ అను వారి మహిమలను పేర్కొనియాడుటకు సమర్థుఁడనాయని తాత్పర్యము. నవవిధాంగములతోఁ గూడిన భక్తియనఁగా: "శ్రవణం కీర్తనం శంభోః స్మరణం పాదసేవనం, అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మనివేదనమ్" అనునట్లు ఆచార్యసన్నిధియందు విధియుక్తముగా తత్త్వ

విచారణచేయుట శ్రవణమనియు, పరమశివస్వరూపధ్యానమును ప్రసిద్ధపఱుచట కీర్తన మనియు, ఆ పరమశివునిమనస్సునభావించుట స్మరణమనియు, ఆయన పంచవింశతి లీలలను స్వరూపములుగా పెద్దలచేనేర్పఱుపఁబడిన దివ్యస్థలముల నుద్దేశించిపోవుటయు, లేక పరబ్రహ్మముయొక్క శక్తిశుక్లమిశ్రపాదుకలను నిష్ఠచేసేవించుటే పాదసేవనమనియు, ఆ పరమాత్మను సగుణ నిర్గుణరూపములుగా నుపాసించుట అర్చనమనియు, ఆయనను గూర్చి నమస్కరించుట వందనమనియు, దానునిరీతిగ తన సకలేంద్రియవ్యాపారములుఁ తనవిగా వని బ్రహ్మార్పణముచేయుట దాస్యమనియు, చతుర్విధానుసంధానముచేత (అనఁగా రాజభృత్యులవలెను, పితృపుత్రులవలెను, గురుశిష్యులవలెను, సతీపతులవలెను) ప్రవర్తించుట సఖ్యమనియు పరమాత్మప్రత్యగాత్మలను ఐక్యపఱుచుట ఆత్మనివేదనమనియుభావము.

అవ:—గ్రంథకర్త తనకు జీవబ్రహ్మైక్యధ్యానమును తేటగాఁదెలిపిన దేశికేంద్రునకు నమస్కారముఁజేయుచున్నాఁడు.

ఉ. ఎవ్వరితో వచింతు నిఁక ¦ నీముద మాత్మ జనించి పొంగి తా
నివ్వటిలెన్జగత్త్రయము ¦ నిండి తనంతట దాని నాకు ము
న్నవ్వముగా మహోక్తుల సమస్తము దెల్పిన దేశికేంద్రునే
నివ్వసుధన్బ్రణామముల ¦ నేకముగా నొనరింతునెమ్మదిన్. ౧౮౧

టీ. ఇవ్వసుధన్=ఈభూమియందు, ఈముదము=ఈ బ్రహ్మానందము, ఆత్మన్=అంతఃకరణమందు, జనించి=పుట్టి, పొంగి=పైకిఉప్పొంగి, జగత్త్రయమునిండి=మూఁడులోకములయందువ్యాపించి, తాన్=తాను, తనంతటన్ = తేఁటోకరిసహాయములేకయే, నివ్వటిలెన్=వృద్ధిపొందినదాయెను, ఇఁకన్=ఇఁకమీఁద, ఎవ్వరితోన్ = ఎవ్వరితో, వచింతున్=చెప్పఁగలుగుదును, దానిన్ = ఆబ్రహ్మానందమును, నాకున్=నాకు, మున్=ముందు, మహోక్తులసమస్తమున్- మహోక్తులన్=(జీవబ్రహ్మైక్యమునుబోధించెడి)వేదాంతమహావాక్యములయందలి, సమస్తమున్=సకలాభిప్రాయములను, నవ్వముగాన్=తేటగాను, తెల్పినదేశికేంద్రునిన్- తెల్పిన=తెలియఁజెప్పిన, దేశికేంద్రునిన్ = గురుస్వామిని, నెమ్మదిన్=మంచిమనస్సుతోడ, ప్రణామములు = సాష్టాంగనమస్కారములు, అనేకముగాన్=లెక్కలేనివిగాను, ఒనరింతున్=చేసెదను.

తా. ఈభూమియందు ఈనిరతిశయమైన బ్రహ్మానందము నామనస్సులోనుదయించి పైకిఉప్పొంగి త్రిలోకములయందునిండి తాను వేఱొకసహాయములేకయే వృద్ధిపొందినదాయెను. ఈయానందము ఇట్టిదని ఎవ్వరితోఁజెప్పఁగలుగుదును. ఆబ్రహ్మానందమును ముందు జీవబ్రహ్మైక్యమునుబోధించెడి వేదాంతమహావాక్యములయందలి సకలాభిప్రాయములను తేటగాఁదెలియఁజేసిన గురుస్వామియొక్కపాదపద్మములకు అనేకనమస్కారములు చేయుచున్నాఁడనని తాత్పర్యము.

అనఁగా తనయొక్క కృతకృత్యానందమునుజూచి బ్రహ్మమే తానని తెలిసికొనినం దుకు మహానందమునుబొందినవాఁడై ఇట్టిఆనందమును అనుభవమునకు వచ్చునటులుచేసిన పరమాచార్యుల పాదపద్మములకు నమస్కారములు చేయుచున్నాఁడననుట.

అః:—ఈగ్రంథాభ్యాసకులుచెందెడి మహాతిశయము వర్ణింపఁబడుచున్నది.

మ. సుత విద్యాముద మెల్లఁదెల్పితిఁ దగఁ శోధించి తద్భుక్తి సం
తతమీశాస్త్రము నభ్యసించి కడుఁ దాత్పర్యంబుచాలించి స
న్మతిచే స్వానుభవాత్ములై వెలయు సన్న్యాస్యు లసదానిష్ఠ సం
స్థితులై యుండిన మౌనివర్యులగతిన్ జెన్నొందరే ధాత్రిలోన్. ౧౮౨

టీ. సుత=కుమారా, విద్యాముదమెల్లన్=(అష్టవిధానందములలో మేలైనతత్త్వమస్యాది మహావాక్యములవలనకలిగిన) విద్యానందమంతయును, తగన్=లెస్సగాను, శోధించి=పరిశీలించి, తెల్పితిన్=తెలియఁజేసితిని, ఈశాస్త్రమున్=ఈకైవల్యనవనీతమనెడియోగశాస్త్రమును, తద్భుక్తిన్-తత్=ఈశాస్త్రముదు, భక్తిన్ = విశ్వాసముచేతను, సంతతము=ఎల్లప్పుడు, అభ్యసించి=వాడుకచేసి, కడున్=మిక్కిలి, తాత్పర్యంబున్=అభిప్రాయమును, ఆలించి=ఆలకించి, సన్మతిచేన్=మంచివివేకముచేతను, స్వానుభవాత్ములై=అపరోక్షసాక్షాత్కారబ్రహ్మానుభవముగలవారై, వెలయుసన్న్యాస్యుల్ = ఒప్పుచుండెడిపెద్దలు, సదా=ఎల్లప్పుడు, నిష్ఠన్=(నిర్వికల్ప) సమాధియందు, సంస్థితులై=నివసించినవారై, ఉండిన మౌనివర్యులగతిన్=నిలిచియుండిన మునీశ్వ[illegible]నే, ధాత్రిలోన్=భూమియందు, చెన్నొందరే=(వైరాగ్యబోధోపరతులచేత) ఒప్పినవారుగారా, (అనఁగా ఒప్పినవారగుదురనుట.)

తా. కుమారా! విద్యానందమంతయును బాగుగాపరిశీలించి నీకుబోధించితిని. అవిద్యానందస్వరూపమగు ఈ కైవల్యనవనీతమనెడి యోగశాస్త్రమును ఎల్లప్పుడు వాడుకచేసి దానిశ్రేష్ఠాభిప్రాయమునుగ్రహించి మంచి వివేకముచేత అపరోక్షసాక్షాత్కారబ్రహ్మానందముగలవారై ఒప్పుచుండెడిపెద్దలు ఎల్లప్పుడు సమాధినిష్ఠయందు నివసించియుండెడి వ్యాసాదిమహర్షులవలెనే భూమియందు ప్రకాశింపరా యని తాత్పర్యము. అనఁగా ప్రకాశింపుదురనుట.

అవ:—శ్రీ శివకామసుందరీ కృపాకటాక్షముచేత నీగ్రంథము సంపూర్ణమైనందుకు ఆమె స్తుతింపఁబడుచున్నది.

మ. వర వేదాంతములందుభాసిలుమహా వాక్యార్థవిద్యాముదం
బిఁవొందన్భువి మానుషాకృతిగఁ దానే తెంచి నిష్ఠన్విదం
బరపూర్ శ్రీశివకామసుందరికృపాపాంగంబున న్దీనినా
దరణీయంబుగ నందెధన్యమతిఁ దత్పాదాబ్జముల్ గొల్చెదన్. ౧౮౩

టీ. పరవేదాంతములందున్-పర=శ్రేష్ఠములైన, వేదాంతములందున్=ఉపనిషత్తులయందు, భాసిలు మహావాక్యార్థ విద్యామదంబు-భాసిలు=ప్రకాశించుచుండెడి, మహావాక్య=ప్రజ్ఞానంబ్రహ్మ, అహంబ్రహ్మాస్మి, తత్త్వమసి, అయమాత్మా బ్రహ్మ అనుసాక్షాత్కారానుభవోపదేశ సంపూర్ణములనెడి నాలుగు మహావాక్యములయందలి, అర్థ=బ్రహ్మైవాహమనెడు ముఖ్యాభిప్రాయమువలనకలిగిన, విద్యామదంబు=విద్యానందము, ఇరవొందన్=వృద్ధిపొందగాను, భువిన్=భూమియందు, మానుషాకృతిగన్=మనుష్యాకారముగాను, చిదంబరపూర్ శ్రీశివకామసుందరి-చిదంబర=చిదంబరక్షేత్రమనెడి, (లేక చిదాకాశమనెడి) పూర్=పట్టణమందుండెడి, శ్రీ=అణిమాద్యష్టైశ్వర్యములుగల, శివ=సూర్యచంద్రాగ్నులకాంతులను మీఱినకాంతిగలిగి, కామ=యోగులచేత కామింపఁబడెడు పరమశివునియొక్క, సుందరి=(ఆయనయందు అవినాభావనిత్యానపాయనియగు) త్రిపురసుందరీదేవి, తాన్=తాను, ఏతెంచి=వచ్చి, కృపాపాంగంబునన్-కృపా=దయతోఁగూడిన, అపాంగంబునన్=క్రీఁగంటిచూపుచేతను, దీనిన్=ఈకైవల్యనవనీతమనెడు వేదాంతశాస్త్రమును, ఆదరణీయంబుగన్=ప్రీతిపూర్వకముగాను, అందన్=నాచేకృతిగాఁదీసికొనినదాయెను, ధన్యమతిన్-ధన్య=కృతకృత్యముతోఁగూడిన, మతిన్=బుద్ధిచేతను, తత్పాదాబ్జములు-తత్=ఆపరదేవియొక్క, పాదాబ్జముల్=పాదపద్మములను, కొల్చెదన్=సేవించుచున్నాను.

తా. శ్రేష్ఠములైన ఉపనిషత్తులయందు ప్రకాశించుచుండెడి నాలుగుమహావాక్యములయందలి బ్రహ్మైవాహమనెడు ముఖ్యాభిప్రాయమువలనకలిగిన విద్యానందము వృద్ధిపొందఁగా భూమియందుమనుష్యాకారముగా చిదంబరక్షేత్రమనెడి పట్టణమందుండెడి అణిమాద్యష్టైశ్వర్యములుగల సూర్యచంద్రాగ్నులయొక్క కాంతులను మీఱినకాంతికలిగి యోగులచేత కామింపఁబడెడి పరమశివునియొక్క అవినాభావనిత్యానపాయనియగు త్రిపురసుందరీదేవి తానువచ్చి దయతోఁగూడిన క్రీఁగంటిచూపుచేతను ఈకైవల్యనవనీతమనెడు వేదాంతశాస్త్రమును ప్రీతిపూర్వకముగా నాచేకృతిగాఁ దీసికొనినదాయెను. కృతకృత్యముతోఁగూడిన బుద్ధిచేతను ఆపరదేవియొక్క పాదపద్మములను సేవించుచున్నానని తాత్పర్యము.

అవ:—ఈగ్రంథముయొక్క ప్రభావము చెప్పఁబడుచున్నది.

మ. విహితాచార్య సదుక్తి నాంతరబహిర్గర్వ త్రిభ్రమాభావమై
మహితాశ్చర్య కరైకలక్ష్యమగునామార్గంబునన్గూడ ని
స్పృహఁగూటస్థుఁడనై తినేనయునియామాహాత్మ్యమున్గాంచఁ దా
రహినీ శాస్త్రముదెల్పు చిన్మయము సర్వంబై వెలుంగున్సుతా.

టీ. కుమా=కుమారా, విహితాచార్యసదుక్తిన్-విహితాచార్య=అష్టగురువులలో మేలైన కారణాచార్యునియొక్క, సదుక్తిన్=సత్, ప్రశస్తమైన, ఉక్తిన్=ఉపదేశమహావాక్యముచేతను, అంతరబహిర్వృత్తిభ్రమాభావమై-అంతర=అంతఃకరణమందును, బహిర్=బ్రహ్మాదిపిపీలికాంత సర్వప్రపంచమువలనకును, వృత్తి=తోఁచెడివృత్తులయొక్క, భ్రమ=భ్రాంతి, అభావమై=శూన్యమై, మహితాశ్చర్యకరైకలక్ష్యము-మహిత=ఒప్పిదములైన, ఆశ్చర్యకర=అద్భుతములైన, ఏక=ముఖ్యములైన లక్షణములచేత, లక్ష్యముగన్=లక్షితముగునట్టి, ఆమార్గంబునన్=ఆ పరబ్రహ్మమార్గమందు, చూడన్=విలోకించినను, ఇమ్మహిన్=ఈభూమియందు, కూటస్థుఁడన్=ప్రత్యగాత్ముండను, నేన=నేనే, ఐతిన్=ఐతిని, అని=అని, ఆమాహాత్మ్యమున్=ఆమహిమను, తాన్=తాను, చెందన్=చెందుటకు, తహిన్=మిక్కిలి, ఈశాస్త్రము, ఈకైవల్యనవనీతమనెడు శాస్త్రము, చిన్మయము=జ్ఞానస్వరూపమై, సర్వంబై=అంతయునై, వెలుంగన్=ప్రకాశించునట్లుగాను, తెల్పున్=తెలియఁజేయును.

తా. కుమారా! అష్టగురువులలో మేలైన కారణాచార్యునియొక్క ప్రసిద్ధమైనయుపదేశ మహావాక్యముచేత లోపల వెలుపలఁ దోఁచెడి సకలవ్యాపారభ్రమము శూన్యమై అత్యాశ్చర్యకరమైన ముఖ్యలక్షణములచేత లక్షితమగు ఆపరబ్రహ్మమార్గమందు చూడఁగాను బ్రహ్మభిన్నకూటస్థుఁడను నేనేఐతిని. ఆ మాహాత్మ్యమును తాను జెందుటకు ఈశాస్త్రము సర్వము బ్రహ్మకారముగాఁ బ్రకాశించునటులఁ దెల్పునని తాత్పర్యము.

అవ:—ఈగ్రంథపరిశీలనమువలన సామవేదమందలి ఉపదేశ మహావాక్యమగు తత్త్వమసి యనునది సంపూర్ణముగునని తెలియఁజేయఁబడుచున్నది.

మ. వరుసన్దత్త్వమసి త్రిశబ్దముల తత్త్వంశబ్ద తాత్పర్య స<br>
త్పరమైక్యం బసిశబ్దమై వెలయు తద్భావం బఖండంబుగాఁ<br>
బరిశీలించి తదన్యమైనజడముం బన్భంగంబు నొందించి సు<br>
స్థిరులై యుందురు దత్సుఖానుభవులై పెన్మోందఁ దామైతగన్.

టీ. వరుసన్=క్రమముగాను, తత్త్వమసి=సామవేదమందలి ఉపదేశమహావాక్యమగు తత్త్వమసియనుదానియందలి, త్రిశబ్దములన్=తత్, త్వం, అసి, యను మూఁడుశబ్దములయందు, తత్=అదియనెడి ఈశ్వరసాక్షియగు పరమాత్మయు, త్వంశబ్ద=నీవనెడు జీవశబ్దమునకు విలక్షణమగు ప్రత్యగాత్మయు, తాత్పర్య=ఈరెండు శబ్దార్థములకు, సత్=శ్రేష్ఠమైన, పరమ=అతిశయమైన, ఐక్యంబు=ఏకమత్యము, అసిశబ్దమై=అసియనుశబ్దమునకు అర్థమై, వెలయున్=ప్రకాశించును, తద్భావంబు=ఆ యభిప్రాయమును, అఖండంబుగాన్=పరిపూర్ణముగాను, పరిశీలించి=పరిశోధించి (తెలిసికొనినవారు),

తదన్యమైనజడములు-తత్ = ఆపరిశోధించిన అఖండభావముకంటెను, అన్యములయిన జడ ములు = వేఱైన నామరూపములుగాఁదోఁచెడి, జడములు = అజ్ఞానకార్యమగు జగత్తును, భంగంబునొందించి = నాశనమునుజేసి, తత్సుఖానుభవమే = ఆయానందానుభవమే, చె న్నొందఁగ = ప్రకాశించునటులు, తామై = (ఆబ్రహ్మమే) తామై, తగఁగ = లెస్సగా, సుస్థిరులై = చలింపనివారై, ఉంగురు = నివసింతురు.

తా. క్రమముగా సామవేదమందలి ఉపదేశవాక్యమగు తత్త్వమసియందలి, తత్, త్వం, అసి యను మూఁడుశబ్దములలో తత్పదమైన అదియను ఈశ్వరసాక్షియగు పరమాత్మయు త్వం పదమైన నీవనెడు జీవశబ్దమునకు విలక్షణమగు ప్రత్యగాత్మయు ఈరెండు శబ్దములకు అతిశయమైన ఐకమత్యము అసిపదమయిన ఐతివియనెడు క్రియాపదముచేత ప్రకాశించును. ఆ యభిప్రాయమును సంపూర్ణముగా పరిశోధించినవారు ఆపరిశోధించిన అఖండభావముకంటె వేఱైన నామరూపములుగాఁదోఁచెడి అజ్ఞ జనకార్యమగుజగత్తును నాశనముచేసి వాక్యార్థనిరసనపూర్వక లక్ష్యార్థములచేత ఆబ్రహ్మనందమేతామై చాంచల్యములేక ప్రకాశింపుదురని తాత్పర్యము.

ముందుచెప్పిన చతుర్వేద సారార్థకమగు చతుర్విధమహావాక్యములలో మొదటి రెండువాక్యములచే బ్రహ్మమొదలు పిపీలికాంతమువఱకుఁగల సకలశరీరములయందునుండెడి చైతన్యమే బ్రహ్మమనియు ఆబ్రహ్మమే నేనైతిననియు తెలిసినవారు మూఁడవది యైన సామవేదమందలి ఉపదేశవాక్యమగు తత్త్వమసి యనుదానియందు తత్పదము, త్వంపదము, అసిపదము అనెడి మూఁటిలో అదియనెడి తత్పదమును (అనఁగా సృష్టికిమునుపు నామరూపములులేక ఏకముగా నేచిద్రూపమగు ఆత్మయుండెనో ఆయాత్మను) నీవు అనెడి త్వంపదమును (అనఁగా వినువానియొక్క శరీరేంద్రియాదులకు అతీతముగానుండు సాక్షిభూతమగు చైతన్యమును) ఐతివి యనెడి అసిపదముచేత ఐక్యమునుజేయుచున్న దానినితెలిసికొని బ్రహ్మతాదాత్మ్యమును బొందుదురు.

ఈ మహావాక్యమునకు దృష్టాంతము. కొంతకాలమునకుమునుపు వంటఁజేయుచుండిన యొకమనుజునికి అదృష్టవశమున ద్రవ్యముదొరకఁగానే ఆకొలువుచాలించుకొని వాణిజ్యాదులచేత మిక్కిలి భాగ్యవంతుఁడై పరివారముతోఁగూడి వాహనమెక్కి దారిని బోవుచుండ వానిని గుర్తెఱిఁగిన మఱియొకఁడు వానిని నిదానించిచూచి అతఁడే ఇతఁడని భావించి అతనితోఁ కలసి మాట్లాడి సంతోషించివెళ్లెను. అట్లు అతఁడే యని నిర్ధారణచేయు సమయమున వంటకు ఉపకరములయిన బిందె, గరిటె, తట్ట మొదలైన ఉపాధిలక్షణములను ఇతఁడుఅని చెప్పునపుడు వాఁడెక్కియుండిన వాహనమును వాఁడువేసికొనిన ఆభరణాదివేషములను ఉపాధిలక్షణములనునిరసించి ఈరెండుపదములలో దేహమునుమాత్రము భావించుకొని అతఁడేయితఁడు ఇతఁడేఅతఁడు అను నిశ్చయముగలవాఁడై ఆ ఒక్క మనుష్యుని నే నిస్సందేహముగఁదెలిసికొనినట్లు తత్పదమయినది ప్రపంచమునకు ముఖ్యకా

తగినదైన పరబ్రహ్మమును మాయాకబళితమయిన ఈశ్వరుని అనీశ్వరునియొక్క దేహత్రయమును కనఁబఱచును. త్వంపదమయినది అవిద్యను, అవిద్యాప్రతిబింబుని, అవిద్యాప్రతిబింబునియొక్క శరీరోపాధియందు అధిష్ఠానకూటస్థుని కనఁబఱచును. అసిపదమైనది ఆ ఇరువురను ఒక్కండేయని ఐక్యపఱచును. కాఁబట్టి ఈరెంటియందునుఉపాధులగుమాయను అవిద్యను వానికార్యములగు సకల ధర్మమునువదలి ‹‹అఖండం సచ్చిదానందం మహావాక్యలక్ష్యతే››అనునట్లు పరిపూర్ణముగానుండు సచ్చిదానందము ఒక్కటియేయని యెఱుఁగుటయే ఈసామవేదమహావాక్యార్థము. ఈగుట్టెఱిఁగినవారు ఆయానందస్వరూపమే తామనునమ్మికయందు పట్టువదలక నిశ్చలచిత్తులైయుండురనిభావము.

అవ:—ఈగ్రంథకర్తయొక్కయాచార్యులను సేవించువారి ఫలములుచెప్పఁబడుచున్నవి.

మ. అతులామ్నాయ మహోక్తులన్వెలయు విద్యానందమీమోదమా
నతభక్తాళికిఁ దాని దెల్పును జిదానందాఖ్యుఁ డస్మద్గురుం
డతని న్గాంచి నుతించువా రఖిల సౌఖ్యప్రాప్తులై యుందు రా
తతపుణ్యాత్ముల యందు సేవకుఁ డవిద్యం బాసి ముక్తుండగున్. ౧౮౭

టీ. అతులామ్నాయమహోక్తులన్- అతుల=సమానరహితమయిన, ఆమ్నాయ=ఋుగాది నాలుగువేదములయందలి, మహోక్తులన్=జాతివాక్యములు, గుణవాక్యములు, క్రియావాక్యములు, విధివాక్యములు, నిషేధవాక్యములు, అవాంతరవాక్యములు మొదలగువానియందు ముఖ్యములైన మహావాక్యములలో మేలైన ‹‹ప్రజ్ఞానం బ్రహ్మ›› యను మొదలగు చతుర్విధవాక్యములచేతను, వెలయు=ప్రకాశించుచుండెడి, విద్యానందము=అష్టవిధానందములలో (ఆఱవదియైన) విద్యానందము, ఈమోదమున్=ఈ ఉపదేశించిన తత్త్వమస్యాది మహావాక్యములవలనకలిగిన ఆనందమగును, నతభక్తాళికిన్-నత=తన్నుఁగూర్చి, భక్త=ఆరాధనవమస్కారములుచేయు శిష్యులయొక్క, ఆళికిన్=సమూహమునకు, అస్మద్గురుండు=నాయొక్క ఆచార్యుఁడైన, చిదానందాఖ్యుఁడు=చిదానందస్వామి, దానిన్=అవిద్యానందమును, తెల్పున్=తెలియఁజేయును, అతనిన్=అట్టిచిదానందస్వామిని, కాంచి=దర్శించి, నుతించువారు=స్తోత్రముచేయువారు, అఖిల=సమస్తములైన, సౌఖ్య=సుఖములను, ప్రాప్తులై=పొందినవారై, ఉందురు=లోకమునందుందురు, తత=అతిశయములైన, పుణ్యాత్ములయందు=అపుణ్యస్వరూపులయందు, సేవకుఁడు=ఎడతెగక చతుర్విధశుశ్రూషలచేత సేవించువాఁడు, అవిద్యన్=మిథ్యాభూతమయిన మాలాతూలాత్మికయగు త్రిగుణస్వరూపప్రకృతిని, బాసి=విడిచి, ముక్తుండగున్=విదేహకైవల్యప్రాప్తుఁడగును.

తా. చతుర్వేదములయందలి మహావాక్యములలో శ్రేష్ఠములైన చతుర్విధమహావాక్యములగు ‹‹ప్రజ్ఞానంబ్రహ్మ, తత్త్వమసి, అహంబ్రహ్మాస్మి, అయమాత్మాబ్రహ్మ›› అనెడివాక్యములచేత ప్రకాశించెడి విద్యానందము. ఈయుపదేశించిన తత్త్వమస్యాది

మహావాక్యములవలన కలిగిన ఆనందమగును. ఆ యానందమును నాయాచార్యుఁడైన చిదానందనాథుఁడు తన్నారాధించు శిష్యసమూహమునకుఁ దెలియఁజేయును. అట్టి ఆచార్యునిదర్శించి స్తోత్రముచేయువారు అఖిలసౌఖ్యములను పొందినవారై యుందురు. అట్టి అతిశయులైన పుణ్యస్వరూపులయందు చతుర్విధశుశ్రూషలచే నెడతెగక సేవించువాఁడు మిథ్యాభూతమయిన మాలాతూలాత్మికయగు త్రిగుణస్వరూపప్రకృతినివిడిచి విదేహకైవల్యమును జెందును.

అవతారిక.—ఈగ్రంథముయొక్క ఫలశ్రుతి చెప్పఁబడుచున్నది.

మ. అవనిన్ దత్త్వవివేకదం బగుప్రమేయం బొండు జిజ్ఞాస్యమా
నవమోహాంధముఁ బాయనొప్పుగుప్రమాణం బొండు కైవల్యస
న్నవనీతం బన వానిఁగూడి త్రిజగన్మాన్యంబుగా భాసిలున్
భవబంధంబులు పాయుఁ దీని జదువన్ భాషింప వ్రాయ న్వినన్.

టీ. అవనిన్=పుడమియందు, ఒండు=ఒకటి (అనఁగా మొదటిదైన తత్త్వబోధప్రకరణము), తత్త్వవివేకదంబగు ప్రమేయంబు-తత్త్వవివేకదంబు=తత్త్వజ్ఞానమును ఇచ్చునదియైన, ప్రమేయంబు=ప్రమేయభాగము, అగున్=అగును, ఒండు=మఱియొకటి (అనఁగా రెండవదియైన సందేహనివారణప్రకరణము, జిజ్ఞాస్యమానవమోహాంధమున్-జిజ్ఞాస్య=తత్త్వజ్ఞానమును దెలిసికొనఁదగిన, మానవ=మనుష్యులయొక్క, మోహ=భ్రమతోఁగూడిన, అంధమున్=చీఁకటిని, పాయన్=వీడుటకు, ప్రమాణంబు=ప్రమాణభాగము, ఒప్పగున్=ఒప్పినదగును, వానిఁగూడి=ఆరెండు ప్రకరణములతోఁగూడి, కైవల్యసన్నవనీతంబనన్-కైవల్య=కైవల్యమనెడి, సత్=శ్రేష్ఠమయిన, నవనీతంబు=నవోద్ధృతము, అనన్=అనునట్లుగాను, త్రిజగన్మాన్యంబుగాన్-త్రిజగత్=ముల్లోకములయందును, మాన్యంబుగాన్=పూజింపఁదగినదిగాను, భాసిలున్=ప్రకాశించును, దీనిన్=ఈ కైవల్యనవనీతమనెడిగ్రంథమును, చదువన్=పఠించినను, భాషింపన్=ప్రసంగించినను, వ్రాయన్=వ్రాసినను, వినన్=వినినను, భవబంధంబులు=పరంపరగావచ్చిన జన్మబంధములు, పాయున్=వీడును.

తా. భూమియందు ఈగ్రంథముయొక్క ప్రథమభాగమయిన తత్త్వబోధప్రకరణము, బ్రహ్మజ్ఞానమును ఇచ్చునట్టి ప్రమేయభాగమగును. రెండవభాగమయిన సందేహనివారణప్రకరణము, తత్త్వజ్ఞానమును తెలిసికొనఁదగిన ప్రమాతలగు మనుష్యులయొక్క భ్రమతోఁగూడిన అంధకారమునునశింపఁజేయఁదగినట్టిప్రమాణభాగమగును. ఆరెండుప్రకరణములతోఁగూడి కైవల్యమనెడిశ్రేష్ఠమయిన నవనీతమనునట్లుగా ముల్లోకములయందుఁ బూజింపఁదగినదియై ప్రకాశించును. ఇట్టిగ్రంథమును పఠించినను వ్రాసినను వినినను, పరంపరగావచ్చిన జన్మబంధములువీడునని తాత్పర్యము. ఇందువలన ప్రమేయ, ప్రమాణములను రెంటిని తెలిసికొనువాఁడు ప్రమాతయని అంతరత్రిపుటి స్పష్టమగుచున్నది.

అవతారిక — ఈగ్రంథకర్త తనయాచార్యులవలన కలిగిన ఆనందసంపదను కొనియాడుచున్నాఁడు.

ఉ. దాసునిఁ జేసి మూర్ధ్నిఁ బదతామరసంబుల నిల్పి విద్య హృ
ద్వాసముగా నొనర్చి శివతత్త్వము నీవని నమ్మఁ బల్కి యు
ల్లాసముఁ జెంద మానుషవిలాసముతోడఁ జిదంబరేశుఁ డీ
భాసురదేశికుండయిన భాగ్యమె భాగ్యము పల్కశక్యమే. ౧౮౮

టీ. దాసునిఁజేసి-దాసునిన్ = (నన్ను తనకు) సేవకునిగాను, చేసి = ఒనర్చి, మూర్ధ్నిన్ = నాశిరస్సునందలి సహస్రారకములయందు, పదతామరసంబులన్ = (తనయొక్క) పాదములనెడి, పద్మములను, నిల్పి = ఉంచి, విద్యన్ = శ్రీచక్రార్థదేవతాస్వరూపమయిన) బ్రహ్మవిద్యను, హృద్వాసముగాన్-హృత్ = అంతఃకరణమందు, వాసముగాన్=నివాసమగునట్లుగాను, ఒనర్చి=కలుగఁజేసి, శివతత్త్వమున్= తత్త్వమస్యాది మహావాక్యార్థమయిన పరమశివస్వరూపమును, నీవని=నీవేయని, నమ్మఁ బల్కి-నమ్మన్=సర్వసందేహములు నివారణమానట్లుగాను, పల్కి=ఉపదేశించి, ఉల్లాసముఁజెందన్-ఉల్లాసమున్=బ్రహ్మానందమును, చెందన్=పొందునట్లుగాను, మానుషవిలాసముతోడన్=మనుష్యాకృతిగాను, చిదంబరేశుఁడు-చిదంబర=చిదంబరక్షేత్రమందుండెడి, (లేక) జ్ఞానాకాశమందుండెడి, ఈశుఁడు = (పరబ్రహ్మమయిన) నటేశుఁడు, ఈ=ప్రత్యక్షముగా నవతరించి చిదానందనాథుఁడను పేరుచేతను, భాసుర=ప్రకాశమానుఁడగు, దేశికుఁడు=ఆచార్యుఁడు, అయిన=అయినట్టి, భాగ్యమే=సంపదయే, భాగ్యము=సంపద, పల్కశక్యమే=దానిని ఇట్టిదని చెప్పుటకు శక్యమా, (అనఁగా) శక్యముగాదనుట.

తా. నన్ను తనకు సేవకునిగాచేసికొని నాశిరస్సునందలి సహస్రారకమలమందు తనయొక్కపాదములనెడి పద్మములనుంచి శ్రీచక్రార్థదేవతాస్వరూపమయిన బ్రహ్మవిద్యను అంతఃకరణమందు నివాసమగునట్లుగాను కలుగఁజేసి తత్త్వమస్యాది మహావాక్యార్థమయిన పరమశివస్వరూపమును నీవేయని సర్వసందేహములునివారణమానట్లు ఉపదేశించి బ్రహ్మానందమును పొందునట్లుగాను చిదంబరక్షేత్రమందుండెడి పరబ్రహ్మమయిన నటేశుఁడే ప్రత్యక్షముగ నరరూపముతో నవతరించి చిదానందనాథుఁడను పేరుచేత ప్రకాశమానుఁడగు ఆచార్యుఁడయినట్టి సంపదయే సంపద. అట్టిసంపద యిట్టిదనిచెప్పుటకు అశక్యమగునని తాత్పర్యము. "శ్రీగురోః పాదుకా మూర్ధ్ని శ్రీచక్రం హృది సంస్థితమ్, శ్రీవిద్యా యస్య జిహ్వాగ్రే స సాక్షాత్ పరమశ్శివః" అనఁగా శిరమున గురుపాదములను, హృదయమున శ్రీచక్రమును, వాక్కున బ్రహ్మవిద్యయుఁ గలవాఁడు సాక్షాత్పరమశివుఁడని భావము. కాఁబట్టి ఇట్టి మహాభాగ్యమునకంటె ఎక్కుడైనది వేఱొండు లేదని కొనియాడుచున్నాఁడు.

అవతారిక.—ఈగ్రంథశ్రవణముయొక్క ఫలమును జెప్పుచున్నారు.

చ. సకలనదీజలంబులను ◦ స్నానముఁ జేసినతత్ఫలంబు దే
శికపదశీతలాంబువుల ◦ శీకర మొక్కటి చల్లుకొన్నయ
ట్లకుటిల మైనయీపరమ ◦ మైన ప్రబంధము నాలకించిన౯
వికసను లౌదు రెందఖిల ◦ విద్యలు నేర్చిన సూరులంబలెన్. ౧౮౯

టీ. (ఇల౯=పుడమియందు,) సకలనదీజలంబుల౯-సకల=సమస్తములయిన, నదీ=(గంగ గోదావరి కావేరి మొదలగు)పుణ్యనదులయొక్క, జలంబుల౯=తీర్థములయందు, స్నానముఁజేసిన=అవగాహన మొనరించిన, తత్ఫలంబు=ఎట్టిప్రయోజనమో అప్రయోజనము, దేశికపదశీతలాంబువుల౯-దేశిక = బ్రహ్మవిదుఁడైన ఆచార్యునియొక్క, పద=పాదప్రక్షాళనము చేయఁబడిన, శీతల=తాపత్రయములను నివారణచేయఁదగిన, అంబువుల౯=చల్లని ఉదకబిందువులలో, ఒకటి=ఒకదానిని, చల్లుకొన్న౯=(తనశిరస్సుమీఁద) ప్రోక్షించుకొనినను (అగును), అట్లు=ఆప్రకారముగాను, అకుటిలమైన, నిష్కల్మషమైన, ఈ=కైవల్యనవనీత మనెడియీ, పరమ=నిరతిశయమైన, ప్రబంధము=శాస్త్రమును, ఆలకించిన౯=(ఆచార్యముఖముగా) శ్రవణముఁజేసినను, ఎందు౯=ఏసమయమందును, అఖిలవిద్యల౯=ఎల్లవిద్యలను, నేర్చిన=అభ్యసించిన, సూరులంబలె౯=పండితులవలెను, వికసనులగుదురు = (బ్రహ్మతత్త్వజ్ఞానముచేత) ప్రకాశించినవారు కాఁగలరు.

తా. శిష్యుఁడా! భూమియందు గంగాగోదావరీకావేర్యాదినదులలో స్నానముఁ జేసిన నేమిప్రయోజనమో ఆప్రయోజనము బ్రహ్మవేత్తరైన ఆచార్యునియొక్క పాదప్రక్షాళనతీర్థములో ఒకబిందువును తనశిరస్సుమీఁదఁ జల్లుకొనిన నగును. అట్టిప్రయోజనమును కలుగఁజేయునట్టి నిష్కల్మషమైన ఈకైవల్యనవనీత మనెడియోగశాస్త్రమును ఆచార్యముఖముగా వినినచో నేసమయములయందును ఎల్లవిద్యల నభ్యసించిన పండితులవలె బ్రహ్మతత్త్వజ్ఞానముచేత ప్రకాశించినవా రగుదురని తాత్పర్యము.

అనఁగా, ॥స్నాతం తేన సమస్తతీర్థనిచయే దత్తం మహీమండలం, విప్రేభ్యః పితృదేవతాస్సురగణా స్సర్వేపి సంతర్పితాః, జప్తామంత్రసహస్రకోటిరమునా తప్తంచ తీవ్రంతపో, యస్య బ్రహ్మవిచారణేక్షణమపి ప్రాప్నోతి ధైర్యం మనః॥ అను శ్లోకార్థము చొప్పున ఒకక్షణమైనను బ్రహ్మవిచారణయందు మనస్సు నిలిపినవానికి గంగాదిసమస్తపుణ్యతీర్థస్నానఫలమును, విప్రోత్తములకు భూమండలమంతయు దారవోసినఫలమును, పితృదేవతలను త్రిమూర్త్యాదిసర్వదేవతలను తృప్తినొందించిన ఫలమును, గాయత్ర్యాదిసహస్రకోటిమంత్రములను జపించుటవలన కలిగిన ఫలమును, కృచ్ఛ్రచాంద్రాయణాదివ్రతములవలన కలిగినఫలమును కలుగునని తాత్పర్యము.

కాఁబట్టి తత్త్వజ్ఞానమును బ్రబలింపఁజేసి సకలసందేహములను నివారణచేయు నట్టి యీకైవల్యనవనీతమును శ్రవణముఁజేయువారికిఁ బైనఁజెప్పినట్టి శ్రేష్ఠమైనఫలము లభించునని భావము.

అవతారిక.—ఇష్టదేవతయగు కృతినాయిక ॥మంగళాదీని, మంగళమధ్యాని, మంగళాంతానిః॥యను ప్రమాణమునుబట్టి ప్రకరణాంతమందుఁ గొనియాడఁబడుచున్నది.

పంచచామరము. త్రయీమయీ నిరామయీ త్రిధామకూటపాదినీ
వియన్ముఖాఖిలప్రభూతవిశ్వజన్మకారిణీ
దయాజలాశయా మహాప్రధానతత్త్వబోధినీ
నియంత్రిణీ నిరంజనీ మనీషిణీ మనోన్మనీ. ౧౯౦

టీ. త్రయీమయీ-త్రయీ=॥ని. శ్రుతిః స్త్రీ వేద ఆమ్నాయ స్త్రయీ ధర్మస్తుత ద్విధిః॥ ఋగ్యజుస్సామములనెడి మూఁడువేదములయందలి బ్రాహ్మణక్షత్రియవైశ్యాదులకు నిర్ణయింపఁబడినధర్మములే స్వరూపముగాఁగలదానా, నిరామయా = (ఆమయము లనఁగా దేహసంబంధములగువ్యాధులు, అట్టి పంచభూతవికారమైన దేహములేనిదిగనుక) వ్యాధులులేనిదానా, త్రిధామకూటపాదినీ-త్రిధామ-త్రి=మూఁడువిధములయిన, ధామ=తేజస్సులును, (అనఁగా సూర్యచంద్రాగ్నులకాంతులును లేక బ్రహ్మవిష్ణురుద్రులకు స్థానములును) కూట, వాగ్భవకూట, కామరాజకూట, శక్తికూటములను పంచదశాక్షరియందలి మూఁడుకూటములును, పాదినీ=(ఆదిభౌతిక, ఆధ్యాత్మిక, అధిదైవికము లనెడి భూలోక, భువర్లోక, సువర్లోకస్వరూపములయిన వ్యాహృతులతోఁగూడిన గాయత్రియందలి) మూఁడుపాదములను కలిగినదానా, వియన్ముఖా...కారిణి-వియత్=ఆకాశము, ముఖ=మొదలుగాఁగల, ప్రభూత=పంచమహాభూతములయొక్కయు, విశ్వ=వానివికారములయిన యిరువదియైదుతత్త్వములతోఁగూడిన సర్వప్రపంచముయొక్కయు, జన్మ=పుట్టుకకు, కారిణీ=హేతుభూతురాలవైనదానా, దయాజలాశయా-దయా=కరుణకు సముద్రమువంటిదానా, మహాప్రధానతత్త్వబోధినీ-మహాత్=అతిశయమగు, ప్రధానతత్త్వ=మిథ్యాస్వరూపమయిన సకలచరాచరప్రపంచమును కలుగఁజేసెడి మూలప్రకృతిస్వరూపమును, బోధినీ=(తన్నాశ్రయించిన బ్రహ్మవేత్తలకు) తెలియఁజేయుదానా, నియంత్రిణీ=ప్రపంచకర్తలైన బ్రహ్మవిష్ణురుద్ర ఈశ్వర సదాశివాది దేవతలను నవగ్రహాదులను వారివారికి కలుగఁజేసిన హద్దులనుమీఱి నడువకయుండునట్లుఁజేయుదానా, నిరంజనీ=తన్నుఁదెలియుటకు సాధనాంతరాపేక్షలేక స్ఫురించుదానా, మనీషిణీ=కేవలవిజ్ఞానస్వరూపురాలవైనదానా, మనోన్మనీ=మనోన్మనియను ముఖ్యనామముగలదానా యని ప్రకరణాంతమందు కృతినాయిక సంబోధనపూర్వకముగా స్తుతింపఁబడుచున్నది.

తా. వేదములయందలి ధర్మమే స్వరూపముగాఁగలదానవనియు పంచభూతవికారశరీరము లేనందున వాతపిత్తశ్లేష్మాది వ్యాధులు లేనిదానవనియు సూర్యచంద్రాగ్నిప్రకాశములును వాగ్భవ కామరాజశక్తికూటములును (ఈ కూటములును కాదివిద్యా, హాదివిద్యా, సాదివిద్యా యనియును పంచదశాక్షరియందుఁ జెప్పఁబడును.) గాయత్రియందలి మూఁడుపాదములును, స్వరూపముగాఁగలదానవనియు, ఆకాశము మొదలగు పంచభూతవికారములవలనఁ గలిగిన జగత్తుయొక్క జన్మమునకు హేతుభూతురాలవైనదానవనియు సముద్రముతో సమానమైన దయగలదానవనియు, అతిశయమైనమిథ్యాభూతమగు సమస్తస్థావర జంగమాత్మక ప్రపంచస్వరూపమైన మూలప్రకృతిని తెలియఁజేయుదానవనియు, దీపమును గనుటకు దీపమేసాధనమైనట్లు నిన్నుఁ గనుటకు నీవేసాధనముగాఁ దెలియఁజేయుదానవనియు, ప్రజ్ఞానఘనస్వరూపిణియనియు, మనోన్మనియను పేరుగలదానవనియు, ప్రకరణాంతమందు కృతినాయిక సంబోధనపూర్వకముగా స్తుతింపఁబడుచున్నదని తాత్పర్యము.

॥శ్లో. శ్రీమద్వాగ్భవకూటైకస్వరూపముఖపంకజా, కంఠాధఃకటిపర్యంత మధ్యకూటస్వరూపిణీ, శక్తికూటైకతాపన్న కట్యధోభాగధారిణీ॥ అని లలితాసహస్రనామములందు పంచదశాక్షరీ త్రిపురసుందరీ మహామంత్రమందు, కాదివిద్య, వాగ్భవకూటమని, అది శిరస్సు మొదలు కంఠమువఱకును, హాదివిద్య, కామరాజకూటమని, అది కంఠము మొదలు నడుమువఱకును, సాదివిద్య, శక్తికూటమని, అది నడుము మొదలుకొని పాదములవఱకును, ఈ మూఁడుకూటములయందును హ్రీంకారత్రయ ముండుటవలన యీ మూఁడును భ్రూమధ్యములనియు, ఉత్పత్తిస్థితిలయములకు కారణభూతములైన బ్రహ్మగ్రంథి విష్ణుగ్రంథి రుద్రగ్రంథులనియు చెప్పఁదగినది. ఈపంచదశాక్షరీమహామంత్రమందు కకారత్రయము హకారద్వయముచేరి శివబీజములు. మొదటికూటమందు ఏ-ఈ-ల, అనియు రెండవకూటమందు, స-ల యనియు, మూఁడవకూటమందు స-ల యనియుఁ జెప్పఁబడెడి ఈయేడును శక్తిబీజములు. హ్రీంకారములు మూఁడును ఉభయాక్షరములు. ఈపంచదశాక్షరి త్రిశతినామములయందలి యిరువదినామములకు నొక్కొకబీజముగాను, హయగ్రీవస్వామి అగస్త్యుల కుపదేశించినట్టుగా లలితోపాఖ్యానమందున్నదని యెఱుంగునది.

అవతారిక.—ఆదరాద్ద్విరుక్తియను లక్షణముచేత కృతినాయికయగు శివకామసుందరీదేవి మఱియును స్తుతింపఁబడుచున్నది.

మాలిని. నిరుపమసుఖమూర్తీ । నిత్యసత్యానువర్తీ
సరసగుణమతల్లీ । సాధుహృత్కల్పవల్లీ
హరిహరజనయిత్రీ । హంసమంత్రార్థదాత్రీ
కరధృతసృణిపాశా । కమ్రసంవిత్ప్రకాశా. ౯౧



# కైవల్యనవనీతము,

...నిరుపమ...పమింపఁగూడని, సుఖ=బ్రహ్మానందమే=మూ_ర్తి=స్వరూపము గాఁగలదానా, నిత్య...నువ_ర్తి-నిత్య=త్రికాలములయందును నశించని, సత్య=సత్య స్వరూపుఁడైన పరమా...తోడను, అనువ_ర్తి= వేఱుపాటులేని స్వభావముచేతఁ గూడి ...యుండుదానా, ...గణమతల్లీ-రస=శృంగారాది నవరసములతోఁగూడిన, గుణ=శాంత ...కల్యాణగుణములచేత, మతల్లీ=శ్రేష్ఠురాలవైనదానా, సాధుహృత్క-ల్పవల్లీ-సాధుహృత్=సద్హృదయులైన పెద్దలకు, కల్పవల్లీ=ఇష్టార్థముల నిచ్చుటయందు కల్పవృక్షపు తీఁగవంటిదానా, హరిహరజనయిత్రీ-హరి=విష్ణువునకును, హర=రుద్రునకును, జనయిత్రీ=తల్లియైనదానా, హంసమన్త్రార్థదాత్రీ-హంస=హకారబిందు సకార రూపములైన పురుషపుత్రస్త్రీ ప్రవాహరూపముగ నొప్పెడి, మంత్ర=రహస్యములయందలి, అర్థ=తాత్పర్యమును, దాత్రీ=ఇచ్చుదానా, కరధృతసృణిపాశా-కర=నాలుగు హ_స్తములలోపల ఊర్ధ్వహ_స్తముల రెంటిచేతను, ధృత=ధరింపఁబడిన, సృణి=అంకుశమును, పాశ=పల్లెత్రాడును గలదానా, కమ్రసంవిత్ప్రకాశా-కమ్ర=మనోహరమైన, సంవిత్=బ్రహ్మజ్ఞానముచేత, ప్రకాశ=ప్రకాశించుదానా.

తా. ఉపమానరహితమైన బ్రహ్మానందమేస్వరూపముగాఁగలదానవనియు. త్రికాలములయందును నశింపని సత్యస్వరూపుఁడైన పరమాత్మతోడను అగ్నియందలి ఉష్ణత్వ... అగ్నికి వేఱుగానుండనటులఁ గూడియుండుదానవనియు, శృంగారాది నవరసములతోఁ గూడిన శాంతశమదమాది కల్యాణగుణములచేత శ్రేష్ఠురాలవనియు, మంచి హృదయము గలపెద్దలకు అభీష్టములుగలుగఁజేయుటయందు కల్పవృక్షమువంటిదానవనియు, విష్ణువునకును రుద్రునకును తల్లియైనదానవనియు, హంసమంత్రార్థమును తెలియఁజేయుదానవనియు నాలుగుహ_స్తములలోపల ఊర్ధ్వహ_స్తద్వయముచే ధరింపఁబడిన అంకుశమునుపల్లెత్రాడును గలదానవనియు, బ్రహ్మజ్ఞానముచేత ప్రకాశించుదానవనియు తాత్పర్యము.

గద్య.—ఇది శ్రీపంచదశాక్షరీవిద్యానవద్యస్వరూప శ్రీశివకామసుందరీ కృపాకటాక్ష వీక్షాసమాసాదిత కవితాకలిత కాశ్యపసగోత్ర పవిత్ర వేంకయమంత్రిపుత్ర నిఖిల నిగమాగమాంత ప్రబోధ కనువ_ర్తి వేంకటరామ శ్రీవిద్యానందనాథ విరచితంబైన టీకాతాత్పర్య సహిత కైవల్యనవనీతంబను మోక్షశాస్త్రంబునందు సందేహనివారణంబను ద్వితీయప్రకరణము

సర్వము సంపూర్ణము.



...ద్రశాలయు ముద్రితము, చాకలపేట, చెన్నపురి:—1924.